# కోలాచలం శ్రీనివాసరావు

## నాటక సాహిత్య సమాలోచనము

1972లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి
పీ హెచ్. డి. పట్టము పొందిన సిద్ధాంత గ్రంథము

డాక్టర్ ఎస్. గంగప్ప, ఎం.ఏ, పీహెచ్ డి.

# కోలాచలం శ్రీనివాసరావు

## నాటక సాహిత్య సమాలోచనము

1972లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి
పిహెచ్.డి. పట్టము పొందిన సిద్ధాంత గ్రంథము

రచయిత :

డా. ఎన్. గంగప్ప, ఎం.ఏ., పీహెచ్.డి.
తెలుగు శాఖాధ్యక్షులు,
సిల్వర్ జూబిలీ ప్రభుత్వ కళాశాల,
కర్నూలు-518002.

ప్రథమ ముద్రణ : జూన్, 1977

ముఖపత్ర చిత్రణము :

శ్రీ శీలావీర్రాజు

వెల :

సాదా ప్రతి : రూ. 30-00
మేలు ప్రతి : రూ. 35-00

ప్రతులకు :

శశీ ప్రచురణలు
కర్నూలు-518002.

నవోదయా పబ్లిషర్సు
ఏలూరు రోడ్, విజయవాడ-2

ముద్రణ :

శ్రీ వరలక్ష్మి ప్రెస్,
ఖైరతాబాద్, హైదరాబాద్-500 004,
ఫోన్ : 34711

Paper was made available by the Govt. of A.P. at concessional rates.



'రామరాజు చరిత్రము'లో 'పటాణి'గా బళ్లారి రాఘవ

# విషయసూచిక

## 10. నాటకేతరరచనలు 354-375



## 11. వ్యక్తిత్వము 376-404

# అంకితము

అక్షరములు రాని ఆత్మవేత్త యైన
అక్షరమూర్తి గా అవతార మిచ్చిన
స్వర్గము నలంకరించిన చిరకీర్తికి
వరణీయ పితృలు వేంకటప్ప మూర్తికి

వరముల పంటగా నన్ను పొందిన
పరమ ప్రీతితోడ నన్ను పెంచిన
కృపాంతః కరుణామయ మూర్తికి
కృష్ణమ్మ మమతా మాతృమూర్తికి

తెలుగు నాటక సాహిత్య జలధిని మథించి
తీసిన అమృత సారము సిద్ధాంత గ్రంథము
పుణ్యులార! మీ ఋణ విముక్తి కీలేశము
పుష్పాంజలి పురస్సరముగా సమర్పితము.



# కృతజ్ఞతలు

పరిశోధనకు నన్ను ప్రోత్సహించి, అవకాశమును గల్పించి, పర్యవేక్షించి ఆరంభమునుండి చివరి వరకు అనేకామూల్యములైన సలహాల నొసగి, ఈ సిద్ధాంతగ్రంథమునకు వన్నె గూర్చిన ప్రొఫెసర్ జి. ఎన్. రెడ్డి గారికి,

నా విద్యార్థి దశనుండి నా అభివృద్ధి నత్యంతమాకాంక్షించి, ప్రోత్సహించి, కోలాచలం శ్రీనివాసరావుగారి జీవిత సంబంధి అమూల్యాంశములను వ్రాయించి పంపిన ప్రొఫెసర్ తూమాటి దొణప్పగారికి,

నా పరిశోధన ఫలవంతము కావలెనని ఆశీర్వదించిన గురువులు ఆచార్య గంటి జోగిసోమయాజిగారికి, ప్రొఫెసర్ బి. హెచ్ కృష్ణమూర్తి గారికి, శ్రీ. శ్రీ. అనంత పద్మనాభన్ గారికి, డాక్టర్ అంతటి నరసింహంగారికి.

అర్థించిన వెంటనే తమ యొద్దగల గ్రంథములను, అమూల్యాభిప్రాయములను ఒసగిన డా. పి. ఎస్. ఆర్. అప్పారావుగారికి, శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి గారికి. కోరిన వెంటనే కోలాచలం శ్రీనివాసరావుగారి జీవిత విశేషములను, రచనలను గూర్చి 'పరిచయము'గావించిన శ్రీ. కోలాచలం జయరత్నం, శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, శ్రీ రావాడి వేంకటరాయశాస్త్రి, శ్రీ రొద్దం హనుమంతరావు, శ్రీ శ్రీ పప్పూరు రామాచార్యులు, శ్రీ తిరుమల రామచంద్ర, శ్రీ. శ్రీ. పింగళి నాగేంద్రరావు గారలకు,

ఈ సిద్ధాంతగ్రంథరచనాసమయమున అమూల్యములైన సలహాల నొసగిన మిత్రులు శ్రీ. శ్రీ. డాక్టర్ జె. విశ్వామిత్ర (హిందీ శాఖాధ్యక్షులు, ప్రభుత్వ కళాశాల, అనంతపురము) గారికి. గ్రంథములనిచ్చి ప్రోత్సహించిన పెద్దలు శ్రీ. శ్రీ. జి. జానకిరామశర్మ గారికి, మిత్రులు శ్రీ రాణి సత్యనారాయణ గారికి, శ్రీ ఎస్. బాలయ్య గారికి,

ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, హైదరాబాద్, గ్రంథాలయము లోని గ్రంథముల పరిశీలించుట కనుమతించి, సహకరించిన శ్రీ పసల సూర్య చంద్రరావుగారికి, మిత్రులు శ్రీ కొత్త దేశపతిరావుగారికి, పెద్దలు శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారికి. రాజమండ్రి గౌతమీ గ్రంథాలయము, వేటపాలెం 'సారస్వత నికేతనం' గ్రంథాలయము, మద్రాసు తమిళనాడు పురావస్తుశాఖ, మద్రాసు కన్నెమెరా, గ్రంథాలయము, మద్రాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయము అధిపతులకు,

నా పరిశోధనార్థము గ్రంథములు కొనుటకు, ఆయా గ్రంథాలయములను దర్శించుటకు ఆర్థిక సాహాయ్యము గావించిన 'యూనివర్సిటీ గ్రాంట్సు కమిషన్' వారికి,

నాకు వివిధ రూపముల సహకరించిన శ్రీవేంకటేశ్వర విశ్వ విద్యాలయ ఆంధ్ర శాఖో సన్యాసకులకు, అనంతపురం ప్రభుత్వ కళాశాల ఆంధ్రశాఖలోని నా సహోపన్యాసకులకు,

గ్రంథముద్రణార్థము ఆర్థికసాహాయ్యము గవించిన ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాలశాఖ వారికి, సంగీతనాటక అకాడమి అధిపతులు శ్రీ కూర్మా వేణు గోపాలస్వామి ప్రభృతులకు,

నాసిద్ధాంత గ్రంథమును ముద్రించుకొనుటకు అనుమతించిన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి అధిపతులకు

పరిశోధన, ముద్రణ సమయములలో అన్ని విధముల సహకరించిన నా సహధర్మచారిణి శ్రీమతి ఎస్. పార్వతమ్మకు,

ముచ్చటగా ముద్రించి ఇచ్చిన శ్రీవరలక్ష్మి ప్రెస్ అధిపతులకు,

నా కృతజ్ఞతలు :

హైద్రాబాద్,
జూన్, 1977

ఎస్. గంగప్ప,
రచయిత

# 0. ప్రస్తావన

0.1 కోలాచలం శ్రీనివాసరావుగారి నాటకములు, ఇతర రచనల గూర్చి ఇంతవరకు సమగ్ర పరిశోధనము జరుగలేదు. ప్ర ప్రథమముగా శ్రీనివాసరావు గారికి నాటక కర్తగా అధికగౌరవమొసగినవారు శ్రీ పురాణం సూరిశాస్త్రిగారు. వారు తమ 'నాట్యాంబుజము'న శ్రీనివాసరావుగారి నాటకములలో ప్రధానము, ప్రసిద్ధమునైన 'రామరాజు చరిత్రము'ను గూర్చి కొంత వరకు చర్చించిరి. అట్లే శ్రీ దేకుమళ్ల అమృతరావుగారు 'ఆంధ్ర నాటకము-రంగస్థలములు'లో శ్రీనివాసరావుగారి 'రామరాజు చరిత్రము'ను ప్రశంసించి యున్నారు. 'నాటకోపన్యాసములు'లో శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు_ 'శ్రీ ధర్మవరం, కోలాచలం'వారల గూర్చి అయినను-శ్రీనివాసరావుగారి నాటకముల గూర్చి ప్ర ప్రథమముగా దిఙ్మాత్ర పరిచయము గావించిరి. శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారు తమ 'ఆంధ్ర నాటక దర్శిని, ఆంధ్ర నాటక సమీక్ష, తెలుగు నాటక కవులు' అను గ్రంథములలో శ్రీనివాసరావుగారి నాటకముల గూర్చి సంక్షిప్తముగా వివరించిరి. ఇక డా. పి. ఎస్. ఆర్. అప్పారావుగారి 'తెలుగు నాటకవికాసము'న శ్రీనివాసరావుగారికి సముచిత స్థానము కలదు. అందు సమగ్ర చర్చ కవకాశము లేదు, 'ఆంధ్ర నాటక కర్తలు'లో శ్రీనివాసరావుగారి నాటకములనేగాక, ఇతరరచనలను సైతము గూర్చి శ్రీ కప్పగల్లు సంజీవమూర్తిరావుగారు రచించిన వ్యాసము మిక్కిలి విలువైనది, శ్రీనివాసరావుగారి జీవితమునకు, నాటకములకు, ఇతర రచనలకు సంబంధించిన సంగతులను లోకమునకు తెలియజేసిన వారు శ్రీ కప్పగల్లు వారే, అయినను ఇది పరిమితమైనది. ఇట్లు శ్రీనివాసరావుగారి జీవిత విశేషములను, రచనలను గూర్చిన కూలంకష పరిశీలనము జరుగలేదని స్పష్టమైనది.

0.2 'నాటకాంతంహి సాహిత్యమ్' అను నార్యోక్తియున్నను, నాటకాది సాహిత్యముగా కోలాచలం శ్రీనివాసరావుగారు ఆరంభించియు, ఉత్తమ నాటక

కర్తగా నిరూపించి కొని యుండుట ఈ సిద్ధాంత గ్రంథమున వ్యక్తమైనది. నాటక రచనానంతరమే పద్య కావ్యము నాంధ్రీకరించుటయు, ఇతర వచన రచనలను ఆంధ్రాంగ్ల భాషలలో చేసి యుండుటయు స్పష్టమైనది, ఆధునిక యుగమున ఆంధ్ర నాటకరచనా ప్రయోగముల తొలి దినములలో శ్రీనివాస రావుగారు నాటకరచనకు పూనుకొనిరి. అప్పటికి వీరికి దాదాపు నలువది వత్సరముల ప్రౌఢవయస్సు. అట్టి వయఃపరిపాకమున రచనకు దొరకొని యుండుటచేతనే జన్మతః వీరిలో గల ప్రతిభకు భారతీయ పాశ్చాత్య కావ్యనాటక పఠన విమర్శన జన్యవ్యుత్పత్తి వన్నె పెట్టినది. లోకజ్ఞతజతయై. సముచిత రీతి రచనకవకాశము కల్పించినది ఇట్టి సదవకాశమును పరిగ్రహించి శ్రీనివాసరావు గారు నాటకములు రచింప నారంభించి, క్రమముగా నాటక వాఙ్మయ నిర్మాత కాగలిగిరి. మరొక ప్రక్క ఆధ్యాత్మికచింతనతో భగవద్గీతను తొమ్మిది భాష్యముల సాహాయ్యమున పఠించి, ఉపన్యాసములు రచించి ప్రసంగించిరి. ఇంకొక ప్రక్క తమ జీవిత కాలమందలి సంఘమును సంస్కరించ దలచి వేదశాస్త్ర గ్రంథములను పఠించి, ఆర్యుల సంస్కృతి, నాగరకతాదుల నెరిగి, విమర్శించి, పరిశోధించి, ఉపన్యాసములు వ్రాసి సభలలో జదివిరి. ప్రపంచ నాటకములను, తత్సంబంధి గ్రంథములను జదువుట చేతను, 'సుమనోరమ సభ' నాటక సమాజమున నాటక ప్రయోక్తగా నుండుటచేతను, కలిగిన అసామాన్యానుభవమును పురస్కరించుకొని 'ప్రపంచనాటక చరిత్రము' ('The Dramatic History of the World') ను రచించిరి. సంస్కృతములోని అగస్త్య బాలభారతమును సైతము తెనిగించిరి. అయినను ఇంత కంటెను నాటక కర్తగా వీరు తమ గుణగరిష్ఠములు, రసవంతములు, అమూల్యములు నైన రచనలు గావించి ప్రసిద్ధిగాంచిరి. ఇట్లామరణము రచనా వ్యాసంగము కొనసాగించిరి. ఆంధ్ర నాటక వాఙ్మయమునకేగాక, ఆంధ్ర వాఙ్మయమునకే ఎనలేని సేవగావించిన వారు శ్రీనివాసరావుగారు.

0.3 ఇట్టి శ్రీనివాసరావుగారి జీవిత విశేషములను, రచనలను పరిశోధనాత్మకముగా సమీక్షించుట ఈ సిద్ధాంతవ్యాసోద్దేశము. ఇందు పదునొకండు ప్రకరణములు కలవు. మొదటి ప్రకరణమున శ్రీ కోలాచలం శ్రీనివాసరావుగారి జీవితచరిత్రము సంగ్రహముగ తెలుప బడినది. వీరి వ్యక్తిత్వమునకు, రచనలకు దోహదము గావించిన సన్నివేశము లిందు చర్చింప బడినవి.

తెలుగులో నాటక రచనారంభము, ఆంగ్ల ఫార్శీనాటక రంగ ప్రభావము తెలుగు నాటకవికాసము మున్నగు నంశములకు సంబంధించిన చర్చ రెండవ ప్రకరణమున గలదు. ఇది రావుగారి నాటక విమర్శకు పూర్వరంగము వంటిది.

మూడవ ప్రకరణమున శ్రీనివాసరావుగారి వివిధ రచనల రచనాకాల నిర్ణయము, వాని వర్గీకరణము ప్రధాన విషయములు.

నాలుగవ ప్రకరణమున శ్రీనివాసరావుగారి నాటకేతివృత్తానుగుణ వర్గీకరణము, నాటకేతివృత్తమూలము (Sources)ల నిరూపణములను రెండంశ ములు ప్రాధాన్యమును వహించినవి

ఐదవ ప్రకరణమున శ్రీనివాసరావుగారి నాటకేతివృత్తనిర్మాణదక్షత సప్రమాణముగ నిరూపితము. ఇందు వీరి నాటకములు ప్రాచ్యపాశ్చాత్య నాటకలక్షణసమ్మిశ్రితము లనుట నిరూపితము.

శ్రీనివాసరావుగారి సన్నివేశ కల్పనా సామర్థ్యము, ప్రాచ్య పద్ధతులతో పాత్రపోషణ గావించిన విధము లనునవి ఆరవ ప్రకరణము నందలి విషయ ములు.

ఏడవ ప్రకరణము శ్రీనివాసరావుగారి రచనా శిల్పమునకు సంబంధించి నది. ఇందు రావుగారి సంభాషణ రచనా వైదగ్ధ్యము, కవిత్వము, పద్యములు, పాటలు, ఛందస్సు, భాష అను నంశములు సోదాహరణముగా ప్రకటితములు.

శ్రీనివాసరావుగారి నాటకరచనాప్రయోజన దృష్టి ఎనిమిదవ ప్రక రణమున వివరింప బడినది. నాటక రచనా ప్రదర్శనముల వలన నీతిబోధ గావించి, సంఘ సంస్కరణ మొనరింప వలెననియు, ఇందుకు నాటకము రంగ మున ప్రదర్శింపవలెననియు సంకల్పించినరావుగారి హృదయమిందావిష్కృతము

శ్రీనివాసరావుగారు ఆంధ్ర చారిత్రక నాటక పితామహులైన విధము, వారి విషాదాంత నాటక వైశిష్ట్యము, హాస్యపోషణ పద్ధతి, ఔచిత్య నిర్వహణ చణ త్వము అను నంశముల చర్చ తొమ్మిదవ ప్రకరణమున గలదు.

పదవ ప్రకరణమున శ్రీనివాసరావుగారి నాటకేతరరచనల పరిచయము కలదు.

శ్రీనివాసరావుగారి వ్యక్తిత్వ చిత్రణమే పదనొకండవ ప్రకరణము. ఇందు నాటక కర్తగా, కవిగా, వ్యాసకర్తగా, విమర్శకుడుగా, సంఘసంస్కర్తగా, బహు భాషావేత్తగా రావుగారి బహుముఖ ప్రతిభావైభవము నిరూపితము. ఆంధ్ర నాటక వాఙ్మయమున వీరి స్థానమిందే నిర్ణయింపబడినది.

0.4 నా రచనకు సరళగ్రాంథికముపయుక్తము. అర్ధానుస్వార, శకట రేఫములకు ఇందు చోటులేదు.

0.5 శ్రీనివాసరావుగారి రచనల గూర్చి సమగ్రపరిశోధనము గావించుటకు 1965వ సంవత్సరమున ఆరంభించితిని. అనేక ప్రదేశములు తిరిగియు, అనుభవజ్ఞులైన పెద్దలను కలిసికొనియు, శ్రీనివాసరావుగారి జీవితవిశేషములను తెలిసికొని, విషయసేకరణము గావించితిని. ఆయా గ్రంథాలయములందు శ్రీనివాసరావుగారి నాటకములలో కొన్నింటిని ఎత్తి వ్రాసికొనియు, అపురూపమైన పూర్వ పత్రికలలో గల శ్రీనివాసరావుగారిని గూర్చిన విషయములను 'నోట్సు' వ్రాసికొనియు అనేకామూల్య విషయములను సేకరించితిని శ్రీనివాసరావుగారి రచనలను సమ్యక్పరిశోధనము గావించి ఈ సిద్ధాంత గ్రంథమును సిద్ధము చేసితిని.

0.6 నా యీపరిశోధనా ప్రయత్నమున శ్రీనివాసరావుగారి రచనలలో కొన్ని లభింపనేలేదు. ఎంతగా వ్యయ ప్రయాసల కోర్చినను శ్రీనివాసరావుగారి చంద్రహాస, రాక్షసీమహత్వాకాంక్ష, యువతీవివాహము' అను మూడు నాటకములను, 'సమయమునకు భార్య' అను ప్రహసనమును సంపాదింపలేకపోయినందుకు చింతించుచున్నాను. ఇంకను కొన్ని ఆంగ్ల భాషా రచనలు సైతము కలవని తెలియవచ్చుచున్నది.

0.7 అయినను ఈ సిద్ధాంత గ్రంథమున శ్రీనివాసరావుగారి జీవితమునకు, రచనలకు సంబంధించిన అనేకాజ్ఞాతవిషయములను సువ్యక్తము గావించుటలోను, విశేషించి రావుగారి నాటకములను పాశ్చాత్య నాటక లక్షణానుగుణము పరిశీలించుటలోను, పై వాని మూలమున రావుగారివ్యక్తిత్వమును చిత్రించుటలోను ఇతః పూర్వములేనిది సొంతమునైనది అయిన మౌలికత నిరూపితము.

---

# సంకేతముల వివరణము

అ : అధ్యాయము

అం : అంకము

అను : అనుబంధము.

ఆ : ఆశ్వాసము

ఉ : ఉపోద్ఘాతము

ప : పద్యము

పీ : పీఠిక

పు : పుట (లు)

ప్ర : ప్రస్తావన

ప్రక : ప్రకరణము

భూ : భూమిక

రం : రంగము

శ : శతాబ్దము

సం : సంచిక; సంవత్సరము.

సంపు : సంపుటము

అధోజ్ఞాపికలలోని :

మొదటి సంఖ్య : అధోజ్ఞాపిక సంఖ్య

రెండవ సంఖ్య : ఉపయుక్త గ్రంథ సంఖ్య

పు. తరువాతి సంఖ్య : పుట సంఖ్య.

———

# ఉపయుక్త గ్రంథములు

## తెలుగుగ్రంథములు: విమర్శనములు


1. ఆంధ్ర కవి పండిత సంఘ చరిత్రతత్త్వము 1899

2. నాట్యాంబుజము-పూరాణం సూరి శాస్త్రి 1923

3. ఆంధ్ర నాటక రంగము-గొల్లపూడి శ్రీరామమూర్తి 1924

4. ఆంధ్ర నాటక సంస్కరణము-పురాణంసూరిశాస్త్రి 1924

5. ఆంధ్ర నాటకములు-రంగస్థలములు-చేకుమళ్ల అచ్యుతరావు 1926

6. నాట్య అశోకము-పురాణం సూరిశాస్త్రి 1925-27

7. ఆంధ్ర నట ప్రకాశిక-పసుమర్తి యజ్ఞ నారాయణశాస్త్రి 1930

8. నాటకోపన్యాసములు-రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

9. ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేజము-గిడుగు వెంకట రామమూర్తి పంతులు 1933

10. శారదాకాంచిక-చతుర్థ కింకిణి-గ్రామ్యభాషా ప్రయోగ నిబంధనము వేదం వెంకటరాయశాస్త్రి 1934

11. ఆంధ్ర నాటక పితామహుడు-ప్రొఫెసర్ దివాకర్ల వేంకటావధాని

12. భారతాభారత రూపక మర్యాదలు-వేదం వేంకటరాయశాస్త్రి 1940

13. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము-కె. వెంకటనారాయణరావు 1951 (ప్రథమముద్రణ-1928. రచన 1926)

14. సాక్షి-ప్రథమ భాగము-పానుగంటి లక్ష్మి నరసింహారావు 1954

15. తెలుగు హాస్యము—ముట్నూరి సంగమేశం 1954

16. మన గురజాడ—అవసరాల సూర్యారావు 1954

17. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర-నేలటూరి వేంకటరమణయ్య

18. దక్షిణాంధ్రయుగ వాఙ్మయ చరిత్ర-డా.కె.వి.ఆర్. నరసింహం 1955

19. వేదం వేంకటరాయశాస్త్రి జన్మ శతాబ్ది మహోత్సవ సంచిక-సంపాదకులు-ధరణికోట వేంకట సుబ్బయ్య, గుఱ్ఱము వేంకటసుబ్బయ్య 1956

20. కావ్య నాటకాది పరిశీలనము-అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి.

21. ఆంధ్ర నాటక కర్తలు-ఆదర్శసాహిత్యమాల, హైదరాబాద్ 1957

22. కాళిదాసుని కళాప్రతిభలు-కోరాడ రామకృష్ణయ్య 1957

23. ఆంధ్ర నాటక పద్య పఠనం-భమిడిపాటి కామేశ్వరరావు 1957

24. వేదం వేంకటరాయశాస్త్రి రూపక సమాలోచనము-అమరేశం 1959

25. తెలుగు వాఙ్మయము-సంగ్రహ చరిత్ర-సంకలనం: కూర్మా వేణుగోపాలస్వామి 1960

26. మన ప్రాచీన కళల-పుట్టు పూర్వోత్తరాలు-ఎల్లోరా 1960

27. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర-డా.ఎస్వీ జోగారావు 1961

28. భాసుని రామనాటక మూలములు-డా.జీరెడ్డి చెన్నారెడ్డి 1962

29. నాటక సదస్సు సంచిక-1960 డిశంబరు నెలలో హైదరాబాద్‌లో నిర్వహింపబడినది 1962

30. ఆంధ్ర నాటక సమీక్ష-శ్రీనివాస చక్రవర్తి 1963

31. ఆంధ్ర నాటక దర్శిని- " 1963

32. మన శ్రీరంగం-బిందాన నారాణరావు 1963

33. నారేడియో ప్రసంగాలు-పింగళి లక్ష్మీకాంతంగారు 1963

34 తిరుపతి వేంకటకవుల సాహిత్య సమీక్ష-శిష్టా లక్ష్మీకాంత శాస్త్రి 1963

35. గౌతమ వ్యాసములు-పింగళిలక్ష్మీకాంతం 1964

36. కాళిదాసభవభూతులు-గొడవర్తి సూర్యనారాయణ 1965

37. శ్రీ వీరేశలింగయుగము-కల్లూరు వేంకటనారాయణరావు 1965

38. రాఘవ స్మారక సంచిక-బళ్లారి 1965

39. ఆంధ్రలో నాటకం-నాటక రంగం-డా డి.వి.ఏ. ఆచార్య 1965

40. ఆంధ్ర మహా భారతము:ఛందశ్శిల్పం-డా.పాటిబండమాధవశర్మ 1966

41. షేక్స్పియర్ సాహితీ పరామర్శ-బుచ్చిబాబు 1966

42. తెలుగు నాటక కవులు-శ్రీనివాస చక్రవర్తి 1966

43 తెలుగు నాటక రంగం-సంకలనం: -శ్రీగొల్లపూడి మారుతీరావు, శ్రీ పాద రామచంద్రరావు 1966

44. సాహిత్యోపన్యాసములు-6-స్వర్గీయ కళా ప్రపూర్ణ వేదం వేంకటరాయ శాస్త్రుల వారి శతజయంతి.

45. తెలుగునాటకవికాసము - డా. పి. ఎస్. ఆర్. అప్పారావు 1967

46. కవి కోకిలగ్రంథావళి -4- వ్యాసములు-దువ్వూరి రామిరెడ్డి 1967

47. గ్రీకు రూపకములు- ఎమ్. ఆర్. అప్పారావు 1967

48. సాహిత్యంలో ఔచిత్యం-అవుల గోపాలకృష్ణమూర్తి 1967

49. సాహిత్యోపన్యాసములు-2-శ్రీ పాద కృష్ణమూర్తిశాస్త్రిగారు 1967

50. పానుగంటి వారి సాహిత్యసృష్టి-డా. ముదిగొండ వీరభద్రశాస్త్రి 1968

51. మన హాస్యము-మునిమాణిక్యం నరసింహారావు 1968

52. సాహిత్యోపన్యాసములు-3-శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు 1968

53. ఆంధ్ర నాటక రంగ చరిత్రము-మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి 1968

54. ఆంధ్ర నాటక కళ-శిష్టారామకృష్ణశాస్త్రి 1969

55. వ్యాసరాజి-డా.జి. సూర్యనారాయణ 1969

56. సాహిత్య ప్రయోజనం-కొడవటిగంటి కుటుంబరావు 1969

57. ప్రాచీన పాశ్చాత్య నాటక రంగం-శ్రీనివాస చక్రవర్తి 1969

58. సారస్వత వ్యాసములు-రెండవ సంపుటము-పరిష్కర్త: శ్రీ పురిపండా అప్పలస్వామి 1969

59. సారస్వతవ్యాసములు-ప్రథమ సంపుటము-పీఠిక-పీఠికాకర్త, సంకలన కర్త: డా.జి.వి. సుబ్రహ్మణ్యం 1969

60. మహోదయం-కె.వి. రమణారెడ్డి

60. A. సారస్వతవ్యాసములు-తృతీయసంపుటము-సంకలనకర్త: డా జి. వి. సుబ్రహ్మణ్యం 1969

## లక్షణ గ్రంథములు:

61. ఆంధ్ర సాహిత్య దర్పణము-వేదం వేంకటరాయశాస్త్రి 1935

62. ఆంధ్ర ప్రతాపరుద్రయశోభూషణము-చలమచర్ల రంగాచార్యులు 1944

63. నాట్య శాస్త్రము-డా.పి.ఎస్.ఆర్. అప్పారావు 1959

64. సాహిత్య శిల్ప సమీక్ష-పింగళిలక్ష్మీకాంతం 1966

65. ఆంధ్ర దశరూపకము-మల్లాది సూర్యనారాయణశాస్త్రి 1967

## పద్యకావ్యములు:

66. ఆంధ్రీకృతాగస్త్య బాలభారతము-కోలాచలం శ్రీనివాసరావు 1908

67. శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము-వావిలికొలను సుబ్బారావు 1913-14

68. రుక్మాంగద చరిత్రము-ప్రౌఢకవి మల్లన 1914

69. ఉత్తర రామాయణము-కంకంటి పాపరాజు 191

70. జైమిని భారతము—పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి 1915

71. భాస్కర రామాయణము 1923

72. గోపీనాథ రామాయణము—గోపీనాథము వేంకటకవి 1923

73. రామరాజీయము—అందుగుల వెంకయ్య 1923

74. హరిశ్చంద్రోపాఖ్యానము-శంకర కవి 1930

75. రాణా ప్రతాప సింహ చరిత్రము-రాజశేఖర శతావధాని 1933

76 హరిశ్చంద్రోపాఖ్యానము-గౌరన 1951

77. హరిశ్చంద్రనలోపాఖ్యానము-రామరాజభూషణుడు

78. రంగనాథ రామాయణము

79. శ్రీమదాంధ్ర మహాభారతము-వావిళ్లప్రతి 1967

80. శ్రీమదాంధ్ర మహాభాగవతము-సాహిత్య అకాడమీప్రతి 1968

81. నిర్వచనోత్తర రామాయణము-తిక్కన 1968

82. కుమారసంభవము—నన్నెచోడుడు 196

## జీవిత చరిత్రలు:

83. స్వీయ చరిత్ర-కందుకూరి వీరేశలింగం పంతులు 1910-1915

84. అబలాసచ్చరిత్ర రత్నమాల-భండారు అచ్చమాంబ

85. వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవిత చరిత్ర సంగ్రహము-వేదం వేంకటరాయశాస్త్రి ఎం. ఏం. 1949

86, ఆంధ్ర రచయితలు-ప్రథమ భాగము- (1806-1901) మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి 1950

87. స్వీయ చరిత్రము-చిలకమర్తి లక్ష్మీనరసింహం 1957

## చరిత్రలు:

88. హిందూదేశ కథా సంగ్రహము-ద్వితీయ భాగము-మహమ్మదీయ మహాయుగము-కొమర్రాజు వేంకట లక్ష్మణరావు 1908

89. ఢిల్లీ దర్బారు-కొమర్రాజు వేంకటలక్ష్మణరావు

90. హండే అనంతపురము చరిత్ర-జి.వి అప్పారావు

91. శ్రీ వేంకటపతి మహారాజు- టి. శివశంకరం 1930

92. అళియరామ భూపాలుడు ,, 1932

93 అళియ రామరాయలు-చిలుకూరి వీరభద్రరావు

94 రాజస్థాన్ కథావళి-చిలకమర్తి లక్ష్మీనరసింహం.

## నాటకములు:

95. 'జూలియస్ సీజరు'- వావిలాలవాసుదేవశాస్త్రి 1876

96. ఉత్తర రామ చరితము ,, 1883

97. హరిశ్చంద్ర నాటకము-కందుకూరి వీరేశలింగం పంతులు

98. సునందనీ పరిణయము– కోలాచలం శ్రీనివాసరావు 1907, 1924.

99. సుల్తానాచాందుబీ ,, 1907, 1926

100 రామరాజు చరిత్రము : ,, 1907 1920

101 రుక్మాంగద చరిత్రము : ,, 1907

102. సత్యహరిశ్చంద్రీయము : ,, 1908, 1920

103. పాదుకా పట్టాభిషేకము : ,, 1920

104. కుశలవ నాటకము : ,, 1920

105. ప్రహ్లాద నాటకము : ,, 1920

106. ద్రౌపదీ వస్త్రాపహరణము : ,, 1921

107. బభ్రువాహన నాటకము ,, 1923

108. సీతాకల్యాణము : ,, 1923

109 సుఖమంజరీ పరిణయము : ,, 1924

110. శిలాదిత్య నాటకము : ,, 1924

111. కీచకవధ : ,, 1924

112. లంకాదహన నాటకము ,, 1924

113 శిరోమణినాటకము: ,, 1924

114. గిరిజాకల్యాణ నాటకము ,, 1924

115. శ్రీరామజనన నాటకము ,, 1924

116. మైసూరు రాజ్యాభివృద్ధి ,, 1925
117. ప్రతాపార్కప్రతీయము ,, 1925
118. మానాపమాన నాటకము ,, 1925
119. సీమంతినీ నాటకము ,, 1926
120. మదాలసా నాటకము ,, 1926
121. కాళిదాస నాటకము ,, 1926
122. చంద్రగిర్యభ్యుదయము ,, 1926
123. అభిషేక నాటకము : బులుసు వేంకటరమణయ్య
పరిచయము - నిడదవోలు వేంకటరావు 1953
124. కన్యాశుల్క నాటకము : గురజాడ అప్పారావు 1955
125. చిత్ర నళీయము : ధర్మవరం రామకృష్ణమాచార్యులు 1961
126. విషాద సారంగధరము ,, 1961
127. పాదుకా పట్టాభిషేకము ,,
128. కట్టబొమ్మ : డా॥ గిడుగు వెంకటసీతాపతి 1964
129. మొట్టమొదటి కన్యాశుల్కము:గురజాడ అప్పారావు : బం.గో.రె. 1967

## ప్రహసనములు:

130. నాచిపార్టి : కోలాచలం శ్రీనివాసరావు 1914
131. అన్యాయధన్యపురీ మహిమ ,, 1914

132. ఆచారమ్మన ప్రహసనవు ,, 1914
(కన్నడము)

## నవల:

133. రంగరాయ విజయము : శిరోభూషణం వెంకటరంగాచార్యులు 1915

## సంపుటము:

134. విజ్ఞాన సర్వస్వము : 4 వ సంపుటము - తెలుగు సంస్కృతి " -2

## పత్రికలు:

135. అముద్రిత గ్రంథ చింతామణి

136. చింతామణి

137. ఆంధ్రశిల్పి

138. ఆంధ్ర పత్రిక - సంవత్సరాది సంచికలు

139. భారతి

140. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

141. తెలుగు స్వతంత్ర

142. పరిశోధన

143. ఆంధ్రమహిళ

144. అభ్యుదయ

145. నాట్యకళ

146. స్రవంతి

## సంస్కృత గ్రంథములు :

147. 'భరతకల్పలతామంజరి'-సంగ్రహకర్త-పట్టవర్ధనం సుబ్బాశాస్త్రులు 1887

148. రామాయణము-వాల్మీకి.

149. కుమార సంభవము-కాళిదాసు 1957

150. 'అభిజ్ఞాన శాకున్తలమ్'-రసాస్వాదినీవ్యాఖ్య (తెలుగు)-నేలటూరి రామదాసయ్యంగారు

151. 'సాహిత్య దర్పణ:'-సటిప్పణ లక్ష్మీ వ్యాఖ్యా భూషిత:- 1967

152. The Natya Sastra-Vol I (Chs. I-XXVII)-Edited with introduction by Manomohan Ghosh 967,

153. గీతామకరందము : శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు 1970

154. "ఉత్తర రామ చరితమ్" – రసాస్వాదినీ వ్యాఖ్య-(తెలుగు) : నేలటూరి రామదాసయ్యంగారు 1970

## ఆంగ్ల గ్రంథములు:

155. The Forgotten Empire—Robert Sewell 1900

156. Aristatle's Theory and Fine Art - with a critical text and translation of the Poetics-S.H. Butcher

157. The Dramatic History of the World - Kolachalam Srinivasa Rao 1908

158. Annals of Rajasthan - James Tod 1914

159. Encyclopedia of the Madras Precidency and the adjacent States : Edited by V.L Sastry and M. Venkatarangaiah.

160. The Sanskrit Drama : A. B. Keith 1924

161. The Indian Theatre : R. K. Yajnik 1933

162. An Introduction to the Study of Literature : W.H. Hudson 1955

163 A Report of the Committee for the Revival of Dramatic Art (Constituted by the Government of Composite Madras State in the year 1949) 1959

164 The Influence of English on Telugu Literature : Prof. G.N. Reddy (Un-published)

165. The Karnatak Theatre : Dr. H. K. Ranganath 1960

166. The Gurazada Souvenir - Editor Sri D. Ramanuja Rao 1962

167 The Dasarapa-Dhananjaya: George, C. O. HAAS 1962

168. Sanskrit Poetics as a study of Aesthetic : S. K. De 1963

169. Rupaka Samiksha - General Editor : Dr. E. R. Sri Krishna Sarma 1964

170. Raghavakalamandira - Inauguration Celebration - Souvenir 1964

171. The Complete works of Shakespeare 1965

172. Shakespearean tragedy : A. C. Bradley 1965

173. Drama in Sanskrt Literature - Adya Rangacharya 1967

174. Viresalingam - *V.* R. Narla

175. A Catelogue of the Telugu Books in the Library of British Museum

176. The South Indian Stage - T. Raghavachari (*Mysore* University Magazine - June, 1930)

## కన్నడ గ్రంథములు:

177. కలెయేకాయక - గుబ్బి వీరణ్ణ నవర ఆత్మకథె 1967

178. కన్నడ రంగభూమియ పురోభివృద్ధి - ఆద్య రంగాచార్యరు 1968

179. కుముదిని - గళగనాథ 1969

180. కన్నడిగర కర్మ కథె - గళగనాథ 1969

———

# సంగ్రహ జీవిత చరిత్ర

"కాశ్యపస గోత్రజుఁడు, తెలుఁగాణి ద్విజుఁడు,
భాసురుండగు శ్రీ సేతుపతి సుతుండు,
కలఁడు కోలాచలాంచిత కులములోన
శ్రీనివాసుండు, సదధీనమానసుండు."[1]

"భ్రాజిత కవి సార్వభౌముఁడై నాటక
కవి చక్రవర్తియై క్రాలునెవఁడు,
ప్రాపంచ నాటక ప్రథవోర్జితాదులఁ
బ్రకటించి బోధించు ప్రాజ్ఞుఁడెవఁడు,
చరితాంశ నాటకసార పూరితములౌ
రూపకంబు లొనర్చె రూఢినెవఁడు,
స్వల్ప కాలము నందనల్ప నాటక కావ్య
రచనల కోటిసిరహి నెవండు,

అభినయజ్ఞాన సంపూర్ణతాధికారి
యై చెలంగెడు రసిక శిఖావతంసుఁ
డెవఁడు బళ్ళారి పురమునో నెలమిగాంచు
వాసిఁగనినట్టి కే. శ్రీనివాసుఁడతఁడె."[2]

శ్రీ కోలాచలం శ్రీనివాసరావుగారు (1854-1919) ఆంధ్ర నాటక రంగమునకు, ఆంధ్ర నాటక వాఙ్మయమునకు గావించిన సేవ అపారము; అనితరసాధ్యము. వీరు స్వతంత్ర నాటక కర్తగా, నాటక సమాజాధిపతిగా, అత్యుత్తమ నాటకశాలా నిర్మాతగా, ప్రాచ్యపాశ్చాత్య నాటకముల ప్రథమశ్రేణి విమర్శకుడుగా అత్యున్నత స్థానము నాక్రమించుకొన్నారు. బహుళాంధ్ర జనాదరణకు పాత్రమైన "రామరాజు చరిత్రము" (The Fall of Vijayanagar) మున్నగు ఇరువది యెనిమిది నాటకములు రచించి, "సుమనోరమసభ" అను నాటక సమాజమును స్థాపించి, 'వాణీ విలాస నాటకశాల'ను నిర్మింపజేసి,

1. 98. ప్ర. పు. 12 2. 108, 111, 112, 115.

సంస్కృతాంగ్ల రూపక పఠన జన్య వైదుష్య ప్రకటనాచణమైన ''ప్రపంచ నాటక చరిత్రము" (The Dramatic History of the World) అను నాంగ్ల గ్రంథమునకు కర్తయై విరాజిల్లిన వారు వీరు. ఏ యితరాంధ్ర నాటక కర్తయు రచింపనంత అధిక సంఖ్యలో చారిత్రక నాటకములు రచించి ''ఆంధ్ర చారిత్రక నాటక పితామహు" డని ప్రఖ్యాతి గడించిన వారు వీరు. ''నాటకములు తెలుఁగులో వ్రాయుటకు పునాది వేసిన యగ్రేసరులలో కీర్తి శేషులగు ధర్మవరం రామకృష్ణమాచార్యులును, కోలాచలము శ్రీనివాసరాయలును గణనీయులు. తెలుఁగు రూపకముల చరిత్ర వ్రాయువారు వీరి పేరులు మరచుటకు వీలు లేదు''[1] అని శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు పొగడుటలో నెంతయు సామంజస్యము కలదు. అనేక విధములుగా సేవచేసి యుండుటచే ఆంధ్ర నాటక వాఙ్మయ చరిత్రమున శ్రీనివాసరావుగారి కొక విశిష్ట స్థానము కలదు.

## 1.1 వంశ ప్రశస్తి :

కోలాచలం శ్రీనివాసరావుగారిది పండిత వంశము. జగత్ప్రసిద్ధి గాంచిన మల్లినాథసూరి వీరి పూర్వుడు. "ఎవ్వాని వదన రాజీవ రంగ స్థలంబున నలువ రాణి నిచ్చలును నట్టువలు సలుపుచుండునో, ఎవ్వాఁడు కువ్యాఖ్యా విషయ మూర్ఛిత యగు కాళిదాస కవితా సుకన్యకనుదనదు సంజీవినిచేఁ దెప్పఱిల్లఁ జేసి, వెజ్జుల మిన్నయని వన్నెకెక్కెనో, ఏ మహిత చారిత్రుని యశఃకుసుమంబుల ధరియించి దివాకరనిశాకరులు పుష్పవంతులను సార్థకనామమును బడసిరో, ఏ విద్వదవతంసుఁడు అనన్య జన సామాన్యమగు మహామహోపాధ్యాయ బిరుదమునకు మార్గదర్శియయ్యెనో, అట్టి చులుకీకృత సకల శాస్త్ర జలధియగు కోలాచల శ్రీమల్లినాథసూరి వంశమున మన శ్రీనివాస ముక్తామణి"[2] జన్మించెను.

శ్రీనివాసరావుగారు 'ఆంధ్రీకృతాగస్త్య బాలభారతము' పీఠికలో తాము మల్లినాథసూరి వంశీయులమని సప్రమాణముగా నిరూపించియున్నారు[3] 'ఎల్ఫిన్‌స్టన్', 'దక్కన్' కళాశాలలలో ప్రాచ్య భాషాచార్యులుగ నుండిన శ్రీ కే. పి. త్రివేదిగారు 1901 లో ప్రఖ్యాత వ్యాఖ్యాత మల్లినాథసూరిని గూర్చిన

1. 8 పు. 37
2. 101. సి. పు. 1, 2
3. 66: పి. పు. 1-6,

కొన్ని విషయములను తెలుపవలసినదని శ్రీనివాసరావుగారిని కోరిరి. మల్లినాథ సూరి తమ పూర్వుడనుట వాస్తవమైనను, దానిని నిరూపించు నాధారము లప్పటికి తమ యొద్ద లేకుండినవనియు, ఆ వెనుక పరిశోధించి తద్విషయమును సప్రమాణముగ నిరూపించితి మనియు శ్రీనివాసరావుగారు తెలిపిరి. శ్రీ త్రివేది గారు విద్యాధరకృతమైన 'ఏకావళి' కి వ్రాసిన ఉపోద్ఘాతమున మల్లినాథసూరి పదునాల్గవ శతాబ్ద్యంతము నందుండినవాడని నిర్ణయించిరి. ఈ నిర్ణయమునకు త్రివేదిగారు చూపిన ఆధారముల మూలముననే మల్లినాథసూరి పదునైదవ శతాబ్దివాఁ[1] డనుటకును అవకాశము కలదని శ్రీనివాసరావుగారు తలచిరి. ఇందుకు వారు చూపిన ఉపపత్తు లివి. ప్రతాపరుద్ర మహారాజు 1320 ప్రాంతమున దివంగతు డయ్యెను. ఆ రాజాస్థానము నలంకరించిన విద్యానాథుడు[2] సంస్కృత భాషలో 'ప్రతాపరుద్ర యశోభూషణమును' రచించెను. విద్యాధరుడను విద్వాంసుడు "ఏకావళి" యను నలంకార గ్రంథమును వ్రాసెను. ఈ ఏకావళి వ్యాఖ్యాత మల్లినాథసూరి. మల్లినాథసూరి ద్వితీయ పుత్రుడు కుమారస్వామి సోమయాజి. 'ప్రతాపరుద్ర యశోభూషణము' నకు వ్యాఖ్యాత తన వ్యాఖ్యానమున కుమారస్వామి సోమయాజి, తాను తన అన్న పెద్దిభట్టు మల్లినాథసూరి పుత్రుల మనియు, తాను తన అన్న యొద్దనే విద్య నభ్యసించితి ననియు, పూర్వము మహావిద్వాంసుడైన విద్యాధరుడు సాహిత్యమున రత్నముల వంటివి సేకరించెననియు తెలిపియున్నాడు. అందుచే విద్యాధరుడు కుమారస్వామిసోమయాజి కంటె పూర్వుడని తెలియుచున్నది.[3] ఈ కుమారస్వామికి మల్లిస్వామి సోమయాజు లను పుత్రుడుండెను, ఇది పరంపరగా జనశ్రుతిలో నున్న విషయమేయైనను ఒక దాన పత్రము నాధారముగగొని దీనిని శ్రీనివాసరావుగారు ధ్రువపరచిరి. ఆ దానపత్ర మిపుడు లభ్యముకాదు. 1907లో

---

1. (i) 134. పు. 369, (ii) 62 పి. పు. 11

2 66. పి పు. 3 లో శ్రీనివాసరావుగారు విద్యానాథ, విద్యాధరుల నొకే వ్యక్తిగా గ్రహించి, 'ప్రతాపరుద్రయశోభూషణము, ఏకావళి గ్రంథముల కర్త విద్యాధరుడని పేర్కొనుట ప్రామాదికము.

3. 63. పి. పు. 14, 15. విద్యాధరవిద్యానాథులు సమకాలికులు. [ప్రతాపరుద్రుడు క్రీ. శ. 1290-1326, విద్యానాథుడు- 1275-1325, ఇతని సమకాలికుడు విద్యాధరుడు 1282-1327]

తన 92 వ ఏట మరణించిన తమ దగ్గర బంధువు తెలిపిన ఈ క్రింది విషయ మును విశ్వసించిరి బళ్ళారి తాలూకాలోని 'ఊలూరు' గ్రామమును పై తెల్పిన మల్లిస్వామి సోమయాజులకు, అతని పూర్వులకు శ్రీకృష్ణదేవరాయలు అగ్రహార ముగ దాన మొసగియుండె ననియు, ఆ దాన పత్రము పైని తెల్పిన వృద్ధుని యొద్ద నుండగా అంతకు ఏబది వత్సరములకు ముందు బళ్ళారి కలెక్టరుగారు అట్టి దాన పత్రములను వశపరచుకొన్నప్పుడు గ్రహించి తిరిగి ఈలేదనియు తెలిపెను. భవబంధములనుండి తప్పించుకొనిన సాధువగు ఆ వృద్ధుని శ్రీనివాస రావుగారు విశ్వసించి, శ్రీకృష్ణదేవరాయలు 1530 ప్రాంతములో దివి జేరెనను చారిత్రక సత్యమును గ్రహించి కుమారస్వామి సోమయాజులు పదునైదవ శతా బ్ద్యుత్తరార్థమునను, అతని తండ్రి మల్లినాథసూరి ఆ శతాబ్ది పూర్వార్థమునను నివసించి యుందురని భావించిరి. ఇంతేగాక పైన పేర్కొనబడిన మల్లిస్వామి సోమయాజుల పుత్రుడు కోలాచల సర్వదేవ సోమయాజులు 1564 లో నివసించుచుండెననియు, ఊలూరులోని నల్వురు యజమానులలో నొక్కడుగ పరిగణింపబడెనని శా.శ. 1486 అనగా A.D. 1564 సం॥నకు చెందిన ఆ అగ్రహారములోని ప్రాయశ్చిత్త సంబంధి పత్రమునందు గలదు [1] ఈ సర్వదేవ సోమయాజులకు మల్లిశేషాద్రి దీక్షితుడను పుత్రుడుండెను. తల్లి కోట యుద్ధానంతరము 1564 సం లో విజయనగర రాజ్య మరాజకము కాగా అనుభవించుచుండిన వారినుండి 'ఊలూరు' అగ్రహారము లాగివేయబడినది. కాని అనంతపురము పాళెగాడయిన హండే హనుమప్ప నాయకుని యొద్దనుండి మహావిద్వాంసుడైన మల్లిశేషాద్రి దీక్షితులు "ఊలూరు" అగ్రహారమును మరల సంపాదించిరి. సి.పి.బ్రౌన్‌దొరగారు తమ'Annals of Handeh Anantapur' లో బళ్ళారికి పశ్చిమమున కొంత ప్రాంతము హండే హనుమప్ప నాయకునకు 1569 లో ఈబడినట్లును,అతడు 1582 లో మరణించినట్లును తెలిపియున్నారు [2] కాబట్టి తమ పూర్వుడు శేషాద్రిదీక్షితులు 'ఊలూరు' అగ్రహారమును 1569-1582 సం॥ల మధ్య కాలమున తిరిగి సంపాదించియుందురని శ్రీనివాసరావుగారు నిర్ణయించిరి

మల్లిశేషాద్రి దీక్షితుల పుత్రుడు సూర్యనారాయణ. ఇతని కాలమున ఆ గ్రామ యాజమాన్యమునకు సంబంధించి, ఇతనికి, ఇతర విద్వాంసులకు తగాదా తలయెత్తగా ఆనెగొంది రాజునకు నివేదింప, ఆ రాజుచే మల్లి సూర్యనారా

1. 66. పి. పు. 3, 4. 2. 90. పు. 7,8

యజతోపాటు తక్కిన కొందరును గ్రామమున యజమానులని నిర్ణయింప బడెను. పైని పేర్కొనబడిన వృద్ధ సన్యాసి వంశీయుల అధికారములోనే అప్పటికిని ఆ గ్రామముండినది. కాని ఆతడు విసిగి ఆ గ్రామమును వదలి, తన పుత్రుడు భాస్కరభట్టుతోపాటు తుంగభద్ర కవతలి వైపున నిజాము రాష్ట్రములోని 'జంతకలము' నందు స్థిరపడెను. అక్కడ సైతము వారికి జమీనులుండినవి అతని పౌత్రుడు వేంకటరాచ దీక్షితులు మహా విద్వాంసుడై ధార్వాడ జిల్లాలోని గజేంద్ర గడమున భూసంపదను సంపాదించి తన 98 వ యేట మరణించు వరకు అక్కడే నివసించుచుండెను అతనికి సుబ్బాశాస్త్రి, గంగాధరశాస్త్రి (శ్రీనివాసరావుగారి పితామహుడు), భాస్కరశాస్త్రి అని ముప్వురు పుత్రులు. సుబ్బాశాస్త్రి ఉత్తమ పండితుడు; నిజాము వజీరు 'చందూలాల్' వలన తుంగభద్రా పశ్చిమ భాగము నందలి 'కొప్పాల్' సమీపముకగల 'చూకనకలము' జాగీరును పొందినవాడు. అది ఆ తరువాత కూడ తమ వంశీయుల అనుభవములోనే ఉండినదని శ్రీనివాసరావుగారు తెలిపిరి.

బొంబాయి, మద్రాసు, నిజాము రాష్ట్రములలో పలుచోట్ల వీరి వంశీయుల ఆస్తిపాస్తు లుండుటచే సుబ్బాశాస్త్రి తన తమ్ములను భిన్న స్థలములపై ఆధిపత్యము వహింప నియోగించెను ఆ విధముగ శ్రీనివాసరావుగారి పితామహుడైన గంగాధరశాస్త్రి ప్రసిద్ధమైన హంపి సమీపమందలి కమలాపురముకోను, ఊలూరు, పందిపాడు, కదరాంపురము, ఆనెగొంది, సిద్ధమ్మనహళ్లి, రాంపురము మున్నగు గ్రామములలోను గల భూసంపదపై నధికారము వహించి, వాని ననుభవించుచు కమలాపురమున స్థిరపడెను. ఆ తరువాత శ్రీనివాసరావుగారి తండ్రి సేతుపతిశాస్త్రిగారు అధికారమును వహించి కమలాపురమున నివసించుచు 1888 లో మరణించిరి. తన వంశమునకు 'కోలాచలము' అను నామము కలుగుటను రావుగారిట్లు వివరించిరి. 'ఏకావళి' పీఠిక (పుట 28) లో ప్రొఫెసర్ త్రివేదిగారు కోలాచలమనునది యొక గ్రామమనియు, దానిపై వంశపారంపర్యముగ ఒక జమీందారు 14, 15 శ. లలో ఆధిపత్యము వహించి యుండెననియు పేర్కొనిరి. శ్రీనివాసరావుగారు దీనిని సత్యముగా గ్రహించి తమకు తెలిసిన మరియొక ఐతిహ్యమును దీనికి జోడించిరి. మల్లినాథసూరి పూర్వులు "ఊలూరు" సమీపమున గల "పందిపాడు" నందు నివసించెడివారు. వారికి పందిపాడు వారని ప్రసిద్ధి. దీనినే కన్నడమున

"హందిహాళు" అందురు. పందులకు సంబంధించిన స్థలము 'పందిపాడు' అను నర్థముగల ఆ పదమును మల్లినాథసూరి "కోలాచల" అని సంస్కృతీకరించెను. అప్పటినుండి మల్లినాథసూరి, అతని సంతతివారును "కోలాచలము" వారని పిలువబడుచు వచ్చిరనియు, శ్రీనివాసరావుగారి వంశీయులకు 'పందిపాడు'లో ఇనాముభూమి కలదనియు, ఈ పేరు "కోలచర్ల' అని యెట్లు మారినదో తమకు తెలియదనియు శ్రీనివాసరావుగారు వివరించిరి. కాని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దీనిని స్వీకరింపక, ఓరుగల్లు సమీపములోని "కొలచెలము" అనునది మల్లినాథసూరి స్వస్థలమని నిరూపించిరి.[1] ఇది ప్రస్తుతము "మెదక్" జిల్లాలో కలదు. ఇదే సరైనదని మరికొందరు విద్యావేత్తలు విశ్వసించుచున్నారు. అయినను వ్రాత, అచ్చు ప్రతులలో "కోలాచల, కొలచల, కోలచెర్ల, కొలచెర్ల, కొలచెలమ-అని అనేక విధములుగా నుండుటచే ఇదమిద్ధముగా చెప్పుట కష్టము. 'కోలాచల' శబ్దమే ఇన్ని వికారములు పొంది ఉండవచ్చును.

పైని శ్రీనివాసరావుగారు వర్ణించిన దానినిబట్టియు, వీరి కోరికపై శ్రీకామావధానుల సుబ్బాశాస్త్రి గారాంధ్రమున పద్యరూపమున వ్రాసిన దానిని అనుసరించియు, కోలాచల వంశవృక్షమును నిర్మింపవచ్చును.[2]

మల్లినాథసూరి మొదలుకొని కోలాచలం వారిది పండిత వంశము, మల్లినాథసూరి వ్యాఖ్యాతృ శిరోమణిగా ప్రపంచ ప్రఖ్యాతి గాంచినాడు. అతని పుత్రుడు కుమారస్వామి సోమయాజి 'ఏకావళి' వ్యాఖ్యాత. ఇతని అన్న పెద్దిభట్టు మహాపండితుడు. కుమారస్వామి ప్రపౌత్రుడు మల్లిశేషాద్రి దీక్షితులు మహా విద్వాంసుడు. ఇతని ప్రపౌత్రుడు వేంకటరామ దీక్షితులు మహా విద్వాంసుడై ధార్వాడ జిల్లాలోని గజేంద్ర గడమున భూసంపదను దానముగ పొందినవాడు ఇతని జ్యేష్ఠ పుత్రుడును, శ్రీనివాసరావుగారి పితామహుడైన గంగాధర శాస్త్రికి అన్నయునగు సుబ్బాశాస్త్రికీర్తి ప్రతిష్ఠలు గడించిన మహాపండితుడు. బొంబాయిరాష్ట్రమందలి ధార్వాడ జిల్లాలోని'నారగుండ' యందలి ప్రసిద్ధికెక్కిన చిదంబర దీక్షితులు నిర్వహించిన యాగమున కితడు ఆహూతుడయ్యెను. ఆ యజ్ఞమును పద్యరూపమున అభివర్ణించి బహుమతి గ్రహించెను. తనశిష్యుడును, నిజాము వజీరు (మంత్రి) ను అయిన 'చందులాల్'కు,చిదంబర దీక్షితులు సుబ్బాశాస్త్రిని పరిచయము గావించెను. ఆ వజీరు ఇతనివైదుష్యమును వెంటనే

1. మీఁగడ తఱకలు. పు. 190-207 2. చూడుడు. పు. 7, 8.

## కోలాచల వంశవృతము:

మల్లినాథసూరి (15 వ శ పూర్వార్థము)

- పెద్దిభట్టు
- కుమారస్వామి సోమయాజి (15 వ శ. ఉత్తరార్థము)
  - మల్లిస్వామి సోమయాజులు
    - సర్వదేవ సోమయాజులు (A D. 1584)
      - మల్లిశేషాద్రి దీక్షితులు (1559-1582)
        - మల్లిసూర్యనారాయణ
          - భాస్కరభట్టు
            - వేంకటరామ దీక్షితులు
            - శివరామ
            - లక్ష్మణ

వేంకటరామ దీక్షితులు

- సుబ్బాశాస్త్రి ('చూకనకల' మను జాగీరును పొందెను. సంస్కృతమున బహు గ్రంథకర్త)
  - వేంకటరామారావు
    - లక్ష్మణ
    - భరత
    - శాంత
    - శత్రుఘ్నరావు
      - శ్రీనివాసరావు, B. A., B. L. (Advocate)
- గంగాధరశాస్త్రి (కమలాపురమున స్థిరపడెను)
  - సేతుపతిశాస్త్రి (1868 లో మరణించెను)
    - వేంకటరావు (న్యాయవాది)
      - రామచంద్రరావు (Bar-at-Law)
        - శ్రీరామారావు
    - శ్రీనివాసరావు (1854-1919) (నాటక కర్త)
      - జయరత్నం
      - వీరప్రతాప్
      - సునందని
    - లక్ష్మ్యంబ
    - వెంకాంబ
    - గిరియమాంబ
- భాస్కరశాస్త్రి

గుర్తించి తుంగభద్రా పశ్చిమ దిశలోని 'కొప్పాల్' సమీపమున గల 'చూకన కలము' జాగీరునిచ్చి సన్మానించెను. సుబ్బాశాస్త్రి సంస్కృతమున బహు గ్రంథములకు కర్త.[1] మరాఠీ, కన్నడ భాషలలోను ఉత్తమ కవిగా పేరు కలదు [2] అతడు సన్యసించి వానప్రస్థమును స్వీకరించిన తరువాత గజేంద్ర గడమున ఇరువది సంవత్సరములు నివసించి సిద్ధిని పొందెను. అతని సమాధి నిప్పటికిని దర్శింతురట శ్రీనివాసరావుగారి పితామహుడు గంగాధరశాస్త్రిని "భాషాధిపు" డని కామావధానుల సుబ్బాశాస్త్రిగారు వర్ణించిరి. ఇతడు పైతృక ముగ సంక్రమించిన కమలాపురము, ఊలూరు, పందిపాకు, కదరాంపురము, ఆనెగొంది, సిద్ధమ్మనహళ్లి, రాంపురము మున్నగు గ్రామములలోని భూసంపదపై అధిపత్యము వహించుట యందే నిమగ్నుడై కాలము గడిపియుండును ఇతడు సుబ్బమ్మను వివాహమయ్యెను చాలకాలము సంతతి లేమిచే భార్యా సహితుడై ఆసేతు యాత్రలో పుణ్యక్షేత్ర సందర్శనము వెనుక పుత్రజనన మయ్యెను. ఆ పుత్రున కాదంపతులు సేతుపతి యని నామకరణము గావించిరి. సేతుపతి పెరిగి పెద్దవాడై విద్యను గడించి బుద్ధిని బృహస్పతియై, ఆనాడు ఆనెగొందికి రాజయిన శ్రీమత్తిరుమల దేవరాయల యొద్ద మంత్రి (దివాన్) పదవిని స్వీకరించి ప్రసిద్ధిని గాంచెను. కాని కవిగా వాసివన్నెలు సంపాదింపలేదు ఇత డచ్చమాంబను వివాహమాడెను. వీరికి ముగ్గురు పుత్రులు, ముగ్గురు పుత్రికలు జన్మించిరి వీరిలో కనిష్ఠ పుత్రుడైన శ్రీనివాసరావుగారు, "విరూపాక్ష క్షేత్ర మునకు సమీపమున నుండు కమలాపురమను గ్రామమున క్రీస్తు శకము 18-8-854 తేదీలకు సరియగు ప్రమాదీచ సంవత్సర ఫాల్గుణాసిత చతుర్దశి నాడుద్భ" వించిరి. శ్రీనివాసరావుగారి కంటె వేంకటరావుగారు నాలుగేండ్లు పెద్ద. అనగా వీరు 1850లో జన్మించియుందురు. వేంకటరామారావుగారు వేంకటరావు గారికంటె పెద్దవారు. సేతుపతిశాస్త్రిగారు గార్హస్థ్య జీవితము సుఖ సంతోషము లతో గడిపిరి. సేతుపతిశాస్త్రిగారి మంత్రిత్వమున ఆనెగొంది సంస్థానము సుఖ శాంతుల కాలవాలమైనది. వారుత్తమ గుణ సమన్వితులు. ధైర్యము, భూరిదయ వారిసొత్తు. శ్రీనివాసరావుగారి తొమ్మిదవ యేట 1863లో సేతుపతిశాస్త్రిగారు దివంగతులైరి.

---

1 66. పీ. పు. 5. 2. 159. పు. 642

## 1 2 బాల్యము, విద్యాభ్యాసము:

శ్రీనివాసరావుగారు 18-8- 854 తేదీన జన్మించినది మొదలు తొమ్మిదవ సంవత్సరము వరకు మాత్రమే తండ్రి ప్రేమాదరములకు నోచుకొన్నారు. అంతవరకు తండ్రి పోషణలో సుఖముగా చీకు చింతలేక కమలాపురముననే పెరిగి పెద్దవారైరి. 1868 వ సంవత్సరములో వీరి తండ్రి సేతుపతిశాస్త్రిగారు దిగవంతులు కాగా, వీరి బావగారు తిన్నవేలి కుప్పుస్వామయ్య గారు శ్రీనివాసరావుగారిని చేరదీసి ఆదరించి, ఆంగ్ల భాషాబోధనార్థము బళ్ళారికి కొనితెచ్చి, విద్యా బుద్ధుల గరపుచు సంరక్షించు చుండిరి. అంతకుముందే వీరి అన్నగారగు వేంకటరావుగారిని తెచ్చి తమ యింటనే విద్య నేర్పించుచు పోషించుచుండిరి.[1] శ్రీనివాసరావుగారు బావగారి పోషణలో భయభక్తులతో విద్య నభ్యసింప మొదలిడిరి. వీరికి మొదటినుండియు నాంధ్రభాషపై నమిత ప్రేమ. అయినను "హూణ పరీక్షాపాఠములు నేర్చుటయందే కాలంబు" గడిపిరట. అనగా వీరి ఆంగ్ల విద్యాభ్యాసమెట్టిదో అవగతమగుచున్నది.[2] కనుక ఆంధ్రభాషతో పాటు సంస్కృతము, అంతకంటె కాలానుగుణముగా ఆంగ్లభాషను సహిత మభ్యసించుచు వచ్చిరి వీనికి తోడుగా కర్ణాట భాషయు నలవడినది. ఇట్లు భాషా సాహిత్యముల పరిచయము నొంది, నానాముఖముల తమ పాండిత్యము నభివృద్ధి చేసికొనుచు, ఆ యవకాశమును శ్రీనివాసరావుగారు సద్వినియోగము గావించుకొనిరి[3] శ్రీనివాసరావుగారు జన్మతః కుశాగ్రబుద్ధి. దానికి తోడు బహుముఖ జ్ఞాన సముపార్జనముతో బంగారునకు తావియబ్బినట్లయినది. శ్రీనివాసరావుగారి బుద్ధి నైశిత్యమునకు తార్కాణముగా వీరు 1873వ సం.న అనగా తమ పందొమ్మిదవ యేట 'మెట్రిక్యులేషన్' పరీక్షలో కృతార్థులైరి.[4] శ్రీనివాసరావుగారి విద్యాభ్యాసము మెట్రిక్యులేషన్‌తోనే ముగియలేదు. వీరి యుత్తమ జ్ఞాన సముపార్జనమునకు నిదర్శనముగా 1876 వ సం. నందు అనగా వీరి ఇరువది రెండవ సంవత్సరమున ఎఫ్. ఏ. పరీక్షలోను ఉత్తీర్ణులైరి.[5] మరొక విషయము. పైని పేర్కొన బడిన శ్రీ వి ఎల్. శాస్త్రి, శ్రీ ఎమ్. వెంకట

1 66 పీ పు. 5. 2. 98 పీ. పు. 1
3. 21 పు. 18 4. 159 పు 643
5. 86 పు. 131

రంగయ్యంగార్ల సంపాదకత్వము నందలి 'Encyclopedia of the Madras Presidency and the adjacent States'' అను గ్రంథమున శ్రీనివాసరావు గారిని గూర్చి వ్రాయు నప్పుడు 'Mr. K. Sreenivasa Rao, B. A- అని పేర్కొనబడియున్నది. ఇదిగాక మరెక్కడ శ్రీనివాసరావుగారు బి.ఏ. అయి నట్లు తెలియరాదు; వాడుకలోనులేదు. మే 1918నుండి ఆరంభమైన 'వేదార్థచంద్రిక ముఖపత్రముపై పత్రికాధిపతుల పేర్లుగలవు. అందులో 'కోలాచలము శ్రీనివాసరావు' అని మాత్రమే కలదు. తదితర వ్యక్తుల నామముల వెనుక వారి 'డిగ్రీలు' సైతము కలవు. శ్రీనివాసరావుగారుకూడ 'బి.ఏ." అయి యుండిన ఇతరులతో పాటు వీరి నామము వెనుక డిగ్రీ అచ్చువేసి యుందురు కాబట్టి శ్రీనివాసరావుగారు బి.ఏ. కాలేదో లేక బి.ఏ. చదివి డిగ్రీ తీసికొనలేదో తెలి యదు. ఇట్లు శ్రీనివాసరావుగారు ఆంగ్ల భాషలో విజ్ఞాన సముపార్జనము గావించి, అందరి ప్రశంసలకు నోచుకొనిరి. ఇట్లు కొంతకాలము గడచినది. కాని ఇతరుల కెంత కాలమీ విధముగ బరువుగ నుండగలరు? ఏదేని ఉద్యోగముచేసి ధనార్జన చేయదగిన వయస్సు వచ్చినది. అర్హతయు సంపూర్ణముగాగలదు. అందుచేత తమ కాళ్ళపై తామే నిలబడ దలచినారు రావుగారు. అంతేగాదు, 'ఉద్యోగం పురుషలక్షణమ్' అను సూక్తిని రావుగారు బాగుగా గుర్తించినవారు. కనుక "ఉద్యోగ నిమిత్తము ప్రయత్నములు గావించినారు. ఫలితముగా "రెవిన్యూ డిపార్టుమెంటు"లో ఉద్యోగము కుదిరినది. వీరు అనంతపురం జిల్లా గుత్తిలో పండ్రెండు వత్సరముల కాలమూ (1877-1889) ఉద్యోగమును నిర్వర్తిం చిరి.[1] ఈ మధ్య కాలమున కొలదినాళ్ళు '1881లో అనంతపురమండలము "డిప్యూటి కలెక్టరు' కడ దివానుగా సైత ముండినట్లు తెలియు చున్నది.[2] ఏ పనినైనను త్రికరణశుద్ధితో నిర్వర్తించుట శ్రీనివాసరావుగారిలో గుర్తింపదగిన ఉత్తమ గుణము. పని నెగవేయు పద్ధతి వీరి యింట నొంటలేనిది. అందుచే ఉద్యోగ ధర్మమును సక్రమముగా నిర్వర్తించిరి. ఆ నిర్వహణమున కార్యభార మధికమై యుండును. "దొరతనపు వారి కొలువు బలు'వైనట్లును 'ఆ వేతనా యాతనంబు లన్బడి, రేయింబవళులు శరీరాయాసంబు' చెందినట్లును రావుగారే తెలిపి యుండుట యిందుకు నిదర్శనము.[3] ఇంతేగాదు శ్రీనివాసరావుగారి

1. 159 పు. 643    2. 86 పు. 181

3, 98 పీ. పు. 1

ప్రకృతికి యుద్యోగము విరుద్ధమనియు తలంపవలెను. కనుకనే స్వేచ్ఛాజీవి, కళాపిపాసువు అయిన వీరికి ప్రభుత్వపు నియమనిబంధనలు, పరిస్థితులు రుచించి యుండవు. పంజరములోని చిలుకవలె బంధింపబడక, విశాల విహాయసమున రెక్కలార్చి స్వైర విహారముగావింప దలచినది రావుగారి మనసు అట్టి స్వేచ్ఛా పథగాములగుటచే వీరికి ఉద్యోగముపై నాస్థతగ్గిపోయినది. అందుచే 1889వ సం.న తమ ముప్పది ఐదవ సంవత్సరమున ఉద్యోగమునకు స్వస్తి చెప్పి శ్రీనివాసరావుగారు బళ్లారికి తిరిగి వచ్చిరి.[1] అంతటితో వీరి ఉద్యోగ దశ పరిసమాప్తమైనది.

## 1.3 న్యాయవాద వృత్తి :

శ్రీనివాసరావుగారు ఉద్యోగమును వదలి 1889 బళ్ళారికి వచ్చుసరికి వీరి అన్న వేంకటరావుగారు సుప్రసిద్ధ న్యాయవాదులై కీర్తి ప్రతిష్ఠలతోపాటు ధనమును వలసినంత ఆర్జించుచుండిరి. వేంకటరావుగారు తమ్ముని చేరదీసి ఆదరాభిమానములతో అరయుచుండిరి. శ్రీనివాసరావుగారు సైతము న్యాయ వాద వృత్తి నవలంబింప నభిలషించిరి. అన్నగారి యొద్దనే యుండుట వలన శ్రీనివాసరావుగారు క్రమముగా న్యాయస్థానపు చట్టముల పరిచయము, వాని ప్రయోగ ప్రచార విధానములలో ప్రవేశమును క్రమముగా అచిర కాలముననే అభ్యసించిరి అభ్యసించుటయేకాదు 'ప్లీడర్షిప్' పరీక్షకు వెళ్ళవలెనను ఆకాంక్ష జనించినది. ఇందుకు అన్నగారి ప్రోత్సాహ సాహాయ్యములు లభించినవి శ్రీని వాసరావుగారు కోరిన విధముగానే 'సెకండ్ గ్రేడ్ ప్లీడర్షిప్' పరీక్షలో కృత కృత్యులైరి.[2] వెంటనే 1892 వ సంవత్సరము నుండి స్వచ్ఛందమైన న్యాయవాద వృత్తి నవలంబించిరి.[3] శ్రీనివాసరావుగారు అన్నగారితోపాటు బళ్ళారి యందే న్యాయవాదిగా పనిచేయ నారంభించిరి. వీరు కేవలము పేరుకు మాత్రమే న్యాయవాది కాదు. వీరు స్వతఃగా వాజ్నైపుణ్యము, సంభాషణా చాతుర్యము కలవారు. కనుకనే న్యాయవాదిగా సైతము మిక్కిలి రాణించిరి. వృత్తియందు ధనముతోపాటు కీర్తి ప్రతిష్ఠలు విస్తారముగా గడించిరి. శ్రీనివాస రావుగారిలో సత్యనిష్ఠ అధికము. ధర్మము నెరిగి నడుచుకొనువారు. అంతేగాదు.

---

1 95 పీ. పు. 1 2. 21 పు. 18
3. 98 పీ. పు. 1

వీరికి బుద్ధి నైశిత్యముతోపాటు పట్టుదల, కార్యదీక్ష, కార్యదక్షతయు మెండుగా గలవు. ఇట్లుత్తమ గుణగరిష్ఠులగుట చేతనే వీ రచిరకాలముననే వృత్తిలో మహోన్నత స్థాయి నందుకొనిరి.

శ్రీనివాసరావుగారికి ఆర్థికమైన ఇబ్బందులు లేవు. తామధికముగానే ధన సంపాదన చేయుచుండిరి. అన్నగారు అప్పటికే విత్తము బాగుగా గడించి దాతగాను, ఉత్తమాశయ సంపన్నుడుగాను పేరు పొందియుండిరి. శ్రీనివాస రావుగారి కంతకుముందే వివాహమై యుండవలెను. కాని వీరి వివాహ మెప్పుడు జరిగినది ఇదమిత్థముగా తెలియరాలేదు. వీరి భార్య లక్ష్మమ్మ. వీరు భార్యా సమేతముగా అన్నగారి ఇంటిలోనే ఏ విధమైన అరమరికలు లేక సుఖముగా జీవించుచుండిరి. వీరిది అవిభక్త కుటుంబము. వేంకటరావుగారు బళ్ళారిలో సుప్రసిద్ధులైన వకీలుగా 'మద్రాసు ప్రెసిడెన్సి' లోనే ఖ్యాతి వహించిరి. ఆ దినములలో వృత్తిమూలకముగా వారికి నెలసరి వరంబడి దాదాపు ఐదువేల రూపాయలు. ఒక కారు, కోచ్ (టాంగా) కొని సుఖసంపదలతో తులతూగుచుండెడివారు.[1] దానము చేయుట ధనమున్నందుకు ప్రయోజనము. ఈ సూక్తిని ప్రగాఢముగా విశ్వసించినవారు వేంకటరావుగారు. కనుకనే సంపాదించిన ధనమును సద్వినియోగము చేయుటలో వారినే ప్రప్రథమముగా పేర్కొనవలెను. గుప్తదానము లెన్నియో గావించినారు. ప్రజాహిత కార్యము లందాసక్తి యుండుటయేగాక దేశాభిమానము, సంఘ సంస్కరణాభిలాష వీరి సొత్తు. 'జాతీయ కాంగ్రెస్' సంస్థలో చేరి పనిచేసి తమ దేశాభిమానమును ప్రకటించిరి. సంఘము నందలి దురాచారములను తొలగించి సంస్కరణమును కోరిరి. అందుకు విద్య ప్రధానము. స్త్రీవిద్యను ప్రోత్సహించిరి. బళ్ళారికి పుర భవనము(TownHall) లేని కొరతను సొంత డబ్బు-రూ. 50,000/- లు ఖర్చుపెట్టి నిర్మించి,తీర్చిరి. అంతే మొత్తము వెచ్చించి అందు ప్రజల సౌకర్యార్థము, విద్యాజ్ఞానాభివృద్ధులకు గ్రంథాలయమును స్థాపించిరి బళ్ళారి పురమున ఈనాడును ఇవి కలవు వీరు సంఘ సంస్కరణాభిలాషను కార్యరూపమున చేసి చూపిన సంఘ సంస్కర్తలు. నిమ్నజాతుల బాలికల కొరకు రూ. 7,000 వెచ్చించి ఒక భవనమును కొని దానమిచ్చిరి. వితంతువుల సంరక్షణార్థము రూ. 5 000/- ఖర్చుపెట్టి భవన

1. శ్రీ రొద్దం హనుమంతరావుగారి 'కోలాచలం వారిపరిచయ' మందలి విషయము.

మును దాన మొసగిరి.అంతేగాక అనాథశరణాలయముకొరకు రూ.20,000/-లు ధర్మముగా నిచ్చిరి.[1] దీనివలన వేంకటరావుగారి సంపాదన యెట్టిదో, సిరిసంపద లెట్టివో మనకు సులభముగ అర్థమగును. ధనధాన్య సంపదలతో తులతూగుచుండుట చేతనే అంతగా దానధర్మములు గావింపగలిగిరి. అయినను ధనవంతులందరు దానము చేయువారేనా? కాదు. కాని వేంకటరావుగా రుత్తమాశయులగుటచేతను, సద్బుద్ధి-సత్కార్యాచరణము నందలి ఆసక్తికల వారగుటకును పై కార్యములే నిదర్శనములు మూఢ విశ్వాసములకు వేంకటరావుగారు లొంగలేదు. ఆ దినములలో 'సీమకు' పోయివచ్చినవారిని వెలివేయుచుండిరి. కాని దానిని లెక్క-చేయక తమ ఏకైక పుత్రుడు 'రామచంద్రరావు' గారిని ఇంగ్లండుకు పంపి 'బారిస్టరు' చదివించిన ఘనులు. తాము సైతము ఇంగ్లండుకే గాక ఫ్రాన్సుకు కూడా వెళ్ళివచ్చిరి, తమ అరువదిఏడవ సంవత్సరమున సైతము అనగా 1917 లోగూడ వారు అభ్యుదయ కార్యకలాపములలోనే నిమగ్నులై యుండిరి పుత్రుడు 'రామచంద్రరావు' గారు బారిస్టరు పట్టము గ్రహించి ఇంగ్లండునుండి వచ్చిన వెనుక బళ్ళారిలోనే తండ్రియొద్దనే న్యాయవాదిగా కుదిరిరి. అనగా వేంకటరావుగారు, శ్రీనివాసరావుగారు, రామచంద్రరావుగారు ముగ్గురు తోడుగానే వృత్తి నవలంబించుచుండిరి.[2] ఇట్లు వేంకటరావుగారానాడే అభ్యుదయ భావములతో మహోన్నత వ్యక్తిగా ప్రఖ్యాతి పొందిరి.[3]

అన్నగారైన వేంకటరావుగారు శ్రీనివాసరావుగారి కన్ని విధముల ఆదర్శ పురుషులు. ఇటు వృత్తిలోను, అటు సంఘ సంస్కరణ, సాంస్కృతికాది రంగములలోను అన్నగారి ప్రభావము వీరిపై కలదు. శ్రీనివాసరావుగారు అన్నగారి ఆదరణతో సుఖమయ జీవితము గడుపుచు హాయిగానున్న కాలమున కావ్య పఠనాసక్తి కలిగినది. విద్యార్థి దశలోనే ఆంధ్రాంగ్ల కర్ణాట సంస్కృత భాషలలో పరిజ్ఞానము సంపాదించియున్న రావుగారు తమ బుద్ధికి పదును పెట్టుకొనుటకు పరిస్థితులును అనుకూలించినవి. శ్రీనివాసరావుగారి ఆరోగ్యమంత మంచిదిగా కన్పట్టదు. అనారోగ్యముగా నున్న సమయమున చదువ నవకాశము

1. 159 పు. 642

2. శ్రీ వేంకటరావుగారు ఫ్రాన్సు దర్శించి 'Goud Houst' నుండి 18-6-1902 శ్రీనివాసరావుగారికి వ్రాసిన లేఖ వలన వ్యక్తమగును.

3 శ్రీ వేంకటరావుగారి స్వీయచరిత్ర కలదట అలభ్యము.

కలిగినదట. 'అప్పుడు (న్యాయవాదవృత్తి నవలంబించిన వెనుక) ఇంచుక యవకాశము కలిగినను, శరీరాయాసంబు లేదన కపుడపుడు పొద సూపు చుండె. ఇట్టి జాడ్య పీడనంబున నుండిన తఱియే గ్రంథంబులఁ జదువ నవకాశము గలుగుచుండె.'[1] అని రావుగారు నుడివియున్నారు. శ్రీనివాసరావు గారు అధిక కాలమును కావ్యపఠన వ్యాఖ్యానములందే గడుపుచు దెడివారని శ్రీ రావాడి వేంకటరామశాస్త్రిగారి మాటలవలన వ్యక్తమగును. 'కోలాచలంవారు మంచి ప్రౌఢ వయస్సులో నుండిన కాలమున నాకు వారి పరిచయు భాగ్యము కలిగినది. శ్రీనివాసరావుగారు వృత్తికంటె సాహిత్య గోష్ఠి అనిన చెవి గోసు కొనేవారు. సంస్కృతము, తెలుగు, ఇంగ్లీషు, కన్నడము మొగలైన భాష లన్నింటిలోను పాండిత్యముండినవారు. అందులోను మల్లినాథసూరి వంశీయులు గనుక పారంపర్యమైన సంస్కృత పాండిత్య ముగ్గుతో పెట్టిన విద్య. అన్న వేంకటరావుగారు డబ్బు బాగుగా గడించినారు. కనుక కోలాచలంవారికి డబ్బు విషయములో కొరతలేదు అదే సమయమున ఆర్కాట్ భీమాచార్యులు గారు' బళ్ళారి మ్యున్సిపల్ హైస్కూలులో హెడ్‌మాస్టరుగా పనిచేయుచుండిరి. కోలాచలంవారికి భీమాచార్యులతో ఎక్కువ మైత్రి. వారిద్దరు కలిసి అనేక కావ్య నాటకాలు చదువుకొనుచు, విమర్శించుకొనుచు కాలము వెళ్ళబుచ్చెడి వారు. వారెప్పుడు కలిసినా, వారితోపాటు నేను తప్పక ఉండవలసినదే! నేను లేకుండా కావ్య పఠనము కావించెడివారుకాదు. బళ్ళారిలో 'లాలాకమాన్' లో ఉన్న నాకు చెప్పి పంపేవారు. నేను వెళ్ళి కోలాచలంవారి గృహములో వారితో పాటు కావ్య పఠన విమర్శనలలో పాల్గొనేవాడను. రాత్రి 12, 1 గంటలకుతిరిగి వచ్చేవాడను... ఆ విధముగ ప్రతి రాత్రి కావ్య పఠనము జరుగుతూ ఉండేది.

'భీమాచార్యులు సంస్కృతమున నిష్ణాతులైన పండితులు. వారిని తీసి పోనివారు కోలాచలం వారు. కాళిదాసాది కవుల నాటకములను భీమాచార్యులు చదువుచుండగా, కోలాచలంవారు విమర్శనాత్మకముగా వ్యాఖ్యానించేవారు. అప్పుడు వారిద్దరు పారవశ్యము చెందేవారు. ఆ తాదాత్మ్యములో ఒకసారి కోలాచలం వారిలా అన్నారు 'భారతీయులమైన మనకు పునర్జన్మ మీద నమ్మిక ఉన్నది. ఈ జన్మలో సుకృత్యములు చేసిన వచ్చే జన్మలో మనకు మంచి కలుగుతు దని అంటారు. కాని మనమీజన్మలో ఏపుణ్యము చేసినామో నాకు

1. 98. పీ. పు. 1.

తెలియదు భగవంతుడే జన్మ ప్రసాదించినా భయము లేదు. అయితే ఆ జన్మలో మీరుపుస్తకాలు చదివేట్లుగాను, నేను విమర్శించేట్లుగాను మాత్రమే భగవంతు డనుగ్రహించాలని కోరుకొంటున్నాను. మన మైత్రి కావ్యపఠన విమర్శలతో కొనసాగాలని ఆకాంక్షిస్తున్నాను". అని భీమాచార్యులతో గల మైత్రిని, కావ్య పఠనమునందలి ప్రీతిని ఇట్లు వ్యక్తము చేసేవారు. అలాంటివారు కోలాచలం వారు. [1] ప్రతిభావంతులైన రావుగారికిట్టి విద్వద్గోష్ఠుల వలన వైదుష్యము తోడై బంగారమునకు తావియబ్బినట్లయినది. గ్రంథ రచన చేయవలెననెడి ఆకాంక్ష రావుగారి మనస్సులో పొటమరించినది. బీజప్రాయమైన రావుగారిలోని ఆ యాకాంక్షయే తరువాతి కాలమున మొలకెత్తి, చిగిర్చి, ఎదిగి, మహావృక్షమై నాటకాది వివిధ రచనల రూపమున ఫలించినది.

## 1.4 నాటక రచన :

'నాటకాంతం హి సాహిత్య' మ్మని పెద్దల నుడి. అనగా క్రమముగా పురాణములు కావ్యములు ఆ తరువాత నాటకములు చదివి విజ్ఞాన సముపార్జనము చేయవలెననుట. అంతేకాదు. శ్రవ్యకావ్య రచన చేసిన వెనుక అర్హత సంపా దించి, ప్రతిభాప్రావీణ్యముల ను ప్రకటించుచు ఏ కవియైనను దృశ్యకావ్యము— నాటకము – ను రచింపవలెనని మనము తలంప వీలగును. సాహిత్యము నాట కముతోనే సంపూర్ణత్వము పొందుననియు దాని యర్థము దాని వైశిష్ట్యమును గుర్తెరుగుట చేతనే "కావ్యేషు నాటకం రమ్య' మ్మని విపశ్చిద్వరులు వచింప గలిగిరి. ఈ క్రమము ననుసరించి చూడ ఏ కవియైన మొదట శ్రవ్య కావ్య రచనకు దొరకొనుటయే సహజము. కాని కోలాచలం శ్రీనివాసరావుగారు మాత్రము మొదటే నాటకరచనకు పూను కొన్నట్లు తెలియును. 'అట్టి కాలం బున (1882 వ సం.న న్యాయవాద వృత్తి నవలంబించిన తరువాత)నే వైజ యంతి విలాసంబను నాటకంబు నాలుగాశ్వాసంబుల వచన రూపకంబుగ లిఖిం చితి. పిదపం బూర్వ గ్రంథంబుల నచ్చటచ్చటం గన్పట్టు ఘనుల చరిత్రంబుల సేకరించి యొక కబ్బంబు వ్రాయ నుపక్రమించి'[2] విరమించినట్లు రావుగారు తెలిపియున్నారు. వైజయంతి విలాసము ముద్రితమైనట్టు కన్పట్టదు. ఇట్లు కోలాచలం వారి రచనా వ్యాసంగ మారంభ మయినది. శ్రీనివాసరావుగారు నాటక రచనకు పూనుకొనుటకు కారణములు గలవు. వీరు బళ్ళారి చేరిన వెనుక

---

1. శ్రీ రావాడి వేంకట రామశాస్త్రి గారి 'కోలాచలం వారి పరిచయ' మందలి కొంత భాగము. 2 98 పి. పు. 1.

ఆ పట్టణమున అనేక నాటక ప్రదర్శనలను రావుగారు చూచియుందురు. ఆరోజులలో పూనా, ధార్వాడల నుండి కొన్ని నాటక సమాజములు వచ్చి హిందీలోను, కన్నడములోను ప్రదర్శన లిచ్చుచుండెడివి. అదే పట్టణమున శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు మొదట 'స్వప్నా నిరుద్ధము'ను కన్నడమునను,తరువాత తెలుగులో "చిత్రనళీయము'ను రచించి 1886లో ప్రదర్శించి అనేకుల మన్ననలకు పాత్రులైరి. అదే సంవత్సరము 1886 లోనే సరస వినోదినీ సభను స్థాపించుటచే వారి నాటక రచనా ప్రదర్శనములకు అవకాశ మెక్కువగా కలిగినది. బళ్ళారిలోని నాటక ప్రదర్శనములను చూచిన రావుగారికి నాటకము రచింపనాసక్తి జనించియుండును. మిత్రుల ప్రోత్సాహమును అధికముగనే యుండినది. దీనికితోడు విద్వద్ఘోషులలో కావ్య నాటక పఠన విమర్శనముల వలన కలిగిన వైదుష్యమపారముగా రావుగారిలో కలదు. వీరు పఠించి జీర్ణించుకొన్న సంస్కృతాంగ్ల రూపకములు గూడ వీరిని నాటక రచనకు పురికొల్పి యుండును. వీనియన్నిటి ఫలితముగా ప్రప్రథమముగా వీరు రచించిన నాటకము 'సునందనీ పరిణయము' లేక 'దురాశాభంగము'. ఈ నాటకమునకు తమ పుత్రిక 'సునందని' పేరు పెట్టుట విశేషము ఈ నాటకమును రచించుటకు కారణము "ఈ ప్రపంచంబున జనులు తమ యోగ్యతకు మీఱిన పదవుల నెల్ల న్గోరి ఫల ప్రాప్తికై యెక్కో యగచాట్లుపడి 'వడ్డియాస మొదలు చెఱుచు' నను నానుడి భంగిఁదమ నైసర్గిక పదవుల న్గూడఁ బోఁగొట్టి కొనుచుండుటయుఁ, గొందఱు కార్య సాఫల్య కారణంబు బుద్ధి బలదేహబలంబులె, యని వాదించుటయుం జూచి, యీ విషయంబును గుఱించిన నాటకం బవశ్యంబని తలంచి, ప్రస్తుత నాటకంబుల భాతిఁబాటలు మాటలున్గల యొక కథ కల్పించితి."[1] అని రావుగారు తెలిపిరి. ఈ 'సునందనీ పరిణయము' కేవల కల్పిత నాటకము అయినను చారిత్రకాభాసమువలె ఒప్పుచున్నది. సునందనీ పరిణయ నాటకము 1892-93 కాలముననే రచింపబడి యుండవలయును. అప్పటి నుండి రావుగారు న్యాయవాద వృత్తితో పాటు నాటక కర్తగా కూడ నిరూపించుకొనుట కారంభించిరి.

వీరి నాటక రచనా కాలమును మూడు దశలుగా స్థూలముగా విభజింపవగును ప్రథమదశ 1892 నుండి 1899 సం.వరకు, ద్వితీయదశ 1899 నుండి 1908 సం. వరకు, చివరి దశ 1909 నుండి ఆ మరణము.

1. 98 పీ. పు. 1

ప్రథమ దశలో 'సునందనీ పరిణయము' తరువాత 1895 లో 'సుఖ మంజరీ పరిణయ' మను చారిత్రక నాటకము, 1895–96 లో మదాలసా నాటకమును, 1899 లో 'సీమంతినీ' నాటకమును రచించిరి. ఈ దశలోనే శ్రీనివాసరావు గారు ఉత్తమ నాటక కర్తగా గుర్తింపబడిరి. వీరి నాటకము లన్నియు ప్రదర్శింపబడుచువచ్చినవి. ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారి నాటకములు 'సరస వినోదిని సభ' నాటక సమాజము వారిచే ప్రదర్శింపబడుచుండినవి శ్రీనివాసరావుగారి నాటకములు సైతము ప్రదర్శింపబడుటకు మరొక నాటక సమాజ మవసరమైనది. శ్రీ పద్మనాభ వెంకోబాచార్యులు, మరి కొందరు పురప్రముఖులు నేకమై 'సుమనోరమసభ' నాటక సమాజమును స్థాపించి శ్రీనివాసరావుగారిని అధ్యక్షునిగా ఎన్నుకొనిరి.[1] శ్రీ పద్మనాభ వెంకోబాచార్యులతో పాటుండిన మరికొందరిలో శ్రీ సభాపతి మొదలియార్, గారు, జి. లక్ష్మణరావుగారు, జి. క్రిష్టప్ప చెట్టిగారు, ఎన్. నీలకంఠప్పగారు, ఎమ్ శీనప్పగారు మొదలైన వారుందురని తలంపవచ్చును. వీరు కోలాచలం వేంకటరావుగారికి, శ్రీనివాసరావుగారికి ఆప్తులను విషయము వేంకట రావుగారి ఉత్తరమువలన తెలియుచున్నది.[2] డా. పి. ఎస్. ఆర్ అప్పారావు గారు ఈ సుమనోరమసభ నాటక సమాజము 1900 సం న స్థాపింపబడినట్లు తెలిపిరి.[3] కాని ఇది 1896–97 లోనే స్థాపింపబడినది.[4] శ్రీనివాసరావు గారు నాటక సమాజమునకధ్యక్షులై యుండుటచే అనేక నాటక రచనా ప్రదర్శనముల కవకాశము కల్గినది. వీరి నాలుగు నాటకములు నీ దశలోనే ముద్రింపబడి పత్రికలలో కృతి విమర్శనమునకు గూడ నోచుకొనినవి 'సునందనీ పరిణయము' 1895 లోను, సుఖమంజరీ పరిణయము 1896 లోను, 'మదాలస' 1897 లోను, సీమంతిని 1899 లోను ప్రథమ ముద్రణములను పొందినవి. సునందనీ పరిణయమును జూలై 1899 చింతామణి పత్రికలో సంపాదకులు శ్రీ న్యాపతి సుబ్బారావుగారు కృతి విమర్శనమున మిక్కిలి ప్రశంసించిరి. ఆగష్టు 1895 అముద్రిత గ్రంథ చింతామణిలో పత్రికాధిపతులు శ్రీ పూండ్ల రామకృష్ణయ్య గారు విమర్శించిరి. దానికి సమాధానమును శ్రీనివాస

---

1. పు 19 2. పై 2 పు. 14. 3. 45. పు. 528–570
4. 159. పు 648 అనుసరించి 1896-97 లో 'సుమనోరమసభ' స్థాపితము

రావుగారు ఒక చిన్న పుస్తకరూపమున 16-10-1896 న ముద్రింపించిరి. దానికి ప్రతి సమాధానముగా ఏప్రిల్ 1896 అముద్రిత గ్రంథ చింతామణిలో పూండ్లవారు ప్రతి విమర్శనము గావించిరి సుఖమంజరీ పరిణయమును జనవరి 1897 అముద్రిత గ్రంథ చింతామణి లో పూండ్లవారు విపులముగా విమర్శించిరి. దీనికి సమాధానముగా శ్రీనివాసరావుగారు శశిలేఖ పత్రికలో సమాధానమిచ్చిరి 1 ప్రతి విమర్శనము పూండ్లవారు ఏప్రిల్ 1897 అముద్రిత గ్రంథ చింతామణి లోనే చేసిరి. 'మదాలసా నాటకము'ను ఫిబ్రవరి 1897 'చింతామణి'లో శ్రీన్యాపతి సుబ్బారావు గారును, జూన్ 1897 'అముద్రిత గ్రంథ చింతామణి'లో పూండ్లవారును విమర్శించిరి. "సీమంతినీ నాటకము"ను డిశంబరు 1900 'మంజువాణి'లో సంపాదకులు రాజా ఎమ్. భుజంగరావుగారు విమర్శించిరి పైకృతి విమర్శనలలో పూండ్లవారి విమర్శనము నాటి పద్ధతి ననుసరించి కొంచెము కటువుగా నున్నది. పైగా నది కవితా విమర్శనమేగాని పూర్తిగా నాటక విమర్శనము కాకపోయినది. "సునందనీ పరిణయము" 1898లో ద్వితీయ ముద్రణమును, 1907లో తృతీయ ముద్రణమును, 1924లో చతుర్థ ముద్రణమును పొందినది 1899 సం॥న ప్రథమ శాస్త్ర పరీక్ష (F.A)కు 'సునందనీ పరిణయము' పాఠ్య గ్రంథముగా నిర్ణయింపబడినది. దీనికి శ్రీ నోసము నరసింహాచార్యులుగారు టిప్పణముగూడ వ్రాసినారు [2] శ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రులు మొదలుకొని, పెనుగొండ శ్రీ రొద్దం హనుమంతరావుగారి వరకు గల ఆంధ్ర కవి పండితులెందరో 'సునందనీ పరిణయము'ను గూర్చి మిక్కిలి ప్రశంసించి యున్నారు [3] శ్రీనివాసరావుగారు నాటక రంగమున ప్రశంసలకు, సాహిత్య రంగమున దూషణ భూషణములకును గురియైరి అయినను ఇది రావుగారి కీర్తినలుదెసల ప్రసరించుట కవకాశము కల్పించినది. ఇచటనే మరొక విషయము సైతము స్మరింపవలెను. శ్రీనివాసరావుగారు 'కవి పండిత సంఘము'న సభ్యులుగా నుండిరి 1897 సం.నందు ఆంధ్రదేశములోని కవిపండితులు చేరి యొక సంఘముగా నేర్పడిరి. దీని నిర్మాత శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారు, ప్రథమ ద్వితీయ కవి పండిత సంఘములకు వీరే కార్యదర్శియై వ్యవహరించిరి. ఈ సంఘ ప్రథమ సమావేశము ఏప్రిల్ 1897లో బళ్ళారిలో జరిగినది. ద్వితీయ సమావేశము 1899 సం. జనవరి 1వ తేదీన మద్రాసులో జరిగినది.[4]

---

1. శశిలేఖ అలభ్యము. 2. 175, 3. 98,

4. 35 పు. 74-77, 88-97.

ఈ సంఘమున ధర్మవరం, కోలాచలం వారలతోపాటు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు, కోవూరు సుబ్బరామయ్యగారు, గుండ్లపూడి సుబ్బయ్యగారు, సి. దొర సామయ్యగారు, వేదం వేంకటరాయశాస్త్రిగారు, పూండ్ల రామకృష్ణయ్యగారు, కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు, వేంకటసుబ్బయ్యగారు, రాయదుర్గము నరసయ్యగారు, వావిలికొలను సుబ్బారావుగారు, వడ్డాది సుబ్బారాయుడుగారు ఇంకను అనేక ఆంధ్ర కవి పండితులు సభ్యులుగా నుండిరి. బళ్ళారిలో ఏప్రిల్ 1897లో జరిగిన ప్రథమ సమావేశమునకు అనంతాచార్యులుగారు అగ్రాసనాధిపతులైరి. రెండవ సమావేశము మద్రాసులో జరిగినది. అంతకు ముందే కొక్కొండ వేంకటరత్నము పంతులు గారి 'ప్రసన్న రాఘవము'ను వేంకటరాయ శాస్త్రిగారు విమర్శించినందుకు పంతులు గారు పత్రికా మూలమున శాస్త్రిగారిని దూషించిరట, ప్రతి దూషణమునకు దిగకయే శాస్త్రి గారు విమర్శను పూర్తిచేసి ముద్రించిరట. దానితో కొక్కొండ వేంకట రత్నము పంతులుగారి పక్షమును కోలాచలం వారును, ధర్మవరంవారును, వేంకట సుబ్బయ్యగారును, వావిలికొలను సుబ్బారావుగారును మరికొందరును చేరి వేదము వారిని దూషించిరట. పూండ్ల రామకృష్ణయ్యగారు శ్రీ పాదవారు మొదలైన వారు వేదము వారి పక్షము నవలంబించిరి. మద్రాసులో జరిగిన రెండవ సభలో కొక్కొండవారు నాటకములందు గ్రామ్యము పయోగింపరాదనియు, వేదంవారుపయోగింపవచ్చుననియు నుపన్యసించిరి. పత్రికలలో తదధిపతులు కవులకృతులను స్వపరభేదములతో భూషణ దూషణలు చేయుట ఉచితము కాదనియు, అందుకు 'కృతివిమర్శనోప సంఘ నిర్మాణము' చేయవలెననియు కార్యదర్శియైన ధర్మవరం వారుపన్యసించిరి. కాని అది తరువాత వీగిపోయినది. వేదంవారుపన్యసించిన పాత్రోచిత భాషపై వాదోప వాదములు జరిగినవి. కొక్కొండవారు వీరగ్రాలధిక వాదులగుటచే దాని నంగీకరింపలేదు. కోలాచలం వారికిని, నాటకమున పాత్రోచితభాషా ప్రయోగ మనుచిత మనియు, తన్మూలమున భాష చెడుననియు ప్రగాఢాభిప్రాయము గలదు. ఇంతకు ముందే వివరించినట్లు శ్రీనివాసరావు గారి నాటకములను 'అముద్రితగ్రంథ చింతామ'ణ్యధి పతులు పూండ్లవారు విమర్శించి యుండుటచేత గూడ రావు గారు కొక్కొండ వేంకటరత్నం పంతులుగారి పక్షమును చేరి

యుందురేమో! ఎందుకనగా వూండ్లవారు వేదం వారి పక్షము. వూండ్లవారు ధర్మవరం వారి నాటకములను సైతము విమర్శించియున్నారు. అందుచేతనే వీరందరు నొక కూటమిగా చేరియుందురు. అంతేగాదు. శ్రీనివాసరావుగారు తమ నాటకములలో ఎక్కడో ఒకటి రెండు చోట్ల నీచపాత్రలకు గ్రామ్యమువాడినను వీరికది యిష్టము లేదు. తరువాతి నాటకములలో నిది కన్పట్టదు. శ్రీనివాసరావు గారీదశ నుండియే కవిపండిత సంఘములందు పాల్గొనెడి వారని తెలుపుటకింత వివరింపవలసివచ్చినది.

ద్వితీయ దశ: 1899 నుండి 1908 మధ్య కాలమున శ్రీనివాసరావు గారుత్తమ నాటక కర్తగా నిరూపించుకొనిరి. సుల్తానాచాందుబీ, రామరాజు చరిత్రము, శిలాదిత్య, మైసూరు రాజ్యాభివృద్ధి, శిరోమణి, రుక్మాంగద, సత్య హరిశ్చంద్రీయము, ప్రతాపాకబ్బరీయము అను నెనిమిది అత్యుత్తను నాటకములను క్రమముగా రచించిరి ఇందులో ఐదు చారిత్రక నాటకములు. 'సుఖమంజరీ పరిణయము'తోనే చారిత్రక నాటక రచన మారంభమయినను ఈ దశలోని చారిత్రక నాటకములే రావుగారి కెనలేని కీర్తినే గాక 'ఆంధ్రచారిత్రక నాటక పితామహ'దను ప్రతీతిని గూడ సంపాదించి పెట్టినవి. 'సుల్తానా చాందుబీ, రామరాజు చరిత్రము, సత్యహరిశ్చంద్రీయము' నను నాటకములు 1907–1908 సం. లలో ముద్రింపబడినవి. శ్రీనివాసరావుగారికి నాటక కర్తగా వచ్చిన కీర్తి ప్రతిష్ఠలకు వీరి రామరాజు చరిత్రము జయపతాక. ఈ నాటకము ఎం. ఏ డిగ్రీ పరీక్షకు పాఠ్యగ్రంథముగ ఒకప్పుడు నిర్ణయింపబడినది.[1] 'ప్రతాపాకబ్బరీయ నాటక' రచనా కాలమున పుత్రసంతతి కలుగ నతనికి 'ప్రతాపరా'వని నామకరణము గావించిరి రావుగారు. ప్రతాపరావుగారు వీరి చివరి పుత్రుడు, 1907–1908 సంవత్సరములలో వీరు జన్మించియుందురు. వీరి అక్కగారు 'సునందనమ్మ' గారు 1892–'98 సం. లలో జన్మించియుందురని ముందే తెలిపితిని. అంతకు ముందు శత్రుఘ్నరావు, శ్రీ రామారావు గారలనువారును, ప్రతాపరావు గారి కంటె పెద్ద వారయిన జయరత్నముగారను వారునుకలసి రావు గారికి మొత్తము ఐదుమంది సంతతి. ఇంకొక విషయము. అన్నదమ్ములందరు నొకే కుటుంబమున కలిసి జీవించుటచే వారి సంతతికి రామాదుల నామములుంచి

1. 159 పు. 643

నారు. వేంకటరావుగారి పుత్రుడు రామచంద్రరావుగారు. వేంకటరామారావుగారి పుత్రులు భరత లక్ష్మణులు,పుత్రిక శాంత; వరుస క్రమమున శ్రీనివాసరావుగారి ప్రథమ సంతతి శత్రుఘ్నరావుగారు. శ్రీనివాసరావుగారు తక్కిన సంతతికి శ్రీరామారావు, సునందనమ్మ, జయరత్నం, ప్రతాపరావుగారలను నామములుంచి నారు. ఇందరు కలసి మెలసి యుండుట ముదావహమైన విషయము. ఇటు సుఖ శాంతులతో కూడిన గార్హస్థ్య జీవితము గడుపుచు, అటు రావు గారనేక నాటకములు రచించి 'సుమనోరమసభ' నాటక సమాజముచే ప్రదర్శనము లిప్పించుచు విజయము చేకూర్చుచుండిరి పీరి పట్టుదల కార్యదీక్షా దక్షతలట్టివి. పీనికి మరొక్క నిదర్శనము సైతము గలదు. అదొక అపూర్వ సంఘటన. అదియే 'వాణీవిలాస నాటకశాలా' నిర్మాణము. నాటక రచనతో నాటక కర్త పని పూర్తికాదు. ఆ నాటకము రంగమున ప్రయోగింపబడినప్పుడే దానికి జీవము పోసినట్లుగదా! శ్రీనివాసరావుగారు ఆరంభమునుండి నాటకములు రచించి ప్రదర్శించుచుండిన మాట వాస్తవము. కాని అట్టి ప్రయోగమునకు ఉచితమైన నాటకశాల అత్యవసరము. కోలాచలం వారు అట్టి నాటకశాలానిర్మాణమునకు పూనుకొన్నారు. చేదోడు వాదోడుగా నుండిన మిత్రుల ప్రోత్సాహమొకప్రక్క సిరిసంపదలతో తులతూగుచు స్వర్గసుఖములనుభవించుచుండిన అన్న వేంకట రావుగారి అండదండలు మరొకప్రక్క సమకూరగా మహామేధావియైన శ్రీనివాస రావు గారికి చేయలేని కార్య మేమి కలదు? అందుకే రావుగారు 1905వ సం. న వాణీ విలాస నాటక శాలను రూ. 10,000/-లు వెచ్చించి నిర్మింపజేసి[1] బ్రహ్మశ్రీ లోక మాన్య బాల గంగాధర తిలక్కుగారిచే ప్రారంభింపజేసిరి. ఈ ప్రారంభోత్సవమున తిలక్కుగారు "నాటకములకూర్చియుఁ దత్ప్రదర్శనా చాతుర్యమును గూర్చియు, తదుపయోగముల గూర్చియు నొక సమంచిత మహోపన్యాసము గావించి, శ్రీ రావు గారి నాటక రచనా సామర్థ్యమునకు, తన్నాటకశాలా నిర్మాణ కౌశలమునకును నెంతయు నభినందించిరి. అదే సమయ మున సుప్రసిద్ధ సంఘ సంస్కర్తలగు శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు గారు సభనలంకరించి యుండిరి. పంతులుగారు సంఘసంస్కరణమును గూర్చి యొక చక్కని యుపన్యాసము గావించి, జన సాహాన్నమ్మ నందులకుఁ బురి కొల్పిరి. ఈ యుత్సవ మెంతయు విజృంభణముగ జరుపఁబడుటచే బళ్ళారి

1. 159. పు. 648.

నగరమున కొక నూతన శోభ నొడఁగూర్చెను."[1] ఉత్తమ నాటకశాలా నిర్మాతగా, ఉత్తమ శ్రేణి నాటక కర్తగా శ్రీనివాసరావుగారు, శ్రీ తిలక్ మహాశయుల ప్రశంసలందుట కొనియాడదగినది. ఇది వీరి ఘనతకు పరమ నిదర్శనము. 'వాణీ విలాస నాటకశాల' నిర్మాణ మొక యద్భుత కార్యము, అసామాన్యము. ముగ్గురు మహాపురుషుల కలయికయు మిక్కిలి అపురూపము. మహోత్కృష్టము. ఇది బళ్ళారికే గాదు, యావదాంధ్ర దేశమునకే ఘనత. బళ్ళారిలోనే యన నేల ఆంధ్ర దేశములోనే అంతవరకు నిట్టి 'నాటకశాల' యుండెడిది కాదు. అట్టి కొరతను శ్రీనివాసరావు గారు తీర్చిరి. 'సుమనోరమసభా' నాటక సమాజమునకు సొంత భవనము లభింపగానే దిదృక్షువుల కన్నుల పండువుగా శ్రీనివాసరావుగారి నాటకములు ప్రదర్శింపబడుచు విజయవంతములగుచు వచ్చినవి. శ్రీనివాసరావుగారికి చారిత్రక నాటకములపైననే ప్రీతియధికము. కాని సమాజము వారి కోరికపై పౌరాణికములు సైతము రచించి ఆడించిరి. శ్రీనివాసరావుగారు తమ అపారానుభవముతో నాటక రచన ప్రయోగములతో సంతృప్తి చెందలేదు. నాటక లక్షణము సైతము రచించిరి. అది కేవలమాంధ్ర దేశమునకుగాని, భారతదేశమునకు గాని మాత్రమే పరిమితము కాలేదు. ప్రపంచ దేశములలోని నాటక చరిత్రను ఆంగ్లమున రచించిరి. అదియే 'ప్రపంచ నాటక చరిత్రము' (The Dramatic History of the world)–అను ఉద్గ్రంథము. ఈ గ్రంథము వీరి భారతీయ పాశ్చాత్య రూపక పఠన జన్యజ్ఞానమునకు నిదర్శనము. ప్రపంచదేశములలోని నాటక చరిత్రలను వివరించుటయే గాదు, ఆయా దేశముల నాటక లక్షణములను, నాటకములను విమర్శనాత్మక దృష్టితో పరిశీలించుట చూడ వీరి పరిశోధనాత్మక బుద్ధి నైశిత్యము స్పష్టమగును. ఇందులో నాటక కళోత్పత్తి వికాసములను సమగ్ర సమ్యక్పరిశీలనము గావించుటయేగాక, చివర నాటక కర్తలు, నటులు మొదలైనవారనుసరింప వలసిన బహ్యాంశములను సూచించియున్నారు. దీనిచే రావుగారికి నాటక కళానుభవ మెంతటిదో వ్యక్తమగును. ఈ గ్రంథమును 1908 లో ముద్రింపించిరి. ఇట్లు శ్రీనివాసరావుగారు ఏ నాటక కర్తయు గావింపనంతగా ఆంధ్ర నాటక వాఙ్మయమున కెనలేని సేవ గావించిరి.

ఈ దశలోనే రావుగారి మనస్సు పారమార్థికముపై సహితము ప్రసరించి

1. 21 పు. 20

యుండును. ఆధ్యాత్మిక చింతనమధికమై యుండును. భగవద్గీత, వేదముల సవిమర్శకముగా పఠించి తెలుగున ఉపన్యాసములు రచించి సభలలోనుపన్యసింప నారంభించినారు. ఇట్లు వీరి వచనరచనకు గూడ దొరకొనిరి. వీరు భగవద్గీతను వేదములను విమర్శనాత్మకముగా పఠించిన ప్రభావము వీరి నాటకములపైగూడ పడినది. వీరి చారిత్రక నాటకములలో అతి బాల్యవృద్ధ వివాహములు, సతీసహగమనము మున్నగువానిని దూషించియుండుటయు, శిరోమణి నాటకమున గీతోపదేశమును చేర్చి యుండుటయు నిందుకు నిదర్శనములు. శ్రవ్యకావ్యమును గూడ రచింప నాసక్తి గలిగి 'అగస్త్య బాలభారతమునందలి' ఆదిపర్వమును తెనిగించి 1908 లో ముద్రింపించిరి. ఈ రెండవదశ శ్రీనివాసరావుగారి జీవితమున మిక్కిలి ప్రాధాన్యమును వహించినదనుటలో సందేహములేదు. నాటక రచనా ప్రయోగములు, నాటక సమాజ స్థాపనము, నాటక శాలా నిర్మాణము, ప్రపంచ నాటక చరిత్ర రచనము, శ్రవ్యకావ్యము, వచన రచనలు గావించి ఈ దశలోనే శ్రీనివాసరావుగారెంతయో ఉన్నతస్థానమునాక్రమించిరి.

తృతీయదశ:1909 నుండి అమరణము. ఈ దశలో తత్పూర్వమారంభించిన కృషి ఫలవంతమయినది. శ్రీనివాసరావుగారు వైవిధ్యముగల నాటక రచన చేయుట, వచన రచనలు విరివిగా చేయుట, సంఘ సంస్కర్తలుగా నిరూపించుకొనుట, విద్వత్సభకధ్యక్షులగుట మొదలగునవన్నియు నీ దశలో గలవు. ఈ దశలో రచించిన వానిలో రెండు చారిత్రక నాటకములును గలవు. అయినను పౌరాణికములకే అధిక ప్రాధాన్యముగలదు. వీరు పౌరాణిక నాటకములను 'సుమనోరమసభ' వారి కోరికపై వ్రాసినారు. 'కుశలవ' 1909 లోను, ప్రహ్లాద 1912 లోను రచించియుందురు. శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారంతకుముందే 'ప్రహ్లాద' రచించియున్నను, శ్రీనివాసరావుగారును రచించిరి. ధర్మవరం వారి నాటకమున పోతన కవి పద్యములె ఉపయుక్తములు. అది ఉచితము కాదనియు భాషాభివృద్ధికి ప్రతి కవియు పద్యములు రచింపవలెననియు రావుగారభిప్రాయపడి, తదుచితముగ ప్రహ్లాద నాటకమునురచించిరి.[1] ఇవిగాక అమరణము పదునాలుగు నాటకములు రచించిరి. దాదాపు భారత రామాయణములను నాటకములుగ శ్రీనివాసరావుగారు ఈదశలో పూర్తి

---

1. 105 ఉ. పు 5.

గావించిరి. ఈ దశలో రచించిన వానిలో రెండు మరాఠీ నాటకముల కనువాదములు గలవు పూనా నుండి కేశవ గంధర్వ, బాలగంధర్వ అను నాటక కంపెనీలు బళ్లారికి 1915-16 సం. లలో వచ్చి మరాఠీ నాటకములను ప్రదర్శించినప్పుడు ఆ నాటకములను దర్శించిన రావు గారు పట్టుదలతో మరాఠీ భాష నేర్చుకొని, 'మానాపమానము, రాక్షసీ మహత్వాకాంక్ష' అను రెండు నాటకములను తెనిగించినారు.[1] 'యువతీ వివాహ' మను సాంఘిక నాటకమును గూడ రచించిరి. కన్నడ భాషలో 'ఆచారమ్మన ప్రహసనవు'ను తెలుగులో నాచిపార్టి, 'అన్యాయధర్మపురి మహిమ', 'సమయమునకు భార్య' అను ప్రహసనములను సైతము రచించిరి. శ్రీనివాసరావుగారు నాటక కర్తగానే గాక సంఘ సంస్కర్తగా సైతము నిరూపించుకొనిరి.

## 1.5 సంఘ సంస్కరణము:

శ్రీనివాసరావుగారికి మొదటినుండియు సంఘ సంస్కరణముపై అభిలాష యున్నను ఈ దశలో నది వీరిలో పరిపూర్ణత్వమును పొందినది. భాషా దేశాభివృద్ధులను ఆకాంక్షించినారు. ఇంతకుముందే ఆరంభించిన వేద భగవద్గీతా పఠన విమర్శనములు ఈ దశలో పూర్తిచేయుటయే గాదు రావుగారుపన్యాసములు వ్రాసి సభలో ప్రసంగించిరి. భగవద్గీతపై విమర్శనోపన్యాసములు రచించిరి. ఆనాడు ఆచారములపేర మనవారు గావించుచుండిన అనాచారములను దూషించిరి. మూఢ విశ్వాసములను నిరసించిరి. ఏదేని అడిగిన పెద్దలు వేదమును ప్రమాణముగా చెప్పుదురు. అందుకొఱకు శ్రీనివాసరావు గారు వేదమును సమగ్రముగా పరిశీలించి వేదమార్యుల చరిత్ర అని నిరూపించి, అతి బాల్య వృద్ధ వివాహములు సతీసహగమనము మున్నగు దురాచారములు వేదమున లేవనియు తరువాత ఆపద్ధర్మములుగ కల్పితములనియు, అపద్ధర్మముగా నేర్పడిన సంప్రదాయము సంప్రదాయము గాదనియు, జాతి మత భేదములు కల్పితములనియు, మను సంతతియైన మానవసంఘమంతయు నొక జాతియనియు నుపన్యాసములలో వివరించిరి. ఇట్లు తమ సంఘ సంస్కరణాభిలాషను విశదపరచిరి

### పత్రికా ప్రకటనము:

ప్రజలను విజ్ఞానవంతులను గావించి, తన్మూలమున సంఘ సంస్కరణము

---

1. 118 పి. పు. 1

గావించి దేశాభివృద్ధిని చేయనెంచినవారు రావుగారు. ఈ సంఘ సంస్కారకార్యము పైని పేర్కొనబడినవానికంటె ఉన్నతోన్నతము, పవిత్రమునైన ఒక మహా కార్యమును గావించినారు రావుగారు. అది మానవ జాతికే మహోపకారము. అదియే 'వేదార్థ చంద్రికా' ప్రకటనము. ఈ పత్రిక 1918 మే నెల నుండి ప్రారంభింపబడినది.[1] ఈ పత్రికాధిపతులుగా శ్రీనివాసరావుగారితో పాటు ఏ. భీమాచార్లు, బి.ఏ., ఎల్.టి., టి. శంకర లింగం, బి.ఏ.,బి.ఎల్, యన్. నారాయణరావు, బి.ఏ., బి: ఎల్., టి. నరసింహులు, ఎల్.ఎమ్.ఎస్., జె. బ్రహ్మశాస్త్రి అనువారున్నారు. ఇందు శ్రీనివాసరావుగారిదే ప్రధాన పాత్ర. ఈ పత్రికలో కేవలము వేద సంబంధి విషయము. సంస్కృత భాషలోని వేదములను ప్రప్రథమముగా తెనుగు చేయుట కారంభించుటయేగాదు, వానిని ప్రజా సముదాయమున కందించి, తద్ద్వారమున విజ్ఞానము పెంపొంధింపవలెననెడిది వారి ఉత్తమాశయము. పత్రికా పీఠికలోని విషయము తెలిసికొనిన వీరి మహదాశయములు స్పష్టమగును. "అనాదిగా నార్యుల మూలధనంబుగ నుండి, సర్వసామాన్యముగ ప్రపంచమున నెల్లరపేక్షించు వేదముల యర్థము పండితోత్తములగు మహనీయుల మానసములందే గుప్త ధనంబుగ దాగెను. జన సామాన్యమునకు, విదితంబుగాదయ్యె. అక్కారణముననే, పలువురు పలు మతములవలంబించి సులభమగు వేదమతమును బరిత్యజించిరి. తత్కారణంబున, నార్యులలో భిన్న మతము లేర్పడి మతద్వేషము బలమయి, వేదమతము నామావశిష్టమై నిలచెను. ఆ కుందును బాపను, యథాశక్తి న్యాయముననుసరించి, శ్రమించి, వేద స్వర ప్రీతి పదార్థ తాత్పర్యములను జక్కని యాంధ్ర భాషలో "వేదార్థ చంద్రిక" యను నామంబున నొక మాసపత్రికఁ బ్రకటింపఁ బూనినాము." "పాశ్చాత్య పండిత శిఖామణులు మన వేద వేదాంతములను ఫ్రెంచి, జర్మను, హూణభాష మొదలుగా గల భాషల యందు భాషాంతరీకరణ మొనరించి మనవేద వేదాంత శాస్త్ర రహస్యములను తమ దేశీయులకు వెల్లడి పఱచుచు వచ్చుచుండగ హిందూ మతము నవలంబించి వేదవేదాంత సారములే మన మతావలంబనమున కాలవాలంబని మాటలు నెఱపుచు వేదమననేమో, వేదాంతమన నెట్టిదో, తెలియక, కాలము గడుపుచు వచ్చిన మన చరిత్రము బహు చిత్రము. మఱికొందఱు వేదాధ్యయన శీలురు వేదముల నామూలాగ్రంబుగఁగంఠపాఠ మొనర్చి చిలు-

1. 'వేదార్థ చంద్రిక' ప్రథమ పత్రిక లభ్యము'.

పల్కుల వలెఁ జెప్పనోపిరికాని వాని యర్థంబు తెలిసికొనినవారు కారైరి. ద్రావిడ భాషలందెందేని వేదముల సాంతముగ భాషాంతరీకరణము చేసినవారు లేరు. ఈ న్యూనత బాపుటకై మాయథాశక్తిని యీ కార్యము నెరవేర్పఁబూనినారము."[1] అని తమ అభిలాషను వ్యక్తము చేసిరి వేద పఠన పాఠనములు ఉత్తమ కులసంజాతులకు మాత్రమే పరిమితమవి అనాది నుండియు తలంపబడియుండిన సంప్రదాయ శృంఖలములను రావుగారు త్రెంచివేసినారు. సర్వజనులకును తెలియునట్లు వేదములను తెనుగులోని కనువదింప నారంభించిరి. దీనివలన శ్రీనివాసరావుగారు ఎంత సంస్కార ప్రియులో స్పష్టమగుచున్నది. అంతేగాక వీరెంత సంప్రదాయబద్ధులో అంత సంస్కరణాభిలాషులు. ఈ రెండు గుణములు నొకే వ్యక్తిలో సంగమించియుండుట అపూర్వము, అసామాన్యము. ఎందుకనగా సంప్రదాయ బద్ధులు సంస్కరణమును కోరరు. సంస్కరణము కోరువారు సంప్రదాయమును మన్నింపరు. కాని రావుగారిలో ఇట్టి రెండు గుణములు నుండుట యెంతేని కొనియాడదగినదేకాదు రావుగారొక మహావ్యక్తియని తెలియును. ప్రప్రథమముగా వేదమును తెనుగులోనికి అనువదించిన ఘనత రావుగారికి దక్కినది. వీరు కుల మత తత్వములను గర్హించిరి. వీరి పుత్రులు శ్రీ జయరత్నంగారి మాటలు సైత మీ విషయమును స్థాపించుచున్నవి. "బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులన్న వివక్ష మాకు లేదు. ఇప్పుడు నాకే గాదు. మా నాయనగారి నుండి కూడ అట్టిది లేదు. అందరితోను కలిసి మెలిసి ఉండేవారు మా నాయనగారు. సర్వకుల మతముల సమానత్వమునకు ప్రయత్నించినవారు. బ్రాహ్మణులతో గల తెగలను గర్హించిన వారు. వారు సంఘ సంస్కరణప్రియులు."[2] ఇట్లు శ్రీనివాసరావుగారు తమ సంఘ సంస్కర్తలుగా నిరూపించుకొనిరి.

సంఘ సంస్కరణాభిలాషులైన శ్రీనివాసరావుగారు భాషా సంస్కారమును కోరలేదు. అనగా వీరు గ్రామ్యభాషా ప్రయోగమున కిచ్ఛగింపలేదు. 1918 సం. లో మద్రాసు విశ్వవిద్యాలయముచే నియమింపబడిన 'గ్రామ్యభాషా-ప్రయోగావశ్యకమును' గూర్చి నివేదికను సమర్పింపవలసిన కార్యవర్గమున

1. 'వేదార్థ చంద్రిక'-మే 1918 పీ. పు. i; ii

2. కోలాచలం జయరత్నంగారి 'కోలాచలంవారి పరిచయ' మందలి చివరి భాగము.

శ్రీనివాసరావుగారు సభ్యులుగ నుండిరి. ఇందులో గ్రాంధిక భాషావాదులు, వ్యావహారిక భాషావాదులు నని రెండు పక్షములుండినవి. శ్రీనివాసరావుగారు గ్రాంధిక భాషావాది. ఈ విషయము శ్రీ కె. వి. రమణారెడ్డిగారి మాటలచే స్పష్టముగ చున్నది "అందులో తమకు గ్రాంధిక భాషావాదులకు సంఖ్యాధిక్య తను చేకూర్చుకొనేందుకని ప్రాంతీయ తత్వాన్ని రెచ్చగొట్టి దత్తమండల సమాజం (Ceded Districts Union) కోరిందంటూ, రాయలసీమ ప్రతినిధు లను ఈ సంఘంలో చేర్పించారు. కొత్తగా వచ్చిన సభ్యులు కోలాచలం శ్రీనివాసరావు, టి. శంకరలింగ పిళ్లె, నాగపూడి కుప్పుస్వామయ్య, బారిస్టరు కె. సుబ్బారెడ్డి." "1918 మార్చిలో ఈ కమిటీని పునర్నిర్మించినప్పుడు వేదం వేంకటరాయశాస్త్రి, కొమర్రాజు లక్ష్మణరావు, జయంతి రామయ్య, జి. వి. రంగారావు (సమావేశకర్త) ఒక కూటమి గిడుగు, గురజాడ, బుర్రా శేషగిరిరావు, పి. టి. శ్రీనివాసయ్యంగారింకొక కూటమి. యం. రంగాచార్, ఆర్. డబ్ల్యు. రాస్ (R w. *R*oss) తటస్థులుగానూ సభ్యులయ్యారు. రాయలసీమ ప్రతినిధులు (అనగా కోలాచలం శ్రీనివాసరావుగారు మొదలైనవారి) చేర్పు గ్రాంథిక భాషావాదుల సంఖ్యను రెట్టింపు చేసింది."[1] ఇట్లు శ్రీనివాసరావు గారు గ్రాంథిక భాషావాదు లనుటకు మరొక ఉదాహరణము కలదు. ఇందుకు గిడుగు రామమూర్తి పంతులుగారి మాటలుల్లేఖించుట సముచితము. "వ్యావహారిక భాష గ్రంథములలో వాడదమునకు తగనిది అనే వాదము సిద్ధాంతీకరించుటకు ఆ భాషలో గొప్ప దోష మొకటి తరచుగా చూపిస్తూ ఉంటారు మా ప్రతిపక్షులు (గ్రాంధిక భాషా వాదులు). 'ఆ భాష ఒక మండలములో ఒక విధముగాను మరి ఒక మండలములో మరి ఒక విధముగాను ఉంటుంది. అక్కడివారి మాటలు ఇక్కడి వారికి, ఇక్కడివారి మాటలు అక్కడి వారికి బోధపడవు. గ్రాంధిక భాష అటువంటిది కాదు. ఆంధ్రదేశమందు అన్ని మండలముల వారికి అది సామాన్య భాష. అదే అందరికి సుపరిచిత మయినది. గనుక సుబోధము ' ఈ విషయమును గురించి ఒక సభలో జయంతి రామయ్యపంతులుగారున్ను మరి ఒక సభలో[2] మ. కోలాచలం శ్రీనివాస రావు పంతులుగారున్ను చెప్పిన మాటలు నాకు జ్ఞప్తియందున్నవి,"

---

1 60. పు. 209, 210 2. ఆ సభ యేదియో తెలియరాలేదు.

"......మేము 'వక్కాలు' అంటాము. మీరు 'చెక్కాలు' అంటారు. మీ మాట మాకు తెలియదు. మాట్లాడే టట్టు గ్రంథాలలో వ్రాస్తే అందరికి సుబోధముకాదు. అన్నారు శ్రీనివాసరావుగారు. సభలోని వారంతా ఆ మాటలు విని మెచ్చుకొని కరతాళధ్వనులు చేస్తూ పకపక నవ్వుతూ నావైపు చూచినారు".[1] అని గిడుగువారు శ్రీనివాసరావుగారి గ్రాంధిక భాషా వాదమును గూర్చి తెలిపి యున్నారు. సంఘ సంస్కరణమున వీరేశలింగం పంతులుగారి ననుసరించి యున్నను భాషా సంస్కారమున మాత్రము శ్రీ గిడుగు, గురజాడ వారలను శ్రీనివాసరావుగారనుసరింప లేకపోయిరి. గ్రామ్య ప్రయోగమున భాష చెడు ననియు, గ్రాంధిక భాషను ప్రయోగించుట భాషాభివృద్ధికి కారణమనియు వీరు ప్రగాఢముగా విశ్వసించినవారు. అందుచేతనే 'కవి పండిత సంఘము'న నైతము గ్రాంధిక భాషా వాదులైన శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారి పక్షము చేరిరని ముందే తెలిపి ఉన్నాను.

## 16 విద్వత్సభలలో పాల్గొనుట :

ఈ దశలోనే శ్రీనివాసరావుగారు ఆంధ్ర సాహిత్య పరిషత్సభలలో పాల్గొను అవకాశము కల్గినది. మొదట కేవలముపన్యాసకులుగా పాల్గొనిరి. ఆ తరువాత సభకగ్రాసనాధిపతులుగ వ్యవహరించిరి. ఆంధ్ర సాహిత్య పరిషచ్చతుర్థ వార్షికోత్సవ సభ 1915 సం. ఏప్రిల్ నెల 3,4 తేదీలలో బళ్ళారిలో కోలాచలము వేంకటరావుగారి పుర భవనమున జరిగినది. ఆనెగొంది సంస్థానాధీశులు శ్రీ మద్రాజాబహదూరు శ్రీరంగ దేవరాయులు వారు సభ కగ్రాసనాధిపతులైరి. 'బళ్ళారి పుర నివాసులు ప్రసద్ధ నాటక గ్రంథ కర్తలు, కవీశ్వరులు నగు కోలాచలము శ్రీనివాసరావుగారాహ్వాన సంఘ పక్షమున స్వాగతోపన్యాసముం జదివిరి. అది యెంతయు నాంధ్రుల చరిత్రమును బహుపురాతన కాలము నుండి తెలుపు చున్నది " తరువాత "మ.రా.శ్రీ కోలాచలము శ్రీనివాసరావుగారాంధ్ర నాటకముల విషయమై యొక చక్కని వ్యాసముం జదివిరి ' ఆ మరు దినము మధ్యాహ్నము సభలో 'కోలాచలము శ్రీనివాసరావుగారు 'ఆర్యుల నాగరకత, వారి దేశాక్రమణమును' గుఱించి వ్యాసముం జదివిరి. ఇట్లు శ్రీనివాసరావు గారు మూడుపన్యాసములు గావించిరి. 'మొదటి నాటి రాత్రి మ. కోలాచలము

1. బాలకవి శరణ్యము పు. 271

శ్రీనివాసరావు విరచిత మగు "రామరాజు'ను విజయనగర సామ్రాజ్య పతన సూచక నాటకముఁ బరిషత్సభ్యుల యానందమునకై ప్రదర్శించిరి."[1] ఈ 'రామరాజు చరిత్ర' నాటక ప్రదర్శనముమ గూర్చి యిచట చెప్పవలసి యున్నది. పై సభలో పాల్గొని దేశభాషా ప్రాముఖ్యమును గూర్చి ఉపన్యసించిన శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారు- "బళ్ళారి 'సరసవినోదిని'[2] నాటక సమాజము వారు మా నిమిత్తము, సభకాహూతులైన వారి నిమిత్తము రెండు నాటకములు ప్రయోగించిరి అందొకటి 'రామరాజు'. ఆ నాటకములో శ్రీ తాడిపర్తి రాఘవాచార్యులుగారు పఠాను పాత్ర ధరించి మిక్కిలి యద్భుత ముగా నటించి, నాటకాంతమున జరీ బనారసు పట్టుశాలువ యొకటి నాకు బహు మానముగాఁగప్పిరి."

"...కోలాచలం వెంకటరావుగారిని, వారి తమ్ముడైన శ్రీనివాసరావు గారిని బళ్ళారిలో దర్శించితిని. ఈ శ్రీనివాసరావుగారుతెనుగులో బహు నాటకములు వ్రాసిరి."[3] అని తమ స్వీయ చరిత్రలో వ్రాసికొన్నారు.

ఇంక శ్రీనివాసరావుగారి వైదుష్యమునకు, విమర్శనాత్మక బుద్ధి నైశిత్యమునకు అధ్యక్షార్హతకు జయ పతాక యనదగిన అంశము కలదు. వీరు 1917 వ సం. ఏప్రిల్ 7,8 తేదీలలో కడప పట్టణమున 'మ్యునిసిపల్ బాయిలంచి సెకండరీ స్కూలు' భవనమునందు నిర్వహింపబడిన ఆరవ ఆంధ్ర సాహిత్య పరిషద్వార్షిక సభకు అగ్రాసనాధిపతులుగ వ్యవహరించిరి. వీరు ఉపక్రమోప సంహారోపన్యాసములు గావించిరి. ఉపక్రమోపన్యాసమున ఆంధ్ర భాషా చరిత్రలకు సంబంధించిన విషయములను విపులముగ చర్చించిరి. ఆంధ్ర భాషను గూర్చియు, భాషోన్నతి దేశోన్నతి కెట్లుపకరించునో వివరించి, సాహిత్య మును గూర్చి సర్వమును చర్చించిరి. వ్యాకరణావశ్యకమును, విమర్శన గ్రంథములు, వార్తా పత్రికలు, భాషాభివృద్ధి కుపకరించు విధమును, అలంకార ముల ప్రాముఖ్యమను, నాటకములు, నాటక భాష, కళాశాల శిక్షణ మొదలైన

1. 140 సంపు 4 సం. 1 రాజహంస, చైత్రము పు. 18-21
2. "సుమనోరమ సభ" నాటక సమాజమై యుండవలెను,
3. 87 పు. 324.

వానిపై రావుగారు మహోపన్యాసము గావించిరి ఉపసంహారోపన్యాసమున వీరి విమర్శనాత్మక దృష్టి విచక్షణా జ్ఞానము, వాక్నైపుణ్యము, శ్రోతల నాకట్టి కొనగల చతురత స్పష్టమగును సభలో శ్రీ కుప్పుస్వామయ్యగారు 'శ్రీనాథుని కవిత్వము'ను. శ్రీ వావిలికొలను సుబ్బారావుగారును, నేరేళ్ళపల్లి రామ కృష్ణ శాస్త్రిం వారును 'పోతన జన్మస్థలము'ను, శ్రీ తాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు 'సంకుసాలనృసింహకవి'ని, శ్రీచింతలపల్లి నరసింహశాస్త్రిగారుకవితత్త్వము'ను గూర్చియు నుపన్యసింప రావు గారు మిక్కిలి చాకచక్యముతో సమీక్షించి 'మనుచరిత'లోని "ఇంతలు కన్నులుండ" పద్యమునుదాహరించి కావించిన వ్యాఖ్యానమనితరసాధ్యము. అందలి పెద్దన ప్రతిభను ప్రశంసించి శ్రీనివాస రావుగారు తమ ప్రతిభావ్యుత్పత్తులను ప్రకటించిరి, సమయస్ఫూర్తితో వ్యవహ రించి తమకుగల అధ్యక్షార్హతను నైతము స్పష్టముగావించిరి.[1] మహా విద్వత్సభకు అధ్యక్ష పదవి గౌరవమునకు శ్రీనివాసరావుగారర్హులైరి పై ఉపన్యాసములలో శ్రీనివాసరావుగారిసాహిత్యమూర్తి మహోజ్జ్వలమై ప్రకాశించి నట్లు విదితమగుచున్నది.

## 1.7 జీవిత పరిసమాప్తి:

శ్రీనివాసరావు గారు వేద భగవద్గీతా విమర్శనోపన్యాసములనే గాక 'ఇతరానేక వ్యాసములు వ్రాసిరి. వీరి చివరి వ్యాసము 8.1.1919 లో రచించిన 'భాసకాళిదాస విక్రమాదిత్యులకాల నిర్ణయ"మనునది. అంతకుముందే 25-7-1918 న 'ప్రాచీన గ్రంథాలయ చరిత్రము, రచించిరి. చివరినాటకము 'పాదుకా పట్టాభిషేకము'. ఇది 1918-19 లో రచింపబడియుండును. ఈ నాటక రచనా కాలమునకు'సుమనోరమసభా'నాటక సమాజపు కార్యకలాపములు ఆగిపోయినట్లు పీఠిక వలన తెలియుచున్నది. "బళ్ళారి పట్టణంబున 'సుమనోరమ' యను నాటక సంఘ మొకటి యుండెను. ఆ సంఘము వారు నాచే రచింపఁబడిన నాటకములనేకములు ప్రదర్శించుచుండిరి...

"మా సభలోఁ జేరిన పాత్రధారులు కొందఱు చేరి యిటీవల నూతన సభ నేర్పఱచికొని నా నాటకములాడుచున్నారు. వారును 'పాదుకా పట్టాభిషేక'

---

1. 140 పు. 1-24, 69-84, 101-108

మాడవలెనను కుతూహలమున నీ నాటకము౯ బూర్తీకరించి యివ్వుమని నన్ను వేఁడ వారి యిష్టానుసారంబుగనే వ్రాసితిని."[1] 'సుమనోరమసభా' స్థానమున కొలది మంది చేరి మరల మరొక సమాజమును స్థాపించినట్లు తెలియు చున్నది. శ్రీనివాసరావుగారు చెప్పినట్లు వీరి నాటకములనేకములు 'సుమనోరమ సభా' నాటక సమాజముచే ప్రదర్శింపబడుచుండినవి. ఈ విషయమును 'పాదుకాపట్టాభిషేక' నాటక పీఠికలోనే గాక ఇతర నాటక పీఠికలలోను పలు మార్లు ప్రశంసించియున్నారు పై సభలో ప్రధాన పాత్రధారి శ్రీ టి. రాఘవా చార్యులుగారు రావుగారి నాటకములలో ప్రధాన భూమికలను ధరించెడివారు. కాని శ్రీనివాసరావుగారు వారినిగూర్చిగాని, వారు రావుగారిని గూర్చిగాని ఎచటను ప్రస్తావించియుండలేదు. దీనికి కారణమేమిటో తెలియదు.

శ్రీనివాసరావుగారు ఆ మరణము నాటక రచన చేయుటయేగాక ఇతర వచన రచనలు గావించిరి. నాటక రంగముననే గాక సాహిత్యరంగమునసైతము కీర్తి ప్రతిష్ఠలను సంపాదించిరి. వీరి నిర్విరామ సాహిత్య కృషి కన్నివిధముల పరిస్థితులనుకూలించినవి. సుఖమయమైన సంసార జీవితముతోపాటు సాంస్కృతిక రంగమున పురోగమించిరి. ఆర్థికమైన ఇబ్బందులు లేవు. అందుచే నాటక రచనా ప్రయోగములలోను, విద్వద్గోష్ఠులలోను, కావ్యపఠన విమర్శనములోను, సభలలోను పాల్గొనుచు ఒక ప్రక్క న్యాయవాదవృత్తిని కొనసాగించుచు శ్రీనివాసరావుగారు కాలము గడుపుచుండిరి. వీరు ఏ కార్యమునైనను పట్టుదలతో త్రికరణశుద్ధితో చేసెడివారు. వీరి ప్రయత్నమునకు భగవంతుడు సహకరించి కృపా కటాక్షవీక్షణములను ప్రసరింపజేసినాడు కాని అనారోగ్యమపుడపుడు వీరిని పీడించుచుండినది. తమ అనారోగ్య విషయము నాటక పీఠికలలో పలు తావుల ప్రస్తావించిరి. అనారోగ్య సమయమునందే గ్రంథములు చదివెడివారు రావుగారు. రావుగారి ఆరోగ్యము మంచిది కాకపోయినను ఇంతగా నాటక రంగమునకు, నాటక వాఙ్మయమునకు సేవ చేసియున్న వీరికి మంచి ఆరోగ్యమే యుండిన ఇంకెంత సేవచేసియుందురో కదా!

శ్రీనివాసరావుగారు తమ రచనలన్నింటిని ముద్రింపించి శాశ్వతము చేయవలెనని, తన్మూలమున భాషా సాహిత్యాభివృద్ధిని చేకూర్పవలెనని ప్రగాఢముగా

1. 103 పీ. పు. 3

ఆకాంక్షించినవారు. అందుకే వీరు "Let the dramatist not keep his plays in manuscripts. Let his dramas be printed and thus become literary and living dramas"[1] అని నుడివియున్నారు. కనుకనే వీరు తమ ప్రథమ ద్వితీయదశలలోని నాటకముల నన్నిటినిదాదాపు ముద్రింపించి యున్న సంగతి ముందే ముచ్చటించితిని. ఈ కోరికతోనే అన్ని రచనలను ముద్రింపించి ప్రకటింప తలంచి రావుగారు సర్వము సిద్ధము చేసికొని, యొక తేదీ నిర్ణయించుకొని, మద్రాసుకుపోవుటకై నిశ్చయించి యుండిరట. అపు డపుడు పొడసూపుచుండిన అనారోగ్యము బలువై-దైవ నియోగమేమియోకాని- శ్రీనివాసరావుగారి నదే తేదీన మద్రాసుకుగాక శాశ్వతముగ స్వర్గమునకు గొని పోయినది. ఈ విషయమును వీరి జ్యేష్ఠపుత్రులైన శ్రీ శత్రుఘ్నరావుగారు "మా తండ్రిగారగు కోలాచలం శ్రీనివాసరావుగారు తమ వలనఁ జేయఁబడిన నాటకములన్నియు ముద్రింపించుటకు 1919 సం. జూన్ 28వ తేదీ చెన్నపురికి పోవలెనని నిశ్చయించుకొని యుండిరి. ఇట్లుండ జూన్ 19వ తేదీ మొదలు రాజవ్రణపీడితులై 1919 సం. జూన్ 28వ తేదీనాఁడే యస్తమించిరి."[1] అని తమ విషాదమును తెలిపి యున్నారు. భారతీయ పాశ్చాత్యనాటక లక్షణములలో నుత్తమమైన వానిని, అవసరమైన వానిని గ్రహించి తెలుగున నాటకములురచించి, అందున చారిత్రకనాటకములచే చారిత్రకనాటక పితామహుం డను ప్రఖ్యాతిగాంచిన శ్రీనివాసరావుగా రిహలోకమును వదలినారు వారి సాహిత్యమూర్తి మాత్రము శాశ్వతముగా మిగిలినది. ధర్మవరంవారు దివంగతులైన తరువాత ఏడు వత్సరములకు కోలాచలంవారు కన్నుమూసిరి. ఉత్తమ సంఘసంస్కర్తయు, ఆధునికాంధ్ర సాహిత్యోద్ధారకులును అయిన కందుకూరి వీరేశలింగం పంతులుగారు కోలాచలంవారి కంటె ఒక మాసము ముందు మాత్రమే అనగా 27-5-1919 తేదీన కీర్తిశేషులైరి. సంఘసంస్కరణ సాహిత్యసేవలందు కందుకూరివారి ప్రక్కనేఉండదగిన కోలాచలంవారు కందుకూరివారు స్వర్గస్థులైన వెనుక ఎంతోకాలము భూమిపైనివసింప నిచ్చగింప లేకపోయిరి. కనుకనే వారివెంట రావుగారును స్వర్గస్థులైరి. తండ్రి మరణా నంతరము, రావుగారి నాటకములను, ఉపన్యాసములను పూర్తిగా ముద్రింపించి, ముందే ముద్రితమైన వానిని పునర్ముద్రింపించి రావుగారి రచనల నన్నింటిని

1. 104 ఉ. పు. 4. ఉపోద్ఘాతరచన తేదీ 10-6-1919.

వెలుగులోనికితెచ్చి తండ్రి ఆశయమును నెరవేర్చిన ఘనతను సంపాదించిన ఉత్తములు శత్రుఘ్నరావుగారు. శ్రీనివాసరావుగారు ఆంధ్ర వాఙ్మయమునకు, ఆంధ్రనాటక వాఙ్మయమునకు, నాటక రంగమునకు గావించిన సేవ అనన్య సామాన్యము; అనితరసాధ్యము. ఇట్టి మహానుభావులు కావించిన ఘనకార్య సంస్మరణముచేతనే మనము ధన్యుల మగుదుము కదా! "ఇట్లు శ్రీ కోలాచలం శ్రీనివాసరాయ మహాశయుఁడు తాను జన్మించిన చిరయశోధురంధర మల్లినాథ సూరిగారి వంశపు కీర్తిచంద్రికలట్లే వెలిగింపఁజేయుచు, నానా సారస్వత రంగములందు నిరుపమాన కృషినొనరించి, యందును ముఖ్యముగ ఆంధ్ర నాటకరంగమున ప్రఖ్యాతనాటక రచయితయై పేరుగాంచి, యాంధ్ర సరస్వతిని వివిధ భూషణభూషితఁ గావించి సేవించి ధన్యుఁడై, తుదకు రాజవ్రణము నెపమున సిద్ధార్థిసంవత్సర, జ్యేష్ఠబహుళ దశమి (23-6-1919) సోమవారము నాఁడు కాలరూపియగు పరమాత్ముని పాదపద్మములకు శిరసొగ్గెను. యశోమాత్ర శరీరియై మిగిలెను."[1]

★

# 2. ఆంధ్ర నాటక వికాసము

2.1 పందొమ్మిదవ శతాబ్ది వరకు తెలుగున సంస్కృత రూపకముల వంటివి లేవనుట చారిత్రక సత్యము. కాని ఆంధ్రదేశమున యక్షగానాది వివిధ ప్రక్రియలు దృశ్య రూపములుగా పండిత పామర ప్రజానీకమునకు విజ్ఞాన వినోద దాయకములై విలసిల్లు చుండినవి. తెలుగున నాటక రచనారంభ వికాసములు పాశ్చాత్య నాటక రంగ ప్రభావముచేతనే జరిగిన వనుట నిర్వివాదాంశము. అట్లు ప్రారంభింపబడిన తెలుగు నాటక రచనా ప్రదర్శనములు పొందిన క్రమ వికాసమును, ప్రముఖ నాటక కర్తలు ఆంధ్ర నాటక రంగాభివృద్ధికి గావించిన సేవ మొదలగు విషయముల నీ ప్రకరణమున దిఙ్మాత్రముగ పరిశీలించుట ప్రసక్త విషయము. ఇది పూర్వ రంగముగ నుండి శ్రీనివాస రావుగారి నాటక విమర్శకు ఉపకరించును.

ఆంగ్లేయులు భారత దేశమున పరిపాలనాధికారములు సంపాదించుకొన్న తరువాత సుస్థిరతకై ఆంగ్ల భాషాభ్యాసనము ప్రవేశ పెట్టిరి. భారతీయులు ఉద్యోగ సముపార్జనము కొరకును, సంఘమున గౌరవము పెంపొందించుకొనుటకును, ఆంగ్లభాష నభ్యసింప మొదలిడిరి. వాఙ్మయాంతర సంపర్కము వలన నొక వాఙ్మయమున పరిణామము కలుగుట సహజము. కనుక ప్రపంచ మంతట వ్యాపించి, ప్రఖ్యాతి పొందిన ఆంగ్ల భాష భారతదేశమున గూడ రాజభాష యగుటచే తత్ప్రభావము మనపై ననేక విధముల ప్రబలినది. ఇట్లు ఆంగ్ల భాషాభ్యసనము వలనను, ఆంగ్ల వాఙ్మయము నందలి రసవన్నాటకము లనేకములు ప్రదర్శన మూలకముగ వ్యాప్తిజెందుట వలనను, మన వారు కూడ తెలుగున నాటకములు రచింప నారంభించిరి.

ఆంగ్లేయుల పరిపాలన మన దేశమున సుస్థిరము కాక మునుపు వ్యాపారార్థమై 'ఈస్టిండియా కంపెనీ' నెలకొల్పబడెను. ఆ సమయమున ఆంగ్లేయులు, ఆంగ్ల వర్తకులు పాశ్చాత్య నాటక రంగమును భారత దేశమున ప్రవేశ పెట్టిరి. మొట్టమొదట వీరు భరత దేశ మందలి ముఖ్య నగరములైన కలకత్తా, బొంబాయి, మద్రాసు మున్నగు నగరములలో సొంతముగా ఆంగ్ల నాటకములను

ప్రదర్శించుట ఆరంభించిరి. శ్రీ ఆర్.కె. యాజ్ఞిక్ గారి మాటల వలన నిదిస్పష్ట మగును."Before the battle of Plassy in 1757,an English Theatre was in existance in Calcutta.

"At this 'Calcutta Theatre', after 1770,sparkling comedies like The Beavix Strategem and the School for Scandal and Shakespearean tragedies like Richard III and Hamlet were staged by one Mr. Massick or Massing, who had been sent out by David Garrick...." 1

"The original Bombay theatre, which stood on the old Bombay Green (Elphinstone Circle) was built by subscription in 1770 (on a site granted by Government) and for a few years only managed to pay its way." 2

"In 1875 'the Madras Dramatic company' was founded, under whose auspices amatuer Europeans gave performances in English...." [3] ఇట్లు ప్రారంభింపబడిన నాటకశాలలోని ఆంగ్ల నాటక ప్రదర్శనములకు సామాన్యముగా భారతీయులలో ఆంగ్ల విద్యావంతులను,సంపన్నులను, జమీందారులను, రాజులను ఆహ్వానించెడివారు.ఇట్టి భారతీయులు ఒకవైపు అత్యద్భుతమై మనోహరమైన ఆంగ్ల నాటక రంగము వలన ఆకర్షింపబడి, మరొక వైపు ఆంగ్లేయుల చేతకూడ అభినందింపబడిన సంస్కృత రూపకౌన్నత్యముచే భావావేశమును బొంది భారతీయ నాటక రంగమును పునరుద్ధరింపవలెనని తలంచిరి [4]

ఇట్టి తలంపుతో పందొమ్మిదవ శతాబ్దిలో భారతీయులు ముఖ్య నగరములలో ఆంగ్ల నాటకములుగాని, సంస్కృత రూపకములుగాని, వాని అనువాదానుసరణములుగాని ప్రదర్శించుట కారంభించిరి. భారత దేశమున పనిచేయుచుండిన ఆంగ్ల భాషాచార్యులు కళాశాలలలో పాఠ్య గ్రంథములుగ నిర్ణయింపబడినవే గాక ఇతరములయిన షేక్స్పియరు మున్నగు వారి ఆంగ్ల నాటకములను

1. 161 పు. 88 2. 161 పు. 91

3. 161 పు. 99. 4. 157 పు. 232.

తమ విద్యార్థులచే ప్రదర్శింప జేయుచుండెడివారు.[1] ఇట్లు కలకత్తాలో వలెనే బొంబాయి,పూనా నగరములలోను విద్యార్థులు ప్రదర్శనలిచ్చెడివారని తెలియును. "Similarly, at Pooaa in 1872, Julius Caesar was staged by University stadents....Following tha example of English productions, Sanakrit Classics were also staged by College amateurs".[2] ఇట్టి పద్ధతి ఆంధ్ర దేశమున గూడ నుండినదని చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి మాటలవలన స్పష్టమగును. "మోసు దొరగారు ప్రథమశాస్త్ర పరీక్షకు చదువు విద్యార్థులచే, నా సంవత్సరము (1887) పాఠ్య పుస్తకమైన 'వెనీసు వర్తకుడు' (Merchant of Venice) అను నింగ్లీషు నాటకము నాడించిరి".[3] ఇట్లు కళాశాల, విశ్వవిద్యాలయములలోని ఆంగ్లాధ్యాపకులు విద్యార్థులలోని నాట్య కళా ప్రావీణ్యమును ప్రోత్సహించుచుండిరి.

అంతేగాక ఆంగ్ల విద్యావంతులైన ఉన్నతాధికారులు, ప్రసిద్ధ వ్యక్తులు వివిధ పాత్రలు ధరించుచు నాటక రంగమున కన్పట్టుచుండిరి. ఇట్లు గొప్ప వారందరు నాటకములందు నటింప నారంభించుటచే నటునకు సంఘమున గల న్యూనతాభావము తొలగిపోయి, గౌరవము కలుగజొచ్చెను. పందొమ్మిదవ శతాబ్ది వరకు వేషధారుని యెడ అనాదర ముండెడిది అతడెంత ప్రజ్ఞావంతుడు గాని ఉత్తమ గాన కళాకోవిదుడుగాని, భావ ప్రకటనా ప్రవీణుడుగాని సంఘమున గౌరవములేకపోయినది; అతడు పంక్తి బాహ్యుడు. కనుకనే తక్కువ కులములవారు వీధి నాటకములలోను, భాగవతములలోను, బొమ్మలాటలలోను పాల్గొనుచుండెడివారు. అట్టిది మారిపోయినది. ఆంగ్ల వాఙ్మయము, పాశ్చాత్య నాగరికతల ప్రభావముచేత భారత దేశమునందు నాటకమునకు, నాటక రంగమునకు, నటునకు అత్యధిక గౌరవోన్నతులు గలిగినవి. తన్మూలమున భారత దేశము నందలి విద్యార్థులే గాక ఇతరులును నాటకము లాడవలెననెడి ఉత్సాహపూరితులై తత్కార్యమునకు పూనుకొనిరి.

## 2 · 2 పార్సీనాటకరంగ ప్రభావము :

ప్రారంభదశలో ఆంగ్లనాటకరంగముచే తెలుగు నాటకరంగము ప్రత్యక్ష

1. 161 పు. 86. 2, 161 పు. 93, 94.
3. 87 పు. 60.

ముగా ప్రభావితము కాలేదు మొదట ఇంగ్లీషు నాటకరంగ ప్రభావము పార్శీ, మహారాష్ట్ర నాటకరంగములపై బడినది."The ever enterprising Parsees, the pleasure seeking Mahamedans and the talented Maharattas have commenced performances in their own vernaculars.They have borrowed from English stage all that they can conveniently and usefully borrow. Others have followed their example."[1] తరువాత వీని ద్వారమున మన ఆంధ్రనాటకరంగము ప్రభావితమైనది. కనుక తెలుగుపై ఆంగ్లనాటక ప్రభావము పరోక్షమైనది. "But we find that the influence of the English stage on Telugu was not direct at the start. It came indirectly through the Parsi and Mahratta groups of artists who toured Andhra and Karnatak in the 19 th century."[2]

ఆంగ్లనాటకముచే ప్రభావితమైన పార్శీనాటకరంగము తదనుగుణమైన ప్రదర్శనలిచ్చుట కారంభించినట్లు శ్రీ ఆర్. కె. యాజ్ఞిక్‌గారి వాక్యముల వలన తెలియును. "Secondly, Parsis, the most intelligent minority in India, have made their headquarters in Bombay. They brought with them ancient Parsian traditions profoundly modified by Hindu culture. Again, they have a genius for completely adapting themselves to Western standards. In a sense, they are the pioneers of the modern theatre in Bombay, both in the amateur and in the professional field. As a community, they are responsible for bold experiments in stagecraft, but at the same time they made this too commercial for higher development."

" Generally, their plays were adaptations of English Comedies to suit Parsi life and manners. They continued the Engligh practice of giving small farces in Gujarati, Urdu, or English at the end of the principal play."[3] ఇట్టి నాటక ప్రదర్శనములను మనోరంజకము మొనరించుటకు పార్శీలు అధికధనము వెచ్చించెడివారు.

1. 167 పు. ౪32, ౪88. 2, 164. పు. 124.

8. 161 పు. 90, 96.

వివిధ విధములుగ రంగాలంకరణముగావించి చక్షుఃప్రీతిలోపాటు మహాద్భుతావహ మొనరించెడివారు "పార్శీ నాట్యరంగము, యూరపియన్ నాట్యకళా వైశద్యంతో ప్రహసనాలు, సంగీతనాటకాలు, ఉత్సవనాటకాలు (పెజెంట్స్) ప్రదర్శించడం అలవర్చుకొంది. నాటకపుసీన్లు, దుస్తులు అచ్చంగా 19 వశ. లోని ఇంగ్లీషు స్టేజీ నకళ్లు, స్టేజి వెనుకనున్న తెర (బాక్‌డ్రాప్) వింతరంగులతో చిత్రించబడింది. రాక్షసులు, ఘాతుకపాత్రలు, రణరణధ్వనిజేస్తూ, బొబ్బలు పెట్టేవారు. భూతాలు గాలిలో హుంకరించి ఎగిరేవి. కత్తుల తళతళలు మెరిసేవి. నాయకులు కోటగోడలపైనుంచి ఉరికేవారు. సాక్షాత్తు లీషియం ప్రహసనాలు, (స్టంట్సు) దొమ్మరిమొగ్గలూ, (డూరికన్) దృశ్యాలు అవతరించాయి. భాగవత నాటకానికి ఒకలక్షరూపాయల విలువగల అలంకరణాలు, ద్రశ్యాలుకొనిరి పండిత నారాయణ ప్రసాద్‌చే తాబ్ వ్రాసిన భాగవతంలో అనేక కృష్ణరూపాలు కల్పించడానికి ఖరీదైన అద్దాలమర్చబడ్డాయి. (ట్రిక్‌సీన్సు) చమత్కారపు పనులు, విశేషంగా కల్పించి ప్రేక్షకులను ఆకర్షించేవారు."[1] ఇట్టివి పార్శీనాటక ప్రదర్శనములు.

ఈ పార్శీనాటక ప్రభావముచే భారతదేశమున అనేకనాటక రంగములు వెలసినవి. క్రీ.శ. 1842లో కన్నడయక్షగాన ప్రదర్శనమును తిలకించిన సాంగ్లీప్రభువు అప్పాసాహెబ్, విష్ణుదాస్‌భావేను నాటకము రచింప నాదేశించెను. విష్ణుదాస్‌భావే 'సీతాస్వయంవర'మను నాటకమును మరాఠీలో 1843లో రచించి ప్రదర్శించెను. అదే మరాఠీనాటకరచనా ప్రదర్శనములకు ఆరంభము. 1851లో భావే నటకులు బొంబాయికివెళ్లి అచట ఆంగ్ల, పార్శీ నాటకప్రదర్శనముల తిలకించి వాని ననుకరింపనారంభించిరి. తరువాత మహారాష్ట్ర నాటక రంగమెంతయో అభివృద్ధిచెందినది.పార్శీ ప్రభావముచే ఉర్దూ, గుజరాతీ నాటక రంగములు వెలసినవి."The Urdu stage was the creation of Parsis. The Gujarati theatre proper arose out of discontent with Parsi high handedness in the management of the new theatre."[2] ఈపార్శీ,మహారాష్ట్ర నాటక సమాజములు పలుప్రదేశములలో సంచారముచేసి ప్రదర్శన లిచ్చి

1. (i) 145 డిసం, 1964, (ii) 157 పు. 238, (iii) 161పు. 96
2. 161. పు. 96.

నవి. 1855 ప్రాంతములలో మహారాష్ట్ర. పార్శీ సమాజములు ఉత్తర కర్ణాటక, మైసూరు, ఆంధ్రప్రదేశములలో సంచారముచేసి ప్రదర్శన లిచ్చినట్లు డా॥ హెచ్. కె. రంనాథ తెలిపినారు. "Every important city like Sangli, Miraj, Tolthapur and Ichalkaranji saw the birth of a troupe which tried to go one better than the great Sanglikar Company which had earned for Maharashtra a new mode of theatre. All these professional troupes made frequent visits to North Karnatak soon after 1855. Tempted by the success of Marathi professional troupes in North Kranatk, Parsi Companies, including the well known Victoria Parsi Company of Balliwala started visiting North Karnatak, Mysore and Andhra."[1]

"Because of the conspicuous change in the attitude of the people, Maharashtrian professional troupes bypassed North Karnatk and went to Mysore and Andhra in 1876–'77' (N. K. Huilgol :— Oct. 1925 p. 54) in search of new audience for their plays.'[2] తత్ప్రభావముతో గదగ్‌లో కన్నడనాటక సమాజము ప్రప్రథమముగా వెలసినది. "The first professional troupe of North Karnatak appeared in Gadag (Kritapura) in the year 1877. This troupe was called Karnataka Nataka Company and also Sri Veeranarayana Prasadika Kritapura Nataka Mandali".[3] ఇంక ననేక సమాజములు కన్నడదేశమున వెలసినవి. ఇట్లు పార్శీ మహారాష్ట్ర నాటక సమాజముల ప్రభావముచే కన్నడదేశమున నాటక సమాజములు వెలసినవి.

## 2 . 3 తెలుగునాటక రంగారంభము :

ఆ తరువాత ఆంధ్రనాటక రంగముపై పార్శీమహారాష్ట్ర నాటకరంగముల ప్రభావమేగాక కన్నడనాటకరంగ ప్రభావముగూడ పడినది. పైని వర్ణింపబడిన కర్ణాటక నాటక సమాజములుకొన్ని ఆంధ్రదేశమున ముఖ్యముగా

1. 165. పు. 79 2. 162 పు. 82.
3. 162 పు. 81.

బళ్ళారినిదర్శించి ప్రదర్శనలిచ్చినవి. **"Bellary had for a long time preserved the traditions of the folk stage with its "Togalu Bombe" (coloured image), 'Sootrada Bombe' (the morionet) and 'Doddata', the popular folk show. Prominent professional troupes of North Karnatak and Mysore paid frequent visits to Bellary from the eightees of the last century, and in later years it became a passion with every troupe to visit the Bellary and Mangalore districts, for that was the land of their prosperity.'**[1] ఇట్లు బళ్ళారికో మరాఠీ, హిందీ నాటకములతోపాటు కన్నడభాషా నాటకములుగూడ ప్రదర్శింప బడుచుండు నవి. ఇట్టి వాతావరణములో నాటకోచితభాష కన్నడమే యనియు, అందుకు తెనుగు భాష ఉపయోగపడదనియు కొంతమంది అభిప్రాయ పడగా, ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు అట్టి అపోహను పోగొట్టుటకై తెనుగున చిత్రనళీయమను నాటకమును రచించి మొట్టమొదటి సారిగా 1886లో ప్రదర్శించి విశేషఖ్యాతిని గడించిరి. కాని ఆనాడు కన్నడ నాటకమునకున్న ప్రాధాన్యము, ప్రజాదరణమును బట్టి ధర్మవరంవారు మొదట కన్నడముననే నాటకము రచించిరి. "నాకా కన్నడము నందును నొకింత పరిచయ మున్నందున వారి మతము చొప్పునఁ బోవలసివచ్చి మొట్టమొదట స్వప్నానిరుద్ధ మనుపేర ఉషా కల్యాణచరిత్రమును గన్నడ భాష నాటకముగా నొనరించితి".[2] అని ధర్మవరంవారు వాకు్రుచ్చిరి. పందొమ్మిదవ శతాబ్ది చివరి దశక ములలో కొన్ని సంచార నాటక సమాజములతోపాటు బాలగంధర్వ, ప్రౌఢ గంధర్వ మున్నగు మరికొన్ని నాటకసమాజములును పూనా, ధార్వాడలనుండి ఆంధ్రదేశమునకు వచ్చి ప్రదర్శనలిచ్చి ఆంధ్ర ప్రజలలో నాటకరంగపునరుజ్జీవ నాభిరుచి కలిగించినవి. ధర్మవరం వారి సమకాలికులయిన కోలాచలం శ్రీనివాస రావు గారు చారిత్రక పౌరాణిక నాటకములు స్వతంత్రముగా రచించియుండినను మహారాష్ట్ర నాటకములచే ప్రభావితులై వానిని తెలుగులోనికి పరివర్తనము గావించిరి. "ఇటీవల బళ్ళారి పురంబునకు వచ్చిన పూనా కంపెనీలు రెంటిలో 'కేశవ గంధర్వ కంపెనీ' వారు 'రాక్షసీ మహత్వాకాంక్ష' యను గంభీర నాట కము (Tragedy) నాడి ప్రేక్షకులను మెప్పించిరి...మరియొక బాలగంధర్వ యను కంపెనీవారు 'మానాపమాన'మనెడి నాటకమాడి జనులను హర్షింపఁజేసిరి.

1. 162 పు. 123 2. 125 పి పు. 1.

పిదప మహారాష్ట్రి భాషనొక నెలదినములు తగినంతవఱకు నభ్యసించి ప్రారంభమున 'రాక్షసీమహాత్వాకాంక్ష'యను నాటకము నాంధ్రీకరించితిని...అయినను దైవానుగ్రహమువల్లఁ బట్టినపట్టు వదలక యథాశక్తి న్యాయముగ మానాపమాన నాటకము నాంధ్రీకరించితిని...''[1] అని శ్రీనివాసరావుగారు నుడివిరి.

ఇట్లే ఉత్తర సర్కారులలోను నాటకము లారంభమైనవి. 1880 లో మద్రాసు,ఆంధ్ర దేశములలో మహారాష్ట్రి,ధార్వాడ నాటక సమాజములు సంచారముచేసి ప్రదర్శనము లిచ్చినవి.

"About 1880, when medieval " paddy field" or open air plays were still the principal source of dramatic amusement, the 'Poona Sangli Troupe' visited Madras. Inspired by their nove performances, one Govindaswami Rao, a Marathi resident started to act Tamil mythological plays with the aid of crude scenery and native music".[2] ధార్వాడ నాటక ప్రదర్శన ప్రభావము చేత కందుకూరి వీరేశలింగం పంతులుగారు గూడ నాటకములు రచించి ప్రదర్శింప నారంభించిరి. "1880వ సం. నందు ధార్వాడ నాటకసమాజము వారు మా (రాజమండ్రి) పట్టణమునకు వచ్చి గొప్ప పాకవేసి దానిలో తమ నాటకముల నాడిపోయిన తరువాత పాక తీసివేయకముందే యా నాటకశాలలో నాడింపవలెనన్న కుతూహలముతో శ్రీ హర్షదేవ విరచితమైన రత్నావళినాటికను సంస్కృతమునుండి పద్యగద్యములతోను, ఇంగ్లీషు కవులలో నగ్రగణ్యుఁడుగా పరిగణింపబడెడు షేక్స్పియరు మహాకవి విరచితమైన 'కామెడీ ఆఫ్ ఎఱ్ఱర్స్' నాటకము నింగ్లీషునుండి గద్యాత్మకముగాను అత్యంత శీఘ్రకాలములో తెలిగించి యారెంటిని తన్నాటకశాలలో జయప్రదముగా ప్రదర్శింపించితిని."[3] అని పంతులుగారు చెప్పికొన్నారు. అంతకు ముందే (1880 లోనే) శ్రీ విజయనగరము బాలికా పాఠశాలలో వారి విద్యార్థులు కొందరు వారి 'వ్యవహార ధర్మబోధిని' నాటకమును ప్రయోగించి యుండిరి. అంతకు పూర్వమే తెలుగున స్వతంత్రములు గాని, అనువాదములుగాని ఒకటి రెండున్నప్పటికి ఆంధ్రదేశమున తెలుగు నాటక ప్రదర్శనమున కిదే ప్రప్రథమమనుటలో సందే

1. 118 పి. పు. 1. 2. 161. పు.99.
3 88. పు. 178

హము లేదు. 1885లో వామనభట్టజోషి ఏలూరులో నాటకసమాజము నేర్పరచి నట్లు చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారి మాటలవలన వ్యక్తమగును. "ఆ సమాజము (ధారవాడ నాటక సమాజము) నకు నాయకుడైన వామనభట్ట జోషికిని, దక్కిన సభ్యులకును మనస్పర్థలు గలిగినందున, నేలూరు పట్టణమున నతడు తన సమాజమునుండి విడిపోయి, సమాజముమీద కోపముచేత మరియొక సమాజము దానికి పోటీగా లేవదీయతలచి, మన యాంధ్ర యువకుల కొందరను జేర్చుకొని, యొక నాటక సమాజమును లేవదీసెను. దానికే యేలూరు కంపెనీయని పేరు. ధారవాడ నాటక సమాజమువారి వలెనే వీరును హిందీలో నాటకములాడెడి వారు.''[1] తొలుత ఆంధ్ర దేశమున గూడ హిందీ నాటకములు రచింపబడి ప్రదర్శింపబడిన వనుటకు నిదర్శనము గలదు. అందుకు నాదెళ్ళ పురుషోత్తమ్‌గారే తార్కాణమని భీమ్‌సేన్ నిర్మల్‌గారి అభిప్రాయము. "ధార్వాడ నాటకములను అనుకరిస్తూ నాటక ప్రదర్శనములకై అనేక నాటక సమాజములు వెలసినవి. వానితోపాటు హిందీ నాటకములు ప్రదర్శింపవలెనను ఉద్దేశ్యముతో బందరులోను, మరికొన్ని పట్టణములలోను నాటక సమాజము లేర్పడినవి....'' "రేపల్లెబోర్డు లోయర్ సెకండరీ స్కూలులో అధ్యాపకులుగానున్న శ్రీ పురుషోత్తములనువారు హిందీ నాటక రచనకై ప్రోత్సహించిరి."[2] వీరు ముప్పది రెండు హిందీ నాటకములు, పది తెలుగు నాటకములు రచించిరి. పూనా నాటక సమాజము .88వలో ఆంధ్ర దేశమంతట సంచారము చేసి అనేక నాటక ప్రదర్శనములిచ్చిన తరువాత ఆంధ్ర దేశమున తెలుగున సంస్కృత ఆంగ్ల పరివర్తనములతో పాటు, స్వతంత్ర నాటకములు విరివిగా వెలసినవి; ప్రదర్శనలు ఆరంభమైనవి.

## 2.4 తెలుగు నాటక సమాజములు :

1860 లోనే కోరాడ రామచంద్రశాస్త్రిగారిచే రచితమైన 'మంజరీ మధుకరీయము', తదితరుల సంస్కృత ఆంగ్ల నాటకానువాదము లుండినప్పటికి అవి ప్రఖ్యాతికి రాలేదు 1880 లో కందుకూరి వీరేశలింగం పంతులుగారు రాజమండ్రిలో నాటక సమాజమును మొట్టమొదటిసారిగా నెలకొల్పినట్లు "వారి

1. 87 పు. 66. 2. 145 ఏప్రిల్ 1967, పు. 161

(నా మిత్రుల) కోరిక ననుసరించి 1880 వ సంవత్సరములో కడపటి భాగమున నొక నాటక సమాజమును స్థాపించి, ధార్వాడ నటకులు వచ్చి నాటకములాడి విడిచిపోయిన పాకలోనే 'రత్నావళి' 'చమత్కార రత్నావళి' యను రెండు నాటకములు చేసి యాడించితిని. అట్టి నాటకము లాడుట కదియే ప్రథయ ప్రయత్నమైనను, మొత్తముమీద నవి జయప్రదముగానే జరిగినవని యెల్లవారు భిప్రాయపడిరి".[1] అను వారి మాటల వలన తెలియును. ఈ సమాజము తాత్కాలిక మైనదే గాని ప్రాధాన్యమును వహింపలేదు. కాని ఆంధ్రదేశమున బళ్ళారిలో మొట్టమొదటి నాటక సమాజమును నెలకొల్పిన ఘనత ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారికి దక్కినది. దాని పేరు 'సరసవినోదిని సభ'. వీరు ప్రథమ స్వతంత్రాంధ్ర నాటక కర్తలు. ఆంధ్ర నాటక రంగమునకు వీరితో ఏ మాత్రము తీసిపోని సేవచేసినవారు బళ్ళారి నివాసియేయైన కోలాచలం శ్రీనివాసరావుగారు. వీరు బళ్ళారిలో 'సుమనోరమ సభ' అను నాటక సమాజమును స్థాపించిరి. వీరు 'ప్రపంచ నాటక చరిత్ర' (The Dramatic History of the World) అను ఉద్గ్రంథమును ఆంగ్లమున రచించిరి. వీరి ఘనతకు మరొక తార్కాణము గలదు. అధిక ధనమును వెచ్చించి వీరు బళ్లారిలో 1905 లో 'వాణీ విలాస నాటకశాల'ను నిర్మించిరి. బళ్ళారిలో తప్ప మరెక్కడ నిట్టి నాటకశాల లేదని బళ్ళారికి వచ్చి కన్నడ నాటకముల ప్రదర్శించిన శ్రీ గుబ్బి వీరణ్ణగారు తమ ఆత్మకథలో నొక్కి వక్కాణించిరి.[2] ఇది నిజముగ కోలాచలం వారికి గర్వకారణము! పార్శీ నాటక ప్రదర్శనలచే ప్రభావితులైన ఇమానేని హనుమంతరావుగారు 1885 లో ఒంగోలులో హిందీ, ఉర్దూ నాటకము లాడుట కారంభించిరి. వారి నాటక రచయిత ఉండవల్లి సాహెబుగారు. 1889 లో పై ఇమానేని హనుమంతరావుగారే రాజమండ్రిలో 'హిందూ నాటక సమాజము'ను స్థాపించిరి. వారికి చిలకమర్తి వారు నాటకములు వ్రాసియిచ్చెడివారు. ఈ సమయముననే గుంటూరు 'హిందూ సమాజము', విశాఖపట్టణము 'జగన్మిత్ర నాటక సమాజము', వెలసినవి. తరువాత బందరు 'హిందూ థియేటరు', కడప 'సురభీ కంపెనీ', నెల్లూరు 'ఆంధ్రాభిమాన సమాజము', పిఠాపురము హిందూ థియేట్రికల్ కంపెనీ', నరసాపురం 'ఆర్యానంద హిందూ నాటక సమాజము', నరసరావుపేట 'విక్టోరియా మెమోరియల్

1. 88. పు, 175 2. 177. పు, 7

థియేట్రికల్ కంపెనీ' మొదలైనవి పేర్కొనదగినవి. వీనిలో కొన్ని 'రాజా'ల అధికారములో నుండినవి. ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు అనేక పర్యాయములు తమ నాటక సమాజమును మద్రాసుకు తీసికొనిపోయి ప్రదర్శన లిచ్చి, అచటి వారిలో గూడ నాటక ప్రదర్శనపై నభిలాష కలిగించిరి. తత్ప్రభావము చేతనే 'తమిళ నాటక పితామహ' సంబంద మొదలియార్ గారు 1891లో మద్రాసులో 'సుగుణ విలాస సభ'ను స్థాపించిరి. పై సమాజములవారు సంస్కృతాంగ్ల నాటక పరివర్తనములు గాని, స్వతంత్ర నాటకములు గాని ప్రదర్శించెడివారు. వారి నాటకము లన్నింటను పాశ్చాత్య నాటక యుక్తు లధికముగా నుండెడివి. ఆ ప్రదర్శనము లందు ఆంగ్లేయులయు, పార్శీలయు నాటకరంగ ప్రభావ మధికము. పార్శీ నాటకములలోని పాటల పద్ధతిని తెలుగు నాటకములలో తెలుగు వారనుసరించిరి. తెలుగున స్వతంత్ర నాకటమును మొదట రచించిన ధర్వవరం వారే ఇట్టి పాటల పద్ధతిని ప్రవేశ పెట్టుటలో ఆద్యులు. ఇట్లే కోలాచలం వారును పాటలను రచించిరి. తరువాత ననేకు లనుకరించిరి. దక్షిణ దేశము నందలి ఆధునిక నాటక రంగము నత్యున్నత స్థితికి దెచ్చిన వారు ఆంధ్రులనుట ఇచట గమనింపదగిన విషయము.

## 2.5 ఆంధ్ర నాటక ప్రారంభ దశ (1860 - 1897) :

'తెలుగు నాటక వికాసము' ద్వితీయ భాగమున డా. పి. ఎస్. ఆర్. అప్పారావుగారు తెలుగు నాటక ప్రారంభ వికాసములను ఆరధ్యాయములుగా విభజించి సమీక్షించిరి. సౌలభ్య, సంక్షిప్తతల కొరకు. తెలుగు నాటకము ప్రారంభదశ (1860-1897), వికాసము (1897-1920). రచనా వైవిధ్యము (1920-1944), అద్యతనకాలము (1944 నుండి నేటివరకు) నని నాలుగు విధములుగా తెలుగు నాటకవాఙ్మయమును విభజింపనగును.నా యీ సిద్ధాంత వ్యాస రచనకు పై నాలుగింటిలోని మొదటి రెండు దశలయిన తెలుగు నాటక ప్రారంభ వికాసములే ప్రయోజనకారులు వానిని గూర్చిన సమగ్ర చర్చ ఇచట అవశ్యకము. దాని సమగ్రతా సంపాదనార్థము తరువాతి రచనా వైవిధ్యము, అద్యతన కాలము' నను వానిని గూర్చి క్లుప్తముగా తెలుపుట సమంజసమని తలంచి అట్లు గావించితిని.

మొట్టమొదట తెలుగున నాటకము రచించిన ఘనత కోరాడ రామచంద్ర శాస్త్రిగారికి దక్కినది. అంతకు పూర్వము తెలుగున నాటకములులేవను కొరతన తీర్చుటకై [1] రామచంద్రశాస్త్రిగారు 1860లో 'మంజరీ మధుకరీయ'మను నాలుగంకముల నాటికను రచించిరి. ఇది తెలుగున స్వతంత్రమైన తొలి రూపకము. కాని ఇందలిభాష శ్రవ్యకావ్య రీతినినడచి కవి పాండిత్య ప్రకర్షనే ప్రకటించుచున్నది. సంస్కృతనాటక లక్షణములిందుకుదిరినవి. ఇది రంగస్థలమున ప్రదర్శితమైనట్లుతోపదు. అందువలననే అంతగా ప్రఖ్యాతికి రాలేకపోయినది. 1872 వ సంవత్సరమున శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు 'నరకాసుర విజయ వ్యాయోగము'ను సంస్కృతమునుండి తెలుగులోనికి పరివర్తిత మొనరించిరి. కాని అంతకు పూర్వమే కోరాడ రామచంద్ర శాస్త్రిగారు సంస్కృత వేణీసంహారమును తెలుగులోని కనువదించినట్లును, వారి ననుసరించి కొక్కొండ వారు నాటకానువాదమునకు పూనినట్లును వావిలాల వాసుదేవశాస్త్రిగారి మాటలవలన వ్యక్తమయినది. [2] కోరాడవారి వేణీసంహారము లభింపలేదు. వీరుకొన్ని సంస్కృత రూపకములను రచించినట్లు తెలియును. ఇంక లభించిన వానిలో కొక్కొండవారిదే సంస్కృత నాటకమునకు మొదటి అనువాదమనుట స్పష్టము. 1875 సంవత్సరము ప్రాంతమున పరవస్తు వేంకట రంగాచార్యులుగారు కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలమును కొంతవరకు తెనిగించి 'సకలాభివర్ధని' పత్రికలో ప్రకటించిరి. ఆ తరువాత 1875లోనే కందుకూరి వీరేశలింగం పంతులుగారు శాకుంతలము ననువదింప మొదలిడి 1883 నాటికి పుస్తక రూపమున ప్రకటించిరి. కాని ఈ శాకుంతలమును ప్రప్రథమముగా అనువదించిన వారు యమ్. శేషాచార్యులుగారని శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి గారి అభిప్రాయము. "మొట్టమొదటిసారిగ శాకుంతలాన్ని అనువదించినది శ్రీ యమ్ శేషాచార్యులు. అది 1870లోనే అచ్చుపడింది. ఇది ఆంధ్ర వాఙ్మయ సూచికనుబట్టి తెలిసేవిషయం."[3] దీనినిబట్టి శేషాచార్యులుగారి అనువాదమే ప్రథమ మనవలపివచ్చును. సంస్కృతానువాదము లీవిధముగా తెలుగులోనికి వచ్చుచుండ 1875 వ సంవత్సరము నందే షేక్స్పియరు "జూలియస్ సీజర్" నాటకమును తేటగీతులలో పద్యాత్మకముగా శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారను వదించిరి. తరువాత వారే 1880లోనే స్వతంత్ర సాంఘిక

1. 189 ఏప్రిల్ 1960. పు. 8-10 2. 96. పీ
3. 25. పు. 276.

నాటకము 'నందకరాజ్యము'ను రచించిరి.[1] ఆ వెనుక ఉత్తరరామచరిత్ర, మృచ్ఛకటికములను సంస్కృతమునుండి అనువదించిరి. ఇట్లు వావిలాల వాసుదేవశాస్త్రిగారు ఆంగ్లనాటకానువాదమునను, స్వతంత్ర సాంఘికనాటక రచనమునను ప్రథములని తెలిసినది

1880 సంవత్సరము ఆంధ్రనాటక వాఙ్మయమున ముఖ్యమైన కాలముగా పరిగణింపబడినది. ఈ సంవత్సరమునందే ప్రప్రథమముగా ఆంధ్రదేశమున తెలుగునాటకము ప్రదర్శింపబడినది. అది కందుకూరివారి 'వ్యవహారధర్మబోధిని'. ఈ నాటకము విజయనగరము మహారాజాగారి బాలికా పాఠశాలలో ప్రదర్శింపబడినది. అదే సంవత్సరమున మిత్రుల ప్రోత్సాహముచే కందుకూరివారు 'రత్నావళి' (సంస్కృత రత్నావళీ), 'చమత్కార రత్నావళి' (Comedy of Errors) అను నాటకముల సంస్కృతాంగ్లములనుండి అనువదించి ధార్వాడ నాటక సమాజమువారువేసిన పాకలోనే ప్రదర్శింపించిరి. ఆంధ్రనాటక ప్రదర్శనములు తెలుగువారికి క్రొత్తవగుటచే అశేష ప్రజానీకము చూచి యానందించినదట.[2] ఈ విధముగా నాటకరచన, ప్రదర్శనములు తెలుగు దేశమున ఆరంభమైనవి. అంతకుపూర్వమే బ్రాహ్మ వివాహమనెడి నాటకమును కందుకూరివారు రచించి 'హాస్యసంజీవనీ' పత్రికలో ప్రకటించియుండిరి. 'బ్రాహ్మవివాహ వ్యవహార ధర్మబోధిను'లలో నాటకీయ శిల్పము కొరవడినదనుటలో సందేహము లేదు. కాని వీరు సంఘ సంస్కరణము ప్రధానోద్దేశ్యముగా తలంచి వినోదాత్మకముగ రచించిరి. తదుద్దిష్టములుగా వీరనేక ప్రహసనముల రచించిరి. ఇవిగాక సంస్కృతమునుండి అభిజ్ఞాన శాకుంతలము, మాళవికాగ్నిమిత్రము, ప్రబోధచంద్రోదయము ననువానిని, ఆంగ్లమునుండి రాగమంజరి, కల్యాణకల్పవల్లి, వెనీసు వర్తకచరిత్ర అను వానిని అనువదించుటయేగాక ప్రహ్లాద, హరిశ్చంద్ర, దక్షిణగోగ్రహణము నను స్వతంత్ర నాటకములనుగూడ రచించి, అంతకుముందే అరంభింపబడియున్న త్రివిధ నాటక రచనను పంతులుగారుకొనసాగించిరి.

ఇచటనే పేర్కొనదగిన నాటక కర్తలు మరికొందరు గలరు. 1880 లో గురుజాడ శ్రీరామమూర్తిగారు "మర్చంట్ అఫ్ వెనిస్" నాటకమును

1. 96. పే. 8. 88. పు. 175-179

గావించిరి. వీరు నాలుగు ప్రహసనములగూడ రచించిరి. కనుకనే ఆంధ్ర నాటక వాఙ్మయ చరిత్రమున వీరికొక ప్రత్యేక స్థానము కలదు.

ఇటనే 1896 లో 'మనోరమ' అను సాంఘిక నాటకము రచించి ప్రకటించిన అచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మగారిని పేర్కొనుట ఉచితము. 1929 లో ఆంధ్ర నాటక కళా పరిషత్స్థాపనలో వీరి పాత్ర గమనింపదగినది.

1860–1897 మధ్యకాలమున ఆంధ్ర దేశమున నాటక రచన ప్రయోగ ములు ఆరంభమైనవి; ఆ తరువాత అధిక వికాసమును గాంచినవి.

## 2.6 వికాస దశ (1897 - 1926) :

వికాస కాలమున ప్రప్రథముగా పేర్కొన దగిన వారిద్దరు నాటక కర్తలు. వారు వేదం వేంకటరాయశాస్త్రిగారు, గురజాడ వేంకట అప్పారావు గారు నమవారు 1897 వ సంవత్సరము ఆంధ్ర నాటక చరిత్రమున గుర్తింపదగినది ఈ సంవత్సరములోనే వేదంవారి 'ప్రతాప రుద్రీయ' నాటకము, గురజాడ వారి 'కన్యాశుల్క' నాటకము రెండును వెలువడినవి. ఈ నాటకముల ప్రకటనతో నాంధ్రలోకమున విమర్శకులలో అలజడి బయలుదేరి, వాదోప వాదములు తర్జన భర్జనలు జరిగినవి. వ్యావహారిక భాషకు కన్యా శుల్కము ప్రతినిధికాగా, పాత్రోచిత భాషకు ప్రతాపరుద్రీయము ప్రతినిధి యైనది. గురజాడ వారు అంతవరకు నెవరు నుపయోగింపని వ్యావహారిక భాషను కావ్య భాషగా వాడి, వ్యావహారిక భాషా బలమును, గొప్పదనమును ప్రకటించినారు. వేదం వారును సంస్కృత రూపకానుసారముగ నాటకము నందలి ఆ యా పాత్రలకు సముచిత భాషను వాడి దాని ప్రాముఖ్యమును ప్రక టించిరి. ఉత్తమ, మధ్యమ పాత్రలకు సంస్కృతమును, స్త్రీ నీచ పాత్రలకు ప్రాకృతమును వాడుట సంస్కృత రూపకముల సంప్రదాయము. ఈ పరిపాటి ననుసరించి, వేదం వారు ఉత్తమ మధ్యమ పాత్రలకు గ్రాంథిక భాషను, స్త్రీ నీచ పాత్రలకు వ్యావహారిక భాషను వాడి ప్రతాపరుద్రీయ నాటకమును రచించిరి. ఇంతకు ముందే (1891 లోనే) నాగానందమును సంస్కృతము నుండి అనువదించిరి. వీరు ఉష, బొబ్బిలి యుద్ధములను మరి రెండు స్వతంత్ర

నాటకములను గూడ రచించిరి. ఇంకను అభిజ్ఞాన శాకుంతలము, ప్రియదర్శిక, మాళవికాగ్నిమిత్రము, ఉత్తర రామచరితము, విక్రమోర్వశీయము, రత్నావళి అను సంస్కృత రూపకముల ననువదించిరి. సంఘ సంస్కరణ లక్ష్యముతో గురజాడవారు సున్నితమైన హాస్యమును జోడించి కన్యాశుల్క నాటకమును రచించిరి. వేదం వారి నాటకములలోను హాస్యమున కెక్కువ ప్రాధాన్యము కలదు. గురజాడ వారి గిరీశం, వేదంవారి పేరిగాడు మరపురాని పాత్రలు. వేదంవారి నాటకములు గద్య పద్యాత్మకములే అయినను - ధర్మవరం, కోలాచలం వారల నాటకములలో వలె గాకపోయినను - క్వచిత్తుగా గేయములును గలవు

అటు తరువాత ఆంధ్రనాటకరచన మరొకమలుపు తిరిగినది. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు ముప్పది నాటకములు [1] రచించి తమ వైశిష్ట్యమును ఆంధ్రనాటక వాఙ్మయమున నిలబెట్టుకొనిరి. 1900 సంవత్సరమున మొట్ట మొదటిసారిగ 'నర్మదాపురుకుత్సీయ'మను పౌరాణిక - నాటకమును రచించిరి. సారంగధర నాటకమును మోదాంతముగ రచించిరి. వీరి ప్రసిద్ధ నాటకములలో రాధాకృష్ణ, పాదుకాపట్టాభిషేకము, విప్రనారాయణ, కంఠాభరణము, ముఖ్యముగా పేర్కొనదగినవి. కంఠాభరణము కన్యాశుల్క నాటక ప్రభావముతో రచితము. ఇందులోను సంఘములోని దురాచారములను అవహేళన చేయుటయే ప్రధాన విషయము. వీరు చాలవరకు సంస్కృత నాటక లక్షణముల ననుసరించియే నాటక రచన గావించిరి. అనగా ధర్మవరం, కోలాచలంవారలవలె రంగ విభజనాదులను చేయలేదు. ఒక ప్రక్క వ్యావహారిక భాషావాదము, మరొకప్రక్క పాత్రోచితభాషా సిద్ధాంతము విరివిగా కొనసాగుచున్న సమయమున వీరు వ్యావహారికమునకు దగ్గరగా నున్న భాషనువాడి, రెంటిని సమన్వయించినట్లు తోచును. వీరు నాటకములందు వృత్తములను వాడరాదను సిద్ధాంతము కలవారు. వీరి నాటకములలో ఆటవెలది, తేటగీతి, కందము, సీసము ననునవి మాత్రమే సామాన్యముగా కాననగును. క్రమముగా వీనినిగూడ త్యజించి కేవలము వచన నాటకములను మాత్రమే రచించిరి. వీరు సహజముగా హాస్య ప్రియులు. వీరి నాటకములలో హాస్యమునకు కొరత యుండదు.

1. 50. పు. 38 - 40

ఇచటనే సుసర్ల అనంతరావుగారు, మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు, కోపల్లి వేంకటరమణారావుగారు, వల్లూరి బాపిరాజు గారు. సి. ఎస్. ఆర్. కృష్ణమ్మగారు, దాసు శ్రీరామకవిగారు, కాళ్ళకూరి సాంబశివరావుగారు, పి. శ్రీనివాసాచార్యులుగారు, గోమఠం శ్రీనివాసాచార్యులుగారు అను నాటకకర్తలు పేర్కొన దగినవారు.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు 31 నాటకములు రచించిరి. వానిలో ఇరువదొక్కటి ముద్రితములు. 1902లో ముద్రితమైన కలభాషిణి మొదటి నాటకము. వీరి నాటకములలో అధిక ప్రసిద్ధిగాంచినది బొబ్బిలియుద్ధము. శాస్త్రిగారిందు పాత్రోచితభాషనే ప్రయోగించిరి. 1916లో వీరు బొబ్బిలియుద్ధము నాటకపు పోటీలు నిర్వహించినారు.

ఆంధ్రదేశమును గ్రూత లూగించి, అశేషాంధ్ర ప్రజానీకపు మన్ననకు పాత్రములయినవి తిరుపతి వేంకటకవుల నాటకములు. వీరు 16 నాటకములు రచించిరి. వీనిలో స్వతంత్రములు, అనువాదములును గలవు. వీరి మొదటి నాటకము పండితరాజము 1900 ప్రాంతమున రచింపబడి 1909లో ముద్రితమైనది. వీరు భారతమును పూర్తిగా నాటకీకరించిరి. అందు పాండవోద్యోగ విజయములు ప్రదర్శనలో ప్రఖ్యాతి పొందినవి. వచన నాటకములు రచింపబడుట యుత్తమమని తలంపబడుచుండిన సమయమున వీరు తమ పద్యరచనా పాటవమును వ్యక్తముచేయుచు నాటకములందు పద్యములను గుప్పించిరి. గయోపాఖ్యానము తరువాత వీరి నాటకములలోని పద్యములనే విరివిగా ఆంధ్ర ప్రజలు పాడుకొన మొదలిడిరి. దీనివలన వీరి నాటకపద్యముల కెంత ప్రచారము కలిగినదో స్పష్టము కాకమానదు. పద్యముల అధిక్యముచే వీరి నాటకములు కేవల పద్యాత్మక నాటకములవలె గోచరించును. అయినను ఇప్పుడుగూడ ప్రదర్శింపబడుచున్న రంగస్థల నాటకములు వీరి పాండవోద్యోగ విజయములు మాత్రమే!

ఇక్కడ చెప్పదగిన నాటకకర్త బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారు. బలిజేపల్లి వారిపేరు చెప్పగనే వారి "హరిశ్చంద్ర నాటకము" స్ఫురించును వారి యితర నాటకములు బుద్ధిమతీ విలాసము, ఉత్తర రాఘవము, సాత్రాజితీయము అనునవి. కందుకూరి వారు, ధర్మవరం వారు, కోలాచలం వారు మున్నగు

వారు 'హరిశ్చంద్రనాటకము' రచించినప్పటికి బలిజేపల్లి వారి హరిశ్చంద్రకు వచ్చినంత ప్రఖ్యాతి మరియే యితరుల నాటకమునకు రాలేదనిన సత్యదూరము కాదు

ఇంకను జయంతి భావనారాయణగారు, సెట్టి లక్ష్మీనరసింహంగారు, ధర్మవరం గోపాలాచార్యులుగారు, ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారు, కాళ్ళకూరి నారాయణరావుగారు, శ్రీపాద కామేశ్వరరావుగారు, ముత్తరాజు సుబ్బారావు గారు, శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారు, పండిత కె. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, మల్లాది అచ్యుతరామశాస్త్రిగారు మున్నగు వారిని స్మరించుట ఉచితము.

తెలుగు నాటక వికాసకాలమున నాటకములలో రచనా వైవిధ్యముగూడ లేకపోలేదు. స్వతంత్రములు, చారిత్రములు, అనువాదములునని వివిధములుగా వెలసినవి. ప్రయోగ సౌలభ్యార్థము నాటకరచనా పద్ధతిలో మార్పులు రాసాగినవి. బందరులో నాటకపు పోటీలు, విమర్శలు ప్రారంభమైనవి. ఆంధ్ర నాటక పరిషత్తును స్థాపించి పురాణం సూరిశాస్త్రిగారు పోటీలను, విమర్శలను నిర్వహించిరి. దానితో నాటకరచన, ప్రదర్శనలపై అనేకులు తమతమ అభిప్రాయములు వెలువరించుచు తెలుగు నాటకమును, నాటక రంగమును అభివృద్ధి చేయుట కారంభించిరి. ఇదే సమయములోనే ఉత్తమ నటవతంసులు ఆంధ్ర దేశము నలుమూలలనుండి ప్రసిద్ధికి రాసాగిరి. నాటక రచన, ప్రదర్శనలపై విద్వాంసులలో విమర్శనాలేశము ప్రబలినది.

## 2. 7 రచనా వైవిధ్యము (1920—1944):

1920 సం. తరువాత తెలుగు నాటకరచనలోనేకాక భావవ్యక్తీకరణము, ప్రదర్శనము ననువానిలోగూడ ఎంతో వైవిధ్యము వెలసినది. నాటకరచనలో పెక్కు ప్రయోగములు వచ్చినవి. వానిని డా. పి. ఎస్. ఆర్. అప్పారావు గారిట్లు విభజించిరి. ''మొత్తముమీద ఈ ప్రయోగముల దశలను స్థూలముగా క్రింది విధముగా విభజింపవచ్చును. 1920—25 మధ్య దేశభక్తి పూరితములును, సంఘ సంస్కరణాత్మకములును అయిన రూపకములు వెలువడినవి. 1925—30 మధ్య రచనయందు ప్రయోగాత్మకములును, సాంఘికదురాచార

తిరస్కారాత్మకములును, అయిన రూపకములు వెలువడినవి. 1930—35 మధ్య రచయితల దృష్టి మరల కొంత సాంప్రదాయక మార్గము ననుసరించినది. 1935-40 మధ్య ఆంధ్ర సంస్కృతి నిరూపణాత్మకములయిన రూపకములు ను 1940-44 మధ్య అన్ని రకములయిన రూపకములును వెలువడినవి. ఇది కేవలము స్థూల విభజనము మాత్రమేయని మరువరాదు.''[1]

దేశభక్తి ప్రబోధ నాటకములను రచించిన వారిలో 'దామరాజు పుండరీకాక్షుడు గారు' ముఖ్యముగా పేర్కొన దగినవారు. గాంధీమహోదయము, గాంధీ విజయము, పాంచాలీ పరాజవము చెప్పదగినవి. శ్రీపాద వారి 'తిలకు మహారాజనాటకము' స్మరింపదగినది. ఇంక స్వాతంత్ర్యోద్యమమునకు సంబంధించి అనేక నాటకములు రచించిరి. చారిత్రక నాటకము లనేకములు వెలసినవి.

ఈ సమయములోనే సంఘ సంస్కారణాభిలాష అధికమై తదుచిత నాటకములు రచింపబడినవి. ఆయా నాటకకర్తల రచనా కాలమునుబట్టి వికాస కాలముననే పేర్కొనబడినప్పటికి మరల వారి రచనా వైవిధ్యమునుబట్టి కాళ్లకూరి నారాయణరావుగారు మున్నగు వారిని పేర్కొనకతీరదు. ప్రప్రథమముగా సంఘ సంస్కారణార్థము నాటకము రచించిన వారిలో నందక రాజ్యకర్త వావిలాలవారు, అధిక సంఖ్యలో నాటక ప్రహసనములు రచించినవారు కందుకూరి వారు ముఖ్యులు. అనుసరించిన వారిలో గురజాడవారు ప్రథమగణ్యులు. కోలాచలం వారిలోను సంఘ సంస్కారణాభిలాష కలదు. తరువాత పేర్కొన దగినవారు పానుగంటి వారు. ఆ వెనుక చెప్పదగిన వారు కాళ్ళకూరి నారాయణ రావుగారు. వీరి నాటకములు చింతామణి, మధుసేవ, వరవిక్రయముననునవి ముఖ్యములు. సోమరాజు రామానుజరావుగారి 'రంగూన్ రౌడి' పేర్కొన దగినది. సంఘమున పాతుకొనిపోయిన కుళ్ళును తుదముట్టతొలగించుటకై చేసిన ప్రయత్నమే వీనియందలి విషయము. ఎక్కువ ప్రజాదరణకివి నోచుకొన్నవి. వీనిలో పద్యముల సంఖ్యయు నధికమే. కాని నాటకకర్త ఉద్దేశించినట్లుకాక నీతికి బదులు అవినీతియే ప్రజలలో హత్తుకొని పోయినదని విమర్శకుల అభిప్రాయము.

---

1. 45. పు. 343

ఈ కాలమున సాహిత్యదృష్టితో రచించిన నాటకకర్తలలో దువ్వూరి రామిరెడ్డిగారు,విశ్వనాథ సత్యనారాయణగారు, చింతాదీక్షితులు ముఖ్యముగా చెప్పదగినవారు. సాంఘిక దురాచారముల తిరస్కారణోద్యమమునకు నాయకులు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు. తదుచిత నాటకములు వీరు రచించిరి. ముద్దు కృష్ణగారు, ఆమంచర్ల గోపాలరావుగారు, గుడిపాటి వేంకటచలంగారు ఈ కోవకు జెందిన నాటకకర్తలు ప్రదర్శన సౌలభ్యమునకై ప్రయోగములు చేసిన వారిలో కొప్పరపు సుబ్బారావుగారు, పింగళి నాగేంద్రరావుగారు మున్నగువారిని పేర్కొనవలెను. ఆంధ్రోద్యమ సమస్యపై గ్రంథి వేంకట సుబ్బారాయగుప్తగారు,హనుమంతరావుగారు మున్నగువారు నాటకములు రచించిరి.

ఇంకను ఈ కాలమున ఆంధ్ర నాటకరచనమున అనేకరీతులు వెలసినవి. ఆంగ్ల వాఙ్మయములోవి ఇబ్సన్, గాల్స్‌వర్దీ మున్నగు వారి ప్రభావము ఒక ప్రక్క, జాతియోద్యమా వశ్యకము మరొక ప్రక్క ప్రజలలో నధికమగు చుండుటచే అనేక రచనా పద్ధతులు తలసూపినవి. వ్యావహారికభాష ప్రాధాన్యమును వహించినది. కేవల వచన నాటకముల కాధిక్యము కలిగినది. జాతీయ భావములు వెల్లివిరియు నాటకములు రచింపబడుచు వచ్చినవి. సాంఘిక జీవిత విశేషములను వ్యక్తముచేయు నాటకములు వచ్చినవి అట్టి వానిలో ప్రథమ ప్రదర్శనముతోనే ఆంధ్రుల నాకర్షించినది పి.వి రాజమన్నారుగారి "తప్పెవరిది" నాటకము. క్రమముగా సంఘమున వివిధములయిన మార్పులు రాసాగినవి. మానవజీవితము యాంత్రికముగా మారినది. మానవునికో నెట్టిక్లేశములేక సుఖమును పొందవలెననెడి ఆసక్తి అధికమైనది. కనుకనే చిన్నచిన్న రచనల కత్యధిక ప్రాముఖ్యము కలిగినది. అందుచే ఖండకావ్యములు కథానికలు, నవలికలు వెలసినట్లే నాటికలు, ఏకాంకికలు రచింపబడజొచ్చినవి. ప్రథమదశలో ఏకాంకికలు రచించిన వారిలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, భమిడిపాటి కామేశ్వరరావుగారు, ముద్దు కృష్ణగారు, పాకాల వేంకట రాజమన్నారుగారు, చింతా దీక్షితులుగారు. గుడిపాటి వేంకటచలంగారు, బుచ్చిబాబుగారు, పాలగుమ్మి పద్మరాజుగారు, నార్లవారు మున్నగువారు పేర్కొనదగినవారు. ఈ కాలమున ముఖ్యముగా 1929 లో

స్థాపింపబడిన ఆంధ్రనాటక కళా పరిషత్తు నాటకరచన, ప్రదర్శనములలోనే గాక అన్ని విధముల ప్రోత్సాహము కలిగించుచు వచ్చినది.

## 2. 8 అద్యతన కాలము 1944 నుండి నేటి వరకు):

నాటకరచనా వైవిధ్యకాలమున వెలసిన వివిధ నాటకములు, నాటికలును ఈ అద్యతన కాలముననుగలవు. వీనికి తోడు స్వభావ వాదమందు ప్రాధాన్యమును వహించినది. సంప్రదాయ బద్ధములయిన రచనలతోపాటు మనస్తత్వ నిరూపక నాటకములు వెలసినవి. ప్రతీక నాటక, నాటికలు వచ్చినవి. సాంఘిక, చారిత్రకేతి వృత్తములతో నాటకములు రచింపబడినవి

ప్రదర్శనలోను ఎంతో మార్పు వచ్చినది. చలనచిత్ర పరిశ్రమ ప్రభావముచే నాటక ప్రదర్శనము దెబ్బతిని పోయినది. నటులు, ప్రేక్షకులు కూడ చలనచిత్రముల కెగబడ జొచ్చిరి. పూర్వ నాటకములు ఈ కాలపు ప్రదర్శన కుపయుక్తముగా లేకుండుటచే నూతన నాటక, నాటికలు రచితములయినవి. ఆంగ్లనాటక ప్రభావముచే స్వభావవాదముతో పాత్రల మనస్తత్వ చిత్రీకరణము ప్రాధాన్యము వహించినది. తదుచిత రీతిని ప్రదర్శనలో మార్పురాక తప్పినది కాదు. ప్రదర్శనలు కేవలము ఔత్సాహికులకే పరిమితమైనవి.

ఆచార్య ఆత్రేయగారి ఎన్.జీ.వో., లేక 'గుమాస్తా' అను నాటకము ఈ కాలమున ప్రప్రథమముగా పేర్కొనదగినది. మధ్యతరగతి గుమాస్తా కష్టనిష్ఠురములిందు చిత్రితములు. కొండముది గోపాలరాయశర్మగారు, అనిశెట్టి పినిశెట్టిగార్లు, ధనికొండ బెల్లంకొండగార్లు, సుంకర వాసిరెడ్డిగార్లు, బోయి భీమన్నగారు, కొడాలిగారు, కొర్రపాటిగారు, కె. ఎల్. నరసింహారావుగారు, చిల్లర భావనారాయణగారు, డి.వి. నరసరాజుగారు, పడాలగారు, త్రిపురనేని గోపీచంద్‌గారు, వార్లవారు, సోమంచి యజ్ఞన్నశాస్త్రిగారు, భమిడిపాటి రాధాకృష్ణగారు—ఇంక ననేకులు నాటక, నాటికలను ఎక్కువగ రచించి అద్యతన కాలమున తెలుగు నాటకవాఙ్మయమునకు పుష్టిని తుష్టిని కలిగించిరి. 'రేడియో' ప్రభావముతో 'రేడియో నాటికలు' వివిధ రూపములతో వెలువడ నారంభించి

నవి. గేయ, పద్య, సంగీత, నాటికలు రాసాగినవి. ఇట్లెన్ని పద్ధతులలో నాటకములు, నాటికలు రచింప వీలగునో అన్ని పోకడలు తెలుగున నేడు చూడవచ్చును. కాని చలనచిత్ర పరిశ్రమవలన గాని, సంఘమున వచ్చిన వివిధ విధములయిన మార్పులవలన గాని, మానసిక దృక్పథభేదము చేతగాని పైని విదితమైనట్లు వికాసకాలమునందలి తెలుగు నాటకరంగమువలె మూడుపూవు లారుకాయలుగా అభివృద్ధి చెందుటగాని, అందాసక్తిగాని ఈనాడు లేకపోవుట వాస్తవము. అయినను రచనలోను, ప్రదర్శన సౌలభ్యములోను అభివృద్ధిని సంపాదించిన మాటమాత్రము నిజము. కాని తెలుగు నాటక రంగపునరుద్ధరణావశ్యకము మాత్రము అధికముగా గలదు.



# 3. వివిధరచనలు - వర్గీకరణము

## 3.1 నాటకముల సంఖ్య :

శ్రీనివాసరావుగారు ఉత్తమ రసవన్నాటక నిర్మాణముతోపాటు ఆంగ్లమున ప్రపంచ నాటక చరిత్ర (The Dramatic History of the World) రచన, సంస్కృతాగస్త్య బాలభారతాంధ్రీకరణము, వివిధ విషయముల గూర్చి అనేక వచన రచనలు గావించి తమ బహుముఖ ప్రతిభా పాండిత్యములను ప్రకటించినారు. శ్రీనివాసరావుగారు రచించిన నాటకముల సంఖ్య విషయములో కొన్ని అభిప్రాయ భేదములున్నవి. కాబట్టి వీరి రచనల కాలక్రమమును గుర్తించుటకు ముందు వీరి నాటకముల సంఖ్యను నిర్ణయించుట అవసరము. కోలాచలం శ్రీనివాసరావుగారే "నాచే నిప్పటికి రచింపబడిన ముప్పది నాటకములలో నెనిమిది నాటకములు చారిత్రక నాటకములున్నవి." అని తెల్పియున్నారు.[1] శ్రీమాన్ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు ముప్పది కెక్కువగానే కోలాచలం వారు నాటకములు రచించినట్లు "కావున ఇరువురు (ధర్మవరం, కోలాచలం వారు)ను చెరి సుమారు ముప్పదింటికి మించి వివిధ రూపకములను రచించుటయేకాక ప్రత్యేకముగా 'సరసవినోదిని', 'సుమనోరమ'యను రెండు నాటకసంఘములను స్థాపించి విద్యావంతులగు నటులను చేర్చుకొని యా నాటకముల నభినయింపఁజేసిరి." అని నుడివి యున్నారు.[2] 'నాట్యాంబుజ' కర్తపురాణం సూరిశాస్త్రిగారుగాని, 'ఆంధ్ర నట ప్రకాశికా' రచయిత పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రిగారుగాని, విజ్ఞాన సర్వస్వములో కోలాచలంవారినిగూర్చి వ్రాసిన నిడదవోలు వేంకటరావుగారుగాని కోలాచలంవారి నాటకముల సంఖ్యను తెలుపలేదు. అందులో నిడదవోలువారు కోలాచలంవారి ఐదు నాటకములను మాత్రమే పేర్కొనిరి. మైగా రామరాజు, విజయనగర పతనము అను వానిని

---

1. 108 పి పు. 4

2. 8 పు. 40, 41

రెండు వేర్వేరు నాటకములుగ తెలిపిరి.[1] 'ఆంధ్రనాటక కర్తలు'లో కప్పగల్లు సంజీవమూర్తిరావుగారు కోలాచలం శ్రీనివాసరావుగారినిగూర్చి వ్రాసిన వ్యాసము ననుసరించి కోలాచలంవారి నాటకములు ఇరువదెనిమిదని స్పష్టమైనది.[2] కాని వారు శిరోమణి నాటకమునకుఐదులు భారతయుద్ధము లేక ధర్మవిజయమును పేర్కొనిరి. శిరోమణికివి నామాంతరములు. రాక్షసీమహత్వాకాంక్ష, మానవ పిశాచమునని రెండువేర్వేరు నాటకములుగా చెప్పుట పొరపాటు. రాక్షసీ మహత్వాకాంక్షకే మానవ పిశాచమనునది నామాంతరము. ఇంతేగాక గిరిజా కల్యాణము పేర్కొనబడలేదు. వారు కోలాచలంవారి 'అదారమ్మన ప్రహసనవు' (కన్నడము), నాచిపార్టి, అన్యాయ ధర్మపురీమహిమ అను ప్రహసములను గూడ పేర్కొన్నారు. వై. సీతారామశర్మగారు కోలాచలంవారిని గూర్చి వ్రాయుచు ఇరువదెనిమిది నాటకములు రచించిరనిచెప్పి ఇరువదితొమ్మిది నాటకముల పేర్లు పేర్కొనిరి.[3] కానికప్పగల్లువారి వలెనే వీరును గిరిజాకల్యాణమును పేర్కొనక వదలి, ధర్మవిజయము లేక భారత ధర్మయుద్ధము, శిరోమణులను, మానవ పిశాచము, రాక్షసీ మహత్వాకాంక్షలను వేర్వేరు నాటకములుగా పేర్కొనిరి. దీనినిబట్టి వీరు కప్పగల్లువారి ననుసరించినట్లు తెలియును. వీరును పైమూడు ప్రహసనములను పేర్కొనిరి. శ్రీనివాస చక్రవర్తిగారు కోలాచలం వారి నాటకములను వర్గీకరించి మొత్తము ముప్పది నాటకములు రచించినట్లు తెలిపిరి.[4] కాని వీరుగూడపైవారి వలెనే భారత ధర్మయుద్ధము, శిరోమణులను మానవ పిశాచము, రాక్షసీ మహత్వాకాంక్షలను వేర్వేరునాటకములుగా పేర్కొనిరి. గిరిజాకల్యాణమును వీరు పేర్కొనిరి. ఇంతేగాక 'ఆంధ్ర నాటక దర్శిని'లో వీరు కోలాచలంవారి ఇరువదియైదు నాటకములనుగూర్చి మాత్రమే వివరించియున్నారు.[5] అందులోవారు చంద్రహాస, రాక్షసీమహత్వాకాంక్ష యువతీ వివాహములనుగూర్చి తెలుపలేదు. వీరుగూడ మూడు ప్రహసనములను పేర్కొనిరి. డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు తమపరిశోధనా వ్యాసము నందు "శ్రీనివాసరావుగారు మొత్తము ముప్పది నాటకముల వరకును రచించి నారు" అని వివిధ నాటకములను తెలిపిరి.[6] వీరును పైవారి వలెనే శిరోమణి,

1. 184 పు. 65 2. 21 పు. 17-35
3. 189. (అక్టోబరు 1964) పు. 57-60 4. 42 పు. 42-50
5. 31 6. 45. పు. 262, 295, 296.

ధర్మవిజయము (భారతయుద్ధము)లను, మానవ పిశాచము, రాక్షసీమహత్వా కాంక్షలను వేర్వేరు నాటకములుగా పేర్కొనిరి. వీరును మూడు ప్రహసనము లను పేర్కొనిరి.

'ఆంధ్ర నాటక కళ' (Andhra Dramatic Art) అను గ్రంథమున శిష్టా రామకృష్ణశాస్త్రిగారు కోలాచలం శ్రీనివాసరావుగారి నాటకములను ఇరువదైదింటిని మాత్రము పేర్కొనిరి[1]. వానిలో 'రోషనార' చారిత్రక నాట కము శ్రీనివాసరావుగారిదని తెలిపియున్నారు. అది ధర్మవరం రామకృష్ణ మాచార్యుల నాటకముగాని కోలాచలంవారిది గాదు. ఇది ఒక పొరపాటు. కోలాచలంవారి ప్రసిద్ధ నాటకము 'రామరాజు చరిత్రము' లేక 'కర్ణాటక రాజ్య వినాశము' లేక 'విజయనగర వినాశము' (The Fall of Vijayanagar) అని యుండగా వీరు దీనిని 'రామరాజ్య పతనము'అని పొరపాటుగా పేర్కొనిరి. కోలాచలంవారి తొలిమలి రచనలైన సునందనీ పరిణయము, సుఖమంజరీ పరిణయము అను వానిని, కుశలవ నాటకమును పేర్కొననే లేదు.

ఇట్లు కోలాచలంవారి నాటకములను పేర్కొన్నవారిలో తబ్బిబ్బులు కలవు. కాగా వైవిధ్యపరిశీలన వలన కోలాచలంవారు రచించిన నాటకముల సంఖ్య ఇరువదెనిమది అని తేలుచున్నది. అందులో శిరోమణి, రాక్షసీ మహత్వా కాంక్ష అనెడి రెండునాటకముల విషయమున పొరపాటు జరిగినది శిరోమణి నాటకముఖపత్రమున 'The Siromani Natakam or Dharma Vijayam' అని ఆంగ్లమున ముద్రింపబడినది. దీనికే భారత ధర్మయుద్ధమనియు నామాంత రము. అట్లే రాక్షసీ మహత్వాకాంక్షకు మానవ పిశాచమని మరొక పేరు. ఈ విధముగా కోలాచలంవారి నాటకములలో కొన్నింటికి నామద్వయముండుట అసహజముకాదు. వీరి ప్రథమ నాటకము 'సునందనీ పరిణయము'నకు 'దురాశాభంగ'మనునది నామాంతరము. వీరి ప్రసిద్ధ నాటకము 'రామరాజు చరిత్రమునకు 'కర్ణాటక రాజ్యనాశనము', 'విజయనగర రాజ్యనాశనము' -అను నవి నామాంతరములు. కాగా నిది 'The Fall of Vijayanagar' అను ఆంగ్లనామముతోనే ప్రసిద్ధి కెక్కినది. 'ప్రహ్లాద'కు 'దానవ వధ' 'చంద్ర గిర్యభ్యుదయము'నకు 'ఏచమనీడు', 'కీచకవధ'కు 'సైరంధ్రి', 'బభ్రువాహన'

1. 54. పు. 188,

కు 'అర్జున గర్వభంజనము' అను నామాంతరములు గలవు. కనుక ఈ పద్ధతి ననుసరించి శిరోమణి, రాక్షసీ మహత్వాకాంక్ష అనునవిరెండే నాటకములు వానికి నామాంతరములు కలవు. అందువలన కోలాచలంవారి నాటకములు ఇరువదెనిమిది మాత్రమని స్పష్టముగా తెలిసినది. ఇందుకు ఆ యా నాటకము లందు ప్రకటించిన ప్రకటన లుపకరించును. శ్రీనివాసరావుగారి మరణా నంతరము వారి కుమారుడు శత్రుఘ్నరావుగారు ఐదారుమార్లు ముద్రింపించినట్లు తెలియును.

1920—21 సంవత్సరములలో ముద్రితమైన నాటకములందలి ప్రకటన లలో కోలాచలంవారి ఇతర రచనలతోపాటు ఇరువదెనిమిది నాటకములు పేర్కొనబడినవి. అందులో ప్రహసనములు నాలుగు ప్రకటింపబడినవి, సమయమునకు భార్య అనునది అదనముగాకలదు. 1923లోని ప్రకటనకూను నట్లే కలదు. కాని సమయమునకు భార్య పేర్కొనబడలేదు. 1925లోని ప్రకటనలో కొంత భేదముకలదు. ఇందు మొత్తము ఇరువదెనిమిది నాటకములు గలవు కాని శిలాదిత్య నాటకములు రెండుగా పేర్కొనబడి సునందనీ పరిణ యము విడువబడినది శిరోమణికిమారుగా భారత యుద్ధము లేక ధర్మవిజయము గ్రహితము. కొన్ని నాటకముల చివరిముద్రణ 1926లో జరిగినది. ఇందులో 1920—21లో వలెనే ఇరువదెనిమిది నాటకము లివ్వబడినవి. కాని రాక్షసీ మహత్వాకాంక్షకుబదులు మానవ పిశాచము పేర్కొనబడినది. ప్రహసనములు మూడుమాత్రమే కలవు మొత్తముమీద కోలాచలంవారు ఇరువదెమిది నాటక ములు రచించిరనుట ఉచితము. అయినచో కోలాచలంవారే తమ పాదుకా పట్టాభిషేక నాటకపీఠికలో తాము ముప్పదినాటకములు రచించినట్లు చెప్పికొనుట లోని ఆంతర్యమేమి అన్నది ప్రశ్న. ఇది వారు ఉజ్జాయింపుగా చెప్పినమాట అనుటకు వీలులేదు. కారణము వారువ్రాసిన నాటకములే వారికి జ్ఞాపకముండ వనుట ఉచితము కాదు. సునందనీ పరిణయ నాటకము వ్రాయకపూర్వము శ్రీనివాసరావుగారు వైజయంతీ విలాసమను నాటకమును వచనములో నాలుగా శ్వాసములు రచించినట్లు మనకు తెలియును.[1] ఇట్టిదే మరొకటి ఏదైన అసంపూర్ణ రచనయుండి యుండవచ్చునేమో తెలియదు. వానిని మనసునందుంచుకొని రావుగారు తమ నాటకములు ముప్పది అని చెప్పియుందురా? చెప్పలేము.

1. 68. పీ. పు. 1.

లేదా వారు వ్రాసిన ప్రహసనములను కలుపుకొని - ప్రహసనము దశరూపకములలో నొకటి గనుక - ముప్పది నాటకములని యుందురా ? ఇందు కవకాశము గలదు. వారి నాలుగు ప్రహసనములలో మొదటిది 'ఆదారమ్మన ప్రహసవు' కన్నడ భాషలోనిది. ఇదిగాక తెలుగు ప్రహసనములు మూడు. ఇందులో అన్యాయ ధర్మపురి మహిమ, నాచిపార్టి అన్నవి రెండు ప్రాధాన్యమును వహించినవి. సమయమునకు భార్య అన్నది ఒక్కచోటమాత్రమే పేర్కొనబడినది. అంతేగాక కోలాచలంవారి తృతీయ పుత్రుడు కోలాచలం జయరత్నంగారి 'పరిచయము'లో 'సమయమునకు భార్య'అను ప్రహసనమునుగూర్చి వారికేమి తెలియదన్నారు. అదిగాక 'పాదుకా పట్టాభిషేక నాటక' రచనానంతరము కోలాచలంవారు పై ప్రహసనము రచించియుండవచ్చును కనుక నాచిపార్టి, అన్యాయ ధర్మపురి మహిములను కలుపుకొని వారి నాటకములు ముప్పది అని చెప్పనగును కాని వారి అచ్చమైన నాటకములు ఇరువదెనిమిది అనుటలో ఏ విధమైన సందేహమునకు తావుండనక్కరలేదు.

## 3. 2 రచనాకాల నిర్ణయమునకు మార్గములు :

ఇట్లు రచితములైన వీరి నాటకముల, ఇతర రచనల, రచనాకాలమును తెలిసికొనుటకు ప్రయత్నింతము. వీరి నాటకముల పౌర్వాపర్యము నిర్ణయించుట కొంత వరకు కష్టసాధ్యమైన పని. కాని ఇందుకు నాటక పీఠికలు, నాటక ప్రచురణ సంవత్సరములు, నాటక రచనాపద్ధతి - అనునవి ఉపకరించును. కోలాచలం శ్రీనివాసరావుగారు జీవించియుండగా ఏడు నాటకములు మాత్రము ముద్రితములు. తక్కినవన్నియు వారి మరణానంతరము శత్రుఘ్నరావు గారిచే ప్రచురింపబడినవి. ఆ యా నాటకముల ముద్రణకాలమునుబట్టి నాటకముల పౌర్వాపర్యము నిర్ణయించుటకు వీలులేదు. అనగా అనుపూర్విగా - వరుస క్రమమున ఆ నాటకములు ముద్రింపబడక పోవుటయే యిందుకు కారణము. కనుక నాటక ముద్రణ సంవత్సరములు మనకంతగా నుపయోగపడవు. ఇక మిగిలిన నాటక పీఠికలు, నాటక రచనాపద్ధతి అనునవి రెండును ప్రధాన మార్గములు. ఇతివృత్తము, నాంది ప్రస్తావన, భరతవాక్యము, పాటలు, పద్యములు, భాష - అనునవి రచనాపద్ధతిలో చేరును. కాని మరొక బాధకూడ

కలదు. కోలాచలంవారు వ్రాసిన నాటకముల కన్నింటికి పీఠికలు వ్రాసినట్లు లేదు. ఉన్న వానిని కొన్నింటిలో తొలగించినట్లుగూడ కలదు. 'సునందనీ పరిణయము' నాలుగవ ముద్రణమున పీఠికతొలగింపబడి, పండితాభిప్రాయములు ముద్రింపబడినవి. అయినను కొన్నింటిలోగల నాటక పీఠికలు, రచనాపద్ధతి యను రెంటిని ఆధారముగా చేసికొని కోలాచలంవారి నాటకముల రచనా కాలమును నిర్ణయింప వీలుకలదు. వీనికి సమకాలిక విమర్శలు, అభిప్రాయములు నుపకరించును.

## 3.3.1. వివిధ నాటక రచనా కాల నిర్ణయము :

కోలాచలం వారు రచించిన ఇరువదెనిమిది నాటకములలో సునందనీ పరియణము మొట్టమొదటి నాటకము. కాని వీరు దానికంటె ముందే వైజయంతీ విలాసమను నాటకము వ్రాసినట్లు తెలియుచున్నది. "1889 వ సంవత్సరమునందు బల్లారి వైతోచు దొరతనపుఁ గొలువునకు సెలవిచ్చి ప్లీడరు పరీక్షలోఁ గడతేఱి, 1892 వ సంవత్సరమునందుఁ బలువుఅకొలువు నవలంబించితి. అప్పుడించుక యవకాశము గలిగినను, శరీరాయాసంబు లేదనకపుడపుడు పొడసూపుచుండె. అట్టి జాడ్య పీడనంబున నుండిన తఱియే గ్రంథంబులఁ జదువ నా కవకాశంబు గలుగుచుండె. అట్టి కాలంబునవే వైజయంతీ విలాసంబను నాటకంబు నాలుగా శ్వాసంబుల వచన రూపంబుగ లిఖించితి". [1] కాని వైయంతీ విలాసమసంపూర్ణ రచన, ముద్రణకు నోచుకోలేదు. అలభ్యము; నాటక విభాగము నంకమనుటకు బదులు వీరాశ్వాసమని పేర్కొనిరి. కనుక 'సునందనీ పరిణయమే' ప్రథమ నాటక మనుట నిర్వివాదాంశము. శ్రీనివాసరావుగారీ నాటక మెప్పుడు వ్రాసినది పీఠికలో గాని, మరెక్కడగాని చెప్పలేదు. డా. పి. ఎస్ ఆర్. అప్పారావుగారు "వారి (కోలాచలం శ్రీనివాసరావుగారి) తొలి నాటకము 'సుందనీ పరిణయము' 1894 - 95 ప్రాంతముల ప్రకటితమైన"దని తెలిపిరి[2]. పూండ్ల రామకృష్ణయ్యగారు తమ పత్రికలో 'సునందనీ పరిణయ' నాటకమును అగస్టు 1895 లో సమీక్షించినారు. [3] వీనిని బట్టి

1. 98 పీ. పు. 1.    2. 45 పు. 262.

3. 185 (అగ. 1895) పు, 74, 75.

ఈ నాటక రచన 1894 సంవత్సరమునకు ముందే జరిగి యుండవలయును. ఇందుకు తగిన యాధారము గూడ కలదు. 'సునందనీ పరిణయము' నాటకము నాల్గవ ముద్రణ [1] యందు సునందనీ పరిణయ నాటకముపై వచ్చిన పండితుల అభిప్రాయములు పొందుపరుపబడియున్నవి. అందులో మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు శ్రీనివాసరావుగారిని, సునందనీ పరిణయ నాటకమును ప్రశంసించుచు నలువది పాదముల శార్దూల మాలిక వ్రాసిపంపినారు. ఆ మాలికలో వారు పంపిన తేదీని గూడ కనపరచిరి.

"శ్రీభవ్యుండగు మల్లినాథ కవి కీర్తింజెందె నే వంశ మం
దాభద్రంబగు వంశమందు జనితుండై కీర్తి భూభాగమున్
ద్యోభాగంబును నిండుచుండఁ దగు సత్కోలాచల శ్రీనివా
సాభిఖ్యార్యుఁడనల్ప కల్పిత కళాత్యంతాద్భుతంబౌ దురా
శాభంగాఖ్య సునందనీ పరిణయాంచన్నాటకం బిద్ధమై
శోభిల్లంగ నొనర్చి ముద్రితముగా సొంపొందఁగాఁజేసి శ్రీ
సౌభాగ్యోన్నతిఁ గన్న చెన్నపురిలో సంధిల్లి భావంబులే
కీభావం బెనయంగ సంతసిలి తత్కృత్యుత్తమం బిచ్చె...
.............................................
శ్రీ భాషాగిరిజేశు లిట్టి కృతులే చేయింత్రుగాకంచు దు
గ్గాభర్గాశ్రిత మండ పాకకుల జాగ్రత్పార్వతీశాగ్రజుం
డీ భాస్వన్మదనాబ్ది భాద్రపద మందీ పద్యముం పెందమిన్" 2

ఇందు 'భాస్వన్మదనాబ్ది భాద్రపదమందు' తమ అభిప్రాయము పంపించినట్లు తెలియును. మదనాబ్ది మనగా మన్మథ నామ సంవత్సరము. 'మన్మథ నామ సంవత్సరము, భాద్రపద మాసము' అని తేలినది. ఆ మన్మథ నామ సంవత్సరము నుండి ఈ విరోధి కృన్నామ సంవత్సరము వరకు లెక్కింపగా డెబ్బది ఆరు సంవత్సరములు గడచినట్లు స్పష్టమైనది. దీని సమన్వయము వలన మన్మథ నామ సంవత్సర భాద్రపద మాసమునకు సరియైన ఇంగ్లీషు తేదీ 1895 వ సంవత్సరము అగస్టు, సెప్టెంబరు, నెలలుగా తెలిసినది. అనగా

1. 98 2. 98. పు. 9-11.

మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు 1895 వ సంవత్సరము ఆగస్టు, సెప్టెంబరు నెలలలో పంపి నారు. దీనిచేత 'సునందనీ పరిణయ' నాటకము అంతకుముందే ముద్రింపబడి ప్రకటింపబడినది. 1895 లో ప్రథమ ముద్రణము నొందినట్లును తెలియుచున్నది. [1] కాబట్టి 'సునందనీ పరిణయ' నాటక రచనా కాలము 1892-93 అయి యుండునని ఊహింపవచ్చును. దీనికి కోలాచలం వారి సునందనీ పరిణయ పీఠికలో చెప్పిన విషయములును సరిపోవుచున్నవి. ఇంతేగాక కోలాచలం వారు 'సునందనీ పరిణయ' నాటకము రచించెడి కాలమున వీరికి జన్మించిన పుత్రికకు సునందనమ్మ అని నామకరణము కావించిరట. వీరి పుత్రిక సునందనమ్మ 1892-93 ప్రాంతములలో జన్మించి యుండును. కనుక కోలాచలం వారి ప్రథమ నాటకము సునందనీ పరిణయ రచనా కాలము 1892-93 అని తలంపవచ్చును.

3.3 2 'సునందనీ పరిణయ' నాటకము తరువాత కోలాచలం వారు 'సుఖమంజరీ పరిణయము' రచించినట్లు సుఖమంజరీ పరిణయ నాటక పీఠిక వలన దెలియును. "ఈ సుఖమంజరీ నాటకము సునందనీ నాటకంబు బలె నవీనమేను."[2] ఈ పీఠిక రచనా కాలము '20 డిశంబరు, 1895' అని కలదు. ఇది నాటక రచనా కాలమగునో కాదో తెలియదు కాని అంతకు పూర్వమే ఈ నాటకము రచింపబడియుండు ననుట సత్యము. తరువాత మదాలస నాటకము రచితమైనట్లు తెలియును. ఈ నాటక పీఠికలో "ఇంతకు మున్ను నాచే రచియింపఁబడిన 'సునందనీ, సుఖమంజరీ' నాటకంబులు గేవల నూతనంబుగా నుండుటచే మదీయాప్తులొకరు పౌరాణిక కథ నొకటి నాటక రూపంబుగాఁ జేయుమని నాకు హితముపదేశించిరి." [3] అని యున్నది. "ఇది వరలో 'సునందని, సుఖమంజరి యను నాటకంబులు సేసిన కవి" అని సూత్రధారుడు ప్రస్తావనలో నటికి సమాధాన మిచ్చును. [4] వీరి నాలుగవ నాటకము 'సీమంతిని'. ఈ నాటక ప్రస్తావనలో ఈ రచనా క్రమము స్పష్టము గాగలదు. నటితో సూత్రధారుడు చెప్పిన పద్యము రత్నావళీ వృత్తము.

---

1. 175
2. 109 పీ. పు. 4
3. 120 పీ. పు. 3
4. 120 ప్ర. పు. 6

"అమర సునందని సుఖమంజరియు మదాలసయు ననెడి నాటకము ల్
సుమముఖ్యములుగ సుముఖుల కొసఁగెను సుకృతి యెతఁడతఁడె సుధివసుధా
సుమనోమణి కోలాచల వంశజ సుందరమణి, శ్రీనివాస రా
వమర సుతము సీమంతిని నాటకమునుసీయమృత ఫలంబిపుడిచ్చెన్ " [1]

'సీమంతినీ' నాటక పీఠిక రచించిన తేదీ 27-6-1899. కాని నాటక రచన అంతకు పూర్వమే జరిగి యుండవలెను. ఇక మదాలసా నాటక పీఠికలో తారీఖు కనపరచలేదు. అనగా 1895 - 1899 సంవత్సరముల మధ్య కాలమున 'మదాలస' రచింపబడియుండును. మదాలసా నాటకమును కోలాచలం శ్రీనివాసరావుగారు ముద్రింపించి ప్రకటించిన తరువాత జనవరి, 1897 లో పంపగా, దానిని పూండ్ల రామకృష్ణయ్యగారు జూన్ 1897 నాటి తమ పత్రికలో "బళ్ళారిజిల్లా మునసబు కోర్టు ప్లీడరగు మహారాజరాజ శ్రీ బ్రహ్మశ్రీ కోలాచలం శ్రీనివాసరావు గారిచే విరచితమైన మదాలసా నాటకమభిప్రాయమునకై గ్రంథకర్తగారిచే 21-1-1897 మా కార్యస్థానమునకు బంపఁబడినందున దానిని గృతజ్ఞతతోఁ గైకొని సాంతముగఁ బఠించితిమి" అని ప్రారంభించి విమర్శించిరి. [2] దీనినిబట్టి మదాలసా నాటకము 21-1-1897 కంటె ముందే ముద్రితమై యుండవలెను. కనుక ఈ నాటక రచనా కాలము 1895 - 1896 కావచ్చునని మనము తలంప వీలగును. పైని నిరూపించిన అభిప్రాయముల పరిపోషకముగ ఆ యా నాటక రచనా పద్ధతియు కలదు.

3.3.3. అటు పిమ్మట కోలాచలంవారు రచించిన నాటకముల క్రమము సత్యహరిశ్చంద్రీయ నాటకోపోద్ఘాతము వలన వ్యక్తమగును. "నే నింతకు మున్ను ముద్రింపించి ప్రచురించిన నాటకములలో 'సునందని' స్వకపోల కల్పితముగను, 'సుఖమంజరి' చరిత్రాంశముగను, 'మదాలస, సీమంతిని' పౌరాణిక కథలుగ నున్నవి. కేవల పౌరాణిక కథలు నాటకములుగఁ బన్నుటయందు గ్రంథకర్తకు నితివృత్త కల్పనా కష్టంబేమియు నుండదనియును, జనసామాన్యమునకుఁ జరిత్రాంశములు బొత్తిగఁ దెలియవు గావున, నవి నాటకంబులుగ వ్రాయుటచే నితివృత్త కల్పనా చమత్కృతి నగపఱచుటయగాక, జనులకుఁ

1. 119 ప్ర. పు. 10 2. 135 (జూన్, 1897) పు. 52-56

ఊరి(త్రాంశములు బోధింప నగునని యెంచి, తురుష్కులలో గొప్ప రాణి యని ప్రసిద్ధికి నెక్కి, 'అహమ్మదునగరు' రాజ్యము నేలిన 'సుల్తానా చాందుబీ' యను నామె చరితంబు నాటక రూపంబున వ్రాసితి. ఈ పురి నుండు 'సుమనోరమ సభ' వారు దానినిఁ జక్కఁగ ప్రదర్శించిరి మరల 'విజయనగర నాశనము' అని పేరిడి తాళికోట యుద్ధమును, పార్థియన్‌లు సింధు నది దాటి, మనదేశము ప్రవేశించి యప్పటికి గొప్ప పట్టణమని పేరందిన ఖలహారి నగరమును బాడొనరించిన విజయమును దెలుపు 'శిలాదిత్య' నాటకమును, తాళికోట యుద్ధమైన పిదప మైసూరు రాజ్య మరాజకమై క్షీణించుతఱిని మరల దాని నుద్ధరించిన యదురాయ యొడయరు' చరిత్రమును దెలుపు 'మైసూరు రాజ్యాభివృద్ధి' యను నాటకమును వ్రాసితి. నా మిత్రులు కొందఱు నన్నుఁ జేరి పురాణసంబంధములైన కథలు మఱికొన్ని వ్రాయుమని నన్నడిగిరి. నా మానసంబున కది యిష్టంబుగాక యున్నను మిత్రుల మనోభీష్టంబు వ్యర్థపరచుట యుక్తము గాదని యెంచి, భారతములోని ముఖ్యాంశము లన్నియు వెల్లడి యగు రీతి 'శిరోమణి నాటక' మని పేరిడి యశ్వత్థామ శిరోరత్నమును దీయునంతవఱకు నొక నాటకంబు వ్రాసితి. అందున భగవద్గీతాంశములు విశేష భాగముఁ జేర్చితిని. మరల 'రుక్మాంగద చరిత్ర' నాటకంబుగా వ్రాసి యుంచితిని. ... 'సుమనోరమసభ' వారు హరిశ్చంద్ర నాటకం బొనర్పుమని నన్నడిగిరి. ప్రసిద్ధులగు ననేక కవులొనరించిన నాటకమునే, నేనొనరింప నేల యని నేబదులిడఁ దమ పురి నాటకం బొకటి కావలెనని యుత్తరం బిచ్చిరి. కానిమ్మని సమ్మతించి, నవీన పథం బొకటి కల్పింప యత్నించితిని కాని, యది యసాధ్యమయ్యెను. కావున నున్నది యించుమించుగ నున్నరీతిని వ్రాయవలసి వచ్చెను..."[1] ఇట్లు సునందనీ పరిణయము నుండి 'సత్య హరిశ్చంద్రీయము' వరకు గల నాటకములు ఆనుపూర్విగానే పేర్కొనబడినవి. ఇక 'సత్య హరిశ్చంద్రీయ' నాటకోపోద్ఘాతమున నాటి తేదీ కనపరచలేదు. కాని ఆ ఉపోద్ఘాతమున కోలాచలంవారు ఆంగ్లమున రచించిన 'ప్రపంచ నాటక చరిత్రము' (The Dramatic History of the World) పేర్కొనబడినది. "పదునాల్గవ శతాబ్దమునుండి మన దేశములో నాటములుక్షీణించుట కనేక కారణములు కలిగెను. ఆ కారణంబు లన్నియు నాచే నాంగ్లేయ భాషలో వ్రాయబడిన

---

1. 102 ఉ. పు 1, 2

'The Dramatic History of the World' అను పొత్తములోఁ దెలుపఁ బడినవి. విద్యాభివృద్ధి విరాజిల్లిన యిక్కాలమున నట్టి కారణంబులు మరలఁ గలుగునని నేనూహించి యుండలేదు". [1] ఈ 'ప్రపంచ నాటక చరిత్రము' (The Dramatic History of the World) 1908 లో ముద్రింపబడి ప్రకటింపబడినది. దీని యుపోద్ఘాతము (Preface) రచించిన కాలము 1-1-1908 అని కలదు. అనగా ఆ గ్రంథము 1907 లో గాని, అంత కంటె ముందుగాని రచింపబడియుండును. కనుక 'సత్యహరిశ్చంద్రీయ' నాటక రచనాకాలము 1907-1908 అనుటలో విప్రతిపత్తిలేదు. ఇంతేగాక సుల్తానా చాందుబీ, రామరాజు చరిత్రము అను రెండు నాటకములు 1907 లోను, 'సత్యహరిశ్చంద్రీయము' 1808 లోను ప్రథమముగా ముద్రింపబడి నట్లును తెలియుచున్నది. [2] దీనినిబట్టి 'సుల్తానా చాందుబీ, రామరాజు చరిత్రము, శిలాదిత్య, మైసూరు రాజ్యాభివృద్ధి, శిరోమణి, రుక్మాంగద, సత్యహరిశ్చంద్రీయము' నను ని యేడు నాటకములును 1889 - 1907 సం.ల మధ్య కాలమున రచింపబడియుండును. ఇందుకు వానిలోని రచనా పద్ధతియు నుపకరించుచున్నది: 'సునందని, సుఖమంజరి, మదాలస, సీమంతిని' అను నాల్గు నాటకములలో వలెనే 'సుల్తానా చాందుబీ' లోను 'నాంది ప్రస్తావనా భరత వాక్యములు' కలవు. తరువాతి నాటకములయిన 'రామరాజు చరిత్రము, శిలాదిత్య, మైసూరు రాజ్యాభివృద్ధి, శిరోమణి, రుక్మాంగద, సత్యహరిశ్చంద్రీయము' నను వానిలో నాందీ పద్యము కలదు. ప్రస్తావన లేదు గాని నాటకేతివృత్తమును ప్రస్తావించు నొక పద్యము గలదు. భరత వాక్య మొక్క 'సత్యహరిశ్చంద్రీయము'న మాత్రము గలదు. అయినను పై నాటకముల రచనా క్రమము నిది సూచించుచున్నది.

3.3.4 1908 లో ముద్రింపబడిన 'ఆంధ్రీకృతాగస్త్య బాలభారతము' నందు శ్రీ కామావధానుల సుబ్బాశాస్త్రిగారు రచించిన 'కోలాచలం వంశాను క్రమము' నందలి యొక పద్యములోను [3] చివరి అట్టమీది వ్యాపార ప్రకటన మునను పై పదునొకండు నాటకములతోపాటు అదనముగా 'వ్రతాపాక్బరీయ'

1. 102 ఉ. పు. 2 2. 175

3. 66 పు 7, 8

మను నాటకము పేర్కొనబడినది. 'ఆంధ్రీకృతాగ స్త్య బాలభారతము' 'సత్య హరిశ్చంద్రీయ' నాటకమునకంటె తరువాతి రచన యగుటచేత, 'ప్రతాపా క్భరీయ' నాటకము 'సత్యహరిశ్చంద్రీయము' తరువాతిదని తెలియుచున్నది. అనగా శ్రీనివాసరావుగారు 1908వ సంవత్సరమునకు పండ్రెండు నాటకములు రచించిరని సుస్పష్టమగుచున్నది

3. 3 5 1913 మే నెల నుండి ప్రకటన ప్రారంభమైన 'వేదార్థ చంద్రిక' ప్రథమసంచికచివరి అట్టమీదివ్యాపారప్రకటనపై పండ్రెండు నాటకము లతోపాటు 'కుశలవ, ప్రహ్లాద, గిరిజాకల్యాణము, సీతాకల్యాణము, శ్రీరామ జననము, ద్రౌపదీవస్త్రాపహరణము, కీచక వధ' అను నేడు నాటకములుకలిపి పందొమ్మిది నాటకములు పేర్కొనబడినవి. కాబట్టి 1908 నుండి 1913 వరకు గల ఐదు సంవత్సరములలో పై ఏడునాటకములను శ్రీనివాసరావుగారు రచించిరని స్పష్టమగుచున్నది. కొన్ని నాటకముల పీఠికల రచనాకాలములను బట్టి వీని పూర్వాపరములను నిర్ణయింప వీలగును. 'కుశలవ' నాటకోపోద్ఘాత రచనాకాలము 10-6-1919 అని కలదు. ఈ ఉపోద్ఘాతమును శ్రీనివాసరావు గారు తమ మరణమునకు పదునైదు దినములకుముందు రచించినారు. దీని వలన 'కుశలవ' పదేండ్లక్రితమే రచింపబడినట్లు తెలియుచున్నది. "ఈనాటకము (కుశలవ) నా వలన నొనర్పబడి దాదాపుగఁ బదియేండ్లయ్యెను. సుమనోరమ సభవారు పలుమారులు దీనినిఁ బ్రదర్శించిరి."[1] అనగా 1909సం. ప్రాంతమున రచితమని స్పష్టము. ఇదే విధముగ 'ప్రహ్లాద' నాటకోపోద్ఘాతమున తద్రచనా కాలము 10-6-1919 అనియే కలదు. ఇది ఏడేండ్లకుముందే రచింపబడినట్లు చెప్పబడినది. "ఈ నాటకము (ప్రహ్లాద) నావలన రచింపఁబడి దాదావుగ నేడు వత్సరంబులయ్యెను. నాకుఁ బొసఁగినయనేకాననుకూలములు ముద్రింపించు టకు నంతరాయములుగ నిలిచెను."[2] కనుక ప్రహ్లాద 1912 సం.న కంటె ముందే రచింపబడియుండవలయును. దీనికితోడుగ మరి కొన్ని విషయములీ ఉపోద్ఘాతము వలన తెలియును. అంతకు పూర్వమే ధర్మవరం రామకృష్ణమా చార్యులుగారు 'ప్రహ్లాద' రచించి పోతన పద్యములను గ్రహించియుండగా, ఒకానొక సందర్భమున శ్రీనివాసరావుగారు వారితో సంభాషించుచు, నది

1. 104. ఉ పు. 3. 2. 105. ఉ పు. 5.

యుచితముకాదనియు , కవితాభివృద్ధికి కవులు స్వతంత్రముగా పద్యములు రచింపవలెననియుచెప్పి, స్వతంత్రముగ పద్యములను సైతము వ్రాసి ప్రహ్లాద నాటకమును ముగించినట్లు శ్రీనివాసరావుగారు తెలిపియున్నారు.[1] ధర్మవరం వారు 1912లో మరణించియుండుటచే వీరి సంభాషణ మంతకుపూర్వమే జరిగి యుండును గనుక 1912నకు ముందే యీ నాటకమురచితమని తలంపవచ్చును. అందుచే 'ప్రహ్లాద' రచనాకాలము 1910-1911 కావచ్చును. ద్రౌపదీవస్త్రాపహరణమునకు శ్రీ వై. హనుమంతరావుగారు ముద్రణా సమయమున 26-10-1921వ తేదీన భూమికనురచించి యున్నారు. ఇందులో వీరు దీనిని శ్రీనివాసరావుగారి చివరిదశలోని నాటకమని పేర్కొనిరి [2] కాని అది ఉచితము కాదు 1918సం.న 'వేదార్థచంద్రిక' అట్టమీద పేర్కొనబడి యుండుటచే 1918 కంటె ముందే రచితమని స్పష్టమగును. ఇందులో ప్రసిద్ధములైన 'మదాలస' మైసూరు రాజ్యాభివృద్ధి, రుక్మాంగద, ప్రతాపాక్బరీయము' నను నాటకములలోని పద్యములేగాక 'ఆంధ్రీకృతాగస్త్య బాలభారతము' నందలి పద్యములు[3] సైతము పరిగ్రహింపబడి యుపయుక్తములైనవి ఇంతేగాక 'శ్రీరామ జననము సీతాకల్యాణము' అను నాటకములలోని పద్యములు ద్రౌపదీవస్త్రాపహరణమున కలవు.కనుక నివి 'ద్రౌపదీ వస్త్రాపహరణము'న కంటె ముందే రచింపబడి యుండునని తలంపవలెను. 'సునందనీ పరిణయము సీమంతిని, మైసూరు రాజ్యాభివృద్ధి, శిరోమణి' నాటకములలోని పద్యములు 'కీచక వధ'లో నుపయుక్తములగుటచేతను 1918లో వేదార్థచంద్రిక అట్టమీద పేర్కొనబడి యుండుటచేతనునిది 1918కు ముందే రచితము. కాని ఏ సంవత్సరమున రచింపబడినదో యిదమిత్థముగా చెప్పలేము. "పై రీతిగనే పై సభవారు 'శిరోమణి నాటకము, కీచకవధ, శ్రీరామజననము, లంకాదహనము' బలవంతముగ నాచే వ్రాయించిరి."[4] అను శ్రీనివాసరావుగారి మాటల వలనకూడ కీచకవధ శ్రీరామజననములలోనేది ముందో తెలిసికొన వీలులేదు. దాదాపిదే సమయము లోనే 'గిరిజాకల్యాణము' రచింపబడి యుండును. ఇందు 'సునందనీ పరిణయము, మదాలస, సత్యహరిశ్చంద్రీయము, ప్రహ్లాద, శ్రీరామ జననము' అను నాటకములలోని పద్యములుపయుక్తములగుటచే శ్రీరామ జననము తరువాతనే

1. 105 ఉ పు. 5 2. 106 భూ. పు. 3

3. ఈ సిద్ధాంతవ్యాసము ప్రక. 11 4. 105 ఉ. పు. 6

రచింపబడియుండును. కాని స్పష్టముగా కాలము చెప్పవీలులేదు. 1908-1918 మధ్యకాలమునందలి పైఏడు నాటకములు 'కుశలవ(1909), ప్రహ్లాద(1910-11), శ్రీరామ జననము, సీతాకల్యాణము, ద్రౌపదీ వస్త్రాపహరణము, కీచకవధ, గిరిజాకల్యాణము' అను వానిని వరుసగా రచించియుందురని ఊహింపవచ్చును.

8.3.6. ఇక లంకాదహనము నాటకము సుమనోరమసభవారికోరిక ననుసరించి కోలాచలంవారు రచించినట్లును, ఆ నాటకపీఠిక రచనా కాలము 8-8-1919 అనియు తెలియుచున్నది. "కొన్ని సంవత్సరముల క్రిందట చెన్నపురి నుండి గోవిందస్వామినాయకర్ నాటక సంఘమువారువచ్చి లంకా దహన నాటకము నత్యద్భుతంబుగఁ బ్రదర్శించిరి. అందున నాంజనేయపాత్ర ధరించిన వాఁడు భక్తిరస మచ్చెరువుగఁ గనపఱచెను దానింగని సుమనోరమ సభవారు తమకును నానాటకముగా వలెనని యేకారిరి. రుగ్మత వలనను, కార్యబాహుళ్యము వలనను దీరికలేక యొకలేఖరితో వ్రాయించితిని." [1] దీనిని బట్టి లంకాదహనము సుమారు 5, 8 ఏండ్లకుముందే అనగా 1910-1914 మధ్యకాలమున రచింపబడి యుండునని తలంపవచ్చును. ఇందుకు వీరి చివరి నాటకమైన 'పాదుకాపట్టాభిషేకము' పీఠికగూడ ఉపకరించును. "బళ్ళారి పట్టణమున 'సుమనోరమ'యను నాటకసంఘము ఒకటి యుండెను. ఆ సంఘము వారు నా చే రచింపఁబడిన నాటకములు ప్రదర్శించుచుండిరి. ఆ నాటకములలో 'రామాయణ నాటకమాల'యనునవి కొన్ని యుండెను. శ్రీరామ జననమునుండి లంకాదహనము వరకును, ఉత్తర రామాయణములోని కుశలవ నాటకమును రచించి పాదుకాపట్టాభిషేక నాటకము నీ పట్టణవాసులుగా నుండి కీర్తిశేషులైన ధర్మవరము కృష్ణమాచార్యులవారు రచించిన కతంబుననే వ్రాయకవదలితిని". [2] దీనినిబట్టి కుశలవ, శ్రీరామజననము, సీతాకళ్యాణము అను వాని తరువాత లంకాదహనము రచింపబడి యుండును. ఇంతేగాక 1913లో ప్రకటితమయిన 'వేదార్థ చంద్రిక' అట్టమీద పేర్కొనబడిన వానిలో నిదిలేకుండుటచేతను, 'సునందనీ పరిణయ'నాటకములోని పద్యములు 'కుశలవ'లోను 'లంకాదహనము' లోను నుండుటచేతను, 'కుశలవ'లోని మరొక పద్యము 'లంకాదహనమున' నుండుటచేతను 'లంకాదహనము' 1913-14లో రచింపపడియుండునని యెంచ

1. 112 పీ.పు. 8 2. 103 పీ పు. 3

వచ్చును. ఈ ప్రాంతముననే గోవిందస్వామినాయకర్ నాటకసంఘము బళ్ళారికివచ్చి ప్రదర్శన మిచ్చియుండునని ఊహించుటలో విప్రతిపత్తిలేదు.

తరువాత 'చంద్రగిర్యభ్యుదయ' నాటకము రచింపబడినట్లు తెలియును. ఆ నాటక పీఠిక రచనాకాలము 3-8-1916 అని యున్నది. అనగా నంతకు పూర్వమే ఈ నాటకము రచితమనియర్థము. శ్రీనివాసరావుగారింతకు ముందే రచించిన ప్రసిద్ధ నాటకములు 'సునందనీ, సుల్తానా చాందుబీ, రామరాజు చరిత్రము, సత్యహరిశ్చంద్రీయము, ప్రతాపాక్బరీయము'లనుండి అనేకపద్యము లెత్తివ్రాసినారు. ఈ నాటకమున ఇతర నాటకములలోకంటె పద్యములసంఖ్య తక్కువ.ఇందు పూర్వ సంస్కృత గ్రంథములలోని యేడు శ్లోకములు,సునందనీ పరిణయ,రామరాజు చరిత్రములలోనుండి రెండేసి పద్యములు,సుల్తానా చాందుబీ' సత్యహరిశ్చంద్రీయములనుండి ఒక్కొక్క పద్యమును,ప్రతాపాక్బరీయమునుండి ఆరు పద్యములు గ్రహింపబడియున్నవి. ఇట్లే నాటకములలోని పద్యములు గ్రహించుటకు శ్రీనివాసరావుగారు "ఈ నాటకము (చంద్రగిర్యభ్యుదయము) లోని గొన్ని పద్యముల నాచే రచింపఁబడిన యితర నాటకములనుండి యెత్తి వ్రాసినాను. కారణము దేహానారోగ్యము"[1] అని తెలిపియున్నారు.

తరువాత నాటకము 'కాళిదాస'ను సంగతి ఆ నాటకపీఠికవలన వ్యక్తమగును. అందు తద్రచనాకాలము 14-8-1916 అని కలదు. ఈ తేదీతప్ప పీఠికలోగాని, నాటక ప్రస్తావనలోగాని పూర్వాపర నాటక ప్రస్తావనలేదు. అంతకంటె పూర్వనాటకములైన సుఖమంజరీ, కుశలవ ప్రస్తావనలలోని

"గీ॥ ఎడమచేత నద్ద మిడుకొని మొగమిటు
లటులఁద్రిప్పి కొప్పు నమరఁజూచి
విప్పికట్టి మరలవిప్పి కట్టఁగఁజూను
నలసమతులు గారె యతివలెందు." [2]

అను నీ పద్యము కాళిదాసనాటక ప్రస్తావనలోను గలదు.

---

1. 122. పీ. పు. 8

2. 121. పు. 7, 109. పు 8, 104. పు. 1

ఇట్లే మానాపమాన నాటకపీఠిక వలన అది తరువాతిదైనట్లు తెలియుచున్నది. ఈ నాటకపీఠిక రచించిన తేదీ30-10-1916.మానాపమాన నాటకమున కంటె'రాక్షసీ మహత్వాకాంక్ష'యనెడి నాటకము ముందటి రచనయనియు, ఈరెండును మహారాష్ట్రభాషలోని వాని కాంధ్రీకరణములనియు శ్రీనివాసరావుగారే వచించియున్నారు ''ఇటీవల బళ్ళారి పురంబునకు వచ్చిన పూనా కంపెనీలు రెంటిలో ''కేశవగంధర్వ కంపెనీ" వారు "రాక్షసీ మహత్వాకాంక్ష'' యను గంభీర నాటకము (Tragedy) నాడి ప్రేక్షకులను మెప్పించిరి.ఆ నాటకమును నేనాంధ్రీకరించి పీఠికలో 'ఖేదాంత' నాటకమనునది యన్వర్థనామము కాదనియును దానిపేరు 'గంభీర' నాటకమని యుంపఁ బడవలెననియు వ్రాసినాను. అటులనుటకుఁగల కారణమ్ములుసైతము వ్రాసినాను. మఱియొక 'బాలగంధర్వ' యను కంపెనీవారు "మానాపమాన''మనెడి నాటకమాడి జనులను హర్షింపజేసిరి. అచటఁ గూడిన రెండువేల జనులలోఁ బదుగురికి దప్ప మిగతవారికి వారాడిన యొక మాటయైనను నర్థము గాదాయెను. బాలగంధర్వుఁడు పాడుచున్నప్పుడు మాత్రము ప్రతి ప్రేక్షకుఁడు నెలుఁగుగొద్దు బలెఁదలయూచుచు బాణిపాదమున నా వేషధారినిఁ బ్రోత్సాహ పఱచుచుండెనుగాని కథయేమైనదియు ననేకులకుఁ దెలియదాయెను. అట్టి యవస్థచే నేనును బాధపడితిని. పిదప మహారాష్ట్రభాషనొక నెల దినములు తగినంతవఱకు నభ్యసించి ప్రారంభమున 'రాక్షసీ మహత్వాకాంక్ష'యను నాటకము నాంధ్రీకరించితిని. నాటకము కథా రూపకముగ నుండినందున నాంధ్రీకరించుపని నాకుఁ గష్టమనిపింపలేదు. ఆ నాటకమునందు హెచ్చుభాగము సంస్కృత శబ్దములును గొంతభాగము మన దేశములో నలవాటుగనున్న మహారాష్ట్ర భాషయును నుండెను. ఈ "మానాపమాన నాటకము'' హెచ్చుగ దేశిభాషా సంకలితముగ నున్నది. దేశిభాష యనఁగా పూనాలోను నచటికిఁ జుట్టుముట్టుఁగల ప్రదేశములలో వాడుకగనుండు ప్రాకృతభవవికారము లగు తద్భవశబ్దములు. కావున నీ నాటక మాంధ్రీకరింప నాకు గష్టమాయెను. పైఁగా నిది గృహకృత్య సాంబంధిక మోదాంత నాటకమైనందున (Domestic Drama)సాధారణముగ నిండ్లలో నాడువారును మగవారును మాటలాడు రీతిగ భాషమారినందున, నా చిక్కులఁ దెలియుట కష్టమాయెను.అయినను దైవానుగ్రహమువల్ల బట్టినపట్టు వదలక యథాశక్తి న్యాయముగ నాంధ్రీక

రించితిని''.[1] ఇట్లు రాక్షసీ మహత్త్వాకాంక్షను ఆంధ్రీకరించిన వెనుక మానాప మానమును తెనిగించినట్లు స్పష్టమైనది. మహారాష్ట్ర భాషలో శ్రీవీర్ వామన రావు జోషిగారు 'రాక్షసీ మహత్వాకాంక్ష' ను, శ్రీ కె. పి. ఖాడీల్కర్‌గారు 'మానాపమానము'ను రచించియున్నారు.

పై విధముగనే పాదుకాపట్టాభిషేక నాటకపీఠిక వలన నిది శ్రీనివాస రావుగారి చివరి నాటకమని సువ్యక్తమగుచున్నది. కాని యిందు తద్రచనకు సంబంధించిన తారీఖు లేదు. అయినను శ్రీనివాసరావుగారి మాటలే దీనికి నిదర్శనమగుచున్నవి. ''పురాణ నాటకములు రచించుట యందుఁ గవులకుఁ బద సంఘటన కష్టముతప్ప నితివృత్త చమత్కారకల్పనా కష్టమేమియునులేదు. మహనీయులగు వాల్మీకి, వ్యాసాదు లావిషయమున రాజమార్గమేర్పఱిచినారు. కవులామార్గమును బట్టికొని యిష్టానుసారము సంచరింపవచ్చును. పురాణ నాటకములు పూర్వాచార పరాయణులగు మన వారికి రుచించినటుల చారిత్రక నాటకములు రుచింపవు. అయినను నాచే నిప్పటికి రచింపఁబడిన ముప్పది నాటకములలో నెనిమిది నాటకములు చారిత్రక నాటకములున్నవి.''[2] కోలాచలం వారు రచించిన నాటకముల సంఖ్య మనమింతకు ముందే తెలిసికొన్నాము. కనుక ఈ పాదుకాపట్టాభిషేక నాటకము వీరి నాటకములందు చివరిదనుటలో సందేహ మక్కరలేదు. ఈ విషయమును అందలి మరికొన్ని మాటలు ధృవపరచు చున్నవి. ''బళ్ళారి పట్టణంబున 'సుమనోరమసభ'' యను నాటక సంఘమొకటి యుండెను. ఆ సంఘమువారు నాచే రచింపఁబడిన నాటకము లనేకములు ప్రదర్శించుచుండిరి. ఆ నాటకములలో ''రామాయణ నాటకమాల'' యనునవి కొన్ని యుండెను. శ్రీరామజననము నుండి లంకాదహనము వఱకును, ఉత్తర రామాయణములోని కుశలవ నాటకమును రచించి పాదుకాపట్టాభిషేక నాటకము నీ పట్టణవాసులుగ నుండి కీర్తిశేషులయిన ధర్మవరము కృష్ణమా చార్యులవారు రచించి యుండిన కతంబుననే వ్రాయక వదలితిని. ఆకారణము మా సభవారికిఁ దృప్తికరముగ లేక, తమకును ప్రత్యేకముగ నొక నాటక మావశ్యకమని, నన్ను బాధింప నేనానాటకమును రెండంకములు వ్రాయునంతలో దేహారోగ్యము తప్పినందున దానిని ముగింపక నిలిపి యుంటిని.

---

1. 118. పీ, పు. 3,4. 2. 103. పీ. పు. 4

''మా సభలోఁజేరిన పాత్రధారులు కొందఱు వేరి యిటీవల నూతనసభ నేర్పఱచికొని నా నాటకము లాడుచున్నారు. వారును ''పాదుకాపట్టాభిషేక" మాడవలెనను కుతూహలమున నీ నాటకమును బూర్ణీకరించి యివ్వుమని నన్ను వేఁడ వారి యిష్టానుసారంబుగనే వ్రాసితిని...'' [1] ఈ విషయము ననుసరించి పాదుకాపట్టాభిషేక నాటకము 1918వ సంవత్సరము చివరలో గాని 1919సం॥ ఆరంభమున గాని రచింపబడి యుండునని తలంపనగును. అంతకంటె ముందే రచింపబడి ప్రసిద్ధి వహించిన కోలాచలంవారి నాటకములు సునందనీ పరిణయము, రుక్మాంగద, సత్యహరిశ్చంద్రీయము, కుశలవ, లంకాదహనములలోని పద్యములు పాదుకాపట్టాభిషేక నాటకమున ప్రయుక్తములైనవి. ఈనాటకము చివరి దగుటచే పూర్వనాటకముల పద్యము లుపయోగించుకొనుట శ్రీరావుగారికి సుకరమైనది.

8.8.7 ఇక "బభ్రువాహన'' లేక "అర్జున గర్వభంజన''మను నాటక రచనగూడ కోలాచలంవారి చివరి దశలోనిదని మనము తలంపవచ్చును. ఈ నాటకమున నొక భాషాభిమాని 'విజ్ఞప్తి' వ్రాసినారు. [2] కాని దానివలన నాటక రచనా కాలము తెలిసికొనుటకు వీలులేదు. ఇందులో 'సునందనీ పరిణయము, మదాలస, సుల్తానాచాందుబీ, రామరాజు చరిత్రము,కీచకవధ' అను నాటకముల లోని పద్యములు 'ద్రౌపదీ వస్త్రాపహరణ, బభ్రువాహన, నాటకములలో నొక పద్యము సమానముగా కలవు. కనుక 'బభ్రువాహన' తరువాతి రచన. ఇంక 'చంద్రహాస నాటకము' బభ్రువాహనకంటె ముందుగాని, వెనుకగాని రచింప బడి యుండునని తలంపవచ్చును. దీని రచనాకాల నిర్ణయమున కాధారములగు సాధనసంపత్తి నాయొద్ద లేదు. కోలాచలం వారి ఇరువదెనిమిది నాటకములలో మిగిలినది "యువతీ వివాహ'' మను నాటకము. ఇది సాంఘికేతి వృత్తము కలది. డా. పి. ఎస్. ఆర్. అప్పారావుగారు తమ తెలుగు నాటకవికాసము నందీ నాటకము అముద్రితమని తెలిపిరి. [3] శ్రీనివాస చక్రవర్తిగారు కూడ తమ 'ఆంధ్రనాటకదర్శిని' లో నీ నాటకమును ప్రస్తావింపలేదు. కాని ఇది గూడ ముద్రితమై యుండవలెననియే నా తలంపు. ఆ యా నాటకములందు

---

1. 108 పీ వు. 8. 2 107

3. 45. పు 296.

కోలాచలం వారి వివిధ రచనల పట్టికలును ముద్రింపబడి ప్రకటితములైనవి. శ్రీనివాసరావుగారి కుమారుడు శత్రుఘ్నరావుగారు తండ్రిగారి రచనలన్నింటిని ముద్రింపించి ఉండగా దీనిని వదలి యుందురనుట కాధారము తక్కువ. కనుక అప్పారావుగారికిని, శ్రీనివాస చక్రవర్తిగారికిని యువతీ వివాహ నాటకము లభించి యుండకపోవచ్చును. 'పాదుకాపట్టాభిషేకము' రావుగారి నాటకములలో చివరిదని ముందే స్పష్టమైనది. కనుక "బభ్రువాహన, చంద్రహాస, యువతీ వివాహము" నను నాటకములు పాదుకాపట్టాభిషేకమున కంటె ముందే రచితములనుట స్పష్టము. అనగా నీ నాలుగు నాటకములు 1916 – 1919 మధ్యకాలమున రావుగారు రచించి యుందురని విశదమగుచున్నది.

3.3.8 ఇంక మిగిలినవి ప్రహసనములు, నాచిపార్టి, ఆచారమ్మన ప్రహసనవు అను ప్రహసనములు 1914 సం. లో ముద్రితమైనవి.'ఆన్యాయ ధర్మపురి మహిమ' అను ప్రహసనము 1915 సం.లో ముద్రితమైనట్లు డా. పి. ఎస్. ఆర్. అప్పారావుగారు తెలిపిరి.[1] అనగా నీ ప్రహసనములంత కంటె ముందే రచితములై యుండవచ్చును. 'సమయమునకు భార్య' అను మరొక ప్రహసనము కలదు. ఇది చివరిదై యుండవచ్చును. ఇంతకంటె వీని కాల నిర్ణయాధారములు లేవు.

## 3. 4 నాటకేతర రచనల కాల నిర్ణయము :

కోలాచలంవారి నాటకములుగాక తక్కినవానిలో వారి 'ప్రపంచ నాటక చరిత్రము' (The Dramatic History of the World) ప్రథమ గణనీయము. ఈ ఆంగ్లగ్రంథము 1908లో వాణీవిలాస ముద్రాక్షరశాల బళ్ళారియందు ముద్రింపబడినది. అందలి ఉపోద్ఘాతము (Preface) రచనా కాలము 1-1-1908 అని కలదు. కాబట్టి ఈ గ్రంథము 1907కు పూర్వమే రచింపబడి యుండుననని తలంపవచ్చును.

3.4.1 1908 లోనే వాణీ విలాస ముద్రాక్షర శాలలోనే ముద్రింపబడిన మరొక గ్రంథము "ఆంధ్రీకృతాగస్త్య బాలభారత "మను పద్యకావ్యము.

1. 45. పు 293.

సంస్కృత కావ్యమునందలి ఆది పర్వమున కాంధ్రీకరణము. ఇందలి కోలా చలం వారి పీఠిక రచనాకాలము 24-6-1908 అని యున్నది. కాని అంతకు పూర్వమే ఇది రచింపబడి యుండవలెనని తెలియుచున్నది. "ఇప్పటి కెనిమి దేండ్ల క్రిందట నా పెద్ద మామగారయిన బ్రహ్మశ్రీ గోళ్ళపల్లె శంకరశాస్త్రిలు వారు నాతో మాటలాడుచుండునపుడు నొక శ్లోకము చెప్పినారు. ఆ శ్లోక మెచటిదని ప్రశ్నింప నగస్త్య భారతములోని దనియు, తమ చిన్నతనంబున బాలురెల్లరు దానినిఁ బాఠముగఁ జదువుచుండిరనియు చెప్పినారు. అందుపైన నేను చెన్నపట్టణమునకు వ్రాసి పన్నెండుసర్గల గ్రంథము వ్రాయించి తెప్పించి తిని. వచ్చిన గ్రంథములోఁ దప్పులుంటయగాక కొన్ని శ్లోకములు లేకయుఁ గొన్ని శ్లోకములలో నొక్కటి రెండు చరణములు లేకయు నుండినవి వానిని నాంధ్రీకరించుట కష్టమని యెంచి శ్లోకాభిప్రాయంబు వచ్చినఁ జాలునని యెంచి యాఱు సర్గలాంధ్రీకరించితిని. చక్కని ప్రతి దొరకునంతవఱకుఁ మిగత భాగ మాంధ్రీకరించుటకు నిష్టములేక మానితిని. శుద్ధ ప్రతికై మైసూరులో నుండు నా మిత్రులకు వ్రాసినాడను. మూలమునందు శ్లోకములు లేని తటి నేను గొన్ని పద్యములుకూర్చి సందర్భము మాఱనటుల యొనర్చినాను. కొన్ని శ్లోకములు చంపూ భారతమునుండియు గొన్ని శ్లోకములు మరియొక బాలభార తము నుండియు నాంధ్రీకరించినాడను..."[1] దీనినిబట్టి అగస్త్య బాలభారత మును ఆరేడు సంవత్సరములకు ముందే రచించి యుందురని తెలియును.

3.4.2 'నాటకచరిత్ర'అను వ్యాసమును కోలాచలంవారు 1911లో ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో ప్రకటించినారు.[2] పత్రికాధిపతులలో ప్రముఖులుగా నుండి 'వేదార్థచంద్రికా' పత్రికను మే 1913 నుండి ఋగ్వేద ముతో నారంభించి ప్రకటింప మొదలిడిరి. 11-2-1915లో 'ఆర్యవివాహము' అను వ్యాసమును రచించినారు. 1915 సం. ఏప్రిల్ 3, 4 తేదీలలో బళ్ళారిలో జరిగిన ఆంధ్రసాహిత్య పరిషచ్చతుర్థవార్షికోత్సవ సభలో శ్రీనివాసరావుగారు స్వాగతోపన్యాసమున 'ఆంధ్రులచరిత్రము'ను గూర్చియు మరిరెండుపన్యాసము లలో 'ఆంధ్రనాటకములు, ఆర్యులనాగరికత, వారి దేశాక్రమణము'నను

---

1. 66 పీ. పు. 1 2. 188 పు. 108-112 (1?-4-1911)

విషయములను గూర్చియు నుపన్యసించిరి.[1] కడపలో 1917సం. ఏప్రిల్ 7, 8 తేదీలలో జరిగిన ఆంధ్రసాహిత్య పరిషత్సభకధ్యక్షత వహించిన సమయమున ఉపక్రమోపన్యాసము, ఉపసంహారోపన్యాసమును రెండు వ్యాసములు కలవు.[2] ఆ తరువాత 25-7-1918లో 'ప్రాచీన గ్రంథాలయ చరిత్రము'ను గూర్చి వ్రాసినారు. ఆ వెనుక 8-1-1919లో 'భాస కాళిదాస విక్రమాదిత్యుల కాల నిర్ణయము' అను వ్యాసము రచించినారు. 1918లో కాళిదాస నాటకమును కోలాచలంవారు రచించినారు. అందలికథ కల్పనగా నున్నదని తలంచిన వీరు ఆ తరువాత 'భాసకాళిదాస విక్రమాదిత్యుల కాల నిర్ణయము'ను గూర్చి వ్రాసి యుందురని తలంపనగును. 1908లో ముద్రితమైన ప్రపంచ నాటకచరిత్ర (The Dramatic History of the World)లో భాసునిగూర్చి కోలాచలం వారు ప్రస్తావించి యుండలేదు. కారణము 1911 తరువాతనే భాసుడు సర్వ విద్వజ్జన లోకమునకు తెలియుటయే. కనుక ఆ తరువాత కోలాచలంవారు పై వ్యాసమును రచించినారు. 'భారతీయ విద్యాభివృద్ధి'యను వ్యాసమును "అనిబిసెంటు"గారు ఏదో పత్రికలో వ్రాసిన వ్యాసమునుగాంచిన వెనుక కోలాచలంవారు రచించిరట. ఇందు ఘోరసంగ్రామము అనగా ప్రపంచయుద్ధము పేర్కొనబడినది. అది ప్రథమ ప్రపంచసంగ్రామము. కనుక నీ వ్యాసము 1914-1918 మధ్య కాలమున రచించబడినదని తెలిసికొనవచ్చును. "మాయ వాదోత్పత్తి క్రమము" అనువ్యాసమును మహారాష్ట్ర భాషయందలి తిలకుగారి భగవద్గీతా రహస్యమును చూచిన తరువాత రచించినట్లు వ్యక్తమగును.

3.4.3 పైని పేర్కొనబడిన కొన్ని వ్యాసములుతప్ప తక్కినవాని రచనా కాలమును నిర్ణయింప ఆధారములు తక్కువ. భగవద్గీతా సంబంధి ఉపన్యాసములు పంద్రెండు గలవు ఇవి యెప్పుడు రచించినది చెప్పుటకష్టము. కోలాచలం వారప్పుడప్పుడు సభలలో ఉపన్యసించిన వ్యాసములని పీఠిక వ్రాసిన చింతలపల్లి నరసింహశాస్త్రిగారి మాటలవలన వ్యక్తమగును. "ఆంగ్ల భాష యందు దీనికిఁ (భగవద్గీతకు) బెక్కు విమర్శనగ్రంథములు వెలువడినవిగాని యాంధ్రాది దేశభాషలయందు విపులమగు నొక విమర్శన గ్రంథమేని గాన రాకుండుట మిగుల శోచనీయము. అంధ్రాదిదేశ భాషలయందు విపుల తమము

1. 140 సం. పు. 4సం. 1 చైత్రరాక్షసము.

2. పైదే పు. 1-24, 69-84, 101-118.

లగు వ్యాఖ్యానములు గలవుగాని విమర్శనమను పేరుతో నాకుఁ దెలిసినంత వరకు నొక గ్రంథమైనను గనఁబడదు.

"ఆ లోపంబు నివారింపఁగోరి యనేక దృశ్య ప్రబంధకర్తలును సాంధ్రాంగ్ల కర్ణాట పండితులునునగు బ్రహ్మశ్రీ కోలాచలం శ్రీనివాసరావుగారి శ్రీ భగవద్గీతకు గొప్ప విమర్శగ్రంథము సమకూర్పనెంచి తొలుత దీనినిగూర్చి సభలలో నుపన్యసించి యా యుపన్యాసముల నన్నిటిని నొకటిగఁజేర్చి యొక గ్రంథముగ సంసిద్ధము చేసి యాంధ్ర లోకమునకు మిక్కిలి మహోపకార్యము గావించిరి వీరి దృశ్య ప్రబంధము లనేకము లట్టి గ్రంథము సహితము ముద్రిత మగుటకుఁ బూర్వమే వీరు కీర్తిశేషులయిరి.[1] ఈ వ్యాసములన్నియు 1925 - 1928 మధ్యకాలమున ముద్రింపబడినవి. బహుశః శ్రీనివాసరావు గారు 'శిరోమణి' నాటకము ముందే భగవద్గీతను గూర్చి పరిశోధించుచుండెడి వారని వారి మాటల వలననే వ్యక్తమగును. "నా మిత్రులు కొందఱు ననుఁ జేరి పురాణ సంబంధములైన కథలు మరికొన్ని వ్రాయుమని నన్నడిగిరి నా మానసంబున కది యిష్టంబుగాక యున్నను మిత్రుల మనోభీష్టంబు వ్యర్థ పరచుట యుక్తముగాదని యెంచి భారతములోని ముఖ్యాంశము లన్నియు వెల్లడియగు రీతి 'శిరోమణి' నాటక మని పేరిడి యశ్వత్థామ శిరోరత్నమును దీయునంతవఱకు నొక నాటకంబు వ్రాసితి. అందున భగవద్గీతాంశములు విశేషముఁ జేర్చితిని"[2] శిరోమణి నాటకము 1899 - 1907 మధ్యకాలమున రచింపబడి యుండునని నిర్ణయింపబడినది కనుక 1899 నుండియు శ్రీనివాస రావుగారు భగవద్గీతను గూర్చి పరిశోధించుచు అనేకోపన్యాసములు రచించి యుందురు.

3.4.4 తరువాత వేదముల నాధారముగా జేసికొని ఆర్యులచరిత్ర, నాగరికత, మతము, సాంఘిక పద్ధతులు, వివాహములు, జాతి వర్ణాశ్రమ ధర్మములు, దైవములు మున్నగు విషయములనుగూర్చి పైని పేర్కొనబడిన 'ఆర్య

1, భగవద్గీతావిమర్శనోపన్యాసములు-ప్రథమగుచ్ఛము. పీ. పు. 1
2. 103 ఉ. పు. 1

వివాహ' మను వ్యాసముగాక పదునైదుపన్యాసములు కోలాచలంవారు రచించిరి. ఇవన్నియు 1926—'28 మధ్యకాలమున ముద్రితములైనవి. పై భగవద్గీతా విమర్శనోపన్యాసముల వలెనే వీని రచనా కాలమును గూడ ఇదమిత్థమని చెప్ప లేము. 'భగవద్గీతా విమర్శనోపన్యాసముల'లో మొదటి వ్యాసమైన 'భారత భగవద్గీతల గురించిన విమర్శనము' నందు 'ఆర్యుల నాగరికత' వారి దేశా క్రమణము' (ఆర్యుల నాగరికత, వారి ప్రపంచ వ్యాపకత) అను వ్యాసమును ముందు రచించినట్లు చెప్పబడియున్నది.[1] వేద విమర్శనోపన్యాసములలో నిది మొదటిది. కాని 1918 సం. మే నెంలో వేదార్థ చంద్రిక పత్రిక' ప్రథమ సంచిక ప్రకటితము. తత్సంబంధ విషయములను అంతకు ముందు నుండియు ఉపన్యాసముల రూపమున విశదీకరింప నారంభించి యుందురని తలంపనగును. ఇందుకు వేదార్థ చంద్రిక పత్రికాధిపతుల మాటలును ఉపకరించుచున్నవి. ఆ పత్రికాధిపతులలో ప్రముఖులు శ్రీనివాసరావుగారు. కనుక వారి మాటలు శ్రీనివాసరావుగారి నుడులనుటలో సందేహము లేదు. "ఇప్పటి కాలపు నాగరిత కంటెను, వేదము నాటి నాగరికత హెచ్చుగా నుండెనా, తగ్గియుండెనా, వారికి సాధన సంపదలన్నియు నుండెనా ? వారి యాచార వ్యవహారము లెటు లుండెను ? ఇప్పటివలె మత భేదములును, వర్ణాశ్రమ ధర్మములును అప్పటికిని నుండెనా ? వారల రాజ్యాంగ పద్ధతి యెద్ది ? వారి నీతి ప్రవర్తన మెట్టిది ? అతి బాల్య వివాహములు, విధవా వివాహములు, పతితో సతి చితిఁ జేరుట వేద సమ్మతమై యుండెనా ? వ్యభిచార ద్యూత విశ్వాస ఘాతుకాదులగు నేరము లక్కాలమున నుండెనా ? ఇవియు, నింకను దీనికి సంబంధించిన చరితాంశ ములను మనము చక్కఁగ గుర్తెఱుఁగుట విధిగ నున్నది.

"వేదకాలమెద్ది ? వేద కాల నిర్ణయమున కాధారము లెవ్వియైన గలవా ? ఈ విషయము సైతము మనము చక్కఁగ నాలోచింపఁదగినదిగ నున్నది. పై విషయము లన్నిందిని గుఱించి యుపోద్ఘాత మిపుడే వ్రాయవలయునన్న చదువరుల కతి కష్టమగు నను నాలోచన మమ్ము బాధించుచున్నది. ఏలయన, వ్రాయఁబోవునుపోద్ఘాతములో వేదాష్టకమును, ఋక్కు మొదలగు వానిని సూచింపవలెను. చదువరులు సరస ఆంధ్ర భాషార్థము లేనిది యుపోద్ఘాత ములో సూచింపఁబడిన ఋక్కు యొక్క యర్థమును దెలిసి పరిశీలింపఁజాలరు.

1. భగవద్గీతావిమర్శనోపన్యాసములు—ప్రథమ గుచ్ఛము. పీ. పు. 6.

కావున 4, 5 అష్టకములు ఆంధ్రీకరించిన పిదప నుపోద్ఘాతము ముద్రింపవలెనని సర్వజన సమ్మతంబుగ నెన్నఁబడి యుండుటచే మే మీ వేదమునే మొదట నాంధ్రీకరింపఁ బూనితిమి..." [1] పై ప్రశ్నలకు సమాధానములే వేదసంబంధి వ్యాసములని తలంప వలయును. 'ఆర్యుల నాగరికత, ప్రపంచ వ్యాపకత' అను నొక వ్యాసము మాత్రము భగవద్గీతా విమర్శనోపన్యాసముల కంటె ముందే రచితము. తక్కిన వేద సంబంధి వ్యాసములు తరువాత అనగా 1912 నుండి వ్రాయనారంభించి యుందురు. అయినను రామరాజు చరిత్రము, మైసూరు రాజ్యాభివృద్ధి, ప్రతాపార్కబరీయము మున్నగు నాటకములలో అతి బాల్య, వృద్ధ వివాహములు, సతీసహగమనము మొదలైనవి గర్హింపబడియుండు టచే 1908 కు పూర్వము నుండి వేద సంబంధి పరిశోధనము చేయు చుండి రనియు, తరువాత వ్యాసములు రచించిరనియు తెలిసికొనవచ్చును. కనుక 'ఆర్యుల నాగరికత ప్రపంచ వ్యాపకత' అను వ్యాసము తప్ప శ్రీనివాసరావుగా రీ వ్యాసములను 1900 నుండియు వ్రాయుచు వచ్చిరని విశదమగును.

## 3.5 వివిధ రచనలు (కాలక్రమానుసారము) :

ఇట్లు పైని గావించిన సమగ్ర పరిశీలన వలన కోలాచలం శ్రీనివాసరావు గారు తమ వివిధ రచనలను ఆనుపూర్విగా నీ క్రింది విధముగా రచించి యుందు రని మన మూహించుట కవకాశము గలదు.

| | |
|---|---|
| 1892 - 1893 : | సునందరీ పరిణయము, |
| 1895 : | సుఖమంజరీ పరిణయము, |
| 1895 - 1896 : | మదాలసా నాటకము, |
| 1898 - 1899 : | సీమంతినీ నాటకము, |
| 1898 - 1907 : | సుల్తానా చాందుబీ, రామరాజు చరిత్రము, శిలాదిత్య, మైసూరురాజ్యాభివృద్ధి, శిరోమణి రుక్మాంగద, |

1. వేదార్థ చంద్రిక (మే, 1918) పీ. పు. i, ii

| | |
|---|---|
| 1907 : | 'ప్రపంచ నాటక చరిత్రము' (The Dramatic History of the World), |
| 1907 - 1908 : | సత్యహరిశ్చంద్రీయము, |
| 1908 : | ప్రతాపాక్బరీయము, |
| 1901 - 1908 : | ఆంధ్రీకృతాగస్త్య బాల భారతము, |
| 1909 : | కుశలవ నాటకము, |
| 1910 - '11 : | ప్రహ్లాద నాటకము, |
| 1911 : | నాటక చరిత్ర, |
| 1911 - 1913 : | శ్రీరామ జననము, సీతా కల్యాణము, ద్రౌపదీ వస్త్రాపహరణము, కీచక వధ, గిరిజా కల్యాణము, |
| 1912 - 1914 : | లంకాదహనము, నాచిపార్టి, ఆచారమ్మన ప్రహసనవు, |
| 1915 : | ఆర్య వివాహము, ఆంధ్రుల చరిత్రము,ఆంధ్ర నాటకములు,అన్యాయధర్మపురి మహిమ, |
| 1914 - 1918 : | భారతీయ విద్యాభివృద్ధి, |
| 1915 - 1916 : | చంద్రగిర్యభ్యుదయము, కాళిదాస నాటకము, రాక్షసీ మహత్వాకాంక్ష నాటకము, మానాపమాన నాటకము, |
| 1916 - 1918 : | బభ్రువాహన నాటకము, చంద్రహాస నాటకము, యువతీ వివాహము, |
| 1917 : | అర్థశాస్త్రోపన్యాసములు, |

25-7-1918 : ప్రాచీన గ్రంథాలయ చరిత్రము,

1899 - 1919 : భారత భగవద్గీతలను గురించిన విమర్శనము, వ్యవహార కర్మ జిజ్ఞాస, అర్జున విషాదయోగము, సాంఖ్యయోగము, కర్మ యోగము, జ్ఞాన యోగము, కర్మ సన్న్యాస మంత్రలయ మాత యోగములు, ధ్యానయోగము, విజ్ఞాన తారక బ్రహ్మ యోగము, రాజ విద్యా రాజ గుహ్య విభూతియోగములు, విశ్వరూప సందర్శన భక్తి యోగములు, గుణత్రయ విచారము.

1900 - 1919 : ఆర్యుల నాగరికత, వారి ప్రపంచ వ్యాపకత; వేద మతము, నాస్తిక మతము, ఆర్యుల దైవములు ; వేద విచార విమర్శనము ; సృష్టిని గురించిన తాత్పర్యము; వేదము చరిత్రయా ? నరమేధ, అశ్వమేధాది యజ్ఞములు; వేదమతము ; ఋగ్వేదము-పురాతనార్యుల చరిత్రము, (Rigveda- History of the Primitive Aryans); ఋగ్వేదములోని ముఖ్య ప్రార్థనలు; మద్యపానము, జూదము, స్త్రీల గుణములు; వివాహ కట్టడములు; జాతి, వర్ణాశ్రమ ధర్మములు; మత విధు లే రీతిగ ప్రబలినది; ఋషులు, సప్తర్షులు, దధీచి, చ్యవనుఁడు యమ, యమి, మృత్యువు, పితృదేవతలు, కర్మ; మాయవాదోత్పత్తి క్రమము.

1918 - 1919 : పాదుకా పట్టాభిషేక నాటకము, సమయమునకు భార్య

8-1-1919 : భాస కాళిదాస విక్రమాదిత్యుల కాల నిర్ణయము.

## 3 . 6 వివిధ రచనలు – వర్గీకరణము :

శ్రీనివాసరావుగారు 1892 నుండి ఆమరణము గావించిన రచనలను కొన్ని వర్గములుగ విభజించవచ్చును. ఆయా రచనల విషయ ప్రాధాన్యము, విషయము నందలి సామ్యము, అను వానిననుసరించి, ఒకటిగాని, అంతకంటె ఎక్కువగాని గ్రంథములను ఒక వర్గముగ విభజించుట యిందలి ముఖ్య గుణము. కోలాచలం వారి వివిధ రచనల నిట్లు వర్గీకరింపవచ్చును.

1. నాటకములు – 28 :

సునందనీ పరియణము, సుజమంజరీ పరియణము, మదాలస, సీమంతిని, సుల్తానా చాందుబీ, రామరాజు చరిత్రము, శిలాదిత్య ,మైసూరు రాజ్యాభివృద్ధి, శిరోమణి, రుక్మాంగద, సత్యహరిశ్చంద్రీయము, ప్రతాపాక్బరీయము, కుశలవ, ప్రహ్లాద, శ్రీరామ జననము, సీతాకల్యాణము, ద్రౌపదీ వస్త్రాపహరణము, కీచకవధ, గిరిజా కల్యాణము, లంకాదహనము, చంద్రగిర్యభ్యుదయము, కాళిదాసు, రాక్షసీ మహత్వాకాంక్ష, మానాపమానము, బభ్రువాహన, చంద్రహాస, యువతీ వివాహము, పాదుకా పట్టాభిషేకము.

2. ప్రహసనములు – 4 :

తెలుగు – నాచిపార్టి, అన్యాయ ధర్మపురి మహిమ, సమయము నకు భార్య.

కన్నడము – 'ఆచారమ్మన ప్రహసనవు'.

3. పద్యకావ్యము : ఆంధ్రీకృతాగస్త్య బాల భారతము.

4. విమర్శనము : ఆంగ్లము – 'The Dramatic History of the World' (ప్రపంచ నాటక చరిత్ర).

తెలుగు :

భగవద్గీతా విమర్శనోపన్యాసములు – 12 :

భారత భగవద్గీతలను గురించిన విమర్శనము, వ్యవహారకర్మ జిజ్ఞాస, అర్జున విషాద యోగము సాంఖ్య యోగము, కర్మయోగము, జ్ఞానయోగము, కర్మసన్న్యాస మంత్ర లయ హఠ రాజ యోగములు, ధ్యానయోగము, విజ్ఞాన తారక బ్రహ్మయోగము, రాజ విద్యా రాజగుహ్య విభూతి యోగములు, విశ్వ రూప సందర్శన భక్తి యోగములు, గుణత్రయ విచారము.

వేద విమర్శనోపన్యాసములు –15:

ఆర్యుల నాగరికత, వారి ప్రపంచ వ్యాపకత, వేదమతము, నాస్తిక మతము ఆర్యుల దైవములు, వేద విచార విమర్శనము, సృష్టిని గురించిన తాత్పర్యము, వేదము చరిత్రయా ? నరమేధ. అశ్వమేధాది యజ్ఞములు, వేద మతము, ఋగ్వేదము – పురాతనార్యుల చరిత్రము, ఋగ్వేదములోని ముఖ్య ప్రార్థనలు, మద్యపానము, జూదము, స్త్రీల గుణములు; వివాహ కట్టడములు, జాతి వర్ణాశ్రమ ధర్మములు, మత విధు లేరీతిగఁ బ్రబలినది, ఋషులు సప్తర్షులు, దధీచి, చ్యవనుడు; యమ, యమి, మృత్యువు, పితృదేవతలు, కర్మ.

ఇతర విమర్శనోపన్యాసములు – 10

మాయ వాదోత్పత్తి క్రమము, ఆర్య వివాహము, భారతీయ విద్యాభి వృద్ధి, ప్రాచీన గ్రంథాలయ చరిత్రము, భాసకాళిదాస విక్రమాదిత్యుల కాల నిర్ణయము, నాటక చరిత్ర, ఆంధ్రుల చరిత్ర, ఆంధ్ర నాటకములు, అధ్య క్షోపన్యాసములు (ఉపక్రమోప సంహారోపన్యాసములు).

ఇట్లు శ్రీనివాసరావుగారు వివిధ రచనలు పై వర్గీకరణము నందిమిడి, తరువాతిప్రకరణములలో వీనిని విమర్శనాత్మక దృష్టితో పరిశీలించుటకు, తన్మూలమున అభిప్రాయముల నభివ్యక్తము గావించుటకును ఎంతయు నుపకరించును.

# 4. నాటక మూలములు

## 4. 1 పూర్వవిమర్శకుల వర్గీకరణము :

పూర్వ ప్రకరణమున శ్రీనివాసరావుగారి నాటకము లిరువదెనిమిదనియు, ప్రహసనములు నాలుగనియు స్పష్టమైనది. ఈ నాటకముల నింత వరకు వివిధ విమర్శకులు వర్గీకరించిన పద్ధతులను పరామర్శించుట ఉచితము. శ్రీని వాసరావుగారి నాటకములను వర్గీకరణము వంటి వివరణము గావింప ప్రప్రథమ ముగా ప్రయత్నించిన వారు శ్రీ కప్పగల్లు సంజీవమూర్తిరావుగారు.[1] వీరి వర్గీకరణమున ఒకటి రెండు దొసగులు కలవు. 'సునందనీ పరిణయము' స్వకపోలకల్పితముగాని సాంఘిక నాటకము కాదు. 'సీమంతినీ నాటకము' పౌరాణికముగాని కల్పితము కాదు. 'మానవపిశాచ' మనునది 'రాక్షసీ మహాత్వా కాంక్ష'కు గల నామాంతరముగాని ఇవి వేర్వేరు నాటకములు కావు. తక్కిన విభజనము సమంజసముగానే కలదు.

శ్రీ వై. సీతారామశర్మగారు 'కోలాచలం శ్రీనివాసరావుగారి'ని గూర్చి భారతిలో ఒక వ్యాసము ప్రకటించిరి. అందు వీరు కప్పగల్లు సంజీవ మూర్తిరావుగారి ననుసరించి శ్రీనివాసరావుగారి నాటకములను విభజించిరనుట కంటె, వారి విభజనమునే గ్రహించిరన వలయును.[2] ఈషణ్మాత్రమేని భేదము లేదు.

4.1.1 "తెలుగు నాటక వికాసము" న డా. పి.ఎస్.ఆర్. అప్పారావు గారి వర్గీకరణ మీ విధముగా గలదు. 'శ్రీనివాసరావుగారు మొత్తము ముప్పది నాటకములవరకు రచించినారు. అందు చారిత్రకములు కొన్ని; పౌరాణిక ములు కొన్ని; సాంఘికములు కొన్ని; తక్కినవి చారిత్రక, పౌరాణిక వాతా

---

1. 21. పు.20-26. 2. 189 (అక్టో, 1964) పు. 57-60

వరణములో కల్పింపబడినవి.'[1] అని నుడివి వారు అధోజ్ఞాపిక (Foot note) లో నిట్లు పేర్కొనిరి.

"చారిత్రకములు : సుల్తానా చాందుబీ, రామరాజు చరిత్రము (విజయనగర వినాశము), శిలాదిత్య, మైసూరు రాజ్యాభివృద్ధి, చంద్రగిర్యభ్యుదయము, ప్రతాపొక్బరీయము.

పౌరాణికములు : గిరిజా కల్యాణము, రుక్మాంగద, సత్యహరిశ్చంద్రీయము, కాళిదాస నాటకము, మదాలస(మార్కండేయ పురాణము); ప్రహ్లాద నాటకము (దానవ వధ).

భారత నాటకములు : ధర్మవిజయము (భారతయుద్ధము), చంద్రహాస, ద్రౌపదీ వస్త్రాపహరణము, బభ్రువాహన, కీచకవధ (సైరంధ్రి).

రామాయణ నాటకములు : శ్రీరామ జననము, సీతా కల్యాణము, పాదుకా పట్టాభిషేకము, లంకాదహనము. కుశలవ.

ఉభయములు : సునందనీ పరిణయము, సుఖమంజరీ పరిణయము, సీమంతినీ నాటకము.

సాంఘికములు : మానాపమాన నాటకము, యువతీ వివాహము (అముద్రితము), మానవ పిశాచము, రాక్షసీ మహత్వాకాంక్ష.

ప్రహసనములు : అన్యాయ ధర్మపురి మహిమ, (1915), నాచి పార్టీ, ఆదారమ్మ కథ (కన్నడము)" [2]

ఈ విభజనము చాల వరకు సమంజసముగా నున్నది. కాని ఒకటి రెండు నాటకములు మాత్రము పొరపాటుగ వర్గీకరింపబడినవి. కాళిదాస నాటకము 'పౌరాణికము' లలోను, సీ మంతినీ నాటకము 'ఉభయములు'లోను పేర్కొనబడుట పొసగదు. సీమంతినీ నాటకేతి వృత్తము పౌరాణికమనుటలో సంది

1. 45. పు, 262. 2. పైదే పు. 295, 296.

యము లేదు. ఇంక శిరోమణి నాటకమునకు ధర్మవిజయము లేక భారత యుద్ధము అనియు, రాక్షసీ మహోత్వాకాంక్షకే మానవ పిశాచమనియు నామాంతరములని ఇంతకు ముందే తెలిసినది.

4.1.2 'ఆంధ్ర నాటకదర్శిని' లో శ్రీ శ్రీనివాసచక్రవర్తి గారి విభజన మిట్లు గలదు.[1] కాళిదాసు-గద్యపద్య ఇతిహాస నాటకము, కీచక వధ, కుశలవ, గిరిజాకల్యాణము, ద్రౌపదీ వస్త్రాపహరణము, పాదుకా పట్టాభిషేకము, ప్రహ్లాద, బభ్రువాహన, మదాలస, రుక్మాంగద, లంకాదహనము, శిరోమణి, శ్రీరామ జననము, సీతాకల్యాణము, సీమంతిని, హరిశ్చంద్ర-గద్యపద్య గేయ పౌరాణిక నాటకములు, చంద్రగిర్యభ్యుదయము, ప్రతాపాక్బరీయము, రామరాజు చరిత్రము, శిలాదిత్య, మైసూరు రాజ్యము, సుల్తానా చాందుబీ-గద్యపద్యగేయ చారిత్రక ములు; మానాపమానము, సుఖమంజరీ పరిణయము, సునందనీ పరిణయము-గద్యపద్యగేయ కాల్పనిక నాటకములు'.

వీరి విభజనము చాలమట్టుకు సమంజసముగనే గన్పట్టును కాని కాళిదాస నాటకమెంత వరకు ఐతిహాసిక మన్నది ప్రశ్న. 'సుఖమంజరీ పరిణయము'ను చారిత్రకముగను, "మానాపమానము ''ను అనువాదముగను పేర్కొని యుండవలసినది. 'రాక్షసీ మహత్వాకాంక్ష' చంద్రహాస, యువతీ వివాహము'-అను మూడు నాటకములను పేర్కొన్న వీరు 'తెలుగు నాటక కవులు' అను తమ చిన్న పుస్తకమున సాంఘికములు, చారిత్రకములు, పౌరాణికములు, ప్రహసనములునని విభజించి, సాంఘికములలో 'సునందనీ పరిణయము, సీమంతిని, సుఖమంజరీ పరిణయము' అను నాటకములను గ్రహించుట అంతగా పొసగదు.[2]

4.1.3. 'ఆంధ్ర నాటక కళ' (Andhra Dramatic Art)లో శిష్టా రామకృష్ణశాస్త్రిగారు పౌరాణికములు, చారిత్రకములు, సాంఘికములు నని వర్గీకరించిరి. ప్రహసనములను పేర్కొన లేదు.[3] పొరపాటున 'రోషనార'

1. 31. 2. 42. పు. 42—50
3. 54. పు. 188.

శ్రీనివాసరావుగారి నాటకముగా చారిత్రకములలో పేర్కొనిరి. శ్రీనివాస రావుగారీ నాటకము రచింపనే లేదు. ఇది ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారిది. ఇంక వీరు సాంఘిక నాటకములలో సీమంతిని, శిరోమణి నాటకము లను గ్రహించిరి. ఇవి రెండును పౌరాణికములనుట ప్రసిద్ధమే !

4.1.4 1907-1908 సంవత్సరములలో కోలాచలంవారి ముఖ్య నాటకములేగాక వారి ఆంధ్రీకృతాగస్త్య బాలభారతము, ప్రపంచ నాటక చరిత్ర (The Dramatic History of the world) ముద్రింపబడినవి. 1908లో ముద్రితమైన 'ఆంధ్రీకృతాగస్త్య బాలభారతము' పుస్తకము అట్ట మీది వ్యాపార ప్రకటనమున వీరి పంద్రెండు నాటకములు పేర్కొనబడినవి. వాని విభజనమిట్లు కలదు సునందనీ పరిణయము-స్వకపోల కల్పితము; సుఖమంజరీ పరిణయము, సుల్తానా చాందుబీ, రామరాజు చరిత్రము, మైసూరు రాజ్యము, శిలాదిత్య చరిత్రము, ప్రతాపాక్బరీయము-చారిత్రక నాటకములు; మదాలస నాటకము, సీమంతినీ నాటకము, రుక్మాంగద చరిత్రము, భారతము లేక శిరోమణి నాటకము, హరిశ్చంద్రీయము-పురాణ కథలు. ఈ విభజనము చాల సముచితముగా గన్పట్టును. కాని ఇది శ్రీనివాసరావుగారి పంద్రెండు నాటకములకు మాత్రము పరిమితము. వీరి నాటకములన్నియు కొంతవరకు సముచితముగా వర్గీకరింపబడిన పట్టు మరొకటి గలదు. 1920లో ద్వితీయ ముద్రణమునందిన 'రామరాజు చరిత్రము, సత్యహరిశ్చంద్రీయము' నను రెండు నాటకములలోను, అదే సంవత్సరము ప్రథమ ముద్రణగాంచిన 'కుశలవ' నాటకమునను, 1921లో ప్రథమముగా అచ్చుపడిన 'ద్రౌపదీ వస్త్రాపహరణ నాటకము'నను గల వ్యాపార ప్రకటనమునందీ క్రింది వర్గీకరణము కలదు.

**చారిత్రక నాటకములు :**

రామరాజు చరిత్రము (లేక కర్ణాటక నాశనము), సుల్తానా చాందుబీ, చంద్రగిర్యభ్యుదయము, మైసూరు రాజ్యము, శిలాదిత్య, సుఖమంజరీ పరిణయము, ప్రతాపాక్బరీయము,

**పౌరాణిక నాటకములు :**

రామాయణ నాటకములు : శ్రీరామజననము, సీతాకల్యాణము, పాదుకా పట్టాభిషేకము, లంకా దహనము, కుశలవ నాటకము,

భారత నాటకములు : ద్రౌపదీ మాన సంరక్షణము లేక ద్రౌపదీ వస్త్రాపహరణము, కీచకవధ, శిరోమణి నాటకము, అర్జున గర్వభంజనము లేక బభ్రువాహన నాటకము, హరిభక్తిరస పూరితములు: ప్రహ్లాద, రుక్మాంగద,

నాయికా పాత్రపోషణ చమత్కృతములు : గిరిజా కల్యాణము, సీమంతిని, మదాలస,

దైవఘటన వైచిత్రి మంతములు : సత్యహరిశ్చంద్రీయము, భోజ ప్రబంధము లేక కాళిదాస నాటకము, చంద్రహాస,

**స్వకపోలకల్పితములు :** సునందనీ పరిణయము (అద్భుత నీతి పూరితము), యువతీవివాహము,

**ఆంధ్రీకరణములు :** మానాపమానము, రాక్షసీ మహత్వాకాంక్ష

**ప్రహసనములు :** ఆచారమ్మ కథ (కన్నడ భాషలో) సమయమునకు భార్య, అన్యాయ ధర్మపురి మహిమ, నాచిపార్టి.

ఈ వర్గీకరణమెంతయు **సూక్ష్మపరిశీలనతో** గావించినట్లు విదితమగును. అయినను ఇందులోను కొన్ని దొసగులు దొరలినవి. కాళిదాస నాటకము పౌరాణికములలో జేర్చుట పొసగదు. 'చంద్రహాస' ను భారత నాటకముల లోనే పేర్కొని జైమిని భారతములోనిదని తెలుపవలెను .'యువతీ వివాహము'

స్వకపోలకల్పిత మనుట వాస్తవమేయైనను దానిని సాంఘిక మనుటయే సమంజసము.

## 4.2 ఉచిత వర్గీకరణమునకు మార్గములు :

పై పరిశీలన వలన శ్రీనివాసరావుగారి నాటకములు సముచితముగ వర్గీకరింప బడలేదని స్పష్టమైనది. కనుక వీరి నాటకములను ఉచితరీతిని వర్గీకరింపవలెను. ఆ వర్గీకరణము సహేతుకమై సర్వజనాంగీకార యోగ్యముగ నుండుట యెంతయు అవసరము.

శ్రీనివాసరావుగారు వివిధ నాటకములు రచించినను, వీరికి చారిత్రక నాటకముల పైనే అధిక ప్రత్యయమున్నట్లు విదితమగును. పైగా వీరి ప్రసిద్ధ నాటకములలో చారిత్రకములే అధిక ప్రాముఖ్యమును వహించిన వనుటయు సత్య దూరముకాదు. వీరి చారిత్రక నాటకములలో వేనిని చేర్పనగునో పరిశీలించుట ముఖ్యము. చారిత్రక నాటకముగ స్పష్టముగా తెలియు నాటకము 'సుల్తానా చాందుబీ'. తరువాత 'రామరాజు చరిత్రము' శిలాదిత్య, మైసూరు రాజ్యము, ప్రతాపాక్బరీయము, చంద్రగిర్యభ్యుదయము అను నాటకములను రచించినట్లు మనకు ముందే తెలిసినది. వీనితో కోలాచలంవారి చారిత్రక నాటకము లారనుట స్పష్టము. కాని వారే పాదుకా పట్టాభిషేక నాటక పీఠికలో "నా చే నిప్పటికి రచింపఁబడిన ముప్పది నాటకములలో నెనిమిది నాటకములు చారిత్రక నాటకములున్నవి." [1] అని నుడివి యుండుటచే పై ఆరు నాటకములతో 'సుఖమంజరీ పరిణయము, కాళిదాసు' అను రెంటిని కలిపినచో మొత్తము ఎనిమిది చారిత్రక నాటకములగును. కాని దీనికి కొంత ఇబ్బందియు గలదు. అయినను 'సత్యహరిశ్చంద్రీయ నాటకోపోద్ఘాతమున' "నేనింతకు మున్ను వ్రాసి ముద్రింపించి ప్రచురించిన నాటకములలో 'సునందని' స్వకపోల కల్పితముగను, 'సుఖమంజరి' చరిత్రాంశముగను, 'మదాలస, సీమంతిని' పౌరాణిక కథలుగ నున్నవి." [2] అని వీరే అనుటచే సుఖమంజరి చారిత్రక మనుట పొసగుచున్నది. అట్లే తదితరులు వారి నాటకముల వర్గీకరించినపుడు

---

1. 108 పీ. పు. 4 2. 102 ఉ. పు. 1

చారిత్రక నాటకములలోనే దీనిని చేర్చిరి. అంతేగాక "సుఖమంజరీ పరిణయము" పీఠికలో "ఈ సుఖమంజరీ నాటకము సునందనీ నాటకంబు వలె నవీనమేను ... ఒక రాజకన్య తాఁగోరిన వరుని ప్రతిమను స్వయంవరమ్మున గామించెనని చరిత్రకారుఁ డొకఁడు వ్రాసియున్నాడు. దానిం బట్టియే యీ నాటకంబు గల్పించితి." [1] అనుట వలన నిది చారిత్రక విషయము నాధారముగా గొని చారిత్రక వాతావరణమున కల్పింపబడిన నాటకము. కనుక నిది చారిత్రక మనుట పొసగును. ఇంక కాళిదాస నాటకమును చారిత్రక మనుట కాధారములు లేవు. కాళిదాస నాటక పీఠికలో తన్నాటమునకు ముందే, బ్రహ్మశ్రీ చిలకపాటి వెంకటరామానుజాచార్యులవారి కాళిదాస నాటకము, వేంకటాచార్యుల వారి కర్ణాటక భాషలోని భోజప్రబంధ నాటకమును, నారపరాజు లక్ష్మీకాంతము గారి కాళిదాస నాటకము అనునవి కలవనియు వాని ననుసరించియే తాము ఈ కాళిదాస నాటకమును రచించితిమనియు తెలిపి, "ఈ నాటక సంవిధానమంతయును గేవల కల్పనా కథగఁ బారంపరిగ వచ్చినదిగాని యథార్థ స్థితిగ నుండునని తలచుటకు మార్గములేదు." [2] అని శ్రీనివాసరావుగారు వ్రాసి యుండుటచే నిది చారిత్రక వాతావరణమున రచితమైన నాటకములకు అనుసరణ మనుటయే సముచితముగా గన్పట్టును. కనుక పైని పేర్కొన్నట్లు సుల్తానా చాందుబీ, రామరాజు చరిత్రము, శిలాదిత్య, మైసూరు రాజ్యము, ప్రతాపాకృ రీయము, చంద్రగిర్యభ్యుదయము, సుఖమంజరీ పరిణయము నను నివి చారిత్రక నాటకములు. కాళిదాసు చారిత్రక వాతావరణమున రచితమైన నాటకముల కనుసరణము అని స్పష్టముగా తెలిసినది. ఇట్లు నిక్కమైన చొక్కపు చారిత్రకేతివృత్తముల గ్రహించి అధిక సంఖ్యలో చారిత్రక నాటకముల రచించిన ఘనత తెలుగు నాటక కర్తలలో శ్రీనివాసరావుగారి కొక్కరికే దక్కినదన్న సత్యదూరము కాదు !

4 . 2 . 1 ఇంతేగాదు శ్రీనివాసరావుగారు రచించిన నాటకములలో అధికసంఖ్యలో పౌరాణికములు గలవు. అందున ప్రసిద్ధములైన భారత రామాయణ కథలను గ్రహించి ఇంచుమించుగా వానిని నాటికీకరించరనవలెను.

---

1. 109 పీ. పు. 4 2. 121 పీ. పు. 8.

సర్వజన సమ్మోదకరమైన రామాయణమును శ్రీరామ జననము మొదలుకొని ఉత్తర రామాయణ కథలోని సీతాపరిత్యాగము వరకు ఐదు నాటకములుగ రచించిరి. శ్రీనివాసరావుగారీ నాటకమును వరుస క్రమమున రచించినట్లు గోచరింపదు. మొదట కుశలవ నాటకమును, తరువాత శ్రీరామ జనన, సీతా కల్యాణ నాటకములను ఆ వెనుక లంకాదహనమును రచించిరి ధర్మవరం రామకృష్ణామాచార్యులుగారి పాదుకాపట్టాభిషేకముండుటచే కోలాచలం శ్రీనివాసరావుగారీ నాటకమును రచింపలేదట కాని చివరి దశలో వీరీ నాటకమును రచించి రామాయణమును పూర్తిగా నాటకీకరించిన ఘనతను గూడ సంపాదించుకొనిరి.[1] కనుక కోలాచలం వారు యుద్ధకాండము తప్ప రామాయణగాథను పూర్తిగా నాటకములుగ రచించిరనుట స్పష్టము. వీరు రామాయణము వలెనే భారతమును గూడ ఇంచుమించుగ నాటకీకరించిరి. వీరు భారత నాటకములలో ప్రప్రథమముగ రచించిన నాటకము "శిరోమణి". దీనికే భారత యుద్ధము లేక ధర్మవిజయమునని గూడ పేర్లు గలవు. శ్రీకృష్ణుడు కౌరవ సభకు రాయబారిగా పోయివచ్చిన తరువాత ధర్మరాజాదులతో సంభాషించుచున్నట్లు ఆరంభమై, అశ్వత్థామ శిరోరత్నమును దీయునంతవరకు గల కథ యీ నాటకమున గలదు. ఆ వెనుక "ద్రౌపదీ వస్త్రాపహరణము, కీచకవధ" అను నాటకములను రచించిరి. "ద్రౌపదీ వస్త్రాపహరణము, కీచకవధ, శిరోమణి" అను మూడు భారత నాటకములలో లాక్షాగృహదహనము మొదలుకొని భారత యుద్ధానంతరము, అశ్వత్థామ, ఉపపాండవ ధృష్టద్యుమ్నులను వధించిన వెనుక శిరోరత్నమును దీయునంతవరకుగల కథయంతయు గలదు. ఈ కథ కనుబంధముగ నుండునట్లు జైమిని భారతములోని కథను గ్రహించి "బభ్రువాహన" లేక "అర్జున గర్వభంజన" మను నాటమును రచించిరి. అర్జున బభ్రువాహనుల యుద్ధము భారతమున నున్నను జైమిని భారతములోని కథనే వీరు గ్రహించిరి. జైమిని భారతములోని "చంద్రహాస" కథను గూడ నాటకముగ రచించిరి ఇట్లు భారతమును గూడ ఇంచుమించుగ నాటకీకరించిన ఘనత కోలాచలం వారికి దక్కినది. రామాయణ భారత నాటకములుగాక ఇతర పౌరాణిక నాటకములను సైతము కోలాచలం వారు రచించిరి. వీరి మొట్టమొదటి పౌరాణిక నాటకము మదాలస. ఆ తరువాత సీమంతినీ నాటకము,

1. ఈ సిద్ధాంతవ్యాసము రెండవ ప్రకరణము.

రచితము. ఆ వెనుక వీరి ప్రసిద్ధ పౌరాణిక నాటకములైన రుక్మాంగద, సత్యహరిశ్చంద్రీయము, ప్రహ్లాద, గిరిజా కల్యాణము అను నాటకములు రచింపబడినవి. ఇట్లు పురాణ వస్తువుల గ్రహించి పదునారు నాటకములను రచించిరి.

4 . 2 2 శ్రీనివాసరావుగారు మరాఠీనాటకములనుగూడ ఆంధ్రులకు రుచిచూపిరి మహారాష్ట్ర భాషలో శ్రీ కె. పి. ఖాడిల్కర్‌గారు రచించిన మానాపమానము, శ్రీ వీర్ వామనరావుజోషిగారు రచించిన రాక్షసీమహత్వాకాంక్ష అను రెండు నాటకములను రావుగారుతెనిగించి తమ మహారాష్ట్రభాషా వైదుష్యమునుగూడ ప్రకటించిరి.

4 . 2 . 3 వీరు మొట్టమొదటరచించిన సునందనీ పరిణయము కేవల కల్పిత నాటకము. ఈ విషయమును వీరే 'సునందనీ పరిణయ' పీఠికలోనుడివి యున్నారు.[1] వీరు చారిత్రక, పౌరాణిక, ఆంధ్రీకరణ నాటకములతోనే సంతృప్తి చెందక ఒక సాంఘికనాటకమునుగూడ రచించిరి. అదియే 'యువతీ వివాహ'నాటకము

4 . 2 . 4 వీరు ప్రహసనములను సైతము రచించిరి. "అచారమ్మన ప్రహసనవు"అను నొక ప్రహసనమును కన్నడభాషలోను, నాచిపార్టి, అన్యాయ ధర్మపురి మహిమ, సమయమునకు భార్య అనుమూడు ప్రహసనములను తెలుగులో రచించిరి.

పై విధముగ శ్రీనివాసరావుగారు చారిత్రక, పౌరాణికాది వివిధ నాటకములను, ప్రహసనములను రచించి తమ బహుముఖప్రతిభా వైదుష్యములను ప్రకటించి ప్రసిద్ధికెక్కిరి.

## 4 . 3. వర్గీకరణము :

పై పరిశీలనానంతరము శ్రీనివాసరావుగారి నాటకములను ఇతివృత్తమునుబట్టి యీ క్రింది విధముగ వర్గీకరింపవచ్చును.

---

1. 98. పీ పు 1.

చారిత్రిక నాటకములు 8.

సుఖమంజరీ పరిణయము, సుల్తానా చాందుబీ, రామరాజు చరిత్రము, లాదిత్య, మైసూరు రాజ్యాభివృద్ధి. ప్రతాపాకృరీయము, చంద్రగిర్యభ్యుద యము, కాళిదాసు.

పౌరాణిక నాటకములు :

రామాయణ నాటకములు 5.

శ్రీరామజననము, సీతాకల్యాణము, పాదుకాపట్టాభిషేకము, లంకా దహనము, కుశలవ.

గారత నాటకములు 5.

భారతకథ: ద్రౌపదీవస్త్రాపహరణము, కీచకవధ, శిరోమణి,

జైమిని భారతము : బభ్రువాహన (లేక) అర్జున గర్వభంజనము, చంద్రహాస.

ఇతర పౌరాణిక నాటకములు 6.

మదాలస, సీమంతిని, రుక్మాంగద, సత్యహరిశ్చంద్రీయము, ప్రహ్లాద, గిరిజాకల్యాణము.

ఆంధ్రీకృత నాటకములు 2.

రాక్షసీ మహత్వాకాంక్ష, మనాపమానము.

కల్పిత నాటకము 1.

సునందనీ పరిణయము.

సాంఘిక నాటకము 1.

యువతీ వివాహము.

ప్రహసనములు 4.

తెలుగు : నాచిపార్టి, అన్యాయ ధర్మపురిమహిమ, సమయమునకు భార్య.

కన్నడము : ఆచారమ్మన ప్రహసనవు.

## 4 . 4 నాటకేతి వృత్తమూలములు :

శ్రీనివాసరావుగారి నాటకముల వైశిష్ట్యము నెన్నుటకమున్ను ఆయా నాటక కథా వస్తువులను, వానికి మూలములను తెలిసికొనుట ఉచితము-తన్మూలమున తరువాతి విషయవివేచనము సులభసాధ్యమగును.

### 4 . 4 . 1 లభింపని నాటకములు :

నేను 1965 నుండి కోలాచలంవారి నాటకములను, ఇతర రచనలను సంపాదించుటకై చేసిన ప్రయత్నఫలితముగ నాకు ఇరువదెయైదు నాటకములు, మూడు ప్రహసనములు లభించినవి. లభింపని నాటకములు మూడు. చంద్రహాస, రాక్షసీమహత్వాకాంక్ష, యువతీవివాహము, ప్రహసన మొకటి. "సమయమునకు భార్య". 'చంద్రహాస' జైమిని భారతామందలి ప్రసిద్ధమైన కథ. చంద్రహాసుని జననమాదిగ నాశముచేయ, దుష్టబుద్ధిగావించిన ప్రయత్నములు విఫలమై, చంద్రహాసుడు చక్రవర్తియగుట యిందలి కథ. నాటకము లభింపకపోవుటచే శ్రీనివాసరావుగారి సంవిధానచాతుర్యమ్ము, మార్పుల ఔచిత్యము తెలిసికొన వీలులేకపోయినది. 'రాక్షసీ మహత్వాకాంక్ష' అను నాటకము వీర్ వామనరావు జోషిగారు మరాఠీభాషలో రచించిన దాని కనువాదము. కోలా

చలంవారి నాదకముగాని, దీనికి మూలమైన మరాఠీనాటకము [1] గాని నాకు లభింపలేదు. గుబ్బివీరణ్ణ నాటకసమాజమువారు ప్రదర్శించుచుండిన కన్నడనాటకము 'రాజభక్తి'గూడ నీ 'రాక్షసీ మహత్వాకాంక్ష' నాటకమున కనువాదమే.[2] దీనికిసహితము నేను చాల ప్రయత్నించి సంపాదింపలేకపోయి నందుకు మిక్కిలి చింతించుచున్నాను. నాటకము లభింపకుండుటచే అందలి కథావస్తువు తెలిసికొనుటకు సాధ్యము కాకపోయినది. 'యువతీ వివాహము' అను సాంఘిక నాటకమునందలి కథ గుర్తించుట కవకాశము లేక పోయినది. కాని బాల్య వివాహములను ఖండించుచు, యువతీ వివాహమే యుచితమని శ్రీనివాసరావు గారిందు నిరూపించి యుందురని తలంపవచ్చును. ఇది అముద్రితమని డా॥ పి. ఎన్. ఆర్. అప్పారావుగారు తెలిపియున్నారు.[3] 'సమయమునకు భార్య' అను ప్రహసనము నందలి కథ ఏమిటో తెలిసికొన వీలులేకపోయినది. పై మూడు నాటకములను శ్రీ శ్రీనివాసచక్రవర్తిగారు తమ "ఆంధ్ర నాటక దర్శిని"లో పేర్కొనలేదు. తక్కిన నాటకముల వస్తువులు, తన్మూలములు లను ఇటతెలిసికొందము.

## 4 . 5 కల్పిత నాటకము :

శ్రీనివాసరావుగారి ప్రథమనాటకము 'సునందనీ పరిణయము'. ఇది కల్పితనాటకము. "ఈ ప్రపంచమున జనులు తమయోగ్యతకు మించిన పదవుల న్గోరి ఫలప్రాప్తికై యెన్నోయగచాట్లుపడి, వద్దిమూస మొదలు చెఱచు''నను నానుడిభంగిఁదమ నైసర్గికపదవులన్గూడఁ బోఁగొట్టుకొనుచుండుటయుఁగొందఱు, కార్యసాఫల్య కారణంబు బుద్ధిబలదేహబలంబులె, యని వాదించుటయుంజూచి, యీ విషయంబును గుఱించి నాటకం బవశ్యంబని తలంచి, ప్రస్తుత నాటకంబుల భాతిఁబాటలు మాటలున్గలయొక కథను గల్పించితి." నని శ్రీనివాసరావుగారే

1. ఇది అలభ్యమని పూనా, బొంబాయి పుస్తక విక్రేతలనుండి అందిన వార్త.

2. 165. పు. 130, 131. 3. 45. పు. 296.

4. 98. పీ పు. 1.

తెలిపియున్నారు. బుద్ధిబలమును నమ్మినమంత్రి సుమతి, కళింగ దేశపురాజు ప్రతాపుని కుమారుని దొంగలచే నపహరింపజేసి, రాజపుత్రికను తనకోడలిగా జేసికొనుటకును, దేహబలమును నమ్మిన సైన్యాధిపతి ఉగ్రసేనునినాశముచేసి, ఆ వెనుకతానే రాజ్యమేలుటకునుయత్నించి, చివరికి శృంగభంగము పొందుట యిందలి కథ. సునందనీ సుదేవుల వివాహముతో నాటకము ముగియును, ఇందు బుద్ధిబలదేహబలములకంటె విధిబలమే గొప్పదని కోలాచలంవారు నిరూపించిరి

## 4. 6 చారిత్రక నాటకములు :

శ్రీనివాసరావుగారికి చరిత్రపై నత్యధిక ప్రత్యయము కలదు. చరిత్రాధారముతో రచింపబడిన ప్రథమనాటకము 'సుఖమంజరీ పరిణయము'. కోలాచలంవారి నాటకములలో రెండవది. దీనికి మూలమైన విషయము "ఒక రాజకన్యక తాఁగోరిన వరుని పతిగను స్వయంవరమ్మున గామించెనని చరిత్రకారులు వ్రాసియున్నారు. దానింబట్టియే యీ నాటకంబు గల్పించితి"[1] నని శ్రీనివాసరావుగారే నుడివియున్నారు. అట్లు ప్రేమించిన వరుని వరించిన రాజకన్య కనోజ్‌రాజు జయచంద్రుని పుత్రిక రాణీసంయుక్త, వరుడు ఢిల్లీ చక్రవర్తి పృథ్వీరాజు నని 'టాడ్' పండితుని గ్రంథమువలన మనకు స్పష్టమగును.[2] ఈ నాటకమునగల చరిత్రాంశములివి: తనకుశత్రువైన రాజప్రతిమను జేయించి ద్వారముకడ నుంచుట, రాజపుత్రి స్వయంవరమున తాను వలచిన రాజప్రతిమ కంఠమున పుష్పహారమువేయుట, అందుక్రుద్ధుడైన రాజు పుత్రికను చెరలోనుంచుట, వరింపబడిన రాజు ఈ విషయమెరిగి రాజపుత్రికను గొనిపోయి వివాహమాడుట, ఇవిగాక తక్కిన యంశములు నాటకమున కల్పితములు. నాటకమున రాణీసంయుక్త సుఖమంజరిగాను, పృథ్వీరాజు ప్రద్యుమ్నుడుగాను మారినారు; రాజుల రాజ్యముల పేర్లును మారినవి. ఉదయపురి, జయపురులకు తోడు అదనముగ మరొకటి 'మాళవపురి'గూడ చేరినది. వరింపబడిన రాజుచివరి

---

1. 102. పీ పు. 4.

2. (i) 158. సం. 1, ప్రక I పు. 6, 7, ప్రక XXII పు. 495
(ii) 84. పు. 1-11, (iii) 88. పు. 81-35

యుద్ధమున మరణించి స్వర్గమలంకరింప, రాజపుత్రి చితిలో దూకి ప్రాణములొసగి భర్తను గలిసినట్లు చరిత్రవిషాదాంతమును కాగా, నాటకము సుఖమంజరీ ప్రద్యుమ్నుల వివాహముతో సుఖాంతమగుచున్నది. ఇట్టి కల్పనలు, మార్పులు నాటకశిల్పమునకు దోహదకారులుగానే కలవు. కనక బాలవరకు నిందు చరిత్రాంశములుండుటచే దీనిని చారిత్రక నాటక మనుటలో విప్రతిపత్తిలేదు

4.6.1 'సుల్తానా చాందుబీ' చారిత్రక నాటకములలో రెండవది. తురుష్కులలో గొప్ప రాణియని ప్రసిద్ధికెక్కి, 'అహమ్మద్‌నగర్' రాజ్యమునేలిన మహాసాహసికురాలామె బహ్మనీ రాజ్యములైదు నేకమై తాళికోటయొద్ద జరిగిన యుద్ధమున రామరాజును వధింపజేసి, ఔన్నత్యముపొందిన అహమ్మద్, బీజా పూరు రాజ్యములు తదనంతరము వినాశమైన విషయ మీ 'సుల్తానా చాందుబీ' నాటకమున వర్ణితము. మొదట బీజాపురమును, తరువాత అహమ్మద్ నగరమును బాలుర తరపున రాజ్యమునేలి సుల్తానా చాందుబీ కీర్తిప్రతిష్ఠల నార్జించినది. ప్రజల శ్రేయస్సుకై యత్నించినది, ప్రాణముల నైతములెక్క చేయక శత్రువుల నెదిరించి, అహోరాత్రములందుకు పనిచేసి, ఘనత వహించిన మహారాజ్ఞిఆమె ఆమె చరిత్రను గ్రహించి శ్రీనివాసరావుగారు తమ రసవన్నాటక ముగా జేసిరి. శ్రీ కె. వి. లక్ష్మణరావుగారీమె చరిత్రమును హిందూదేశ కథాసంగ్రహమున వివరించిరి.[1] ఈ నాటకమునందలి ముఖ్య సన్నివేశము లన్నియు చరిత్రనుండియే శ్రీనివాసరావుగారు గ్రహించిరి. నాటకీయత కొరకు కొన్ని చిన్నిసన్నివేశములను కల్పించి, సహృదయ రంజకమైన నాటకముగ వీరు రూపొందించిరి.

4.6.2 శ్రీనివాసరావుగారి చారిత్రక నాటకములలో ప్రసిద్ధమైనది 'రామరాజు చరిత్రము'. విజయనగర రాజులలో 'సాహితీ సమరాంగణసార్వ భౌము' డని ప్రసిద్ధికెక్కిన శ్రీకృష్ణదేవరాయల అల్లుడైన రామరాయల చరిత్రను దెలుపు నాటకము. 1565 లో తాళికోట దగ్గర రామరాయలు వధింప బడిన వెనుక బహ్మనీ సుల్తానులు విజయనగరము నాక్రమింతురు ఈ నాటక మును 'విజయనగర వినాశ' మనియు (The Fall of Vijayanagar) 'కర్ణా

1. 88 పు. 220-227.

టక రాజ్య నాశ' మనియు నామాంతరములు గలవు. ఇదే వృత్తము గల 'కన్నడిగరకర్మకతె' అను కన్నడ నవల యొకటి కలదు. దాని కర్త 'గగనాథ'. దీనితో నాటకమునకు సంబంధములేదు. ఈ నవలారచన (1916) కు దాదాపు పది పండ్రెండు సంవత్సరములకు ముందే 'రామరాజు చరిత్రము' నాటకము రచితము. ప్రసిద్ధమైన రామరాజు చరిత్రమును శ్రీనివాసరావుగారు చరిత్ర నుండియే గ్రహించిరి. డాబర్టు స్యూయల్ దొర గారు "A Forgotten Empire" అను చారిత్రక గ్రంథమును రచించి 1900 లో ప్రచురించిరి. [1] శ్రీనివాసరావుగారీ గ్రంథమునండియే 'రామరాజు చరిత్రము'ను గ్రహించిరి. రామరాయాది ముఖ్యపాత్రలతోపాటు సామంత ప్రభువులు గూడ చరిత్రలోనివారే. [2] సలకం తిమ్మయ్య రాజ్యకాంక్షతో అచ్యుతరాయల మరణానంతరము బాలుడైన యతని పుత్రుని విషప్రయోగ మునే చంపుటయు చారిత్రకమే. కోడిగ్రుడ్డుతో సమానమైన వజ్రము విజయ నగరమున నుండినట్లు వర్ణితమైన విషయమును చరిత్ర చెప్పుచున్నది [3] ఈ చరిత్రకు కొన్ని కల్పనలు చేసినారు శ్రీనివాసరావుగారు. పటాణి [4] రుస్తుమ్ పాత్ర శ్రీనివాసరావుగారి అనన్య సామాన్యమైన కల్పన. ఆషాబీ పాత్రయు కల్పితమే. తన యాస్థానమున సంగీత సభ చేసిన సంగీత పాఠకునకు ఐదుగురు సుల్తానులు సంభావన నీ వలెనని వారియొద్ద కతనిని రామరాయలు పంపిన సన్నివేశమును కల్పితమే. ఇదియే విజయనగర వినాశమునకు నాంది యైనది. నాటకమున ప్రధానపాత్ర పటాణి; ఇతడు రామరాజునకు మహా బాహుడై యుండుద్భవించిన కుమారుడు; సర్వసైన్యాధిపతిగా చేయబడినవాడు; చివర యుద్ధమున రామరాయలను సంహరించినవాడు. తన పుత్రుని మరణ మునే శోకించుచుండిన రామరాయలను ఓదార్చిన 'ఆదిల్షాను' రామరాయలు పుత్రునిగా నెంచెననియు, యుద్ధమున నతడే రామరాయల కంఠము నుత్తరించె ననియు చరిత్ర. ఈ విషయమునే శ్రీనివాసరావుగారు "రామరాజు శిరంబు నఱికిన వాండతని సేనాధిపతులలో నొకడని యొక చరిత్రకారుండు వ్రాసినాడు. వాండెవండైనది రాజును జంపుటకుం గారణమేమయినది నేను

1. (i) 88, (ii) 92, 98, (iii) 78. 2. 155 పు. 384–398
3. 155 పు 399 – 401.
4 'పఠాన్ రుస్తుమ్'నే రావుగారు పటాణిగా వ్రాసిరి.

గల్పించి వ్రాసినాఁడను". [1] అని తెలిపిరి. చారిత్రక నాటకములలో ప్రధానేతి వృత్తమున కెట్టి లోపము రానీక కల్పింప వచ్చునని రావుగారి యభిప్రాయము. "ఈ నాటకము కేవల చరిత్రాంశములు గలిగినది. తాళికోట యుద్ధమునందుఁ బరాజయము నొందె హిందూ రాజులు విజయనగర రాజ్యమును గోలుపోయిన విజయ మిందలి యితివృత్తము. చరిత్రాంశము లన్నియును తూ-చా తప్పక యథార్థ స్థితిలో నాటకము నందుండవు. ఆంగ్లేయభాషయందుండు చారిత్రక నాటకంబులు చదివిన వారి కెల్లరకు నిది తెల్లంబుగ నుండును. ఒక కార్య మునకుఁ గారణంబు గల్పించు స్వాతంత్ర్యము నాటక కర్తకు గలదు". [2] అని వివరించిరి. ఇట్లు శ్రీనివాసరావుగారు ప్రధాన కథ కెట్టి విఘాతము లేకుండు నట్లు కల్పనలు గావించి సర్వశ్రేష్ఠమైన చారిత్రక నాటకముగ 'రామరాజు చరిత్రము'ను రూపొందించి ప్రసిద్ధి కెక్కిరి.

4.6. శిపార్థియన్‌లు సింధునదిని దాటి హిందూదేశమున ప్రవేశించి, అప్పటికి అధిక ప్రసిద్ధి గాంచిన బలహారి నగరమును నాశము గావించిన విషయ మును దెలుపు నాటకము 'శిలాదిత్య' అని శ్రీనివాసరావుగారు నుడివియున్నారు. [3] 'శిలాదిత్య' అను బిరుదము హర్షునకు గలదు. కాని హర్షునకు పార్థియన్‌ల దండ యాత్రకు సంబంధము లేదు. కాబట్టి పార్థియన్‌లు హిందూదేశముపై దండ యాత్రచేసి, బందు ప్రవేశించి, ఆక్రమించుకొనిరను చరిత్రాంశమును గ్రహించి శ్రీనివాసరావుగారీ నాటకమును రచించి యుందురని తెలిసికొనవచ్చును. భర్తృ విహీనయైన సుభగ దుఃఖమును వారింప శంద్రి వాచస్పతి శర్మ ఆదిత్యహృదయ మను మంత్రము నుపదేశించును. ఆ మంత్ర పఠన మహిమచే సూర్యుడు ప్రత్యక్షమై సుభగకు నవమాలికా, శిలాదిత్యులను పుత్రీ పుత్రుల ననుగ్ర హించును. శిలాదిత్యుడు బలహరిపురమునకు రాజయి తదనంతరము సప్తాశ్వ సరోవరము కలుషితము చేయబడుటచే పార్థియన్‌లచే నిహతుడగును. ఈ నాటక మున చరిత్రాంశముల కంటె కల్పనమే యధికమని తెలియుచున్నది.

4.6.4 మైసూరు రాజ్యమరాజకమై క్షీణించు సమయమున దాని నుద్ధ రించిన 'యదురాయ కృష్ణరాయ, మొడయరుల చరిత్రను దెలుపు నాటకము

---

1 100 పి. పు. 1 2. 100 పి. పు. 1

3 102 ఉ. పు. 1.

'మైసూరు రాజ్యము' లేక 'మైసూరు రాజ్యాభివృద్ధి'. ఈ చరిత్ర శ్రీ కె. వి. లక్ష్మణరావుగారు 'ఢిల్లీదర్బారు' అను గ్రంథమున వివరించియున్నారు.[1] చరిత్ర నాధారముగా గొని కోలాచలంవారు నాటకమును రచించిరి. ఈ నాటకమందలి పూర్వాంకమైన ప్రథమాంకేతి వృత్తమును శ్రీనివాసరావుగారు కల్పించిరి. శాపవశమున లక్ష్మణ వీరులు సంహరింపబడి తరువాత జన్మమున వసుదేవునకు యదురాయ కృష్ణరాయలుగ జన్మించి హదినారు రాజ్యమునకు పోయి అక్కడ రాజ్యమును స్థాపించినట్లు కల్పించిరి. ద్వితీయాంకమునుండి చివరి వరకు గల కథను చరిత్ర నుండియే గ్రహించి పై కల్పనలను జోడించిరి.

4.6.5 'ప్రతాపాక్బరీయ' మొక ఉత్తమ చారిత్రక నాటకము. తిన తిండి లేక, వసింప నిల్లు లేక, ఘోరారణ్యములతో ఆకలము తినుచు తురుష్కుల నెదిరించి చివరకు విజయ దుందుభులతో హైందవౌన్నత్యమును వెలయింపజేసిన 'రాణా ప్రతాప సింహ' చరిత్ర మిందు నాటకీకరింపబడినది. జేమ్సుటాడ్ మహాశయుడు వ్రాసిన రాజస్థాన చరిత్రయే దీనికాధారము.[2] శ్రీనివాసరావుగారు టాడ్ పండితునను సరించి చారిత్రక సత్యముల నన్నిటిని నాటకమున నుపయోగించిరి. 'నౌరోజు సంత'ను గూడ యథాతథముగ గ్రహించిరి. చారిత్రక పాత్రలను ఔచితీ సహితమైన పద్ధతిలో సహజసుందరముగ పరిపోషించిరి. అందు కల్పనలకు గాని, మార్పులకు గాని ప్రయత్నింపలేదు. చారిత్రక విషయములను యథాతథముగ గ్రహించి, ఉత్తమ చారిత్రక నాటకముగ 'ప్రతాపాక్బరీయము'ను శ్రీనివాసరావుగారు రచించిరి.

4.6.6 తాళికోట యుద్ధానంతరము విజయనగర రాజులు పెనుగొండకు తరలిపోయి కొంతకాలము తరువాత చంద్రగిరిని రాజధానిగా జేసికొని రాజ్యము చేయుచుండ,వృద్ధవెంకటరాయల మరణానంతరము దుర్మార్గులైన జగ్గరాయాదుల కుట్రలనుండి ఏచమ నాయకుడు విజయనగర రాజుల సంతతిని సంరక్షించి తదభివృద్ధికి కారణ భూతుడగును. ఈ చరిత్రను దెలుపు నాటకమే 'చంద్రగిర్యభ్యుదయము'. ఈ నాటక రచనకు పూర్వము శ్రీనివాసరావుగారు స్యూయల్లు దొరగారి మరపుదట్టిన రాజ్యము (A Forgotten Empire)

1. 89, పు. 819, 820.

2. 158, సంపు. 1, ప్ర xi. (i) 94. (ii) 75, (iii)88.

మ. రా. రామకృష్ణపిళ్లెగారి 'పద్మిని' యను ఆంగ్లభాషలోని నవల, శిరోభూష ణం వెంకటరంగాచార్యులచే రచితమైన 'రంగరాయ విజయ' (1914) మను తెలుగు నవల, కర్ణాటక భాషలో గళగనాథకృత 'కుముదిని' (1918) అను నవల అను వీనిని చదివియున్నట్లు దెలియుచున్నది.[1] వీనిలో 'పద్మిని', దాని ననుసరించిన 'రంగరాయ విజయము' రెండును చారిత్రక విరుద్ధమైన ఇతివృత్తములు గలవని శ్రీనివాసరావుగారు విమర్శించిరి.[2] వీరు చాలవరకు చరిత్ర ననుసరించి 'చంద్రగిర్యభ్యుదయము'ను రచించిరి. అనగా దీనికి స్యూయల్ దొరగారి మఱపుదట్టిన రాజ్యము' ఆధారమని స్పష్టముగా తెలియును. అయినను కుముదినీ చాందుఖాన్ పాత్రల నిందురావుగారు ప్రవేశపెట్టిరి కాని దీనివలన చారిత్రక విరుద్ధమెక్కడను గోచరింపదు. ఈ పాత్రలు నాటకము నకు వన్నెదెచ్చినవి.[3] చిన్న ఓబుళరాయడు కుటుంబ సహితముగ రాజును సర్వనాశనము చేసినట్లు చరిత్ర చెప్పుచుండ, నాటకమున ఔచిత్యము కొరకు చిన్న మార్పు చేయబడినది. ఓబళుడు శ్రీరంగరాయాదుల జంప చెఱయొద్దకు బోగా క్షత్రియుడైన రాయలు భార్యను,సంతతిని వధించి, ఆత్మహత్మ గావించు కొనును. వీరనరసింహరాయలు తన భార్యను జంపి, ఓబళుని వధించి, చివర తానను కత్తిపై బడి మరణించును. ఇవి తప్ప తక్కిన కథయంతయు చరిత్రాత్మకమే.

4.6.7 చరిత్రాత్మక నాటకములలో చివరిది 'కాళిదాసు'. కాని 'కాళిదాసు' నాటకము పూర్తిగా చారిత్రక మని విశ్వసించుట కవకాశము తక్కువ. "ఈ నాటక సంవిధాన మంతయును గేవల కల్పనా కథగాఁ బారంపరిగ వచ్చినదిగాని యథార్థస్థితిగ నుండునని తలచుటకు మార్గము లేదు. భవభూతి, దండి, బిల్హణాది కవులు కాళిదాసుని సమకాలికులుగారు." [4] అని శ్రీనివాసరావుగారు నుడివిరి. ఇంకను కాళిదాసు నామమున ద్వాదశ సంఖ్యలో గల రనియు భోజుని కాలమందలి కాళిదాసు అభినవ కాళిదాసనియు శ్రీనివాసరావుగారు పరిశోధించి వివరించిరి.[5] 'భోజరాజు కాలమున నుండిన కాళిదాసభినవ

---

1 122 పీ. పు. 5-8. 2. అదే; 3. అదే.

4. 121 పీ పు. 3

5. భాసకాళిదాస విక్రమాదిత్యుల కాల నిర్ణయము (8-1-1919).

కాళిదాసగును గాని యాదికాళిదాసుగాదు. ఆది కాళిదాసు శాకుంతలాది నాటకములు రచించిన ప్రసిద్ధవర కవి. ఆది శంకరులు భర్తృహరి మొదలగు మహానుభావుల సమకాలికుఁడు. క్రీస్తు శకమునకు నాలు శతాబ్దములకు మున్నున్నవాడు. విక్రమార్క భోజుల కాలమునందున్న వారభినవ కాళిదాసులను బిరుదము లందినవారు. ఈ యభినవ కాళిదాసులలో నెవరో యొకరు, మేఘసందేశ కుమారసంభవాది కావ్యములు రచించినారు...నాటకములు రచించిన కాళిదాసు పేరు మాతృగుప్తుఁడు. ఇతఁడుఁజ్జయిని నేలుచు శాక్యులను నార్యావర్తము నుండి పాఱఁదోలి శాకారి నృపతియని పేరంది హర్షశకమును స్థాపించిన శ్రీ హర్ష విక్రమాదిత్యుని యాస్థానకవి. క్రీస్తుశకమునకు 457 వత్సరములకు ముందున్న వాఁడు. శ్రీ హర్ష విక్రమాదిత్యు నంతటి బలాఢ్యులకు విక్రమాదిత్య నామమును, గాళిదాసు నంతటి విద్యాధికులకుఁ గాళిదాస నామమును లభించుటచే నిజమగు వారి జీవిత కాలములు సనాతనము నుండి యధునాతనమునకు నీడ్వఁబడినవి.'' [1] అని వీరు స్పష్టముగా తెలిపిరి.

ఈ నాటకేతివృత్తము తమ సొంతముగాదని, దీని కాధారములైన వానిని వీరు పేర్కొనిరి. "ఈ నాటకములోని యితివృత్తమంతయు నా సొంతము గాదు. బ్రహ్మశ్రీ చిలకపాటి వెంకటరామానుజాచార్యులవారు కాళిదాస నాటకమనియు, భోజనాటకమనియు, వినోదకథా కల్పవల్లి యనియు వ్రాసియుండిరి. పూర్వకవుల శ్లోక పద్యములనేకములెత్తి కాళిదాస కృతములని వారు వ్రాసినారు, అందులోని కొన్ని పూర్వకవికృత చమత్కార శ్లోకములు నే గ్రహించితిని. మిగిలిన వానిని గాలవిళంబభీతిచే వదలితిని. మైసూరు రాజ్యములోఁ బండితులగు బ్రహ్మశ్రీ వేంకటాచార్యులవారు కర్ణాటకభాషలో భోజప్రబంధమని యొక నాటకము వ్రాసినారు. అది ప్రదర్శనీయముగ నున్నదికాని కొన్ని యసందర్భాంశములున్నవి. అవి పండితువరులకు రుచింపవనిదోఁచును ఈ నా నాటకములోను, అసందర్భాంశము లనేకములుండును. కళ్యవునకు మదాలస యను నప్సరసయందుఁ బుట్టినవాఁడు కాళిదాసని నే నింతకు మున్ను వినియుండలేదు. బ్రహ్మశ్రీ నారపరాజు లక్ష్మీకాంతముగారు, తమ కాళిదాస నాటక

1. 121. పీ పు. 3, 4.

ములో, నీగాథను సూచించినారు. ఆ గాథ నేనును గ్రహించితిని." [1] అని స్పష్టముగా కోలాచలంవారు తెలిపిరి.

ఈ నాటకమున కాధారములైన పైవానిలో మరొక విషయమును నమ్మ శక్యముగాని దానిని "పండిత శిరోమణియై వాక్పతియను బిరుదునంది సారస్వత ప్రపంచంబున మిక్కిలి ప్రసిద్ధిగాంచిన ముంజ మహీపాలుఁడు భోజునిఁ జంపఁ బ్రయత్నించెననుట విశ్వాసార్హముగాదు." [2] అని పేర్కొనినను తమ నాటకమునగూడ వీరీ విషయమునే గ్రహించిరి.

గ్రంథచౌర్యమన్నది ఏ కోశమున లేశమైనను తమ కంటగూడదను సత్య దృష్టితో పై గ్రంథములాధారములైనవని స్పష్టపరచి, ఈ నాటకమును మరింత మనోహరమొనరింప తాము గావించిన కృషినిగూడ వీరు "ఈ నాటకములోఁ బూర్వకవుల సంస్కృత శ్లోకములు విశేషముగనుండు కారణంబునఁ దెలుఁగు పద్యములుగొన్ని మాత్రము రచించితిని. సమస్యాపూర్ణములకు వ్రాయఁబడిన పద్యములు కేవలము చాటువులయి యాంధ్ర ప్రపంచమునందెల్లెడ వ్యాపించినవి. కొన్ని పద్యములు వదలఁదగినవిగ నున్నవి." [3] అని తమ పరిశుద్ధాత్మను ప్రకటించి యున్నారు. ఇది యిట్లుండగ కాళిదాసకృత మనబడు శ్యామలాదండక మీ నాటకమున గల దానిని శ్రీనివాసరావుగారిచేత రచితమని కప్పగల్లు సంజీవ మూర్తిరావుగారు, వారి వ్యాసము [4] ననుసరించి మరొక వ్యాసము వ్రాసిన వై. సీతారామశర్మగారు [5] ను ఆరోపించుట చింత్యము.

ఇట్లు జనశ్రుతిలో పరంపరాగతమగు చుండిన విషయములనే గ్రహించి శ్రీనివాసరావుగారు కాళిదాస నాటకమును రచించిరనుట సమంజసము.

---

1. 121 పీ పు 8. 2. అదే

3. అదే 4 21 పు. 17-35.

5. [illegible]

## 4. 7 రామాయణ నాటకములు :

శ్రీనివాసరావుగారికి చారిత్రకేతివృత్తములపైనే ప్రీతి యధికమైననువారి నాటకములలో సాబాలు పౌరాణికములు గలవు. 'సుమనోరమసభ' వారికోరిక ననుసరించియు, మిత్రుల ఉపదేశముచేతను, కొంతవరకు తమకే వానిపైమనసు గలిగియు శ్రీనివాసరావుగారు పౌరాణిక నాటకములు రచించిరి. వీరు ఇతిహాస పురాణకావ్యములనుండి ఇతివృత్తములను నెన్నుకొనిరి. వీరు యుద్ధకాండము తప్ప రామాయణము నంతటిని ఐదు నాటకములుగా రచించిరి. రామాయణ మున యుద్ధకాండమునందు రసవత్తర సన్నివేశములుగలవు. వానిని నాటకీ కరింపక వదలుటకుగల బలవత్తర కారణమేమిటో తెలియదు. శ్రీరామజనన నాటకమునందలి ఇతివృత్తము వాల్మీకి రామాయణమునందలి బాలకాండమున గలదేయైనను ప్రథమాంకమందలి విషయము రామాయణోత్తర కాండము నుండి గృహీతము.

రావణుడు తపస్సుచేసి బ్రహ్మవలన వరములు పొందుట కుబేరుని జయించి లంకనుండి తరిమి, అలకాపురమును ముట్టడించి పుష్పక విమానము గ్రహించుట, దిక్పాలకుల జయించి ముల్లోకముల అల్లకల్లోల మొనర్చుట, విష్ణువును భర్తగాపొంద దలచి తపోనిమగ్నయైన వేదవతిని మోహింప ఆ యవ మానమును భరింపలేక ఆమె అగ్నిలోదూకి ప్రాణత్యాగముచేయుట, రంభారావణ సంవాదము అను విషయములు ప్రథమాంకమున గలవు. ఇవి రామాయణ బాలకాండమున గన్పట్టవు. కాని శ్రీనివాసరావుగారు విష్ణువు శ్రీరామావతార మున భూలోకమున జన్మించుటకు బలవత్తర కారణములు చూపుటకై, రావణుని దుండగములను తెలిపి కార్యకారణ సంబధమును నిరూపించిరి. కనుక నీ యంశములు రామాయణోత్తరకాండములోనివే యైనను తరువాత కథ కెంతయు బలముచేకూర్చిన వనుటలో సందేహము లేదు. మరికొన్ని చిన్న మార్పులుకూడ కలవు. బ్రహ్మేంద్రాది దేవతలు విష్ణువునొద్దకేగి రావణుని దుండగములను వివరించి దేవలోకమును రక్షింపవలసినదిగా వేడుకొనుసందర్భమున వేదవతియు విష్ణువును ప్రార్థించినట్లు శ్రీనివాసరావుగారు చిన్న మార్పుగావించిరి. ఇది

రామాయణమున కనిపింపదు. క్షత్రియ వినాశముచేయ బద్ధకంకణుడైన పరశురాముడు, యజ్ఞదీక్షవహించిన దశరథుని సంహరింప, లోకసంరక్షణార్థము పుత్రులపొందగోరి దశరథుడు పుత్రకామేష్టి జేయుచున్నాడనియు, దివ్యలోచనములతో జూడవలసినదని వసిష్ఠుడు పరశురాముని ప్రార్థింపగా అతడట్లుగాంచి, సంతసించి, పుట్టిన పుత్రునకు తన నామముంచ వలసినదిగా వాగ్దానము చేయించుకొని వెడలిపోవును. ఇట్టిది వాల్మీకి రామాయణమునగాని, ఆంధ్రభాస్కర, రంగనాథ రామాయణములలోగాని లేదు. శ్రీనివాసరావుగారు దీనిని కల్పించిరి. పుత్రకామేష్ట్యంతమున ప్రాజాపత్య పురుషుడు ప్రత్యక్షమై దశరథునకు దివ్యపాయసపాత్ర మొసగును. వెంటనే దశరథుడు తనకు కన్పించిన కౌసల్యాకైకేయిలకా దివ్యపాయసమును రెండుగా విభజించియిచ్చును. తరువాత సుమిత్రరాగా కౌసల్యా కైకలచే నామెకు సాబాలిప్పించును. అందుకే కౌసల్యాకైకేయిలకు ఒక్కొక్కరును, సుమిత్రకు రెండు భాగములు లభించుటచే ఇద్దరుపుత్రులును జన్మించుటను శ్రీనివాసరావుగారు సూచించినట్లు తెలియును. కాని వాల్మీకిరామాయము మొదలైనవాని యన్నిటభార్యలు మువ్వురకు పాయసము పంచిపెట్టిన వెనుక మిగిలిన శేషమును సుమిత్ర కిచ్చినట్లు గలదు. కౌసల్యాకైకలు తమ పాయసభాగములలో సగము సగము సుమిత్రకిచ్చునట్లు శ్రీనివాసరావుగారు చిన్న మార్పుగావించి దానిచే శ్రీరామునియెడ లక్ష్మణుడు, భరతునియెడ శత్రుఘ్నుడూ భక్తితోనుండుటకు గల కారణమును స్పష్టపరచిరనవలయును.[1] లేనిచో వారట్లు వర్తింపవీలులేదని శ్రీనివాసరావుగారి తలంపు. ఈ కొన్ని చిన్నమార్పులుతప్ప తక్కిన కథ యంతయు రామాయణమునుండియే శ్రీనివాసరావుగారు గ్రహించిరి.

4.7 1 'సీతాకల్యాణ నాటకము' నందలి ఇతివృత్తము రామాయణము బాలకాండము లోనిదేయైనను శ్రీనివాసరావుగారి కల్పనలు కలవు. నాటకమున పూర్వరంగమునందలి లక్ష్మి సీతగా జన్మించుటకు నారదశాపము కారణమని కలదు' ఒకానొక సమయమున తుంబుర పర్వతులగానలోలయై లక్ష్మియుండ నారదుడటకేగి పల్కరింపలేదని కోపించి నారదుడు తుంబుర పర్వతులను మానవులుగ జన్మించునట్లును, లక్ష్మిభూమిపైజన్మించి, దానవునిచే నపహృ-

1. 28 పు. 80-84.

తయై భర్తవియోగము పొందునట్లును శపించును. తరువాత విష్ణువీవిషయ మెరిగి తాను శ్రీరాముడుగ భూమిపై జన్మింతుననియు, రామునకు సతిగా సీతా నామమున లక్ష్మియు, తుంబుర పర్వతులు అగ్నితేజస్సులను ముని కుమారులు గాను జన్మింతురనియు లక్ష్మిని ఓదార్చినట్లు పూర్వరంగమున గలదు. ఈ యంశము వాల్మీకి రామాయణమునగాని, భాస్కర రంగనాథ రామాయణము లలోగాని కనిపింపదు. వేదవతియే రావణ సంహారార్థము సీతగా జన్మించు నను వేదవతీ వృత్తమున్నను కోలాచలం శ్రీనివాసరావుగారీ యంశమును దానికి జోడించి తరువాత రామాయణకథకు సమగ్రతను సంపాదించిరన వలయును. విశ్వామిత్రుడు స్వయంసృష్టికర్త, త్రికాలవేదియనుటను నిరూపించుటకేకాక, వాల్మీకిరామాయణాదులలో సీతా స్వయంవర సమయమున రావణుడు కన్పట్టి కుండుటకు సరియైన సమాధానములేమిచే, విశ్వామిత్రుడు మాయా సీతను సృజించి, ఆమెను నిజ సీతగా తలంచి రావణుడెత్తికొని లంకకు పోవునట్లు కల్పించి, ధనుర్భంగ సమయమున నతడు లేకపోయినట్లు సమర్థించినారు కోలా చలంవారు. లేనిచో ఆ సమయమున రావణుడు తప్పక వచ్చియే యుండు ననుట సమంజసము. రావణుడు ఉద్యానవనమందు విహరించుచుండిన మాయా సీతను నిజసీతగాతలంచి, రాముని వేషమున నామె నపహరించి లంకకుగొని పోయి వివాహమాడ నుద్యమించును మాయాసీత తాను విశ్వామిత్ర మానస పుత్రిననియు, నిజసీతను శ్రీరాముడు వివాహమాడు చున్నాడనియు తెలిపి అదృశ్యమగును. అప్పటికి తన ప్రయత్నము విఫలమైనందుకు రావణుడు చింతించి, సీతనేవిధముగానైన నపహరింపవలెనని నిశ్చయించుకొనును. ఇట్లు శ్రీనివాసరావుగారీ కల్పనచే కార్యకారణసంబంధమును సమకూర్చిరనవలయును. విశ్వామిత్రుడు త్రికాలవేది యనుటను నిరూపింప, పరశురాముని యవతారము ముగియవచ్చినదనియు, శ్రీరాము నతడెదిరించి తన ప్రభావము నంతటిని శ్రీరా మున కప్పగించుననియుముందే గ్రహించినట్లు తృతీయాంకమున శ్రీనివాసరావు గారు కల్పించిరి. ఇట్లు శ్రీనివాసరావుగారు చేసినమార్పులు నాటకమున కెంతయు సామంజస్యమును చేకూర్చినవి.

4.7.2 పాదుకాపట్టాభిషేక నాటకమునకు మూలము వాల్మీకి రామాయణము అయోధ్యాకాండము. కాని శ్రీనివాసరావుగారుకొన్ని మార్పులు

గావించిరి. వాల్మీకి రామాయణమునను, భాస్కర రామాయణమునను దశరథుడు రామునకు పట్టాభిషేకము చేయదలచినట్లు దెలుప రాముడు తండ్రికి ప్రత్యుత్తర మిచ్చినట్లులేదు. కాని నాటకమున రాముడు తానింకను చిన్నవాడననియు తండ్రి యుండగనే తానన్హుడననియు, తమ్ములులేని సమయమున తానభిషిక్తుడగుట సంతోసదాయకము గాదనియు వినయముట్టిపడునట్లు తండ్రి కెరిగించెను. ఇట్టిది రంగనాథ రామాయణమున సూచనప్రాయముగ గలదు. కాని శ్రీనివాసరావుగారు పితాపుత్రుల సంభాషణమున రాముని ఉత్తమశీలమును స్పష్టపరచి నాటకమును మనోహరమొనరించిరి. శ్రీరామ పట్టాభిషేక విషయమును తెలిసికొన్న మంథర తత్పట్టభంగము గావింపదలచుటకు కారణము తన బాల్యమున రాముడు తనను పాదతాడనము గావించుట అను నంశము వాల్మీకి రామాయణమునలేదు. భాస్కర రంగనాథ రామాయణములలో నదిగలదు. నాటకమున రామునకుగాక భరతునకు పట్టము గట్టవరము వేడుమని మంథర కైకకుబోధింప మొదటనట్టిది రుచింపని యామెచే "బాల్యంబున రామునుండి నీకు గలిగిన చరణతాడనభంగమునకు వైరశుద్ధి నీ వరయుచున్నావని నాకు దోచెడు."[1] నని శ్రీనివాసరావుగారు పల్కించినారు. కాని దేవ కార్యార్థము మంథర కైకకు దుర్బోధచేసినట్లు శ్రీనివాసరావుగారు గల్పించినారు శ్రీరాముని పట్టాభిషేకము మరుదినమే జరగబోవునని చాటింపు వానివలన వినిన మంథర "హా! హా! అంతయును గరతలామలకంబాయెను. ఇంతటి యుత్సవంబునకు గారణంబిదియేనా? ఆ ధాత్రిమిడిసిపాటునకు హేతువు స్పష్టమాయెను. (అనుచు జిచ్చువడి యించుక నిలిచి భూతావేశమయిన దానింబలె నటునిటు పాద విన్యాసంబొనర్చి తలయూచుచు నావులించుచు నెట్టకేలకు స్మారకము వచ్చి) ఏమీ! ఇవుడే నా చెవిలో మాటలాడిన మహనీయుండెవండు? ఎందుడాగెను? (నలుదిక్కులంజూచును) ఎవడులేడే! ఆ మహానుభావుడు నా వీనులనే వచనంబులజొనిపెను? (ఆలోచించి) "రాముడు రాక్షసవధార్థము జన్మించినాడట! దిగ్దిశల రాక్షసులు ప్రబలినారట! రాముడిచట రాజ్యమేలుచుండిన రాక్షసవధకు మార్గములేదట! కావుననే నెటులైనబట్టభంగం బొనర్చి రామునకు రాజ్య వియోగము గల్పింపవలెనట! దీని నుండి నాకేపాపమునురాదట!" ఈమాటలు గదా నా వీనుల దూరినవి. (తలయూచి) ఇది దేవతాకార్యమని దోచుచున్నది.

---

1. 108 పు. 16.

అట్టి దివ్యకార్యంబునకు నా సాహాయ్యంబుగోరంబడినది. హా హా ! దేవతలు సైతముదమ కార్యమును సాధించుకొనుటకు దుష్టుల సాహాయ్యంబు నపేక్షించు చుందురుగదా? కాని అంతటి దేవతలే వేడికొనుచుండ నేనేల సాహాయ్యపడ గూడదు? రామరాజ్య వియోగమునకు నా యొనరింపఁదగిన సాహసమంతయును వెచ్చించెద. అదిగో జ్యేష్ఠాదేవియుంబోలె వేకువయిన జాము నిద్రించియిపుడె లేచి, నను గానక వెదకుచున్నది యా కైక. నా మాయలన్నియునిపుడు విని యోగింపవలెను. ఆటబొమ్మగ గైకను ముందునిలిపి సూత్రధారిణిగనే వెనుక నుండి సూత్రములాడింపవలెను. ఇదియ నా చేయందగిన కార్యము. (ఆలోచన చేయువిధంబునఁ గపోలన్యస్తహస్తయై యశ్రుపూరితనేత్రయై కూర్చుండును)''[1] ఇట్లు శ్రీనివాసరావుగారు ఏ రామాయణమునను గన్పింపని యీ యంశమును కల్పించి మంథర దుర్గుణమును తొలగించుటకు యత్నించిరనవలయును. అదే విధముగ కైకయు దుర్వినీత గాదనుటకు వలసినట్లుపాత్ర పోషణమును గావించిరి.

రామాయణమున శ్రీరాముడు భరతునకు వేదాంతోపదేశము గావించినట్లు గలదు. శ్రీనివాసరావుగారు దానిని మార్చి, శ్రీరాముడుతండ్రి మరణమువిని పామరునివలె నిశ్చైతన్యుడుకాగా వశిష్ఠుడు రామునకు దుఃఖోపశమనమునకు వేదాంతోపదేశము గావించినట్లుకూర్చిరి. ఈ మార్పు తత్సమయానుగుణమై యొప్పుచున్నది.

జాబాలి రామునకు నాస్తికవాదముదెలుప, రాముడు దానిని ఖండించినట్లు రామాయణమున ప్రసిద్ధము. కాని శ్రీనివాసరావుగారు ఇది దృశ్యమగుటచే దానిని పరిత్యజించిరి. ఇట్లుకొన్ని మార్పులు కోలాచలంవారు కావించినను బాలవరకు వాల్మీకిరామాయణము అయోధ్యాకాండము పాదుకాపట్టాభిషేక నాటకమున కాధారము. శ్రీనివాసరావుగారికంటె ముందే ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారును, పానుగంటి లక్ష్మీనరసింహారావుగారును 'పాదుకాపట్టాభిషేకము' రచించినారు. కాని వానిని శ్రీనివాసరావుగారు అనుసరింపక అందరికి మూలమైన రామాయణమునే గ్రహించిరి. పైగా వారి నాటకముల కంటె పైని పేర్కొన్నట్లు శ్రీనివాసరావుగారు విశిష్టముగా తమ నాటకమును రచించిరి.

1. 108 పు. 7,8.

పైరెండు నాటకములలోను నందీ గ్రామమున పాదుకల నభిషేకము జరిగి నట్లున్న ప్రసిద్ధ విషయమునుమార్చి అరణ్యముననే జరిగినట్లు రచించిరి. అది యుచితముకాదని శ్రీనివాసరావుగారి తలంపు.[1]

4 7 3 'లంకాదహన నాటక' రచనకు గోపీనాథ రామాయణము పకరించినదని శ్రీనివాసరావుగారి నాటక పీఠికలో తెలిపిరి. గోపీనాథ రామా యణమునకును ఇతర రామాయణములకువలెనే వాల్మీకి రామాయణమే మూలము. అరణ్య, కిష్కింధా, సుందర కాండస్థేతివృత్తము లంకాదహన నాటకమునకు మూలము ఈ నాటకము రామ లక్ష్మణులవలన తనకు గల్గిన పరాభవమును శూర్పణఖ రావణునకు తెల్పుటతో నారంభించి హనుమంతుడు లంకను గాల్చివచ్చి సీతావృత్తాంతము రామునకెరింగించి, ఆనవాలుగా సీతాదేవి యిచ్చిన చూడామణిని రామున కొసంగుటతో ముగియును. సంపూర్ణముగ రామాయణమునను సరించియే ఈ నాటకము రచితము. కాని రెండు యంశములు నాటకమున గన్పట్టవు. ప్రథమ దర్శనమున హనుమ రామ లక్ష్మణులను భిక్షుక వేషమున జూచినట్లు రామాయణమున గలదు. నాటకమున స్వస్వరూపముతోనే దర్శించును. నాటకమున సౌలభ్యమునకై యిట్లు కోలా చలంవారు గావించియుందురని తలంప వచ్చును. సీత రావణాపహృతయై కొనిపోబడుచు, ఉత్తరీయమున తన యాభరణములను మూటగట్టి క్రిందికి వదలి పోవును. లభించిన ఆ నగలమూటను సుగ్రీవుడు భద్రపరచి, రాముడు సీతా న్వేషణకై వచ్చినప్పుడొసగును. ఈ యంశము రామాయణమున గలదు. కాని నాటకమున దీనికి తావులేకపోయినది. ఇట్టి యల్పమైన మార్పులుతప్ప లంకాదహన నాటకమునందలి వస్తువుపూర్తిగా రామాయణము ననుసరించియే శ్రీనివాసరావుగారు రచించిరి.

4·7·4 రామాయణోత్తరకాండస్థ కథను స్వీకరించి 'కుశలవ' నాట కమును కోలాచలంవారు రచించిరి. తిక్కన, కంకంటి పాపరాజు ఉత్తర రామాయణములలోను నిక్కథగలదు. నాటకమున జైమిని భారతమునందలి కథ చాలవరకు అనుసరింపబడినదనవచ్చును. ఉత్తర కాండమునలేని రజకి

---

రజకుల వృత్తాంతము జైమినిభారతమున గలదు. భవభూతికృతోత్తర రామ చరిత నాటకమునను నిదే ఇతివృత్తము కలదు. 'కుశలవ' నాటక వస్తువిన్నిటి నున్నను కోలాచలం వారు కొన్ని కల్పనలు, మార్పులు గావించి నాటకము నెంతయు సహృదయరంజకముగా రచించిరి. శ్రీరాముడు సీతను పరిత్యజించు టకు కారణము శూర్పణఖామంథరలనునది శ్రీనివాసరావుగారు కుశలవ నాటక మున ప్రధానముగా గావించిన కల్పన. శ్రీరామునకు జరిగిన పట్టాభిషేకమును తెలిసికొన్న శూర్పణఖా మంథరలు విజన ప్రదేశమున కలిసికొని తమకు పూర్వము శ్రీరామునివలన గలిగిన యవమానమును స్మరించి సీతారాములకు సౌఖ్యము లేకుండజేయ నిశ్చయించుకొందురు. ఇందులోను శూర్పణఖ ముదుసలిదాని వేషమున చాకలిరంగని భార్య ఓబి, బోయభీమయ నాయకునితో లేచిపోయినట్లు రంగనికిజెప్పి "రావణుడెత్తికొనిపోయిన సీతను మరల రాముడు దెచ్చుకొన్నట్లు ఓబిని దెచ్చుకొనుటకు నీవేమి రాముడవా?" అని వాని మనసు విరిచి, మరొక వివాహమాడుమని రంగనికి పౌరుషముపోసి దుర్బోధచేయును ఓబి తలిదండ్రులు పంచాయతిచేసి రాజునకు చెప్పుదుమని భయపెట్టి రంగనిని ఓబితో కాపురముచేయునట్లు అంగీకరింపజేయుదురు. చాకలివాడన్న సంగతి చారునివలన రామునకు తెలియునట్లు శూర్పణఖయే గావించును. ప్రధానముగా ఒక దినము సీత దాసి రానివేళ ఆదాసి వేషమున సీత పడకటింటిలో ప్రవే శించి తానంతకుముందే సీతారావణులేక శయ్యాగతులై యున్నట్లు చిత్రించిన చిత్రపటమును సీత తలగడక్రిందనుంచి తెలియనట్లుపనిలో నుండును గూఢ చారిప్రవేశించి చాకలివీధిలో జరిగినసంగతి తెలుపును. అచటనే దాసి వేష మునున్న శూర్పణఖ తగిన సమయమనియెంచి సీత రావణునిగూర్చి సదా తలంచుచుండుననియు, అందుకు నిదర్శనము వారిద్దరు నేకశయ్యాగతులైన చిత్రపటము ఆమె తలగడ క్రింద నుండుటయేయనియు రాముని మనస్సు విరిచి వేయును. రాముడిట్టిచిత్ర పటముగాంచి ఖిన్నుడై సీతను పరిత్యజింప నిశ్చ యించును. రాముడు సీతను పరిత్యజించుటకు కారణ మీ శూర్పణఖయేయని నాటకాంతమున విభీషణుడు శూర్పణఖనుబట్టితెచ్చి రాముని యెదుటనుంచి శిక్షింపుమన రాముడు క్షమించి వదలిపెట్టును. ఈ యంశముపైని పేర్కొనిన రామాయణములలో నెందును గన్పట్టదు. కాని రజకీ రజకుల వృత్తము జైమిని భారతమున గలదు. భవభూతి ఉత్తర రామచరిత నాటకమునను

నాచ్యముగాగాక సూచన చేయబడినది. కాని శూర్పణఖయే కారణమైన సంగతి మాత్రములేదు. కనుకనిది శ్రీనివాసరావుగారి కల్పన. అయినను శ్రీనివాసరావుగారే ఉపోద్ఘాతములో "ఈ నాటకములోని యితివృత్తముకొంత వఱకుఁ బట్టాభిరామాయణములోని కథ ననుసరించినది." [1] అని నుడువుటచే పై కల్పనమును పట్టాభిరామాయణములోనిదే యై యుండునేమో ! ఇట్టి కల్పనమే పండిత కె. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'లవకుశ' నాటకముననుగలదు. రావుగారి నాటకమున శూర్పణఖామంథరలుండ శాస్త్రిగారి నాటకమున శూర్పణఖా కరాళులు గలరు. ఇట్టి కల్పనము స్వకీయమని శాస్త్రిగారు తమ నాటక పీఠికలో వ్రాసికొనినట్లు గొల్లపూడి శ్రీరామమూర్తిగారు "ఆంధ్ర నాటక రంగమున" "సకల జనానందకరమగు రామరాజ్యమున హీనజాతివారైనను, లోకజనయిత్రి యగు జానకీదేవిపై నపనింద నారోపించుట శ్రీరామ ప్రజాపాల నౌన్నత్యమునకు భంగకరమని యెంచి, నే నా రజకీ రజకులు శూర్పణఖా కరాళులను రాక్షసులనుగా నాటకంబున సంవిధాన మొనర్చితి"[2] నను విషయమును పేర్కొనిరి. కాని యిట్టి కల్పనము శాస్త్రిగారి స్వకీయముగాదనియు శ్రీనివాస రావుగారి నుండియే వీరు గ్రహించిరనియు స్పష్టమగును అందుకు శ్రీనివాస రావుగారి మాటలే తార్కాణము "ఇందులోని యితివృత్తచిత్రము నొకరిద్దఱు గ్రహించి, తమ కల్పనాశక్తి వలనఁ గలుగఁబడినదని వ్రాసికొనినారు. యశః కాముకులగు బాలురటు పలికి కొనుట సహజమేను. దానికి నేఁ జింతింపనుగాని బాణుఁడు నుడివిన భంగిఁజోర కవులను నామమందురే యని మాత్రము చింతించెద." [3] అని మెత్తమెత్తగ నిరసించి, గర్హించి శ్రీనివాసరావుగారు మర్యాదను పాటించిరి. మరొక్క చిన్న విషయము. కుశలవ నాటకారంభ మున శూర్పణఖతో కలిసి సంభాషించు సమయమున మంథర బాల్యమున రాముడు తనను పాదతాడనము చేయుటచే రాముని పట్టభంగ మొనర్చితిననియు మరల నతని కేదేని యపఖ్యాతి గావింప తలచి వేచియున్నట్లును చెప్పును. కాని పాదుకాపట్టాభిషేక నాటకమున దేవకార్యార్థము మంథర పట్టభంగ మొనర్చి నట్లు శ్రీనివాసరావుగారు కల్పించియు కుశలవ నాటకమున మామూలు పద్ధతిలో

1. 104 ఉ పు. 3.

2. 3 పు 32, 33. 3. 104 ఉ. పు. 3.

మంథరచే పల్కించిరి. దీనికి కారణము రామాయణ నాటకములలో మొట్టమొదట కుశలవ రచించి చిట్టచివర పాదుకా పట్టాభిషేక నాటకము రచించుట యని తెలియును. ఇంకను కొన్ని చిన్న మార్పులు నాటకమున గలవు. లవణాసుర సంహారము గావింపుమని చ్యవనాది మహర్షులు రాముని కోరినట్లు రామాయణ మున నుండ నాటకమున నారదుడు కోరినట్లు గలదు. రామాయణమున కుశ లవులు సవనాశ్వమును బట్టుట, యుద్ధమొనర్చుట యను ప్రసక్తి లేదు. కాని నాటకమున నట్టిది గలదు. ఈ యంశము జైమిని భారతమునను సరింపబడినది. యుద్ధ ప్రసక్తి భవభూతి ఉత్తర రామచరిత నాటకమున గలదు కాని కుశ లవులతో లక్ష్మణ పుత్రుడైన చంద్రకేతునకు యుద్ధము జరిగినట్లు వర్ణించి, పుత్రులు తండ్రితో యుద్ధయు చేయుట యను ననిష్టమును భవభూతి తొల గించెను. రామాయణమున యజ్ఞవాటికలో కుశలవులు రామాయణ గానము చేసినట్లుండ నాటకమున యుద్ధవాటికలోనే కుశలవులు గానము చేసిన కొన్ని పాటలు రాముడు వినినట్లు మార్చిరి. రామాయణమున ఉత్తర కాండమున సీత భూ వివరమున నదృశ్య యగును. కాని నాటకమున సీత రామునితో పుత్రులతో కలిసి అయోధ్య కేగి సుఖముండునట్లు మోదాంతము గావింపబడినది. ఈ విషయమున జైమిని భారత, భవభూతి ఉత్తర రామ చరితములనుసరింప బడినవి. ఈ విధముగా ఈ కుశలవ నాటకము నెంతయో రమణీయముగా రచించిరి. ఇట్లలతియలతి మార్పులతో, అవసరమని తలంచినప్పుడు కొన్ని కల్పనలతో యుద్ధకాండ విరహితముగా రామాయణము నంతటిని ఐదు నాటక ములుగా రచించి శ్రీనివాసరావుగారు పుణ్యము, పురుషార్థము సంపాదించి ధన్యులైరి.

## 4.8 భారత నాటకములు :

పూర్తిగా కాకపోయినను కొన్ని రసవద్ఘట్టములను గ్రహించి భారతేతి వృత్తముతో శ్రీనివాసరావుగారు మూడు నాటకములు రచించిరి ద్రౌపదీ వస్త్రాపహరణ నాటకమున భారతములోని ఆదిపర్వము షష్ఠాశ్వాసనమున పాండవులు లాక్షాగృహమున వసించుటతో నారంభించి సభాపర్వాంతము వరకు గల ఇతివృత్తము గృహీతము. ఇట్లు దీనికి మూలము భారతమే యైనను

అక్కడక్కడ శ్రీనివాసరావుగారు చిన్న మార్పులు గావించిరి. మత్స్యయంత్రమును అర్జునుడు ఖండించిన వెనుక ద్రౌపదితో కుమ్మరియింటి కేగిన పాండవులను ద్రౌపదీ స్వయంవరమునకై వచ్చిన బలరామకృష్ణులు కలిసి కొందురు. ఈ యంశము నాటకమున పరిత్యక్తము. మత్స్య యంత్రము గొట్టిన వాని నెరుగుటకై ద్రుపదుడు తన పుత్రుని ధృష్టద్యుమ్నుని పంపి, తరువాత వారిని తోడితేర పురోహితుని పుచ్చినట్లు భారతమున నుండ,నాటకమున మంత్రిని పంపినట్లు గలదు. ద్రౌపదీ పాండవుల వివాహానంతరము వారింద్రప్రస్థ పురమున నున్న సమయమున నారదుడు వేంచేసి వారు ద్రౌపదితో కాపురము చేయవలసిన సమయ మెరింగించినట్లు భారతమున నుండ,వివాహానంతరము వారు ద్రుపదపురమున నుండగనే నారదుడు వేంచేసి సమయము నెరింగించినట్లు నాటకమున కోలాచలం వారు మార్చిరి పాండవులీ విషయము వివాహమైన వెంటనే తెలిసికొనుట ఉచితమని కాబోలు రావుగారట్లు కావించిరి. దుర్యోధనుడు మయసభను సందర్శించిన సమయమున తెలియమిచే తబ్బిబ్బు పడినప్పుడు ద్రౌపదితో పాండవులైదుగురు నవ్వినట్లును, దుర్యోధనుని వస్త్రములు తడసినప్పుడు ధరనుజుడు భీమునిచే దుర్యోధనునకు వస్త్రాభరణము లిప్పించినట్లును భారతమ్మున నుండ శ్రీనివాసరావుగారు నాటకమున ద్రౌపదీ భీమ సహదేవులు ఉండినట్లును, ద్రౌపది నవ్వినట్లును, భీముడు పరిహసించి సహదేవునిచే వస్త్రములిప్పించినట్లును మార్చిరి. నాటకమున తరువాతి కథకు సకారణముగా నుండవలెననెడి దృష్టితో శ్రీనివాసరావుగారిట్లు గావించియుందురని తలంపవలెను. భారతమున అందరి యెదుట ధర్మజశకునులు సుహృద్ద్యూతమాడినట్లుండ, నాటమున ధర్మజుడటకు వచ్చు సరికి కర్ణశకుమలు జూదమాడుచుండినట్లును, శకుని అక్షవిద్యలో తన కంటె ప్రావీణ్యముగలవాడు వేరొకడు లేడని గర్వించి పలికిన పలుకులచే ప్రేరితుడై ధర్మజుడు జూదమాడినట్లును, ఆ సమయమున అచట దుర్యోధన శకుని కర్ణ ధర్మజులు మాత్రముండినట్లును మార్చబడెను ఇచట ఈ మార్పువలన ధర్మజుడు ద్యూతప్రియు డనుటను దెలుపుచు శకుని మాటలచే ప్రేరితుడై యుండినట్లును, దానిచే ధర్మజుని యందు దోషము లేదని నిరూపి ప శ్రీనివాసరావుగారు ప్రయత్నించిరి. సభా మధ్యమునందే దుశ్శాసనుడు ద్రౌపదిని వివస్త్రను గావించినట్లు భారతమున ప్రసిద్ధము. కాని నాటకమున దుశ్శాసనుడు వివస్త్రగావించుచుండ ద్రౌపది యొక గదిలో ప్రవేశించినట్లు శ్రీనివాసరావుగారు కల్పిం

చిరి. ఈ మార్పు నాటకమును ప్రదర్శన యోగ్యముగ చేయుటకే యనుట స్పష్టము. రంగమున స్త్రీని వివస్త్రను గావించుట సభ్యత కాదుగదా ! ఇట్లే శ్రీనివాసరావుగారు ఔచిత్యమునకై నాటకమున చిన్ని మార్పులు గావించిరి.

4.8.1 'కీచకవధ' యను నాటకమునకు భారతారణ్య పర్వము ప్రథమాశ్వాసమున పాండవులు ద్వైతవనమున నుండ వారి యొద్దకు వ్యాసుడు వచ్చిన దగ్గరనుండి ఆశ్వాసాంతము వరకు గల కథయు, విరాట పర్వము ప్రథమ, ద్వితీయాశ్వాసములలోను గల కథ ఆధారము. అయినను కొన్ని మార్పులు లేకపోలేదు. ద్వైతవనమున పాండవులు నివసించుచుండ వేదవ్యాసుడు వారి యొద్దకు వేంచేసి, శత్రువుల జయించుటెట్లని ఆలోచించుచుండిన, ధర్మజునకు ప్రతిస్మృతి విద్యను నేర్పినట్లును, దానిని అర్జునునకు ధర్మజుడు బోధించినట్లును, తన్మూలమున నతడు దివ్యాస్త్రములను తపముగావించి సంపాదించునని భారతమున గలదు. కాని నాటకమున వ్యాసుడే అర్జునునకు ప్రతిస్మృతి విద్యను బోధించినట్లు శ్రీనివాసరావుగారు మార్చిరి. పైగా భారతమున వ్యాసుడు వచ్చునపుడు అర్జును డచటనే యుండును. నాటకమున అతఃపూర్వమే తపస్సునకు తెరిగినట్లు శ్రీనివాసరావుగారు మార్చిరి. దివ్యాస్త్రలాభమునకై శివుని గూర్చి తపమాచరింపుమని, ఇంద్రుడు బ్రాహ్మణ వేషమున వచ్చి అర్జునునకు తెలిపినట్లు గల భారత విషయము నాటకమున పరిత్యక్తము. ఈ రెండు మార్పులును శ్రీనివాసరావుగారు సంక్షేపమునకై చేసియుందురని తలంపవచ్చును. కీచకవధా విషయము వేగులు వచ్చి చెప్ప, దుర్యోధనుడు సభాసదులను పృచ్ఛించును. ధర్మజుడున్న దేశము సుభిక్షమై గోధనముతో విల్లసిల్లుచుండునని భీష్ముడు సమాధానమిచ్చును. అట్టి దేశము మత్స్య దేశమనియు, నందలి గోగణమునపహరించిన పాండవులు బయల్వెడుదురనియు దుర్యోధనుడు తలంచునని భారతమున గలదు. అందే పాండవులు విరటు కొల్వున నుండ మల్లుడొకడు వచ్చుటయు వానిని వలలుని వేషమున నుండిన భీముడు అతని నోడించినట్లును గలదు. ఈ విషయములను నాటకమున చక్కగ మార్చిరి. నాటకమునందు గావింపబడిన మార్పిది. పాండవులు విరటుని కొల్వునకుదురుకొందురు. వారిని కనుగొనలేక పోయితిమని దుర్యోధనునకు వేగులు తెలియజేయుదురు. సభలోనున్న కర్ణుడు వారు మరణించియుందురనును. అశ్వత్థామ అతనిని అధిక్షేపించును. దుర్యోధనుని పక్షమున నున్న భీష్మునకు తెలిసిన విషయము చెప్పక

తప్పదయ్యెను. ధర్మజుడుండు దేశము గోసమృద్ధితో సుభిక్షమైయుండుననియు వేగులట్టి దేశమేదియో వెదుకవలయుననియు, పాండవులలో భీముడు తొందరగ బయటపడును గనుక కండలు దిరిగిన మల్లుని పంపి దేశములో మల్లయుద్ధము చేయించిన వాని నెదిరింప భీముడును, తన్మూలమున పాండవులును బయల్వె డుదురనియు భీష్ముడుపదేశించును తత్ప్రకారమే జీమూతుడను మల్లుని దుర్యో ధనుడు పంపగా వాడు మత్స్యదేశమున భీమునిచే నోడింపబడినట్లు చక్కగ సప్రయోజనముగా నాటకమున శ్రీనివాసరావుగారుపయుక్త మొనర్చుకొనిరి. అనగా భారతమున కీచక వధానంతరమున్న విషయమును నాటకమున వధా త్పూర్వమే జరిగినట్లు శ్రీనివాసరావుగారు మార్చిరి. సుదేష్ణ కొరకు సైరంధ్రి కీచకుని మందిరమున మదిర తేరబోయినప్పుడు, కీచకుడు పయిబడి పట్టుకొనగా సూర్యానుగ్రహమున వచ్చిన రక్కసుడు తన్నావహింప కీచకుని త్రోసిపోయి నట్లు భారతమున గలదు. నాటకమున కీచకుని సైరంధ్రి పాదముతో తన్ని పోయినట్లుగ మార్పబడినది. కాని భయభ్రాంతయై విరటుని కొలువు కూటమున కేగుచున్న సైరంధ్రిని వెండ్రుకలు పట్టికొని, కీచకుడు కాలితో తన్నినట్లు గల భారత విషయము నాటకమున పరిత్యక్తము. సైరంధ్రి పాత్రపోషణకై శ్రీనివాసరావుగారిట్లు గావించిరని తలంప వచ్చును. ఈ విధముగా శ్రీనివాస రావుగారు 'కీచక వధ' అను నాటకమును సార్థకమైన చిన్న మార్పులతో రచించిరి.

482 భారతము ఉద్యోగపర్వమున శ్రీకృష్ణ రాయబారము ముగిసిన వెనుక ఇరుపక్షములు యుద్ధసన్నాహములు చేయుటతో నారంభమై యుద్ధ పంచకమున సౌప్తిక పర్వమున అశ్వత్థామ శిరోమణిని దీయునంతవరకు గల ఇతివృత్తము 'శిరోమణి' నాటకమునకు మూలము. అయినను ఒకటి రెండు కల్పనలు, కొన్ని మార్పులు నాటకౌచిత్యముకొరకు శ్రీనివాసరావుగారు గావించిరి. బాహ్లిక భీష్మధృతరాష్ట్రులు యుద్ధము వలదని బోధించునపుడు భీష్ముని మాట లకు గినిసి భీష్ముడు మరణించునంతవరకు తాను యుద్ధము చేయనని కర్ణుడు ప్రతిన బూనినట్లు భారతమున గలదు. కాని నాటకమున శ్రీనివాసరావుగారీ విషయమును మార్చిరి. రాబోవు యుద్ధమున సర్వసైన్యాధిపతివికమ్మని దుర్యోధనుడు భీష్మునికోరి, రెండు పక్షములలోని వీరుల బలాబలములగూర్చి చెప్పుమని ప్రార్థించును. భీష్ముడు అతిరథ, మహారథాదులను నిర్ణయించిచెప్పి,

కర్ణుని అర్ధరథుడని పేర్కొనగా, కర్ణుడు కుపితుడై భీష్ముడు మరణించు వరకు తాను యుద్ధముచేయనని అస్త్రములను వదలినట్లు మార్చబడినది. భారతమున లేని ద్రౌపదీ భీష్ములకలయికను శ్రీనివాసరావుగారు నాటకమున కల్పించిరి. కౌరవ పక్షమున యుద్ధమునకు సిద్ధమై, సర్వసైన్యాధిపతిత్వము వహించిన తాత భీష్మనియొద్దకుబోయి భర్తృభిక్ష పెట్టుమని ద్రౌపది వేడినట్లును, శ్రీకృష్ణుడు పాండవులకు సాహాయ్యుడై యున్నంతవరకు వారజేయులనియు,కనుక పాండవులే జయింతురనియు, ద్రౌపదిసుమంగళీత్వమునకు లోపము లేదనియుచెప్పి, పాండవులైదుగురినితప్ప సంగ్రామ రంగమున నితరుల నందరిని వధింతునని దుర్యోధనునకు తాను మాట యిచ్చితిననియును ద్రౌపదికి తెలిపినట్లును కోలాచలంవారు కల్పించిరి. భారతమున అశ్వత్థామ మరణించెనను వార్త భీమునిచే, తరువాత ధర్మరాజుచే కృష్ణుడు చెప్పినట్లును, అదివిని ద్రోణుడస్త్రసన్న్యాస మొనర్చినట్లును గలదు. కాని నాటకమున ధర్మజు డొదబడమి కృష్ణుడు. ధర్మజుని రూపమున ఘటోత్కచునిచే అశ్వత్థామ మరణించెనని చెప్పించినట్లు శ్రీనివాసరావుగారు మార్చిరి. ఈ మార్పు ధర్మజుని ధర్మపరాయణత్వము తెలియునట్లు అసత్యమంటనట్లు గావింపబడినది. కాని భారతమున ధర్మజుడు అశ్వత్థామ మరణించెనని పల్కుసరికే, ఇంద్రదత్తమైన శక్తివలన కర్ణునిచే ఘటోత్కచుడు నిహతుడైనట్లు గలదు. కనుక ఈ మార్పునంతగా పొసగదేమో అనిపించును. కౌరవులను చాలమందిని వధించితినని యుద్ధరంగమునుండివచ్చి భీముడుదెలుప, అది తనకు సంతోషదాయకము కాదనియు, దుర్యోధన దుశ్శాసనులు వధింపబడినప్పుడే తన కమితానందమనియు, కౌరవుల దుర్ణయమునుచెప్పి, భీముని పరాక్రమమునుపొగడి ద్రౌపది భీముని యుద్ధమునకు ప్రోత్సహించినట్లు నాటకమున శ్రీనివాసరావుగారు కల్పించిరి. ఇది భారతమునలేదు. ఈ కల్పన భీముని రణోన్ముఖుని గావించి దుర్యోధన దుశ్శాసనుల వధకుపకరించును. దుస్ససేనునివధించి, రక్తసిక్త హస్తములతో భీముడు ద్రౌపది కురులను ముడిచినట్లు నాటకము తృతీయాంకము చతుర్థరంగమున శ్రీనివాసరావుగారు కూర్చిరి. భారతమున భీమ దుర్యోధనుల గదాయుద్ధముచూడ బలరాముడు వచ్చును. భీమునిచే నూరుభంగము గావింపబడి దుర్యోధనుడు నేలపైపడగానే బలరాముడు కృష్ణుని నిందించును. ఇది నాటకమున విడువబడినది. నకుల సహదేవులు ధర్మజాదులతో ద్వైపాయనహ్రదమునకు బోయినట్లు నాటకమున లేదు. సంక్షిప్తతకై శ్రీనివాసరావుగారిట్లు గావించి యుందురని తలంపు

వచ్చును. కృపకృతవర్మలతో పాండవ శిబిరముల యొద్దకు అశ్వత్థామపోగా శివుడు భూతమై కన్పట్టి, నతడు సర్వాయుధములు ప్రయోగింప వాని నది మ్రింగును. అగ్న్యాకారమై భయంకరముకాగా అశ్వత్థామ ఆత్మాపహారమొనర్ప శివుడు సంతసించి ప్రత్యక్షమై కత్తి నొసగినట్లు భారతముననుండ రావుగారు నాటకము ప్రదర్శనయోగ్యముగా నుండుటకై అగ్నిసంగతి పరిహరించిరి. శేష మిందు కలదు. ఇందింకొక విశేషమును గలదు. రామాయణమున యుద్ధకాండమును నాటకముగ రచింపక శ్రీనివాసరావుగారు, భారతమున యుద్ధ పంచకమును గ్రహించి ఈ శిరోమణి నాటకము ప్రదర్శన యోగ్యముగ రచించుట ప్రశంసనీయము. నాటకమున యుద్ధము ప్రదర్శింపగూడదనుట ప్రాచీన లాక్షణికమతము అవసరమైనప్పుడు సూచింపవలెనని కలదు. భీష్మ ద్రోణాభిమన్యు కర్ణ శల్య శకునులను ముఖ్యవ్యక్తుల మరణములను శ్రీనివాస రావుగారు నాటకమున సూచించిరి. ఇవి ప్రదర్శన సాధ్యములునుగావు. కాని సైంధవ, దుశ్శాసన, దుర్యోధన, ధృష్టద్యుమ్నాదుల మరణమును రంగముననే జరిగినట్లు నాటకమున కోలాచలంవారు కూర్చిరి. వీనిని రంగమున ప్రదర్శించు టకు కొంత అనువుగానుండుటచేతనే వీరిట్లు కూర్చిరని తెలిసికొనవచ్చును. ఇది కోలాచలంవారి నాటక రచనా శిల్పమునకు పరమోదాహరణము.

4.8.8 ధర్మరాజు రాజసూయాగము చేయబూనగా సవనాశ్వము వెంబడి అర్జునుడు వెళ్ళుచు రాజుల జయించుచు పుత్రుడైన బభ్రువాహనునిచే భంగపడుట 'బభ్రువాహన' లేక 'అర్జున గర్వభంజన' మను నాటకమునందలి ఇతివృత్తము. ఈ విషయము భారతమునను గలదు. కాని శ్రీనివాసరావు గారు జైమిని భారతమునందలి వస్తువునే దీనికి ఆధారముగ గ్రహించిరి. అయినను శ్రీనివాసరావుగారు ఒకటి రెండు మార్పులుచేసిరి. శ్రీకృష్ణాను మతమున హంసధ్వజుని పుత్రుడైన సురథుని తల గరుత్మంతుడు తీసికొని పోయి ప్రయాగలో త్రివేణిలో పడవేయుట, సవనాశ్వముగోడిగయై. క్రోల్పులి యగుట అను రెండంశములను నాటకమున కోలాచలంవారు పరిత్యజించిరి. వీనిని పరిత్యజించుటవలన నాటకమునకు గలిగిన లోపమేదియు లేదు. ఇట్లు శ్రీనివాసరావుగారు జైమిని భారతమునందలి కథను సంపూర్ణముగ గ్రహించి 'బభ్రువాహన' నాటకమును రచించిరి.

## 4.9 ఇతర పౌరాణిక నాటకములు :

'మదాలస' నాటకము వరుసక్రమమున మూడవదైనను, శ్రీనివాసరావు గారి పౌరాణికములలో మొట్టమొదటిది. 'మదాలసా నాటకము'నకు మూలము మార్కండేయ పురాణము. మదాలసా కథ మార్కండేయ పురాణస్థమేయైనను పాతాళకేతుడు మదాలస నపహరించి ఆమెను కామింపగ, కుండలబోధింప షాణ్మాసవ్రతము పూనితినని మదాలస పాతాళకేతునితోచెప్పి తప్పించుకొనుట అను నంశము శ్రీనివాసరావుగారి కల్పన. ఇది నాటకమునకు శోభను చేకూర్చినది. కొన్ని మార్పులును గలవు. పురాణమున కుండల తుంబురునితలంప నతడువచ్చి శాస్త్రవిహితముగ మదాలసాకువలయాశ్వుల వివాహముగావించి నట్లుండ నాటకమున గాంధర్వవిధివి వివాహమాడినట్లుశ్రీనివాసరావుగారు మార్చిరి.పాతాళ కేతుడు గాలవాశ్రమమునకు సూకరాకారమున వచ్చినట్లు పురాణమున నుండ ప్రయోగ సౌలభ్యముకొరకు నాటకమున రాక్షసుడు స్వస్వరూపముననే వచ్చి నట్లు మార్పబడినది. ఈ మార్పులతో కొంత కల్పనతో మదాలసా నాటకమును సహృదయరంజకముగా శ్రీనివాసరావుగారు రచించిరి.

4.9.1 'సీమంతిని' నాటకేతి వృత్తమున కాధారము బ్రహ్మోత్తర ఖండమను పురాణమని శ్రీనివాసరావుగారి నాటకపీఠికలో పేర్కొనిరి.[1] స్కాందబ్రహ్మ పురాణములలోను ఈ కథగలదు. సీమంతినీ కల్యాణమను ప్రబంధము పిల్లలమర్రి సోమమంత్రి కృతమై 1919లో ప్రచురింపబడినది. కాని సీమంతినీ నాటకము రెండు దశాబ్దములకుముందే రచింపబడి యుండుటచే ప్రబంధమును శ్రీనివాసరావుగారు చూడనేలేదని తలంపవలయును. 'సీమంతిని' కథ పురాణములలోనిదేయైనను ఒకటి రెండు చిన్నమార్పులు శ్రీనివాసరావుగారు గావించిరి. సీమంతినికి వైధవ్యము కలుగకుండుటకై ఈశ్వరభట్టు తపమాచరించుటను కల్పించిరి. నిజమునకిది రావుగారి కల్పనకాదు. పైడి మఱ్ఱి వేంకటపతియను మహాకవి రచితమైన 'చంద్రాంగద చరిత్ర' నుండి శ్రీనివాస

1. 119 పీ ప. 5.

రావుగారు గ్రహించినట్లు పీఠికలో తెలిపిరి.[1] సీమంతిని యొద్దకు భార్యాభర్తల వేషమున బోయిన వారిద్దరు సోదరులని పురాణములలోనుండ శ్రీనివాసరావుగారు వారిద్దరు వటువులని మార్చిరి. సోదరులు భార్యాభర్తలగుట ఉచితము కాదని యెంచి శ్రీనివాసరావుగారు వటువులనిమార్చి అనౌచిత్యమును పరిహరించిరి. ఇట్లు శ్రీనివాసరావుగారు ఔచితీసంపాదనార్థ మీ మార్పుగావించిరి.

4.9.2 సారో దార బ్రహ్మాండపద్మాది పురాణములందు 'రుక్మాంగద' కథ ఉన్నప్పటికి శ్రీనివాసరావుగారి 'రుక్మాంగద' నాటకమునకు మూలము ప్రౌఢకవి మల్లన విరచితమైన 'రుక్మాంగద చరిత్ర'మను కావ్యము. అయినను ఒకటి రెండు కల్పనలు మార్పులు శ్రీనివాసరావుగారు గావించి రసౌచిత్యమును సంపాదించిరి.

రుక్మాంగదుని ఉద్యానవన కాసార సరసీరుహములను విశ్వావసుడను గంధర్వు డపహరించుచుండ, వనపాలకులు బంధించి, అతని విమానము గాల్చి రాజసన్నిధికి గొనిపోగా, అతడు గంధర్వుడని తెలిసికొని రాజు క్షమింపవేడుటయు ఏకాదశీ దివసమున నుపవసించినవారి పుణ్యమును ధారవోసిన తాను దివికేగ గలనని విశ్వావసుడు తెలుపును. రాజాజ్ఞతో ఏకాదశీ దినమున అలిగి ఉపవసించిన చాకలి దుర్గిని భర్తతోపాటుభటులు బంధించికొనివత్తురు. దుర్గి ఉపవాస పుణ్యమును విశ్వావసున కిప్పింప తన్మహిమచే గంధర్వుడు రెక్కలు మొలిచి దివికెగసిపోవును అను నీ విషయము నాటకమున శ్రీనివాసరావుగారు కల్పించిరి. ఈ యంశము కావ్యమునలేదు. "...ఏకాదశీవ్రత మహిమాతిశయమును స్థాపించుటకును, దదీప్సితాచరణమునందు రుక్మాంగదునకిఁ గలిగిన దృఢతరాభినివేశమునకును, గారణముగఁజెప్పిన కథాంశమును గల్పించి, స్వోద్దిష్టశాంతరస పరిపోషణమును నిర్వహించెనని యూహింపవలయును" నని శ్రీనివాసరావుగారి కల్పనా సామర్థ్యమును శ్రీరావాడి వేంకటరామశాస్త్రిగారు మిక్కిలి ప్రశంసించిరి.[2] శౌనకాది మహర్షులు రుక్మాంగదుని యొద్దకువచ్చి ఏకాదశీవ్రత మాచరింపుమని చెప్పినట్లు కావ్యమునందుండ నాటకమున నారద మహర్షివచ్చి బోధించినట్లు శ్రీనివాసరావుగారు మార్చిరి. కావ్యమున నారదుడు

---

1. 119 పీ పు. 5. 2. 101 పీ పు 8-5.

యమలోకమునకేగ యముడు తన లోకమున పాపులులేరని తెలుపును. అందుకు కారణము రుక్మాంగదుని దేశమున సలుపుచుండు ఏకాదశీ వ్రతమనియు, బ్రహ్మ యొద్ద కరుగవలసినదనియు నారదుడు యమునకుపదేశించును. యముడు సత్యలోకమున కేగును. కాని నాటకమునఅట్లుగాక యముడు సత్యలోకమునకుబోయి బ్రహ్మనడుగ, దానికి కారణము రుక్మాంగదుని ఏకాదశీ వ్రతమనియు, దానిని తొలగింతువనియు యముని పంపినట్లు శ్రీనివాసరావుగారు మార్చిరి. కావ్యమున బ్రహ్మ మోహినిని అరణ్యమునకుబంపి, అందు క్రూరమృగములను సృజించును. క్రూరమృగములను సంహరించి ప్రజల రక్షింపవలసినదని అచటివారు రుక్మాంగదుని కోరుదురు. రాజు వేటకై పోయి వామదేవునిగాంచి, మోహినిని చూచినట్లు, వరించి వివాహమాడినట్లును గలదు. కాని నాటకమునగాన నైపుణ్యయైన మోహినిని గూర్చి అస్థానగాయకుడొకడుచెప్పి ఆమె గానము వినగోరి అరణ్యమునకేగి రాజు ఆమె సౌందర్యమునకు ముగ్ధుడై ఆమెను కూడినట్లు శ్రీనివాసరావుగారు మార్చిరి. ప్రదర్శనా సౌలభ్యమునకై వీరిట్టిమార్పుచేసి యుందురనతలంపవలెను. ఇవి కొన్నితప్ప తక్కిన నాటక కథావస్తువంతయు కావ్యములోనిదే. అయినను కథాసంవిధానమున శ్రీనివాసరావుగారు గావించిన నైపుణ్యము గోచరించుచునే యున్నది.

4.9.3 శ్రీనివాసరావుగారు 'సత్యహరిశ్చంద్రీయ' నాటకము రచించుటకు ముందు ఈ క్రింది గ్రంథములను చూచినట్లు ఉపోద్ఘాతమున వివరించిరి. మార్కండేయ పురాణము, స్కాందపురాణము, మల్లారెడ్డిగారి షట్చక్రవర్తుల కథ, అడిదము సూరకవి కవిజన రంజనము, కంచి కావ్యమను హరిశ్చంద్ర చరిత్ర, శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానము,గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము, అయ్యనకోట పార్థసారధి శుద్ధాంధ్ర నిర్వచన హరిశ్చంద్రోపాఖ్యానము, రామరాజ భూషణుని హరిశ్చంద్రనలోపాఖ్యానము, ఉత్తర హరిశ్చంద్ర చరిత్ర, పూర్వకవులిరువురు రచించిన హరిశ్చంద్రోపాఖ్యానములను యక్షగానములు కందుకూరి వీరేశలింగం పంతులుగారి హరిశ్చంద్రనాటకము అనునవి. వీనిలో స్కాందపురాణస్థ హరిశ్చంద్ర కథ నందలు ననుసరించిరని కోలాచలంవారు నుడివిరి. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమున చివర వశిష్ఠ విశ్వామిత్రులు

1. 102. ఉ. పు. 4.

పక్షులై పోరినట్లు కలదు. అది నాటకమున ప్రదర్శన యోగ్యమైనది గాదు. శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమున నిట్టిది లేదు. కనుక నాటకముల కన్నింటికి శంకరకవి కావ్యమే ఆధారము. వీరేశలింగం పంతులుగారికికూడ శంకరకవి కావ్యమే మూలమని వీరి పీఠికవలన వ్యక్తమగును.[1] శ్రీనివాస రావు గారికి నదియే మూలమని స్పష్టము. పంతులుగారి నాటకమునకు, శ్రీని వాసరావుగారి నాటకమునకు కొన్ని భేదసాదృశ్యములు గలవు. ఇంద్రసభలో సత్యమును గూర్చిన వాదమును పంతులుగారుపయోగింప దానినే శ్రీనివాసరావు గారు గ్రహించిరి.[2] పంతులుగారి నాటకమున హరిశ్చంద్రునకు గాలవుడను విదూషకుడు లేడు. మాయామృగము విశ్వామిత్రుని ఆశ్రమమున దూరును. దానికై వెంబడించిన హరిశ్చంద్రుడది విశ్వామిత్రుని ఆశ్రమమునకు చెందిన దని, దానివలన తనకేమి కీడు మూడునోయని భయపడును. అదియే విశ్వా మిత్రకోపమునకు కారణమగును, ఇది పంతులుగారి నాటకమున గల యంశము. కోలాచలం వారి నాటకమున మాయా మృగమునకై వెంటాడ హరిశ్చంద్రున కది లభింపదని మాత్రము గలదు. చంద్రమతి శాపమునకు కారణము దుర్వాసశాపమని పంతులుగారు కల్పించిరి. కాని శ్రీనివాసరావుగారు ముఖ్య పాత్రల జన్మలవృత్తాంతములను ఉత్తర హరిశ్చంద్రచరిత్రనుండి గ్రహించిరి. నీలలోహితుడనువాడే హరిశ్చంద్రుడుగాను, అతని ప్రియురాలు కలకంధరయే చంద్రమతిగ, నలకూబరుడే లోహితాస్యుడుగను జన్మించినట్లున్న ఉత్తర హరి శ్చంద్ర కథను వీరు గ్రహించిరి.[3] తక్కినదంతయు సమానమే. ఇంకను నాటక సంవిధాన నైపుణ్యము వెలయునట్లు శ్రీనివాసరావుగారు గావించిన మార్పులనిట్లు పేర్కొనిరి. "ఇందు హరిశ్చంద్రుని సత్యవాక్య పరిపాలనకుఁ జంద్రమతి ప్రాముఖ్యురాలని యగపఱచ యత్నించినాడను." "చంద్రమతినిఁ జంపుటకు రాజాజ్ఞ యయినదని యా సతీమణిని, వీరదాసుని యెదుటనిడినపుడు వీరదాసుఁడా సతి తన భార్యయని తెలిసి, వ్యసనంబును సూచింపక విధిని మాత్రము దూరుచు, శిరంబుఁ దెగవేయ నుద్యుక్తుఁడు గావలెనని, నా మిత్రు లొకరు వక్కాణించిరి. ఎంతటి కఠిన మనుజునకైన నది సహజంబు కాదని కొన్ని వ్యసనసూచక వాచకములచటఁ జేర్చితి." [1] ఇంతేగాక నటులు నాటక

1. 97. పీ. 2. 102. ఉ. పు. 2.

3. 102. పు. 182, 183,

ర క్తి కనుసరింప దగిన సూచనలనుగూడ తెలిపిరి. "ఇందు నక్షత్ర కాల కౌశికుల భాష కొన్ని స్థలములలో హాస్యరసాస్పదంబుగ భాషింపఁదగదు. అది హరిశ్చంద్ర చంద్రమతుల కష్టమును హెచ్చించుటకును, వారి మానసవృత్తిఁ గలఁచుటకును నుపయుక్తముగ నుండవలెను. ఇది విషాదాస్పద నాటకంబు గావున సాధ్యమైన వఱకు హాస్యరసంబు హెచ్చింపక యుండుటమేలని తెలియ వలెను. గాంభీర్యము వహించి వాక్యము లుచ్చరింపనిచో నవి హాస్యవాక్యము లుగ నుండవు. ఈ పాత్రాధికారులు జ్ఞానవంతులై యుండవలెను."[2] ఇవిగాక మరికొన్ని విషయములనుగూడ తెలిపిరి. ఇట్లు శ్రీనివాసరావుగారు తమ సత్య హరిశ్చంద్రీయ నాటకము నొక యుత్తమశ్రేణికి జెందినదిగా రూపొందించిరి.

4.9.4 భాగవతము సప్తమస్కంధమున ప్రసిద్ధమైన ప్రహ్లాదచరిత్రను గ్రహించి 'ప్రహ్లాద' నాటకముగ శ్రీనివాసరావుగారు రచించిరి. ఇందు శ్రీని వాసరావు గారొకే యొక మార్పు గావించిరి. ఈ నాటకమున నొక పూర్వ రంగమును గూర్చిరి. పూర్వరంగమున సనకనందుల శాపముచే జయవిజ యులు దితికి కశ్యప ప్రజాపతి వలన హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగ జన్మించు నట్లు గలదు. ఇట్లు భాగవతము తృతీయ స్కంధమున గల విషయమును శ్రీనివాసరావుగారు పూర్వరంగమున కూర్చి, తరువాతి ప్రహ్లాదకథను సంపూ ర్ణముగ నుపయోగించుకొనుటయే గాదు; పోతన పద్యములుగూడ నాటక పద్య ములకు ఒరవడి చేసికొన్నామని కోలాచలం వారు తమ ఉపోద్ఘాతములోని మాటలవలన వ్యక్తము గావించిరి.[3] వీరికంటె ముందు ప్రహ్లాద నాటకమును కందుకూరి వీరేశలింగం పంతులుగారు, ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు రచించిరి. కాని వారి నాటకములకును రావుగారి నాటకమునకును సంబం ధము లేదు. కందుకూరి వారి నాటకమున లేని పూర్వరంగము కోలాచలం వారు కూర్చిరి. కందుకూరి వారు నాటకాంతమున సంఘసంస్కరణమును దృష్టిలోనిడి మత సహనమునుగూర్చి తెలిపియున్నారు. ధర్మవరం వారి ప్రహ్లాదలో లేని కోలాచలంవారు పూర్వరంగమునుగూర్చుటయే గాక, కొన్ని

---

1. 102. ఉ, పు. 2,3. 2. 102. ఉ. పు. 2,3.

3. 105, ఉ. పు. 5.

విషయములను వారికంటె భిన్నముగను విశిష్టముగను నాటకమున ప్రయోగించిరి. హిరణ్యకశిపుని నోటశత్రువైన హరినామస్మరణము కోలాచలం నాటకమున కన్పట్టదు. ధర్మవరం వారి నాటకమున నిట్టిది గలదు. ధర్మవరం వారు చాలవరకు పోతన పద్యములనే నాటకమున ఉపయోగించిరి. కోలాచలం వారు స్వయముగ పద్యములుగూడ రచించిరి. పూర్వకవుల పద్యములనే నాటకములలో వాడుకొన్నచో నిప్పటి కవుల కవితాభివృద్ధికి మార్గముండ'దని కోలాచలం వారి అభిప్రాయము.[1] ఇట్లు శ్రీనివాసరావుగారు ప్రహ్లాద నాటకము నెంతయు మనోహరముగ రచించిరి.

4.9 5 పౌరాణిక నాటకములలో నింక మిలిగినది 'గిరిజాకల్యాణము'. దీనికి మూలములు కాళిదాస కుమార సంభవము, నన్నెచోడకుమార సంభవము నను నవి. ఇందులోను నన్నెచోడుని కథయే నాటకమునకు దగ్గరగా కలదు. అయినను ఈ కథను నాటకీకరించుటలో కొన్ని మార్పులు శ్రీనివాసరావుగారు గావించిరి. మాయాదేవి కశ్యపులకు తారకు డుద్భవించినట్లు నాటకమున గల విషయము కావ్యములలో లేదు. తారకాసురుడు బ్రహ్మవలన వరములు పొందినట్లు కావ్యమున నుండ శ్రీనివాసరావుగారు నాటకమున తారకుడు ఈశ్వరుని గూర్చి తపమాచరించి వరములు పొందినట్లు మార్చిరి. శివుడు మాయా వటు వేషమున పోయినట్లు పార్వతిని పరీక్షించినట్లు కావ్యములలో నుండ నాటకమున మాయావృద్ధు వేషమున పోయినట్లు శ్రీనివాసరావుగారు మార్చిరి. ఇంకను మరికొన్ని చిన్న మార్పులతో గిరిజా కల్యాణ నాటకము నెంతయు రమణీయముగ రచించిరి. ఇట్లు శ్రీనివాసరావుగారు పౌరాణిక నాటకములను పూర్వ గ్రంథములనుండి గ్రహించి సంవిధానమున తమ చాతుర్యమును ప్రకటించిరి.

## 4.10 ఆంధ్రీకృత నాటకము :

శ్రీనివాసరావుగారు మరాఠీ భాషనుండి 'మానాపమాన నాటకము' ననువదించిరి. మరాఠీ భాషా నాటకకర్త శ్రీ కె. పి. ఖాడీల్కర్‌గారు. వారు సుప్రసిద్ధ మహారాష్ట్ర నాటక కర్తలలో ఒకరు. బళ్ళారిలో 'కేశవ గంధర్వ కంపెనీ'

1. 105. ఉ. పు. 5.

వారు 'రాక్షసీ మహత్వాకాంక్ష' యను నాటకమును, 'బాలగంధర్వ' యను కంపెనీ వారు 'మానాపమాన నాటకము'ను మరాఠీ భాషలో ప్రదర్శించిరట. ఆ నాటకములు ప్రజల మన్ననలకు పాత్రములైనవి. వానిని తెలుగులోని కనువదించుటకు తమకు ఎదురైన క్లేశముల నిట్లు శ్రీనివాసరావుగారు తెలిపిరి. 'పిదప మహారాష్ట్రి భాషనొక నెలదినములు తగినంతవఱకు నభ్యసించి ప్రారంభమున 'రాక్షసీ మహత్వాకాంక్ష' యను నాటకము నాంధ్రీకరించితిని. నాటకము కథా రూపముగ నుండినందున నాంధ్రీకరించు పని నాకుఁ గష్టమనిపింపలేదు. ఆ నాటకము నందు హెచ్చు భాగము సంస్కృత శబ్దములును గొంత భాగము మన దేశములో నలవాటుగ నున్న మహారాష్ట్రి భాషయును నుండెను. ఈ మానాపమాన నాటకము హెచ్చుగ దేశిభాషా సంకలితముగ నున్నది. దేశిభాష యనఁగా పూనాలోను నచటికిఁ జుట్టుముట్టుఁగల దేశములలో వాడుకగ నుండు ప్రాకృత భవ వికారములగు తద్భవ శబ్దములు. కావున నీ నాటక మాంధ్రీకరింప నాకుఁ గష్టమాయెను పైఁగా నిది గృహకృత్య సాంబంధిక మోదాంత నాటకమైనందున (Domestic Drama) సాధారణముగ నిండ్లలో నాడువారును మగవారును మాటలాడు రీతిగ భాష మారినందున, నా చిక్కులఁ దెలియుట కష్ట మాయెను. అయినను దైవానుగ్రహమువల్లఁ బట్టిన పట్టు వదలక యథాశక్తి న్యాయముగ నాంధ్రీకరించితిని"[1] అని కోలాచలంవారు వివరించి, "శౌర్యము స్తుత్యమా, ద్రవ్యముస్తుత్యమా యను విషయమే యితివృత్తమునకు బీజముగ నుంచుకొని యింతటి మోదాంత నాటకమును గష్టపడి రచించి కీర్తినిఁగాంచి యితరులకు మార్గదర్శకులైన మ. రా. రా. శ్రీ కృష్ణాజి ప్రభాకర్ ఖాడిల్కరు గారికి నా వందనములర్పించుచు నింతటితో నీ యుపోద్ఘాతమును ముగించు"[2] చున్నానని తమ కృతజ్ఞతను తెలుపుకొన్నారు.

పై పరిశీలన వలన శ్రీనివాసరావుగారి వివిధ నాటకేతి వృత్తమూలములు, కల్పనలు మార్పులు, వాని వైశిష్ట్యము స్పష్టముగా తెలిసినవి.

1. 118. పీ. పు. 3, 4. 2. 118 పీ. పు. 5.



# 5. నాటకములు - ఇతివృత్త నిర్మాణ దక్షత

5. ఆధునిక యుగమున తెలుగుభాషలో మొదట రచింపబడినవి సంస్కృతాంగ్ల నాటకానువాదములు, లేదా అనుకరణములు. కాని ఆ వెను వెంటనే స్వతంత్రనాటకములు సైతము వెలువడినవి ఈ స్వతంత్ర నాటకములు సంస్కృతాంగ్లనాటకములకంటె విలక్షణమైనవి. అనగా భారతీయ పాశ్చాత్యనాటక లక్షణములిందు సమ్మిళితములైయున్నవని అర్థము. అంత మాత్రముచేత సంస్కృతాంగ్లనాటక లక్షణము సర్వము తెలుగు నాటకములలో గలదని కాదు. స్వతంత్రాంధ్ర నాటక కర్తలేవి అవసరము; సముచితమునని యెంచిరో అట్టివానిని భారతీయపాశ్చాత్యనాటక లక్షణములనుండి గ్రహించియు, కొన్నింటిని తామే స్వతంత్రముగాచేర్చియు రచించిరి. ఇట్టి లక్షణోపేతము లైనవి కోలాచలం శ్రీనివాసరావుగారి నాటకములు. శ్రీనివాసరావుగారు సంస్కృతాంగ్లనాటకములు పఠించి జీర్ణించుకొన్నవారు. 'పాతరోత, కొత్త వింత' అను నభిప్రాయము కలవారుకారు; మంచి ఎక్కడున్నను గ్రహింప వలెననెడి దృఢాభిప్రాయము కలవారు. కనుకనే వీరు సంస్కృత రూపకముల లక్షణములను సంపూర్ణముగా అనసరించి తీరవలెనని పట్టుపట్టలేదు. లేదా ఆంగ్లనాటక లక్షణములను గ్రహింపరాదని మడిగట్టుకొనలేదు. 'ప్రపంచ నాటక చరిత్రము' (The Dramatic History of the World) అను నుద్గ్రంథము నాంగ్లమున రచించిన ఘనులు వీరు. సంస్కృత నాటక లక్షణము అవసరమనుకొన్నప్పుడు పరిత్యజించుటకుగాని, ఉచితమని తలంచినప్పుడు ఆంగ్లనాటక లక్షణములను గ్రహించుటకుగాని వీరు వెనుదీయలేదు. సంస్కృతాంగ్లనాటక లక్షణములలోనుచితమైన వానిని గ్రహించి శ్రీనివాసరావుగారు గద్యపద్య గేయాత్మకములుగ రచించి, తమ స్వతంత్రతను నిరూపించుకొనిరి.

5·1 భారతీయ పాశ్చాత్యరూపకములలో ఇతివృత్తము ప్రాధాన్యమును వహించును. తద్విరహితముగా నాటకమేలేదు. సంస్కృతమును

ఇతివృత్తము నాట్యశరీరమని భరతమహర్షి పేర్కొనెను.[1] వ్యక్తికిఆత్మ ప్రధాన మేయైనను శరీరావశ్యకమును గలదు. కనుక నాటకమున కితివృత్తము శరీరమని చెప్పబడినది. అభినవగుప్తుడితివృత్తమును నిర్వచించిన విధము గమనింపదగినది. "అనభినేయమైన కావ్యము 'వృత్తము' (= కథ Story) శరీరము, అభినేయమైన కావ్యము (దశరూపము)నకు 'ఇతివత్తము (Wel knit plot) శరీరము. 'ఇతి' అనగా 'వివరింపబడనున్న పంచసంధులతో అలంకరింపబడిన అని యర్థము. ఇతివృత్తము ఆధికారికము, ప్రాసంగికము నని రెండు విధములు. ప్రధానఫలము కలది ఆధికారికము. దాని కంగభూతమై తదుపకరణార్థమైన దానిని ప్రాసంగిక మందురు. ఈ ప్రాసంగికము పతాకా ప్రకరీ భేదములచే ద్వివిధము. ఇతివృత్తము మరల ప్రఖ్యాతము, ఉత్పా ద్యము, మిశ్రమునని మూడు విధములు. భారత రామాయణాదులలో ప్రసిద్ధ కథ ప్రఖ్యాతము. కవి కల్పితముత్పాద్యము. ప్రసిద్ధము, కల్పితమునైనది మిశ్రమమనబడును. పురాణేతిహాసాదులలోని వస్తువేకాక చారిత్రకముగూడ ప్రఖ్యాతమే. పైవానిలో ఏయొక దానినైన గ్రహించి నాటకకర్త సహృదయా నంద జనకమైన నాటకముగా రూపొందించును. అది నాటక కర్తృనైపుణ్యము ననుసరించి యుండును.

పాశ్చాత్యనాటకములలో 'ట్రాజెడీ' ప్రధానమైనదిగా 'అరిస్టాటిల్' పేర్కొనెను. ఈ 'ట్రాజెడీ'లో 'ఇతివృత్తము, పాత్రలు, శైలి, భావములు, రంగాలంకరణాదులు, సంగీతము'అను నారంశములున్నను[2] 'ట్రాజెడీ'కి ఇతి వృత్తము ప్రధానమేకాదు, ఆత్మ యనియు, అందు పాత్రలకు ద్వితీయస్థాన

---

1. "ఇతివత్తంతు నాట్యస్య శరీరం పరికల్పితమ్।
పంచభిః సంధి భిస్తస్య విభాగః సంప్రకల్పితః॥"

152. అ 19. శ్లో 1

2. "Every Tragedy, therefore, must have six parts, which parts determine its quality namely, Plot, Character, Diction, Thought, Spectacle and Song."
156 పు. 25

మనియు స్పష్టముగా చెప్పెను. నవలలోని ఇతివృత్తమెంత విస్తృతముగా నైన నుండవచ్చును. కాని నాటకేతివృత్తము సంక్షిప్తముగా నుండి తీరవలెను. నవలాకారుడు వర్ణించు ఘట్టములన్నింటిని నాటకకర్త గ్రహింపడు. వానిలో రసవద్ఘట్టములను మాత్రమే గ్రహించును. నాటకకర్త వదలిపెట్టిన సమస్త విషయములను సామాజికులు రంగమున దృశ్యమానమగు వివిధ సన్నివేశములను చూచి అవగాహన చేసికొనవలసియుండును.అనగా నాటకకర్త మిక్కిలి ప్రతిభావంతుడై ఒక విషయమును నాటకీకరింపవలసి యుండునని స్పష్టమగును. నాటకీయ యుక్తుల నెరిగిన చతురుడుగా నాటక కర్తయుండవలెను. అతడే ఉత్తమనాటకకర్త.ఇట్లుభారతీయ పాశ్చాత్యరూపకముల రెంటను 'ఇతివృత్తము' ప్రాధాన్యమును వహించియున్నది.

5.1.1 నాట్య శరీరమైన ఇతివృత్తము ఐదు సంధులచే విభజింపబడు చున్నదని భరతమహర్షి సూత్రించెను.[2] నాటకమూర్తిసౌష్ఠవమును సిద్ధింప జేయుటకీ పంచ సంధులెంతయు నవసరము. వానిని క్లుప్తముగా తెలిసికొనుట ముఖ్యము.[3]

కార్యావస్థలు : నాటకమున నాయకుడు ప్రధాన ఫల సంపాదనార్థము చేయు ప్రయత్నమైదవస్థలయి యుండును. ప్రారంభము, ప్రయత్నము, ప్రాప్తిసంభవము, నియతఫలప్రాప్తి, ఫలయోగమనునవి పంచ కార్యావస్థలు. ఇవి దశ రూపకమున ఆరంభము, యత్నము, ప్రాప్త్యాశ, నియతాప్తి, ఫలాగమమునని భిన్నముగా జెప్పబడి ప్రసిద్ధికెక్కినవి. ప్రధాన ఫలప్రాప్తిని గూర్చిన బీజానుగుణమగు ఔత్సుక్యము హృదయముననెలకొనుట 'ప్రారంభము'. ఫలప్రాప్తి కనబడునప్పుడు ఆ ఫలమునుగూర్చిన వ్యాపారమును మరింత ఔత్సుక్యముతో జేయుట 'ప్రయత్నము'. కొంచెముగా, భావమాత్రముగా ఫలము ప్రాప్తించుట 'ప్రాప్తిసంభవము'. దీనివలన తప్పక ఫలప్రాప్తియగు

1. "The Plot, then, is the first principle, and, as it were the soul of tragedy; character holds the second place" 156 పు. 26, 27.

2. 153 అ. 19 శ్లో. 1.  3. 68 అ. 19 పు. 561-606.

నని తలంచుట నియతఫలప్రాప్తి. నాటకమున నాయకుడాసించిన ఫలము ఫలించుట 'ఫలయోగము'.

అర్థప్రకృతులు : పై పంచావస్థలవలెనే "బీజము, బిందువు, పతాక, ప్రకరి, కార్యము' నను ఐదు అర్థప్రకృతులు నితివృత్తమున నుండును. కారావస్థలు, ఆధికారికేతి వృత్తమందలి భాగములుకాగా, అర్థప్రకృతులు ఫలసాధనోపాయభేదము. అర్థమన ఫలము; ప్రకృతులన ఉపాయములు; కావున అర్థప్రకృతులన ఫలహేతువులు. ఆదిలో స్వల్పమాత్రముగా నాటబడి, పిమ్మట బహుప్రకారములుగ విస్తరించునదై, ఫలావసానముగ నుండునది బీజము ప్రయోజనమునకు విచ్ఛేదము కలిగినప్పుడు, అవిచ్ఛేద కారణమై ఫలప్రాప్తి పర్యంతము నిలుచునది 'బిందువు'. పరార్థమై ప్రధాన ఫలమున కుపకారక మగునట్లుగా ప్రధానేతివృత్తము వలెనే కల్పింపబడెడి వృత్తము 'పతాక'. ఇందు కొంత స్వప్రయోజనముగూడ నుండును. కేవలము పరార్థమునకై కల్పిత వృత్తము 'ప్రకరి'.

పంచ సంధులు : అవస్థలు కథాగమన క్రమదశలనియు, అర్థప్రకృతులు కథాగమన హేతువులనియు పైని స్పష్టమయినది. పంచ కార్యావస్థల వలెనే పంచ సంధులును గలవు. నాటక రచనా ప్రారంభమునకు ముందు నాటక కర్త కథను విభజించుకొనగా నేర్పడినవే సంధులు. నాటక ప్రధానేతివృత్తమున ముఖము, ప్రతిముఖము, గర్భము, విమర్శనము, నిర్వహణము నను పంచ సంధులుండును. కావ్యమందు నానార్థ రస సంభవమగు బీజ సముత్పత్తి జరిగెడి కథాభాగము 'ముఖసంధి'. ఇది ప్రారంభమను కార్యావస్థననుసరించియుండును. ముఖసంధి యందు నిష్పన్నమైయున్న బీజము అవాంతర కారణములచే మరుగు పడినప్పుడు, ఆ బీజము మరల ఉద్ఘాటితము (సుస్పష్టము) చేయబడినచో ఆ కథాభాగము 'ప్రతిముఖసంధి'. అందు ప్రయత్నమను కార్యావస్థయుండును. బీజోద్భేదము అనగా ప్రాప్తి, అప్రాప్తి, మరల అన్వేషణమనునవి ఎచ్చట కూర్పబడునో ఆ కథాభాగము 'గర్భసంధి'. ఇందు ప్రాప్తి సంభవమను కార్యావస్థయుండును. గర్భనిర్భిన్నమైన (ఫలోన్ముఖమైన) బీజార్థము లోభ, క్రోధ, వ్యసనములచే సందేహాస్పదమయ్యెడి కథాభాగము 'విమర్శ సంధి'. దీనినే 'అవమర్శ సంధి'యు నందురు. నియత ఫలప్రాప్తి యిందుండును. సబీజకములును, నానాభావోత్తరములును అయిన ముఖాది

సంధులయందలి ప్రారంభాద్యవస్థలు ఫలనిష్పత్తికి సంబంధించి యుండునట్లు కూర్పబడు కథాభాగము 'నిర్వహణ సంధి'. ఇట్లు ప్రణాళికానుసారము నడచిన కార్యముగల నాటకమే సుసంఘటిత మగును. ఇట్టి సంధులు చెడిన నాటకము కీళ్లు సడలిపోయిన బొమ్మవంటిది. ఇవి ఊహా మాత్రములే కాని అంకములవలె కన్పట్టునవి కావు; సంధుల కంగభూతములై వర్తించునవి 'సంధ్యంగము' లనబడును. ఇట్లు నాటకమున పంచసంధులకు విశిష్టస్థానము కలదు.

5.1.2 పై విభాగమువలె నొప్పు నట్టి పద్ధతి పాశ్చాత్య నాటకముల లోను గలదు. 'అరిస్టాటిల్' పండితుడు 'ట్రాజెడీ'లోని ఇతివృత్తము స్వయం సంపూర్ణ మనెను; అనగా ఆది మధ్యాంతములనెడి మూడు దశల క్రను పరిణతిలో స్వయంవ్యక్తమైన మూర్తి కలదు. [1] కాని 'హడ్సన్' పండితుడు నాటకేతివృత్తము నైదు విభాగములుగ విభజించెను. పాశ్చాత్య నాటకములలో సంఘర్షము (Conflict) ఉండి తీరవలెను. సంఘర్షముగల నాటకమే ఉత్తమ నాటకము ఈ సంఘర్షముతో ఇతివృత్తము (real plot) ఆరంభమగును. అంతకు ముందు కొంత విషయము జరిగిన అది 'exposition' అనబడు భాగము. సంఘర్షాంతముతో ఇతివృత్త మంతమగును. ఆద్యంతముల నడుమ గల ఇతివృత్త మైదు భాగములుగ విభజింపబడుచున్నది. [2] ఈ ఐదు భాగములు : Initial Incident, Rising Action or Growth or Complication, Climax or crisis or Turning Point, Falling Action or Resolution or Denoument, Conclusion or Catastrophe అనునవి. 'Initial Incident' అను దానితో నాటక మారంభింపవలెను. దాని నుండియే

---

1. "Now according to our definition of Tragedy is an imitation of an action that is complete and whole, and of a certain magnitude; for there may be a whole that is wanting in magnitude. A whole is that weich has a beginning, a middle, and an end." 156 పు. 81.    2. 162 పు. 199.

సంఘర్ష మారంభమగును. "Rising Action or Growth or Complication" అను భాగమున సంఘర్షాధిక్యము విరివిగా సాగుచుండును అయినను ఫలప్రాప్తితో అస్థిరత యుండును. Climax, or Crisis or Turning point అను దశలో తప్పని సరిగ జయము లభించునను నాశ కలుగును. Falling Action, or Resolutitn or Denouement అను నాల్గవ అవస్థలో కలుగ బోవు విజయ సోపానములు స్పష్టమగును. అయిదవదైన Conclusion or Catastropheలో సంఘర్షమంతమగును.[1] ఇదియే నాటకాంతము. ఈ పంచావస్థలను ఐదంకములలోనిబంధించుట ఉచితమే. కాని దాని నందరు పాటింప లేదు. ప్రథమాంకమున అరంభమైన 'Initial Incident' తృతీయాంకము వరకును సాగుట కలదు; తృతీయాంకమున దీని తుది భాగమును, తరువాతి రెండవస్థలు గూడ కన్పట్టుచుండును; నాలుగవ అంకమునుండి పంచమాంకారంభము వరకును నాలుగవ అవస్థ సాగి, పంచమాంకాంతమున ఐదవ అవస్థ పొందుపడుట కలదు. ఇట్లు సహజవిభాగములైదును పాశ్చాత్య నాటకములలో ప్రసిద్ధిలోనికి వచ్చినవి. పై పంచావస్థలలో సంఘర్షము క్రమవికాసము నంది పుష్టిని, వైశిష్ట్యమును కలిగించును.[2] ఈ విభాగములు సంస్కృత నాటకము నందలి వానిని పోలియున్నవేమో పరిశీలింతము. డా. దివాకర్ల వేంకటావధాని గారు పాశ్చాత్య నాటకమందలి సహజవిభాగము లొకచోట అర్థప్రకృతులను, మరొకచోట కార్యావస్థలను పోలియున్నవనిరి.[3] డా.పి. ఎస్. ఆర్ అప్పారావు గారవి మన పంచ కార్యావస్థలతో సమాన మనిరి.[4] కాని శ్రీ పింగళి లక్ష్మీ కాంతంగారు మాత్రము వినిని పంచ సంధులతో పోల్చిరి.[5] సంస్కృత లాక్షణిక మతానుసారము పంచ కార్యావస్థలు కథాగమనమునందలి క్రమదశలు. అర్థప్రకృతులు కథాగమన హేతువులు. కనుక పాశ్చాత్య విభజనముతో నివి పొసగవనియే తలంపవలెను. కొంతవరకు కార్యావస్థలనైన నివి పోలునేమో కాని అర్థప్రకృతులకు వీనికి సంబంధము లేదు. ప్రాసంగికముతో కూడిన ప్రధానేతివృత్తమున మాత్రమే యీ యైదు అర్థ ప్రకృతులు నుండును. ప్రాసంగిక రహిత నాటకమున బీజము, బిందువు, కార్యము నను నని మాత్రమే యుం

1. 162 పు. 200. 2. 162 పు. 200, 201.

3. 11 పు. 89; 119.

4. 68. అ. 19 పు. 590, 591, 603, 604. 5. 64 పు. 268.

దును. కాని పాశ్చాత్య నాటకములలో నైదు సహజ విభాగములుండును. కనుక నివి సంవదింపవు. పంచ కార్యావస్థలు కథాగమనము నందలి దశలు గనుక నివి కొంతవరకు పాశ్చాత్య నాటక విభాగములను పోలు ననవచ్చును. కాని యింతకంటె ముఖ్యముగ పంచ సంధులు - కథ యందలి ముఖ్య విభాగములు - పాశ్చాత్య నాటక సహజ విభాగములతో సరిపోలుననుట సముచితము. కనుక శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు పోల్చిన పద్ధతియే యుచితమని తలంపవలెను. భారతీయ పాశ్చాత్య నాటకములలోని విభాగములు వేర్వేరుగా చెప్పబడినను పోలికలుండుట గమనింపదగిన విషయము.

5.1.3 శ్రీనివాసరావుగారి నాటకములలో ప్రఖ్యాతేతివృత్తము గల వానిసంఖ్య యెక్కువ; కొన్ని మిశ్రమములు; మరికొన్ని ఉత్పాద్యములును గలవు. చారిత్రక నాటకములలో సుఖమంజరీ పరిణయము, కాళిదాసు రెండు నాటకములలోని ఇతివృత్తములు మిశ్రమములు. 'సునందనీ పరిణయ' నాటకేతివృత్తముత్పాద్యము. మానాపమాన మనువాదమైనను నిందలి యితివృత్తమునుత్పాద్యమే లభించిన తక్కిన నాటకములు అనగా చారిత్రక, రామాయణ, భారత, పౌరాణిక నాటకములు ప్రఖ్యాతేతివృత్తములు గలవి. ఇట్టి నాటకములలో ప్రాచ్య పాశ్చాత్య నాటక లక్షణము లెంతవరకు ప్రయుక్తములైనవో పరిశీలింతము.

**కార్యావస్థలు** (Natural divisions of a dramatic plot) :

పైని వివరింపబడినట్లు సంస్కృత నాటకము నందుండవలసిన కార్యావస్థాదులకంటె ఆంగ్లనాటకములలో గల వంచ కార్యావస్థలె శ్రీనివాసరావుగారి నాటకములలో నెక్కువగ నున్నట్లు పరిశీలన వలన స్పష్టమగును అంత మాత్రముచేత వీరి అన్ని నాటకములలోను నీ యవస్థలు యథాశాస్త్రముగా ననుసరింపబడిన వనుటకును వీలులేదు. వీరి నాటకములలో ప్రసిద్ధములైన వాని యందీ కార్యావస్థలు స్పష్టముగా తెలియును. కాని కొన్నిట వానిని వివరించుట సులభ సాధ్యముకాదు. లేదా ప్రయత్నించి వానిని చూపెట్టినను అవి సహజముగా నుండవు. 'రామరాజు చరిత్రము'న నాయకుడైన పఠాణి, రామరాజు

శిరము ఖండించి స్వమత రక్షణము గావించుట కార్యము. పటాణి ఉద్యోగార్థము విజయనగరమునకు వచ్చినప్పుడు తందాన పాటలు విని హిందూ రాజుల వైభవము, మహమ్మదీయుల హైన్యము గుర్తెరిగి హిందూరాజ వినాశము గావింప శపథము పూనుటలో ప్రథమ కార్యావస్థ (Initial Inident) గలదు. సభలో రామరాజు వలన ఆషాబీకి గలిగిన అవమానమును సహింపని పటాణి కాలానుగుణముగా అణగియుండి, తోటలో ఆషాబీని కలిసికొన్నప్పుడు రామరాజు కంఠముత్తరింతునని ప్రతిజ్ఞ చేయుటలో ద్వితీయ కార్యావస్థ (Rising action, or Growth or Complication) యున్నది. బహ్మనీ సుల్తానులతో తన ప్రతినను పునరుద్ఘాటించిన వెనుక, తల్లి వలన రామరాజు తన తండ్రి యని తెలిసికొని మానసిక సంఘర్షమునకు లోనయి యుండి ఆషాబీచే ప్రేరితుడై పటాణి రామరాజును సంహరింప నిశ్చయించుకొనుటలో తృతీయ కార్యావస్థ (Climax or crisis or turning point) కలదు. రామరాజు పటాణిని సైన్యాధిపతిని చేయుటలో చతుర్థ కార్యావస్థ (Falling Action or Resolueion or Denouement) కలదు. యుద్ధరంగమున రామరాజు కంఠము ఖండించి విజయము చేకూర్చుకొని, తన ప్రతినను పరిపూర్తి గావించితినని సంతసించి ఆషాబీని గూడుటలో పంచమ కార్యావస్థ (Conclusion or Catastrophe) గలదు.

'పాదుకాపట్టాభిషేకము'న భరతుడు శ్రీరామ పాదుకలకు అభిషేకము గావించుట కార్యము. దశరథుడు రామున కభిషేకము గావింప తలపెట్టగా దేవకార్యార్థము మంథర కైకకు దుర్బోధగావించుట, కైక కోపగృహము చేరి దశరథుడు రాగా వరద్వయ మడిగి నిర్బంధించి గ్రహించుట, రాముడరణ్యమున కరుగ దశరథుడు పుత్రవాత్సల్యముతో ఎదబాటును సహింపక మరణించుట, భరతుడు మేనమామ గృహమునుండి తిరిగివచ్చి విషయము తెలిసికొని తల్లిని దూషించి రాముని యొద్ద కరణ్యమునకు బోవతలంచుట, భరతుడరణ్యమున రాముని కలిసికొని రాజ్యము స్వీకరింపుమని కోర నతడంగీకరింపక పోగా, అతని పాదుకలు గొనివచ్చి అభిషేకించుట అను వానిలో పంచ కార్యావస్థలు గలవు.

రుక్మాంగద నాటకమున రుక్మాంగదుని భక్తి ద్వారమున ఏకాదశీ మాహాత్మ్యమును స్థాపించుట కార్యము. ఏకాదశినాడుపవసించిన చాకలి దుర్గి ఉపవాసఫలమును విశ్వావసున కొసగుటచే నాతడు రెక్కలు మొలచి స్వర్గమున కేగగా రుక్మాంగదుడు ఏకాదశీ మాహాత్మ్యమున కబ్బురపడి తద్వ్రతము చేయబూనుట, ఏకాదశీ వ్రతము దేశమంతట జరుగుటచే తన్మహిమచే జీవులు వైకుంఠమున కేగుచున్న విషయమును యమునివలన నెరిగిన బ్రహ్మ తనకు పునస్సృష్టి కార్యముండదని తలంచి ఆ వ్రత విఘాతమునకై మోహినిని సృష్టించుట, వింధ్యాటవిలో రాలగరగించు గాన మాధుర్య మోహినిని గాంచి రుక్మాంగదుడు మోహించి భార్యగా స్వీకరించుట, మోహినిని వదలి రుక్మాంగదుడు ఏకాదశీ వ్రతము సలుపుచుండ నామె అతనిని దానిను డి మరల్ప ప్రయత్నింపగా, నతడు వదలక తన పుత్రునైన వధింప నంగీకరించుట, ధర్మాంగదుని సంహరింప రుక్మాంగదుడు ఖడ్గ మెత్తగా ఆతని విష్ణుభక్తికి మెచ్చి విష్ణువు ప్రత్యక్షమగుట అను నంశములలో పంచ కార్యావస్థలు స్పష్టమైనవి.

'సత్యహరిశ్చంద్రీయము'న హరిశ్చంద్రుని సత్యసంధత నిరూపితమగుట కార్యము. హరిశ్చంద్రుడు వేటకై అరణ్యమునకుబోయి మాలెతల విరుద్ధ కార్యములకు గినియగా విశ్వామిత్రుడువచ్చి కుపితుడై బొంకింప యత్నింప రాజందుకంగీకరింపక రాజ్యమంతయు నతనికి ధారవోయుట, సత్యము కొరకు హరిశ్చంద్రుడు రాజ్యము విశ్వామిత్రునకప్పగించి అంతకుముందే విశ్వామిత్ర యాగార్థ మొసగెదనన్న ఋణముదీర్ప దారసుత సమేతముగా అరణ్యమున కేగుట, అనేక బాధలతో అరణ్యమున గ్రుమ్మరుచుండ నక్షత్రకుడు ఋణము తీర్పుమని బాధింప కాశికేగి తీర్తునని ఆలుబిడ్డలతో హరిశ్చంద్రుడు కాశికి వెడలుట, హరిశ్చంద్రుడు ఋణవిముక్తుడగుటకు చంద్రమతిని దాసిగా నమ్మి, తనను హీనకులజునకు అమ్ముకొని కాటికాపరియగుట, మృతుడైన లోహితుని శవము దహింప కాటికి కొనివచ్చిన చంద్రమతిని భార్యయని గుర్తించియు, కాటి సుంకమీనిదే దహింప వీలులేదని హరిశ్చంద్రుడుచెప్ప, కాటి సుంకము కొని తెచ్చుటకై పోయి కారణాంతరముచే రాజదండనకు గురియైన తన భార్య కంఠమును రాజాజ్ఞతో నరుకనుంకింప, హరిశ్చంద్రుని సత్యవాక్య పరిపాలనము

నకు మెచ్చి ఈశ్వరుడు ప్రత్యక్షమై అతని ననుగ్రహించుట అను నీ యంశము అందు పంచ కార్యావస్థలిమిడి యున్నవి.

'కుశలవ నాటకము'న కుశలవులతో సీతారాముల పునస్సంయోగము కార్యము. శూర్పణఖా మాయోపాయముతో సీతారావణు లేకశయ్యపై నుండి నట్లు చిత్రించిన చిత్రపటమువలనను, గూఢచారి చెప్పిన నీచజనులనుకొను చుండిన సీతాపవాదమువలనను సీతపైమనసు విరిగి శ్రీరాముడు సీతనుత్యజింప దలచుట, లక్ష్మణుడు రామాజ్ఞతో సీతనరణ్యమున వదలివచ్చుట, రాముడు వదలిన యజ్ఞాశ్వమును కుశలవులుపట్టి బంధించుట, చివరికి శ్రీరాముడే యుద్ధముచేయబోయి కుశుని సమ్మోహనాస్త్రముచే మూర్ఛపడుట, వాల్మీకిమాటల ననుసరించిన కుశుడు సమ్మోహనాస్త్రముపసంహరింప రాముడు మూర్ఛనుండి తేరికొనగా వాల్మీకి కుశలవులు రాముని పుత్రులనితెలిపి సీతనప్పగించుట అను నీ యంశములలో పంచ కార్యావస్థలు గలవు.

'లంకాదహనము'న హనుమ లంకను దహించుట కార్యము. రావణుడు సీత నపహరించుట, రాముడు సుగ్రీవునితో సఖ్యముచేయుట, ఆంజనేయుడు సముద్రము లంఘించి లంకకుబోవుట, హనుమంతుడు అశోకవన వినాశము గావించి ఇంద్రజిత్తుచే బ్రహ్మాస్త్ర బద్ధుడగుట, రావణభటులు హనుమంతుని తోకకు అగ్ని దరికొల్ప అతడు లంకను దహించి వెనుదిరిగివచ్చి రామునకు సీతావృత్తాంతము నివేదించుట అను వీనిలో పంచకార్యావస్థ లిమిడియున్నవి.

'కీచకవధ లేక సైరంధ్రి' అను నాటకమున భీముడు కీచకుని వధించుట కార్యము. అజ్ఞాతవాసార్థము పాండవులతోపాటు సైరంధ్రివేషమున ద్రౌపది విరటు కొలువుజేరుట, ప్రప్రథమమున సైరంధ్రిని కీచకుడుద్యానవనమున జూచి మోహించుట, సుదేష్ణఆజ్ఞతో మదిరతేర కీచకుని గృహమునకుబోవ వాడు సైరంధ్రిని తరుముకొనిరాగా ఆమె తనకు గలిగిన యవమానమును విరటుని కొలువునదెలుప భీముడు విని కుపితుడగుట, సైరంధ్రి రహస్యముగా భీము నొద్దకేగి తన భంగపాటును దెలుప రహస్యముగ నర్తనశాలకు కీచడువచ్చునట్లు గావింపవలసినదని భీముడు సైరంధ్రికిచెప్పి పంపుట, నర్తనశాలలో రాత్రి

సమయమున భీముడు కీచకుని వధింపగా ద్రౌపది సంతసించుట అను వీని యందు పంచకార్యావస్థలు కలవు.

'శిరోమణి' నాటకమున భారత యుద్ధాంతమున అశ్వత్థామ శిరోరత్న మును దీయించుట కార్యము. భారత యుద్ధ మారంభమగుట, భీష్మాదుల మర ణానంతరము, ద్రోణుని ధృష్టద్యుమ్నుడు సంహరించుట, తండ్రిని వధించిన ధృష్టద్యుమ్నునిపై గల కోపముచే, తొడలు విరిగిపడియుండిన దుర్యోధనుని దీనావస్థనుగాంచి స్వామి కార్యము నెరవేర్పదలచి అపాండవము గావింతునని అశ్వత్థామ ప్రతిన పూనుట, శివుని సంతసింపజేసి పాండవులదప్ప సర్వనాశము గావించి వ్యాసాశ్రమమున నున్న అశ్వత్థామను వెదకుచు పాండవులు రాగా వారిపై నతడు బ్రహ్మశిరోనామ కాస్త్రము ప్రయోగించుట, అర్జునుడు బ్రహ్మ శిరోనామ కాస్త్రము ప్రయోగించి వ్యాసాజ్ఞతోనుపసంహరింపగా, అశ్వత్థామ కుపసంహార యోగ్యత లేమిచే, వ్యాసాజ్ఞతో అశ్వత్థామ తలలో ధరించిన శిరో మణిని తీసి పాండవుల కిచ్చుట అను నీ యంశములందు పంచకార్యావస్థ లున్నవి.

'బభ్రువాహన' లేక 'అర్జున గర్వభంగ'మను నాటకమున అర్జునకు గర్వ భంగమగుట కార్యము. సవనాశ్వము వెంటబోయిన అర్జుననిచే బాధింపబడిన నీలధ్వజుడు తన భార్యజ్వాలాదేవిని నిందింప నామె గంగానది యొద్దకుబోయి అర్జునుని తల ఖండింపబడునట్లు గంగాదేవిచే శాపమిప్పించి, తాను బభ్రువాహను నకు బాణమగుదునని తలంచుట, సుధన్వార్జునుల యుద్ధయు, పితృభక్తితో వచ్చిన బభ్రువాహనుని నిందించి,యుద్ధమొనరింపుమని అర్జునుడగుట,తల్లులఆజ్ఞచే అర్జునునితో యుద్ధముచేసి బభ్రువాహనుడు జయించుట, మృతుడైన అర్జునుని బభ్రువాహనుడు మృతసంజీవకమణిని గొనివచ్చి కృష్ణమహిమతో పునర్జీవితుని గావించుట అను నంశములలో పంచకార్యావస్థలు గలవు.

'ప్రహ్లాద' నాటకమునకు 'దానవవధ' అనియు పేరుంచుటచే నృసింహ స్వామి హిరణ్యకశిపుని వధించుట కార్యము. విష్ణువు వరాహావతారమున హిరణ్యాక్షుని సంహరించెనని వినిన హిరణ్యకశిపుడు విష్ణుసంహారార్థము బ్రహ్మనుగూర్చి ఘోరతపమాచరించుట, బ్రహ్మ వర లాభముచే హిరణ్య

కశిపుడు విష్ణులోకముపై దాడి వెడలుట, తన పుత్రుడు ప్రహ్లాదుని విష్ణుభక్తిని సహింపలేక అనేక విధములుగ నతనిని హిరణ్యకశిపుడు బాధించుట, ప్రహ్లాదుడు విష్ణువు స్తంభమున గలడని హిరణ్యకశిపునకు సమాధానము చెప్పుట, హిరణ్యకశిపుడు స్తంభమును దన్నగా నరసింహస్వామి ఆవిర్భవించి హిరణ్యకశిపుని సంహరించుట అను నంశములలో పంచకార్యావస్థలు కుదిరినవి.

'మానాపమాన నాటకము'న భామినీ ధైర్యధరుల వివాహము కార్యము. మహిషాసుర మర్దన్యాలయమున ప్రథమ దర్శనముననే భామిని ధైర్యధరుని వివాహమాడ ననుట, ధైర్యమే ప్రధానమని నమ్మి వనమాలి వేషమున నుండి, ధైర్యధరుని ధైర్యమునకు మెచ్చి భామిని అతనిచే సమ్మానిత అగుట, సమ్మానితుడైన ధైర్యధరుని తన కూతురు భామినిని వివాహమాడ వలసినదని బాబా సాహెబు కోర నత డంగీకరింపకపోవుట, ధైర్యధరుని యొద్ద గల సేవకులందరిని పంపివేసి తా నతనిని సేవింతునని వనమాలి కుదురుకొని అతని మనస్సును చూరగొనుట, చివరికి వనమాలియే భామిని యని తెలిసి ఆమె మార్పును గ్రహించి, ఆమెను వివాహమాడ నంగీకరించుట అను నీ యంశములందు పంచ కార్యావస్థలు గలవు.

'మదాలసా నాటకము'న మదాలసా కువలయాశ్వుల పునస్సంయోగము కార్యము పాతాళకేతుడు మదాలస నపహరించుట, కువలయాశ్వుడు పాతాళకేతుని తరుముకొనిపోయి వానిని జంపి వానిచే నిర్బంధితయైన మదాలసనుగాంచి పరస్పరము మోహించుకొనుట, ఆ తరువాత వారికి వివాహమగుట, తాళకేతు మాయోపాయముచే మదాలసా మరణమునకు దుఃఖితుడై నాగలోకము నందలి దేవల నాగులచే కువలయాశ్వుడు సమాశ్వాసింపబడుట, అశ్వతరుని తపః పరోపకారముచే అశ్వతరుని ఉద్యానవనమున మదాలసా కువలయాశ్వులు పరస్పరము గుర్తించియు సంశయించుట, పాతాళలోకమున మదాలసా కువలయాశ్వులకు అశ్వతరుడు పునర్వివాహము గావించుట అను వీనిలో పంచకార్యావస్థలు గలవు.

'సుల్తానా చాందుబీ' నాటకమున అమహన్నగరు రాజ్యమునకు ఢిల్లీ పాదుషాతో కల్గిన యుద్ధమున సుల్తానా చాందుబీ శౌర్యపరాక్రమములు చూపుట

కార్యము. సుల్తానా చాందుబీ బాలుడైన ఇబ్రహీం ఆదిల్షాకు బదులుగా బీజాపూరు రాజ్యము చేయుచుండ అహమన్నగరుతో యుద్ధము కలుగుట, అస్మన్‌బేగుతో చేతులు కలిపి సుల్తానా చాందుబీని రాజ్య భ్రష్టను జేయ కుట్రబన్నిన మంత్రి ఇస్మాల్‌ముల్క్, సేనాని ఇల్లాజుఖాన్ యుద్ధమున మరణింపగా, ఉపసేనాని యాఖూబ్ అబిస్సుచే వధింపబడిన వెనుక ఆ కుట్ర నెరిగి అస్మన్‌బేగును పదవినుండి తొలగించి, సుల్తానా తన రాజకీయ చతురతను ప్రకటించుట, అస్మన్ రాజద్రోహమునకు శిక్ష మరణమే యయినను సుల్తానా దయతో రాజ్యభ్రష్టునిగావించి, ఇబ్రహీం ఆదిల్షాకు రాజ్య మప్పగించి, అమహన్నగరు రాజ్యమును రక్షింపబోవ చాందుబీ తలంచుట, కారాగారమున పడియుండిన డాండియాగో మాయోపాయములతో తప్పించుకొనిపోయి దేశభ్రష్టుడైన అస్మన్‌బేగును కలిసికొని సుల్తానాకు ప్రతీకారము చేయ సమకట్టి ఢిల్లీ పాదుషా సుతుని అమహన్నగరుపై యుద్ధమునకు కొనివచ్చుట, అహమన్నగరుకు పాదుషా సేనలకు జరిగిన యుద్ధములో సుల్తానా చాందుబీ ధైర్యసాహసములతో పాటు బుద్ధి నైశిత్యమును ప్రకటించి, చివర హమీదుచే బాకుతో పొడువబడి మరణించుట అను నంశములలో పంచకార్యావస్థలు గలవు. శ్రీనివాసరావుగారి నాటకములన్నిటి కంటె నిది క్లిష్టమైన ఇతివృత్తముతో బహుపాత్రలతో నున్న నాటకము.

'చంద్రగిర్యభ్యుదయ' నాటకమున చంద్రగిరిలో విజయనగర రాజ్యమును యాచమనీయడు పునస్థాపించుట కార్యము. విరూపాక్షాలయమున సదాశివ వాక్కులు శిరోధార్యముగా గ్రహించి, వృద్ధ వేంకటపతి రాయల అనంతరము శ్రీరంగరాయలను చంద్రగిరిరాజుగా నుండ నంగీకరింపజేసి విజయనగర సంరక్షణమే తన లక్ష్యమని యాచమనీయడు శపథమూనుట, జగ్గరాయల కుట్రతో శ్రీరంగరాయాదులు కారాగార బద్ధులగుటచే వారిని రక్షింప కుముదినిని చాకలి చంప వేషమున బంపించి వేంకటరాయలను చాకలి మూటలో గొనివచ్చునట్లు గావించుట, చాందుఖాన్ ద్వారమున శ్రీరంగరాయాదులను కారలో నుండి తప్పింప యత్నించుట, జగ్గరాయల దౌష్ట్యముచే శ్రీరంగరాయాదుల మరణము విని జగ్గరాయల మీదికి విజయదశమినాడు దండెత్తిపోవతలంచుట, జగ్గరాయాదుల జయించి, వృద్ధ వెంకటరాయల నిజమైన పుత్రుడు చిక్క

రాయడుగారని నిరూపించి, నిజమైన వారసుడు చిన వేంకటరాయలని విశద పరచి, యాచమనీయడు చిన వేంకటరాయలను రాజ్యాభిషిక్తుని జేయుట అను నంశములలో పంచ కార్యావస్థలున్నవి.

'సుఖమంజరీ పరిణయము'న సుఖమంజరీ ప్రద్యుమ్నుల వివాహము జరుగుట కార్యము. స్వయంవరమున ప్రద్యుమ్నుని ప్రతిమ కంఠమున సుఖ మంజరి హారము వేయుట, తండ్రి దురాగ్రహుడు ఆగ్రహించి సుఖమంజరిని కారలో వేయించుట, ప్రద్యుమ్నుడు దురాగ్రహుని బంధించి, సుఖమంజరికి కారాగార విముక్తి కలిగించుట, మాయనసాయనల మాయోపాయముతో, ప్రద్యుమ్నుడు బంధితుడగుట, సుఖమంజరి యుక్తితో విషయసేనుని బంధించి, ప్రద్యుమ్నునితో వివాహమగుట అను వీనిలో పంచకార్యావస్థలు గలవు.

'కాళిదాస' నాటకమున మదనసేనా కాళిదాసుల వివాహము కార్యము. డంబరవానితో మదనసేన వివాహము జరుగుట, కాళికాలయమున మదనసేన భక్తిచే కాళికాదేవి వలన డంబర వాడుత్తమ కవియై వెడలిపోగా, మదనసేన విరహము ననుభవించుచుండి పీరయోగి మాటలతో ధారానగరమున భోజుని ఆస్థానమున గల కాళిదాసును కలిసికొన విద్యాసర్వస్వవేదిని వేషమున మదన సేన పోవుట, కాళిదాసు ధారానగరముజేరి దర్పసారునిచే శిక్షితుడై కాంచన మాలతోపాటు బ్రహ్మరాక్షసి గల దేవాలయమున పడవేయబడుట, కాళిదాసు విద్యాసర్వస్వవేదిని యను మారు పేరుగల మదనసేనను ఓడించుట, భోజుని ఆస్థానమున మదనసేన తన వృత్తాంతమెరిగింప, పీరయోగి వచ్చి వారి పూర్వ వృత్తాంతము తెలుపగా కాళిదాసుల వివాహము జరుగుట అను వీనిలో పంచ కార్యావస్థలున్నవి.

'సీమంతినీ కల్యాణనాటకము'న సీమంతినీ పాతివ్రత్య మహిమ స్థాపింపబడుట కార్యము. సీమంతినీ చంద్రాంగదులుద్యాన వనమున కలిసికొని పరస్పర మాలోకించుకొనుట, సీమంతినీ చంద్రాంగదుల వివాహానంతరము చంద్రాంగదుడు యమునలో మునిగిపోయి నాగకన్యలచే రసాతలమునకు కొనిపోబడుట, తక్షక పుత్రుడైన సత్యవంతునితోపాటు పునర్జీవితుడైన చంద్రాంగదుడు శివతపముననున్న సీమంతినికి కనిపించుట, సీమంతినీ

చంద్రాంగదులకు పునర్వివాహము జరుగుట, సోమవారవ్రతము జరుపుచు దంపతులను శివపార్వతులుగా పూజించుచు మహాపతివ్రతయైన సీమంతినియొద్దకు సామవంత సుమేధులనునిద్దరు వటువులు సామవతీసుమేధులనుపేర దంపతులుగా పోగా సీమంతిని పాతివ్రత్యమహిమచే నిజమైన దంపతులగుట అను నీయంశము లలో పంచకార్యావస్థలు గలవు. ఇట్లీ నాటకములలో పంచకార్యావస్థ లిమిడి యున్నవి.

5.1.4 కాని 'సునందనీ పరిణయము', 'శిలాదిత్య' నాటకములలో కొంచెము భిన్నముగా నీ కార్యావస్థలు గలవు. అనగా రెండువిధములుగా నీ కార్యావస్థలను చూపవీలగును. 'సునందనీ పరిణయము'నకు 'దురాశాభంగ' మనియు నామాంతరముగలదు. ఈ రెండు నామముల కనుగుణముగా కార్యావస్థలు మారును. సునందనీ సుదేవుల పరిణయము కార్యమైనచో ఉద్యాన వనములో సునందనీ సుదేవులు పరస్పరము మోహించుకొనుట, గడువుమీరి నను సుదేవుడురాలేదని సన్న్యాసి వేషమున సునందని అతనిని వెదకబోవుట, అరణ్యమున పాదములు ఖండింపబడియున్న ఉగ్రసేనుడు సుమతి దుర్మార్గము లనన్నింటిని ఉత్తరమువ్రాసి ఈగా సన్న్యాసివేషముననున్న సునందని తెలిసి కొనుట, సునందని రాజ్యమునకువచ్చి సుమతి దుర్మార్గమును బయటపెట్టుట, సునందనీ సుదేవుల వివాహము జరుగుట అనువానిలో పంచకార్యావస్థలు గోచ రించును. అంతకంటె దురాశాభంగమను నామమే దీనికి సమంజసమనిపించును. అప్పుడు సుమతి దురాశకుభంగము గలుగుట కార్యము బుద్ధిబలముననమ్మిన సుమతి రాజపుత్రుడైన జయపాలుని అరణ్యములో మాయముచేయించి తనకేమీ తెలియనట్లునటించి జయదేవీ ప్రతాపులకు హితముపదేశించుట, పట్టణమునకు వచ్చిన వెనుక సుమతి తన కుమారుడు కుబేరుని సునందని వివాహమాడిన రాజ్యము తనదగునని దాని కవసరమైనపద్ధతిలో కార్యమాచరించుట, సుదేవుడు జయపాలుని అన్వేషింపకుండ సుదేవుని బంధింపవలసినదని సుమతి ఉగ్రసేనున కాజ్ఞాపించి తదనుగుణముగా జేయించుట; సుమతి ఆజ్ఞచే అరణ్యమున కాళ్ళు నరకబడి పడియుండిన ఉగ్రసేనుని యొద్దకు సన్న్యాసివేషముననున్న సునందని రాగా నతడామెకు సుమతి దౌష్ట్యమును జాబులోవ్రాసియిచ్చి తెలియజేయుట, సునందని సన్న్యాసివేషమునసభలో ప్రవేశించి సుమతి కుట్రలన్నింటిని బయట పెట్టగా రాజుప్రతాపుడు సుమతి కాళ్ళుచేతులు ఖండింపబడునట్లు శిక్షవిధించు

టతో సుమతి దురాశకు భంగము కలుగుట అను నంశములలో పంచ కార్యావస్థలు గలవు.

ఇక శిలాదిత్యనాటకమునకు రెండు విధములుగా ముగింపుకలదు. శిలాదిత్యతోపాటు కళావతీ మదనులు పార్థివునిచే వధింపబడుటతో ముగియునాటకమున కార్యము శిలాదిత్య మరణము. శిలాదిత్యుడు రాజగుట, మదనుకు నవమాలికార్థము మారువేషమున ఉద్యానవనప్రవేశముచేసిన తప్పిదమునకు కారాగార శిక్షనుబొందుట, కళావతీ సాహాయ్యమున మదనుడు కారాగారమునుండి తప్పించుకొని తండ్రిచెప్పినరీతి పార్థియనుల ప్రాపుజేరబోవుట, మదన కళావంతులు పార్థివసేనను శిలాదిత్యునిపైకి యుద్ధమునకు గొనిరాగ, కళావతి యుక్తితో సాలగ్రామము నపహరించి సప్తాశ్వ సరోవరము మలినము గావించుట, శిలాదిత్యునకు పార్థియన్లకు గలిగిన యుద్ధమున శిలాదిత్యుని మరణానంతరము కళావతీ మదనులు వధింపబడుట అను నంశములలో పంచ కార్యావస్థలు గలవు. శిలాదిత్యుని పుత్రుడు గుహుని పట్టాభిషేకముతో ముగియునట్లు గల నాటకమున చివరి యంశము అనగా శిలాదిత్య మరణానంతరము కళావతీ మదనులు పశ్చాత్తప్తులై భిల్లులసాయమున శిలాదిత్యుని పుత్రుడు గుహుని సింహాసనస్థునిగావించుటలో పంచనుకార్యావస్థ ఉండును.

5 . 1 . 5 పైని వివరించినట్లు ఆ యా నాటకములందు పంచకార్యావస్థలున్నవని తెలిసినను ప్రథమకార్యావస్థ (Initial Incident)కు ముందు నాటక కథావివరణము ప్రతి నాటకమునను గలదు. దీని నాంగ్లమున **Exposition** అందురు. కొన్ని నాటకములలో నిట్టి వివరణము కొన్ని రంగము లాక్రమించియుండ మరికొన్ని నాటకములలో అంకము లాక్రమించి యుండును. అట్టి సమయమున ఈ కార్యావస్థలను సమన్వయింప ప్రయత్నించుట యనవసరము. శ్రీనివాసరావుగారి ఉత్తమ నాటకములలో ఒకటైన 'రామరాజు చరిత్రము'న ఇంతకుముందే వివరించినట్లు ద్వితీయాంకము తృతీయ రంగమున ప్రథమ కార్యావస్థగలదు. అంతకు ముందున్న కథ అనగా అచ్యుతరాయల మరణానంతరమతని పుత్రుని బాలుని రాజుగా నొనరించి వానికి విషప్రయోగము గావింప సలకం తిమ్మయ ప్రయత్నించుట, సామంతులీ విషయమెరిగి రామరాజును రప్పించుట, రామరాజాగమనము విని సర్వనాశము

గావించి సలకం తిమ్మయ్య ఆత్మహత్యగావించుకొనుట, రామరాయలు సదాశివ రాయలను రాజు గావించి విజయనగర రాజ్యమును సుస్థిరముగావించుట అను విషయమంతయు వివరణమువలె నొప్పారు చున్నది.

ఇట్టి వివరణము లితర నాటకములలోను గలవు. 'ప్రతాపాక్బరీయ' నాటకమున మహమ్మదీయుల బెదదపోగొట్టి హిందూరాజ్యమును ప్రతాపుడు సుస్థిరము గావించుట కార్యము. కాని కార్యమునకు తగినవరీతిలో కథలేదు. ఉదయసింగు మరణముతో ప్రతాపుడు రాజగుటలో ప్రథమ కార్యావస్థగలదు. అనగానిది తృతీయాంకము చతుర్థరంగమున నున్నది. తత్పూర్వము తృతీయ రంగమువరకునున్న కథయంతయు వివరణము వంటిదనవలెను. అనగా నాటక వస్తువు స్వల్పమగును. తరువాతికథలో తక్కిన నాలుగవస్థలు హల్దీఘాటునొద్ద ప్రతాపాక్బరుల సేనలకు యుద్ధముజరుగుట, పిల్లలు, భార్య, తాను అరణ్యమున పడుచున్న బాధలను సహింపలేక ప్రతాపుడు రాజీకొరకు అక్బరుకు లేఖ వ్రాయుట, క్షత్రియోచితధర్మముల నూరిపోయుచు ప్రతాపవతి పృథ్వీరాజులు వ్రాసిపంపిన జాబువలనను, కుబేరసేనుడు ధనమొసంగెదనని వాగ్దానము చేయుటవలనను తప్పక అక్బరును జయింతునను ప్రతాపుడు దృఢనిశ్చయుడగుట, చివరి యుద్ధమున అక్బరుసేనను జయించి ప్రతాపుడు రాజగుట అను నంశములలో గలవని తెలియును.

'మైసూరు రాజ్యాభివృద్ధి'యను నాటకమున యదురాయడు జగదంబను వివాహమాడి మైసూరు రాజ్యమును సుస్థిరము గావించుట కార్యము. దీనికి సంబంధించినకథ నాటక మధ్య భాగమునగలదు. ద్వితీయాంకము తృతీయ రంగమున యదురాయాదులు మైసూరునకు ప్రయాణమైపోవుటలో ప్రథమకార్యావస్థ గలదు. అంతకుముందున్న కథ యదురాయ కృష్ణుల పూర్వజన్మ వృత్తాంతము, యదురాయడు పెద్దవాడయిన వెనుక మతచర్చలు మొదలైన వివరణములు గలవు. మారనాయకుని కుట్రతో వాగాడంబరాచార్యుని ఔషధ సేవనముతో చామరాజు పిచ్చెత్తి రాజ్యమును వదలిపోవుట, జగదీశ్వరుని సఖ్యముతో యదురాయాదులు మారనాయకుని వధింపజేయుటకు ప్రయత్నము గావించుట మారనాయక మరణానంతరము జగదంబాయదురాయలు కలిసికొనుట, యదురాయడు రాజయి జగదంబను వివాహమాడుట అను నంశము

లలో తక్కిన కార్యావస్థలు గలవు. కాని యదురాయడు రాజయినవెంటనే వాగాడంబరాచార్యుడు గావించిన రాజద్రోహమును వివరించు ఘట్టము వాదోప వాదములతో అతి మాత్రముగా పొడిగింపబడినది. ఈ నాటకమునందలి ఆరంభములోని వివరణమును, నాటకాంతమునందలి న్యాయస్థాన వాదోపవాద ముల ఘట్టముకలిసి నాటకమున సాబాలాక్రమించినవి.

5.1.6 ఇవి యిట్లుండ ద్రౌపదీ వస్త్రాపహరణము, శ్రీరామజననము, సీతాకల్యాణము, గిరిజాకల్యాణమను నాల్గునాటకములలో కార్యావస్థలకై ప్రయ త్నించుట నిష్ప్రయోజనము. 'ద్రౌపదీ వస్త్రాపహరణమని' నాటకమునకు పేరున్నప్పటికి అసలు కథకంటె నితరమెక్కువ. ద్రౌపదీ వివాహము, సుభద్రావివాహము, ద్రౌపదీ వస్త్రాపహరణమను విషయముల సంపుటీకరణమే యీ నాటకము. చతుర్థాంకము ద్వితీయరంగమునుండి ద్రౌపదీ వస్త్రాపహ రణమునకు సంబంధించిన కథ ఆరంభమయి, పంచమాంకముతో ముగియుటచే నది స్వల్పమని తెలియును. శ్రీరామజనన, సీతాకల్యాణ, గిరిజాకల్యాణ నాట కములలోను నిట్టి కార్యావస్థలు వెదుక ప్రయత్నించిన ప్రయోజనముండదు. ఒకవేళ మనము ప్రయత్నించి కార్యావస్థలను ముడిపెట్టినను అవి యంతగా పొసగవు అయినను పంచకార్యావస్థలీ నాటకములలో సహజములై గోచరింపక పోయినంత మాత్రమున వానికి వచ్చిన దొసగేమియు లేదని తలంపవలెను. కాని సమష్టి సౌందర్యము వీనిలో కొరవడిన దనుటలో సందేహము లేదు. శ్రవ్యకావ్యోచి తములైన ఈ ఇతివృత్తములను నాటకములుగా నొనర్పచేసిన ప్రయత్నము కొని యాడదగినది. ఇట్లు కొన్నింటిలో తప్ప ఎక్కువ నాటకములలో పంచకార్యా వస్థలను శ్రీనివాసరావుగారు పాటించినట్లు తెలియును.

## 5.2 సమానాంతరత్వము (Parallelism) :

నాటక కార్యావస్థల తరువాత పేర్కొనదగినవి కొన్ని నాటక నిర్మాణ వైఖరులు (Some features of a dramatic design) పాశ్చాత్య నాటకము లలో ఆధిక్యమును వహించుచున్నవి. ఇట్టివి సంస్కృతమున లేవనవలెను.

నాటక నిర్మాణ వైఖరులలో సమానాంతరత్వము (Parallelism) ప్రథమ గణనీయము. పాశ్చాత్య నాటకములలో ప్రధాన విషయము ఆమ్రేడిత రూపమున చూపబడును. ఇదియే సమానాంతరత్వము. ఇది ప్రాసంగిక కథలోను, రంగములలోను, సన్నివేశములలోను, పాత్రలలోను నుండవచ్చును. తన్మూలమున ప్రధాన కథావిషయములు సామాజికులకు స్పష్టమగును. షేక్స్పియరు 'King Lear', 'Comedy of Errors, 'Much Ado about nothing', 'Mid-summer Nights dream' అను నాటకములలో నీ సమానాంతరత్వమును వివిధ విధముల ప్రయోగించి నాటక సమష్టి సౌందర్య సంపాదనార్థము ప్రయత్నించినట్లు స్పష్టమగును. 17 వ శ. 'స్పెయిన్' దేశపు నాటకములలో ప్రధానోద్దేశమును పౌనరుక్త్యముగా పరిహాస రూపమున ప్రయోగించుట కలదు ఇట్టిది షేక్స్పియరు 'As you like it' నాటకమునను గలదు. అనగా నాటకమున విదూషకుడు నాయకుని చర్యలను, మాటలను అనుకరింప ప్రయత్నించుట వలన పరిహాసాత్మకమైన సమానాంతరత్వము గోచరించును.[1] ఇట్టి ప్రయోగముచే నాటక కర్త నాటక రచనా వైఖరిలో నైపుణ్యము స్పష్టమగును.

6.2.1 శ్రీనివాసరావుగారి నాటకములలో పాశ్చాత్యపద్ధతి ననుసరించి సమానాంతరత్వము ప్రయుక్తము. ఇది సన్నివేశములలో, పాత్రలలో, పరిహాస రూపమున నగపడును. 'రామరాజు చరిత్రము'న ముద్గల్లునవాబును జయించి, అతని పుత్రి ఆషాబీని చెరపట్టి తెప్పించి, రామరాజు సభలో ఆమె ముసుగు దీయించిన వెనుక, తిరుమలాంబ ప్రవేశించి అన్యమతావలంబ యయినను, సాటి స్త్రీకి భర్త గావించుచున్న అవమానమును సహింపక, ఆషాబీని రక్షించును. తద్ద్వారమున తిరుమలాంబసౌశీల్యము ప్రకటితమగును. దీనిని సమానాంతరముగ నాటకము చివర నొక సన్నివేశమును శ్రీనివాసరావుగారు కల్పించిరి. దుర్గాలయమున దుర్గ పూజచేయుచున్న సమయమున రామరాయల మరణానంతరము తురక సేన పట్టణమంతయు నాశము గావించుచు వచ్చి, తిరుమలాంబ కేలు పట్టి అవమానించుచుండ, ఆషాబీ ప్రవేశించి తురక సేన నుండి తిరుమలాంబను రక్షించి, ఆ నాడు ఆమె భర్తనుండి తనను రక్షించిన

1. 162 పు. 216 - 219.

కృతజ్ఞతను ప్రకటించినది మహమ్మదీయ స్త్రీ అయినను ఆషాబీలో నిర్దిష్ట ఉత్తమ గుణము కలదని స్పష్టమగును.

'సునందనీ పరియణము'న సుమతి దౌష్ట్యమునకు సాయముగ నుండుటకై జయమాలి ఉగ్రసేనునిపై ప్రేమ యున్నట్లు తెచ్చికోల్వలపులు పచరించి వానిని వదలించుకొనును. దీనికి సమానాంతరముగా కుబేరుడు సునందనిని వివాహమాడుమని పైబడినపుడు కృత్రిమ ప్రేమను నటించి సునందని కుబేరుని తొలగించును.

'శిరోమణి' నాటకమున భారత యుద్ధమారంభమగునని తెలిసి కుంతి కర్ణునొద్దకుబోయి అతడు తన పుత్రుడను విషయముతెలిపి సోదరులతో కలిసి యుండవలసినదని కోరును. కాని తన బలమునేనమ్మిన దుర్యోధనుని మోసగించి పాండవులనుజేరి భీరువనునిందను సహింపనని కర్ణుడు సమాధాన మీగా చివరికి యుద్ధమున పాండవులను వధింపనట్లు కుంతి మాటయిమ్మనగా అర్జునునితప్ప తక్కిన వారిని సంహరింపనని కర్ణుడు వాగ్దానము చేయును. కర్ణార్జునులు సమబలులు కనుక అందుకే మాత్రము వ్యథజెందక కుంతి సంతసించి పోవును. ఇది మూల కథలోని సన్నివేశమే. దీనికి సమానాంతరముగ శ్రీనివాసరావు గారొక సన్నివేశమును గల్పించిరి. భీష్ముడు కౌరవ పక్షమున సర్వసైన్యాధిపతిత్వము వహింపబోవుచున్నాడని తెలిసి ద్రౌపది తాత భీష్ముని యొద్దకేగి పతిభిక్షవేడును. పాండవులజేయులనియు, నామె సుమంగళీత్వమునకు హాని లేదనియు భీష్ముడు తెలిపి పంపివేసి, ఆమె పాతివ్రత్యమును మిక్కిలి కొనియాడును.

"చంద్రగిర్యభ్యుదయము"న పాదుషా ఆజ్ఞతో చాందుఖాన్ చంపమ (కుముదినిని) పట్ట ప్రయత్నించి చివరికామె కొక కత్తినొసగి యుద్ధముచేయ ప్రయత్నించి, ఆమె స్త్రీ సాహసమునకు మెచ్చుకొని, ఆమె తన మిత్రుడైన యాచమునకు కాబోవు ప్రియురాలని తెలిసి ఆమెచు వదలుటచే, చాందుఖాన్ పాదుషా ప్రాపుపోగొట్టుకొనును. దీనికి సమానాంతరముగా మరొక సన్నివేశము కలదు. కుముదిని చాకలిచంప వేషమున చాకిమూటలో చిన వెంకటరాయలను తీసికొనిపోవుచుండ పసిగట్టి జగ్గరాయనికొరకు రాజదేవుడను పేరుగల దుర్గప్ప నాయకుడు కుముదినిని బంధింపదలచును. కుముదిని ద్వంద

యుద్ధముచేసి గెలిచిన వారికి చిన వెంకటరాయలు దక్కునట్లు అతనితోజెప్పి, అది ధర్మ యుద్ధమనియు నట్టి దుర్గప్పనాయకు నడిగి తెలిసికొనవలసినదని రాజదేవునకు తెలుపును. అట్టి దుర్గప్ప నాయకుడుతానే యగుటచే ఆమె ధైర్య సాహసములకుమెచ్చి వదలి పెట్టిపోయి జగ్గరాయని ప్రాపును పోగొట్టుకొనును. ఈ రెండు సన్నివేశములచే నాటక సమష్టిసౌందర్యమును నాటక కర్త సంపాదించెను. దాందుఖాన్ యాచమని పక్షమవలంబించి జగ్గరాయని కుట్రల వినాశమునకును, దుర్గప్ప నాయకుడు జగ్గరాయని కుట్రలకు సాయపడకపోవుట అను ఫలితములుచేకూరి కుముదినీ యాచమూల ఉత్తమ కార్యమునకు తోడ్పడుట జరిగినది.

"కాళిదాసు" నాటకమున మదసేన తన భక్తిచే కాళిని మెప్పించి ఆ దేవీ మహిమచే డంబరవానిని కాళిదాసుగామారునట్లు గావింప, తనకు దివ్య జన్మ మొసగుటచే తల్లి యనియు, దీనికి డంబరవాని భార్యగాని తన సతిగాదని ఆమెను వదలి కాళిదాసు వెడలిపోవును. దీనికి సమానాంతరమైన సన్నివేశము ఒకటికలదు విద్యాసర్వస్వవేదినియను మారువేషముననున్న మదనసేనను కాళిదాసు ఓడించిన వెనుకతనకు సతిగమ్మనును. మదనసేన కాళిదాసును వివాహమాడ సంతసించుచున్నను ఆ నాటి తనస్థితి నాలోచించి, తననోడించి, విద్యా రహస్యము నెరుగజెప్పుటచే తండ్రిసమానుడుగనుక వివాహము కుదురదని తెలుపును. ధర్మ సమ్మతముగాదని తిరస్కరించును. అందుచేనిది భోజరాజాస్థానమున విచారింపబడి నిజము వ్యక్తమయి వారివివాహము జరుపజడును.

'సీమంతినీ నాటకము'న సీమంతిని జాతకము జూచి పదునాల్గవ యేట ఆమెకు వైధవ్య మున్నను రాజు సంతోషమును కొరకు దశ సహస్రవర్షము లామె పతివ్రతయై ప్రఖ్యాతి గాంచునని ఇచ్చకమునకు ఈశ్వరభట్టు పలుకును. తన పలుకులు యదార్థ మొనర్ప పార్వతిని గూర్చి తపమాచరించి సీమంతినికి పతి వియోగము తటస్థించినను దశ సహస్రవర్షములు జీవించునట్లు ఈశ్వరభట్టు పార్వతీదేవిచే వరము పొందును. దీనికి సమానాంతరమైన ఘట్టము కలదు. సామవంత సుమేధులను నిద్దరు వటువులు ధనార్థము చంద్రహాసుడను రాజు నొద్ద కేగ నతడు వారు సామవతీ సుమేధులను దంపతులుగా సీమంతినిని దర్శించిన వలసినంత ధన మిచ్చునని చెప్పును. వారావిధముగానే పోయి సీమంతినీ పాతివ్రత్య మహిమచే సామవంతుడు నిజమైన సామవతిగా మారి

పోయి తిరిగిరాగా ఈ యనర్థమునకు తానే కారణమని తలంచి దానిని తప్పింప సారస్వతునితోపాటు చంద్రహాసుడు పార్వతిని గూర్చి తపమాచరించుటయు, దేవి మాటలచే సీమంతిని మహిమ మార్పనలవిగాదని తెలిసికొని వచ్చి సామవతీ సుమేధులకు వివాహ మొనరించుటయు గావించును. ఇట్టి సమానాంతరత్వముచే ఈశ్వరభట్టు వలన సీమంతినికి పూర్ణాయువును, చంద్రహాసునిచే సీమంతిని పాతివ్రత్య మాహాత్మ్య ప్రచారమును సంపాదింపబడినవి.

'మైసూరు రాజ్యాభివృద్ధి'లో జగన్మోహిని మేనల్లుండ్రు లక్ష్మణవీరులను మోహించి వారిని గవయగోరిన రెండు సన్నివేశములలో సమానాంతరత్వము గలదు. ఆ సన్నివేశములలో లక్ష్మణ వీరులు జగన్మోహిని నీతిబాహ్యమైన చర్యను తిరస్కరించి తమ ఉత్తమ శీలమును నిలబెట్టుకొనిరి.

'సుల్తానా చాందుబీ' నాటకమున దుష్టులైన అస్మన్‌బేగు, డాండియాగోలు వరుసగా జోరియ, మేరీలను మోహించి తమ వశము గావించుకొనచేసిన ప్రయత్నములలో సమానాంతరత్వము గోచరించును. జోరియా, మేరీలు తమ సౌశీల్యములను నిలబెట్టుకొనిరి. వారి కొరకే అస్మన్‌బేగు, డాండియాగోలు ఢిల్లీ పాదుషా యొద్ద ప్రాపు సంపాదించి అమహన్నగరు సుల్తానా చాందుబీ పైకి పాదుషా సేనలను కొనివచ్చుటయు సుల్తానాను వధింపజేసి తాము నికృష్టముగా జచ్చుటయు జరుగును.

'ద్రౌపదీ వస్త్రాపహరణము'న మయసభను గాంచుచు దాని వైభవమునకు విభ్రాంతుడైన దుర్యోధనుని చూచి పాంచాలి నవ్వుటచే నతడవమానితుడగుటయు; మాయాద్యూతమున శకునిచే ధర్మజుడోడిన వెనుక దుర్యోధనునిచే ద్రౌపది అవమానిత యగుటయు నను వీనిలో సమానాంతరత్వచ్ఛాయ మూలకథలోనే గోచరించును.

5.2.2 ఇంక పాత్రల ఆశయములలో, అభిప్రాయములలో సమానాంతరత్వ మగపడుటయు గలదు. 'రామరాజు చరిత్రము'న తురుష్కుల సమున్మూలము గావించి ఆంధ్రుల యశము దిక్కులన్నింట వ్యాపింపజేయుటయే తన లక్ష్యముగ రామరాయలు తలంచి తదనుగుణముగనే వర్తించును. పటాణి

క్రమవికాస దశలలోను, మంచి చెడుగుల మధ్య మాత్రమేగాక, పాత్రల వైవిధ్యములోను, నాటకేతి వృత్తమునందలి వివిధాంశములలోను ప్రతియోగము ప్రయోగింపనగును. సామాన్యముగా విషాద గంభీర నాటకములలో సమతా సంపాదనకై పరిహాసాస్పదమైన ప్రాసంగికేతి వృత్త ప్రయోగము కన నగును. ఇట్టి సమయములలో సమానాంతరత్వముతో ప్రతియోగము కూడియుండును. చాలవరకు నాటకేతి వృత్త క్రమవికాసమున నిట్టి ప్రయోగముండి తీరును. ఇది నాటకీయౌచిత్యమున కుపకరించుననుటలో సందేహము లేదు. ఇతివృత్తము నందు వలెనే పాత్ర చిత్రణమున గూడ ప్రతియోగము ప్రయుక్తమగును. పాత్రల ఆంతర సంఘర్షము నిది స్పష్టముచేయును. ఆయా పాత్రల విభిన్న భావ వ్యక్తీకరణమున ప్రతియోగమున కధిక ప్రాధాన్యము కలదు. నాటకమున నీతిని బోధించుటకై గూడ నిట్టి ప్రతియోగమునుపయోగించుట కలదు. ఇట్లు సమానాంతరత్వము వలెనే ప్రతియోగమును పాశ్చాత్య నాటకమున ప్రాధాన్యమును వహించినది.

5 8.1 సమానాంతరత్వము వలెనే ప్రతియోగమును శ్రీనివాసరావుగారి నాటకములలో గోచరించును. పాత్రల శీల స్వభావములోను, సన్నివేశములోను ప్రతియోగముండును. శీలస్వభావములకు సంబంధించిన ప్రతియోగము శ్రీనివాసరావుగారి చాల నాటకములలో గలదు. 'రామరాజు చరిత్రము'న రామరాజు సకలము తిమ్మయ్యలకు 'ప్రతాపార్కీయము'న ప్రతాపవతీ సుంద రాంబలకును, 'చంద్రగిర్యభ్యుదయము'న యాచమ జగ్గరాయలకును, 'మైసూరు రాజ్యాభివృద్ధి'లో జగన్మోహినీ లక్ష్మణ వీరులకును, 'కాళిదాసు'న భోజముంజులకును, మదనసేన, ఉపాధ్యాయులకును, 'సునందనీ పరిణయము'న సుమతి ప్రతాపులకును, 'ప్రహ్లాద'లో ప్రహ్లాద హిరణ్యకశిపులకును, 'పాదుకాపట్టాభిషేకము'న కైకా మంథరలకును, 'లంకాదహనము'న రామరావణులకును, 'ద్రౌపదీ వస్త్రాపహరణము'న ధర్మదుర్యోధనులకును, 'కీచకవధ'లో సైరంధ్రీ కీచకులకును, 'మానావమానము'న ధైర్యధరలక్ష్మీధరులకును మధ్యవారి శీల స్వభావములలో ప్రతియోగము కలదు.

'రామరాజు చరిత్రము'న పటాణిని పుత్రవాత్సల్యముతో చేరదీసి సేనాని పదవినిచ్చి ఆదరించి, చివరికి బహ్మనీ సుల్తానులతో కలిగిన యుద్ధమున

సమానాంతరత్వమున కుదాహరణము. అనగా ఓఖళాంబయు నట్లే కామేశ్వర పంతులను వశము గావించుకొనిన దను విషయము విస్పష్టమగును.

'బభ్రువాహన' నాటకమున భీషణుడను రాక్షస రాజ్యమున సవనాశ్వము ప్రవేశింప వారు దానిని బంధించి, మేధోహోత అజ్ఞానుసారము తన తాత బకాసురుని జంపిన భీముని సోదరుడైన అర్జునుని నరపశువు గావించి భీషణుడు నరమేధము చేయదలంచు రంగము ధర్మజుడు గావింపదలచిన అశ్వమేధ యాగమునకు పరిహాస రూపమైన సమానాంతరముగా స్పష్టముగాగలదు. ఇట్లే సుఖమంజరీ పరియణమున విషయసేనుడు ప్రద్యుమ్నుని బంధించి, సుఖమంజరిని తన వశము గావించుకొనచేసిన ప్రయత్నము తెలిసి విషయసేనుని సేనలోని కొందరి సంభాషణలో తమ రాజు రాజ్యము గెలిచి సుఖమంజరిని పట్టబోవు నట్లొకడు ఆడుదానిని పట్ట యత్నించును. మరొకడు నవ్వుచు దానివలన పాపము కలుగునని చెప్పును. ఈ రంగము విషయసేనుని దుష్కార్యమునకు పరిహాస రూపక సమానాంతరమై యొప్పారు చున్నది.

ఇట్లు కోలాచలం వారు తమ నాటకములలో సమానాంతరత్వముచిత రీతిని ప్రవేశ పెట్టిరి.

## 5 . 3 ప్రతియోగము (Contrast) :

సమానాంతరత్వము (Parallelism) కంటె నత్యధిక ప్రాముఖ్యమును నాటక సంవిధానమున వహించునది ప్రతియోగ (Contrast) మని హడ్సన్ వివరించెను.[1] సంఘర్షము నాటకమున ప్రధానమే అయినను ఇతివృత్త సంబంధియై యుండును. కాని ప్రతియోగము (Contrast) అనునది నాటకమున వివిధ రీతులతో ఒప్పుచుండును. ఈ ప్రతియోగము సామాన్యముగా ఇతివృత్తము నందలి సన్నివేశములందును, నాటకస్థ పాత్రల శీల స్వభావము లందును గోచరించుచుండును. నాటక కార్యము (Action) యొక్క వివిధ దశలలోని క్రమవికాసమున ఈ ప్రతియోగముండును. అయితే నాటక వస్తు

1. 162 పు. 219 - 228.

క్రమవికాస దశలలోను, మంచి చెడుగుల మధ్య మాత్రమేగాక, పాత్రల వైవిధ్యములోను, నాటకేతి వృత్తమునందలి వివిధాంశములలోను ప్రతియోగము ప్రయోగింపనగును. సామాన్యముగా విషాద గంభీర నాటకములలో సమతా సంపాదనకై పరిహాసాస్పదమైన ప్రాసంగికేతి వృత్త ప్రయోగము కన నగును. ఇట్టి సమయములలో సమానాంతరత్వముతో ప్రతియోగము కూడియుండును. చాలవరకు నాటకేతి వృత్త క్రమవికాసమున నిట్టి ప్రయోగముండి తీరును. ఇది నాటకీయోచిత్యమున కుపకరించుననుటలో సందేహము లేదు. ఇతివృత్తము నందు వలెనే పాత్ర చిత్రణమున గూడ ప్రతియోగము ప్రయుక్తమగును. పాత్రల ఆంతర సంఘర్షము నిది స్పష్టముచేయును. ఆ యా పాత్రల విభిన్న భావ వ్యక్తీకరణమున ప్రతియోగమున కధిక ప్రాధాన్యము కలదు. నాటకమున నీతిని బోధించుటకై గూడ నిట్టి ప్రతియోగమునుపయోగించుట కలదు. ఇట్లు సమానాంతరత్వము వలెనే ప్రతియోగమును పాశ్చాత్య నాటకమున ప్రాధాన్యమును వహించినది.

5 8.1 సమానాంతరత్వము వలెనే ప్రతియోగమును శ్రీనివాసరావుగారి నాటకములలో గోచరించును. పాత్రల శీల స్వభావములోను, సన్నివేశములలోను ప్రతియోగముండును. శీలస్వభావములకు సంబంధించిన ప్రతియోగము శ్రీనివాసరావుగారి చాల నాటకములలో గలదు. 'రామరాజు చరిత్రము'న రామరాజు సకలము తిమ్మయ్యలకు 'ప్రతాపార్కరీయము'న ప్రతాపవతీ సుందరాంబలకును, 'చంద్రగిర్యభ్యుదయము'న యాచమ జగ్గరాయలకును, 'మైసూరు రాజ్యాభివృద్ధి'లో జగన్మోహినీ లక్ష్మణ వీరులకును, 'కాళిదాసు'న భోజముంజులకును, మదనసేన, ఉపాధ్యాయులకును, 'సునందనీ పరిణయము'న సుమతి ప్రతాపులకును, 'ప్రహ్లాద'లో ప్రహ్లాద హిరణ్యకశిపులకును, 'పాదుకాపట్టాభిషేకము'న కైకా మంథరలకును, 'లంకాదహనము'న రామరావణులకును, 'ద్రౌపదీ వస్త్రాపహరణము'న ధర్మజదుర్యోధనులకును, 'కీచకవధ'లో సైరంధ్రీ కీచకులకును, 'మానావమానము'న ధైర్యధరలక్ష్మీధరులకును మధ్యవారి శీల స్వభావములలో ప్రతియోగము కలదు.

'రామరాజు చరిత్రము'న పటాణిని పుత్రవాత్సల్యముతో చేరదీసి సేనాని పదవినిచ్చి ఆదరించి, చివరికి బహ్మనీ సుల్తానులతో కలిగిన యుద్ధమున

(అం. 4 - రం. 8) తన సామంతు లెదిరించినను సర్వసైన్యాధిపతిని చేసి విశ్వసించిన రామరాజును పటాణి యుద్ధమున వధించును. వధానంతరము (అం. 5 - రం. 5) తాను గావించిన తప్పిదమును గుర్తించి మానసిక సంఘర్ష మునకు లోనయి తండ్రి రామరాజు చూపిన ప్రేమకు తాను గావించిన ప్రతి ఫలము వధ, అని పటాణి మిక్కిలి బాధపడును. ఈ సన్నివేశములలో రామ రాజు పటాణి పాత్రలకు గల ప్రతియోగము స్పష్టముగా తెలియును.

'కీచకవధ'లో ప్రతియోగము గల సన్నివేశములు గలవు. అర్జునుడు తనను మోహించిన ఊర్వశిని త్రోసిపుచ్చి మనోనిగ్రహము ప్రకటించి ఆమె వలన శాపముపొందినను అదియే అతనికి అజ్ఞాతవాసమున మారువేషమున నుండుటకు వరమైనది. కీచకుడు సైరంధ్రినికామించి ఆమెను తరుముటచే నందుకు నికృష్టముగా జచ్చెను. ఈ ప్రతియోగముచే అర్జునుని శీలము మనో హారముగా పోషింపబడినది.

"బభ్రువాహన"లో నీలధ్వజుడు సవనాశ్వమును బంధించి, అర్జునునితో యుద్ధముచేయుట ఉచితముగాదని తలంచుచుండ జ్వాలాదేవి భర్తయయిన నీల ధ్వజుని నిందించి యుద్ధమునకు పంపును. యుద్ధమున అర్జునునిచే జితుడైనను పరాక్రమమును ప్రకటించెను కాని అర్జునునిపై యుద్ధమునకు సిద్ధమైన సుధ న్వుని భార్య తాను ఋతుమతిననియు, మదనుని జయించిన వెనుక అర్జునునకు సాయమైన మదనజనకుని జయింపవలసినదని అర్థగించి భర్తతో క్రీడించెను. కాని రాజాజ్ఞను ధిక్కరించినందుకు శిక్ష మరణమగుటచే తండ్రిచే సుధన్వుడట్టి శిక్షకు గురియయ్యెను. ఈ సన్నివేశములోని ప్రతియోగముచే పాత్రల శీల స్వభావ తారతమ్యములు తెల్లమైనవి.

'సుల్తానా చాందుబీ'లో ఉత్తమశీలుడై యుండవలసిన క్రైస్తవమత ఫాదరి డాండియాగో దుష్టుడై సాటి ఫాదరి ఆల్మేడాను పదవినుండి తొలగించి అతని సోదరి మేరీని మానభంగము చేయప్రయత్నించును. సోదరి మాటలచే వానినిజంపప్రయత్నమునువదలి భగవంతునిపైభారముపై చిఆల్మేడారాణిసుల్తానా చాందుబీని నమ్మియుండును. అస్మన్‌బేగు మున్నగు కుట్రవారులతో చేతులు కలిపినాడన్న సంగతి రాణికితెలిసి, డాండియాగోను కారాగారబద్ధుని గావింప,

కుయుక్తితో తప్పించుకొనిపోయి అస్మన్‌బేగుతో కలసి ఢిల్లీకిపోయి పాదుషా సేనతోవచ్చి అమహన్నగరుపై యుద్ధమొనరింపజేసిన సందర్భమున క్షత గాత్రుడై మేరీఆల్మేడాలచే చికిత్సపొందుచున్నట్లు తెలిసికొని పశ్చాత్తాప్తుడై మేరీ క్షమాభిక్షనుగోరి వారి చేతులలోనే ప్రాణమువదలును. ఉత్తమ శీలవంతులైన మేరీ ఆల్మేడాలు సుల్తానా అనుగ్రహమునకు పాత్రులైరి అదే విధముగ తన మిత్రుడైన అబిస్సు ప్రేమించిన జోరియాను, అబిస్సు ప్రయాణమై జలదుర్గము నుండి వెడలిపోయినవెనుక అస్మన్‌బేగుపట్టి తెప్పించివివాహమాడ ప్రయత్నించి విఫలుడై ఆమెను మరల తెప్పించుటకుయత్నించును. ప్రయోజనము లేకపోవును. మంత్రి ఇన్నూల్‌ముల్క్ మున్నగు కుట్రదారులలో అస్మన్‌బేగు ఒకడని ఋజువుకాగా సుల్తానా అతనికి మరణశిక్ష విధించినప్పుడు అబిస్సు తనకు, తన ప్రియురాలకు గావించిన అన్యాయమునుసైతము విస్మరించి అస్మన్‌బేగు తండ్రి వృద్ధుడైన సుల్తాన్‌బేగు దేశమునకు గావించిన సేవనుగుర్తించి అతనిని క్షమించి శిక్షను తగ్గింపవలసినదనికోరి తన పరిశుద్ధాత్మను ప్రకటించును. రాణి శిక్ష తగ్గించి అస్మన్‌బేగును దేశభ్రష్టునిగావింప, ఆ క్రూరుడు డాండియాగోతోపాటు ఢిల్లీకిపోయి పాదుషా సేననుగొనివచ్చి సుల్తానాతో యుద్ధము గలిగించి కుట్రతో హమీదుచే సుల్తానా దాందుబీని బాకుతో పొడిపించి, అచటనేయుండి హమీదును పొడిచిచంపిన జోరియాను మోసముతో ఎత్తుకుని పోవుచుండును. ఇంతలో అబిస్సు ఈ విషయము తెలిసి, అస్మన్‌బేగును వెన్నంటిచంపి జోరియాను రక్షించుకొనును. ఇట్లు డాండియాగో, మేరీ అల్మేడాలకును, అస్మన్‌బేగు, జోరియా అబిస్సులకును ప్రతియోగము పాటించి శ్రీనివాసరావుగారు పాత్ర పోషణ గావించిరి.

"సత్యహరిశ్చంద్రీయము"న విశ్వామిత్రుని ఆజ్ఞతో మతంగకన్యలు హరిశ్చంద్రుని వరింపబోవు సమయమున నక్షత్రకుడెదురుపడి తననుగూడుమని, తన యిష్టార్థము నెరపినవారికి కార్యసిద్ధియగునని చెప్పును. కాని వారామాట ననాదరించి పోవుదురు. నక్షత్రకుడు రాజదండన ప్రాప్తిరస్తని దీవించి వెలి చేడియలనుకోరుటచే తనద్విజకులమునకు హైన్యము దెచ్చుకొనును. మతంగ కన్యలు తమ ఆటపాటలచే హరిశ్చంద్రుని అలరించి తమ్ము వరింపుమని కోరుదురు. అది నీచమని హరిశ్చంద్రుడు ఎన్ని విధములజెప్పినను వినకపోవుటచే

రాజాజ్ఞతో మంత్రి సత్యకీర్తి కొరడాతో వారిని గొట్టును. మతంగ కన్యలు తమకు ఉచితముగాని కోరికనుగోరి రాజశిక్షకు గురియైరి. కాని విశ్వామిత్రుడు బెదరించి చెప్పినను హరిశ్చంద్రుడు వారిని వివాహమాడ తిరస్కరించి, చివరికి తన సత్యసంధతను ప్రకటించి ప్రసిద్ధిపొందెను. మరొక ప్రక్క హరిశ్చంద్రుని బాధించుచు గురుఋణము రాబట్టుటకు యత్నించిన నక్షత్రకుడు లోకమున నట్టి వారిని తన పేరునబిలుచునట్లు చేసికొనెను. ఇట్లాయాపాత్రలకు శ్రీనివాసరావు గారు ప్రతియోగము కల్పించి విషయవివరణము గావించిరి. ఇంక మహా పతివ్రతయైన చంద్రమతి పుత్రుడు లోహితుని శవ సంస్కారార్థము కాటి సుంకముకొరకు బోవుచుండి విశ్వామిత్రుని మాయచే నేరముమోపబడి, కాశీరాజు ప్రతాపచంద్రదేవుని యెదుట ప్రవేశపెట్టబడినపుడు తన తప్పిదములేదని తెలిసియు రాజెదుట బదులు పలుకక మౌనమూనియుండి శిరఃఖండన శిక్షకు గురియగును. అదియు స్మశానములో తన భర్తచేతనే సంహరింపబడవలసి వచ్చుటయు, స్త్రీలను జంపనని హరిశ్చంద్రుడుచెప్ప, తన శిరసుఖండించి సత్యసంధతను ప్రకటింపవలసనదని భర్తను ప్రోత్సహించుటయు నామె పాతివ్రత్యమునకు నిదర్శనము. అనగా నిచట అట్టి మహాపతివ్రతకు కఠినమైనశిక్ష విధింపబడుటలో ప్రతియోగము కలదు. కాని ఆమె పాతివ్రత్య మహిమవలనను హరిశ్చంద్రుని సత్యసంధత చేతను తమ పుత్రుని పునర్జీవితునిగా పొందుటయేగాక ప్రసిద్ధినిగూడ పొందిరి. ఇట్లు శ్రీనివాసరావుగారు తమ నాటకములలో పాశ్చాత్యపద్ధతిని ప్రతియోగముప్రవేశపెట్టి పాత్రల శీలస్వభావములను సుస్పష్టమొనరించిరి.

## 5 . 4 నాటకీయ వ్యంగ్యము Dramatic Irony) :

పైని చెప్పబడిన ప్రతియోగమునందే మరొక రకముగలదు. దానిని Dramatic Irony (నాటకీయ వ్యంగ్యము) అందురు.[1] స్థూలముగా నాటకీయ వ్యంగ్యము ఒక వస్తువుయొక్క ద్వివిధ భావమును వ్యక్తము చేయునదిగా నుండునని చెప్పవచ్చును. అట్టి యర్థము తత్కాలమునకు సంబంధించినదిగాని

1. 162. పు. 228-227.

తరువాత స్పష్టమగునదిగాని కావచ్చును. రంగమున పాత్రలుచ్చరించిన మాటలలోగాని, సన్నివేశములలోగాని పాత్రలొక విధముగను, సామాజికులు మరొక విధముగను భావించినచో నప్పుడది నాటకీయ వ్యంగ్యమనబడును. ఈ నాటకీయ వ్యంగ్యముసంఘటనలేక సన్నివేశసంబంధి(Irony of Situation or incident) (దీనినే వస్తుసంబంధి అనిగూడ అనవచ్చును.) వాక్యసంబంధి Verbal Irony అని రెండు విధములు, కాని ఇవి రెండుకలిసియు నుండవచ్చును. అట్టి నాటకీయ వ్యంగ్యము పాశ్చాత్య నాటకములలో విరివిగా నుపయుక్తమైనది. గ్రీకు నాటకములలో, 'షేక్స్పియరు' నాటకములలోను దీని కధిక ప్రయోగము గలదు.

"పాత్రలు చర్చించు పలుకులక్కడి సన్నివేశమునకొక విధముగా సరిపడియే యున్నను సామాజికులకు భిన్నార్థస్ఫురణము కలిగించుట యందుక్తి సంబంధమయిన Irony గోచరించును. ఈభిన్నార్థము వక్తకుగాని, సంబోధితునకుగాని తెలియకుండనే యుండును.[1] గ్రీకు నాటకములలోని కథలు తఱచు కల్పితములుగాకుండుటచే సామాజికుల కందలిసన్నివేశములన్నియు కొంచెమించు మించుగాముందే తెలిసియుండును. అట్టియెడ నిట్టి Irony కి అవకాశము పెక్కువిధముల కలుగుచుండును."[2] ఇట్టి నాటకీయ వ్యంగ్యమునకు గ్రీకు నాటకకర్త 'Sophocles' రచించిన 'Oedipus the king' నాటకముత్తమోదాహరణము. ఇక స్త్రీ పురుషులు మారువేషములలో నున్నప్పుడిట్టి నాటకీయవ్యంగ్యము బాగుగా పోషింపబడును. ఈ నాటకీయవ్యంగ్యము శ్లేషాత్మకమై యుండుటయు గలదు. భావ్యర్థ సూచనాత్మక నాటకీయ వ్యంగ్యము (Prophetic Irony) అనుమరొక పద్ధతియు కలదు. ఇన్ని విధములుగా పాశ్చాత్య నాటకములలో నాటకీయవ్యంగ్యము ప్రసిద్ధికెక్కినది.

సంస్కృత నాటకములలో నిట్టిది కలదు. దీనిని 'పతాకాస్థానక'మని భరత మహర్షి పేర్కొనెను. ఒక వాక్యము నొక యర్థము నుద్దేశించి ప్రయోగించినను, ఆగంతుక భావముచే మరొక నిగూఢార్థము వచ్చిన నది 'పతాకా

---

1. 162. పు. 224, 225. 2. 11. పు. 99.

స్థానకము'. ఇది భావ్యర్థసూచకమై యుండును. పతాకాస్థానకము నాలుగు విధములు. వీనికి ప్రత్యేకమైన పేర్లులేవు.[1] ఈ పతాకాస్థానకములతో నాటక కార్యముకూడి ఉత్కృష్టముగా నుండును.

5.4.1 ఇట్లు భారతీయ పాశ్చాత్య నాటకముల రెంటను "నాటకీయ వ్యంగ్యము''న్నను శ్రీనివాసరావుగారి నాటకములలో పాశ్చాత్య నాటకపద్ధతిలోని నాటకీయ వ్యంగ్యమే ఎక్కువగ గోచరించుచున్నది. రావుగారి నాటకము లన్నిట నాటకీయ వ్యంగ్యమున్నను ప్రధానములైన వానిని మాత్రముదాహరింతును. 'సుల్తానా చాందుబీ' నాటకమున డాండియాగో జాబునందికొని చదివి, ఆల్మేడాను పదవినుండి తొలగించినారనియు, తక్షణమే గోవాకుఆల్మేడా పోవలయుననియు జాబులోనివిషయమని తెలిపి, అందలి సమస్త విషయములు తన కధిగత పూర్వమగుటచే లోలోన సంతసించియు, ఆల్మేడమేరీలకు కలిగిన కష్టమునకు సానుభూతితోదుఃఖించినట్లు నటించుటలో సన్నివేశసంబంధి నాటకీయ వ్యంగ్యము గలదు.

ఇట్లే "సునందనీ పరిణయము"న జయపాలుని దొంగలెత్తుకొని పోయిరని దుఃఖించుచున్న జయదేవీ ప్రతాపులకు, జయపాలుని అపహరింపజేసి, తనకా విషయము తెలియనట్లు సుమతి నటించుచు సానుభూతితో వేదాంతోపదేశము చేయుటలోను, చివర ప్రతాపుడు రాజ్యమునకువచ్చి మంత్రిని విచారించునపుడు ఉత్తముడుగానే నటించుటలోను సన్నివేశసంబంధి నాటకీయ వ్యంగ్యమున్నది.

"సీతాకల్యాణము"న రావణుడు మాయారాముని వేషమున బోయి ఉద్యానవనమున మాయా సీతను నిజసీతగా తలంచి తన గుట్టు బయటబడలేదని తలంచి ఆమె నపహరించిపోవుటలో నిట్టి సన్నివేశనాటకీయ వ్యంగ్యము స్పష్టము కాగలదు.

"శిలాదిత్య" నాటకమున కళావతి యుక్తితో మదనుని కారాగృహము నుండి తప్పించుటకై అనంగవర్మ వేషమునపోగా కావలివారు నమ్ముటలోను, కళావతి పొంచివినుచుండగా ఆమెవెళ్ళిపోయినదని తలచిమదనుడు తనదుష్టస్వభావ

1. 63. అ. 19. పు. 566, 567.

మును స్వగతములో చెప్పుటలోను; కళావతి కళావంతుని వేషమున మదనునితో పార్థియన్ రాజు నాశ్రయించివారిని నమ్మించి శిలాదిత్యునిపైకి యుద్ధమునకు గొనివచ్చి విజయము చేకూర్చుటయందును పార్థియన్‌రాజు, మంత్రులకు ఆమె నిజస్వరూపము తెలిసినను వారికితెలియదని ప్రవర్తించుటలోను సన్నివేశ నాటకీయ వ్యంగ్యము స్పష్టముగా తెలియుచున్నది.

"మైసూరు రాజ్యాభివృద్ధి"లో కృష్ణరాయడు సుబ్బాసాని వేషమునరాగా మారనాయకుడు నిజమైన ఆడుదానినిగా నమ్మటలోను, "కాళిదాసు"లో తన శిష్యురాలు మదనసేనపై మోహముజెంది తదుచితముగా వ్యంగ్యముగా గుణమాలినితో సంభాషించుచు తనదుష్టస్వభావమామెకు తెలియలేదని ఉపాధ్యాయుడు ప్రవర్తించుటలో, మదనసేనను, బలాత్కరించినను, గురువుపై నింద మోపక పోవుటచే, ఉపాధ్యాయుడుగూడ వాక్చాతుర్యముచే తప్పించుకొని రాజుచే గౌరవింపబడుటలో, ఉపాధ్యాయుడు, మంత్రి కలిసి మదనసేనకు దంబరవానిని భర్తను గావింపగొనివచ్చి, వానిని బ్రాహ్మణవటువుగా నిరూపింప ఉపాధ్యాయుడు ప్రయత్నముచేసిన సందర్భమునను, 'మదాలస'లో కృత్రిమ ముని వేషముననున్న తాళకేతువును, కువలయాశ్వుడు, శత్రుజిత్తు, మదాలస నిజమైన మునిగా నమ్ము సందర్భములందును, 'సీమంతినీ కల్యాణము'న సామవంత సుమేధులను వటువులు సామవతీ సుమేధులను దంపతులుగా సీమంతిని యొద్దకు పోవునపుడామె పాతివ్రత్య మహిమచేవారు యథార్థదంపతులుగాదని తలంచినను వారు తమ గుట్టుతెలిసికొనలేదనుకొనుటలో, 'కుశవల'లో శూర్పణఖను చాకలి రంగడు ఇతరులు నిజమైన అవ్వగా నమ్ముటలో, దాసివేషముధరించిన శూర్పణఖను శ్రీరాముడనుమానింపక పోవుటలో, 'ద్రౌపదీ వస్త్రాపహరణము' నందు మాయా సన్న్యాసినిని అర్జునుడుగా సుభద్రా బలరాములు గుర్తింపక నిజమైన సన్న్యాసిగానమ్ముటలో, 'కీచకవధ'లో సంకేతముగా కీచకుని నర్తనశాలకు రమ్మనినపుడు కీచకుడది వాస్తవమని నమ్ముటలో, స్త్రీ వేషమును ధరించిన భీమునివాస్తవముగా ద్రౌపదియని కీచకుడు విశ్వసించుటలో, 'మానాపమానము'న వనమాల పేరుతోనున్న భామనిని గుర్తింపకపోవుటలోనిట్టి సన్నివేశ సంబంధమైన నాటకీయ వ్యంగ్యము ప్రస్ఫుటమై యొప్పారుచున్నది.

5 . 4 . 2 భావిని తనకు గలుగబోవు ఘోరమును గణింపక తమ చాతుర్యమును పొగడుకొనుటలో నిట్టి నాటకీయ వ్యంగ్యములో మరొక పద్ధతి గలదు. సునందనీ పరిణయము'న సుమతి తన బుద్ధినైపుణ్యముచే సర్వము తానూహించినట్లు సిద్ధించునని తలంచును. కాని చివరికి రాజుచే మరణశిక్షను బొందుటలోను, 'సుల్తానా చాందుబీ'లో డాండియాగో అస్మన్‌బేగు తాముపన్నిన కుట్రప్రకారము ఢిల్లీపాదుషా సేనలను అమహన్నగరుపై యుద్ధమునకు గొని వచ్చు సందర్భమున సుల్తానా చాందుబీని సంహరింపజేసి, తాను వరుసగా వలచిన మేరీ జోరియాలను బొంద తలంచి ఉవ్విళ్ళూరుచు తమ బుద్ధి నైపుణ్యమును బొగడు కొనినవారు చివరికి యుద్ధమున నిక్రష్టముగా జచ్చుటలోను నిట్టి నాటకీయ వ్యంగ్యము గలదు

5 . 4 . 3 పాత్రల సంభాషణలో వాక్యగత నాటకీయ వ్యంగ్యము స్ఫురించును. 'సుల్తానా చాందుబీ'లో డాండియాగో మేరీని బలాత్కరించు సమయమున "అన్నా ! ఏమిమాటలివి సర్వసంగపరిత్యాగినై దైవసేవకు దీక్ష వహించిన యాచార్యురాలను నేనుగానా ?" అని మేరీఅనగా "నేను నట్టి యాచార్యుఁడన. కావుననే సంబంధము చక్కఁగఁ గుదురును." అని డాండియాగో పల్కుటలోను, జలదుర్గమునుండి అబిస్సు బయలుదేరి వెళ్ళుచున్నప్పుడతనితో పాటు మేరీ ఆల్మేడులనుగూడ కొనిపోవలసినదిగ ముదగల్లునవాబు వ్రాసినారని అస్మన్‌బేగు తెలుప, ఆ పాదరి సాయము దారిలోదాల అవసరమని అబిస్సు అదిశుద్ధాత్మతో పలుక అస్మన్‌బేగు చిరునవ్వుతో వారి సోదరి తోడ్పాటు సైతము వలయునేని నీకు లభించు ననుటలోనునిట్టి వాక్యగత నాటకీయ వ్యంగ్యమున్నది.

"శిలాదిత్య''లో ఉద్యానవనవిహారమున నవమాలికతో నామె పూర్వస్థితి స్ఫురించునట్లు వనరమను కళావతి వర్ణించుటలోను, నవమాలికను మోహింప మదనుడు మదనిక వేషమునవచ్చి పలుకుమాటలలోను మదనునకు, కళావతి ధరించిన మారువేషములోని కళావంతునకుమధ్య జరిగిన సంభాషణలోనిట్టి వాక్యగత నాటకీయవ్యంగ్యము గలదు. 'మైసూరు రాజ్యాభివృద్ధి'లో ఔషధ జ్ఞానములేని వాగాడంబరాచార్యుడు మందు గొప్పదనమును గూర్చి శిష్యునితో జెప్పుటయు, శిష్యుడైన వరదుడు దానిని పొగడుసందర్భము నందలి వాక్యముల

లోను, 'సునందనీ పరిణయము'న సుమతి దౌష్ట్యము తెలియని ప్రతాపుడు పొగడుటలోను, సుమతి 'నీ పట్టికి గట్టనాధరకుఁబట్టము' అని రాజుతో పలుకుట లోను, 'సీమంతినీ' నాటకమున భృంగీశ్వరుడు రంభోర్వశులతో నన్న మాటల లోను 'మానాపమానము'న లక్ష్మీధరునిగూర్చి శీలధరుడు పలికిన మాటలలోను వాక్య సంబంధమైన నాటకీయ వ్యంగ్యము స్పష్టముగా తెలియును.

5·4·4 నాటకీయవ్యంగ్యము హాస్య సమ్మిశ్రితమైగూడ నుండును. ముఖ్యముగా పైని వివరించిన వానిలో ఆయా పాత్రలు మారువేషములలో నుండి పలికిన పలుకులలో నిట్టిది స్పష్టముగా తెలియును. వాక్యగతమై హాస్యముతో కూడిన నాటకీయ వ్యంగ్యము రఘునాథుడు 'లతీఫా ! నీకే సందియము వలదు. వీరు పెండ్లికిఁ ద్వరపడుచున్నవారు. మన మందులకే త్వరపడవలెను." అను మాటలలో నర్థద్వయస్ఫురణచే లతీఫా కోపగించుకొను సందర్భమునగలదు' 'సుఖమంజరీ పరిణయము'న విదూషకసూత్రధారుల మాటలలో నిట్టిహాస్యముతో కూడిన నాటకీయ వ్య గ్యము గలదు.

5.4.5 ఉక్తినిష్టమై గూడ నీ రాజకీయ వ్యంగ్యముండును. 'మైసూరు రాజ్యాభివృద్ధి'లో జగదీశ్వరుని వేషమున నున్న జగదంబను గూర్చి యదు రాయడు చెప్పినప్పుడు కామేశ్వర పంతులు "పురుషులందఱు జగదీశ్వరులు. స్త్రీ లందఱు జగదంబలు. ఇది మా మత సిద్ధాంతము" అనగా, అద్వైత బ్రహ్మశాస్త్రి "ఓరీ ! జగదీశ్వర జగదంబలకు భేదమేమి ? భేదము లేదుకదా ? ఉభయు లొకటేను. ఇది నమ్మండి. సందియము లేదు." అనుటయు, తన నిజస్థితి వీరికెట్లు తెలిసెనో యని జగదీశ్వరి రిచ్చవడునప్పుడు 'జగదీశ్వర, జగదీశ్వరి' శబ్దములలో ఉక్తి నిష్ఠమైన నాటకీయ వ్యంగ్యము గలదు. 'సుఖ మంజరీ పరిణయము'లో ఉద్యానవనమున తనకు తెలియని చారులోచన యను చెలిని మామూలు ధోరణిలో సంజయుడు 'చారులోచనా !' యను సంబోధించుట లోను, చూచిన రాజకుమారుని గూర్చి ఎవడై యుండునని సుఖమంజరి యడుగ, సీతయను చెలి 'ప్రద్యుమ్నుఁడ'ని సమాధానము చెప్పుటలోను; 'కాళిదాసు'లో ఉపాధ్యాయునితో గుణమాలిని 'అభీష్టార్థంబు', 'అంత్యసేవ', 'మీకు శోభన మగును' అను మాటలలో 'కీచకవధ'లో ద్రౌపది వేషమున నున్న భీముడు

కీచకునితో 'స్వర్గసుఖము' నందుదు వనుటలోను నిట్టి ఉక్తి సంబంధమైన నాటకీయ వ్యంగ్యము స్పష్టముగా తెలియును.

ఇది శ్లేషాశ్రయమై చాల ప్రచురముగా కన్పట్టును. రామరాజు చరిత్రములో ఐహ్మనీసుల్తానులతో యుద్ధమునకు సిద్ధమగు సమయమున రామరాజు పటాణిని సైన్యాధిపతిగజేసి యతని పరాక్రమము చూపవలసినదని ప్రోత్సహించు నవుడు పల్కిన పద్యమున నిట్టి శ్లేషాశ్రయమైన నాటకీయ వ్యంగ్యము గలదు.

'కలనికిఁజొచ్చు వేళ భటకాండము నన్గొని యాడఁ జేసెదన్
తెలియనె నీకుమారకుఁడనేనయి సర్వము ? యుద్ధభూమిలోఁ
దెలియఁగనౌగదా ? యిపుడు తెల్పఁగ నేమి ప్రయోజనమ్ము నీ
కలతఁ దొలంచి శాశ్వత సుఖంబొనఁగూర్చెద మీకు నమ్ముమీ !,

"మహాప్రభూ ! మీకు నాకుజనకులుగా నెంచి రణావనియందు నాశక్తి యంతయును ధారపోసెద. నిస్సందేహమిది." అను పటాణి మాటలలో "నీ కుమారకుఁడ; మీరు నాకుజనకులు" అను పదములలోని శ్లేషచే నిట్టిది సంభవించినది. ఇంక "యుద్ధభూమిలో దెలియఁగనౌగదా". "శాశ్వత సుఖంబొనఁగూర్చెద మీకు" అను వాక్యములలో పటాణి యుద్ధమున రామరాజు తలఖండింపబోవు సంగతిని గూడ భావ్యర్థ సూచనాత్మక రాజకీయ వ్యంగ్యము గలదు. దీనిని ఆంగ్లమున (Prophetic Irony) అందురు, "సునందనీ పరిణయము" నందు ఉద్యానవనమున కుసుమాపచయసమయమున సునందని సుదేవునిగాంచి సంభాషించిన వెనుక పొంచి వినిన జయమాలిని సునందనితో "సఖీ ! నీవు వలచిన వరకుసుమంబు సంఘటించెనటే ?" అను వాక్యమున 'వరకుసుమ' మన్న మాటకు శ్లేషచే అర్థద్వయ స్ఫురణచే నిట్టి నాటకీయ వ్యంగ్యము స్పష్టమగును ఇట్లే 'సీతాకల్యాణము'న ప్రియంవద 'వరపుష్ప' మనుటలోను 'సీమంతినీ నాటకము'లో కలవాణి 'వరపున్నాగ' మనుటలోను, 'పాదుకాపట్టాభిషేకము'న కైక 'మనోవృత్తి' యనుటలోను, 'శ్రీరామజననము'న రావణుడు 'నీ పీఠంధ విముక్తి' అనుటలోను, 'ద్రౌపదీ వస్త్రాపహరణము'న సన్న్యాసి వేషముననున్న అరునుడు సుభద్రతో 'పక్వారుణ బింబఫలములు' అని పలుకుటలోను, 'నీకు

విజయ లాభమగుగాక' అనుటలోను నిట్టి శ్లేషాత్మక నాటకీయ వ్యంగ్యము మనకవగత మగును.

5.4.7 "సునందనీ పరిణయము" నందు ఉగ్రసేనుడు జయమాలినిని వివాహమాడ వలసినదని యడుగ జయమాలిని "తాళుమింతలోఁ గాలము వచ్చు నీకు", "అపుడు కదా నీ పదవి మిన్నందును ! నీ సుఖంబు స్వర్గ సుఖంబగు" నను వాక్యములలో ఉగ్రసేనునకు గలుగు మరణము సూచించుటలో స్పష్టమయినది. 'సత్యహరిశ్చంద్రీయము'న నక్షత్రకునితో భార్యనమ్మియైన విశ్వామిత్రుని ఋణము దీర్తుననుటలోను, 'సీమంతినీ నాటకము'న చంద్రాంగదునితో యుగంధరుడు "అటులయిన నచట నీకుఁ గల్యాణంబు గలుగునేమో" అని ఆశించుటలో, 'పాదుకా పట్టాభిషేకము'న కైక దశరథునితో "నాథా ! నాకు నేంత యుండిన నేమి నేననాథనైతిని" అని పలుకుటలో, మంధర కైకకు దుర్బోధ గావించునపుడు "నీ కొడుకగు భరతుడు రాముని కాళ్ళ ముచ్చెలు తలపైనిడికొని నడుచుచుండ నిమ్ము" అనుటలోను, వసిష్ఠుడు కైకతో "ఇవ్వార్త భరతుడు విననేని నీపై మండిపడి నిన్నుఁ దూఱి, యరణ్యంబుఁ జేరి, యారాముని చరణంబులు శరణములని నమ్మి, వాని పాదుకలు శిరమున ధరించుకొని తిరుగుచుండునుగాని, నీ మాటలు వినునా ?" అని మందలించుట లోను, 'కుశలవ'లో శూర్పణఖ సీతారావణు లేకశయ్యపై నున్నట్లు చిత్రించి దానిని రాముని కందజేసినపుడందుకు రాముడు బాధపడి లక్ష్మణునకది జూప నతడు "మనకుఁ గాని వారి కుట్ర యిది యని నేఁ దలంచెద" అని, అన్నను సమ్మతింపజేయుటకై యత్నించుటలోను, 'గిరిజా కల్యాణము'న ఈశ్వరుడు సతితో "నీపీ విధి మూర్ఖపు పట్టుపట్టిననది మన చిర వియోగంబునకుఁ గారణంబగునని నేఁజింతించెద" అని వాపోవుటలోను, మన్మథుడు "నాకీ పని యొనర్చుటచేఁ గలుగు నష్టమేద్ది ? ఆ పరమాత్ముడు నన్ను భస్మంబు సేయునని కదా ?" అని స్వగతములో తలంచుటలోను, 'ప్రహ్లాద'లో హిరణ్యకశిపుడు బ్రహ్మతో "ఇంద్రుని ఖరాయుధ భేద్యము కానటుల నా తనువుండవలె" నని వరమడుగ బ్రహ్మ "నఖరాయుధ భేద్యుఁడవుగనుండు" మని శ్లేషతో వరమిచ్చుటలోను భావ్యర్థ సూచనాత్మకమైన నాటకీయ వ్యంగ్యము స్పష్టముగా తెలియును. ఇట్లెన్ని విధములుగా నాటకీయ వ్యంగ్యమును తమ నాటకములలో ప్రవేశపెట్టి శ్రీనివాసరావుగారు మనోహరముగావించిరి.

## 5.5 విషయ గోపనము, అద్భుతము (Concealment and Surprise) :

పై పద్ధతులేగాక పాశ్చాత్య నాటకీయ శిల్పమున మరొక విధానముకలదు. కొంచరు నాటక కర్తలు నాటకారంభముననే ప్రధనాంశములను స్పష్టముచేయక గోపనముగా నుంతురు. తన్మూలమున సామాజికులలో ఔత్సుక్యమును ప్రేరేపింపనగునని వారి తలంపు. నాటకమున విషయ గోపనము చేసి అద్భుతమును కలిగించు నాటక కర్త బహు జాగరూకుడై వర్తింపవలెను. లేనిచో నాటకము విశిష్టమై యొప్పదు. కాని కొందరు నాటకములలో సమస్త విషయములు కాకపోయినను ముఖ్య విషయములను, ఆశయములను ఆరంభమునుండి స్పష్టము చేయుచు నాటకస్థ పాత్రల శీలస్వభావములను సువ్యక్తము చేయుటయు గలదు.[1] షేక్స్పియరు ఇట్టి పద్ధతి ననుసరించెను.

5.5.1 శ్రీనివాసరావుగారి నాటకములలోను నిట్టి "విషయగోపనము, అద్భుతము" అనునవి నిర్వహింపబడినవి. వీనిచే నెచటను నుద్రిక్తి మొనర్పలేదు. వీరు బహు జాగరూకులై నిర్వహించి యుండుట స్పష్టమగును. వీరి నాటకములలో సామాజి కౌత్సుక్య ప్రేరకమైన రచన కానసాగినది. ఆ యా సన్నివేశములలో దానిననుసరించి అద్భుతము కూడ స్పష్టమగుట తెలియును. 'రామరాజు చరిత్రము', 'సుల్తానా చాందుబీ' అను నాటకములందిట్టి ఔత్సుక్యము అడుగడుగున స్పష్టమగును. ముందేమి జరుగునో యని సామాజికు లెదురు చూచుచుండును. ఇట్టిదే తక్కిన నాటకములందును గలదు.

కొన్ని పాత్రలు మారువేషము ధరించునప్పుడు నాటకములందిట్టి విషయగోపనము కన్పట్టును. కాని 'సునందనీ పరిణయము'లో సునందని సన్న్యాసి వేషమున అరణ్యమున దిరుగుచు ఖండిత పాదుడైన ఉగ్రసేనుడు వ్రాసియిచ్చిన ఉత్తరము గొనివచ్చి మంత్రి సుమతి దుశ్చర్యల బయల్వెట్టు సమయమున సునందని అని తెలియుచుండును. అట్లే 'సీమంతిని'లో సామవంత సుమేధులు

1. 162. పు. 228–230.

సోమవతి సుమేధులను దంపతుల వేషమున సీమంతిని యొద్దకేగుట, 'శిలాదిత్య'లో కళావతి అనంగవర్మ వేషముధరించుట, కళావతి కళావంతుడుగ మదనునితో పార్థియన్లనుజేరి వారిని గొనివచ్చి యుద్ధముసాగించుట, 'మైసూరు రాజ్యాభివృద్ధి'లో కృష్ణరాయుడు కిట్టిగాని, సుబ్బాసాని వేషములు వేయుట, 'కుశలవ'లో శూర్పణఖ చాకలి అవ్వగా, దాసిగా వేషము ధరించుట, 'చంద్ర గిర్యభ్యుదయము'న కుముదిని చాకలి చంపగా మారుట, "మానాపమున నాటకము"న భామిని వనమాల వేషమున సంచరించుట, విలాస లక్ష్మీధరులు దొంగల వేషమునవచ్చుట, "సీతాకల్యాణము"న విశ్వామిత్రునాజ్ఞతో మోహిని మాయా సీతయగుట, "గిరిజాకల్యాణము"న పార్వతీదేవి తపస్సును పరీక్షింప ఈశ్వరుడు వృద్ధుని వేషమునవచ్చుట మున్నగు సన్నివేశములలో ఆ యా పాత్రలు సామాజికులకు స్పష్టముగా తెలియుచుందురు.

కాని "సుల్తానా చాందుబీ"లో రఘునాథుడు జోరియా, అబూకర్ అను ముల్లా వేషములు ధరించుట, "మదాలస"లో కృత్రిమ ముని వేషమున తాళ కేతుడు మోసగించుట, 'శిలాదిత్య'లో మదనుడు మదనిక వేషమున ఉద్యాన వనము ప్రవేశించుట, 'మైసూరు రాజ్యాభివృద్ధి'లో జగదీశ్వరి జగదీశ్వరుని వేషమున తిరుగుచుండుట, 'సీతాకల్యాణము'న మాయారాముని స్వరూపముతో రావణుడు సీతనుగూడ యత్నించుట మొదలైన సందర్భములందు ఆ యా పాత్రలను గుర్తించుటకు సామాజికులకు కొంత కాలమైనను పట్టును. అట్లే విషయమును నిగూఢముగా నుంచుట వీరి నాటకములందు సర్వసామాన్యము. అంత మాత్రముచేత నీ నాటకములు సామాజికార్థావగతికి దూరమై దురవబోధ ములై యున్నవని తలంపరాదు.

5.5.2 ఇంక పాత్రల శీలములను మొదటి నుండియు స్పష్టము గావిం చుట వీరి నాటకములందు కననగును. 'సునందనీ పరిణయము'న దుష్టుడైన సుమతి శీలము; 'సుల్తానా చాందుబీ'లో అస్మన్‌బేగు, దాండి మాగోల దుశ్శీల ములు; 'రామరాజు చరిత్రము'న సలకము తిమ్మయ్య దౌష్ట్యము, 'పాదుకా పట్టాభిషేకము'న దేవకార్యార్థము మంథర దుశ్శీలయైనట్లును ఆరంభమునుండి ఆ యా వ్యక్తుల చేష్టలవలనను, స్వగతముల వలనను, శ్రీనివాసరావుగారు

స్పష్టముగావించిరి. ఇట్లు వీరుతమ నాటకములందు పాశ్చాత్య పద్ధతిలో గోపనముచేసి సామాజికుల కద్భుతము కలిగించిరి.

## 5.6 స్వప్నములు, లేఖలు (Dreams and Letters) :

స్వప్నములు,లేఖలు వీని మూలమున సైతము నాటకేతివృత్తమును నడిపించుట కలదు. శ్రీనివాసరావుగారి నాటకములలో సైతము వీనికి ప్రాధాన్యము కలదు. 'సునందనీ పరిణయము'న సునందని, సుమతి, 'రామరాజు చరిత్రము'న తిరుమలాంబ, 'సత్యహరిశ్చంద్రీయము'న హరిశ్చంద్రుడు, 'లంకాదహనము'న త్రిజట కలలు గనుట కలదు. 'శిలాదిత్య'లో శిలాదిత్యుని స్వప్న విషయము, 'పాదుకాపట్టాభిషేకము'న భరతుని స్వప్న ప్రశంసగలవు. వీరు తమకు రాబోవు శుభాశుభములను స్వప్నమున గనుట కలదు. స్వప్నము లన్నింటిలోనుతిరుమలాంబ కల చాల సార్థకమైనది. బహ్మనీ సుల్తానులపై యుద్ధమునకు రామరాజు ఆయత్తమగుచుండ వీరాలాపములచే నతని ప్రోత్సహింపక యుద్ధమునకు పోవలదని తిరుమలాంబ భర్తను వేడుకొనును. సర్వ నాశనమైనట్లు తాను కలగనినవిధమును తెలుపును. కాని రామరాజు లెక్కచేయక యుద్ధమునకు వెడలును. ఈ సన్నివేశము షేక్స్పియరు మహాకవి 'జూలియస్ సీజరు' నాటకమున 'కాల్పూర్నియా' కలగని భర్త సీజరును సెనేట్‌హాలుకు పోవలదని రాబోవు విపత్తును శంకించి కోరినను లెక్కచేయక సీజరు వెళ్ళు నప్పటి సన్నివేశమును తలపింప జేయుచున్నది. ఇట్లనుటచే శ్రీనివాసరావుగారి ఆంగ్ల నాటక పరిచయము సువ్యక్తమగుచున్నది.

5.6.1 లేఖల ప్రసక్తి గల నాటకము లారు. 'ద్రౌపదీ వస్త్రాపహరణము'న విదురుడు పాండవులకు పంపినలేఖ భీషణుడు లక్కయింట నున్న భీమునకిచ్చును భీముడది మౌనముగా చదువుటచే నందలి విషయము స్పష్టము కాదు. కాని భీముని స్వగతమున తెలియును. దుర్యోధనుని దురాలోచనము

తెలిసి తల్లిని సోదరులను లాక్షాగృహము నుండి రక్షించును. ఈ లేఖకు ప్రాధాన్యము కలదనియే చెప్పవలెను.

'సునందనీ పరిణయము'న సన్యాసి వేషమున అరణ్యమున దిరుగుచు వచ్చిన సునందనికి ఉగ్రసేనుడు వ్రాసియిచ్చిన లేఖ నామె గొనివచ్చి సుమతి దౌష్ట్యమును వెలిపెట్టుటయే కాక అన్ని విషయములను స్పష్టము గావించును. ఉగ్రసేనుడు దుష్టుడైన సుమతికి తోడ్పడి యుండుటచే తన పాపములను నోట వచింప నిచ్చగింపక ఉత్తరమున వ్రాసి యిచ్చుటచే చివరకు సునందని సుమతి దౌర్మార్గ్యమును నిరూపింప గలిగినది. ఈ ఉత్తరము పద్యమయముగా నున్నది.

'చంద్రగిర్యభ్యుదయము'న జగ్గరాయలు తన వకీలుతో యాచమనాయకునకు లేఖ పంపును. క్రొత్తగా రాజయిన చిక్కరాయలను శరణువేడ వలసినదని, లేనిచో కఠినశిక్షకు గురికావలసి వచ్చునని జగ్గరాయడు యాచమనాయకు నాదేశించి నట్లుండును. అందుకు యాచమనాయకుడు గినిసి, జగ్గరాయడే ద్రోహి యని వకీలుతో చెప్పిపంపి, జగ్గరాయాదుల సర్వవినాశనము గావించుటకును, విజయనగరరాజుల నే సింహాసనముపై స్థిరపరచుటకును బద్ధకంకణుడగును.

'కాళిదాసు'లో నొక ఉత్తరమున్నది (1-8). ఇదిభోజరాజు ముంజునకు శ్లోక రూపమున వ్రాసి దానిని తెలుగున వివరించి పంపును. అందు హితముపదేశించినట్లుగలదు. దీనిచే భోజుని ఉత్తమ శీలము వ్యక్తమగుటయే కాక ముంజుని మనఃపరివర్తనము చెందుటకుపకరించి కథాగమనమునకు సహాకరించి నట్లు స్పష్టమగును

'ప్రతాపాక్బరీయము'న మూడు లేఖలు గలవు. మొదటివి (2-2) అక్బరుతో యుద్ధము వలదని షాహిదాసుకు ఉదయసింగు వ్రాసిన జాబు; రెండవది (5-8) ప్రతాపుడు రాజీకొరకు అక్బరుకు వ్రాసిన ఉత్తరము. మూడవది (6-2) ప్రతాపవతీ వృథ్వీరాజులు ప్రతాపునకు వ్రాసిన లేఖ. మొదటి దానివలన ఉదయసింగు పిరికిపంద యని తెలియుటయేకాక, అతని హితము

వినసందున షాహిదాసాదులు అక్బరు వలన సర్వనాశనమగుదురను సంగతి విదిత మగును. రెండు మూడు లేఖలుచాల ప్రధానములైనవి. దారసుతుల దుస్థితికి మిక్కిలి కుందిన ప్రతాపుడు రాజీయే శరణమని అక్బరునకు వ్రాయును. కాని అక్బరుననుమతితో ప్రతాపవతీ పృథ్వీ రాజులు వ్రాసినలేఖ వలననే ప్రతాపుడు మరల వీర సాహసములను పుంజుకొని చివరకు అక్బరు సేనల నెదిరించి విజయము చేకూర్చుకొని హిందూ రాజ్యము పునస్స్థాపింప గలిగెను. ప్రతాపుడు మొదట వ్రాయనిచో నీ లేఖ అందుటకు అవకాశము లేదు. కనుక నిట రెండు లేఖలు సర్వప్రయోజనకారు లనుటయే ఉచితము.

ఇంక 'సుల్తానా చాందుబీ' నాటక మంతయు లేఖల మీద ఆధారపడి నడచినది. ఇందు పది జాబులు గలవు. మొదటి ఎనిమిది జాబుల వలన ఇన్నూల్‌ముల్క్, ఇల్లాజ్‌ఖాన్, యాఖూబ్, అస్మన్‌బేగు, డాండియాగో‌ల కుట్రం దౌష్ట్యము స్పష్టమగును. ఇన్నూల్‌ముల్క్, ఇల్లాజ్‌ఖాన్ యుద్ధములోను యాఖూబ్ సభాస్థలముననను పాపపరిహారముగా వధింపబడుదురు. అస్మన్‌బేగు దేశభ్రష్టుడుకాగా, డాండియాగో కారాగారశిక్షకు లోనగును. మేరీ ఆల్మేడాలు జోరియా అబిస్సులు ఉత్తమ శీల స్వభావులనియు నీ యుత్తరముల వలననే స్పష్టమగును. తొమ్మిదవ లేఖ డాండియాగో మరణావస్థలో నుండి ఆల్మేడా చేత వ్రాయించిన మరణశాసనము. డాండియాగో పశ్చాత్తప్తుడై, మేరీ ఆల్మేడాలకు తాను గావించిన పాపమునకు పరిహారముగా తన యావదాస్తియు వారికి జెందునట్లుండు వ్రాయించును. దీనిచే డాండియాగో శీలపరివర్తనము స్పష్ట మగును. పదియవ జాబులో ఢిల్లీ పాదుషాకు సుల్తానా చాందుబీ లోబడియుండ వలెననుట ముఖ్యవిషయము. చాందుబీ అందు కంగీకరించినను హమ్మీదను సేనాని అస్మన్‌బేగు ప్రేరణచే పాదుషా కుమారునకు లోబడియుండుట కంగీక రింపవలదని చాందుబీని మోసగించి, పట్టణము శత్రువుల వశము గావించి చాందుబీని బాకుతో బొడుచును. దగ్గరే యున్న జోరియా హమ్మీదును బొడు చును. ఈ గందరగోళములో అస్మన్ సమయమెరిగి జోరియా నెత్తుకొని పోవును. వెంటనే విషయ మెరిగిన అబిస్సు అస్మన్‌బేగును బొడిచి చంపి, తన ప్రియురాలు జోరియా దుఃఖమును పోగొట్టును. అంతలో చాందుబీ మరణించును. ఇట్లు సుల్తానాచాందుబీ నాటకము నందలి ఉత్తరము లన్నియు నధిక ప్రా ము

ఖ్యము గలవే. అంత మాత్రముచేత నిది శ్రవ్యకావ్యముగా మారినదేమో యని శంకింప పని లేదు. ఈ ఉత్తరములు సంగ్రహముగా నుండి కార్య కారణ సంబంధము కలిగి తరువాతి కథ ముందుకు సాగుట కుపకరించినవి. ఇట్లు శ్రీనివాసరావుగారు లేఖల ప్రసక్తిచే ఆయా నాటకములందు శిల్పమును పోషించిరి.

## 5 . 7 అతిమానుషశక్తులు (Supernatural Powers) :

అతిమానుషశక్తులు గ్రీకు నాటకములలోను, షేక్స్పియరు నాటకములలోను గలవు. సంస్కృత నాటకములలో అతి మానుషశక్తులేగాక స్వయముగా దేవతలుండుటయు సహజమే. శ్రీనివాసరావుగారి నాటకములలో నిట్టివి గలవు. కాని వీరి నాటకములలో 'సుల్తానా చాందుబీ' 'సునందనీ పరిణయము' 'సుఖమంజరీ పరిణయము', ప్రతాపాక్బరీయము', 'మానాపమానము' అనువానిలో దేవతలయు, అతిమానుషశక్తులయు ప్రసక్తియే లేదు. మదాలస, సీమంతిని, సత్యహరిశ్చంద్రీయము, రుక్మాంగద, దాశిదాసు, కీచకవధ, ద్రౌపదీ వస్త్రాపహరము, శిరోమణి, బభ్రువాహన, శ్రీరామజననము, సీతాకల్యాణము, లంకాదహనము, గిరిజాకల్యాణము, ప్రహ్లాద నాటకములలో దేవతల ప్రవేశము, దేవతల ప్రభావము మున్నగు అతిమానుషశక్తులు గలవు. వీని వలన ఆయా నాటకేతి వృత్తములు కొనసాగినవనుట స్పష్టము. శ్రీనివాసరావుగారు తమ చారిత్రక నాటకములలో 'రామరాజు చరిత్రము' 'శిలాదిత్య', 'చంద్రగిరి అభ్యుదయము'నను మూటిలోను, రామాయణ నాటకములు 'కుశలవ, పాదుకా పట్టాభిషేక'మను రెంటిలోను అతి మానుషశక్తులను ప్రవేశపెట్టిరి. వీరి ప్రసిద్ధ నాటకము 'రామరాజు చరిత్రము'న లక్ష్మీసరస్వతి కాళరాత్రులు పాత్రలై వర్తించిరి. వీరు ప్రథమ ద్వితీయ తృతీయాంకముల ప్రథమ రంగములలోను, పంచమాంకము తృతీయరంగమున కాళరాత్రియు ప్రవేశించి నాటక కథను నడపిరి. వీరి సంభాషణల మూలమున విజయనగరపు పూర్వవుటౌన్నత్యము, తద్వినాశము సుస్పష్టమగును. అనగా సామాజికులకు కథను సుబోధ మొనర్చుటకు శ్రీనివాసరావుగారీ పాత్రలప్రవేశపెట్టిరి. ఇట్లు 'రామరాజు చరిత్రము'న

లక్ష్మి సరస్వతి కాళరాత్రులప్రవేశపెట్టుట షేక్స్పియరు మహాకవి 'మేక్బెత్తు'లో (The Three Witches) ను తలపింప జేయుచున్నది. ఇది శ్రీనివాసరావు గారికి గల షేక్స్పియరు నాటకముల అతి మాత్రపరిచయమును సువ్యక్తము చేయుచున్నది.

'శిలాదిత్య నాటకము'న సూర్యుడు ప్రత్యక్షమై సుభగకు పుత్రీపుత్రుల ప్రసాదించుట, ఆదిత్యునకు సాలగ్రామము, మహిమల నొసగి శిలాదిత్యుని గావించి, రాజునొనర్చుట అను నంశములమీదనే ఆ నాటక మంతయు నాధార పడినది. 'చంద్రగిర్యభ్యుదయము'న ఋషి ప్రవేశముచే యాచమనాయకుని పాత్రచిత్రణముతోపాటు కథాగమనమున కుపకరింపజేయ యత్నము జరిగినది. "మైసూరు రాజ్యాభివృద్ధి"లో జగన్మోహినీకారణమున లక్ష్మణవీరుల వధా సమయమున అగస్త్యుడు ప్రవేశించివారికది పూర్వజన్మకర్మానుసారముగ జరుగు చున్నదనియు, మరుజన్మమునవారు యదురాయ కృష్ణరాయలుగ జన్మింతు రనియు తెలిపి వెడలిపోవును. ఇది కొంతవరకు అసహజమేయైనను పూర్వోత్తర కథలకు సమన్వయము చేకూర్పజాలినదనుటలో సందేహము లేదు.

'కుశలవ'లో శూర్పణఖను ప్రవేశపెట్టి, ఆమెచే చాకలిఅవ్వగా, దాసిగా ఇతరులు గుర్తుపట్టుటకు వీలులేనట్లు వేషములు వేయించి రాముడు సీతను పరి త్యజించుటకుపకరించినట్లు శ్రీనివాసరావుగారు కల్పించిరి. శూర్పణఖ తనకు సహజమైన రాక్షసమాయచే వేషము ధరించుట, సీతారావణులేకశయ్యనున్నట్లు చిత్రించిన చిత్రపటముచే రాముని విశ్వసింపజేయుట అతిమానుషశక్తిగాక మరేమి ? ఇంక సీతను త్యజించుటతో శ్రీరామునియందు దోషములేదని నిరూ పింప యత్నించుటయేగాక, కథాగమనమునకు సహకరించినది.

'పాదుకా పట్టాభిషేకము'న రామపట్టాభిషేకమునకు సర్వాయత్తము గావింపబడుచుండ మంథర తెలిసికొని స్మారకముదప్పగా ఎవడో మహానుభావుడు తనకు దేవకార్యార్థము రామపట్టభంగము గావింపవలసినదని కోరినట్లును స్మార కమువచ్చి దేవకార్యార్థమట్లు గావింపయత్నింప సఫలీకృత మనోరథయగుట కల్గదు. ఇది ఎవడో మహానుభావుడు మంథరకు జెప్పినట్లు శ్రీనివాసరావు గారు కల్పించిన అతిమానుష విషయము. మంథర దుష్టస్వభావమును పరిహ

రింప శ్రీనివాసరావుగారిందు యత్నించిరి. అనగా కథాగమనముతోపాటు పాత్ర చిత్రణకుగూడ నిట్టి అతిమానుషశక్తి ప్రవేశముపకరించునని తెలియును. 'కుశలవ, పాదుక'లలోని శ్రీనివాసరావుగారి ఈ కల్పనలు స్వతంత్రములు, సహజములు, సరసములునై నాటకశిల్ప గౌరవమున కుపకరించినవనుట సముచితము. ఇట్లు శ్రీనివాసరావుగారు తమ నాటకములందు ఉచితరీతిని అతిమానుష శక్తులను ప్రవేశపెట్టి నాటకములకు సమష్టి సౌందర్యమును సంపాదించిరి.

## 5 . 8 అంకము- రంగ విభజనము (Act and Scenes) :

సంస్కృత నాటకములందు నాటకాంకమున కెక్కువ ప్రాధాన్యముగలదు నాయకుని జీవితమందలి రసపద్ఘట్టములను మాత్రమే అంకమున నిబంధింప వలెనని సంస్కృత లాక్షణికమతము. పంచ కార్యావస్థాదులు ప్రథమాంకము మొదలుకొనియున్న అంకములలో కూర్పవలెను. రసభావ యుక్తములగు అర్థము లనేకవిధముల ప్రరోహింపజేయునది "అంకము". దీనికిని దశరూపక ములలో నొకటైన "అంకము"నకు సంబంధములేదు. సమగ్రేతివృత్త సహితములైననాటక ప్రకరణమ్ములలో ఐదు నుండి పది అంకములవరకు నుండ వలెనను నియమము కలదు. 'నాటిక'లో నాలుగంకములుండును. పాశ్చాత్యు లలో ఈ అంకవిభజన మారంభమునుండిలేదని తెలియును. "గ్రీకు విషాద రూపకములలో మొదట 'Prologue' తరువాత మూడు 'Episodes', అంత మున 'Exodus' అను విభాగము లుండెడివి. ఐదనెడి ఈ విభాగమే తరువాతి సెనెకా రూపకములందలి పంచభాగ విభజనమునకు (5 Episodes) మార్గదర్శ కమై ఉండును. సెనెకా రూపకములందలి ఈ విభజనమ్మే ఆంగ్లదేశమున పునరుజ్జీవన కాలమందలి రూపకములందు పాటింపబడినది. షేక్స్పియరు నాటకములందుగూడ ఈ విభజనము మొదట అంకము అను పేర వ్యవహృతము కాలేదు. వాటిని భాగములు (Parts) అని మాత్రమే అనెడివారు. తరువాత మొదటి ఫోలియో కాలమున అంకములనెడి విభజన ప్రచారములోనికి వచ్చెను. షేక్స్పియరు తరువాత నాలుగు అంకముల పరిమితి అనునది ప్రచారములోనికి

వచ్చెను. నేడు ఇంచుమించుగా అందరును మూడు అంకములతోనే రూపకములను రచించుచున్నారు. అంకముల సంఖ్య హెచ్చినను తగ్గినను "Dramatic Line" అనునదిమాత్రము అన్నింటను ఉండుటతప్పదు.[1] ఇంతేగాక పాశ్చాత్య నాటకములందు అంకములను రంగములుగ విభజించుట కలదు. అంకమున ఇన్నియేరంగము లుండవలెనను నియమము నైతములేదు. ఎన్ని అయిన నుండనగును. కాని సంస్కృతమున అంకము రంగములుగ విభజించు నాధారము లేదు. సంస్కృత నాటకమున అంకమున నొక దినమునకు సంబంధించిన విషయమును నిబంధింప వలెనను నియమము కలదు.[2] ఆవశ్యక కార్యములకు నిరోధము లేకుండ ఒక దినములో జరిగిన వృత్తమును మాత్రము కూర్పవలెను. ఇది యిట్లుండ 'అరిస్టాటిల్' సాధ్యమైనంతవరకు 'ట్రాజెడీ' సూర్యుని ఏకపరిభ్రమణము లోపల జరిగిన కథకు సంబంధించి యుండవలెనని నిర్వచించెను.[3] దీనిని గ్రహించి నవీనులు ఒక దినమున ఒకే ప్రదేశమున సంభవించిన వృత్తాంతమును రంగమున ప్రదర్శింప నగునని నిర్ణయించిరి.[4] కాని అంకమునందలి కాలపరిమితినిగూర్చి పాశ్చాత్యులు వివరింపలేదు.

5 . 8 . 1 శ్రీనివాసరావుగారు తమ నాటకములలో అంక సంఖ్యను పాటించినట్లులేదు. 'శ్రీరామజననము', పాదుకాపట్టాభిషేకమునను రెండు నాటకములు మూడంకములతో ముగింపబడినవి. 'సుభమంజరీ పరిణయము, శిరోమణి, గిరిజాకల్యాణము, బభ్రువాహన, సీతాకల్యాణము, కీచకవధ, కాళిదాసు

1. 68. అ. 19. పు. 605.

2. "ఏకాహచరితై కార్థమ్" 65. శ్లో 86.

3. "Tragedy endeavours as far as possible to confine its actionwithin the limits of a single revolution of the sun nearly so." 156. పు. 290.

4. "Let the stage be occupied to the end by a single completed action which takes place in one spot in one day". 162 పు. 241.

లంకాదహనము, మైసూరు రాజ్యాభివృద్ధి, కుశలవ' నాటకములు చతురంక పరిమితములు. 'సుల్తానా చాందుబీ' ప్రతాపాక్బరీయము'నను రెండును అరంకము లతో కూడినవి. తక్కిన వన్నియు పంచాంక పరిమితములు.

5.8.2 పాశ్చాత్య పద్ధతి ననుసరించి శ్రీనివాసరావుగారు తమనాటకము లందు అంకములను అవసరమునుబట్టి ఆరు ఏడు రంగములువరకు విభజించిరి. అంకములు మూడు నాలుగున్నను, రంగము లధికముగా నుండుటయు వీరి నాటకములందు గలదు. పాదుకాపట్టాభిషేకము మూడంకములతో ముగింప బడిన ముచ్చటైన నాటకము. కాని దీనిలో ప్రథమ, ద్వితీయాంకములారేసి రంగములతో, తృతీయాంకము పంచరంగములతో నొప్పారు చున్నది. ఒక అంకమొకే రంగముగా గల నాటకములుగూడ లేకపోలేదు. 'రుక్మాంగద'లో పంచమాంకమును, సత్యహరిశ్చంద్రీయ, ప్రహ్లాద నాటకములందుత్తర రంగ ములు పరిహరించినచో వాని యందలి పంచమాంకములును ఒకే రంగముగా నొప్పారుచున్నవి. ఈ యంకములు చాలవిస్తారముగా నుండుటయు సహజమే. అంకములు రంగములుగా విభజింపబడినపుడు సంస్కృత లాక్షణికులమతము ప్రకారము అంక మేకదివసవృత్త ప్రవర్తకమై యుండవలెననుటను పాటించుట కవకాశములేదు. అందుచేత శ్రీనివాసరావుగారి నాటకముల అంకములందీ లక్షణమునకై ప్రయత్నించుట ఉచితముకాదు.

5.8.3 అంకములను రంగములుగ విభజించుటచే రసవిచ్ఛిత్తి కలుగు నని సంస్కృత నాటక సంప్రదాయము ననుసరించిన విమర్శకుల యభి ప్రాయము. "అంకము-రంగము (సీను) అంకమున కాలదేశ వృత్తైక్యములు మూడును సుఘటిత తరములు. ఆ ఘటన రంగనామకాధునిక కల్పిత విభజన చేత శిథిలమగును. శిథిలమైన రసహాని కలుగును. కావున ఈ యవాంతర విభాగములు పనికిరావు. ఎన్ని సీనులో అన్ని అంకములనియే వ్యవహరింప రాదా"?[1] అని వేదము వేంకటరాయశాస్త్రి గారభిప్రాయపడియున్నారు. కాని రంగ విభజనముచే నాటకమున అనేక సన్నివేశములనుచూచి రసానంద మందుట కవకాశము గలదని శ్రీరాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి దృఢవిశ్వాసము.

---

1 12. పు. 54.

"రంగములుగా అంకములను విభజించుటచే కథలోనియనేక సన్నివేశములను మనము సాక్షాత్తుగా జూడ వీలుండును. ఇతరుల మాటలచే నూహింప వలసిన తొందఱ యుండదు. ఈ విభజనకు ముఖ్యసూత్రము కాలదేశముల సామీప్యము. ఒకనాటి కథయొక యంకములో నుండవలయునని ప్రాచీన లాక్షణికులనిరి. కాని రంగ విభాగమునకు చేయివేసిన తరువాత ఆ నియమము సాధ్యముగాదు. ఆవశ్యకమును గాదు. ఒక యంకమునకును మఱొకటికిని దేశకాలముల భేదమెంతయున్నను అంతగా నష్టములేదు. సభ్యులకు విరామముండును గనుక. కాని రంగములందలి కథా సన్నివేశములకు దేశకాలములెంత సమీపముగానున్న నంతమేలు. ఒక రంగములోని పాత్రములే తరువాతి రంగమునకు వచ్చినప్పుడు రెంటికినడుమ నెలలకొలది కాలముగాని, యామడల కొలది దూరముగాని కడచినట్లుచూపుట రంగరచనా దౌర్బల్యము."[1] కాని దౌర్బల్యస్ఫోరకమై, రసవిచ్ఛిత్తికి కారణమైన రంగవిభజన సన్నివేశములు శ్రీనివాసరావుగారి నాటకములలో లేవు. అయినను ఒకటి రెండు రంగముల మధ్య వ్యవధానమధికముగా నుండుట కననగును. 'మైసూరు రాజ్యాభివృద్ధి' ద్వితీయాంకము ద్వితీయరంగమున ద్వారకా పురమునందుండిన యదురాయకృష్ణరాయలు ఆ తరువాతి తృతీయరంగమున మైసూరు దేశమునందున్నట్లు కలదు. అంతదూరము కడచిపోయినట్లు రచించుటంత సహజముకాదు 'లంకాదహనము' తృతీయాంకము ప్రథమరంగమున హనుమంతుడు సముద్రమును లంఘించి ద్వితీయరంగమున లంకలో నున్నట్లుగలదు. ఆంజనేయుడు సముద్రము లంఘించుట అతిమానుషమగుటచే మనము దీనినిట్లు సరిపుచ్చుకొనవచ్చును. రంగ విభజనముచే ఇవితప్ప నెచటను శ్రీనివాసరావుగారు అసహజములను జూపియుండలేదు. ఇట్లు శ్రీనివాసరావుగారు రంగ విభజనము గావించి నాటకేతివృత్తమును సామాజికులకు సుబోధమొనర్చించిరనుట సముచితము.

1. 8. పు. 51, 52.

## 5.9 అర్థోపక్షేపకములు - నిషిద్ధములు :

నీరసములు, అసందర్భములు, అసంభవములు నైనవానిని రంగమున ప్రదర్శింప కూడదనుట భారతీయ మతము. యుద్ధము, రాజ్యభ్రంశము, మరణము, సేనల ముట్టడి మొదలగు వానిని ప్రత్యక్షముగా ప్రదర్శింపరాదు ఇవి ప్రయోగ సాధ్యములు కావు. కనుక ప్రవేశకములచే సూచింపవలెను. శయన, చుంబన, ఆలింగన, అవలేపన, గుహ్యకార్య, దంతచ్ఛేద్య, నీవీస్రంసన, స్తనాంతర విమర్దన, భోజన, సలిలక్రీడాదులను కూడ రంగమున ప్రత్యక్షముగా చూపరాదు. ఇవి అనుచితములే గాక జుగుప్సావహములును. కనుక వీనిని విసర్జింపవలెను. అంకమున అభ్యుదయము పొందదగిన నాయకుని వధను ప్రదర్శింపరాదు; వర్ణింప రాదనుట సంస్కృత లాక్షణిక మతము. కాని పాశ్చాత్యుల నాటకములందు భారతీయులచే నిషిద్ధములనబడిన ఆలింగన చుంబన, మరణాదులను స్వేచ్ఛగా ప్రయోగించిరి. అయినను కొన్నింటిని పరిహరింపవలెనను నిషిద్ధము పాశ్చాత్యులలోను గలదు "క్రౌర్యస్ఫూర్తిచే జుగుప్సను కలిగించునట్టియు, అసంభావ్యత వలన విశ్వాసయోగ్యములు కానట్టియు సంఘటనలను నాటకమునందు పూర్తిగా తొలగింపవలెను; లేదా కథన రూపమున చెప్పింపవలె"[1] నని Dryden చెప్పిన విషయములను శ్రీ పింగళి లక్ష్మీకాంతము గారు వివరించిరి.[2] ఇది భారతీయ మతానుసారమున్నను దీని ననుసరించిన పాశ్చాత్యులు లేరనియే చెప్పవలెను.

5 9.1 భారతీయ నాటకేతివృత్తము సూచ్యము దృశ్యమునని రెండు

---

1. "Those actions which by reason of their cruelty will cause aversion in us or by reason of tneir impossibility in belief,ought either to be wholly avoided by the poet or only delivered by narration." Dryden :- "Dramatic Poesy".

2. 64. పు. 269, 270.

విధములు. నాయకుని జీవితమందలి రసవద్ఘట్టములను మాత్రము పైని వివరించినట్లు ప్రదర్శింపవలెను. నీరసములైన వానిని పరిత్యజింపవలెను. కాని నీరసములై కథకావశ్యకములైన వానిని సూచింపవలెను. ఈ సూచన "విష్కంభము, ప్రవేశకము, చూళిక, అంకావతారము, అంకముఖము" నని యైదు విధములు. వీనిని 'అర్థోపక్షేపకములు' అందురు. విష్కంభమును మధ్యమ పురుషులైన పురోహితామాత్య కంచుకులు ప్రయోగింపవలెను. ఇది శుద్ధ, సంకీర్ణ (మిశ్ర) భేదముచే రెండు విధములు; కేవలము మధ్యమ పాత్రలచే ప్రయుక్త మగునది 'శుద్ధ విష్కంభము'; నీచ మధ్యమ పాత్రలచే ప్రయోగింపబడునది సంకీర్ణ విష్కంభము. ప్రయోజనము ననుసరించి ప్రస్తావన, అంక ప్రారంభముల మధ్య కాని, రెండంకముల మధ్యకాని, ముఖాదిసంధులను, అర్థములను సంక్షేపముగా సూచించుటకు విష్కంభమును ప్రయోగింపవలెను. అంకము ముగించిన వెనుక ఒక మాసము లేదా ఒక వత్సరము లోపల జరిగిన కార్యము నంతటిని ప్రవేశకమున సూచింపవలెను. సంవత్సరమును మించిన కార్యము నెప్పుడును ప్రవేశకమున కూర్పరాదు. ప్రవేశకము నీచ పాత్రలచే ప్రయోగింపబడును. కనుక రెండంకముల నడుమనేగాని, ప్రథమాంకరంభమున కూర్పరాదు. ఈ ప్రవేశకము కాలోదయ సూచకమును, పంచాంగానుష్ఠాన సూచకమును, కార్య విశేషద్యోతకమును, గూఢార్థ వ్యాఖ్యాయకమును, భావ్యంకేతివృత్త సూచకమును కావలయును. యవనికలోపలనున్న సూతాదులచే అనేక విధములుగా అర్థము సూచింపబడుటను 'చూళిక' అందురు. ప్రయోజనము ననుసరించి బీజార్థయుక్తి యుక్తముగా అంకాంతమందలి కథయే తరువాతి అంకమునందు అనుస్యూతముగా కొనసాగుట 'అంకావతారము'. తరువాతి అంక ప్రారంభమందలి కథ పూర్వాంకాంతము నందే స్త్రీచే కాని, పురుషునిచే కాని సూచింపబడు అంకముఖము. దీనిని అంకాస్యమనియు నందురు. ఈ ఐదు పద్ధతులచేత సూచ్యార్థమును సూచింపవలెను ఇట్టి విభజనము పాశ్చాత్యులలో లేదు. కాని వారు నాటకముల నంకములుగ, నంకములను రంగములుగ విభజించి వానిలో మన అర్థోపక్షేపకముల ప్రయోజనమును సాధించిరి. అయినను అర్థోపక్షేపకములలో కేవలము సూచ్యమే యుండును. వారి రంగములందు ఇతివృత్త సంబంధి దృశ్యము గూడ నుండును.

5.9.2 శ్రీనివాసరావుగారు సంస్కృత లక్షణము ననుసరించి నిషిద్ధములైన వానిని పరిహరించి, అపరిహార్యములైన వానిని సూచించిరి. అయినను తత్సూచనార్థమర్థోపక్షేపకములను శ్రీనివాసరావుగారు ప్రవేశపెట్టలేదు. ఆంగ్ల నాటక పద్ధతిననుసరించి వీరు గావించిన రంగవిభజనము మూలముననే అర్థోపక్షేపకములలోని ప్రవేశక విష్కంభముల ప్రయోజనము సాధించిరి. అంకములలోని రంగములు కొన్ని ప్రవేశక విష్కంభములట్లు ఒప్పారుచున్నవి. గ్రామ్యములైన భోజన, స్నాన, విలేప, నాలింగన, చుంబనాదులను శ్రీనివాసరావుగారు పరిత్యజించి ఔచిత్యము సాధించిరి. వీరి నాటకములలో వీనికెటచను చోటులేదు. తప్పనిసరియైనప్పుడు మాత్రమే యుద్ధము, వధ, మరణము చూపెట్టిరి. తక్కినవి ఆ యా రంగములలో కొన్ని చిన్న పాత్రల సంభాషణలచే సూచించుట జరిగినది.

5.9.3 యుద్ధము, వధ, మరణము గల నాటకములలో 'సుల్తానా చాందుబీ, ప్రతాపాక్బరీయము, రామరాజు చరిత్రము, చంద్రగిర్యభ్యుదయము, శిరోమణి, బభ్రువాహన' అనునవి ముఖ్యములు. 'రామరాజు చరిత్రము' అం. 4 రం. 3 లో బహ్మనీ సుల్తానులపై రామరాజాదులు యుద్ధమున కాయత్తమై వెడలినట్లుగలదు. అం. 5 రం. 1 లో యుద్ధరంగమున పటాణి రామరాజు శిరః ఖండనము గావించినట్లు తురకసేనలు నగరమున ప్రవేశించి తిరమలాంబను పటయత్నించినపుడు తెలియును. అం. 5. రం. 3. లో కాళరాత్రి, లక్ష్మి, సరస్వతుల సంభాషణవలన విజయనగర వైభవము సర్వము సమున్మూలనము గావింపబడినట్లు స్పష్టము. ఈ రంగము విష్కంభమువలె నొప్పారుచున్నది. ఇందు యుద్ధము, వధ, మరణము, సూచితము. ఇంక ఈ నాటకమున అం. 1 రం. 1 లో లక్ష్మి సరస్వతుల సంభాషణము వలనను, అం. 2 రం. 1 లో లక్ష్మి సరస్వతుల సంభాషణచేతను, అం. 3 రం. 1 లో కాళరాత్రి స్వగతము వలనను నాటక కథాక్రమ పరిణామమును వీరు స్పష్టము గావించిరి. ఈ రంగములు విష్కంభములట్లుపకరించి విషయ వివరణము గావించుట కావశ్యములైనవి.

చంద్రగిర్యభ్యుదయము అం.2,రం.2 లో వృద్ధ వెంకటరాజు భార్యరాణి బాయమ్మ, ఛాయమ్మ యను బ్రాహ్మణి సంతానమును తన సంతానమని పెంచి

కాని నట్టి రహస్యమును కరణము మహాదేవప్ప, రెడ్డి లింగన గౌడుల సంభాషణలో తెలియును. ఇదొక విష్కంభము వలెనున్నది. అట్లే యాచమనాయకునకు జగ్గరాయాదులతో కల్గిన యుద్ధము పై రెడ్డి కరణముల సంభాషణ అం. 5 రం 1 లో సూచింపబడినది. ఈ రంగమును విష్కంభమువలెనే గలదు.

'సుల్తానా చాందుబీ'లో అం. 5. రం. 1. లో డాండియాగోకు కారాగారశిక్షవిధింపబడినపుడు ఖండోజి, ధోండోజి యను వారల సంభాషణ ప్రవేశకము వలెను, అం. 6 రం. 1 లో శేషప్పశెట్టి, రంగయ్యశెట్టి యను వారల సంభాషణలో యుద్ధము కలుగబోవుచున్నను విషయము తెలుపుటలో విష్కంభమట్లు గోచరించును.

'పాదుకాపట్టాభిషేకము'న దశరథుని మరణము రంగమున చూపవలసిన దానిని వసిష్ఠ సుమంత్రుల సంభాషణ అం. 2 రం. లో 3 సూచించిరి.

'శిరోమణి' భారత యుద్ధ పంచకము నందలి కథ. దానిలోని భీష్ముని మరణమును ద్రోణుని స్వగతము అం. 1 రం, 6 లో స్పష్టము. లక్ష్మణ, రామవర్మల సంభాషణ అం. 1 రం. 7 లో అభిమన్యువధయు, అం. 2 రం. 5 లో ద్రోణవధయు; అం. 3 రం. 5 లో కర్ణ శల్య శకునుల వధయు సూచితములు. ఈ రంగము లన్నియు ప్రవేశకము లట్లు గలవు

'ప్రతాపాక్బరీయము' అం. 1 రం. 3 లో హిందూమహమ్మదీయ సేనల యుద్ధము, అం. 1 రం. 5లో కమల వధింపబడుట, అం. 2 రం. 4లో రాజస్త్రీలు చితిలో దూకుట, అం. 5 రం. 1లో యుద్ధము, అం. 6 రం. 4లో ప్రతాపుని సైన్యము కోటలగ్గలకెక్కి జయించుట, 'సునందనీ పరిణయము'న ఉగ్రసేనుని మరణము 'శిరోమణి'లో దుర్యోధనుని ఊరుభంగము, సైంధవ దుశ్శాసన, ధృష్టద్యుమ్నాదులవధ, 'సుల్తానా చాందుబీలో' డాండియాగో మరణము, చాందుబీ, హమీద్, అస్మన్‌ల వధ, 'బభ్రువాహన'లో యుద్ధముతో పాటు సుధన్వునివధ, అర్జున శిరఃఖండనము, 'కుశలవ'లో యుద్ధము, 'మైసూరు

రాజ్యాభివృద్ధి'లో మారనాయకునివధ, శ్రీనివాసరావుగారు 'స్వేచ్ఛగా రంగములలో జరిగినట్లు చూపెట్టిరి ఇది వీరు పాశ్చాత్యపద్ధతి ననుసరించి ప్రయోగించిరనుటలో సందేహము లేదు. అయినను నాటకము మరణాంతము గావించి, విషాదాంతము గావించుటవారి మతముకాదని తలంపవలెను. అందు కుదాహరణ వీరి 'రామరాజు చరిత్రమే'. వీరు దీనిని సుఖాంతముగావింప నటులు విషాదాంతముగా మార్చిరి.

'సీమంతిని'లో సీమంతిని చంద్రాంగదుల వివాహసమయమున బ్రాహ్మణులు గావించిన భోజనాదికములు అం. 2 రం. 5లో బ్రాహ్మణుల సంభాషణ వలన స్పష్టమగును. భోజనాదులిచట సూచితము. ఇది విష్కంభమట్లు గలదు ఇంక ఆలింగనచుంబనాదులకు రంగమున చోటీక భారతీయ సంప్రదాయమును శ్రీనివాసరావుగారు పరిరక్షించి ఔచిత్యమును గాపాడిరి. ఇట్లితర నాటకములలోను ననేకోదహరణములు చూపవీలగును.

కనుక బాలవరకుయుద్ధము, వధ, మరణములను పరిహరించియు, తప్పనిసరియై, అపరిహార్యములైనప్పుడు మాత్రము వానిని చూపియు, భోజనాదులను సూచించియు, ఆలింగనచుంబనాదుల పరిత్యజించియు శ్రీనివాసరావుగారు బహుజాగరూకులై వర్తించిరి పాశ్చాత్యపద్ధతి ననుసరించి రంగ విభజనము గావించి, అర్థోపక్షేపకముల ప్రయోజనము నాయారంగముల మూలముననే వీరు సాధించి తమ స్వతంత్రవిధానమును నిలబెట్టుకొనిరి.

## 5.10 స్వగతము (Soliloquy) :

సంస్కృత నాటకములలో సర్వశ్రావ్యము, స్వగతము, జనాంతికము, అపవారితము నను వానిని ప్రయోగించుట సహజ విషయము. కాని పాశ్చాత్య నాటకములలో అపవారిత మెదనెద గోచరించినను సర్వశ్రావ్యస్వగతములు మాత్రమే ప్రయుక్తములు. శ్రీనివాసరావుగారి నాటకములలో నీ రెండు మాత్రమే సర్వథా ప్రయుక్తములు. ఆంగ్లనాటకములలో స్వగతమున కధిక

ప్రయోజనము గలదు. అట్లే శ్రీనివాసరావుగారుకూడ అవసరమని తలంచి నప్పుడు స్వగతములను విరివిగా ప్రయోగించిరి. 'సునందనీ పరిణయము' ప్రథమ నాటకమగుటచే కాబోలు నిట్టి స్వగతములు రంగములు రంగములే పూర్తిగా ఆక్రమించినవి. ఉగ్రసేనుని స్వగతము అం 1 రం 1 అం 1 రం 3 లలోను, సుమతి స్వగతము అం 1.రం.3, అం 5 రం 4 లలోను, సునందని స్వగతము అం.4.రం 3 లోను పూర్తిగా రంగములను ఆక్రమించునివి. ఇవి కొంత వరకు విసుగనిపించినను నాటక కథా పరిణామమున కుపకరించుచున్న వనుటలో సందేహములేదు.

కాని ఇతర నాటకములలో ఈ స్వగతములను వీరు తగ్గించియున్నారు. అయినను "రామరాజు చరిత్రము"న పటాణి, సలకము త్రిమ్మయ్య, రామరాజు, ఆషాబీలకు స్వగతము ప్రవేశపెట్టిరి. పటాణి స్వగతములు చాలావిలువైనవి. షేక్స్పియరు నాటకములలోని స్వగతములతో సమానముగా తులతూగ గలవి. ప్రప్రథమమున తందాన పాటలలో హిందూరాజ్య వైభవము విన్నప్పుడు, అం.2 రం 3, ఆషాబీని యుద్యానవనమున కలిసికొన్నప్పుడు అం. 2 రం.5, రామరాజే తన తండ్రియని తల్లివలన తెలిసికొన్న సమయమున అం.3 రం 3, యుద్ధమున కాయత్తమగు సమయమున అం.4 రం.2, అంతకంటె యుద్ధరంగమున రామరాజు శిరఃఖండనము గావించిన వెనుక అం.5 రం.5న కల పటాణి స్వగతములు ఒకటికంటెనొకటి ఉత్తమోత్తములు. వస్తు వికాసముతోపాటు పాత్ర శీల స్వభావములిందు సువ్యక్తములైనవి. భావ సంఘర్షమునకులోనై పల్కిన పటాణిపల్కులు అతి విస్తరమైనను సహృదయ సామాజికుల రంజింపజేయ గల్గినవి. ఇది నాటక శిల్పియైన నాటక కర్తకుమాత్రమే సాధ్యమగును. ఇట్లే 'బభ్రువాహన'లో అం 4 రం 4న అర్జునుని స్వగతము, అం.4 రం. 6లో బభ్రువాహన స్వగతమునుచాల ప్రధానమైనవి. ఇందు అర్జున బభ్రువాహనుల శీల స్వభావములు, భావ సంఘర్షము స్పష్టములైనవి.

'సత్యహరిశ్చంద్రీయము'న హరిశ్చంద్రుని స్వగతము అం 4 రం. 1, 'పాదుకాపట్టాభిషేకము'లో దశరథునిస్వగతము అం.2 రం.2 చాల విలువైనవే. ఇట్లితర నాటకములలోను సందర్భానుసారముగా వీరు స్వగతములను వాడిరి. స్వగతముల నెక్కువగూర్చుట [illegible]తముకాదను విమర్శన మొకటి గలదు.

తన్మూలమున నాటకశిల్పము విహతమగునని వారి అభిప్రాయము. కాని అట్టి దానికి గురి కాకుండునట్లు శ్రీనివాసరావుగారు తమ నాటకములలో స్వగతము లను ప్రవేశపెట్టి కథాక్రమ వికాసమునకు దోహదము గావించులాగొనరించి నాటకమును పరిరక్షించిరి.

## 5 . 11 ఐక్యత్రయము (The Three Unities) :

పైని పేర్కొనబడిన అంశములకంటె పాశ్చాత్య నాటకమువలో ఐక్యత్ర యము (The Three Unities) నకు ప్రాధాన్యము కలదు. కాలదేశ వస్త్వై క్యములను ఐక్యత్రయ మందురు. వీనినిగూర్చి హడ్సన్, [1] అరిస్టాటిల్ పండి తులు వివరించియున్నారు. నాటక కథ ఏక దివసవృత్తమై యుండవలెనని అరిస్టాటిల్ మతము [2] అంకము నందలి కథ ఒక దినమునకు సంబంధించి యుండవలెననియు, అంకమునకు నంకమునకు నడుమ కొన్ని సంవత్సరముల వ్యవధాన ముండనగుననియు సంస్కృతలాక్షణికుల మతము [3]. దేశైక్యమును గూర్చి పాశ్చాత్యులుగాని, ప్రాచ్యులుగాని ఎట్టి అభిప్రాయమును చెప్పలేదు. వస్త్వైక్యము నాటకమున అపరిహార్యమైన లక్షణము. తప్పక నాటక కర్త అనుసరింపదగినది. ప్రాచ్యపాశ్చాత్యులలో ఈ విషయమున భిన్నాభిప్రాయ ములు లేవు. కాని పాశ్చాత్యులుగాని, భారతీయులుగానికాల దేశైక్య సంపా దనార్థము ప్రయత్నించినవారి కంటె వాని నతిక్రమించినవారి సంఖ్యయే అధిక మనవచ్చును.

5.11.1 శ్రీనివాసరావుగారు కాలదేశైక్యముల కంతగా ప్రాధాన్య మిచ్చినట్లులేదు. "To preserve unity of action is very important. Let not the dramatist pay much attention to the unities of

1. 162. పు. 241. 2. 156. పు. 290.

3. (i) 162. పు. 228-230, (ii) 85. శ్లో 86.

**time and place for they hamper the conduct of action''.**[1] అని వీరు కార్యైక్యమునకే యధిక ప్రాధాన్య మొసగియున్నారు. ఏకదివస వృత్తముగా నాటకమునుగూర్చుట కష్టసాధ్యము. కాని పక్షము, ఇరువది దినములలోను, ఒకటి రెండు నెలలలోను ముగిసినవి. శ్రీనివాసరావుగారి నాటకములలో నాలుగైదు కలవు. 'పాదుకాపట్టాభిషేకము' పక్షము దినములలోను, 'శిరోమణి' ఇరువది దినములలోను, 'సుఖమంజరీ పరిణయము' ఒక నెల లోపలను, 'సత్యహరిశ్చంద్రీయము', 'లంకాదహనము', 'మానాపమానము'అను నాటకములు రెండు మూడు నెలల లోపలను జరిగినట్లు స్పష్టమగును. కాని తదితరములు వత్సరము మొదలు 20, 30 సంవత్సరముల వరకు కొనసాగినవి. చాలవరకు ఒకటి రెండు అంకములలో అధిక వ్యవధానము అనగా ఒకటి రెండు వత్సరములు మొదలు పదునైదు సంవత్సరముల వరకునుండి ఆ తరువాతి యంకములలోని కథ మహావేగముగా ఎక్కువ నాటకములలో గడచినట్లుగూడ విశదమగును. అత్యధిక కాలము అనగా దాదాపు ముప్పది వత్సరములు అంతకంటె నెక్కువ కాలము కొనసాగిన నాటకములు రెండు. అవి 'ప్రతాపాక్బరీయము, సుల్తానా చాందుబీ' అనునవి.

5.11.2 అంకమునకు నంకమునకును నడుమ వ్యవధాన ముండుట ప్రాచ్య పాశ్చాత్య నాటకముల రెంటను సమానమే. శ్రీనివాసరావుగారి నాటకముల లోని అంకముల మధ్య వ్యవధానము దినములు, నెలలేగాక వత్సరములు కూడ గడచినట్లు గలదు. 'సునందనీ పరిణయము' తృతీయ చతుర్థాంకముల నడుమ ఆరు నెలలు వ్యవధానము గలదు. ఆరు నెలల మీద ఆరు దినములకు జయపాలుని వెదకి తెత్తునని సునందనికి సుదేవుడిచ్చిన వాగ్దానము గడవు తీరిపోయినది. 'సీమంతిని'లో నాలుగైదు అంకముల మధ్య కొన్ని నెలల వ్యవధియు ప్రథమాంకమున సీమంతిని జన్మించి ద్వితీయాంకమున పదునాలుగు పదునైదు వత్సరముల యువతిగా గన్పట్టుటయుగలదు. 'మైసూరు రాజ్యాభివృద్ధి'లో ప్రథమాంకము చతుర్థరంగమున రాజదండనకు గురియై వధింపబడిన లక్ష్మణ పీరులే ద్వితీయాంకమున వసుదేవున కుద్భవించి యువకులుగా ప్రత్యక్షమగుదురు. అనగా దాదాపు పదునాలుగు పదునైదు వత్సరములు వయసుగల

---

1. 157, Rules - పు. 1

వారుగా నుందురు. 'శిలాదిత్య నాటకము'న మొదటి యంకము మూడవ రంగమున సుభగ పూర్ణ గర్భిణిగా నుండును. ద్వితీయాంకమున బడిలో చదువుచున్న బాలుడుగా ఆదిత్యుడు కనిపించును. అనగా పది, పండ్రెండు వత్సరముల వయస్సు గలవాడుగా నైన నుండవలెను. 'కుశలవ'లో కుశలవులు జన్మించి రాముని సవనాశ్వముబట్టి గల్గిన వయస్సుగల బాలురుగా నుందురు. అనగా ద్వితీయ తృతీయాంకముల నడుమ పండ్రెండు, పదుమూడు సంవత్సరముల వ్యవధి యుండును ఇంక అంకమునకు అంకమునకు నడుమ దినముల వ్యవధానము రావుగారి నాటకములలో ఎచటనైనను ఉదాహరణముగా గోచరించును.

5.11.3 ఇట్లే రంగమునకు నడుమ దినములు నెలలేగాక వత్సరములు గడచినట్లు గూడ రావుగారి నాటకములలో మనము కననగును. 'రామరాజు చరిత్రము'న రెండు మూడు రంగముల మధ్య వత్సరములు గాకపోయినను కొన్ని నెలల వ్యవధానముండును. సలకము తిమ్మయ్య అచ్యుతరాయల అనంతరమతని పుత్రుని రాజు గావించి ఆ రాజ్యము తానాక్రమింప బాలుని విష ప్రయోగముచే చంపించును. ద్వితీయాంకము తృతీయ చతుర్థ రంగముల నడుమ కొన్ని వత్సరములు కాకపోయినను కొన్ని నెలలు గడచియుండును. తృతీయ రంగమున ఉద్యోగార్థము విజయనగరమునకు వచ్చిన పటాణి రామరాజు కొలువున సేనానిగా చతుర్థ రంగమున గన్పట్టును. 'శిలాదిత్య'లో ప్రథమాంకము ద్వితీయ రంగమున సూర్యానుగ్రహ పాత్రయైన సుభగ తృతీయ రంగమున పూర్ణ గర్భిణిగా నుండును. అనగా, తొమ్మిది నెలల వ్యవధానముండును. 'సుల్తానా చాందుబీ'లో పంచమాంకము చతుర్థ రంగమున అమహన్నగరు నుండి ప్రయాణమై తప్పించుకొనిపోయి, పంచమ రంగమున ఢిల్లీలో డాండి యూగో అస్మన్‌బేగులున్నట్లు గలదు. అనగా వారు ఢిల్లీచేరుటకు వత్సరములు కాకపోయినను కొన్ని నెలలయినను పట్టి యుండును. 'కుశలవ'లో ప్రథమాంకము ద్వితీయ రంగమున సీతతో రాముడయోధ్యకు వచ్చి, పట్టాభిషిక్తుడగును. చతుర్థ రంగమున సీతారాముల వనవిహారమున సీత గర్భిణి యని తెలియును. అనగా అప్పటికి కొన్ని నెలలవ్యవధి యుండును. 'ద్రౌపదీ వస్త్రాపహరణము'న తృతీయాంకము ద్వితీయ రంగమున అర్జునుడింద్రప్రస్థపుర

మును వదలిన దగ్గర నుండి చతుర్థ రంగమునకు పది నెలలు గడచినట్లు తెలియును. ఇంక 'ప్రహ్లాద' లో ద్వితీయాంకము ద్వితీయ తృతీయ రంగముల మధ్య మూడు నాలుగు వత్సరములు, తృతీయాంకము ప్రథమ ద్వితీయ రంగముల నడుమ ఒకటి రెండు వత్సరములును, 'గిరిజాకల్యాణము'న చతుర్థాంకము ద్వితీయ తృతీయ రంగముల మధ్య కొన్ని వత్సరములును గడచినట్లును అంతలోపల ప్రహ్లాదుడు, పార్వతి జన్మించి పెద్దవారయినట్లు స్పష్టముగా తెలియును. 'రామరాజు చరిత్రము'న ద్వితీయాంకము ద్వితీయ తృతీయ రంగముల నడుమ పదునైదు పదునారు వత్సరముల వ్యవధి యున్నట్లు స్పష్టమగును. ద్వితీయ రంగమున రామరాయలు సదాశివరాయలును విజయనగరమున కభిషిక్తుని గావించి తానే రాజ్యపాలనము గావించుచు, బహ్మనీ సుల్తానుల జయించి తన హస్తగతము గావించుకొని అరివీర భయంకరుడై విజయనగరమునకు తొల్లింటి వైభమును, ప్రసిద్ధిని పునః కల్పించి తన యశఃకాంతుల దిగ్దిగంతముల వరకు వ్యాపింప జేసిన సమయముననే, మహాబూబుబీతోగల సంబంధముచే పుట్టిన పుత్రుడు పటాణి తృతీయ రంగమున ఉద్యోగార్థము విజయనగరమునకు వచ్చియున్నట్లున్నది. అందుచే పటాణి అప్పుడు షోడశ వర్షప్రాయుడనుటకే మాత్రము సందియము లేదు. 'సీమంతినీ నాటకము'న ప్రథమాంకము ద్వితీయ తృతీయ రంగముల నడుమగల వ్యవధి పదుమూడు వత్సరములు. ఈశ్వరభట్టు పార్వతిని గూర్చి త్రయోదశాబ్దములు తపమాచరించెన. 'ప్రతాపాక్బరీయ నాటకము' కొన్ని యేండ్ల పర్యంతము కొనసాగినట్లు గలదు. అందలి తృతీయాంకము ప్రథమ ద్వితీయ రంగముల నడుమ కొన్ని వత్సరములు చతుర్థాంకము ద్వితీయ తృతీయ రంగముల మధ్య కొన్ని యేండ్లును, పంచమాంకము ద్వితీయ తృతీయరంగముల మధ్య కొన్ని సంవత్సరములు గడచినట్లు స్పష్టముగా మనము కన నగును.

5.11.4 ఇది యిట్లుండ ఒకే రంగమున, రెండు మూడు దినములు గడచినట్లును గలవు. 'సీమంతిని'లో ప్రథమాంకము పంచమ రంగమున ఈశ్వరభట్టు తపోభంగముగావింప రంభోర్వశులు ప్రవేశించి, పగలు గడపి, రాత్రి ముగించి, ఉదయమున అతని చర్యలు గనిపెట్ట రహస్యముగ దాగియుండ పరమేశ్వరి ప్రత్యక్షమై అతనికి వరములొసగి అదృశ్య కాగా, వీరు వెడలిపోవుదురు. ఇట్లు అంకమునకు అంకమునకు, రంగమునకు రంగమునకు

నడుమ వ్యవధానముండగా శ్రీనివాసరావుగారి కాలైక్యమునకై యత్నించి రను టకు వీలులేదు. తక్కువ వ్యవధిలో జరిగిన ఇతివృత్తములు గల వానిలోను సుఖమంజరి తప్ప తక్కినవి మూలముననే అట్టి వ్యవధిలో కొనసాగినవి. ఇట్లుం డుటచే అరిస్టాటిల్ చెప్పిన నాటక కథ ఒక దినమున జరిగినదై యుండవలెనను నియమమును గాని, రంగ విభజనముచే అంక మొక దినమున జరిగినదై యుండ వలెనను సంస్కృతనాటక లక్షణమును గాని శ్రీనివాసరావు గారనుసరించి యుండలేదు; అది సాధ్యమునుగాదు

5.11.5 దేశకాలైక్యములు అవినాభావ సంబంధముగలవి. అనగా కాలము మీద దేశ మాధారపడి యుండును. ఒక దినము కాలమున్నప్పుడు రంగమునకు రంగమునకు మధ్య ఆ దినములోపల ప్రయాణము చేయగల దూరము మాత్రముండవలయును. లేనిచో అసంభావ్యముగ నుండును. అంక మునకు అంకమునకు నడుమ ఎంత దూరమైనను ఉండనగును. శ్రీనివాసరావు గారు. కాలైక్యమును గూర్చుటకై యత్నింపలేదన దేశైక్య విషయమున గూడ దృష్టి యుంచి యుండరనియే తలంపవలెను. సంస్కృత నాటకములలో భూలో కమునుండి దేవలోకమునకు రంగము మారుట గలదు. పాశ్చాత్య నాటకముల లోను రంగము ఒక పట్టణమునుండి మరొక పట్టణమునకే గాక ఖండాంతరము లకు మారినట్లును తెలియును. శ్రీనివాసరావుగారి నాటకములలోను రంగము లిట్లు భూలోకమునుండి దేవలోకమునకు, నగరమునుండి మరొక నగరమునకు దేశమునుండి మరొక దేశమునకు మారినట్లు గలవు. 'మదాలసా నాటకము'న భూలోకము నుండి పాతాళమునకును, పాతాళమునుండి భూమికిని, 'సీమం తిని'లో భూమినుండి రసాతలమునకు, 'సత్యహరిశ్చంద్రీయము'న ఇంద్రసభ నుండి భూలోకమునకు, 'రుక్మాంగద'లో భూమినుండి వినువీధికి; వినువీధి నుండి సత్యలోకమునకు; 'ప్రహ్లాద'లో అరణ్యమునుండి అమరావతికి; 'గిరిజా కల్యాణము'న అరణ్యమునుండి ఇంద్రలోకమునకు; 'కీచకవధ'లో భూమినుండి అమరావతికి రంగములు మారినట్లు గలవు. ఇట్టి వీనిలో అతి మానుష శక్తుల ప్రసక్తి గల పట్టుల మనము సరిపుచ్చుకొనుట కవకాశము గలదు. కాని అట్టి వాని కవకాశము లేనిచోట అంత సమంజసముగా తోపవు. 'సీమంతిని'లో నిషధ నుండి కుండినపురికి, కుండినపురినుండి నిషధకు; 'మైసూరు రాజ్యాభి వృద్ధి'లో ద్వారకనుండి మైసూరుకు; 'సుఖమంజరీ పరిణయము'లో ఉదయ

మాళవ, జయపురములకును, 'శిలాదిత్య'లో పార్థియన్ ఆస్థానమునుండి బలభి పురమునకు; 'సుల్తానా చాందుబీ'లో బీజాపురమునుండి ఢిల్లీకి; 'చంద్రగిర్యభ్యుదయము'న హంపీ విజయనగర ప్రాంతమునుండి చంద్రగిరికి అంకమునకు నంకమునకు నడుమగాక రంగమునుండి రంగమునకు రంగములు మారినట్లు గలదు. 'సుఖమంజరీ పరిణయము'న రంగములు కళింగ రాజ్యము అరణ్యములకు మారినట్లు గలవు. 'ప్రతాపాక్బరీయము'న చిత్తూరునుండి ఢిల్లీ వరకు గల ప్రదేశము లన్నియు రంగములైనవి.

5.11.6 పరిమిత పరిధిలో ప్రవర్తిత నాటకములు రెండు 'శిరోమణి' "మానాపమానములు". వీనిలో దేశమున విపరీత దూరము లేదు. కొంతవరకు దేశైక్యముగల నాటకములు 'రామరాజు చరిత్రము', 'పాదుకాపట్టాభిషేకము', "కీచకవధ' అనునవి. 'పాదుకాపట్టాభిషేక నాటకము'న ఒకటి రెండురంగముల కథ యంతము అయోధ్యలోనే నడచినది. మూడవ యంకము నంచలి కథ మహావేగముతో అరణ్యమున నడచిపోయినది. "కీచకవధ"లో ప్రథమాంకము వదలిన తక్కినకథ యంతయు విరాట నగరముననే జరిగినది. అర్జునుడు పాశుపతము సంపాదించి అమరావతికరిగి శాపరూపరముపొందు కథను వదలించినచో నిందు దేశకాలైక్యములు రెండును సమకూరును. కాని పై విషయము నాటకమున కవసరమనిముందే స్పష్టమైనది. 'రామరాజు చరిత్రము' నందలికథ యంతము విజయనగరముననే నడచినది. కాని తృతీయాంకము నందలికథ మాత్రము బీజపురమున కొనసాగినది ఇది లేనిచో "రామరాజు చరిత్రము"న దేశైక్యమునకు లోపముండియుండదు. ఈ పైని పేర్కొన బడిన ఐదు నాటకములలోను దేశకాలైక్యములకై కొంతవరకు యత్నించినట్లు తెలియును.

5.11.7 కాలదేశైక్యములకంటె వస్త్వైక్యము చాల ప్రధానమైనది. దీనినే కర్తైక్యమనియు నందురు. నాటకశిల్పగరిమ కిది తప్పనిసరిగ అనుసరింపదగిన అంశము. తద్విరహితమైన నాటకము శిల్పవైభవమున కొరత పడియుండును. పూసలలోని దారమట్లు నాటక కర్తైక్యముండిననే అది సహృదయ సామాజిక హృదయముల నాకర్షించి ప్రసిద్ధిగాంచును. పాశ్చాత్యులలో భేదమోదముల పరిమేళనము చేయుటలోకొంత నియమము పాటింప కొందఱు

తలంచిరి. కాని అది అనుసరణీయమైనదిగాదు. నాటక కథ సరళమైయుండ వలెనని అరిస్టాటిల్ చెప్పినదానికి ఆధికారికమునకు ప్రాసంగికముల బెడద ఉండకూడదని కొందరభిప్రాయపడిరి. కాని అదియు నుచితము కాదు. ప్రాసంగిక రహితమైనంత మాత్రమున వస్త్వైక్యము సంపాదింప వీలగుననుట సమంజసముకాదు. నాటక కర్త సంవిధాన చాతుర్యము పై నిది యాధారపడి యుండును. సంస్కృత నాటకములందు విషాదాంతములు లేకపోయినను ఖేదమోదముల సమ్మేళనము గలదు. ప్రకరీ పతాకల ప్రయోగమును వానిలో గలదు. అయిన నివి నాటకమున ఆధికారికేతి వృత్తమున కుపకరించుటయే ప్రధాన విషయము. పైని పేర్కొన్నట్లు శ్రీనివాసరావుగారు తమ నాటకములలో వస్త్వైక్యమునకై మిక్కిలి యత్నించినట్లు స్పష్టమగును. ఖేదమోద పరిమేళనము వీరి నాటకములలో కననగును. ఉపకథలు ప్రధాన కథ కుపకరించునట్లును నిర్వహింపబడియుండుట గలదు

5.11.8 శ్రీనివాసరావుగారి 'రామరాజు చరిత్రము' ప్రసిద్ధనాటకము. ఇందు వస్త్వైక్యము నిర్వహింపబడినది. ఇట్లే ప్రాసంగికేతివృత్తములైన 'శిలాదిత్య' 'శిరోమణి' 'ప్రహ్లాద', 'సుఖమంజరీ పరిణయము', 'కాళిదాసు', 'సత్యహరిశ్చంద్రీయము' 'మానాపమానము' అను నాటకములలో యథావిధిగా కథైక్యము పాటింపబడినది. ప్రాసంగికముల ప్రవేశపెట్టి, ఆధికారికేతి వృత్తమున కుపకరింపజేసి నాటకములందు వస్త్వైక్యము సంపాదించిరి. 'పాదుకాపట్టాభిషేకము'న గుహునికథ, 'చంద్రగిర్యభ్యుదయమున' చాందుఖాన్ విషయము, 'సునందనీ పరిణయము'న జయమాలీకుబేరోగ్రసేనుల కథలును, 'సీతాకల్యాణము' నందలి ఉపకథలును, 'లంకాదహనము'న వాలికథ. "కుశలవ'లో మంథరాశూర్పణఖలయు, రజకీ రజకులయు కథలును, "బభ్రువాహన"లో ప్రభావతీ సుధన్వులకథయు, "రుక్మాంగద"యందు చాకలి దుర్గి ఉపవాస ఫలముచే విశ్వావసునకు రెక్కలుమొలిచి స్వర్గమునకేగు కథయు, "మదాలస"లో కుండల, తాళకేతుల కథలును ప్రాసంగికములై ఆధికారికేతి వృత్తమునకెంతయు నుపకరించునట్లు సంవిధాన పరచి వస్త్వైక్యమునకేలోటును లేని విధమున నాటకములను నడపి నాటక శిల్పమును గాపాడిరి.

రాజకీయపు ఎత్తులతో, కుట్రలతో, మోసముతో, కామవ్యాపారముతో జహుపాత్రాకమై, ప్రాసంగికేతివృత్తములతో బహుక్లిష్ట విషయభూయిష్ఠమై యొప్పు నాటకము "సుల్తానా చాందుబీ". విషయ గౌరవముననేగాక నాటక శిల్పమునను దీని కొక ప్రత్యేకత కలదు. ఇందును వస్త్వైక్యము యథారీతిని పాటింప బడియుండుట ప్రశంసాపాత్రమైన విషయము. దీనిలో మొదట బీజాపురమును, సుల్తానా చాందుబీ రాజ్యపాలనము గావించుచు శౌర్యసాహసములతోపాటు రాజకీయ చతురతను శేముషీ నైపుణ్యమును ప్రకటించి ప్రసిద్ధి గాంచుట ప్రధాన విషయము. అస్మన్, డాండియాగో, మేరీ, అల్మేడాలయు, జోరియా దర్వీషులయు ఉపకథలను జోడించి ప్రధానకథను క్లిష్టముగావించియు, వస్త్వైక్యమునకు లోపమురానీక శ్రీనివాసరావుగారు కథాసంవిధాన చాతుర్యమును స్పష్టము గావించిరి.

"కీచకవధ" లేక "సైరంధ్రి"యను నాటకారంభమున అర్జునుడు పాశుపతాస్త్రము సంపాదించి, అమరావతికిపోయి అచట ఊర్వశిచే శప్తుడగుట అను విషయము స్థూలదృష్టికి అనవసరమనిపించును. అజ్ఞాతవాస సమయమున ద్రౌపది సైరంధ్రిగాను, ధర్మజాదులితర వేషములలోను నుండవీలగును. కాని అర్జునుని తేజము మరుగుపడు నవకాశములేదు. అందుచేతనే ఊర్వశికోరికను తిరస్కరించి ఆమెచే అర్జునుడు బృహన్నలగా శపింపబడి శాపరూపవరమును పొందెను. ఇంద్రునిచే నదియే అజ్ఞాతవాస సమయమున నుపకరించునట్లను గృహీతుడయ్యెను. కనుక నీ నాటకమున ఏకసూత్రతను శ్రీనివాసరావుగారు సంపాదించిరి. ఇంతేగాక ప్రతియోగముచే కీచకునికంటె అర్జునుని ఉత్తమశీల స్వభావములు స్పష్టమగుననియు నితఃపూర్వమే విదితము.

"మైసూరు రాజ్యాభివృద్ధి"లోని పూర్వాంకములోని ప్రధానకథను గలుపుటకై శ్రీనివాసరావుగారు అతిమానుషశక్తిని ప్రయోగించిరి. లక్ష్మణ వీరుల వధాక్షమయమున అగస్త్యుడు ప్రవేశించి పూర్వజన్మ దుష్కృత్యముచే మరణ దండన విధింపబడినదనియు, పునర్జన్మమున యదురాయ కృష్ణరాయలుగ జన్మింతురనియుచెప్పి వెడలిపోవును. యదురాయ కృష్ణరాయలకు వారి పూర్వజన్మమునుగూర్చి సోమయాజి తెలుపును. ఇట్లు వస్త్వైక్యమును సంపాదించిరి.

కాని చివరి యంకమున చివరిరంగము న్యాయస్థానమున న్యాయవాదులయు, వాదిప్రతివాదులయు కోలాహలముతో నిండి అతివిస్తృతమైనది. ఇది అనవసరమైన పెంపు అనవలసియున్నది.

"సీమంతిని"లో సీమంతినీ చంద్రాంగదుల పునర్వివాహముతో నాటకము ముగియుచుండగా, ఆ వెనుక సీమంతినీ పాతివ్రత్యమును నిరూపించుటకై సామవతీ సుమేధుల ప్రాసంగికేతివృత్తము ప్రసక్తమైనది. ఇది ప్రధాన కథకుపకరించిన మాట వాస్తవమైనను చివరదీనికే ప్రాధాన్యము వచ్చినట్లు గలదు. మూలకథలోనే యున్నప్పటికిని బహుశః శ్రీనివాసరావుగారు రసవత్త కొరకు విస్తరించరేమో !

'ప్రతాపాక్బరీయము' 'సుల్తానా చాందుబీ' వలెనే బహు పాత్రాకమై యున్న అరంకముల నాటకము. కాని దీనిలో వస్త్వైక్యమున కవకాశము లేక పోయినది. 'ప్రతాపాక్బరీయ'మని శ్రీనివాసరావుగారు దీనికి నామముంచుటచే ప్రతాపాక్బరులకు సమప్రాధాన్యమిచ్చినట్లు తెలియును. కాని చివరకు అక్బరుపై విజయము సంపాదించినవాడు ప్రతాపుడు. అయినను నాయకుడైన ప్రతాపుడు మూడవ అంకము నాల్గవ రంగమున రాజ్యాభిషిక్తుడై మహమ్మదీయుల మట్టు పెట్టి హిందూరాజ్య పునరుద్ధరణము గావింప బద్ధ కంకణుడగును. అప్పటినుండి చివరి వరకు నాటకమున వస్త్వైక్యమున కేకొరతయులేదు. కాని ప్రథమాంకమునుండి అం. 3 రం. 3 వరకు గల కథ యంతయు పై కథకు వివరణము వంటిదని తలంపవలెను. అది యంతయు అనవసరమనవలసి వచ్చును. అయినను హిందూరాజ్యమును పునరుద్ధరించుటయే ప్రధాన విషయముగా తలచినచో నాటకమున ఐక్యత యున్నదని సరిపుచ్చుకొనవచ్చును. ఇదైనను వాదముకొరకు మాత్రమేగాని లోటులోటుగానే తెలియును. కాని ఇది యీ నాటకము నందలి తదితర లక్షణముల ఔత్కృష్ట్యముచే వాని మరుగునబడి విస్మరింపబడును.

5.11.9 ఇంక వస్త్వైక్యము కొరవడిన నాటకములు మూడు 'శ్రీరామజననము', 'గిరిజా కల్యాణము', 'ద్రౌపదీ వస్త్రాపహరణము' అనునవి, 'శ్రీరామజననము'న అనపత్యుడైన దశరథుడు తృతీయాంకారంభమున దుఃఖితుడగుటకలదు. శ్రీరామజననమునకు సంబంధించిన కథావస్తువు తృతీయాంక

మున మాత్రము గలదు. ద్వితీయాంకారంభమున దేవతలు మొర విని రావణ సంహారార్థము తాను దశరథపుత్రుడై జన్మింతునని నారాయణుడు చెప్పుటలో తద్విషయము సూచితమైనది. ప్రథమాంకమున రావణుడు ఘోరతపమాచ రించి, వరగర్వియై ముల్లోకములను అల్లకల్లోము గావించుట గలదు. ద్వితీయాంకము క్షామ నివారణార్థము ఋశ్యశృంగుని అంగదేశమునకు కొనివచ్చుటలో ప్రాధాన్యము వహించినది. ఇట్లు మూడంకములు మూడు విషయములతో నొప్పుచున్నవి. రావణ తపస్సుతో నారంభమైన శ్రీరామాదుల జననము కొరకు అగ్నిదేవుడనుగ్రహించిన పాయసమును కౌసల్యాకైకా సుమిత్రలకు దశరథుడు పంచిపెట్టుటతో ముగియుచున్నది ఇందు అసలు కథ కంటె నితరమే యెక్కువ. అందుచే వస్త్వైక్యమిందు కొరవడినదని తలంపవలెను. కాని మూడంకములలోని మూడు ప్రధాన విషయములకు కార్యకారణ సంబంధము సంపాదించుటకై శ్రీనివాసరావుగారు ప్రయత్నించిరి. దుర్మార్గుడైన రావణ వధార్థము శ్రీరాముడుద్భవించునను విషయము దెలుపుటకై మొదట రావణ దౌష్ట్యము, దేవతల మొర, నారాయణు డనుగ్రహించుట, క్షామ నివారణార్థము కొనిరాబడిన ఋశ్యశృంగుడు దశరథ పుత్ర కామేష్టితో ఋత్విక్కగుట అను వాని యందలి అంతస్సంబంధముచే సమైక్య సంపాదనార్థమై చేసిన శ్రీనివాసరావుగారి ప్రయత్నము కొనయాడదగినదే. అయినను ఆరంభ విషయములు అధిక ప్రాబల్యము వహించినవి.

'గిరిజాకల్యాము'నను పై నాటకము వలెనే ముఖ్య కథకంటె నితర మెక్కువ ప్రథమాంకమున తారకుడుద్భవించి ఔద్ధత్యము నెరపుట, ద్వితీయాంకమున దక్షుని ఆటోపము, సతి చితి యందురుకుట, శివుడు తపమున కరుగుట, దక్షాధ్వరధ్వంసము, తృతీయాంకమున ఇంద్రాది దేవతలు తారకుని వధింప మన్మథునితో నాలోచించుట; మన్మథుడు భస్మముకాగా రతి విలపించుట చతుర్థాంకమున సతి పార్వతిగా జన్మించి, పెరిగి తపోవనమున కేగి, ఘోర తపమాచరించు ఈశ్వరుని మెప్పించుట అను విషయములు వరుసగా కలవు. చతుర్థాంక విషయమునకు పూర్వపూర్వాంకముల విషయములు కార్యకారణ సంబంధమును కలిగియున్నట్లు కల్పింప శ్రీనివాసరావుగారు యత్నించిరి. కాని

ప్రధాన విషయమున కంటె ముందు విషయము లధిక ప్రాముఖ్యము వహించినవి.

'ద్రౌపదీ వస్త్రాపహరణము'న ఉండవలసిన ప్రధాన కథ కంటె నితర మధికమగుటచే శిల్పమున లోపము కలదు. 'శ్రీరామజనన, గిరిజాకల్యాణము' లలో నైన ఉత్తరోత్తర కథకు పూర్వపూర్వకథలకు సమన్వయము తలంప వీలగుచున్నది. కాని దీనియందది కుదరదు. 'ప్రతాపాక్బరీయము' నైన ప్రతాపుని కథానైపుణ్యముచే దానిని సమర్థింప సాధ్యమగునేమో కాని యిచట అదియు వీలుకాదు. పంచాంక పరిమితమైన ద్రౌపదీ వస్త్రాపహరణ నాటకమున అం. 4 రం. 2 నుండి ద్రౌపదీ వస్త్రాపహరణ సంబంధ కథ ఆరంభమగుచున్నది. తత్పూర్వముగల మూడంకముల కథయంతయు నాటక నామమును బట్టి యనవసరమనవలసివచ్చును. 'లాక్షాగృహమునుండి భీముని వలన పాండవులు బయటపడుట, భీముడు హిడింబ బకాసురుల వధించుట, పాండవులు ద్రుపద నగరమున కరిగి ద్రౌపదీ స్వయంవరమున ద్రౌపదిని వివాహమాడుట, తీర్థయాత్రార్థమరిగిన అర్జునుడు కపట యతి వేషమున సుభద్రను పరిణయమగుట, ఖాండవ దహనము మున్నగు కథలన్నియు మూడంకముల నాక్రమించినవి చతుర్థాంకము నుండి వస్త్రైక్యమునకు కొరతలేదు. భారత కథ యగుటచే నాటకము రసవత్తరముగా నున్నమాట వాస్తవమే. అయినను నాటక శిల్ప విషయమున దెబ్బతిననదనుటలో సందేహములేదు.

5 11.10 శ్రీనివాసరావుగారి నాలుగైదు నాటకములుతప్ప తక్కిన వానిలో ఖేదమోదముల పరిమేళనము గావించిరి. కాని నాటకములను విషాదాంతము గావించుట రావుగారి కిష్టము లేదు. అయినను నాటకములలో విషాద నాటక లక్షణములను విపులముగా ప్రవేశపెట్టియు మోదాంతము గావించుట వీరి మతము. 'రామరాజు చరిత్రము' వీరు మోదాంతముగానే రచించిరి.కాని ప్రముఖ నటులు దానిని విషాదాంతముగా మార్చి ప్రయోగించిరి. కాని వధాంత నాటకము లొకటి రెండు గలవు. 'శిలాదిత్య'లో శిలాదిత్యుడు యుద్ధమున వధింపబడగా, కళావతీ మదనులు వారి మోసకృత్యమునకు శిక్షగా పార్థియన్‌లచే సంహరింపబడి నాటకము వధాంతము గావింపబడినది. అయినను

కళావతీ మదనులు పశ్చాత్తాపులై శిలాదిత్యుని పుత్రుడు గుహుని పట్టాభిషిక్తుని గావించుటతో ముగియునట్టి మోదాంతమైనదియు గలదు. శ్రీనివాసరావుగారు హృదయపూర్వకముగా వధాంతనాటకముగా రచించిన నాటకము 'సుల్తానా చాందుబీ' ఒకటియే. ఇందు చిట్టచివర అస్మన్‌బేగ్, డాండియాగో, హమ్మీదు మున్నగు దుష్టుల దుర్మరణముతోపాటు ఢిల్లీ పాదుషా సైన్యములనుగూడ గడ గడలాడించు శౌర్య ప్రకటనము గావించి, మహాధీరయై, బుద్ధిశాలినియైన సుల్తానా చాందుబీ వధతో నాటకమంతమగును. ఇది కేవలము వధాంతమే కాదు కొంతవరకు విషాదాంతమనియు ననవలయును. 'పాదుకాపట్టాభిషేకము' న విషాదమునకు కొదవ లేదు. సత్యమునకై రాజ్యము విశ్వామిత్రున కప్ప గించి, కట్టుపుట్టములతో అరణ్యములబడి కష్టము లనుభవించుచు, ఋణ విముక్తికై భార్య చంద్రమతినమ్మి, తనను కాటికాపరిగా నమ్ముకొని, బాధా క్రాంతులై చంద్రమతీహరిశ్చంద్రుల దయనీయస్థితిని 'సత్యహరిశ్చంద్రీయము' న గాంచి రాతి గుండెయయినను కరగిపోకుండునా ? చిట్టచివర చంద్రమతిని గుర్తించి. భార్యయనియైనను కనికరింపక హరిశ్చంద్రుడు వధింప నుద్యుక్తుడైన సమయమున దుఃఖముపొంగి పొర్లకుండునా? అట్లే 'రుక్మాంగద' ఆనంద మునకు నిలయమేయైనను నాటకాంతమున పుత్రుడైన ధర్మాంగదుని వధింప బోవునెడ దుఃఖము మేరమీరినది. "లంకాదహనము" న సీతాపహరణముచే ధీరోదాత్తుడైన రామునివంటి ఉత్తమ నాయకుడు సీతా వియోగముచే విషాద మగ్న మనస్కుడై విలపించుటయు, నివాసము అరణ్యమయినను భర్తృనురాగ రసాస్వాదనానంద తుందిలయైన సీత దుష్ట రావణాపహృతయై అశోకవనమున విలపించిన విలాపమునకు విలువ కట్టగలమా? అట్లే 'కుశలవ' మోదాంతమే యయ్యును దోషదూషితకాక పోయినను పూర్ణగర్భిణియైన సీతనరణ్యము పాలు గావించిన రాముడును, పరిత్యక్తయైన మహాపతివ్రత సీతయును పొందిన దుఃఖ మెంతని వర్ణింపవీలగును? 'శిరోమణి' యందలి యితివృత్తము భారతము యుద్ధ పంచకమువందలి దగుటవలన విజయోత్సాహములతో కొందరానందించు చుండ మరికొందరు దుఃఖపరీత మనస్కులై విలపించుట అరంభమునుండి చివరి వరకు మనము కనగలము. 'చంద్రగిర్యభ్యుదయము', సుభమంజరీ పరిణ

యము. సునందనీ పరిణయము, మైసూరు రాజ్యాభివృద్ధి, కాళిదాసు, సీమంతిని, మదాలస మున్నగు నాటకములు మోదాంతములయ్యెను విషాద వైపుల్యముతో నున్నవి. ఇట్లా యా నాటకములలో మోదముతోపాటు విషాదము జోడించియు వాని వస్త్వైక్యమునకు లోటు రానీక శ్రీనివాసరావుగారు మిక్కిలి జాగరూకతతో నాటకముల రచించిరి.

పైని వివరించినట్లు శ్రీనివాసరావుగారు దేశకాలైక్యోల్లంఘనమందందు గావించినను వస్త్వైక్య విషయమున బహుజాగరూకులై నాటక శిల్పగరిమను పరిరక్షించి, ఉత్తమ నాటకకర్తగా నిరూపించుకొనిరి.

## 5. 12 పూర్వోత్తర రంగములు : (Prologue and Epilogue) :

పాశ్చాత్య నాటకములలో పూర్వోత్తర రంగములు (Prologue and Epilogue) ప్రయుక్తములగుట పరిపాటి. Prologue నాటకారంభముననుండి అందు నాటక విషయము ప్రస్తావింపబడి యుండును. Epilogue నాటకాంతమున నుండును, దీనిలో నాటకమున కవి బోధింపదలచిన నీతి వివరింపబడును. వృత్త, పాత్రల గుణావగుణములు విమర్శింపబడుటయు గలదు.[1] షేక్స్పియరు నాటకములలో నీ Prologue, Epilogue ల ప్రయోగించి వానికి శోభను చేకూర్చెను. పాశ్చాత్య నాటకములందలి పూర్వరంగము (Prologue) నకును, సంస్కృత నాటకములందలి పూర్వరంగమునకును సంబంధము లేదు.

5.12.1 ఇట్లు పాశ్చాత్య నాటకపద్ధతితో పూర్వోత్తర రంగముల (Prologue and Epilogue) ను శ్రీనివాసరావుగారు కొన్ని నాటకములలో ప్రవేశపెట్టిరి. శిరోమణి, కాళిదాసు, సీతాకల్యాణము, మైసూరు రాజ్యాభివృద్ధి అను వానిలో పూర్వరంగములును, సునందనీ పరిణయము, సుఖమంజరీ పరిణయము, సత్యహరిశ్చంద్రీయము, ప్రహ్లాద, నాటకములలో ఉత్తర రంగ

1. (i) 162. పు. 203-205. (ii) 11. పు. 109-111.

ములను ప్రయుక్తములయినవి. పైగా శ్రీనివాసరావుగారు పాశ్చాత్యపద్ధతిలో పూర్వరంగముల ప్రయోగించిన రూప, ప్రయోజనములలోను తద్భిన్నమై వీరి స్వాతంత్ర్యమును ప్రకటించుచున్నవి. పాశ్చాత్య నాటకములలో పూర్వరంగము కథన రూపమున నుండ రావుగారు తమ నాటకములలో సంభాషణాత్మకముగా వీనిని ప్రయోగించిరి. తద్ద్వారమున వీనికి కేవల పఠన ప్రయోజనమే గాక రంగమున ప్రయోగ యోగ్యతనుగూడ సంపాదించిరి. చాలవరకు శ్రీనివాసరావుగారు సామాజికులు నాటకములోని కథా విషయమున కార్య కారణ సంబంధమును తెలిసికొనుటకై అనగా కథావబోధన సౌలభ్యమునకై పూర్వరంగములను రచించినట్లు తెలియును. "శిరోమణి నాటకము" పూర్వరంగమున దుష్టశిక్షణము గావించి భూభారము తగ్గింపవలసినదని భూదేవి కృష్ణుని ప్రార్థించును.కృష్ణుడు ప్రత్యక్షమై ఆమె కోర్కెను దీర్తుననియు,కొంత కాల మోపిక పట్టవలసినదనియు నోదార్చి అదృశ్యుడగును. తరువాత రాయబారము విఫలము కాగా భారత యుద్ధమారంభమగును. భారత యుద్ధమున ప్రధానబాధ్యత కలవాడు కృష్ణుడనుటను నిరూపింప శ్రీనివాసరావుగారీ పూర్వరంగమును కల్పించిరి.

'కాశిదాసు' లో పూర్వరంగమును కల్పించి కాళిదాసాదులు దైవాంశ సంభూతులనియు, కేవల మానవమాత్రులు కారనియు నిరూపింప యత్నించిరి. దుర్వాసుని శాపముచే సరస్వతి నీచకులమున మానవుడుగాను, బ్రహ్మ యొక మానవుడుగాను, సావిత్రి శాపముచే దుర్వాసుడు నీచ మానవునకు భార్యగాను భూలోకమున అవతరించునట్లు పూర్వరంగమునగల విషయము కథా వివరణమున కుపయుక్తమగుచున్నది. బ్రహ్మ భోజుడుగను, సరస్వతి దంబరునిగా తరువాత వరకవి కాశిదాసుగాను, దుర్వాసుడు మదసేనగ జన్మించి సంస్కృత భాషోద్ధరణము గావించినట్లు వివరింపబడినది. శ్రీనివాసరావుగారీ కథకు పూర్వరంగరచనముచే అతి మానుషభావము నాపాదించిరి.

'ప్రహ్లాద నాటకము' నందలి పూర్వరంగమున సనకసనందనులను మహర్షులచే శప్తులై, నారాయణానుగృహీతులై జయవిజయులు దితి గర్భమున

హిరణ్యాక్షహిరణ్య కశిపులుగ జన్మించు విషయము గలదు. ఇది కథా వివరణమునకు చక్కగ నుపకరించి పూర్వ విషయమును స్పష్టము గావించినది

సీతాకల్యాణములోని పూర్వరంగమున తన యాగమనమును లెక్క చేయలేదని క్రుద్ధుడైన నారదుడు తుంబుర పర్వతులను మానవులుగా, కోపగించు కొనినదని లక్ష్మిదేవిని మానవ స్త్రీగా జన్మించి, దానవాపహృతయై విరహ మను భవించునట్లును శపించును. నారాయణుడ నుగ్రహించి తాను రాముడుగా జన్మింతుననియు, తుంబుర పర్వతులను అగ్నితేజసులుగాను, లక్ష్మి సీతగాను జన్మింతురని అనునయించును. ఈ పూర్వాంక రచనముచే నాటక కథలోని విషయములను స్పష్టముగావించుటయే గాక వారు దైవాంశ సంభూతులన్నటను నిరూపించుటకుగూడ శ్రీనివాసరావుగారు ప్రయత్నము గావించిరి.

పై నాటకములలో పూర్వరంగ మేకరంగ పరిమితమైయుండ 'మైసూరు రాజ్యాభివృద్ధి' లో నాలుగు రంగములతో కూడిన ప్రథమాంకము పూర్వర గ ముగా శ్రీనివాసరావుగారు రచించిరి. ఇందు జగన్మోహిని మేనల్లుండ్రైన లక్ష్మణ వీరులను కవలను మోహించి విఫల మనోరథయై వారికి మరణదండన విధింపజేయును. వారే పునర్జన్మమున యదురాయకృష్ణరాయలుగా జన్మించి నట్లు కలదు. ఈ నాటకమున తరువాతి కథకు పూర్వాంక మెంతయు శోభను కలిగించినది. కార్యకారణ సంబంధముతోపాటు కథా వివరణమునకు నుప యుక్తమైనది.

ఇది యిట్లుండ 'రామరాజు చరిత్రము'న పూర్వరంగము లేకపోయినను, లక్ష్మిసరస్వతీ కాళరాత్రుల సంభాషణము పాశ్చాత్య నాటకములలోని 'Chorus' వలె నొప్పుచున్నదనవలెను. రామరాజు చరిత్రమున ప్రథమ ద్వితీయ తృతీయాంకముల ప్రథమ రంగములలోను, పంచమాంకము తృతీయ రంగమునను వీరి ప్రసంగము కలదు. వీరి సంభాషణమున విషయ వివ రణముతోపాటు నాటక కథాక్రమ వికాసముకూడ స్పష్టమగుచుండును. ఇట్లు శ్రీనివాసరావుగారు పూర్వాంకరచనచే కథావిషయ వివరణముగావించి సుబోధము చేయ యత్నించిరని స్పష్టమగును.

5.12.2 ఉత్తర రంగములుగల నాలుగు నాటకములలోను సమానముగా లేవు. సునందనీ పరిణయము, సుఖమంజరీ పరిణయములలోని ఉత్తర రంగములందు వరుసగా సునందనీ సుదేవులయు, సుఖమంజరీ ప్రద్యుమ్నులయు వివాహములు జరుపబడినవి. ఇందు వధూవరులు పెండ్లిపీటలపై ఆసీనులైయుండ బ్రాహ్మణులు, ముత్తైదువులు ఆశీర్వదించినట్లు గలదు. ఈ నాటకములను వివాహములచే శ్రీనివాసరావుగారు మోదాంతముగావించి నాటకేతి వృత్తమునకు ఉపసంహృతిని సూచించుట గమనింపనగును.

"సత్యహరిశ్చంద్రీయ, ప్రహ్లాద" నాటకములందీ యుత్తర రంగములు ద్విపదలలో కలవు. సత్యహరిశ్చంద్రీయమున హరిశ్చంద్ర కథతోపాటు సత్యము, పతిభక్తి, అప్పు ముప్పుదెచ్చునను నీతులను వివరించి హరిశ్చంద్ర చంద్రమతుల శీల స్వభావములను శ్రీనివాసరావుగారు వివరించిరి. అనగా నాటక కథను కథనరూపమున సామాజికులకు వివరించిరని తలంపవలెను 'ప్రహ్లాద' లో ప్రహ్లాద చరిత్రతోని వేదాంతార్థమును బోధించు ద్విపదగలదు. దీని చివర ఫలశ్రుతియు చెప్పబడినది. ఈ రెండు నాటకములలోను కథల కొకముగింపు గల్పింపవీరిట్లు గావించిరనవలెను. ఈ ద్విపదలను నాటకాంతమున ఎవరు చదివినది సూచింపబడలేదు.

"సీమంతిని"లో ఉత్తర రంగమని పేరిడకపోయినను చివరి తృతీయ రంగమున మతిగుప్తునియాజ్ఞతో శాస్త్రి సీమంతినీ చరిత్రము ద్విపదలో వ్రాసి సభ్యాళి ఎదుట చదివినట్లు గలదు. ఇందిది రంగాంగముగనే యున్నను ఉత్తర రంగము వంటిదనుటయే ఉచితము. "సునందనీ, సుఖమంజరీ పరిణయము" లలో వివాహము లుత్తరరంగమున నిర్వహింపబడినట్లుండ 'మదాలస, సీమంతినీ' నాటకములలో వరుసగా మదాలసా కువలయాశ్వులయు, సీమంతినీ చంద్రాంగదలయు వివాహములు రంగములందే ప్రయుక్తములు. వీనికి ఉత్తర రంగములను నామములేదు. "మదాలస"లో చతుర్థరంగమున వివాహము జరిగినట్లును, తత్పూర్వము తృతీయ రంగమున సూత్రధారుడు ప్రవేశించి 'మదాలస చరిత్ర' ద్విపదలో సామాజికులకు చదివి వినిపించినట్లును గలదు. ఇది "సత్యహరిశ్చంద్రీయము" మొదలైన నాటకములలోని ఉత్తర రంగమువలె నున్నది.

"సునందని, సుఖమంజరీ పరిణయ" నాటకములలో వివాహములు తెర రంగములలో జరుగును. తత్పూర్వమే దుష్టులైన సుమతి, విషయసేనులు పశ్చాత్తప్తులై తమ దౌష్ట్యముదెలిపి నీతినుపదేశించినట్లు గలదు. రాజదండనకు గురియైన సుమతి పశ్చాత్తప్తుడై పత్రిక ద్విపదలో వ్రాసియీయగా, దానిని మణి కంధరుడు సామాజికులకు చదివి వినిపించినట్లు గలదు. 'సుఖమంజరి'లో కారకు కొనిపోబడుచుండిన విషయసేనుడు పశ్చాత్తప్తుడై కూడిన జనులకు ద్విపదలో నీత్యుపదేశముగావించి వెడలిపోవును. వీనిలో ఉత్తర రంగచ్ఛాయలు గలవు.

పాదుకాపట్టాభిషేకమున ఉత్తర రంగములేదు. కాని భరతుడు శ్రీరామ పాదుకలకు నందిగ్రామమున అభిషేకము గావించుట ప్రత్యేకరంగముగాగలదు. దీనికి పంచమరంగమనిగాని, ఉత్తర రంగముగాని పేరులేదు. అయినను ఉత్తరరంగమువలె భాసించు చున్నది. ఉత్తర రంగముగాని, ఉత్తర రంగము వంటిదిగాని నాటకేతివృత్తములకువివరణ, నీత్యుపదేశములతోపాటు ముగింపును సూచించుటయు గలదు.

ఇట్లు శ్రీనివాసరావుగారు పాశ్చాత్యనాటక పద్ధతిలో పూర్వోత్తర రంగ ముల రచించియు, వానికంటె కొన్నింట రూపమున ప్రయోజనమున భిన్నమై యొప్పునట్లు ప్రయోగించియు తమ స్వాతంత్ర్యమును ప్రకటించిరి. ఇది శ్రీనివాసరావుగారిలోని ప్రత్యేకతకు, వైశిష్ట్యమునకు నిదర్శనమగు ననుటలో నెట్టి సందేహము లేదు.

## 5.13 నాంది ప్రస్తావనా భరత వాక్యములు :

పైని వివరింపబడినట్లు శ్రీనివాసరావుగారు పాశ్చాత్యనాటక లక్షణముల నధికముగా ప్రయోగించినను, ఎడనెడ సంస్కృత నాటక పద్ధతులను నైత ముపయోగించిరి. సంస్కృత నాటకములలో పూర్వరంగము, నాందీ ప్రస్తావనా భరత వాక్యముల కధిక ప్రాధాన్యము కలదు. సంస్కృతరూపక ప్రయోగము

నకు పూర్వము నిర్వర్తింపబడుదానిని పూర్వరంగమందురు. ఇందు విఘ్నోప శాంతికై దేవతా పూజాపురస్కారములు జరుపబడును. వీనిచే దేవతలు సంత సింతురు. అంతర్యవనికాంగములు, బహిర్యవనికాంగములనని పూర్వ రంగాంగములు రెండు విధములు. అంతర్యవనికాంగములు గావించిన వెనుక అనగా తెరవెనుక దేవతాపూజాదికము ముగించిన తరువాత, బహిర్యవనికాంగ ములు నిర్వర్తింపవలెను. ఇందులో నాంది అపరిహరణీయైన అంగము.[1] పూర్వ రంగాంగములు తెరవెనుక పూర్తిచేసి తరువాత తెర తొలగించి నాందీ పద్య మును పూర్వరంగ ప్రవర్తకుడు పఠించును. సంస్కృత నాటకము లందలి నాందీ శ్లోక మిట్టిది. 'నందయతీతి నాంది' అనగా ఆనందింపజేయునది నాంది. నందీశ్వరుని తలపింపజేయునది నాంది.[2] సామాజికులను నందింపజేయునది నాంది యనియు, ఇంద్రియములను ఆనందింపజేయునది నాంది యనియు చెప్ప బడినది.[3] నాంది ఆశీర్వచన సంయుక్తము కావలెనని భరతమతము[4] ఆశీర్వ చనముతోగూడి దేవద్విజనృపాదులస్తుతి గలది నాంది అని విశ్వనాథుడు.[5] అశీ ర్నమస్క్రియలతోకూడి కావ్యార్థ సూచన కలది నాందియనియు గలదు.[6]

1. 68. పు. 154, 155. 2. 64. పు. 243, 244

3. 68, అం 5. పు. 184.

4. "ఆశీర్వచన సంయుక్తా నిత్యం యస్మాత్ ప్రవర్తతే।
దేవద్విజనృపాదీనాం తస్మాన్నాందీతి సంజ్ఞితా॥"
152. అ. 6. శ్లో 24, 25.

5. "ఆశీర్వచన సంయుక్తాస్తుతిర్యస్మాత్ప్రయుజ్యతే।
దేవద్విజనృపాదీనాం తస్మాన్నాందీతి సంజ్ఞితా॥"
151. పరిచ్ఛేదము 6, శ్లో. 24.

6. "ఆశీర్నమస్క్రియారూపః కావ్యార్థసూచకః నాందీతికథ్యతే।"
అని రాఘవభట్టు శాకుంతలవ్యాఖ్యలో పేర్కొనెను.
63 అ. 5 పు 188.

ఇట్లే ధనంజయుడు అర్థముచేగాని, శబ్దము వలనగాని కొంతవరకు కావ్యార్థమును సూచింపవలెనని చెప్పెను.[1] ఇది చంద్రనామాంకితమై యుండవలెననియు కలదు.[2] శంఖచంద్రాబ్జకోక కైరవాది శుభప్రదములైన పదములతో నుండవలెనని విశ్వనాథుడు.[3] భరతుడు ఎనిమిది, పండ్రెండు పదములతోకూడి యుండవలెననెను. విశ్వనాథుడు ఎనిమిది, పండ్రెండు, పదునెనిమిది, ఇరువది రెండు పదములగూడి యుండవలెననెను.[4] ఇచ్చట సుప్తిఙంతము పదమని కొందరును, పద్యపాదము పదమని మరికొందరును చెప్పుదురు. ఇట్లు నాందీ లక్షణము చెప్పబడినది. ఈ లక్షణములలో నాంది కావ్యార్థ సూచనాత్మకము కావలెననునది సార్థకమైనది.

5.18.1 పూర్వరంగ ప్రవర్తకుడైన సూత్రధారుడు నాందిని ముగించి వెడలిపోయిన వెనుక స్థాపకుడు లేదా ప్రస్తావనా ప్రవర్తకుడను రెండవ సూత్రధారుడు ప్రవేశించి ఆముఖమును ప్రవర్తింపజేయును. ఆముఖమునకు ప్రస్తావన, స్థాపన అనియు నామాంతరములు. సూత్రధారుడు నటీ, విదూషక, పారిపార్శ్వకులలో నొకరితో కలసి చిత్రవాక్యములతో, స్పష్టములైన ఉక్తి ప్రత్యుక్తులతో చేయు సంలాపము ప్రస్తావన. నాటకము, నాటకకర్త మొదలైన విషయములిందు కీర్తింపబడును. భారతీవృత్తిలో ఋతుగానము చేయబడును. ఈ ఋతుగానము నాటక ప్రతిపాదిత రసానుగుణముగా నుండును. వీరశృంగారములలో నొకటి యంగి కనుక శరద్వసంతర్తు వర్ణన ముండును. ఈ ప్రస్తావనాంగములైన ఉద్ఘాత్యకము, కథోద్ఘాతము, ప్రయోగాతిశయము,

---

1. "అర్థతశ్శబ్దతోవాపి మనాక్కావ్యార్థసూచనమ్." దశరూపకము.

2. 63. అ. 5. పు. 184.

3. 4. "మాంగల్య శంఖ చంద్రాబ్జకోక కైరవశంసినీ।

పదైర్యుక్తో ద్వాదశభిరష్టాభిర్వాపదైరుత॥"

151. పరిచ్ఛేదయ 6. శ్లో। 25.

ప్రవర్తకము, అవలగితమునను వానిలో నొక దానితో సూత్రధారుడు పాత్ర ప్రవేశమునుసూచించి వెడలిపోవును. సూత్రధారుడొక యర్థమున ప్రయోగించిన పదములను కథకు సమన్వయించుకొని పాత్రప్రవేశము చేయుట ఉద్ఘాత్యకము. సూత్రధారుడు ప్రయోగించిన వాక్యముగాని, వాక్యార్థముగాని ఆత్మసంబంధిగా గ్రహించి పాత్రరంగస్థలమున ప్రవేశించుట 'కథోద్ఘాతము'. సూత్రధారనిర్దిష్ట పాత్ర ప్రవేశము 'ప్రయోగాతిశయము'. సూత్రధారుడు కాలప్రవృత్తిని ఏదేని యొక ఋతువును ఆశ్రయించి వస్తువర్ణనయుచేసినచో తదనుసారముగా పాత్ర ప్రవేశించుట 'ప్రవర్తకము'. ఒక ప్రయోగమున సమావేశముచేత వేరుకార్యము సాధింపబడినచో నది 'అవలగితము'. ప్రస్తావనయిట్లు ముగియును. ఈ నాందీ ప్రస్తావనలు నాటకారంభమున చేయబడునవి.

5.13.2 ఇక భరత వాక్యము నాటకాంతము నందలిది. నిర్వహణ సంధిలోని అంగములలో చివరిది ప్రశస్తి. ఈ ప్రశస్తియే భరతవాక్యము. ప్రశస్తి శుభాశంసనముతో కూడియుండును. సమస్త ప్రజాసముదాయమునకు శుభము కలుగవలెనని అందు ఆశంసింపబడును. మొదట ప్రశస్తిని భరతులు (నటులు) చదివెడివారనియు, తరువాత నాటకాంతమున దేవతలు, పెద్దలు ఇంకేమి గావలెనని యడుగ నాయకుడిట్లగును గాక యని శుభమును గోరునట్లు మారినదనియు తెలియుచున్నది. ఇదియే పరిపాటియైనది.[1] భరత నాట్య శాస్త్రాంతమున భరత వాక్యమిట్లు గలదు.

"కిందాన్యత్ సస్య పూర్ణాభవతు వసుమతీ నష్ట దుర్భిక్షరోగా !
శాంతి ర్గోబ్రాహ్మణానాంభవతు నరపతిః పాతుపృథ్వీంసమగ్రామ్."

(ఇంక చెప్పవలసినదేమి కలదు ? వసుమతి సస్య పూర్ణ మగునుగాక ! దుర్భిక్షములు రోగములు నశించుగాక ! గోబ్రాహ్మణులకు శాంతి కలుగునుగాక ! ఈ సమగ్రమైన అవని నెల్ల నరపతి రక్షించునుగాక !) ఇట్లే సంస్కృత నాటకాంతములలో ఆశంసించుచు భరత వాక్యముపయుక్తమగు చుండునని

1. 142 దిశం. నవంబర్ 1955 పు. 90 – 95, 108.

తలంపవలెను. అంతేగాక కావ్యము శుభాంతము కావలె ననుటను బట్టియు నిది యేర్పడి యుండును. ఇట్లు సంస్కృతమున పూర్వరంగము, నాంది, ప్రస్తావన, భరత వాక్యములనునవి ప్రయుక్తములగుట సంప్రదాయము.

5.18.8 సంస్కృత నాటక పద్ధతిలో నాందీ ప్రస్తావనా భరత వాక్యములను శ్రీనివాసరావుగారు రచించిరి. నాందిని ఎక్కువ నాటకములలోను, ప్రస్తావనను తక్కువ నాటకములలోను, భరత వాక్యమొకటి రెండు నాటకములలోను వీరు రచించిరి. వీనిలో శ్రీనివాసరావుగారు సంస్కృత నాటక లక్షణము లెంతవరకు అనుసరించినారనునది పరిశీలింపవలెను.

శ్రీనివాసరావుగారు నాందీ పద్యము వ్రాయని నాటకములు "రుక్మాంగద, చంద్రగిర్యభ్యుయము, కీచకవధ, ద్రౌపదీ వస్త్రాపహరణము" అను నాలుగు మాత్రమే. తక్కిన నాటకము లన్నింట ఈ నాంది గలదు. 'ద్రౌపదీ వస్త్రాపహరణము'న శ్రీనివాసరావుగారు నాందీ పద్యము వ్రాయకపోవుటచే తత్ప్రతికా కర్త హనుమంతరావుగారు వ్రాసి పొందుపరచిరి. 'కీచకవధ'లో ప్రథమాంకము ప్రథమరంగారంభమున అంతకుముందే రచింపబడిన నాటకములలో గల నాటక కర్తృప్రశంసాత్మక పద్యములు రెంటిని నాందియని ఈబడినవి. శ్రీనివాసరావుగారు వ్రాయలేదని తలంచి నాటకము ముద్రించు సమయమున ఆ పద్యములైన నుండుట మంచిదని తలంచి వానిని చేర్చినట్లు మనము గమనింపనగును. 'చంద్రగిర్యభ్యుదయము'న నాందిలేదు. అందుకు శ్రీనివాసరావుగారీ నాటక పీఠికలో చివర "ఈశ్వరారాధనచే నాటకము ప్రారంభింపఁబడును గావున నాంది యనావశ్యకము" అని తెలిపియున్నారు. ఈ భావము చేతనే కాబోలు శ్రీనివాసరావుగారు 'రుక్మాంగద'లో నాందీ పద్యము వ్రాయలేదు. ఇది కందపద్య దండకములతో విష్ణు స్తుతితో ఆరంభమగుటచేతనే నాందీ పద్యము పరిహరింపబడియుండును. "ఈశ్వరారాధనచే నాటకము ప్రారంభింపఁబడును గావున నాంది యనావశ్యకము" అను వాక్యము వలన ప్రతినాటకమున నాందీ పద్యముండవలెననుటయే శ్రీనివాసరావుగారి మతమని తలంపవలెను.

వీరి నాటకములలో ఆశీర్నమస్క్రియా పూర్వకమై నాందీ పద్యము లొప్పుచున్నవి. అఙ్ణము మొదలైన శుభప్రదపదములతో కూడియున్నవి. అంతేగాక నాంది గల నాటకములలో నాలుగైదింటిలో తప్ప తదితర నాటకములలోని నాంది యందు కావ్యార్థ సూచన గలదు. నాందియందు ప్రధానము, సార్థకమునైన లక్షణమిదియే. 'ప్రహ్లాద, లంకాదహనము' లలో స్పష్టముగా కావ్యార్థ సూచన చేయబడినది. సూకర రూపమున హిరణ్యాక్షు వధించి, నృసింహావతారమెత్తి ప్రహ్లాదుని రక్షించిన విష్ణువు ప్రజల రక్షించునట్లు ప్రహ్లాదలో నాంది యుండుటచే స్పష్టముగా కావ్యార్థ సూచన చేయబడినది. 'శ్రీరాముని హృత్పంకజమున నుంచుకొనిన పావనియని వర్ణింపబడుటచే 'లంకాదహనము'నను కావ్యార్థ సూచన చేయబడినది. 'ప్రతాపాక్బరీయము'న సూర్యాన్వయమున జన్మించి దుష్టశిక్షణ గావించినశ్రీరాముని ప్రార్థించుటయేగాక 'ప్రతాపనిధియై' అను మాటచే 'రాణా ప్రతాపుని' పరాక్రమము సూచింపబడినది. రామరాజు చరిత్రమున ఆంధ్ర రాజుల శౌర్య పరాక్రమము లభివర్ణించుట రామరాజు పరాక్రమమును సూచించుటయే గదా ! 'సుల్తానా చాందుబీ'లో భూభారము తగ్గించిన శక్తిగా వర్ణింపబడి చాందుబీ చరిత్రము సూచితమైనది. 'మదాలస'లో మదాలస పేరితోనే స్పష్టముగా కావ్యార్థ సూచన గావింపబడినది. 'సీమంతిని'లో 'పుంభావవ్యతిక్రమము' అనుటచే సీమంతినీ పాతివ్రత్యముచే సామవతీ సుమేధులను దంపతులుగా మారువేషములతో పోయి సామవంత సుమేధులు నిజమైన దంపతులుగా మారుటను సూచింపబడినది. 'శిలాదిత్య'లో సూర్యకులజుడైన శ్రీరాముని వర్ణించుట ఆదిత్యాంశజుడై జన్మించిన ఆదిత్యుడు తరువాత శిలాదిత్యుడై రాజ్యమేలిన విషయము సూచింపబడినది. 'శిరోమణి'లో విష్ణు స్తోత్రముచే శ్రీకృష్ణుడు భారత యుద్ధమున వహించిన ప్రధాన పాత్రను, దుష్టశిక్షణ, శిష్టరక్షణను సూచించినట్లయినది. 'కుశలవ'లో శ్రీరామ స్తుతి యందు కథాసూచనయు, 'కుశలరీతి' పదప్రయోగముచే కుశలవుల ప్రసక్తియు గలవు. 'కాళిదాసు'లో 'సర్వతీ బ్రహ్మల' ప్రసక్తిచే సరస్వత్యాదులు కాళిదాసాదులుగా భూలోకమున జన్మించుటను సూచించుట జరిగినది. 'శ్రీరామజననము'న విష్ణువును తలంచుటచే శ్రీరామావతార మెత్తబోవునను విషయము సూచితమైనది. 'సీతాకల్యాణము'న శ్రీరామస్తుతివలన కావ్యార్థసూచన గలదు. 'బభ్రువాహన' యందు శ్రీవిలసిల్ల ధర్మజుని సేమముఁజిత్తమునందు గోరి'

యాగావనధుర్యుడై వెడలు నర్జును ప్రాణముఁగాచి, న కృష్ణుని స్తుతిచే స్పష్టముగా కావ్యార్థసూచనగలదు. 'పాదుకాపట్టాభిషేకము'న శ్రీరామస్తుతిచే కావ్యార్థ సూచనచేసినట్లు కననగును. 'గిరిజాకల్యాణము'న గౌరీస్తోత్రముచే స్పష్టముగా కావ్యార్థసూచన గావింపబడినది. 'ద్రౌపదీ వస్త్రాపహరణము'న పీఠికాకర్త హనుమంతరావుగారు రచించిన నాందీ పద్యమున స్పష్టముగా కావ్యార్థసూచన గలదు. 'మైసూరు రాజ్యాభివృద్ధి' లోని నాఁదీ పద్యమున శత్రువైన మారనాయకవధ స్ఫురించునట్లు గలదు. 'సత్యహరిశ్చంద్రీయము, మానాప మానము, సుఖమంజరీ పరిణయము'లలో ఆశీర్నమస్క్రియా పూర్వకమై నాందీ పద్యములు గలవు. కాని 'సునందనీ పరిణయము'న ఒకే నాందీ పద్యమున త్రిమూర్తులను, సంస్కృతాంధ్రకవులను విబుధానీకంబును స్తుతించినట్లు గలదు. 'కుశలవ'లో అష్టాదశ పద పరిమితమై నాంది యొప్పు చున్నది. ఇదియును యాదృచ్ఛికముగా ననుసరించినదనియే తలంపవలెను. 'మానాపమానము'న నాందిలో రెండు పద్యములు గలవు. అందుచే నిట ఎనిమిది పాదములు కుదిరినవి. ఇట్లు శ్రీనివాసరావుగారు కొన్నింటిలోతప్ప చాలవరకు పెక్కు నాటకములలో నాందియందు కావ్యార్థ సూచనగావించుట కననగును. వీరు పెక్కు నాటకములందు నాందీ పూర్వమే దేవతా ప్రార్థనతోపాటు పూర్వ కవిస్తుతి చేయుటయు గలదు. వీరి ప్రథమ నాటకమైన 'సునందనీ పరియణ యము' పూర్వాంతములందు బంధకవిత్వమును పొందుపరచిరి.

5.13.4 శ్రీనివాసరావుగారు పెక్కు నాటకములందు నాందిని రచించియు, చాలతక్కువ నాటకములలో ప్రస్తావనను ప్రసక్తము గావించియున్నారు. సంస్కృత లాక్షణికులు చెప్పిన పద్ధతిలో ప్రస్తావన గల నాటకము లెనిమిది మాత్రమే. అంత మాత్రముచేత తక్కిన నాటకములందు ప్రస్తావనము పరిపూర్తిగా పరిహరించియుండలేదు. 'సునందనీ పరిణయము, మదాలస, సీమంతిని, కుశలవ, కాళిదాసు'లలో నటీ సూత్రధారుల సంభాషణచే కొనసాగింపబడినది. 'సుఖమంజరీ పరిణయము, సుల్తానా చాందుబీ'లలో నటీ విదూషకసూత్రధారులతో ప్రయుక్తముకాగా, 'మానాపమానము'న పారిపార్శ్వక సూత్రధారులచే నడుపబడినది. 'మానాపమానము'న తప్ప తక్కిన పై నాటక ప్రస్తావనలలో ప్రయోగింపబోవు నాటక నామము, అందలి ఇతివృత్తము దాని

వైశిష్ట్యము తత్కర్త శ్రీనివాసరావుగారి ప్రశంసయు గలవు. కొన్ని ప్రస్తావనలలో నటీ విదూషక సూత్రధారుల సంభాషణము చిత్ర విచిత్రోక్తులతో ప్రయుక్తమగుటయేగాక హాస్యముగూడ జోడింపబడినది. 'మానాపమానము'న ఋతువర్ణనలేదు. తదితర సప్రస్తావనకములైన నాటకము లన్నింట రసానుగుణముగ వసంతర్తు వర్ణనము గలదు. 'సుల్తానా చాందుబీ'లోని ప్రస్తావనలో సూత్రధారుడుముందే నిష్క్రమింప విదూషకుడు నటీ సాహాయ్యమున తక్కిన ప్రస్తావనను కొనసాగించుచుండ నటి వసంతర్తు వర్ణనచేసి 'ఇల్లాంగ్రదను వెదకసాగిరిలను విరాగుల్'అని ముగింప నటిపై విదూషకుడు కామాసక్తుడగును. ఆమె వానిని దూషించి నిష్క్రమించును. "ఇల్లాంగ్రదను వెదకసాగి రిలను విరాగుల్" అనుటచే కాముకుడుగాక దైవప్రార్థనలతో నిష్ఠాగరిష్ఠుడై పవిత్రుడుగ కాలము గడుపవలసిన 'పాదరి' 'డాండియాగో' మేరీపై మోహపరవశుడగుటను సూచించుచున్నది. ఇందు కావ్య ప్రశంసగలదు. ఇతర నాటక ప్రస్తావనలలోను నాటకేతివృత్తము ప్రస్తావింపబడినది. అందుచేతనే యిది ప్రస్తావన అనబడుచున్నది.

ప్రస్తావనాంతమున సూత్రధారుడు పాత్రనిర్దేశము గావించి నిష్క్రమించును. ఇట్లు నిర్దేశముగావించు ప్రస్తావనాంగము లైదు విధములుగా గలవు. వానిలో కథోద్ఘాతమను నంగము మిక్కిలి ప్రసిద్ధమైనదిగా చెప్పబడినది. సూత్రధారుని మాటలను ఆత్మసంబంధిగాగొని ప్రవేశించుట కథోద్ఘాతము. 'సునందనీపరిణయము'న సూత్రధారుడు నటితో నాటకమును "సకాలమున కారంభించి జయమోలింబరిగ్రహించెదం జూడుము" అను నంతలో తెరలో "ఓరీ! యెవ్వాడవురా! రేయింబవళులు నిద్రాహారములులేక తన్మిత్రమై యధికోత్సాహంబున యత్నించుచుండు సేనాధ్యక్షుం డుగ్రసేనుం డూపిరితో నుండ జయమాలింబరిగ్రహింతు ననుచున్నవాఁడవు? చూడు నీ భరతము పట్టించెద" అని యరచి ఆవేమాటలతో రంగమున ఉగ్రసేనుడు ప్రవేశించును. 'జయమోలిన్' అను మాటను 'జయమాలిని'గా ఉగ్రసేనుడుగ్రహించి ఉగ్రుడైనాడని తలంపవలెను. ఇదెంతయు రంగమున మనోహరమై యొప్పుననుటలో సందేహములేదు. అట్లే

'మదాలస'లో సూత్రధారుడు "నటీ! మరియొకతూరి దానవారిని నుతించి సభాసదులకు మ్రొక్కి-కథకు నారంభింతము" అనగానే తెరలో "సమస్త లోక సృష్టిస్థితి సంహారంబులకుఁ గర్తనై జగద్భర్తనై నేనుండ, 'దానవారి' యని ప్రల్లదంబులాడు వాడెవ్వఁడు? ప్రాణాపేక్ష నుపేక్షించెఁగాఁబోలు. వాని గుండె జీల్చెద." అని పాతాళకేతుడరచి, అదే మాటలతో రంగమున ప్రవేశించును. ఇందు కథోద్ఘాతమను ప్రస్తావనాంగము ఎంతయు మనోహరముగా నొప్పు చున్నది. 'మానాపమానము'న కథోద్ఘాతము వంటి ప్రస్తావనాంగము కలదు. సూత్రధారుడు పారిపార్శ్వకునితో నటి ప్రవేశింపక పోవుట కారణమడుగుచుండ తెరలో "నేను రాను. రానని ఖండితముగఁ జెప్పుచున్నాను" అను మాటలు వినిపించును. అవే మాటలతో భామిని రంగమున ప్రవేశించును.

తదితర నాటకములలో ప్రయోగాతిశయమను ప్రస్తావనాంగము గలదు. సూత్రధార నిర్దిష్టపాత్ర ప్రవేశము ప్రయోగాతిశయము. "సీమంతిని"లో సూత్రధార నిర్దేశానుసారము చిత్రవర్మ సభలో నాటకారంభమును, 'కుశలవ'లో శ్రీరామ పట్టభిషేకోత్సవముతో రంగారంభమును జరిగినట్లు గలదు. 'సుభమంజరీ పరిణయము'న సూత్రధార నిర్దిష్టమైన విధముననే సుభమంజరి చెలులతో ఉద్యానవనమున విహరించుచుండ ప్రద్యుమ్న ప్రవేశము, వారిద్దరు పరస్పరము ప్రేమించుకొనుట అను రంగముతో నారంభమగును.

ఈ సూచనానంతరము సూత్రధారుడు నిష్క్రమించుట పరిపాటి. కాని ఇందు సూత్రధారాజ్ఞను నిర్వహింప నటి నిష్క్రమింప ఆ వెనుకగూడ సూత్రధార విదూషకుల సంభాషణ కొనసాగినది. ఇట్లు సామాన్యముగా సూత్రధారుడు పాత్రప్రవేశమును సూచించుట గలదు. కాని 'కాళిదాసు'లో సూత్రధారుడుగాక నటి "సింధులరాజ కుమారుఁడగు భోజరాజునకుఁ బట్టంబుగట్టక ముంజరాజు తానే సింహాసన మధిష్ఠింప యత్నించుచున్నవాఁడఁట. అనేకుల కిదియిష్టములేనిపని. ఇది యెటు పరిణమించునో కాంచెదమురమ్మ." అనినట్లు

గానే రంగమారంభమగును. ఇది యిట్లుండ "సుల్తానా చాందుబీ"లో ముందే సూత్రధరుడు పాత్రాయత్తముజేయ నిష్క్రమింప విదూషకుడు నటితో సంభాషించుచు ఆమెపై తనకు గల ప్రేమను దెలుప నామె ఆగ్రహించును. అప్పుడు విదూషకు డచట నుండుట అపాయకరమని తలంచి "ఇపుడు బీజాపురము వారికి నహమ్మదు నగరువారికి యుద్ధము జరుగనున్నదట. వారిలో నొకరి వద్దఁజేరెద"అని నిష్క్రమించును. యథారీతిని సుల్తానా చాందుబీ సభదీరి అహమ్మదునగరు వారిపైకి యుద్ధమున కాయత్తమగుచుండునట్లు రంగమారంభమగును. తరువాత విదూషకుడు అస్మన్‌బేగు నాశ్రయించినట్లు తెలియును. 'సుఖమంజరీ పరిణయము'లో నాంది ప్రస్తావనలు ప్రథమరంగముగానే ప్రయోగించినట్లు తెలియును. ఇట్లు శ్రీనివాసరావుగారు ఈషద్భేదములతో సప్రస్తావనకములైన నాటకములలో ప్రస్తావనను ప్రయోగించిన పద్ధతి స్పష్టమైనది.

అయినను తక్కిన నాటకములలో ప్రస్తావనను పూర్తిగ పరిత్యజించి యుండలేదు. ఒకటి రెండు పద్యములలో ప్రస్తావనాభాసములైన వానిని పొందుపరచియే యున్నారు. "రామరాజు చరిత్రము"న నాంద్యనంతర మీక్రింది పద్యముగలదు.

"శ్రీదేవి యెచట నాశ్రిత కల్పవల్లియై
బంగారు వాన నొసంగెఁగరుణ,
మాధవు లెచ్చోట మానవ కోటిని
మాధవులుగఁజేసి మనిచిరిలను,
బుక్కరాయాదులు పుణ్యులై యెచ్చోట
రాజ్యమేలిరి రమారాజ్యమనఁగ,
రాయలవారి కర్ణాట రాజ్యంబని
రాణించి మించెనే రాష్ట్రమవని,

అట్టి విద్యామహాక్షేత్రమందు నెలమి
రామరాజ్యంబుగా నేలె రామరాజు
వారి చరితంబు నాటకాధారముగను
జేసెఁ గోలాచల శ్రీనివాసుఁడెలమి."

ఇందు విజయనగరవైభవము, దానిని రామరాజ్యముగా రామరాయలు పరిపాలించిన విధమును, దానిని శ్రీనివాసరావుగారు నాటకముగ రచించినట్లు ప్రస్తావింపబడుటచే నిది ప్రస్తావనతో సమానమై యున్నది. అట్లే 'శిలాదిత్య,' 'మైసూరు రాజ్యాభివృద్ధి' 'శిరోమణి', 'ప్రతాపాక్బరీయము', 'పాదుకా పట్టాభిషేకము' అను నాటకములందు ఆ యా నాటకేతివృత్తముల ప్రస్తావించుచు నాటక కర్తనామమును దెలుపుట జరిగినది. కాని "లంకాదహనము". "కీచకవధ", 'శ్రీరామజననము', 'సీతాకల్యాణము', బభ్రువాహన నాటకములన్నింటిలోను ఇతివృత్త సంబంధి ప్రసక్తి లేక కేవలము శ్రీనివాసరావుగారి ప్రశంసాత్మక సీసపద్యము గలదు. 'ద్రౌపదీ వస్త్రాపహరణము'న నాంది వ్రాసిన పీఠికాకర్త హనుమంతరావుగారు ముందు నాటకములలోని శ్రీనివాసరావుగారి ప్రశంసగల తేటగీత పద్యమును చేర్చినారు. ఇంక 'రుక్మాంగద', సత్య హరిశ్చంద్రీయము, ప్రహ్లాద, చంద్రగిర్యభ్యుదయము, గిరిజాకల్యాణము"నను నాటకములలో ప్రస్తావనా ప్రసక్తియే గాదు పైనాటకములలోని వంటిదైన నాటక కర్తృ ప్రశంసాత్మక పద్యముగూడ లేదు. ఇట్లు శ్రీనివాసరావుగారు ఐదారు నాటకములలో తప్ప తక్కిన వారిలో ప్రస్తావన గాని, ప్రస్తావనాభాసములైన పద్యముల చేర్చుటగాని ప్రసక్తము గావించిరని స్పష్టమైనది.

5 18 5 భరత వాక్యము గూడ శ్రీనివాసరావుగారి ప్రథమ నాటకము' 'సునందనీ పరిణయము'లో మాత్రము గలదు. 'సుఖమంజరీ పరిణయము, మదాలస'లలో ఆ యా నాయికానాయకుల వివాహానంతరము మంగళ మహశ్రీ వృత్తము గలదు. 'సత్యహరిశ్చంద్రీయము'నను మంగళ మహశ్రీ వృత్త మున్నది. సుల్తానా చాందుబీలో భరత వాక్యము లేదు. కాని మేరీ ఆల్మేడాల

ప్రార్థనతో నాటకము ముగియుచున్నది. 'రుక్మాంగద, ప్రహ్లాద'ములలో దైవ ప్రార్థనాశీర్వాదములతో నుండుటచే భరత వాక్యమును పరిహరించియుందురు. కాని సీమంతిని, రామరాజు చరిత్రము, చంద్రగిర్యభ్యుదయము, ప్రతాపాక్ప రీయము, మానాపమానము నను వానిలో పూర్తిగా నీ భరతవాక్యమునకు అవ కాశము లేకపోయినది, తక్కిన నాటకములలో భరత వాక్యములేదు. కాని మంగళము పాటలో నివియన్నియు ముగియుచున్నవి. ఇట్లు నాందీప్రస్తావనా భరత వాక్యములను ప్రయోగించిరి.



# ౬. పాత్రపోషణ చాతుర్యము

౬. ఇతివృత్త నిర్మాణ దక్షతతోపాటు సన్నివేశములను కల్పించి, పాత్రపోషణచతురముగా చేయుటయందు నాటక కర్తకు సామర్థ్య ముండి తీర వలెను. సన్నివేశముల మీదనే నాటక మాధారపడియుండును. కథావస్తునంద రెరిగినదే యైనను ఉచిత రీతిని సన్నివేశములను కల్పించి తన్మూలమున నాటక మునకు గౌరవమును కొనిరావలెను. పూర్వపూర్వ సన్నివేశము లుత్తరోత్తర సన్నివేశములకు కారణములగుచు నాటకమునకు శోభనాపాదించుచుండనగును. అప్పుడే నాటకము సహృదయ హృదయములకు హత్తుకొని మరపురాకుండ నుండగలదు. శ్రీనివాసరావుగారిలో నీ సన్నివేశకల్పనా సామర్థ్యమునకే మాత్రము కొదవలేదు. నాటకములలోని సన్నివేశములు ప్రధానముగ నాటక కథాగమమున కుపకరించుచుండును. పాత్రల మనఃప్రవృత్తుల ప్రకటించు టకును కొన్ని యుపయోగపడును. ఉభయ ప్రయోజనములు గలవి గూడ లేకపోలేదు. రావుగారి కొన్ని నాటకములలో సమాన సన్నివేశములునుగలవు.

శ్రీనివాసరావుగారి నాటకములన్నిట చాలవరకు ప్రథమ సన్నివేశముల లోనే నాటక కథా పరిచయము గావించుటయు పాత్రల ప్రాధాన్యమును తెలుపు టయు జరిగినది. వీరి నాటకము లందలి ప్రతి సన్నివేశము కార్యమునకు తోడ్పడునదై, రస నిర్భరమై యుండును. కథకు, పాత్రల గుణశీలస్వభావ ములకు వివరణము వంటివైన కొన్ని ముఖ్య సన్నివేశములు గలవు. 'రామ రాజు చరిత్రము'న రామరాజు నాజ్ఞతో అతని కొలువున సంగీత సభ చేసిన యొక సంగీతజ్ఞునకు బహ్మనీ సుల్తానులచే బహుమతి నిప్పించుటకు పటాణి సంగీత విద్వాంసునితో పాటు విజయనగరము నుండి బీజాపురమున కేగును. దీనినే అదనుగా గ్రహించి, బహ్మనీ సుల్తాను లేకమైనచో పటాణి తనకు సాధ్య మైనంతవరకు విజయనగర వినాశమునకు ప్రయత్నించుతుననియు, రామరాజు కంఠము నుత్తరించుతుననియు తన ప్రతినను పునరుద్ఘాటించును. బహ్మనీ సుల్తా నులు సంతసించి సంగీత విద్వాంసు నవమానించి విజయనగరమునకు పంపి

వేయుదురు. ఇదియే కారణముగ బహ్మనీ సుల్తానులకు విజయనగర రాజులకు యుద్ధము సంభవించును. ఆ యుద్ధరంగమున రామరాజు సైన్యమునకు సర్వాధినేతగా నుండి పటాణి రామరాజు కంఠమును ఛేదించుట జరిగినది. ఇట్టి సన్నివేశము కథకంతయు ప్రాధాన్యమును వహించినది.

ఈ సందర్భమున తన తల్లి మహబూబును కలిసికొనుటయు, తానెన్నియో దినముల నుండి తెలిసికొనవలెననెడి రహస్యచ్ఛేదము గావించుటయు జరిగినది. తల్లితో పటాణి తన తండ్రి విషయమై ఎన్ని మార్లడిగినను ఆమె సరైన సమాధానమీలేదు. కాని పట్టుబట్టి తల్లిని గ్రుచ్చి యడుగుటయు మాటల సందర్భమున రామరాజే యతని తండ్రి యని ఆమె చెప్పుటయు సంభవించినది. రామరాజే తన తండ్రియని తెలిసిన పటాణి మానసికస్థితి మరింత క్లిష్టతమమైనది. తన తండ్రిగా కాక కేవలము రాజుగానే యుండినచో తాను పూనిన ప్రతినను నెరవేర్చుకొనుట అతి సులభమయ్యెడిది. తన తండ్రియని తెలియుటచే తన మార్గము కష్టతమమైనది. తన స్వామియు, తండ్రియు నైన రామరాజును వధింపబూనుట మహాపాపము. వధింపక పోవుటచే ప్రతిజ్ఞాభంగము కలుగును. ఈ పరస్పర విరుద్ధ భావములకు కలిగిన సంఘర్షమే నాటకమునకు వన్నె చేకూర్చిన నాటకీయత. ఈ నాటకీయత లేనిదే ఉత్తమ నాటకము కానేరదు. ఈ ద్వైధీభావమే చివరి వరకు నాటకమును నడిపినది. అయినను కర్తవ్యము పటాణి యందు ప్రాధాన్యము వహించుటచే రామరాజు కంఠమును నరికి ప్రతిన నెరవేర్చుకొన్నను, తరువాత మిక్కిలి దురపిల్లినాడు. ఇట్టి సన్నివేశము నాటకము నందంతట నల్లుకొని జిగిబిగిని కలిగించినది.

మొట్టమొదట విజయనగరమున పటాణి ప్రవేశింపగనే తందాన పాటల వలన రామరాజు మహమ్మదీయ స్త్రీ, మతములకు గావించిన అవమానము తెలిసికొని తద్వినాశముచేయ ప్రతిన బూనును. ఈ సన్నివేశము నాటక కథకు బీజప్రాయము. అదియే నాటక క్రమదశలలో విస్తరిల్లుచు ప్రాధాన్యము వహించి చివరికి ఫలరూపము నొందును. ఇట్లు రామరాజు చరిత్రమున నీ సన్నివేశములు చాల ప్రాధాన్యమును వహించినవి.

"ప్రతాపాక్సరీయము"న పాదుషా సేనతో యుద్ధము చేయ వెనుకాడు చున్న ఉదయసింగును ప్రోత్సహించి, యతనితోపాటు ప్రియురాలు కమల పురుష వేషమున యుద్ధము చేసి విజయముతో తిరిగి వచ్చిన వెనుక సభాస్థాన మున సేనాధిపతులను లెక్కచేయక ఉదయసింగు కమలను పొగడును. అందుకు రవివర్మ మొదలైన సేనాధిపతులు గినియుదురు. అందులో ప్రభాకర రావను నొక సేనాని కమలను నిండు సభలో వధించును. సేనాను లందరు వెడలిపోవుదురు. ఉదయసింగు వారు నేమిచేయలేక ప్రియురాలి మీది వ్యామోహ ముచే మిక్కిలి దుఃఖమున దురపిల్లును. అతడు చిత్తూరులో నుండక రాజ ధానిని ఉదయపురమునకు మార్చుకొని వెడలిపోవును. రాజులేమిచే - పౌరు లెంతగ ఎదిరించి మరణించినను - చిత్తూరు శత్రువైన అక్బరు వశమై పోవును. క్రమముగ హైందవశక్తి సన్నగిల్లుచు వచ్చును. ఉదయసింగు మరణానంతరము ప్రతాపుడు రాజయి అరణ్యములందే యుండి, శత్రు సమూహముల నెదిరించు చుండవలసివచ్చెను. అంతిమ విజయము ప్రతాపునిదే. ఇట్లు పై సన్నివేశము ప్రతాపాక్బరీయ నాటకమునకు ఆధారభూతమైనది.

"రుక్మాంగద"లో విష్ణ్వారాధనమున కమలములు తక్కువగుటకు కారణ మరయునట్లు రుక్మాంగదుడు భటుల కాజ్ఞాపింప వారు విశ్వావసుడను గంధ ర్వుని బంధించి యతని విమానమును కాల్చివేయుదురు. ఈ సన్నివేశమును శ్రీరావుగారు కల్పించిరి. విశ్వావసుని విమానము కాల్చివేయుటచే స్వర్గమునకు బోవ వీలులేకపోగా ఏకాదశీ దినముపవాసముండిన వారి యుపవాసఫల మొసగిన తన్మహిమచే తాను పోగలనని చెప్ప రుక్మాంగదుడట్టి వారికై అన్వేషణచేయింప, చాకలి దుర్గి అత్తమీద కోపముచే నుపవాసముండినట్లు తెలిసి,దాని నతనికి ధార పోయించుటచే నతడు స్వర్గమునకు పోవుటయు జరిగినది. ఏకాదశీ వ్రతము చేయుట ఎంతయు ప్రయోజనకరమని తలంచియు, నారదునిచే బోధింపజేసియు దానిని చేయ రుక్మాంగదుడు పూనును. తరువాతి కథయంతయు పై సన్నివేశము మీదనే యాధారపడియుండుట గమనింపవలెను. రావుగారు గావించిన మార్పు లలో దీని ప్రయోజనము విపులముగా వివరించియే యున్నాను.

'బభ్రువాహన'లో అర్జునుని సవనాశ్వముబట్టుట వలన అపజయమే కల్గు నని, వలదని అగ్నిదేవుడు మామ యగు నీలధ్వజునకు హితముపదేశించును-

నీలధ్వజు డంగీకరించును. అతని భార్య జ్వాలాదేవి నీలధ్వజుని మిక్కిలి నిందించును. ఆమె నిందను సహింపలేక నీలధ్వజుడర్జునునితో యుద్ధముచేసి పరాజయముపొంది వెనుదిరిగిరాగా, జ్వాలాదేవి, కుపితయై భర్తను దూషించి తన సాహసముజూప వెడలిపోవును. ఈ సన్నివేశములమీదనే కథ యంతయు నాధారపడినది. జ్వాలాదేవి వెడలిపోయి గంగాదేవిచే అర్జునునకు శాపమిప్పించి బభ్రువాహనునకు బాణమై యర్జునుని తల ఖండించును. కనుక పై సన్నివేశములు లేనియెడల కథ నడచి యుండెడిదికాదు. శ్రీనివాసరావుగారి సన్నివేశ కల్పనా సామర్థ్య మిట్లవగత మగుచుండును.

'సత్యహరిశ్చంద్రీయము'లోను విశ్వామిత్రు డింద్రసభలో వసిష్ఠునితో పందెము వైచుకొని హరిశ్చంద్రుని బొంకింతునని వచ్చి, యజ్ఞాంతమున హరిశ్చంద్రుడు బ్రాహ్మణులకు భూరిదక్షిణ లొసగుచుండ నతని యొద్దకేగి యెనిమిది కోట్ల ధనము దానమడిగి తరువాత గైకొందునని యుక్తితో వెడలిపోవుట తరువాత కథ కంతయు చాల ప్రధానమైన విషయము. ఈ సన్నివేశములేనిచో తరువాత విశ్వామిత్రుడెన్ని యుక్తులు పన్నినను ఉపయోగముండెడిది కాదు.

6.1 పాత్రల మనఃప్రవృత్తులను స్పష్టముచేయుటకై రచించిన సన్నివేశములును గలవు. ఇట్టి సన్నివేశములను కొన్నింటిని పాత్రపోషణ చాతుర్యమున ఉదాహరింతుము. 'సునందనీ పరిణయము'న మంత్రి సుమతి పుత్రుడు కుబేరుడు సునందని యొద్దకేగి తన మోహమును దెలిపి వివాహమాడుమని కోరును. సునందని అది ఉచితముకాదని హితముపదేశింప, నతడామె పాదముల బట్టుకొనును. వివాహమాడుదునని సునందని యుక్తితో తప్పించుకొనును. ఈ సన్నివేశముచే సునందని ఉత్తమ శీలము, యుక్తి మొదలైన గుణములును, కుబేరుని అవివేకము, అనుచితజ్ఞత మొదలైన వానిని రావుగారు స్పష్టము చేసిరి.

'సుల్తానా చాందుబీ'లో ఖండోజీ ధోండోజీల సంభాషణా సన్నివేశముచే మేరీ ఆల్మేడాల పరిశుద్ధాత్మలును, డాండియాగో దౌష్ట్యమును స్పష్టము చేయబడినవి.

'శిరోమణి' యందు భారతయుద్ధారంభ సమయమున ద్రౌపది భీష్ముని యొద్దకేగి భర్తృ విజయము నాకాంక్షించిన సన్నివేశమున ఆమె పాతివ్రత్యము, భీష్ముని పక్షపాతము స్పష్టమగును. ఈ సన్నివేశము రావుగారి కల్పన. మూలమున లేనిది. ద్రోణుని స్వగతమున ఆతని నిర్మల హృదయమును, దుస్సలాసైంధవుల సంభాషణా సన్నివేశముచే దుస్సల ఉచితజ్ఞత, సైంధవుని గర్వము, మౌర్ఖ్యము మొదలైన దుర్గుణములు స్పష్టములైనవి.

'ప్రతాపాక్బరీయము'న 'నౌరోజు సంతలో' ప్రతాపవతిని బలాత్కరింప బోయి అక్బరు ఆ మహాపతివ్రత వలన బాకుతో సమాధానముగొనిన సన్నివేశము ఆమె పాతివ్రత్య, సాహసవీరములను, అక్బరులోని పరనారీ వ్యామోహమును విశద పరచుచున్నది.

'పాదుకాపట్టాభిషేకము'నందు దశరథుని వలన వరముబొంది రాముని నరణ్యమునకు పంపివేసిన వెనుక దశరథుడు పుత్ర విరహమువలన క్రుంగి కృశించిపోవుచుండ, తన గతియేమగునోయని బాధపడినకైక దుష్ట స్వభావకాదని, ఆమె నైజస్వభావము వెల్లడి యగును. అట్లే భరతుడు అయోధ్యకు వచ్చి జరిగిన సంగతులు తెలిసికొని తల్లిని దూషించి కౌసల్య ననునయింపబోయి ఆమెతో సంభాషించు సన్నివేశమున భరతుని రాజ్యముపై నేవగింపును, భ్రాతృప్రేమయు స్పష్టమగును.

'మానాపమానము'న విలాసధర లక్ష్మీధరులు భామినిని మెప్పింప ధైర్యమును జూపుటకై యుక్తి నాలోచించు సన్నివేశమున లక్ష్మీధరునకు ధనము, నగలు వీనిపై గల వ్యామోహమును, అతడు పిరికిపంద యను విషయమును వెల్లడియగుచున్నవి. ఇట్లా యా సన్నివేశములచే వ్యక్తుల గుణశీల స్వభావములు వెల్లడియగునట్లు రావుగారు కల్పించిరి.

6.2 కథకుపకరించుచు, పాత్రల మనోవృత్తులను స్పష్టముచేయుట కుపకరించు సన్నివేశములును వీరినాటకములలోగలవు. 'రామరాజు చరిత్రము'న రామరాజు కొలువుదీరి యుండ ముద్గల్లు నవాబు పుత్రి అషాబీబి యొక సేనాని బంధించికొనివచ్చును. రామరాజామె ముసుగు దీయించును. ఆమె మిక్కిలి

దూషించును. తరువాత తిరుమలాంబ ప్రవేశించి తన యొద్ద నంతఃపురమున నుండునట్లు రామరాజు అనుమతిని బొంది కొనిపోవును. ఆషాబీ ముసుగు దీయించు సమయమున పటాణి మిక్కిలి కుపితుడై పండ్లు కొరకుచు నొరలోని కత్తిదీసి సమయముకాదని యెంచి కోపోద్రిక్తతను తగ్గించుకొనును. ఇందు రామరాజు చతురుపాయోపేత రాజకీయ తంత్రములనెడి గొప్ప గుణములతోపాటు మహమ్మదీయ స్త్రీలనవమానించుట యను దుర్గుణలేశమును, ఆషాబీ స్వమతాభిమానము, తిరుమలాంబ కరుణార్ద్ర హృదయమును, పటాణి మానసిక స్థితియు స్పష్టములైనవి. ఈ దుర్గుణముచేతనే రామరాజు పతనమైనట్లును తెలియును. అనగా నీ సన్నివేశమే తరువాతి కథకు ప్రధాన విషయమనుటయు స్పష్టమే. తన మత స్త్రీకి జరిగిన అవమానమును కన్నులారగాంచిన పటాణి తన ప్రతినను ఆషాబీయెదుట పునరుద్ఘాటించి రామరాజు నాశమునకు యత్నించినట్లు తెలియును. ఇట్టి సన్నివేశము కథాగమనమున కుపకరించుటయేగాక, పాత్రల చిత్తవృత్తులను గూడ స్పష్టము చేసినది.

'సుల్తానా చాందుబీ'లో చాందుబీ సభచేసి అస్మన్‌బేగు కావించిన దౌష్ట్యములను విచారించు సన్నివేశముచాల ప్రధానమైనది. కథకు సంబంధించిన పూర్వాపరములును, ప్రధాన పాత్రల మంచి చెడులును నిట సువ్యక్తములైనవి.

'కాళిదాసు'లో ముంజునాజ్ఞతో భటులు బాలుడైన భోజుని కొనిపోయి వధించు సమయమున వీరయోగి, బుద్ధిసాగరుడు, సేనాని యను వారతనిని రక్షించు సన్నివేశము ముఖ్యమైనది. ఇందు ముంజుని దౌష్ట్యము, భోజుని యుత్తమ గుణములు, వీరయోగి, బుద్ధిసాగరుల దయాహృదయములు వెల్లడియైనవి. కథయు దీని మూలముననే నడచినది. భోజుడు ముంజుని దౌష్ట్యమును క్షమించుటయేగాక, యతడే యా రాజ్యమునేలునట్లుగా, హితోపదేశార్థము త్తరము వ్రాసిపంపి తాను వెడలిపోవును. భోజుని యుత్తరమువలననే ముంజునకు హృదయ పరిణామము జరుగును. కనుక కథయు దీనిపై నాధారపడియున్నది. ఇట్లే విద్యాపరిపూర్తిని పురస్కరించుకొని మదనసేన గురువు గౌతముని సమ్మానింపరాగా అతడు బలాత్కరించును. అదే సమయమున

రాజురాగా మదనసేన గండము గడచినది. అయినను గురువునుగూర్చి తండ్రితో మంచిగనే చెప్పినది. అందుకు రాజు సంతసించి గౌతముని ఆస్థానపండితునిగ నియమించును. ఈ సదవకాశమును గ్రహించి గౌతముడు మదనసేన కనర్థము జేయబూనును. దీనిపైనే కథ యంతయు నాధారపడినది. గురువు తన్నవ మానింపదలచినను, తండ్రితోగురువుపై నిందమోపని మహోపకారిణి మదనసేన, దుర్మార్గుడైనను సమయస్ఫూర్తిచే రాజపూజితుడైనవాడు గౌతముడు. విష యము నెరుగని అమాయకుడు రాజు. ఇట్టి సన్నివేశము కథకును, పాత్రల మనః ప్రవృత్తులను దెలుపుట కాకరమై యొప్పుచున్నది.

'పాదుకాపట్టాభిషేకము'న కైకకు మంథర దుర్బోధగావించు ఘట్టము చాల ప్రధానమైనది దేవకార్యార్థమై రామపట్టభంగముగావింప మంథర తలచి నట్లు రావుగారు కల్పించిరి, మంథరయెంతగా దుర్బోధచేసినను కైక మనసు మాత్రము రామపట్టభంగమున కిచ్చగింపలేదు. ఆమె నిర్మల హృదయము స్పష్టముగా తెలియును. ఆమె మంథర దుర్బోధవలననే మారినదని స్పష్ట మగును. ఇట్లు మంథరా కైకల నైజ ప్రవృత్తులతోపాటు ఈ సన్నివేశము పైనే కథయంతయు నాధారపడి యుండుట గమనింపదగినది. ఇట్లు శ్రీనివాస రావుగా రుభయప్రయోజన సంపాదనార్థము సన్నివేశముల కల్పించి తమ సామర్థ్యమును, నైపుణ్యమును ప్రకటించిరి.

6.3 శ్రీనివాసరావుగారి నాటకములందు సమాన సన్నివేశములు గలవు సాధారణముగ నాయిక చెలికత్తెలతో నుపవనమున పుష్పాపచయ మున నుండ నాయకుడు వేటకైవచ్చినాయికనుగాంచి మోహించుట కొన్ని నాటక ములందు సమానముగ కలదు, సునందనీ పరిణయము, సుఖమంజరీ పరిణ యము, సీమంతిని నాటకములందిది స్పష్టము. కాని యివి సమానములైనను వీనిలో ప్రతిపాదిత విషయములు విశిష్టముగా, ప్రత్యేకముగా నున్నవి. ఉదాహరణమునకు సునందనీ పరిణయమున సునందని స్నేహితురాలైన మంత్రి సుమతిపుత్రి జయమాలినితో నితర సఖులతో వనవిహారముచేయుచుండ సుదేవుడు మృగయార్థమువచ్చి అలసి ఉపవనమున విశ్రమించి సునందనిని గాంచుట తటస్థించును. ఇది అన్నినాటకములలోను నుండును. కాని జయమాలినిగూడ

సుదేవునిగాంచి వానిని వివాహమాడ నిశ్చయించుకొని, మందిరమునకేగిన వెనుక తండ్రికితెలిపి అతనిని భర్తగా గూర్పుమని వేడును. సుమతి అంగీకరించును. దీని యాధారముగా సుమతికి గల రాజ్యదురాశను ఫలింపజేసికొనుట కవకాశము కలుగును. ఇట్లు నాటక కథ కిది యుపకరించుచున్నది.

ఇంక 'రామరాజు చరిత్రమున' అషాబీ పటాణులును, 'మదాలస'లో రెండవసారి మదాలసా కువలయాశ్వులును, 'మైసూరు రాజ్యాభివృద్ధిలో' జగదంబా యదురాయలును, 'ద్రౌపదీ వస్త్రాపహరణము'న ఉలూచ్యర్జునులును, 'బభ్రు వాహన'లో ప్రమీలార్జునులును వనములలోనే కలిసికొందురు. "మదాలస"లో ప్రప్రథమమున మదాలస ఉపవనవిహారమున నుండ పాతాళ కేతుడపహరించు కొనిపోవును. 'శిలాదిత్య'లో నవమాలిక వనమున విహరించుచుండ మదనుడు మదనిక వేషమునవచ్చి యామెను మోసగింపబోయి వంచితుడగును. ఇట్టివి సమానములై యున్నవి.

'సుఖమంజరీ పరిణయము'న సుఖమంజరీ స్వయంవరము, 'సీతాకల్యాణము'న సీతాస్వయంవరము, 'ద్రౌపదీ వస్త్రాపహరణము'న ద్రౌపదీ స్వయంవరము ననునవి సమానసన్నివేశములు.

'సీతాకల్యాణము'న యాగరక్షణార్థము రాముని పంపుమని విశ్వామిత్రు డర్థించినట్లు, 'మదాలస'లో యాగసంరక్షణముకొరకు ఋతుధ్వజుని పంపుమని గాలవుడు కోరుట సమానసన్నివేశములు. ఇట్లు శ్రీనివాసరావుగారు కథాగమనమున కుపకరించునట్లును, పాత్రల విభిన్న మానసికస్థితులను వ్యక్తముచేయుటకును అనేక ప్రధాన సన్నివేశములను, సమాన సన్నివేశములను కల్పించి, వానిలో వైశిష్ట్యమునుగూడ సంపాదించి ప్రతిభను ప్రకటించిరి.

## 6.4 పాత్రపోషణ చాతుర్యము :

నాటకమున సన్నివేశ కల్పనముతోపాటు ఉచితరీతిని పాత్ర పరిపోషణ ముండు టెంతయు నవసరము. పాత్ర చిత్రణమునుగూర్చి సంస్కృతలాక్షణికులు ప్రత్యేకముగా చెప్పలేదు. పాశ్చాత్య నాటకములలో పాత్ర చిత్రణమతి ప్రధానాంగమై యొప్పుచున్నది.

అరిస్టాటిల్ పండితుడు నాటకమునందలి యితివృత్తమునకు ప్రథమ స్థానమును, పాత్రలకు ద్వితీయస్థానమును ఒసంగెను.[1] ఇతివృత్తమునందు కార్యము (Action) ప్రాధాన్యమును వహించుటచే నదియే ముఖ్యమని, పాత్రలు తరువాత పరిగణింపదగినవని అతని భావము. కాని హడ్సన్ అట్లుగాక పాత్ర చిత్రణగూడ నాటకమున అత్యధిక ప్రాధాన్యముకలిగి యుండునని చెప్పెను.[2] బహుశః అరిస్టాటిల్ మాటల ననుసరించియే కొందరు నాటకమునందలి యితివృత్తమే ప్రధానమనియు, పాత్రచిత్రణము అప్రధానమనియు నమ్మిరి కాని ఇతివృత్తమెంత ప్రధానమైనదో, పాత్రచిత్రణగూడ అంతే ప్రాధాన్యమును వహించుననుటలో సందేహమక్కరలేదు. హెన్రీఆర్థర్జోన్స్ చెప్పినట్లు ఇతివృత్తము, అనేక సన్నివేశములు ఉన్నంత మాత్రమున ప్రయోజనము లేదు. వానిననుసరించి పాత్రచిత్రణ ముఖ్యముగా పాత్రల శీలస్వభావములను అభివ్యక్తము చేసినప్పుడు మాత్రమే నాటకము రాణించును. ఉత్తమ నాటకమునకు పాత్రచిత్రణ మపరిహార్యమైన గుణము. తల్లక్షణ సమన్వితమైన నాటకము ప్రాధాన్యమును వహించుటయేకాక శాశ్వతత్వమునుగూడ సంపాదించుకొనును. నాటకమునందలి కథా ప్రాముఖ్యముననుసరించియే సాహిత్యమున దానికొక స్థిరత్వమేర్పడునని ఏ నాటకకర్త సంతృప్తిపడలేదు. నాటకము నందలి స్త్రీ

---

1. 156 పు 27, 28.

2. (i) 162. పు. 186-198 (ii) 11. పు. 129-134.

పురుషపాత్రల మూలముననే నాటకము విశిష్టమైనదిగా పరిగణింపబడును. 'మేక్బెత్తు' నాటకమున 'మేక్బెత్తు'చేయు వధాకార్యమునగాక "మేక్బెత్తు" పాత్ర శీలస్వభావములవలననే విశిష్టమైన "ట్రాజెడీ"గా ప్రఖ్యాతిగాంచినది. షేక్స్పియరు నాటకములన్నింటిలోను ఆ యా పాత్రల మనస్తత్వ చిత్రణ విశిష్టమై ఉప్పారుటచేతనే వానికి సార్వజనీనత కలిగినదనవచ్చును. కాబట్టి నాటకమున పాత్రల మనస్తత్వచిత్రణముండి తీరవలెను.

నాటక పాత్ర చిత్రణలో తదేకధ్యాస విధిగా ఉండవలసినగుణము. అనుచితములను పరిహరించి సముచితరీతిని పాత్రల సంవాదము నాటకమున నుండి తీరవలెను. పాత్రల సంవాదమునందలి ప్రతిపదము అర్థవంతము సాభిప్రాయయమునై పాత్రల శీలస్వభావముల నభివ్యక్తము చేయునదైయుండ వలెను. వస్తువు ననుసరించి పాత్రఉండవలెను. నాటకమునందలి నాయకుడు లేదా ప్రధానపాత్ర గుణములను స్పష్టపరచునట్టి సంభాషణా సమన్వితమై, నాటక కార్యము (Action)ను ప్రభావిత మొనర్చునట్టిదిగా నుండనగునని Prof Tolman అభిప్రాయము. కనుక నాటకమున ఏ ఏ పాత్ర ఎంత ఎంత వరకు ఆవశ్యకమో గుర్తెరిగి నాటకకర్త చిత్రింపవలెను.

నాటకమున సంక్షిప్తత కంటె పాత్రలో తాదాత్మ్యము చెందుట ప్రధాన గుణము. నవలాకారుడు నవలలోని స్త్రీ పురుష పాత్రలతో తానొకడై చరించుచు ఆ యా పాత్రలకు సంబంధించిన విషయములను విమర్శింపవచ్చును. కాని నాటక కర్త కిది సాధ్యము కాదు; కాకూడదు. నాటక కర్త పాత్రలకు దూరముగా నుండవలెను. ఇట్లు పాత్ర చిత్రణ విషయమున నవలాకారునకు సౌలభ్యమెక్కువ. కాని నాటక కర్త కతిక్లిష్టమైన విషయము. నాటకకర్త తాను స్వీకరించు ఇతివృత్తము మూలమునను, ఆ యా పాత్రల సంభాషణల వలనను పాత్రల శీల స్వభావములను, గుణగణములను వివరింపవలసి ఉండును. సాధారణముగా నాటకేతి వృత్తము పాత్ర చిత్రణకు సాధనమను సంగతిని మనమలక్ష్యము చేయుదుము. కాని నాటక కార్యము (Action) పాత్రాభిప్రాయమును తెలుపుటయే గాక ధ్వనింపజేయును.[1] ఉత్తమ నవలలో

1. "Yet action cannotes and implies it." 162. పు. 30.

వలెనే సముచితమైన ఇతివృత్తముగల నాటకమున గూడ కథ పాత్ర చిత్రణముపై నాధారపడియుండును. నానావిధ సన్నివేశములలో వివిధ విధములైన భావ సంకీర్ణతతో కూడిన ఆ యా పాత్రలు పరస్పర ప్రభావితములగుచు, సంఘర్షితములగుచు సువ్యక్తములు కావలెను. తద్ద్వారమున కథానిర్మాణములోని సన్నివేశములందు ఆ యా పాత్రల స్వభావములు, అభిప్రాయములు, మనోభావములు, ఇతివృత్త క్రమ వికాసమున నభివ్యక్తములయితీరును.

పాత్రల శీల స్వభావములు స్పష్టముగా తెలియుటకు పాత్రల కార్యముతో పాటు సంవాదము ప్రాధాన్యమును వహించును. నాటకమునందు సంభాషణ అపరిహార్యమైన లక్షణము. నాటకీయ సంభాషణలు పాత్రల చిత్తవృత్తులను రెండు విధములుగా తెలుపునని చెప్పవచ్చును. ఆ యా పాత్రలు ఆ యా సన్నివేశములందు వివిధ భావ సంఘర్షణలలో ఇతర పాత్రలతో పలికిన పలుకుల వలన ఆ పాత్రల శీల స్వభావములు తెలియును ఇది మొదటి పద్ధతి. నాటకము నందలి ఇతర పాత్రలు ఒక పాత్రను గూర్చి ఆ యా సమయానుకూలముగా చేసిన విమర్శలవలన తెలియుట రెండవ పద్ధతి. మొదటి పద్ధతి సంభాషణలో పాత్రల శీల స్వభావములు మొదటినుండి చివరివరకు స్పష్టమగుచుండును. అనాలోచితముగాను, ధ్వన్యాత్మకముగాను తనకు తానే పలికిన సంభాషణలలో పాత్ర చిత్తవృత్తులు సుస్పష్టమగును. సంవాదమునందు పాత్రల మాటలచేతనే పాత్రచిత్రణచేయుట ప్రధాన సాధనమే కావచ్చును. కాని ఒక పాత్రను గూర్చి ఇతర పాత్రలు ఎదుటగాని, పరోక్షమునగాని పలుకు మాటలే పాత్ర చిత్రణకు చాల విశిష్టమైన మార్గమనవచ్చును. ఈ పరోక్షపద్ధతిలో జాగరూకత అవసరము. ఒక పాత్రనుగూర్చి ఇతర పాత్రలు పలికినపల్కులు సందర్భానుసారముగ నున్నవా, అత్యధిక ప్రీతితో గాని, మిక్కిలి ద్వేషము చేతగాని వెలువడినవా అను సంగతిని సవిమర్శకముగా మనము చూడవలెను. వీని నాధారముగా గొని ఒక పాత్ర శీల స్వభావములను నిర్ణయింపవలెను. ఇది పాత్ర చిత్రణలోని పరోక్షపద్ధతి.

నాటకము నందొక పాత్ర విభిన్న స్థితిలో నుండి ఇతర పాత్రలకంటె విశిష్టముగా పల్కునట్లగపడును. ఇట్టి పాత్ర గ్రీకు నాటకములోని Chorus వలె నాటక పాత్ర శీల స్వభావములను తెలుపుట కుపకరించును. సామాన్య

ముగా నిట్టి పాత్రల వలన నాటక కర్త ఎంతో జాగ్రత్తతో తన అభిప్రాయములను స్పష్టము చేయును. కనుక పాత్రల స్వభావములను వీనిచే నిర్ణయింప వచ్చును. వీనికి తోడు పాత్ర గుణ శీలములను, ఆంతరిక విషయములను తెలుపుటలో బాగుగా నుపకరించు మరొకటి స్వగతము (Soliloquy). స్వగతముతో పాటు జనాంతికము (Aside) గా మాటాడుమాటలు గూడ ఉపయోగపడును. ఈ స్వగతము పాత్ర శీల స్వభావములను సుస్పష్టము చేయును. తనకు తానే మాటాడుచున్నప్పుడు పాత్ర తన స్వభావము మరుగుపరుచుట కవకాశము లేదు. కాని పిచ్చివారు మాత్రమే ఇట్టి స్వగతములు పలుకుదురు. కనుక నివి అసహజములని కొందరందురు. కాని పాత్రలు తమలో తాము ఆలోచించుటయే గాని, పిచ్చివారివలె పలుకుటకాదని, సామాజికులు తమ మాటను వినుచున్నట్లు గూడ గ్రహింపరు గనుక స్వగతములు సహజములని Congreve వచించెను. 19 వ శ.లోని ఫ్రెంచి, ఇతర నాటకములలో ఈ స్వగతములు సామాజికులనుద్దేశించి ప్రయుక్తమైనట్లు తెలియును. ఆధునికులు వానిని పరిహరించిరి. కనుక స్వగతమును పరిహరించుటయే ఉచితమనుట ఆధునిక పద్ధతి. కాని షేక్స్పియరు తన నాటకములలో స్వగతములను విరివిగా వాడి వానికి వైశిష్ట్యమును కొనివచ్చెను. వివిధ భావ సంకీర్ణములై క్లిష్టములైన పాత్రల శీలస్వభావములను అభివ్యక్తము చేయుటకై షేక్స్పియరు ఈ ప్రత్యేక పద్ధతి నవలంబించెను. ముఖ్యముగా ఈ కవి తన పాత్రలచే ప్రథమ స్వగతము లోనే వాని శీల స్వభావములను వ్యక్తము చేయుటకలదు. నాటకము నందలి ప్రధాన పాత్రల చిత్తవృత్తులను ఆరంభములోనే స్పష్టముచేయుట షేక్స్పియరు పద్ధతి. గ్రీకు నాటకములలో నిట్టి స్వగతము అంతగా లేకున్నను నర్మసఖులతో నాయకులు తమ హృద్గతాభిప్రాయములను తెలుపుటగలదు. ఈ పద్ధతి గ్రీకు నాటకములనుండి 'Seneca' కును, తరువాత పునరుజ్జీవనము (Renaissance) నాటి కవులకును వ్యాపించినది. ఇట్లు స్వగతము నాటకమున పాత్రల గుణశీలముల నభివ్యక్తము చేయుట కుపకరించును.

ఈ విధముగా పాశ్చాత్య నాటకమున ఇతివృత్తముతోపాటు పాత్రచిత్రణగూడ ప్రాధాన్యము వహించినదని స్పష్టమైనది.

6.5 శ్రీనివాసరావుగారు మహా మేధావియేగాక, మానవుల వివిధ మనస్తత్త్వములను సూక్ష్మముగ పరిశీలించి సమగ్రావగాహనము గావించుకొనిన మనస్తత్త్వవేత్త అనుట నిర్వివాదాంశము. కనుకనే సేవకుడు మొదలుకొని మహారాజు వరకు, నిరుపేద మొదలు ధనవంతుని వరకు, చెలికత్తె మొదలు మహారాణి వరకు, పామరుడు మొదలు పండితుని వరకు గల వివిధ వ్యక్తుల గుణశీల స్వభావములను వీరు సూక్ష్మరేఖలతో సుస్పష్టము చేయగలిగిరి. వీరు పాత్ర పరిపోషణము నందు చాలవరకు పాశ్చాత్య పద్ధతి ననుసరించినను, ప్రాచ్య పద్ధతిని సైతము విడనాడి యుండలేదు. ఈ రెండు పద్ధతుల నా యా సందర్భోచితముగా గ్రహించి పాత్ర చిత్రణము గావించి తమ చాతుర్యమును ప్రకటించిరి.

సమానాంతరత్వ, ప్రతియోగములలో శ్రీనివాసరావుగారి పాత్ర చిత్రణ మును గూర్చి కొంత వివరించితిని. ఇంక వీరు తమ నాటకములలోని పాత్రల గుణశీల స్వభావములను నాలుగైదు విధములుగ వ్యక్తము గావించినట్లు తెలియు చున్నది. పాత్రల కార్యము (Action) చేతనే పాత్రల శీలములను వివ రించుట, నాయకాది పాత్రలితర పాత్రలతో సంభాషించుచున్నప్పుడు వారి మనస్తత్త్వములు గోచరింపజేయుట, కొన్ని పాత్రలు మాటాడు సందర్భమున తదితరుల గుణములవగతము గావించుట, ఆ యా పాత్రల స్వగతముల మూల మునను పాత్రల తత్త్వములు స్పష్టము చేయుట అనునవి ప్రధానములు.

ఆ యా పాత్రల చేష్టల వలన వారి గుణశీలములు అనగా దుష్టశిష్ట గుణములు స్పష్టములగుచుండును. 'సునందనీ పరిణయము'న సుమతి, 'సుఖమంజరీ పరిణయము'న విషయసేనుడు, 'సుల్తానాచాందుబీ'లో డాండియాగో అస్మన్‌బేగులు, 'రామరాజు చరిత్రము'నందు సలకం తిమ్మయ్య, 'శిలాదిత్య'లో మదనుడు, 'చంద్రగిర్యభ్యుదయము'న జగ్గరాయడు, 'శిరోమణి'లో దుర్యోధ నుడు, 'కీచకవధ'లో కీచకుడు, "సీతాకల్యాణము, లంకాదహనము"లలో రావణుడు, "ప్రహ్లాద"లో హిరణ్యకశిపుడు మొదలైన దుష్టపాత్రల దౌష్ట్యము వారి కార్యాచరణముచేతనే వెల్లడియగుచుండును.

'సత్యహరిశ్చంద్రీయము'న చంద్రమతి కష్టములలో భాగము పంచుకొనుటయేగాక చివర దుఃఖాబ్ధిమునిగియు హరిశ్చంద్రుని సత్యసంధునిగ నిరూపించుటకై అతనిని ప్రోత్సహించుట, "రుక్మాంగద"లో సంధ్యావళి ఏకాదశీ వ్రత నిష్ఠాగరిష్ఠునిజేయ మోహినీ వ్యామోహమునుండి తప్పింప ఉపాయము పన్నుట, సత్యసంధుడగుటకు పుత్రుడైన ధర్మాంగదుని కంఠము త్తరింప రుక్మాంగదుని ప్రోత్సహించుట, 'సునందనీ పరిణయము'న జయదేవి భర్తతో పాటరణ్యమున నివసించుట, "ప్రతాపాక్బరీయము"న గౌరాంబ ఘోరారణ్యములందు భర్త ప్రతాపునితో కడునిడుమలబడుట, 'పాదుకాపట్టాభిషేకము'న సీత రామునితో నరణ్యమునకేగుట, "కుశలవ"లో రాముడు సీత నరణ్యమున పరిత్యజింపగ నామె అక్కడ కష్టములనుభవించుట అను కార్యములవలన వారి మహాపాతివ్రత్యము వెల్లడియగుచున్నది.

'సుఖమంజరీ పరిణయము'నందు సుఖమంజరి ప్రద్యుమ్నునిరక్షింప సాహసించి విపయసేనుని యొద్దకేగి ఎత్తుకు పైయెత్తువేసి వానిని వంచించి బంధించుట ప్రద్యుమ్నునిపై గల ప్రేమకు నిదర్శనము. 'చంద్రగిర్యభ్యుదయము'న కుముదిని సాహసోపేత కార్యములచేసి యాచమునకు జయము కూర్చుటకై తోడ్పడుట అతనిపై నామెకు గల నిష్కల్మష ప్రేమకు తార్కాణము. 'బభ్రువాహన'లో ఉలూపి అర్జునునకు కలిగిన శాపనివారణార్థము, అతనితో యుద్ధముచేయ బభ్రువాహనుని ప్రోత్సహించి; అర్జునుడు మరణింప, మృతసంజీవకమణిసాహాయ్యమున పునర్జీవితుని గావించుట అతనిపై ఆమె మిక్కిలి ప్రేమాకృష్టయై యుండుటయే కారణము. 'లంకాదహనము'న సీతను రామునియొద్దకు గొనిపోవుదునురమ్మని హనుమ కోరగా ఆమె నిరాకరించుట తన పతివ్రతాత్వముతోపాటు రాముని పరాక్రమమును ప్రకటించుటకే. 'పాదుకాపట్టాభిషేకము'న భరతుడు సర్వము త్యజించి రామునొద్దకరణ్యముల కేగుటయు, రాముని పాదుకలకు పట్టముగట్టి నిరాడంబరజీవితము గడపుటయు అతని భ్రాతృప్రేమకు నిదర్శనము. 'శిలాదిత్య'లో కళావతి నీచపాత్రయైనను ఉపభర్తయైన మదనని దౌష్ట్యములకనేక విధముల తోడ్పడుటయేగాక పలు విధముల మాయలుపన్ని సర్వవినాశముచేసి మదనునితోపాటు మరణించుటయు

నామె కతనిపైగల అపార ప్రేమను వ్యక్తముచేయుచున్నది. 'ప్రతాపాక్బరీయము'న కమల సానియైనను ఉదయసింగును యుద్ధమునకు ప్రోత్సహించి, తానును పురుషవేషమున యుద్ధముచేసి రాజునకు విజయనుచేకూర్చి చివర రాజునెదుటనే వధింపబడుట ఉదయసింగుపై ఆమెకు గల ప్రేమను స్పష్టము గావించును. ఇట్లాయా పాత్రల కార్యాచరణములచే పాత్రల దుష్టశిష్ట గుణములు స్పష్టమగుచుండుట వ్యక్తమైనది.

6.6 నాటకమున సంవాదము చాల ప్రధానాంశమన్నది పూర్వోక్తము. పాత్రల సంవాదమున, మాటాడుచున్న పాత్రలయు, తదితరులయు శీల స్వభావములను చిత్రించుట అతి ముఖ్యమైనది. నాటకకర్త ప్రతిభావిశేషము ఇచటనే వ్యక్తమగును. పాత్రల సంభాషణ మూలమున పాత్రల శీలములభివ్యక్తముల గుట గమనింపనగును. 'రామరాజుచరిత్రము'న సలకం తిమ్మయ్య, సామంతులతో సంభాషించునపుడు రామరాజు ధర్మబుద్ధి వ్యక్తమగును. అట్లే పటాణి, ఆషాబీతో మాటాడునప్పుడు, తల్లితోను, బహ్మనీ సుల్తానులతోను సంభాషించునపుడును హైందవరాజ్యనాశముగావించి మహమ్మదీయ మతరక్షణచేయుట యతని ధ్యేయమని స్పష్టమగును. "సుల్తానా చాందుబీ"లో చాందుబీసభ దీరి యితరులతో సంభాషించునపుడు ఆమె న్యాయనిర్ణయము, ధర్మబుద్ధి, రాజకీయ చతురత మున్నగు నుత్తమ గుణములు వెల్లడియగును. 'పాదుకాపట్టాభిషేకము'న కైకామంధరల సంభాషణచే కైక వాస్తమునకు సుగుణములు కలదే యయ్యున్న, మంధరమాటల మూలమున దుర్మార్గ ఆయినదని తెలియును. శ్రీరాముడితరులతో మాటాడునెడ అతని ఉత్తమశీలము, పితృవాక్య పరిపాలనాసక్తి సువ్యక్తమైనవి. భరతుడు కైకాకౌసల్యలతో మాటాడునప్పుడతని నిర్మల హృదయము, భ్రాతృప్రేమ స్పష్టము. 'సునందనీ పరిణయము'న ప్రతాపసుమతుల భాషణలో మంత్రిపై ప్రతాపునకు గల అచంచల విశ్వాసము, సునందనీ సుమతుల మాటలలో సునందని ఉత్తమ శీలమును వెల్లడియైనవి. 'మదాలస'లో అశ్వతరుడతని పుత్రులు దేవలనాగలులతో కువలయాశ్వునిగూర్చి ఆలోచించునపుడతని పరోపకార బుద్ధిగోచరమగును. 'మైసూరురాజ్యాభివృద్ధి'లో లక్ష్మణ పీరులకు జగన్మోహినితో కలిగిన సంవాదమున లక్ష్మణపీరుల సంయమనశక్తి, విచక్షణతోకూడిన ధర్మబుద్ధి తెలియును. "మానాపమానము"న భామినీ ధైర్య

ధర, లక్ష్మీధర విలాసధరుల మాటలలో ఆ యా వ్యక్తుల శీలములు స్పష్టము లైనవి. ఇట్లెన్నేని యుదాహరణముల బేర్కొనన గును.

కొన్ని పాత్రలితర పాత్రలగురించి చెప్పిన వెంటనేమనము విశ్వశించుట ఉచితము కాదు. అతి ప్రేమచేతగాని, మిక్కిలి ద్వేషముచేతగాని, లేక ఒక వ్యక్తిపైగల అచంచల విశ్వాసమువలనగాని అట్లు వ్రాకుచ్చి యుండవచ్చును. చివరివరకు మనము పరీక్షించినగాని ఏ నిశ్చయమునకు రాకూడదు. 'సునందనీ పరిణయము'న సుమతిని సార్థకనాముడని ప్రతాపుడు పొగడును. వాస్తవ మున కంతటి దుష్టబుద్ధి, మోసకారి, స్వామిద్రోహి, దురాశాపరుడు మరొక్కడు లేడు. తరువాత నాటక క్రమదశలలో అతని నిజమైన స్వభావము వ్యక్త మగును. 'రామరాజుచరిత్రము'న తిమ్మప్పనాయక్ మొదలైన సామంతులు సలకం తిమ్మయ్య మాటలు ఉచితములని వచించిన వానిని మనము పరిగ్రహింప కూడదు. సలకం తిమ్మయ్య రామరాయలను విజయనగరమునుండి పోవ నట్టొనర్చి తానే రాజ్యము గ్రహింపనెంచిన దుర్మార్గుడనియు, బాలహంతయనియు తరువాత స్పష్టమగును.

ఇంక విశ్వసనీయమైన వానికనేకో దాహరణములీనగును. 'రామరాజు చరిత్రము'న రామరాజు తిరుమలాంబ మాటలలో పుణ్యమూర్తి, జగదేక మోహనుడు, శ్రితావనపావనుడు. బాలుడైన వెంకటరాజును రాజునుజేసి, వానిని మోసకృత్యమునజంపి తానే రాజుగావలెనని సలకం తిమ్మయ్య చేసిన మోసమునుగుర్తించిన సామంతరాజులురామరాజు గొప్పదనమును గుర్తించిపొగడు టలో రామరాజు ధర్మము, పరాక్రమము స్పష్టమగును, ఆషాఢీపటాణులు, బహ్మనీ సుల్తానులు తమ మతమునకు, స్వజాతి స్త్రీలకు నవమానము కలిగించిన దుర్మా ర్గుడని రామరాజును నిందించి, తద్వినాశమునకు పాటుపడిరి. 'సుల్తానా చాందుబీ'లో ఇన్మూల్ ముల్క్, ఇల్లాజుఖాన్, యాఖూట్ లను దుష్టత్రయము సంభాషణవలన చాందుబీ శౌర్యపరాక్రమములు, బుద్ధినైపుణ్యమను, కురీన్ యుద్దీళిప్టి మాటలలో ఉత్తమగుణఖని, మేరీ అల్మేడా మాటలలో రణరంగధీర సాహసికురాలు, మీర్జా సేనానుల సంభాషణమున యుద్ధనైపుణ్య, శత్రుసంహారిణి యని సుస్పష్టముగా తెలియుచున్నది. అబిస్సు పల్కులలోను, ఖండోజీ ధోండోజీల

సంభాషణవలనను అల్మేడా ఉత్తమ మతాచార్యుడేగాక ఆస్తికుడుకూడను. సుల్తానాచాందుబీ వాక్కులలోను, ఖండోజీ ధోండోజీల పల్కులలోను మేరీ ఉత్తమశీల డిల్వారు, అబిస్సు మాటలలో దర్వీషు ఆయుర్వేదమునందారితేరిన వాడేగాక పరోపకార పారీణుడు. అబిస్సు రంగనాయకులయు, ఖండోజీ ధోండోజీలయు సంభాషణలో అస్మన్ దుర్మార్గుడు, పరనారీ పరాభవ పారీణుడు నని స్పష్టమగును ఇట్లు శ్రీనివాసరావుగారి అనన్య సామాన్యమైన మానవ మనస్తత్వ చిత్రీకరణమునకు 'సుల్తానా చాందుబీ' నాటకము పరమోదాహరణము "ప్రతాపాక్బరీయము"న ఉదయసింగు మాటలలో అక్బరు మహాపరాక్రమ సంపన్నుడు. అక్బరు మహాపతివ్రతగ ప్రతాపవతిని స్తుతించెను. అప్రతిమ ప్రతాపుడు ప్రతాపుడని ఉదయసింగును, సాటిలేని మేటి వీరుడు, హైందవ రాజ్యలలామా రక్షకుడని పృథ్వీరాజును, ప్రతాపుడు సింహమనియు, తదితరులు బక్కనక్కలనియు లక్ష్మణరామసింగులును వర్ణించుట గమనింపదగినది 'చంద్రగిర్యభ్యుదయము'న రెడ్డి కరణముల సంభాషణచే కుముదినీ యాచమనాయక చాందుఖానుల అరివీర భయంకర పరాక్రమము, సాహసము మున్నగు నుత్తమ గుణములు, జగ్గరాయని దౌష్ట్యమును స్పష్టమగును 'పాదుకాపట్టాభిషేకము'న రామ పట్టభంగమును మనఃపూర్వతముగా కైక కోరినది గాదని దశరథుడు; మంధర దుర్బోధచే నట్లయినదిగాని వాస్తవమునకు కేకయవంశజయైన కైక నీచబుద్ధికాదని శత్రుఘ్నుడు వాక్రుచ్చుటలో కైక నిర్మల హృదయము స్పష్టమచున్నది. సుమంత్ర శత్రుఘ్నుల వాక్కులలో రామపట్టభంగమునకు మంధరయే కారణమని తెలయును. 'సునందనీ పరిణయము'న తండ్రి సుమతి మాటలలో కుబేరుడు విద్యావంతుడు, రూపవంతుడు నయ్యును మూర్ఖుడు, ఆత్మాతురుడు, ఉపాయశీలికాడు. ఉగ్రసేనునిభటుల సంభాషణముచే ఉగ్రసేనుడు మహాదుర్మార్గుడుగా స్పష్టమయినది. ఇట్లు నాటకము నందలి పాత్రల సంభాషణచే నితరుల వ్యక్తిత్వములు సులభముగా నవగతమగుటచాల ప్రధానమైనదిగా నెంచనగును.

6.8 వ్యక్తుల హృద్గతభావములను వెల్లడించుటకు స్వగతము ముఖ్య సాధన మనవలెను. నాటకస్థపాత్రలు తమ మనోభావములను స్పష్టముగా ప్రకటించుటగకిది ఉత్తమావకాశము. ఆత్మగతముగా నను కొను మాటలే

స్వగతము. కనుక నితరులు విని తన హృదయము గ్రహింతురేమో అనెడి శంక ఉండ నక్కరలేదు. అందుచేతనే స్వగతమున ఉన్నదున్నట్లు పాత్రమనో భావము వెల్లడియగును. తన్మూలమున మనమాపాత్రల మన స్తత్త్వములను స్పష్టముగా గ్రహింప వీలగును. కాని యిట్టి స్వగతముల నాటకములందుపయోగింపకుండుటయే ఉచితమని విమర్శకాభిప్రాయము. అయినను పాశ్చాత్య నాటక చక్రవర్తి షేక్స్పియరు తన నాటకములలో స్వగతముల మూలముననే ఆయా పాత్రల మానసిక భావములను స్పష్టము గావించుట ప్రసిద్ధమే. శ్రీనివాసరావుగారుకూడ పలుతావుల స్వగతములను రచించి ముఖ్యపాత్రల మన స్తత్త్వముల వ్యక్తీకరించిరి. శ్రీనివాసరావుగారి ఇతివృత్త నిర్మాణదక్షతలో స్వగతములగూర్చి కొంతవరకు వివరించియే యున్నాను. 'రామరాజు చరిత్రము'న ముఖ్యపాత్రలకీ స్వగతముల రచించి వాని మనోభావముల విశదము చేసిరి. ఇందు రాజు రామరాజయినను పటాణి ప్రధాన పాత్ర. ప్రప్రథమముగా పటాణి విజయనగర ప్రవేశముచేసిన సమయమున తందాన పాటలు విని, విజయనగరపు టౌన్నత్యము, రామరాజు సాహసౌదార్యములకు గినిసి, మహమ్మదీయ మతము, స్త్రీలకు రామరాజుగావించిన ఘోరాన్యాయములకు మిక్కిలివగచి, అతని వినాశముచేయ ప్రతినపూనును. ఉద్యానవనమున ఆషాబీని కలిసికొని ఆమెయెదుట రామరాజు వినాశమునకై యత్నింతునని ప్రతిన చేసిన వెనుకటి స్వగతమున అంతఃకలహములతో క్రుమ్ములాడుకొనుచున్న బహ్మనీ సుల్తానులలో నైక్యము సాధించి తద్ద్వారమున రామరాజు కంఠము త్తరింతునని తలంచును. తరువాత బహ్మనీ సుల్తానుల ఎదుట తన ప్రతినను పునరుద్ఘాటించి తల్లివలన రామరాజే తన తండ్రియని తెలిసికొని పటాణి స్వగతమున మిక్కిలి దురపిల్లును. ఆ విషయ మెరుగుటకు తల్లిని బాధించితి ననియు, తన్మూలమున సంతోషమునకుబదులు ఖేదమునుబొంది పితృహంతయగుటకు విముఖుడగును. కాని తన ప్రతిన స్ఫురణకురాగానే సంహరించుటయే ఉచితమని నిర్ధారణ చేసికొనును. విజయనగర రాజులతో బహ్మనీ సుల్తానులకు యుద్ధమారంభము కాబోవుచున్న సమయమున మంచి చెడులకు మధ్య భావసంఘర్షము కలిగినది. తన మతము, స్త్రీలనుగూర్చి ఆలోచించి నప్పుడు రామరాజును సంహరించుటయే న్యాయమనియు, తన జననమునకు కారకుడై తనను సేనానిగాజేసి పోషించుటచే రాజును చంపిన పితృహంతయగు

దుననియు, వధింపకపోయిన ప్రతిజ్ఞాపాలకుడుకానేరననియు ద్వైవిధీభావ సంఘర్ష మునకులోనై తన హృద్గతాభిప్రాయములను విశదముగా వెల్లడించెను. యుద్ధ మున రామరాజేమరుపాటుననుండ కంఠము త్రెంచిన వెనుక పటాణికి పంచ మాంకము పంచమ రంగమున సుదీర్ఘస్వగతము నొకటి శ్రీనివాసరావుగారు రచించిరి. ఇది శ్రీనివాసరావుగారు రచించిన స్వగతముల కన్నింటికంటె చాల నిలువైనది. ఈ స్వగతమున తాను మహాపరాధమాచరించితిననియు, తనకిక నిష్కృతి లేదనియు, ఘోరరౌరవ నరకమే తనకు శరణ్యమని పిచ్చెత్తి వివిధ రసభావముల సంఘర్షమునకు లోనయి పటాణి మిక్కిలి పరితపించును. దుఃఖిత యైన తల్లియు, కంఠరహితమైన రామరాజు మొండెమును అగపడినట్లు తలంచి తనను నిందించుకొనును. ఆ వెనుక ఆషాబీ కనిపింప ఆమెను వధింపబూని విచక్షణా జ్ఞానముతో నామెదోషమేదియు లేదని తానే అపరాధినని గుర్తించును. ఇట్లు పలుభావముల కాకరమైన ఈ స్వగతమున పటాణి మనోగతాభిప్రాయ ములు స్పష్టమైనవి. ఇట్లే రామరాజు స్వగతమున నతని మనస్తత్వము వెల్లడి యగును ఆషాబీని రామరాజు నాస్థానమునకుగొని వచ్చుటకుముందు రామ రాజు స్వగతము గలదు. ఇందీతడు బహ్మనీ సుల్తానుల కంతఃకలహములు కలిగించి వారిని బొమ్మలట్లాడించుచు, మహమ్మదీయ రాజ్యమునకు స్థిరత్వము లేకుండ దక్షిణాపథమున కంతటికి విజయనగరమున హిందూరాజ్యము సుప్ర తిష్ఠిత మొనరించి ప్రసిద్ధికితెచ్చినవాడు తానని, అందుకు తానవలంబించిన రాజకీయ చతురుపాయములు ప్రధానమని స్పష్టముగావించును. ఇంక సలకం తిమ్మయ్య పైకి మంచివాడుగ తేనెపూసినకత్తి వలె నగపడి సామంతుల మన్ననలకు పాత్రుడై రామరాజును తొలగించి తన మార్గము సుగమముగావించుకొనిన తరువాతి స్వగతమున బాలునకు పట్టముగట్టి, వాని ప్రాణములదీసి తానే రా జగుదునని తన దుస్తంత్రమును విశదము చేయును. ఇట్లి పాత్రల మనో భావము లభివ్యక్తము లగుట తెలిసినది.

'సునందనీ పరిణయము'న సుమతి స్వగతమున అతని వంచన, మాయో పాయము, దురాశ మొదలైన దుర్గుణములు స్పష్టమగును. 'సుల్తానాదాందుబీ'లో డాండియాగో, అస్మన్‌బేగుల వనితావ్యామోహము, దౌష్ట్యము, కుట్ర మున్నగు దుష్ట స్వభావములు వ్యక్తమగును. 'శిలాదిత్య'లో కళావతీ మదనుల స్వగతము

లలో వారి దుష్ట స్వభావములు, "చంద్రగిర్యభ్యుదయ"నందు యాచముని స్వగతమున విజయనగరపునస్థాపనాసక్తి, స్వామిభక్తి, కార్యదీక్షలును, 'మైసూరు రాజ్యాభివృద్ధి'లో జగన్మోహినీ స్వగతమున లక్ష్మణవీరుల మోహించి పాపమైనను వారినిపొంద దలచుటచే నామె మనస్తత్వమును స్పష్టములైనవి. 'ద్రౌపదీ వస్త్రాపహరణము'న విదురుని స్వగతమున అతనికి గల పాండవ పక్షపాతము, ధర్మబుద్ధి మున్నగుభావములు, "సీమంతిని"లో ఈశ్వరభట్టు స్వగతమున నతని వాస్తవాభిప్రాయమును, 'రుక్మాంగద'లో సంధ్యావళీ స్వగతమున నామెకుగల పతిభక్తి, "సత్యహరిశ్చంద్రీయము"న హరిశ్చంద్రుడు కాటికాపరిగా నుండ తమ ఏకైక పుత్రుడు లోహితుడు మరణింప చంద్రమతి సంస్కారార్థము కొనిరాగా కాటికాసివ్వనిచో సంస్కారము గావింప వీలులేదనిచెప్ప, సుంకము కొనిరా చంద్రమతిపోగా స్వగతమున తమదుస్థితిని తలంచుటలో నతని మానసిక స్థితి సుస్పష్టముగ వ్యక్తమయ్యెను. "కుశలవ"లో రాముడు సీత నరణ్యమున పరిత్యజించిన వెనుక స్వగతమున తానాచరించిన కార్యమునందలి మంచి చెడుల భావసంఘర్షమునకు లోనయి మిక్కిలి పరితపించెను. ఇందు శ్రీరామునిహృద్గత భావము స్పష్టము 'మానాపమానము'న భామినీ ధైర్యధర లక్ష్మీధరుల స్వగతములలో వారివారి భావములు సువ్యక్తములుగావింపబడెను. ఈ విధముగ స్వగతముల మూలమున ఆ యా పాత్రల మనస్తత్వముల వివరించుట రావుగారి నాటకములన్నిట కననగును.

6.8 శిష్టదుష్టపాత్ర చిత్రణమున అధికముగా పాశ్చాత్యపద్ధతినే అనుసరించిరి. అయినను ప్రాచ్య పద్ధతియు గలదు. శిష్టులలో కొలదిగా దోషము చూపుటయు, దుష్టులలోను మంచి నివ్యక్తము చేయుటయు అనునది పాశ్చాత్యపద్ధతి. సత్పాత్రలను దోషరహితులుగను, దుర్మార్గులను మిక్కిలి దుష్టులుగాను చిత్రించుట భారతీయ పద్ధతి. ఈ రెండుపద్ధతుల ననుసరించియు రావుగారు నాటకపాత్రలను చిత్రించిరి. కేవలము శిష్టపాత్రలు వీరినాటకములందు గలరు. వారియందెట్టి దొసగులను చూపలేము. అంత ఉత్తములుగ ఆ పాత్రలు చిత్రితము. 'సుల్తానాచాందబీ'లో అబిస్సు, "మైసూరురాజ్యాభివృద్ధి'లో లక్ష్మణవీరులు, యదురాయడు, 'చంద్రగిర్యభ్యుదయము'న యాచమనాయకుడు. 'సత్య హరిశ్చంద్రీయము'న హరి

శ్చంద్రుడు, 'పాదుకాపట్టాభిషేకము'న శ్రీరాముడు, 'ప్రహ్లాద'లో ప్రహ్లాదుడు నిట్టి సత్పాత్రల కుత్తమ నిదర్శనములగు చున్నారు.

మూలమున అల్పదోషముండగా దానిని తొలగించి పరిపూర్ణసత్పాత్రను గావింప శ్రీనివాసరావుగారు ప్రయత్నించిరి. భారత యుద్ధమున అశ్వత్థామ మరణించెనని ధర్మజుడు చెప్పినట్లుండ 'శిరోమణి' నాటకమున కృష్ణుడు ఘటోత్కచునిచే నామాట చెప్పించినట్లు మార్చి ధర్మజునకాపాదింప బడిన ఆయింత దోషమును తొలగించి సమగ్రసత్పాత్రగా తీర్చిరి.

కేవలము దుష్టపాత్రను సైతముమంచి పాత్రగాచేయుట వీరికభిమతమైనట్లును తెలియును. రామాయణమున కైకకు దుర్బోధగావించుటచే మంథర మహాదుష్టురాలుగా పరిగణింపబడుచుండ ఆ దోషముబాప రావుగారు 'పాదుకా పట్టాభిషేకము'న దేవకార్యార్థము మంథర కైకేయికి దుర్బోధచేసినట్లు మార్చి మంథరను శిష్టపాత్రగా నిరూపించిరి.

సంస్కృతనాటకములలో శిష్టపాత్రలలో దొసగులుండవు. కాని శ్రీనివాస రావుగారు పాశ్చాత్యపద్ధతి ననుసరించి శిష్టుని కించిద్దోషదూషితులై యుందురనుటను చిత్రించిరి. 'రామరాజు చరిత్రము'న రామరాజు అసమానధీశాలి, చతురుపాయ సంపన్నుడునై యుండియు మహమ్మదీయ స్త్రీలను చెరబట్టి నిందు కొలువునవారి ముసుగులు తీయించుట, పుత్రవ్యామోహముతో పఠాణి నైజ స్వభావము నెరుగక సర్వసేనానిగాచేసిన మూర్ఖత అను దోషముల వలననే రామరాజు సర్వనాశనమైనట్లు మనకవగతమగును. 'సునందనీ పరిణయము'న ప్రతాపుడు తన మంత్రి దౌష్ట్యములకు లోనయ్యెను. 'శిలాదిత్య'లో క్రోధవర్మ కళావతీ మదనులు గావించుచున్న కుట్రకన్నివిధముల తోడ్పడు చుండగా నదితెలియక అతనినమ్మి ప్రమత్తుడై యుండుటచే శిలాదిత్యుడు యుద్ధమున వధింపబడెను.

"ప్రతాపాక్బరీయము"న అక్బరు చక్రవర్తి మహానీతికోవిదుడు, అన్యమత సహనముగల వాడయ్యును పరనారీవ్యామోహమనెడి అవగుణము చంద్రుని లోని మచ్చవలె నుండినది. 'నౌరోజుసంత' ముగియగానే ప్రతాపవతిని

బలాత్కరింప ఆమె మహాపతివ్రతయు, వీరనారియునగుటచే చక్రవర్తికి పిడి-బాకుతో సమాధానమిచ్చినది. అక్బరు చక్రవర్తి ఆమె అచంచల పాతివ్రత్య నిష్ఠకు జోహారులర్పించెను. ప్రతాపవతీ పృధ్వీరాజులుత్తమ గుణఖనులయినను అక్బరు కొలువులో నుండుట, సుక్తా మంచివాడే అయ్యును ప్రతాపునిపై ఈర్ష్యచే అక్బరు నాశ్రయించుట వారిలోని దొసగులు ప్రతాపుడు హిందూ రాజ్యమును పాదుషానుండి రక్షించుటకై సర్వభోగములు వదలి అరణ్యము-లం దాలుబిడ్డలతో నికృష్ట జీవనము గడుపుచు పడరాని కష్టములనుభవించుచు బద్ధకంకణుడై యుండియు సంతానపువంతలగని కుమిలి పాదుషాతో సంధి అనెడి తెప్పయే తమ కష్టజలధికి తరుణోపాయమని సంధికొరకు జాబువ్రాయుట ప్రతాపునిలోని అల్పదోషమనకతప్పదు.

'బభ్రువాహన'లో అర్జునుడు శిష్టపాత్రయే. అయినను గర్వపూరితుడగుట ఆతనిలోని దోషము 'లంకాదహనము'న రాముడు వాలిని వధించుట అతని స్వల్పమైనదొసగు. ఈ రెండును మూలకథలోనే గలవు. అయినను రాముడు వాలిని వధించుట న్యాయమనియే నిరూపించెను. ఇట్లా యా శిష్టపాత్రలలోను అల్పములే యయినను దొసగులుండుట గమనింపవచ్చును.

దుష్టపాత్రలలోను మంచితనమును శ్రీనివాసరావుగారు చిత్రించిరి. ఇదియు పాశ్చాత్యపద్ధతియే. ఆరంభమునుండి దుర్మార్గులుగానుండి చివర మానసిక పరిణామము జరిగి మంచివారగుట కలదు. 'సునందనీ పరిణయము'న సుమతి దుష్కృత్యములు తెలిసిన వెనుక శిక్షింప భటులు కొని పోవునెడ పశ్చాత్తప్తుడై సభ్యుల కొరకు నీత్యుపదేశకముగా జాబు వ్రాసి పంపును. ఉగ్రసేనుడు భుజబలమును నమ్మి మంత్రి దుష్కార్యములకు తోడ్పడుచు చివర సుమతిచే కాళ్ళు నరకబడి అరణ్యమున మరణావస్థలో నుండి మాయాసన్న్యాసి వేషమున వచ్చిన సునందనికి సుమతిదొసగులను జాబులో వ్రాసియిచ్చుట అతని మనఃపరివర్తనకు నిదర్శనము. 'సుఖమంజరీ పరిణయము'న విషయసేనుని దుష్కృత్యములను శిక్షగా కాళ్ళు నరుక భటులీడ్చుకొని పోవుచుండ, సభ్యుల నుద్దేశించి నీత్యుపదేశము గావించుటవాని మానసికపరివర్తనమునకు తార్కాణము. దురాగ్రహుడు దుష్టుడై అనేక కష్టముల పాలొనరించినను తన పుత్రీజామాతలు సుఖమంజరీ ప్రద్యుమ్నులు చెరబాపగా పశ్చాత్తాపము పొందును. 'సుల్తానా

చాందుబీ'లో డాండియాగో, అస్మన్‌లు ఆరంభమునుండి వనితావ్యామోహము, దురాశ, మోసము కుట్ర మొదలైన దుర్గుణముల కాలవాలమై పాదుషా సైన్యము గొనివచ్చి అమహన్నగరు వినాశము చేసి చాందుబీ మరణమునకు కారకులైరి యుద్ధమున డాండియాగో క్షతగాత్రుడై రాగా మేరీ ఆల్మేడాలు తనకు చేసిన సేవను గాంచి చనిపోవుచు ఆ పరమనికృష్టుడు పశ్చాత్తప్తుడగుటయు, జోరియ్యా నెత్తుకొని పోవుచున్న అస్మన్ అబిస్సు ఖడ్గమున కాహుతియై మరణావస్థలో పశ్చాత్తాపము నొందుటయు జరిగినది 'శిలాదిత్య'లో కళావతీ మదనులు పరమ దుర్మార్గులై పార్థియన్ల నాశ్రయించి వారి సైన్యముల గొనివచ్చి, బలహరి నగరము పాడొనరించి శిలాదిత్యుని వధింపజేసియు, గుహుని పట్టముతో మఁగియు నాటకమున పశ్చాత్తప్తులై భిల్లులతో కూడి శిలాదిత్యుని సంతానమైన గుహునకు పట్టము గట్టి తరింతురు. 'శిరోమణి'లో భారత యుద్ధమున సర్వ నాశనము కాగా ద్వైపాయన హ్రదమున దాగికొనపోయిన దుర్యోధనుడు కృపాశ్వత్థామ కృతవర్మలతో దైన్యముగా మాటాడుచు తన దుస్థితికి వగచును. విదురుని నీతిని, కృష్ణుని హితబోధను, వ్యాసుని యుపదేశమును, తల్లి దండ్రుల మాటలను పెడచెవిని పెట్టి గర్వాంధుడనైతినని పశ్చాత్తాపము నొందునట్లు శ్రీనివాసరావుగారు కల్పించిరి. వాస్తవమునకు భారతమున దుర్యోధనునకు దైన్యమనుమాటగాని, యిట్లయ్యెనే యని వగచుటగాని తెలియని సంగతి. కాని శ్రీనివాసరావుగారు మాత్రము ఎంత దుష్టుడైనను ఒక్కసారైన పశ్చాత్తాపము నొందుననెడి భావముచేతనే దుర్యోధన పాత్ర కిట్టి మార్పుగావించిరని తలప వలెను! ఇట్లు దుష్ట పాత్రలకును మనస్సుండుననియు, చిట్టచివరనైన తమ తప్పిదముల దెలిసికొని సద్భావముల ప్రకటించుట కలదనుటకే రావుగారిట్టి పాత్రచిత్రణము గావించిరి.

దుష్టపాత్రలకు కావ్య న్యాయము ననుసరించి అంతమున పరాజయము కలుగుట సర్వసామాన్యమే. 'సునందనీ పరిణయము'న సుమతి మోకాళ్ళవ కు నరుకబడునట్లు ఆజ్ఞాపింపబడును. 'సుఖమంజరీ పరిణయము'న విషయసేనునకు ఘోరమైన కారాగార శిక్షవిధింపబడును. 'మదాలస'లో పాతాళకేతుడు కువల యాశ్వునిచే దుర్మరణము పొందును 'సుల్తానా చాందుబీ'లో డాండియాగో అస్మన్, ఇన్నూల్‌ముల్క్, ఇల్లాజ్‌ఖాన్, హమ్మీదులు వారివారి దౌష్ట్యముల

కనుగుణముగ మరణింతురు. 'రామరాజు చరిత్రము'న సలకం తిమ్మయ్య స్వయంకృతాపరాధమునకు ఆత్మహత్యయే శిక్షగా విధించుకొనెను. 'శిలాదిత్య'లో స్వామి ద్రోహులై తాము గావించిన దుస్తంత్రములకు ఫలితముగ క్రోధవర్మ యుద్ధమున, యుద్ధానంతరము కళావతీ మదనులు (శిలాదిత్య మరణముతో ముగియు నాటకమున) మహాఘోరముగ పార్థియన్లచే వధింపబడిరి. 'మైసూరు రాజ్యాభివృద్ధి'లో మారనాయకుడు వధింపబడుట, 'చంద్రగిర్యభ్యుదయము'న జగ్గరాయల పరాజయము జరుగుట కలదు. 'కీచకవధ'లో కీచకుడు పతివ్రత నవమానింపబోయి చిత్రవధగావింపబడుట, 'శిరోమణి'లో దుర్యోధన దుశ్శాసనులు పౌలికలనిలో మిక్కిలి హేయముగ జంపబడుట, 'గిరిజాకల్యాణము'న గర్వించిన దక్షుడు వీరభద్రునిచే మరణము పొందుట, 'ప్రహ్లాద'లో హిరణ్యకశిపుడు నరసింహస్వామిచే వధింపబడుట వారి దౌష్ట్యములకుచితమైన ఫలితముల బొందినట్లు స్పష్టమగును.

అయినను శ్రీనివాసరావుగారి నాటకములలో నెడనెడ శిష్టులును శిక్షింపబడుట గలదు. 'సుల్తానా చాందుబీ'లో చాందుబీ నాటకాంతమున హమ్మీదుచే వధింపబడుట, 'మైసూరు రాజ్యాభివృద్ధి'లో దోషమేమియు లేక సుగుణ ఖనులయ్యు లక్ష్మణవీరులు వధింపబడుట, 'ప్రతాపాక్బరీయము'న కమల ఘోరముగ సభాస్థలమున సంహరింపబడుట, 'చంద్రగిర్యభ్యుదయము'న చెరలో దుర్మరణము పాలగుట నిరపరాధులైనను శిక్షింపబడి నందుకుదాహరణములు.

కాని శిష్టులకంతమున విజయముచేకూరి సర్వసుఖములు కలుగుట సర్వత్ర కననగును. ప్రారంభమునుండి శిష్టపాత్రలు కష్టపరంపరల నెదుర్కొని తమ నిర్దోషిత్వము నిరూపితము కాగా జయము పొంది, తన్మూలమున చివర సుఖము లనుభవించుటకలదు. దీనికి రావుగారి ప్రతినాటకమునుదాహరణమే యగును. 'రుక్మాంగద'లో రుక్మాంగదుడు, 'సత్యహరిశ్చంద్రీయము'న హరిశ్చంద్రుడు, 'పాదుకాపట్టాభిషేకము'న రాముడు, 'ప్రహ్లాద'లో ప్రహ్లాదుడు కష్టపరంపరల నెదుర్కొనుటయే తమ ధర్మమన్నట్లున్న సత్పాత్రలు. సత్యధర్మన్యాయములు స్థాపించుటకై ఆ యా పాత్రలు గావించిన అవిరళకృషి కష్ట సముద్రమున మునిగి చివరికి జయించి తేలిన విధానములిట్లు అభివ్యక్తమగుచున్నవి. ఎన్ని కష్టములు కలిగినను చివరికి ధర్మమునకే జయమని నిరూపించుట భారతీయ

సీతికదా ! ఇట్లు శ్రీనివాసరావుగారి పాత్ర లనేకపద్ధతులతో దృక్పథములతో నొప్పారు నట్లావిష్కృతములైనవి.

6.9 శ్రీనివాసరావుగారు చిత్రించిన స్త్రీపాత్రల గూర్చి ప్రత్యేకముగా చెప్పవలసిన ఆవశ్యకము గలదు. ఈ స్త్రీ పాత్రలన్నింటిని ఆరు వర్గములుగ విభజింపవచ్చును. పురుష పాత్రల కంటె అధిక సాహసికురాండ్రయి యొప్పారు స్త్రీలు కలరు. 'సునందనీ పరిణయము'న సుదేవుని కంటె సునందనియు, 'సుభమంజరీ పరిణయము'న ప్రద్యుమ్నునికంటె సుభమంజరియు, 'ప్రతాపాక్బరీయము'న ఉదయసింగుకంటె కమలయు, 'బభ్రువాహన'లో అగ్ని నీలధ్వజులకంటె జ్వాలాదేవియు సాహసము చూపినట్లు స్పష్టమగును. ఆనాటి సాంఘిక పరిస్థితుల ననుసరించి స్త్రీల కధిక ప్రాధాన్య మవసరమనెడి శ్రీనివాసరావుగారికి గల ప్రబల విశ్వాసముచేతనే వారిట్టి పాత్ర చిత్రణము గావించిరి.

పురుషులతో సమానమైన సాహసము నెరపి ప్రసిద్ధిగాంచిన స్త్రీలును గలవు. 'సుల్తానా చాందుబీ'లో స్త్రీగా నుండియు మహాధీశాలినియై రాజకీయ చతురుపాయ తంత్రజ్ఞయై, నేతృత్వదక్షత గలదై, అరిపీరభయంకరయై రాజ్యము నేలి ప్రఖ్యాతిగాంచిన ధీరాను లు చాందుబీతో నేవురుషుని బోల్పనగును? ఇందే జోరియానుగూడ పేర్కొనవలెను. ఇట్లే 'చంద్రగిర్యభ్యుదయము'న 'కుముదిని', 'ప్రతాపాక్బరీయము'న భైమాప్రతాపవతులు, 'మైసూరు రాజ్యాభివృద్ధి'లో జగదంబ, 'బభ్రువాహన'లో ప్రమీల, 'మానాపమానము'న భామిని మున్నగు స్త్రీ పాత్రలిందుకు ముఖ్యోదాహరణములగుదురు.

దొసగులేమాత్రము చూపవీలుకాని భర్తృదీనలు, పతిభక్తియుతలు సహధర్మచారిణులు, మహాపతివ్రతలు సన్మార్గవర్తనలు నైన స్త్రీ పాత్రలును గలరు 'సునందనీ పరిణయము'న జయదేవి, 'మదాలస'లో మదాలస, 'సీమంతిని'లో సీమంతిని, 'రామరాజు చరిత్రము'న తిరుమలాంబ, 'ప్రతాపాక్బరీయము'న గౌరాంబ, 'సుల్తానా చాందుబీ'లో మేరీ, 'రుక్మాంగద'యందు సంధ్యావళి, 'సత్యహరిశ్చంద్రీయము'న చంద్రమతి, 'ద్రౌపదీ వస్త్రాపహరణము, కీచకవధ, శిరోమణి' నాటకములందు ద్రౌపది, 'పాదుకాపట్టాభిషేకము, లంకా

దహనము, కుశలవ' నాటకములలో సీత, 'పాదుక'లో కౌసల్య, 'బభ్రు వాహన'లో చిత్రాంగద, 'కాళిదాసు'లో మదనసేన, 'ప్రహ్లాద'లో లీలావతి మున్నగు పాత్ర లిందుకుదాహరణములుగా పేర్కొనవచ్చును.

శిష్టపాత్రలై యుండియు పరిస్థితుల ననుసరించి దుష్టముగా ప్రవర్తించిన వారును గలరు. ఇందుకుదాహరణము 'పాదుకాపట్టాభిషేకము'న కైక, 'రుక్మాంగద'లో మోహిని, 'మైసూరు రాజ్యాభివృద్ధి'లో జగన్మోహిని, 'కీచకవధ'లో సుధేష్ణ అనువారు. కైక సహజముగా మంచిదేయైనను కేవలము మంధర దురోధము వలననే దుష్టురాలుగా మారిపోయినది మోహిని బ్రహ్మమానస పుత్రియై సుచరితగా జనించినను తండ్రిమాటను కాదనలేక ఏకాదశీ వ్రతము నుండి రుక్మాంగదుని విముఖుని గావింప యత్నించుటలో అతనిని మిక్కిలి బాధించినది. జగన్మోహిని వ్యక్తితః సన్మార్గ వర్తన. కాని తన తలిదండ్రులు ధనాశాపరులై ముదుసలి యగ్గయిన రాజునకు కట్టబెట్టుటచే యౌవన ప్రాదుర్భావము వలన కలిగిన వాంఛల దీర్చుకొనుటకై మేనల్లుండ్రయిన లక్ష్మణ వీరులను మోహించి వారిని కవయబోయి తిరస్కృతయై ప్రతీకారము దీర్చుకొన వారిని క్రూర స్వభావయై సంహరింపజేసినది సుదేష్ణ ఉత్తమ శీలస్వభావయైనను తాననుభవించు రాజ్యభోగము లన్నియు కీచకునిపై నాధారపడినవి, కీచకుని మాట ప్రకారము నడచుకొనుటయే తనకు శ్రేయము, కీచకుడు సైరంధ్రిని కామించి తన మందిరమునకు పంపుమని అక్క సుధేష్ణను కోరగా నామె హితము పదేశించినను ప్రయోజనము లేకపోయినది. కీచకుని కోరిక తీర్ప సైరంధ్రిని కీచకుని మందిరమునకు మదిర తేరబంపినది. మహాపతివ్రతను బలాత్కరించి కీచకుడు భంగపడి చితనధను రుచిచూచెను. ఇట్లు మంచి పాత్రలేయైయుండియు పరిస్థితుల ప్రభావముచే దుర్మార్గులై ప్రవర్తించిరి.

నీచపాత్రలైనను కార్యనిర్వహణశక్తి యుక్తిసాహసములుగల స్త్రీలును గలరు. 'శిలాదిత్య'లో కళావతి, 'శ్రీరామజననము'న రంగాసాని, వెంకాసాని, కమలాసాని యనువారును, 'పాదుకాపట్టాభిషేకము'న మంధర ఇట్టి వారు మదనునిపై గల వ్యామోహముచే కళావతి సాహసించి మదనుని దుస్తంత్రములకు తోడ్పడి సర్వనాశనము గావించినది. ఇందామె బుద్ధినైపుణ్యము స్పష్టము. రంగసాని,

వెంకాసాని, కమలాసాని అను వేశ్యాత్రయము అంగరాజ్యమున వ్యాపించిన క్షామ నివారణార్థము, నేర్పరితనమున ఋష్యశృంగుని గొనివచ్చి సత్కార్య మున కుపకరించిరి. వారి వేశ్యాతంత్రములు మంచికి తోడ్పడినవి. మంధర దేవకార్యార్థము వివిధ విధములుగా కైకేయికి బోధించి రామ పట్టభంగము గావించి అరణ్యము పాలు గావింప యత్నించినది.

ఇంక స్త్రీ పాత్రలలోను కేవలము దుష్టస్వభావలు లేకపోలేదు. 'ప్రతాపా క్బరీయము'న సుందరాంబ, "చంద్రగిర్యభ్యుదయము"న బాయమ్మ, 'మైసూరు రాజ్యాభివృద్ధిలో' ఓబళమ్మ, "సత్యహరిశ్చంద్రీయము"న కలహకంఠి, "కుశలవ"లో శూర్పణఖ, "సునందనీ పరిణయము"న జయమాలిని మున్నగు వారిట్టివారు. సుందరాంబ, ఆక్బరుకులోబడి ప్రతాపవతినతనికికూర్చి ఆమె శీలము చెరుపయత్నించిన దుష్టురాలు. బాయమ్మ తనకు సంతానము లేమిచే రహస్యముగా నొక బ్రహ్మణబాలుని గ్రహించి తనకే జన్మించెనని మోసమున రాజుగాజేయ యత్నించిన పాతకి. ఓబళమ్మ తన సౌఖ్యమునకై ఎన్ని పాప ముల జేయుటకైన వెనుదీయలేదు. కలహకంఠి హంసనారియను మారుపేరున దాసియైన చంద్రమతిని మిక్కిలి పీడించినది. శూర్పణఖ మహాపతివ్రతా లోక మునకెల్ల అదర్శప్రాయయైన సీతపై నేరములు కల్పించి భర్తృవియోగము కల్పించి రాముని సుఖదూరుని గావించిన అక్కటికములేనికటికి. జయమాలిని తండ్రి సుమతి దుస్తంత్రములకు సాయపడుచు ప్రేమించినట్లుగ సేనుని మోస గించి, ఈర్ష్యాసూయాస్వార్థములచే ప్రాణస్నేహితురాలైన సునందనిని ఇడుముల పాలుగావించిన దుర్మార్గురాలు. ఇట్టి నీచస్త్రీ నాటకాంతమున నేమైనదిగూడ తెలియక నామరూపములు లేకపోయినది. ఇట్లు విభిన్నమనస్తత్వములు గల స్త్రీపాత్రల సృజించి శ్రీనివాసరావుగారు తమ అమేయప్రతిభాలోకజ్ఞతల సంపన్న తను స్పష్టము గావించిరి.

8 10 సంస్కృత నాటకములందలి విదూషక పాత్రవంటివి శ్రీనివాస రావుగారి నాటకముందు గన్పట్టవు. 'సుఖమంజరీ పరిణయము'న పస్తావనలో నటీసూత్రధారులతోపాటు విదూషకుడును పాల్గొనెను కాని నాటకమున నతని కేమియు ప్రాధాన్యము లేదు. "సుల్తానాచాందుబీ"లో నటీ విదూషకులతో సూత్రధారుడు ప్రస్తావనను కొనసాగించినట్లు గలదు. సూత్రధార నిష్క్రమి

మఱమతో నటితో సరసములాడబోయి విరసముకాగా సూత్రధారునివలన కలుగబోవు ఆపదను పురస్కరించుకొని బీజాపురము, అమహన్నగరువారికి యుద్ధము సంభవింపబోవుచున్నదని, వారిలో నొకరి యొద్దకేగి జీవుంపనెంచి విదూషకుడు నిష్క్రమించును. జలదుర్గమున కధిపతియగు అస్మన్‌బేగునొద్ద ప్రాపుసంపాదించి విప్రవినోదములు సలిపి కాలము గడుపుచుండును. ఇతడే రఘునాథుడు. అస్మన్‌కొరకు సందర్భోచితముగానితడు జోరియా వేషమును, ముల్లావేషమును ధరించి హాస్యమున కుపకరించెను. రఘునాథుని సాయమున జోరియాతో తన వివాహము పరిపూర్తిగావింపనెంచిన అస్మన్‌కు కొంతవరకు సహకరించెను. 'సుఖమంజరీ పరిణయము'న ప్రద్యుమ్నునకు సంజయుడును 'సీమంతిని'లో చంద్రాంగదునకు యుగంధరుడును ప్రాణమిత్రులుగా నుందురు. ప్రద్యుమ్నుడు సుఖమంజరిని దారగా గ్రహించుటకు కొంతవరకు సంజయుడు సాయపడును. అంతేగాక చివరివరకు నాటకమున ఏదోరూపమున సుఖమంజరీ ప్రద్యుమ్నులకు తోడుగనుండును. యుగంధరుడు చంద్రాంగదుని ప్రణయమునకును, చంద్రాంగదుడు సీమంతినిని వివాహమాడుటకును నుపకరించును. చంద్రాంగదునితోపాటు యమునలో మునిగిపోవుటతో యుగంధరుని పాత్ర ముగియును. ఇట్టి పాత్రలు నాయకులకు కొంతవరకు సఖులై వ్యవహరించినను సంస్కృత నాటకములందలి విదూషకులవంటివారు మాత్రముకారు. వీరిలో భోజన ప్రియత్వముగాని అసందర్భ ప్రలాపములుగాని మనకు కన్పట్టవు. అట్టి విదూషకపాత్ర సృష్టికై శ్రీనివాసరావుగారు ప్రయత్నింప లేదనియే చెప్పవలెను.

6 . 11 శ్రీనివాసరావుగారి నాటకములలో అప్రధాన పాత్రలు (Minor Characters) సైతము కొన్ని గలవు. ఈ అప్రధాన పాత్రలను రెండు వర్గములుగ విభజింపనగును. నాటకమున అప్రధానముగనుండి కథా క్రమ వికాసమునకుపకరించి కొంతవరకు ప్రాధాన్యము వహించిన అప్రధాన పాత్రలు మొదటిరకము. నాటకమున తాత్కాలిక ప్రయోజనముగల అప్రధాన పాత్రలు రెండవరకము. 'రామరాజు చరిత్రము'న దుర్వాసశాస్త్రి యను బ్రాహ్మణుడు నాగోజి, సుబ్బోజి యని కావలివారిచే సలకం తిమ్మయ్య బాలుడైన రాజునకు విషప్రయోగముచేయించి చంపించిన విషయమును, తదనంతరము తానే రాజు కావలెనని తలంచిన సంగతిని సామంతులకు తెలియజేసి

'రామరాజు' విజయనగరమునకు వచ్చునట్లుచేయించును. నాటక కథ కీ పాత్ర ఉపకరించినట్లు తెలియుచున్నది. ఇంక సంగీత పాఠకుని మూలముననే నాటకము నడచినట్లు స్పష్టమగును. "సుల్తానా చాందుబీ"లో జోహరారు, బేహారులను వారు జోరియాను ఎత్తికొనివచ్చి అస్మన్‌బేగు కప్పగించుటకును, లతీఫా, జోరియాను అస్మన్‌కు కూర్చుటకును, భీమక్క జోరియాను అస్మన్‌బేగు నుండి తప్పించుటకును ఉపకరించిరి. 'బలదాసర్' మూలమున డాండియాగో కారాగృహము నుండి తప్పించుకొనిపోగలిగెను. వీని మూలమున నాటకములు నడచినటు విశదమగును.

ఇట్లే "మదాలస"లో కుండలాదేవల నాగలులు, 'సీమంతిని'లో మైత్రేయి, యోగిని, 'శిలాదిత్య'లో అనంగవర్మ, "మైసూరు రాజ్యాభివృద్ధి"లో కామేశ్వర పంతులు' వరదుడు, ఓబశమ్మ, "రుక్మాంగద"లో విశ్వావసుడు, చాకలి దుర్గి, దుర్గడు, మారమ్మ, "ప్రతాపాశ్చరీయము"న షాహిదాసు, కుబేరసేన్, భిల్లునాయకుడు, "బభ్రువాహన"లో దుర్బుద్ధి, దుస్స్వభావుడు, 'పాదుకాపట్టాభిషేకము'న గుహుడు, 'కాళిదాసు'లో వీరయోగి, 'చంద్రగిర్యభ్యుదయము'న సదాశివయోగి, ఓబళనాయక, రెడ్డి, కరణము, 'మానాపమానము'న వినోద, శీలధర, కుసుమ అను పాత్రలు అప్రధానముగా నుండినను నాటక కథాక్రమ వికాసమున ప్రాధాన్యమును రహించినవి.

ఇంక నాటకములందు తాత్కాలిక ప్రయోజనముగల అప్రధాన పాత్రలు కొన్నిగలవు. 'రామరాజు చరిత్రము'న యజ్ఞసోమయాజిని ప్రవేశపెట్టి అతి బాల్యవృద్ధ వివాహములను గర్హించుట, వైశ్యుని మూలమున విజయనగరమున కోడిగ్రుడ్డంతటి వజ్రముండినదను చారిత్రక సత్యమును చాటుట అను ప్రయోజనములను శ్రీనివాసరావుగారు సాధించిరి. ఇట్లే 'సీమంతిని'లో సుమంత్రి (మంత్రి), సత్యవంతుడు, 'శిరోమణి'లో చిన్నోడు, తిమ్మన్న, 'బభ్రువాహన'లో వృషకేతుడు, శంఖలిఖితులు, విశ్వేశ్వరావధాని, 'కాళిదాసు'నందు బుద్ధిసాగరుడు, కాంచనమాల, 'చంద్రగిర్యభ్యుదయము'న పంచమజాత్యర్చకుడు అను పాత్రలప్రధానములైనవి. అయినను తాత్కాలిక ప్రయోజన సంపాదనార్థము శ్రీనివాసరావుగారు వీరిని పోషించిరి. ఇట్లు వీరు నిష్ప్రయోజనముగా నేపాత్రను తమ నాటకములందు ప్రవేశపెట్టి యుండలేదని చెప్పవచ్చును.

6.12 నాటక కర్త నవలారచయితవలె తానైతన అభిప్రాయములను నాటకములందు ప్రకటించుటకు వీలుండదు. కనుక తన అభిప్రాయములను వెల్లడింప దలచిన యెడల ఏదేని నాటకస్థపాత్రలో లీనుడై అవకాశము గల్పించుకొని అట్లు చేయును. తానుద్దేశించిన విషయములను సందర్భోచితముగ ప్రత్యేకించి ప్రకటింప వచ్చును. ఇట్టివి శ్రీనివాసరావుగారి నాటకములలో సైతము గలవు. వీరి విషయమున అతిగా మితిమీరిన సందర్భములు లేకపోయినను, ఎడనెడ తమ అభిప్రాయములను ప్రకటించినట్లు స్పష్టముగా తెలియును. "సునందనీ పరిణయము"న సుమతి మధిమిచిగూర్చి ప్రస్తావించుట, 'రామరాజు చరిత్రము'న హైందవుల బాల్య వివాహములగూర్చి బహ్మనీ సుల్తానులు గర్హించుట, 'ప్రతాపాక్బరీయము'న హిందువులలో ప్రసిద్ధమైన సతీ సహగమనమునకు మిక్కిలికనలి దానిని పోగొట్టుటకై యత్నింతునని అక్బరు వచించుట 'శిలాదిత్య'లో జగన్మోహినియు వారి తలిదండ్రులు ధనాశా పరులై వృద్ధునకు వివాహమొనరించిరని వగచుట, 'శిలాదిత్య'లో వాచస్పత్యాచార్యుడు శ్రుతి స్మృతులకు కష్ట వ్యాఖ్యానము లొనరించినందుకు చింతించుట. "మైసూరు రాజ్యాభివృద్ధి"లో వివిధ మత సంబంధ చర్చలు, న్యాయస్థానమునందలి న్యాయవాదుల కోలాహలమును స్ఫురింపజేయు చామరాజు నా స్థానమున జరిగిన న్యాయ విచారణ, వాదోపవాదములు మొదలైన విషయములన్నియు శ్రీనివాసరావుగారు కావలెనని యోచించి సందర్భానుసారముగా జొప్పించినవని మనకు స్పష్టమగును.

ఇట్లు శ్రీనివాసరావుగారు వివిధ స్త్రీ పురుషుల ప్రకృతుల అతి సూక్ష్మ పరిశీలనముగావించి అవగాహన గావించుకొని తమ ప్రతిభావ్యుత్పత్తి, లోకజ్ఞత మొదలగు గుణములనన్నింటిని వ్యక్తముచేయుచు అత్యద్భుత ప్రపంచమును సృజించిరి. వీరు మానవ మనస్తత్వవిశ్లేషణమొనరించి యుండుటచేతనే వివిధ మానవ మనఃప్రవృత్తులను సందర్భోచితముగా విశదముగావింప గలిగిరి. మానవ గుణశీల ప్రభావ చిత్రీకరణములేనిది ఉత్తమ నాటకముగా పరిగణింపబడుటకు వీలులేదు. కనుక శ్రీనివాసరావుగారు నాటకములలో వివిధపాత్రల మనః ప్రవృత్తుల సుచితరీతిని చిత్రించి నాటకములకు శ్రేష్ఠతవాపాదించిరి. అందుకోను వీరి చారిత్రక నాటకములలో పాత్రల చిత్తవృత్తులను వివిధరీతుల వివరించి తమ విజ్ఞానమును విశదమొనరించిరి. అందులోను "రామరాజు చరిత్రము

సుల్తానా చాందుబీ, ప్రతాపాక్బరీయము" అను నాటకములు శ్రీనివాసరావుగారి మన స్తత్వ చిత్రీకరణ చాతుర్యమునకు ముఖ్యోదాహరణములు. పౌరాణికముల లోను 'శిరోమణి, పాదుకాపట్టాభిషేకము, ప్రహ్లాద"యను నాటకములందును విభిన్న పాత్రల మనఃప్రవృత్తులను సుస్పష్టముగావించి తమ నైపుణ్యమును ప్రకటించిరి. ఇచట "ప్రహ్లాద" నాటకమునందలి పాత్ర చిత్రణనుగూర్చి శ్రీకూర్మా వేణుగోపాలస్వామిగారి మాటల నుల్లేఖించుట అనుచితము కాదు. "శ్రీ కోలాచలం ప్రహ్లాద నాటకంలో పాత్ర చిత్రణకూడ ప్రశంసాపాత్ర మైంది. లీలావతీ హిరణ్యకశిపుల పాత్రచిత్రణ మటువంటిది. హిరణ్య కశిపునికి విష్ణుద్వేషం ఎంత విపరీతమో పుత్రవాత్సల్యం అంత సహజం. అసలీ ద్వంద్వశీలమే చక్కని నాటకీయత. ఆ నాటకీయతని అద్యంతమూ పట్టి యిచ్చేనాటకం ప్రహ్లాద చరిత్ర. అటువంటి రచన అవ్వడం వల్లనే శ్రీ కోలాచలం శ్రీనివాసరావు ప్రహ్లాద చరిత్ర ప్రదర్శనలో విజయవంత మయింది. అనేకులీకథను నాటకంగా వ్రాసినా శ్రీ కోలాచలం ప్రహ్లాదచరిత్ర పరాకోటి రచన." [1] అని వారుచితరీతిని సెలవిచ్చిరి.

6.13 శ్రీనివాసరావుగారి నాటకములలో అధిక ప్రసిద్ధి ప్రచారము లను సంపాదించుకొన్న నాటకము 'రామరాజు చరిత్రము'. దీని గొప్పదన మున కంతటికి కారణమందలి పాత్ర చిత్రణాచాతుర్యము. శ్రీనివాసరావుగారు మేధాసంపత్తిని, ప్రతిభావ్యుత్పత్తులను, లోకజ్ఞత విమర్శనాజ్ఞానముల నుప యోగించి ఇందు పాత్ర పోషణము గావించిరి. అందులోను పటాణి పాత్ర పోషణ మనన్యసామాన్యము; అసదృశము నని చెప్పక తప్పదు. అనేక విమర్శకుల తీవ్ర విమర్శలకు గురియైన పాత్రయు నిదియే. నటనా సామర్థ్యము గల కళాప్రపూర్ణ బళ్ళారి రాఘవాచార్యులు వంటి కొమ్ములు దిరిగిన మేటి నటులు పటాణి పాత్ర ధరించి పాత్రోచితముగ నటించి ఆంధ్ర లోకమునే మెప్పించి ఘనత వహించిరి. అట్టి పటాణి పాత్ర చిత్రణమున గల ఆధిక్య మేమిటి? అను విషయమునిట తెలిసి కొనుట యెంతయు నవసరము.

పాశ్చాత్య నాటకములతో - అందులోను షేక్స్పియరు నాటకములతో - అతి మాత్ర పరిచయముగల శ్రీనివాసరావుగారు వానిలో వలెనే తమ నాటకము

1. 25. పు. 286.

లందుచిత రీతిని పాత్ర చిత్రణము గావించిరి. ప్రధానముగా వీరు షేక్స్పియరు కవి ఉత్తమ విషాదాంత నాటకములలోని విషాద నాయకుని వలె పటాణి పాత్రను చిత్రించి నట్లువగతమగును. ఈ విషయమునే శ్రీపురాణం సూరి శాస్త్రిగారు "మఱియునిందు (రామరాజు చరిత్రమునందు) నాటక ప్రపంచ చారిత్రకులైన శ్రీనివాసరావుగారు తమ యాంగ్ల నాటక పరిచయ సంపత్తిచే షేక్స్పియరు కృతులలో హామ్లెట్, బ్రూటస్‌పాత్రముల మనోవృత్తుల గొన్నిటిని తమ పటానుని కల్పించి నందున ఈ నాటకమున రసోద్రేకము మిక్కుటముగ జేరియున్నది. మఱియు నాట్య చమత్కృతికి నవకాశములును మెండుగ నిందుగలవు "[1] అని మిక్కిలి కొనియాడి యున్నారు. 'జూలియస్ సీజర్' నాటకమున 'బ్రూటస్' కుట్రదారులతో కలిసి 'సీజరు'ను వధించినట్లు 'రామరాజు చరిత్రము'న పటాణి బహ్మనీ సుల్తానులజేరి ప్రతిజ్ఞచేసి యుద్ధమున రామరాజు కంఠమును ఖండించును. 'హేమ్లెట్' నాటకమున తన తండ్రిని వధించి తన తల్లిని భార్యగా స్వీకరించిన పినతండ్రిని సంహరించినట్లు, 'రామరాజు చరిత్రము'న తనతండ్రిని హింసించి చంపి, తల్లిని చెరబట్టి తన జన్మకు కారణభూతుడై నందుకు క్రుద్ధుడైన పటాణి రామరాజును వధించును. ఇచట గమనింపదగిన విషయము మరొకటి కలదు. పినతండ్రి 'క్లాడియస్'ను వధించుటయందు 'హేమ్లెట్' ఆలస్యముచేయును. ఈ ఆలస్యమునకు కారణము దెలుపుచు బహువిమర్శలు పాశ్చాత్య ప్రాచ్య విమర్శకులలో బయలుదేరినవి.[2] ఇట్లే అంత సంపూర్ణముగా కాకపోయినను పటాణి గూడ అవకాశము లభించినను రామరాజును వధించుటయందు ఆలస్యము చేసినట్లు తెలియుచున్నది. ఇంకను ప్రఖ్యాత మనస్తత్వ శాస్త్రవేత్త యయిన 'ఫ్రాయిడ్' మహాశయుడు ప్రచారము గావించిన 'ఎడిపస్ కాంప్లెక్స్' అను సిద్ధాంతము ప్రకారము 'హేమ్లెట్' తన పినతండ్రిని వధించిన విధమున రామరాజు తన తండ్రి యని తల్లివలన తెలిసికొనియు పటాణి అతనిని వధించునని మనము గుర్తింపవలెను. కాని శ్రీపురాణం సూరిశాస్త్రిగారు మాత్రము పితాపుత్ర సంబంధమునైన గణింపక పటాణి

1. 2. పు. 207.

2. (i) 172. పు 70–84; (ii) 4 పు 181-188

రామరాజును చంపుట లోకధర్మానుసారముగా లేదనియు, అమానుష మనియు వాదించిరి.[1] అయినను 'ఎడిపస్ కాంప్లెక్స్' సిద్ధాంతమును గుర్తించిన వెనుక పటాణి రామరాజును వధించుట అసహజము కాదని స్పష్టమగును. 'మేక్బెత్' నాటకమునందు తన ప్రభువైన 'డంకన్' నిద్రించుచుండ మేక్బెత్తు అతనిని వధించినట్లు తనకు తండ్రి, ప్రభువునయి తనను ప్రగాఢముగా విశ్వసించిన రామరాజేమరుపాటున యుద్ధరంగమున నుండ నతని శిరము ఖండించును. సర్వ రాజ్యము తమకే సంక్రమించు ననెడి దురాశాపీడితయైన 'లేడీ మేక్బెత్తు'చే ప్రేరేపింపబడి మేక్బెత్తు డంకన్ ప్రభువును హత్యచేయును. అదే విధముగా రామరాజు తన తండ్రియని గుర్తించి వధించుటకు వెనుకాడుచున్న పటాణి అషాబీచే ప్రోత్సహింపబడి రామరాజును వధించును. ఇట్లు షేక్స్పియరు రచించిన ఆ యా విషాదాంత నాటక నాయకులతో సమానముగ శ్రీనివాసరావుగారు పటాణి పాత్రను చిత్రించినట్లు స్పష్టమయినది.

విషాద నాయక పాత్ర చిత్రణమున షేక్స్పియరు వలెనే శ్రీనివాసరావుగారు కూడ పటాణి పాత్ర చిత్రణమున సంఘర్షము (Conflict) సమృద్ధిగా ప్రవేశపెట్టిరి. తన తల్లి వలన రామరాజు తన తండ్రియని యెరిగిన వెనుక పితృగౌరవము, స్వామిభక్తి, తల్లి యాజ్ఞ యొకప్రక్క, తనకు తానై చేసినట్టిదియు, ఆ యా సందర్భములలో అషాబీ, బహ్మనీ సుల్తానుల యెదుట పునరుద్ఘాటించినట్టిదియునైన శపథము, అషాబీకి జరిగిన అవమానమునకు తగిన ప్రతీకారము చేయవలెననెడి కోరిక, మహమ్మదీయ మత రాజ్యములకు గలిగిన దైన్యస్థితిని పోగొట్టవలెననెడి ఆకాంక్ష అను మూడంశములు మరొక ప్రక్క ముడివడి ఈ పరస్పర విరుద్ధ భావములకు సంఘర్షము కలుగుటచే పటాణి డోలాందోళిత మనస్కుడై కింకర్తవ్యతామూఢుడై యుండ రామరాజును వధింప అషాబీ అతనిని పురికొల్పి కార్యోన్ముఖుని గావించును. ఈ భావ సంఘర్షము స్వగతములలో సుస్పష్టమగుచుండును. షేక్స్పియరు నాటకములలో వలెనే శ్రీనివాసరావుగారు పటాణి పాత్రకు మూడునాలుగు సందర్భములలో దీర్ఘ స్వగతములు రచించిరి. పైని పేర్కొనిన సందర్భముకోని స్వగతము కంటె

---

1. 2. పు. 216 - 221.

రామరాజు కంఠము నుత్తరించిన వెనుక పంచమాంకను పంచమ రంగములోని స్వగతము చాల ప్రధానమైనది. ఇందులో పటాణి విషాద నాయకలక్షణములను ప్రస్ఫుటముగా స్పష్టము గావించుట కొరకు శ్రీనివాసరావుగారు ప్రయత్నించిరి వివిధ రసభావముల కనుగుణముగా రచనయు సాగినది ధర్మాధర్మములకు, ఉచితానుచితములకు, పుణ్య పాపములకు మధ్య పటాణి మనస్సులో సంఘర్షము కలిగినది. తాను గావించిన ఘోరకృత్యమును తలంచి పటాణి :

"కనులకుఁ గావరంబెగయఁ గప్పఁగ, మన్నును మిన్నుఁగానకే
యనుపమ ఘోరకృత్యమకటా ! యొనరించితి సంగరావనిన్
ఘనునకుఁ గారవంబునను గాచి దయన్ గనినట్టి స్వామికిన్
జనకునకయ్యో ! ఘాతుకుఁడ సల్పితి నాతత పాతకంబులన్"

అని వాపోయి మిక్కిలి దురపిల్లి ద్వైధీభావముతో మానసిక బాధను వ్యక్తము గావించెను. తండ్రిని జంపిన ఘాతుకు డగుట తన కిహపరము లుండవని,మరణమే శరణ్యమని ఆలోచించుచు, దుఃఖావేశములో దీని కంతటికి కారణభూతురాలు ఆషాబీయని యెంచి, ఆమె గన్పట్ట శతవిధములుగ నిందించి. చివరికి ఆమె మాటలవలన ఆ తప్పిదమంతయు తనదేనని గ్రహించి సమాధానపడి పటాణి ఆమెతో సుఖముగా జీవించుటకు నిశ్చయించు కొనును. ఇట్లు షేక్స్పియరు నాటకములలోని విషాద నాయకుని వలె శ్రీనివాసరావుగారు పటాణి పాత్రను పోషించి చివర నాటకమును మోదాంతము గావించుట ఉచితముగాదని తలంచిన శ్రీ బళ్ళారి రాఘవగారు మున్నగు ప్రముఖ నటులు పటాణి ఆషాబీని చంపి, తానాత్మహత్య గావించుకొన్నట్లు మార్చి ప్రదర్శించి ఉత్తమ విషాద నాయకునిగా పటాణిని నిరూపింప యత్నించిరి. వాస్తవమున కిదియే సహజ పద్ధతి యనవలెను.ఇక్కడ దీని కనుకూలించు మరొకయంశముగూడ కలదు. షేక్స్పియరు నాటకములలో విషాద నాయకు డేదో యొక స్వయంకృత దోషము వలన దుర్మరణము పొందినట్లు చిత్రింపబడి యుండుట సర్వసామాన్యము. అదే విధముగా రామరాజు తన తండ్రియనెడి గౌరవము, ప్రభువనెడి భక్తి లేకపోవుటయే గాక, తల్లి నిర్దేశము నైన లెక్కచేయక వధించుట పటాణిలోని దోషము. ఈ దోషము వలన గూడ పటాణి విషాద నాయకుడనెడి భావముతో నటులట్లు

ప్రదర్శించి యుందురనియు మనము తలంపవలెను. ఇంతేగాక దీనిని విషాద నాటకముగ కీర్తించిన వారును లేకపోలేదు. "ఆధునిక నాటక కవులలో ప్రథమ శ్రేణి యందుండఁదగిన కోలాచలం శ్రీనివాసరావుగారు వ్రాసిన 'రామరాజు' లేక విజయనగర సామ్రాజ్యాంత మనెడి నాటకము నిక్కముగ విషాద నాటకమే." అని టేకుమళ్ళ అచ్యుతరావుగారు తెలిపి ప్రపంచ విషాద నాటకములలో నొకటి యని కీర్తించి యున్నారు. [1]

కాని పటాణి ధీరోదాత్త నాయకునిగా తలంచుటకు వీలులేదని వాదించిన విమర్శకులును కొందరు గలరు. "షేక్స్పియరు మహాకవి హామ్లెటునకు గాని, భవభూతి విరచిత శ్రీరామునకుగాని, చంద్రమతిని చంపునెడ హరిశ్చంద్రునకుగాని కలిగిన యుత్తమాదర్శ సంక్షోభములు ఈ మొండి పఠానునకు ఆరోపించి యభినయించుట తప్పు." [2] అని తెలిపి శ్రీ పురాణం సూరిశాస్త్రిగారు సయుక్తికముగా నుపపత్తుల జూప యత్నించిరి. అట్లే శ్రీశిష్టారామకృష్ణశాస్త్రిగారును "ఇట్టి పఠాను చరిత్ర వలన ప్రేక్షకులకు భయ నిర్వేదములు కలుగక పోగా, రావణ దుర్యోధనాదుల వలె నట్టి వాఁడు చచ్చిన మేలే యనిపించును. ఇందుచే విషాద నాయకుని లక్షణములు పఠానుని యందు వర్తింపవు కాన నిది విషాద నాటకమనిపించుకొనదుక.నుక పఠానుని విషాద నాయకునిగ నటులు భావించుట కాని, యీ నాటకము విషాదాత్మక నాటక లక్షణోపేతమని లోకము తలంచుట కాని యనుచితముగ నుండును" [3] అని వివరించిరి. కాని యీ సందర్భమున గమనింపవలసిన కొన్ని ముఖ్యాంశములు గలవు. సంస్కృత లాక్షణిక మతానుసారముదాత్త నాయకులగు శ్రీరామహరిశ్చంద్రాది ధీరోదాత్త నాయకులతో పటాణిని పోల్చుట తగదు శ్రీనివాసరావుగారు పాత్ర చిత్రణమున పాశ్చాత్య పద్ధతి ననుసరించిరి. కనుక భారతీయ పద్ధతిలోని యుదాత్త నాయకులతో పటాణిని పోల్చుట వలన ప్రయోజనమేమి ? "కథా నాయకుడు సత్పురుషుఁడు కావలెనను నియమ మెన్నఁడును లేదు. క్రూరులును ధనార్జనాపరులును రాజద్రోహులును కూడ నాయకులుగా నుండుటను చూచు

1. 5. పు. 86, 87. 2. 2. పు. 216.
3. 54. పు. 256.

చున్నాము. క్రూరులను చూచినపుడు భీతియు నిరపరాధులను చూచినపు డెల్ల కనికరమును చూపఱయందుద్భవించు చుండును. కథానాయకుని యత్నము సదుద్యమమైనచో, అతనిని చూచి మనము జాలిపడ వచ్చును. సాహసము కలవాఁడు దుర్మార్గుడైన నేమి? అతని సామర్థ్యము లను చూచి యాశ్చర్యమునొందని వారుండరు. రాజద్రోహి (మెక్బెత్ కథకు నాయకుఁడైనంత మాత్రమున, ఆ కథను చదువుట మానితిమా? చిత్రాంగి దుర్మోహమునకు పాల్పడెనని ఆ నాటక మందలి కవితాచమత్కృతి తగ్గెనా? దుర్మార్గులనుగూర్చియు వారు ధర్మనిరతులను జయించుటకు చేయు ప్రయత్నములను గూర్చియు వినుటకు మనకు నీతిదాయకముగాదా?"[1] అని పై విమర్శకు సూటియైన సమాధానమా? అనునట్లువాదించు శ్రీ తణికెల్ల వీర భద్రుడుగారివంటి విమర్శకులును గలరు. షేక్స్పియరు గొప్పవిషాద నాటకము లలో "మేక్బెత్" ఒకటి. అందలి నాయకుడు మేక్బెత్ డంకన్ ప్రభువు ఇద్దరు సేనానులలో నొకడు రాజద్రోహియై మేక్బెత్ డంకన్ ప్రభువును సంహరించును అంత మాత్రముచేత మేక్బెత్ ఆ నాటకమునకు నాయకుడు కాకపోయెనా? అంత మాత్రముచేత దానికి గల విషాద నాటకగౌరవము తగ్గి పోయెనా? అదే విధముగా రామరాజునకు మహమ్మదీయ వనితవలన కలిగిన పుత్రుడు పటాణి, అతని సేనానులలో నొకడు. మేక్బెత్‌వలెనే రామరా జేమరుపాటున యుద్ధావని నుండ కంఠము త్తరించెను. అట్టి యెడ పటాణి నాయకుడుగా నంగీకరించుటకుగల ఇబ్బందులేవి? కనుక నే పటాణి రామరాజు చరిత్రమున నాయకుడనుటకు సంకోచింపవలసిన అవసరములేదు. అందుచే శ్రీనివాసరావుగారు పాశ్చాత్య విషాద నాయక లక్షణోపేతముగానే పటాణి పాత్రను చిత్రించిరనుటయే యుచితము ఇంతేగాక విషాదాంత నాటకము (Tragedy)లో జాలి, భయము (Pity and fear)ననెడి భావములుత్పన్నములై తన్మాలిన్య పరిమార్జనము (Catharsis or purgation) కలుగునని అరిస్టాటిల్ సిద్ధాంతము. రామరాజు చరిత్రమున కీ సిద్ధాంతము ను వర్తించును. ఆయా సందర్భములలో జాలి, భయము లనుభావము లుత్పన్నములై తన్మాలిన్య పరి మార్జనముగూడ జరుగుననుటలో సందేహములేదు. అందుకు పటాణి పాత్రలో

---

1. 60 A పు. 345, 346.

శ్రీనివాసరావుగారు ప్రవేశపెట్టిన భావ సంఘర్షమే నిదర్శనము. తదుచితరీతి నా పాత్ర చివరివరకు సంపూర్ణ విషాదనాయకునివలె నొప్పారుటయే సమంజస మని గుర్తించిన సాటిలేనిమేటి నటులు ఆ పాత్ర ధరించి నటించిరమటలో విప్రతిపత్తి లేదు. అందు కా దినములలోనట్టి మార్పు గావింపబడి ప్రదర్శింపబడిన అనగా విషాదాంతముగా జేయబడిన రామరాజు చరిత్రమును సమాదరించిన సహృదయ హృదయసామాజికులే చక్కని సాక్ష్యమని తలంపవలెను. మరొక చిన్న విషయము. శ్రీ పురాణం సూరిశాస్త్రిగారు, శిష్టా రామకృష్ణ శాస్త్రిగారు పటాణి యుదాత్త నాయకుడుకాదని వాదించినను మహమ్మదీయ స్త్రీలను, మతమును అవమానించిన దుర్మార్గుడు రామరాజునియెంచి అతనికి ప్రతీకారము చేయదలచిన పటాణిలో స్వమత, స్వజాతిస్త్రీ, స్వరాజ్య వైభవ సంరక్షణములు ప్రాధాన్యము వహించుటచే మహమ్మదీయుల కందరికి పటాణి ఉదాత్తుడుకాక నీచుడెట్లగును ? 'రామరాజు చరిత్రము'న విజయనగర వినాశము నకు కారణము పటాణి అను సంగతి మొదటినుండి నాటక క్రమదశలలో పటాణిపాత్ర చిత్రింపబడిన విధమును పరిశీలించినచో పై మార్గమున శ్రీనివాస రావుగారి హృదయము స్పష్టమగును. కాని ఇదియే పరమార్థము కాదు. రామరాజు హైందవరాజ్య సంరక్షణకై చేసిన ప్రయత్నములలో రామరాజు గొప్పదనము విస్మరింపరాదు.[1]

---

1. మిత్రులు శ్రీ కొత్త దేశపతిరావుగారు (బళ్లారి రాఘవ పు. 99 - 101) అంతకుముందే శ్రీ పి. వి. రాజ మన్నారుగారు (త్రివేణి 1929) "రామరాజుచరిత్ర"లో కథానాయకుడు పటాణి కాదనియు, రామరాజేననియు పేర్కొనిరి. కాని పై పరిశీలనా నంతరము స్త్రీవ్యామోహమను ఒక బలహీనతతప్ప రామరాజుకో విషాద నాయకునకుండవలసిన లక్షణములులేనే లేవు. అత డుత్తముడు. రాజకీయ చతురుడు, మహాసామ్రాజ్య పునస్థాపనా దక్షుడు. ఉత్తమ విషాద నాయకుడు పటాణి. అయినను "రామ రాజు చరిత్ర, విజయనగర వినాశము" అని నాటకకర్త రెండు పేర్లు పెట్టుటలో నిది స్ఫురించును. 'Julius Ceasar' నాటకములో నాయకుడు 'సీజర్' అని కొందరు, 'బ్రూటస్' అని మరికొందరు తలంతురు సీజర్' అన్నదే నాటక నామ

ఇంకను సూక్ష్మపరిశీలనముచేసినచో మరొక విషయము ప్రధానమైనది గోచరింపకపోదు. 'రామరాజు చరిత్రము'ను విషాదాంతము గావించుట శ్రీనివాసరావుగారి ముఖ్యాభిమతము కాదు. మోదాంతముగావించుటయే వీరి కిష్టము. అందుచే ఆంగ్ల నాటకములతో వీరికున్న అతిమాత్ర పరిచయము వలన విషాద నాయకునకుండవలసిన లక్షణము లన్నియు పటాణి పాత్రలో కుదురుకొన్నప్పటికి నాటకమును మాత్రము మోదాంతము గావించుటయే వీరికి సమ్మతము. కనుకనే రామరాజు వధానంతరము తండ్రిని జంపిన ఘాతుకుడ నని ఖావ సంఘర్షముతో బాధపడి, అందుకు కారణ మాషాబీయని ఆమె కంఠము నులుమయత్నించి, ఆమె మాటలచే వారింపబడి వివేకముతో అందుకు తానే కారణమని గ్రహించి స్వమత రక్షణార్థము గావించితినని సహించి, ఆషాబీనికూడి సుఖింప సమ్మతించినట్లు నాటకమును ముగించి శ్రీనివాసరావు గారు మోదాంతము గావించిరి. కనుకనే నాటకము విషాదాంతముగా మార్చుట తమ కిష్టము లేదను నభిప్రాయమును వీరే "ఈ నాటకము మోదాంతముగనే నొనర్చితిని. అయిన నిచట సుమనోరమ సభవారు దానిని ఖేదాంతముగ మార్చినారు. అనగా పటాణి యున్మాదుండై యించుక పిచ్చితెలిసి యున్న కాలము నందాషాబీ యతని నాడిన పలుకులకు గినిసి, యాషాబీనిఁజంపి తను జంపుకొనెనని మార్చినారు. ఇదియ సరియయిన మార్గమని కొందఱి యభిప్రాయంబు. ఇందుకు భిన్నాభిప్రాయంబునైతము గలదు." [1] అని విశదపరచి

---

మైనను 'బ్రూటస్'నే నాయకుడనుట కవకాశమెక్కువ. ఇట్లే పటాణి పాత్రను మనము గ్రహింపవలెను. కనుక విషాద నాయకుడు పటాణి అనుటలో విప్రతిపత్తిలేదు. ఈ సందర్భమున "Diversity of Opinion about a work of art shows that the work is new, complex and vital.

When critics disagree the artist is in accord with himself." (Oscard Wilde) అను మాటలు సమన్వయించినచో కోలాచలం శ్రీనివాసరావుగారి రామరాజు చరిత్ర వైశిష్ట్యము సువ్యక్తముకాగలదు!

1. 100. పి. పు. 2:

యున్నారు. అందుచే పాశ్చాత్య విషాద నాటకపద్ధతి ననుసరించి విషాద నాయక (Tragic hero) పాత్ర చిత్రణలోని సంఘర్షము (Conflict) మున్నగు విషాద లక్షణములు (Tragic elements) గ్రహించి పటాణిపాత్ర పోషణ గావించినప్పటికి సంస్కృత నాటకపద్ధతి ననుసరించి యీ నాటకమును విషాదాంతముగాకాక మోదాంతముగా చేయుటయే శ్రీనివాసరావుగారి కభిమతమని స్పష్టమైనది. పాశ్చాత్య భారతీయనాటక లక్షణములను మేళవించి శ్రీనివాసరావుగారీ నాటకము రచించిరి. కనుక రామరాజు చరిత్రము మోదాంతమగుట జరిగినదని మనము గుర్తింపవలెను. ఇట్లు నాటకములో అపరిహార్యమై ఉత్తమమైన సజీవపాత్ర చిత్రణ మను లక్షణముతో పాశ్చాత్యపద్ధతిని అనన్య సామాన్యముగా, అసదృశముగా రామరాజు చరిత్రమున పటాణిపాత్ర పోషణ గావించి, ప్రముఖాంధ్ర నాటక కర్తలలో సర్వోత్తములుగా చిరస్మరణీయులైన ఘనతను సంపాదించుకొని శ్రీనివాసరావుగారు ధన్యులైరి !



# 7. రచనా శిల్పము

## 7.1 సంభాషణలు :

నాటకములందు సంభాషణల రచన, పద్య రచనాపాటవము, ఛందస్సు, పాటలు, భాష వీని ప్రయోగములను గలిపి రచనా శిల్పముగా భావించి యిందు వివరింపబడినది. ఇతివృత్త నిర్మాణ దక్షత, సన్నివేశకల్పనా సామర్థ్యము, పాత్రపోషణ చాతుర్యము నను లక్షణములతోపాటు ఉచితరీతిని సంభాషణల రచించుటలో నాటకకర్తకు నేర్పరితనముండి తీరవలెను. సంభాషణ రచనా వైదగ్ధ్యము లేని నాటకము సహృదయ సామాజిక మానసిక సీమల కానందము నాపాదింపజాలదు. నిజమునకు సంవాదముండిననే నాటకమగును-లేనిచో నది శ్రవ్యకావ్యమగు ననుట సువిదితమే. కనుక సంభాషణ నాటకమునకు ప్రాణమనుట యుచితము. సందర్భోచిత సంభాషణలు లేని నాటకము అంగోపాంగములతో కూడిన ప్రాణ రహితమైన శరీరముతో సమానము. అనగా ప్రాణరహిత శరీర మెట్టిదో మనకు తెలిసినదే.ఇతివృత్త,పాత్రచిత్రణములందు వలెనే సంభాషణలోను సంక్షిప్తత (Brevity) చాల ముఖ్యము. అనగా సంభాషణలు సంక్షిప్తములు, నాతిదీర్ఘములునై యుండవలెను. ఇవి చతురములై, అర్థవంతములై సరళములై యుండుట సమంజసము. ఇవి దైర్ఘ్యము, అన్వయ క్లిష్టత, దూరాన్వయమునను దోషదూషితములై యుండుట వాంఛనీయము కాదు. సామాజికులు విన్నవెంటనే అర్థముచేసికొనునట్లు సందర్భోచితమై అర్థకాఠిన్యము లేకుండ నుండవలెను. కష్టార్థపద సంయోజనము గల శ్రవ్యకావ్యమైన నైఘంటికార్థముతో సంతోషింపనగును. కాని నాటకము రంగ ప్రదర్శన యోగ్యమైన దగుటచే రంగమున ఆ యా పాత్రధారులు మాటలుచ్చరించిన తోడనే సులభగ్రాహ్యములుగా నుండుట అత్యావశ్యకము. సంభాషణలతిదీర్ఘములైనచో రంగమున నొక పాత్ర మాటాడుచుండ తక్కిన పాత్రలు-

బెల్లముగొట్టినగొంద్రాళ్ళవలె నుండవలసివచ్చును. అది పాత్రధారులకుగాని, ప్రేక్షకులకు గాని సహింపరాని విషయము. అంతేగాదు. దానివలన నాటక కార్యవేగము మందగించును. వేగము తగ్గినచో నది సామాజికుల సహనమునకు పరీక్షయగును. కనుక ప్రేక్షక లోకమునకు విసుగు జనింపని యట్లు, ఆసక్తి జనకములై నాటకమున సంభాషణలు సాగవలెను. అప్పుడే నాటక కర్త నైపుణ్యము ప్రకటితమగును.

శ్రీనివాసరావుగారు నాటకములను రచించుటతో నాటక కర్తగా తమ కర్తవ్యము ముగిసినట్లు తలంచి యుండలేదు. నాటకములను రచించి వాని ప్రదర్శనము విజయవంతమగుటకు యత్నించిన వారగుటచే నాటక సంభాషణలు నడపుటలో మిక్కిలి నైపుణ్యము కలవారనుటలో సందేహము లేదు. ఇది వీరి నాటకముల పరిశీలించుటచే వ్యక్తమగును.

7.1.1 'సునందనీ పరిణయము'న సంభాషణలు దీర్ఘములై యున్నవి. పద్యగద్యములలో చాలకాల మొకే పాత్ర ప్రసంగించుటకలదు. అట్లే సుదీర్ఘ స్వగతములును గలవు. ఇందుకు కారణ మిది ప్రథమ నాటక మగుటయే. అయినను పూర్వపూర్వవాక్యులకు ఉత్తరోత్తర వచనములకు అవినాభావ సంబంధమవిచ్ఛిన్నమై యుండుటచేత నా నాటకమునకు గౌరవము గలదు. గద్యపద్యము లనేకము రచించి దీనిని ప్రబంధముగా నొప్పునట్లు గావించి తమ పాండిత్య ప్రకర్షను ప్రకటించిరి. కనుక దీనిని సంవాదరూపముననున్న ప్రబంధమనినను తప్పులేదు. కాని ఇది శ్రీనివాసరావుగారి తప్పేమిగాదు. ఆనాటి యాంధ్ర నాటక రచనా పద్ధతులు సహితమట్లుండుటయు కారణమనుట సమంజసము. అయినను అతి దీర్ఘములై సులభములై యలతియలతి వాక్యములతో నొప్పుచున్న సంభాషణలు గూడ నిందు లేకపోలేదు. క్రమముగా శ్రీనివాస రావుగారు దీర్ఘ ప్రసంగములతో కూడిన సంభాషణా పద్ధతిని వదలి, చిన్నచిన్న వాక్యములతో కూడిన సూటియైన సంభాషణలే రచించుచు వచ్చిరి. క్రమముగా పద్యములపై నున్న వ్యామోహమును తగ్గిపోవుచు వచ్చినది. శ్రీనివాసరావు గారి సంభాషణ రచనా నైపుణ్యమునకు నుత్తమోదాహరణములు 'సుల్తానా చాందుబీ, రామరాజు చరిత్రము, పాదుకాపట్టాభిషేకము, ప్రహ్లాద' అను నాటకములు. తదితరము లందుత్తమ సంభాషణలు లేవని కాదు. కాని వీనిలో

సంభాషణములు మిక్కిలి నిపుణముగా నిర్వహింపబడినట్లు స్పష్టము కాకమానదు. 'మానాపమానము' నను సంభాషణ లతి చతురములై ఉక్తి ప్రత్యుక్తులతో నొప్పుచున్నవి. ఈ విషయమును గూర్చి శ్రీనివాసరావుగారే "యూరపియన్ భాషలలోఁ బేరందిన మోదాంత నాటకములు విశేషముగనేఁ జదివినాను. వానిలో దేనికిని నీ 'మానాపమాన' నాటకము తలవంచునదికాదు. అచట నచట వన్నె హెచ్చించఁ బడజేసినదనియే నాతాత్పర్యము. షెరిడన్ "TheRivals" "The School for Scandal" యను నాటకములందుఁ గల సంభాషణ మతి రమ్యమని పండితులతాత్పర్యము. ప్రస్తుత నాటక సంభాషణ మతి స్తుత్యముగ నున్నది." [1] అని సెలవిచ్చినారు. కాని దీని మూలనాటక కర్త యైన శ్రీ కె. పి. ఖాడీల్కార్ గారికి కూడ ఆ గౌరవము దక్కనుగదా ! శ్రీనివాసరావుగారి నాటకము లందలి సంభాషణల పరిశీలింతము.

7.1.2 సంభాషణ లుక్తిప్రత్యుక్తులతో చతురములై సామాజికుల కాసక్తి జనకములై యుండవలెను. ఇట్టి సంభాషణలకు శ్రీనివాసరావుగారి నాటకములలో ననేకోదాహరణములను జూపనగును. ప్రస్తావనలు గల "సునందనీ పరిణయము, సుఖమంజరీ పరిణయము, సుల్తానా చాందుబీ, కాళిదాసు" నను నాటకములందిట్టి సంభాషణలు గలవు. నటీ విదూషక సూత్రధారుల మధ్య కొనసాగిన సంభాషణలు చతురముగ నున్నప్పుడే ప్రేక్షకుల మనసుల నాకర్షింపగలవు. రావుగారీ విషయము బాగుగా గుర్తించిన వారు గనుక మిక్కిలి చతురముగా నీ సంభాషణ నడిపి యున్నారు. 'సుల్తానా చాందుబీ' ప్రస్తావనలో విదూషక సూత్రధారుల నడుమ కొనసాగిన సంభాషణ చతురమై యొప్పుచున్నది. సూత్రధారుడు నాందీ ముగించి "ఏమీ ! నటి రాదయ్యెను ? పని బలమాయెఁ గాఁబోలు ! పనిలేని పనికిఁ బ్రొద్దు చాలదనునది నిజము. సకాలమునకుఁ బ్రారంభింతు మనిన నేదోయొక యంతరాయము వచ్చును.

(విదూషకుడు ప్రవేశించును)

విదూ : (సూత్రధారు నెగాదిగఁ జూచి) అయ్యా ! నీవెవఁడవు ? ఏ వ్యాపార

1. 118. పి. పు. 4.

మునకు వచ్చినాఁడవు ? ఓడమీద వచ్చితివియా ? గుఱ్ఱము పైన వచ్చితివియా ?

సూత్ర : ఏమోయి ! పరిచయము లేని వానింబలె నడిగెదవు ? నీ మిత్రుఁడను సూత్రధారుఁడనుగానా ?

విదూ : (మరల నెగాదిగఁజూచి) కాదుకాదు. నా మిత్రునకీ దుస్తులెక్కడివి ? ఈ దువ్వలువలెక్కడివి ? ఈ పట్టు తలగుడ్డ యెక్కడిది ?

సూత్ర : మిత్రమా ! ఇవి యన్నియును నా విద్యాకుశలత నార్జించితిని.

విదూ : (నవ్వుచు) నే నమ్మను. కష్టపడి ద్రవ్యమార్జించు వాఁడు దంబాదారి వేషము వేయునా ?

సూత్ర : (కినుకచే) ఏమోయి ! నేను దొంగ ననుకొంటివియా ?

విదూ : ఎవరనిరి ? "గుమ్మడికాయ దొంగ యనిన భుజము ముట్టికొని చూచికొనె"నను సామెత రీతిగ నీకు నీవే వర్తించుకొనుచున్నావు.

సూత్ర : నీ యర్థ మేమి మఱి ?

విదూ : ఏమియులేదు. ఇప్పటివారి పద్ధతిరీతిఁ జాకలి యెరవనుకొంటిని.

సూత్ర : అటులుండినను గొన్ని యుండవచ్చును

విదూ : అన్నియు నవియే యవిన సిగ్గుచేటూ?......

ఇట్లుక్తి ప్రత్యుక్తులతో సంభావణ కొనసాగినది. ఇట్లే యితర నాటకము లందును కననగును. ప్రస్తావనలోనేగాక నాటకస్థ సంభాషణలును చతురతతో నొప్పుచున్నవి. 'సుఖమంజరీ పరిణయము'న ఉదయపురి రాజపుత్రి సుఖమంజరిని యుద్యాన వనమునే గాంచి వచ్చిన వెనుక జయపురిరాజు ప్రద్యుమ్నుని స్థితినిగాంచి యతని సఖుడు సంజయుకు శరీరము కృశించిన దేమి యని యడుగును.

ప్రద్యు : మిత్రమా ! దేహంబు కృశింప నేల ? రోగంబెద్దియును లేదు.

సంజ : సఖా ! కొన్ని రోగంబులు వెలియగునవికావు.

ప్రద్యు : మిత్రమా ! వెలికి నగపడని రోగంబది యెట్టిది ?

సంజ : మనోజ...కాదు కాదు. మనోరోగము.

ప్రద్యు : మిత్రమా! మనోరోగంబు నాకేల ? దుష్ట శత్రువునొకనిఁ దుద ముట్టించితి.

సంజ : హితశత్రువుమ దెచ్చికొంటివి.

తే. గీ. వెలికినగపడు వైరిని వెతకి పట్టి
సంగరంబునఁజంపి యుప్పొంగి తీవు
గాని హితవైరిగా మనమానియుండు
వానిఁ దెచ్చితివిదియేమొగాని వింత.

ప్రద్యు : ఆ హిత శత్రువెచ్చటనున్నవాఁడు ?

సంజ : నీ మనంబున.

ప్రద్యు : వాఁడెవఁడు ?

సంజ : మనోజుఁడు.

ప్రద్యు : మిత్రమా ! హేళి యొనర్చెదవో...

ఇట్లతి చతురమై యొప్పుచు సంభాషణ కలదు. ఇంకను 'పాదుకాపట్టాభిషేకము'న కైకా మంథరల సంభాషణమును, 'శ్రీరామజననము'న ఋశ్యశృంగునితో వేశ్యాత్రయము గావించిన సంభాషణమును ఉక్తి ప్రత్యుక్తులతో

నొప్పుచు నాటక కర్త సంభాషణరచనా వైదగ్ధ్యమునకు చక్కని తార్కాణము లుగ నొప్పుచున్నవి.

7.1.8 అలతి యలతి వాక్యములతో సంభాషణము చతరముగా నడపుట శ్రీనివాసరావుగారికి సాధ్యమగును చిన్నచిన్న వాక్యములుండినచో నాటకకార్యము శీఘ్రగమనమున సాగిపోవును. దీర్ఘ ప్రసంగముల వలన నాటక కార్యము మందగించును కదా ? అందుకొరకు రావుగారిట్టి సందర్భముల చిన్న వాక్యముల రచించుటకే యిష్టపడుదురు. నాటక కథలో పూర్వాపరములు తెలియుటకై రచించిన రంగములలోనిట్టి సంభాషణ లొప్పుచుండును. విష్కంభ ప్రవేశకముల కార్యముల సాధించు రంగములలో వీనిని కననగును. 'సుల్తానా చాందుబీ'లో ఖండోజీ ధోండోజీలయు, "శిరోమణి"లో లక్ష్మణరామ వర్మలయు, 'ప్రతాపాక్బరీయము'న రామ లక్ష్మసింగులయు, 'చంద్రగిర్యభ్యుదయము'న రెడ్డి కరణములయు సంభాషణలిందుకు ఉచితమైన యుదాహరణములు. ఇందలి వాక్యము లతి క్లుప్తముగానుండి కథావిషయమును వివరించుచుండును. తన్మూలమున ఔత్సుక్యమును ప్రేక్షలలో ప్రేరేపింపజేయుచు నాటకమునంతటిని తుది ముట్టజూచు లాగొనరించును. నాటకస్థ పాత్రల సంభాషణములును చిన్నచిన్న వాక్యములతో అర్థనిర్భరములై యొప్పుచుండుటయు గలదు. "చంద్రగిర్యభ్యుదయము"న కుముదిని యను సార్థక నామధేయయైన చంపను బంధించికొని పోవుటకై చాందుఖాన్ వచ్చినప్పుడు వారిద్దరిమధ్య నడచిన సంభాషణ యిది.

చంప : శూరవరా ! అబలలను బలవంతులు బట్టినచో బలువంతల పాలగుదురు. దూరమాలోచింపుము.

చాంద : నేనాలోచించితిని. బలవంతముదప్ప నాకు వేఱు మార్గముతోపదు.

చంప : వీరాగ్రణీ ! నీవు నన్ను బలాత్కరించినచో నీకుదక్కునది ప్రాణము లేని నా శరీరము.

చాంద : శరీరమో ! శవమో ! పాదుషాగారికిఁ జూపుట నా పని.

చంప : అదియా నీ నిర్ధారణము ?

చాందు : నిజము. అదియేను !

చంప : ధీరవరా ! నీకు యుద్ధధర్మములు తెలియునా ?

చాందు : పైగంబరుని శిష్యుఁడగు నాకుఁ యుద్ధ ధర్మములు తెలియవా ?

చంప : చూడుము నేను నిశ్శస్త్ర పాణిని గదా ?

చాందు : నిజము.

చంప : పరపురుషునితో స్త్రీలు మల్లయుద్ధము జరుపుట న్యాయ విరుద్ధము కదా ?

చాందు : న్యాయ విరుద్ధమేను.

చంప : అటులయిన, శూరాగ్రణీ ! నాకు యుద్ధభిక్షనిమ్ము. నా కొక కృపాణము సైతమిమ్ము. నేనోడినచో నన్నుబట్టికొని పొమ్ము.

చాందు : (స్వగ) ఔరా ! ఈ స్త్రీసాహసము. నాతో శస్త్రయుద్ధము సలుపునట. ఆ వినోదమించుక యనుభవించెద. (అనుచు నొక కృపాణ మిచ్చును.)

ఇట్లీ సంభాషణసాగినది. వారిద్దరికి యుద్ధము జరుగునంతలో చంపను పోషించిన బ్రాహ్మణుడు సమీపింపగా నతనివలన తన మిత్రుడైన యాచమ నాయకునకు కాబోవు ధర్మపత్ని చంపయని తెలిసికొని కత్తిని పారవైచి తన సోదరియని చాందుఖాన్ అటు తరువాత మైత్రితో మెలగును. వాస్తవమున కీ సన్నివేశము తరువాత కథ కంతయు ప్రాధాన్యము వహించిన దనుటలో సందేహము లేదు. పై సంభాషణమున వాక్యములు మిక్కిలి చిన్నవై భావ వ్యక్తీకరణమునకు ఉచితములై యున్నవి.

7.1.4 సందర్భోచితములై రసభావానుగుణముగా నాయా పాత్రలకు - ఉచితరీతిని రచిత సంభాషణలు కోకొల్లలు. 'రామరాజు చరిత్రము'న బాల కాలము నుండి తన తండ్రి యెవరైనది తెలిసికొనవలెననెడి వాంఛను బీజాపురమున కేగినపుడు తల్లి మహబూబుబీని కలిసికొని వ్యక్తముచేసి, చెప్పుమని పటాణి గ్రుచ్చిగ్రుచ్చి యడుగును. అతని కా విషయము తెలియకుండుటయే యుచితమని ఆమె తలంచి తదుచితముగా సమాధాన మొసగును. ఇచట సందర్భోచితముగా మాతాపుత్రుల సంభాషణ యొప్పుచున్నది.

మహబూబుబీ : (నిట్టూర్పు విడుచును) కుమారా ! నీవు పలుమారు నన్నీరీతి ప్రశ్నించుచు వచ్చితివి. ఆక్కాలము నందెల్ల నాకు మితిలేని వ్యాకులత సంభవించుచుండెను. అది కని నీవు నన్నీ విషయంబునఁ బ్రశ్నింప మానితివి. మానితివని యుంటిని. మరల నీతూరి గ్రుచ్చిగ్రుచ్చి యడుగఁజొచ్చితివి. వలదనినను వదలవు. నీ తండ్రి యునికి నీకుఁ దెలియనిదే మేలు

పటాణి : మాతా ! జనకుని కుల నామములఁదెలియని సుతుని జన్మమేల ? ఇది యెఱింగింప సంకోచంబు నీ కేల ?

మహ : కుమారా ! ఇది తెలిసినచో నీకు లాభమేమి ?

పటాణి : తల్లీ ! అపుడుగదా నా జననౌన్నత్య హీనతలు నాకు దెలియును.

మహ : (చింతించుచు) కుమారా ! మొఱకు పట్టుపట్టియీరీతి నను బాధించుట ధర్మముగాదు. ఆ మాటలిఁక జాలింపుము. పుత్రా ! నిన్నేలు రామరాజు సుఖముగ నున్నవాఁడా ? నీ యందుఁ బ్రేమ తప్పదు కదా ?

పటాణి : తల్లీ ! ఆ రామరాజు సుఖంబునకే లోపంబు లేదు. అతఁడు నా విషయంబున మిక్కిలి ప్రేమఁ జూపుచున్నాఁడు.

మహ : కుమారా! నీ పతని భయభక్తులతో సేవించు చున్నావా ?

పటాణి : అమ్మా ! అది యేమోకాని నేతనని(జూచినప్పటి నుండి యెవుడెపుడు వానింబట్టి చంపుదునా యను తలంపుగలుగు చున్నది.

మహ : (నిట్టూర్పు విడుచుచు మోమువంచుకొని) కుమారా ! ఏలినవాని పైన నీ వట్టిద్రోహములం దలంచుట న్యాయమా ?

పటాణి : తల్లీ ! ఇది ధర్మముకాదని యెన్నిమారులునేఁదలఁచినను వాఁడు మన మతస్థులనుంచు బాధలను జూచినపుడెల్ల నా కా తలంపు మరల నిన్మడించుచున్నయది.

మహ : కుమారా ! హిందూ రాజులకు మన మతముపై దాక్షిణ్యముండునా ? మన మతము వారికి హిందువులపై నభిమానముండునా ?

పటాణి : మహమ్మదీయ కులమునఁబుట్టిన నేనట్టి హింసలుచూచి యోర్వఁగలనా అయ్యో ! పోయిన సంవత్సరమున ముదగల్లు నవాబు బిడ్డనుబట్టి తెచ్చి యా స్థానమున నవమానపఱచి మోము ముసుఁగుదీయించెను.

మహ : ఏమీ ! ఈ దుర్గణమును నతడింకను వదల లేదా ?

పటాణి : తల్లీ ! 'ఇంకనూ వదలలేదా'యను కారణంబేమి ?

మహ : కుమారా ! చిన్ననాటినుండి యా రామరాజునకిట్టి దుర్గణంబులు గలవని యంటిని.

పటాణి : అమ్మా ! అది నీ కెటుల తెలియును ?

మహ : (ఆలోచించి) వినుకలిచే

పటాణి : తల్లీ ! అట్టి దుర్గుణాధికుండు వాఁడని కదా నేను వానిఁజంపఁ బ్రతిజ్ఞ చేసినాడను.

మహా : కుమారా ! ఇట్టి బుద్ధి నీకుఁదగదు. ఏలిన వానిపై ద్రోహంబు తలఁచుట తన తండ్రిపై ద్రోహంబు తలఁచుటకాదా ?

పటాణి : తల్లీ ! దుర్మార్గుఁడు తండ్రి యయిననేమి ? మఱి యెవఁడైన నేమి ? శిక్షార్హుఁడే కదా ?

ఇట్లు సందర్భోచితముగా సంభాషణ కొనసాగినది. తరువాత రామరాజే యతని తండ్రియని తల్లి చెప్పివేయును. ఇందు పుత్రునకు తండ్రి పేరు తెలియనీయకూడదని తలంచిన తల్లి మానసికవేదన, తెలిసికొనవలెననెడి కుమారుని యుత్కంఠ, రామరాజుపై పటాణికిగల కోపము మొదలైన భావముల కనుగుణముగ సంభాషణ రచింపబడినది. 'శిలాదిత్య'లోను ఆదిత్యుడు తన తండ్రి నెరుగగోరి తల్లియైన సుభగను ప్రశ్నించు సన్నివేశమునను నిట్టి సంభాషణమే కొనసాగినది. 'మైసూరు రాజ్యాభివద్ధి'లో కామ పిశాచావేశము పొందిన జగన్మోహినికిని, సంయమమే ప్రధాన గుణముగాగల సచ్ఛీలవంతులైన లక్ష్మణ పీరులకు జరిగిన సంభాషణమును సందర్భోచితమై వ్యక్తుల శీల స్వభావముల నభివ్యక్తముచేయుచున్నది. 'ద్రౌపదీ వస్త్రాపహరణము'న కపట సన్న్యాసి వేషమున బోయిన అర్జునునకు, సుభద్రకు జరిగిన సంవాదము శృంగారోచితమై యొప్పినది. అందులోనే భీమ బకాసురుల సంభాషణము వీరోచితమై తగి యున్నది 'కుశలవ'లో పట్టాభిషేకానంతరము వనవిహార సమయమందలి సీతారాముల సంభాషణ మతిచతురమై శృంగారానుగుణమై, ఉత్తమ పాత్రలకు ఉచితమైనట్లు సంభాషణ ముదాత్తముగ సాగినది. ఇందులోనే చాకలి రంగడు మొదలైన వారికిని, 'రుక్మాంగద'లో చాకలి దుర్గి తదితరులకు జరిగిన సంభాషణములును నీచ పాత్రోచితమై సందర్భానుగుణమై యొప్పుచున్నవి.

7.1.5 శబ్దాలంకారములతోకూడిన సంభాషణలును గలవు ఛేకానుప్రాస, వృత్త్యనుప్రాసాదులు గలవు. 'సునందనీ పరిణయము'న సునందనీ కుబేరులయు (2-5), 'రామరాజు చరిత్రము'న తిరుమలాంబా రామరాజులయు (4-1), 'శిలాదిత్య'లో నవమాలికా మదనులయు (8-1), 'రుక్మాంగద'లో

మోహినీ రుక్మాంగదులయు (8-8) సంవాదము లిట్టి ప్రాసఘటితములై యొప్పుచున్నవి.

సాధారణముగ నాయికాదులు సఖులతోకూడి వన విహారమున పుష్పాపచయము గావించునెడ సంభాషణలు రగడలలోనే నడచినవి. 'సునందనీ పరిణయము', 'సుఖమంజరీ పరిణయము', 'సీమంతిని', 'సీతాకాల్యాణము', 'కీచకవధ', బభ్రువాహన' మున్నగు నాటకములందిట్టి సంభాషణలు గలవు. కాని 'మదాలస'లో మదాలసా సఖులసంభాషణము వన విహారమున సీసపద్యము పాదములలో గలదు.

పద్యములలోగాని, పద్యపాదములలోగాని సంభాషణ లుండుట వీరి నాటకములలో సర్వసామాన్యమే. అయినను రసభావ విచ్ఛిత్తికెక్కుడను నివి కారణము కాలేదనవలెను.

ఒకటి రెండు మాటలతో సరిపుచ్చదగిన విషయములను సాగదీసి చెప్పుటయు క్వాచిత్కముగ గలదు. అందుకు 'మదాలస'లో మదాలసా కుండలల సంభాషణ ముదాహరణమగును.

ఇట్లు శ్రీనివాసరావుగారి నాటకములందు పాత్రోచితమై సందర్భానుసారమై, ఉక్తిప్రత్యుక్తులతోకూడి సరళములై సామాజికులకు సులభగ్రాహ్యములై సంభాషణలొప్పుచున్నవి.

## 7.2 కవిత్వము :

నాటకములందు ఇతివృత్తము, పాత్రచిత్రణము, సన్నివేశ కల్పనము, సంభాషణలను నంశములతోపాటు కవిత్వము నుచితమైన భాషయు నవసరము లనుటలో విప్రతిపత్తిలేదు. తెలుగు నాటకములలో గద్యపద్యములతో పాటు

లకుగూడ ప్రవేశముండుటచే గద్యపద్యగేయము లుచితరీతి నుపయుక్తమై నప్పుడవి పరకోటినందగలవు. శ్రీనివాసరావుగారి నాటకములు గద్యపద్య గేయాత్మకములు.

ఆధునిక కాలమున నాటకములందు పద్యములుగాని పాటలుగానియుండ కూడదను స్వభావవాదము బయలుదేరినది. నాటకమున పద్యములుండ కూడదని కొందరు; ఉండుట యెంతయు నవసరమని మరికొందరు; వృత్తములు గాక వచనమునకు దగ్గరగానుండు సీసము, తేటగీత, ఆటవెలదుల నుపయోగించుట యుచితమని ఇంక కొందరు. నాటకమున పద్యములుండినచో రాగాలాపనలో అభినయము చెడును, గనుక పద్యములుండరాదని వారి యభిప్రాయము. పద్యములేనిచో కేవల వచన నాటకము పేలవముగా నుండుననియు, పద్యము లత్యావశ్యకములనియు వారభిప్రాయపడిరి. పద్యములుండినను తప్పులేదు. కాని వానిని రాగయుక్తముగాగాక, భావవ్యక్తీకరణచణమైన పద్ధతిని పఠింపవలెనని మరికొందరు మధ్యేమార్గము నవలంబించిరి. ఇట్లు నాటక పద్యములగూర్చి ఆంధ్ర విమర్శక లోకమున వాదోపవాదములు జరిగి, వివిధ వ్యాసములు, గ్రంథములు గూడ వెలసినవి [1] క్రమముగా తెలుగు నాటకములు పాటలను త్యజించియు, ఆ వెనుక పద్యములను పరిత్యజించియు, కేవలము వచన నాటకములు అందునను వ్యావహారికమున రచింపబడుచు వచ్చినవి.

7.2.1 భావరసానుగుణముగ పాటలు, పద్యములు ప్రయోగింపవలెననియు [2] నాటక పద్యములను పాడవలెనే గాని గద్యమువలె పఠింప గూడదనియు [3] శ్రీనివాసరావుగారి యభిప్రాయము. దృశ్యముగా నొప్పుట నాటక

---

1. (i) 138. ఏప్రిల్ 12, 1911, (ii) 14. పు. 181 - 198, (iii) 2. (iv) 3. పు. 155-190, (v) 8. (vi) 11. పు. 148 - 164. (vii) 23, (viii) 45. పు, 604, 605- (ix) 54. పు. 801 - 402.

2. 188. ఏప్రిల్ 12, 1911, పు. iii.

3. 157. పు. 256, 257.

మునకు ప్రథమ లక్ష్యము. అది శ్రవ్యము గూడ నగుట ద్వితీయ లక్ష్యము. అనగా దృశ్య శ్రవ్యత్వములతో గూడిన నాటకమే సహృదయరంజకమై హృద్యమై యొప్పారునని తలంపవలయును. కనుక శ్రవ్యకావ్యమునకు ప్రధాన గుణము కవిత్వము. అట్టి యుత్తమ కవిత్వముతో గూడినచో నుత్తమ. నాటకముగా దాని గౌరవ మినుమడించును. పద్యములున్నవి గదా యని నాటక ప్రదర్శనమును సంగీత సభగామార్చివేయుట ఉచితముగాదు. శ్రీనివాసరావు గారు 'సునందనీ పరిణయము' కంటెముందు 'వైజయంతీ విలాసంబు'ను రచించిరి.[1] అయినను అది ముద్రణకు నోచుకొన్నట్లు లేదు. 'సునందనీ పరిణయము'న మాటలు పాటలు వ్రాసి తరువాత పద్యములు వ్రాసిరట.[2] 'సునందనీ పరిణయ' నాటకమున 315 పద్యములు గలవు. నాటకాద్యంతములలోని పద్యములు తొలగించినచో నాటకస్థ పద్యములు మొత్తము 304. నాటక పద్యము లధిక సంఖ్యలో గల నాటక మిదియే. ఆద్యంతము లందు గల పద్యములలో బంధ కవిత్వము నెక్కొల్పి, తమ పాండిత్య ప్రకర్షను ప్రకటించిరి.[3] నాటకారంభమున దేవతా ప్రార్థనలో పుష్పమాలికాబంధము, నాగబంధము, నాగపాశబంధము, రథబంధము, చక్రబంధము, గోమూత్రికా బంధము ననునవియు, చివర పుష్పమాలికా గోపుర బంధములును గలవు. అయినను శ్లేష కష్టార్థములు నాటకములందుండుట యనుచితమని వారి యభిప్రాయము.[4] అయినను వీరంత్య ప్రాసానుప్రాసాదుల ప్రయోగించిరి. "నాటకాదులందుఁ బూర్వకవులచే వర్ణింపబడిన వర్ణనలన్నియు జేయవలెనను నిర్బంధముంచికొనం జూచిన, వర్ణనలకై కథాసరణిని బలాత్కారంబుగా నీడ్చి కొని పోవులాగ్గె సారస్యము చెడు, నను భీతిచేఁ గొన్ని వర్ణనలు వదలితి."[5] అని వాకొనియు నిట్టి వర్ణనలను గావించియే యున్నారు. ఈ పై వానికన్నిటికి 'సునందనీ పరిణయము'న ఉదాహరణములు లభించును. ఇది వీరి ప్రథమ నాటకమగు కారణముచే తమ పాండితీ వైభవమును వివరింప దలచి అధిక సంఖ్యలో పద్యములు రచించిరి. వాస్తవమున కిది యొక ప్రబంధమువలె

---

1. 98. పీ. పు. 1. 2. 98. పీ పు. 2.

3. 98. పీ. పు. 2. 4. అదే. పు 2 3. 5 అదే

నొప్పారుచున్నది. ప్రబంధోచితముగా ఇందష్టాదశ వర్ణనలు పూర్తిగా లేకున్నను పుర, వన, విరహ వర్ణనాదు లనేకనులు గలవు. ఉగ్రసేనుడారంభమున రంగమున ప్రవేశించి జయమాలినిని పద్యములలోను, మధుర గతిరగడలోను నతివిస్తారముగ వర్ణించుటయు, సునందని ఇతర సఖులతో వన విహారమున పుష్పాపచయము వృషభగతిరగడలో సంవాదాత్మకముగా జేయుటయు, చంద్ర, మన్మథాద్యుపాలంభనము గావించుటయు, సుదేవుడు వనసరోవర వర్ణనలు మిక్కిలిగా జేయుటయు నిందు కుదాహరణములు. ఇట్టి సుదీర్ఘ వర్ణన లానాటి ప్రజల మన్ననలకు పాత్రమైనవై యుండవచ్చును గాని నేడవి ప్రశంసార్హములుగావు; హృద్యములును గావు. సంక్షేపమే నాటకమునకు ప్రాణముగదా! కాని వీరు తమ ఇతర నాటకములలో సందర్భోచితముగా, భావరసానుగుణముగానే పద్యములు రచించి యుండుట ప్రశంసార్హ విషయము.

తమనాటకములందు స్వతంత్రముగా పద్యములు రచించుటయే రావుగారి శిష్టము. తన్మూలమున నాంధ్ర వాఙ్మయాభివృద్ధియు గలుగునని వారి యభిప్రాయము.[1] 'కాళిదాసు' నాటకమునను, కొన్ని ఇతర నాటకములలోను శ్లోకములను సందర్భానుసారముగా ఉదాహరించిరే గాని గ్రంథముల నుండి పద్యములు గ్రహించి తమ నాటకములందుద్ధరించి యుండలేదు. అయినను తమ ముందు నాటకములలోని కొన్ని రసవంతములైన పద్యముల సందర్భోచితముగా నితర నాటకములందు వాడిరి. తమ పద్యములే యగుటచే విందు దోసగులేదు.

7.2.2 భావము తీవ్రమైనప్పుడు నాటకమున పద్యముండుటెంతయు సముచితము. నీరసభావములకును పద్యము రచించుట హృద్యముకాదు. శ్రీనివాసరావుగారు చాలవరకు భావతీవ్రతగల పట్టులలోనే పద్యములు రచించినట్లు తెలియును. ఒక్కసునందనీ పరిణయమునదప్ప తక్కిన నాటకములందు గద్యమునందలి భావము పద్యమునను నుండుట సంభవింపలేదు. ఇట్లుండుట నిజమునకు పునరుక్తి దోషమువంటిది. అంతేగాక దానిచే నాటక గౌరవము

దెబ్బతినును. శ్రీనివాసరావుగారి పద్యములలో ధారాశుద్ధికి కొదవలేదు. అనగా పద్యరచనా పాటవము నందారితేరినవారు వీరు. ధారాశుద్ధిలేనప్పుడు పద్య రచన కుపక్రమింపకుండుటయే యుచితము. కోపము, శోకము, విచారము మొదలైన భావములుత్కటమై నప్పుడు శ్రీనివాసరావుగారు పద్యములు రచించిరి.

కోపోద్రిక్తుడైన ఋతుధ్వజుడు పాతాళకేతుని మనో భావానుగుణముగ చెప్పినట్లుచేసిన పద్యరచన ఎంతయు సముచితముగా నున్నది.

చ॥ తకతక దింధిమి ధ్వనుల తాండవ మాడెదవేల యోరి! నీ
ళకమడగింతునేనిపుడె చక్కఁగ నిల్వర వచ్చెఁజూడు నా
లుక తెగఁగోయు బాణమిదె; లొంగకు దొంగబలె న్నిశాచరా!
పకపక నవ్వ మా యిపుడు పండ్లిగిలింపుమ చూచి మెచ్చెదన్'

(మదాలస 2-2)

క్రౌర్యోచితమైన పద్యమునకు చక్కనియుదాహరణము అశ్వత్థామ ప్రతిన వూనిన సందర్భములోనిది.

మ॥ ప్రళయోజ్జృంభిత రుద్రుఁబోలి యరులన్ బాధించి నిష్పాండ వం
బిల నేఁ జేయుదు నిప్పుడే భుజబలం బేపారఁగాఁ బార్థుతున్
బొలియన్ జేయుదు వైరశుద్ధిఁగని సంపూజ్యుండనై క్రాలుదున్
జలజాతాయతలోచ నుండెదిరినన్ సాధింతు రౌద్రాకృతిన్." (4-1)

రామరాజు మరణానంతరము తురకసేనలు తిరుమలాంబను బలాత్కరింప అషాబీతోజెప్పి శోకించినసందర్భములోని పద్యము.ఇందు రాజ్ఞీగర్వము ధ్వనించు చునే యున్నది.

శా॥ వీర క్షత్రియవంశజాతనయి గర్వీభూత భూపావళీ
దారవ్రాతము గొల్వఁ జింతయను శబ్దంబైన నా వీనుల్కుఁ

దారన్ జేర్పక సర్వసౌఖ్యముల నానందింతు నా మానసం
బీరీతిన్ వ్యసనాగ్నిఁ ద్రోయఁబడె నింతీ ! యింతగా ధారణిన్. (5–1)

ఇట్లనే కోదాహరణము లీ దుఃఖసన్నివేశములకీ నగును.

శిరోమణిలో యుద్ధమున సర్వనాశముకాగా రారాజు దుర్యోధనుడు ద్వైపాయనహ్రదమున దాగుటకై వచ్చి విచారమగ్నమనస్కుడై చింతించు సందర్భమునందలి పద్య మెంతయు హృద్యము.

చ॥ విదురుఁడు సంధి వాక్యములు వీనులు వీడుగఁజొచ్చి పల్క, నా
యదుకుల భూషణుండటులె యన్నివిధంబులఁజెప్పె, భీష్ముడున్
మృదుపదలాలితంబుగను నీతి పథంబులుదెల్పె, నైన నా
కదనవినీతి హోమసమమై పొలిపోయెను చేటురాకకై (4–1)

ఇట్లే యితర భావముల కనుగుణముగ పద్యములు రచించియుండుట గమనింపనగును.

7 . 2 . 4 శ్రీనివాసరావుగారు తమ నాటకములందు ప్రబంధోచిత వర్ణనలుగావించి కృతకృత్యులైరి. అయినను ఈ వర్ణనలు అస్థాన పతితములు కాకుండుట ప్రశంసింపదగిన విషయము. పుర, వన, మృగయా, కాసార, వసంతర్తు, చంద్ర, మన్మథ, మలయానిల, విరహవర్ణన లనేకములు గావింపబడెను. చంద్ర మన్మథాద్యుపాలంభనములును గలవు. విస్తరభీతిచే వీనిలో కొన్నింటికి మాత్రమే యుదాహరణముల నొసగుచున్నాను. ఋతుధ్వజుడు పాతాళకేతుని పట్టణమును హయప్రచార రగడలో వర్ణించెను. (మదాలస 2–3). 'సునందనీ పరిణయము', 'సుఖమంజరీ పరిణయము', 'సీమంతిని', 'శిలాదిత్య', 'కాళిదాసు' మొదలైన నాటకములందు, వన, మృగయా, కాసార, వసంతర్తు, చంద్ర, మలయానిల, విరహాదివర్ణనలు గలవు.

హరిశ్చంద్రుడు సంతోషాంతరంగుడై సత్యహరిశ్చంద్రీయమున చేసిన వనవర్ణన ఎంతయు రమణీయము.

చ॥ నవనవ యౌవనోదయ వనంబను భామిని తీవెమేనుఁ, గెం
జివురుల పాదముల్, నునుపుఁజిగ్గులకొమ్మల హస్తముల్, శుభో
త్సవమగు కుందకుట్మల విశాలకుచంబులు, పువ్వునవ్వులున్,
సవరుగనంది పద్మిటప సౌరభసంగతిఁజెందెఁ జూచితే ? (2-1)

ద్రౌపదీ వస్త్రాపహరణమున శ్రీకృష్ణుదనురక్తుండై చేసిన వసంత వర్ణన కడు రమ్యము.

చ॥ ననవిలుకానివైభవము నంతయుఁ బ్రాభవ మొప్పఁజేయుచున్
వనరెడి జీవరాశికిని వాసి యొనర్చి కులప్రవర్గ మం
దున ప్రథమంబునై వెలపి నూతన గాయక వర్గసంగతిన్
దనరు వసంతు వైభవముఁ దన్వి కనుంగొనుమా ముదంబునన్. (4-1)

7.2.4 ప్రాచీనాంధ్ర కవులుపయోగించిన సర్వోపమలను గ్రహించి శ్రీనివాసరావుగారు స్త్రీని నఖశిఖ పర్యంతము వర్ణించి కృతకృత్యులైరి. స్త్రీని ఆద్యంతము వర్ణించిశబ్దార్థ రచనతో సహృదయ రంజకముగాజేయుట అందరికీ సాధ్యము కాదు. రావుగారి యీ క్రింది పద్యము గనినవారి వర్ణనా వైదగ్ధ్యము, సున్నితముగాజెప్పు నేర్పును వ్యక్తమగును. కువలయాశ్వుడు మదాలసను గాంచిన సమయమందలిది:

సీ॥ అందమై మన్మనోనందమై నెలతేని
చందమైచెన్నొందు సకియ మోము,
శుద్ధాష్టమీ చంద్ర శుభ బింబమును బోలు
బంగారు ఫలకమీఫాలతలము,
గొప్పలై మూలలు గొనసాగి తెప్పల
కప్పుల నొప్పారు కలికి కనులు,
ఇంచుక కొనవంచి యుంచిన యపరంజి
నసఁదీరు మనుపారునాతినాస,

గీ॥ పౌరశృంగార సౌష్ఠవంబారయిచట
ధాత నిర్మాణ నిపుణతఁ దగె నయారె
కవుల యుపమలు సాలవు కలికిఁబొగడ
నా తరమె చాలు పోయెద నాతి కడకు.

ఈ పద్యము 'మదాలస' (2–8) లోనే గాక రామరాజు చరిత్రము (2–5) లోను, 'బభ్రువాహన' (8–8) లోను గలదు. స్త్రీ సౌందర్య వర్ణన మంత విస్తృతముగా కాకపోయినను పురుషసౌందర్య వర్ణనయు నెడనెడ గలదు.

సీ॥ జ్యాకిణలాంఛన సారమై భుజగేంద్రు
నగియెడి యెగు భుజయుగము వాఁడు,
జానొప్పఁ గాను భూజనుల నడచు నా
జానుబాహూన్నతిఁ బూనువాఁడు,
తలుపుల వైశాల్య మలయింపఁగలయట్టి
వెడదగు ఱొమ్మున నడరువాఁడు,
కేసరికాను నాకే సరియని కేలి
పిడికిట నడిగెడు నడుమువాఁడు,

గీ॥ అంగ సౌందర్యమునకెల్ల నాలవాల
మయిన పైడి మెఱుంగుల మేనివాఁడు,
మదవతుల పాలి మదనుఁడు మానధనుఁడు,
పంచబాణ సమానుఁడు ప్రాణవిభుఁడు.

బభ్రువాహన (8–8) లలో నీ పద్యము గలదు. ఈ సౌందర్య వర్ణన పురుషో ద్రౌపదీవస్త్రాపహరణము (8–5) చితమై యొప్పారుచున్నది.

సుఖమంజరీ పరిణయమున చిన్న కందమున కడు రమ్యముగా రాత్రిని వర్ణించిరి

కం॥ రవిజాతెఁజెచ్చి మాంబుధి
దివి తారల కాంతి మీఱె దివ్వెల మాడ్కిన్
భువి జంతుజాలమెల్లన్
చవి నిదురందాఱె, నాఱె జనులరవంబున్. (4-2)

సునందనీ పరిణయమున నిద్రావర్ణనయు కడుంగడుహృద్యమై యొప్పుచున్నది:

ఉ॥ ఎయ్యది పూరుషావళికి నేఁకటి ప్రేయసిరాత్రివేళలం ?
దెయ్యది సర్వకాలముల నెక్కుడు వంతలఁ గుందువారి మే?
లెయ్యది యద్వితీయ సుఖమియ్యది యంచు నిరూఢి చేయు వే
ఱెయ్యది? నిద్రగాక యది, యెన్ని విధంబులఁ జూచిన న్భువిన్. (3-2)

సత్యహరిశ్చంద్రీయమున పతి భక్తిని గూర్చి శ్రీనివాసరావుగారు వర్ణించిరి.

ఉ॥ ముంగిటి పారిజాతమగు ముద్దియకున్ బతిభక్తి యెందునున్
తంగెటి జున్నుగాదె నిరతంబును భార్యకు భర్తృభక్తియున్
చెంగటి పెన్నిధానమగుఁ జేడియకున్ బతిభక్తిగానవే ?
బంగరు కొండగాదె పతిభక్తి సతీమణి కెల్లకాలమున్ ? (2-2)

ఈ పతిభక్తి నింత మాత్రము వర్ణించి సంతృప్తి జెందక రుక్మాంగదలో రావు గారంత్య ప్రాసాది శబ్దార్థ చిత్రములతో సాగదీసి

"కరతలామలకంబుగాదఁటే చెల్లెలా ?
యుభయానకును ముక్తి విభునిభక్తి" (5-1) అను పద్యమున
వర్ణించిరి.

ఇట్లనేక విషయముల గూర్చి సందర్భోచితముగ పద్యములలో హృద్యముగ వర్ణించి యుండుట వీరి నాటకములలో నెన్నియో చిత్రములను జూడ వచ్చును.

7.2 5 పూర్వకథాకథనము, విషయ వివరణము, హితోపదేశము మొదలైన సందర్భములలోను పద్యములు రచింపబడినవి. సామాన్యముగా

పై సందర్భములన్నిట సీసపద్యములనే రావుగారు రచించి యుండుట గమనింప దగినది. అయినను ఇతర పద్యములును గలవు.

మదాలసలో కుండల మదాలసతో తన పూర్వకథను

సీ॥ వినవమ్మ కామిని వింధ్య వంతుని కూర్మి
తనయ" (1-4) అని వివరించెను.

ఇట్లే యితర విషయములకు సీసపద్యములు రచింపబడినవి. కాని సుఖ మంజరీ, ద్రౌపదీ స్వయంవర సందర్భములలో వివిధ రాజన్యుల వివరణలో నితర పద్యములు ప్రయుక్తములైనవి. 'సునందనీ పరియణము' (5-5) న 'మంగళాంగుడు తన వృత్తాంతమును ద్విపదలలోనే విన్నవించెను. 'సీతా కల్యాణము' (8-6) న జనక మహారాజు సీతా స్వయంవరార్థము వచ్చి సభదీరి యుండిన రాజన్యుల నుద్దేశించి సీతా స్వయంవర విషయమును ద్విపదలలోనే వివరించెను చెప్పవలసిన విషయము అల్పమైన యెడల కందము మొదలైన పద్యములలో తెలుపుటయు గలదు. భక్తి ప్రపత్తిని ప్రకటించుట కా యా సందర్భములలో సీసము మొదలైన పద్యములేగాక దండకాదులు గూడ ప్రయుక్తములై యుండుట ప్రసిద్ధమే. ఇట్లు వివిధ విషయ వివరణల సందర్భము లలో ఉచిత రీతిని వివిధ పద్యాదులు ప్రయుక్తములైనవని స్పష్టమైనది.

7 2.6 పద్యములలోను, పద్యపాదములలోను సంవాదములు గలవు. ఈ విషయము సంభాషణలగూర్చి చెప్పిన సందర్భమున కొంత తెలిపితిని. సర్వసాధారణముగ సీస పద్యములలో సంవాదము సొగసుగ జరిగినట్లు స్పష్ట మగును. 'సునందనీ పరిణయము' (8-1) న సునందనీ జయమాలినులును, (3-5), ఉగ్రసేనుని భటులును; 'సుఖమంజరీ పరిణయము'(2-1) న సాయన మాయనలును, సుల్తానాచాందుబీ (2-3)లో మేరీడాండియాగోలును, (4-2) దొంగలును, శిలాదిత్య (1-2) లోసుభగా సూర్యులును, (8-2) నవమాలికా కళా వతులును, మైసూరురాజ్యాభివృద్ధి (5-8) యందు జగదంబాయదురాయలును, సత్యహరిశ్చంద్రీయము (2-2)లో చంద్రమతీహరిశ్చంద్రులును, కుశలవ(3-1) యందు లవ మునిబాలకులును, (4-8) సీతారాములును సీస పద్యములలో సంవాదము గావించిరి. ఇట్లే యితర నాటకములందును కలవు. ఇం

వృత్తములలోను, వృత్తపాదములలోను సంవాదము గావించుటయు గలదు. శిరోమణి (2-8)లో భీమకర్ణులు మత్తకోకిలావృత్తపాదములలోను, కుశలవ (8-8)లో కుశ శత్రుఘ్నులు వివిధ వృత్తములలోను, వృత్త పాదములలోను, మదాలస (1-2)లో మదాలసా పాతాళకేతులు పద్యములలోను సంభాషించిరి. కీచకవధ (1-3)లో కిరాతార్జునులు చంపకమాల పాదములలో సంభాషించుట కలదు.

కిరాత : చం. పాసెను సూకరమ్ము తన ప్రాణము నా శరవిద్ధమై కదా ?

అర్జు : యేసితిమున్ను సూకరము వేయఁగ నీ కగునే కిరాతకా ?

కిరాత : వేసరి పల్కెదేల మును వేయఁగ నిమ్మొక మిట్టు చేరెఁగా ?

అర్జు : ఈ సరణిన్ వచింపఁబని యేమగుఁ జంపితి మున్నె నేను ?

కిరాత : ఛీ ! కిసరబుద్ధి చంపితివె కీద్వడిచచ్చు మెకంబునున్నలా ?

ఇట్లు పద్యపాదములలోనేగాక పాదపదములలో సంభాషణ యెడనెడ గన్పట్టును. 'సునందనీ పరిణయము' (2-4)న ఉగ్రసేన జయమాలినుల సంభాషణ యిట్టిది.

నాయిక చెలులతో వనవిహారము గావించుచు 'రగడ'లలో సంవాదము చేయుచు పుష్పాపచయ మొనరించుట రావుగారి నాటకములందు ప్రసిద్ధ మైన విషయము. ఇట్లు శ్రీనివాసరావుగారు తమ నాటకములలో పద్యములలోను, పద్య పాదములలోను, పాదపదములలోను సంవాదము కొనసాగించినట్లు స్పష్టమైనది.

7.2.7 శ్రీనివాసరావుగారి కవిత్వము శబ్దార్థాలంకారములతోగూడి యుండును. ప్రబంధకవులలో నీ శబ్దార్థాలంకార రచన అతియై మితిమీరి యుండుట ప్రసిద్ధమే. రావుగా రదేవిధముగా ప్రయత్నించి సాధించిరి. అయినను నాటకీయతకుగాని అభినయమునకుగాని యివి యడ్డంకులుగాలేవు. శబ్దార్థాలంకారములు శ్రుతిహితమై సహృదయ హృదయరంజకమై యొప్పు చుండుట వాని ప్రత్యేకత. శబ్దాలంకారములలో అంత్యప్రాసమును మిక్కిలి మక్కువతో వాడిరి.

"జన్మ జరామృత్యు జాడ్యాపహరణమ్ము
ఘోరారి షడ్వర్గ మారణమ్ము" (ప్రహ్లాద 8-4) అనుపద్యము చక్కని ఉదాహరణ.

ఇట్టి అంత్యప్రాసలకు వీరి నాటకములన్నింట నుదాహరణములు చూప నగును. వీరు రచించిన రగడలన్నియు అంత్యప్రాసలతో నొప్పారుచు మనోహరములై యున్నవి.

వృత్త్యనుప్రాసమునకు :

కం॥ తమ్ములులేని గృహమ్ములు
తమ్ములు లేనట్టి సరసి తనరునెజగతిం
దమ్ములు మోదములు సుకృ
తమ్ములు సుఖదమ్ము లే విధమ్మునఁ జూడన్.
(సునందనీ పరిణయము)

ముక్తపదగ్రస్తమునకు :

సీ॥ పాశుపతాస్త్రంబుఁ బడసి పోయెదు నాకు
నింద్రుఁడడ్డంబొచు నేల వచ్చె,
వచ్చెనుబో నన్ను వసుధనుండగ నీక
త్రిదివంబునకు నేల త్రిప్పితెచ్చె,
తెచ్చెనుబోనేను తెలివిమాలుచు వీధి
నడగితి నటు నన్ను నతివజూచె,
చూచిన మాత్రాన సుదతి కామాంధయై
శాపమియ్యఁగనేల కోపమూని,

గీ॥ షండుడైన నేను శాత్రవాళిని నెల్ల
నాజి బోరుటెటుల యవని యందు
నాదు వైరి కర్ణునణంచుట నింకెట్లు
అన్నఁజూడగోరి యతుగుటెటుల. (కీచకవధ 1-4)

ఇట్లే యితర శబ్దాలంకారములను సందర్భానుసారముగా రావుగారు ప్రయోగించిరి.

7.2.8 శబ్దాలంకారములతోపాటు అర్థాలంకారములను సైతము పద్యములలో సముచితరీతినికూర్చి యుండుట గమనింపనగును.

ఉపమాలంకారమునకు :

కం॥ వలఁజిక్కు-పులుగు మాడ్కి-ని
యలికుంతల చెఱను జిక్కి-యలసిసొలసి తా
నిల వాలె నొక్కొ-, ప్రాణా
నిలమున్నదో లేదా ! యకటనేనెటుసైతున్.'(
(సుఖమంజరీ పరిణయము 8 -

కం॥ కమలములో మధురసమును
భ్రమరము ద్రావిన విధాన భావజురీతులన్
కమలముఖీ ! బింబాధర
విమలామృతరసము పీర్చివిడిచెదనిన్నున్.
(శ్రీరామజననము 1-8)

రూపకాలంకారమునకు :

మ॥ అనురాగాంబుధి నన్ము ముంచెఁగద నీ యందంబు,వేవచ్చి నీ
తనువన్ దెప్పనుజేర్చి తేల్చు రమణీ ! తాపంబు నే నోప నే
మన నీసంగతిఁదప్పనిశ్చయము భామా ! భాగ్యమా ! నమ్ముమా
ఘనమా ! నీవిటు లాచరింపఁగనుమా కల్యాణి ! నన్నుం దయన్
(కీచకవధ 8-1)

ఉత్ప్రేక్షాలంకారమునకు :

తే॥గీ॥ నిండు చంద్రుఁడే కారి నీరజాస్య
మొగముఁజూచిన దృగ్దోషమగ నొయనుచు

మృగమదము రక్షగానిడ్డపగిదిఁ దోచు
నలికఫలకంబు నందున్న తిలకకలిక. (మదాలస 1-2)

అతిశయోక్త్యలంకారమునకు :

కం॥ తరునికరంబుల నిరులను
తరుణీనీకురుల కాంతి దట్టము సేసెన్
దెరవెద్దియొ యను చెలిఁగని
తరళేక్షణ నగియె నిరులు దరలె దరమునన్.
(సుఖమంజరీ పరిణయము 1-2)

స్వభావోక్త్యలంకారమునకు :

చం॥ మలమలమాఁడ సొగిరయొ మండెడు నాఁకలిచేత బాలురీ
యలజడిఁ జెంది బిడ్డలకటా ! బలుసోలిరి నేలఁ బ్రాలుచున్
గళవళమందితీవు కడుకాఱియలంబడి కాననంబులోఁ
గలఁతలనంది నేనెదియుఁగానను మానిని ! యేమితెల్పుదున్.

(ప్రతాపాక్బరీయము 5-3)

అర్థాంతరన్యాసాలంకారమునకు :

తే॥ గీ॥ సకల లతలను గలిగెడు సౌరభమ్ము
ధరణి నలు దిక్కులను, వాసితముగఁ జేయు
చైత్రునకు, నబ్బదయ్యెఁగా, జాతిముదము,
అవని సంపూర్ణ సంపద యౌవనికట్టు.

(పాదుకా పట్టాభిషేకము 3-4)

ఇట్లు శబ్దార్థాలంకారములను సముచితముగా ప్రయోగించి నాటక గౌరవమును సంపాదించిరి. క్వాచిత్కముగా శ్లేషాత్మక రచనయు గలదు.

సీ॥ మదనాగమును బోలు మదనాగమము పద్మ
వదనలపాలి యాపద నిజమ్ము... (శిలాదిత్య 3-1)

చ॥ కలనికిఁ జొచ్చువేళ భటకాండము నన్గొనియాడఁ జేసెదన్
తెలియనె నీ కుమారకుఁడనేనయి సర్వము? యుద్ధ భూమిలో
దెలియఁగ నౌఁ గదా? యిపుడు తెల్పఁగనేమి ప్రయోజనమ్ము? నీ
కలఁత దొలంచి శాశ్వత సుఖంబొనఁగూర్చెద మీకు నమ్ముమీ.
(రామరాజు చరిత్రము 4-3)

వాచ్యమున కంటె వ్యంగ్యము పరమ శ్రేష్ఠమని కదా లాక్షణికుల మతము? అట్టి వ్యంగ్య స్ఫూర్తితోను రావుగారు రచన సాగించిరి.

విరాట సభలో కంకుభట్టు వలలునితోనన్న పద్యమున వ్యంగ్యముగలదు.

ఆ॥ వె॥ వలదు వలదు, వలల ఫలపుష్పభరితమై
వెలయు వృక్షమిద్ది వలదు గెడప
వలయునన్న నీకు కలుగవే కానలో
పాడుపడినహీన పాదపములు. (కీచకవధ 3-6)

భీముడు కీచకుని నర్తనశాలలో వధించు సందర్భములోని పద్యము వను వ్యంగ్యము గలదు.

అనల్ప విషయమును నల్ప పద్యమున జెప్పుటయు శ్రీనివాసరావుగారికి సాధ్యమగును. ప్రహ్లాదుడు హిరణ్యకశిపునకు గీతాసారము నంతటిని యొక్క ఆటవెలదిలో వివరింపగలిగెను.

ఆ॥ వె॥ చంపు వాఁడెవండు చంపింపఁబడు నెవ్వఁ
డేల జనక నీకు నిట్టి భ్రాంతి.
జనికి మనికి మరలఁ జావునకును గర్త
హరియ కాదె వాని నరయవలదె. (ప్రహ్లాద 3-4)

శ్రీనివాసరావుగారు నాటకములలోని పద్యము లందెడనెడ రాగముల నొప్పించి రాగమాలికలుగ జేయుటయు గలదు. 'సత్యహరిశ్చంద్రీయము'

(2-1) న మతంగ కన్యలు హరిశ్చంద్రునెదుటగానము చేసిన సుదీర్ఘ ద్విపద యందనేక రాగముల పేర్లు నెక్కొల్పిరి. ఇట్లే 'రుక్మాంగద'లో మోహిని ఈశ్వరుని స్తుతించుపట్టు (8-8) నను, 'శ్రీరామ జననము' నందు వేదవతి నారాయణుని స్తోత్రము జేయు సందర్భము (2-1) నను సీసపద్యములను రాగ మాలికయుక్తముగ రచించిరి.

7.2.9 శ్రీనివాసరావుగారు ప్రాచీనాంధ్ర కవులనేకులను తమ నాటక పద్యములలో ననుసరించిరి. అధిక ప్రత్యయము ప్రబంధ కవులపైనే వీరి కుండినను పురాణ కవులను గూడ సమాదరించి యుండుట ఘనము తననగును. దీనిచే శ్రీనివాసరావుగారి బహుగ్రంథ పఠన జన్య సంస్కార మెట్టిదో విదితము కాకమానదు.

భీముడు దుశ్శాసనుని సంహరింతునని ప్రతిన బూనుట:

ఉ॥ కోమలి ద్రౌపదిన్‌గదసి కొప్పును గ్రొవ్వునఁ బట్టి యీడ్చె నిం
దామయుఁడెవ్వఁ డాఖలుని నాజినినేలను జిక్కఁ ద్రొక్కి రా
రాములఁబెట్టి వాని రుధిరంబున నీతి కొప్పుముంచుచున్
భీముఁడు సంతసించు నరిభీకరుఁడై యరుదారగా ధరన్.

(ద్రౌపదీ వస్త్రాపహరణము 5—5)

ఈ పద్యము నన్నయ "కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్..." (ఆంధ్రభారతము, సభాపర్వము 2-233) అను పద్యమునకు సమానముగా రచితము. ఇట్లే దుర్యోధనుని తొడలు విరిచెదనని భీముడు ప్రతిజ్ఞచేయు సందర్భములోని పద్యము.

చ॥ అరె కురువంశపాంసనతులాగత నీతియునెల్లఁద్రోసి యా
తరుణిని నెక్కు మంచుఁ దొడధర్మమె చూపఁగహస్త సంజ్ఞచే
దురిత విచార నీతొడలు దున్నెద ఖండనమందు నమ్మరా
కరికరభీకరంబుఁగన్ని ఖండనఁ జేసెద్ది రీతిఁగానరా. (5-5)

నన్నయ్య "ధారుణిరాజ్య సంపద మదంబున" (సభాపర్వము 2-249) అను పద్యమునకు ఛాయగా రచితము.

ద్రౌపది కంకుభట్టుతో వ్యంగ్యముగా తాను సైరంధ్రినని చెప్పిన పట్టు నందలి

కం॥ పతులేవ్వరుందు రందునఁ
గితవుం డొకఁడయ్యె ! నృత్యగీతాదులనీ
డిత మతియొకఁడయ్యె నయో
మతిఁ గలపిరి వారు ! వేఱు మతి యెటులబ్బున్. (కీచకవధ 3-6)

అను పద్యము తిక్కన భారతము (విరాటపర్వము 2-152) "నాదువల్లభుండు" అను పద్యమట్లొప్పుచున్నది. ఇట్టి వనేకములు గలవు.

హిరణ్యకశిపుడు పరమేష్ఠిని వేడు సందర్భమునందలి

సీ॥ నరసురాసుర యక్షగరుడ గంధర్వ కి
న్నర సిద్ధసాధ్యపన్నగ పిశాచ (ప్రహ్లాద 1-6)

అను పద్యము ఎఱ్ఱాప్రెగ్గడ "వ్యాసభరద్వాజ వాల్మీకి గౌతమ" (హరి. ఉ. భా ఆ. 5) అను పద్యమువలెను, నాచనసోముని "పాంచాల పాండ్య బర్బర కిరాతా భీర" (ఉ. హ. 5-144) అను పద్యము వలెను ఒకే సమాసముతో నొప్పుచున్నది.

దక్షుడు దధీచి నెదిరించుచు నీశ్వరుని నిందించిన సందర్భము నందలి

చ॥ కుడువను గూడులేదు, నడికొండ బిడారము, దంతిచర్మమే
యుడుపు, నివాసమోయొలికి, యుల్లమొయుగ్రము, మేనిపూతయో
వడఁ గొనుబూది, పెంజడలొ వంకరటింకర పేగులక్కటా !
జడుఁడు, పిశాచనేత, యనిశంబు నసహ్యకరుండు, వానినే
నొడయనిఁగా నొనర్తునెటు ? లోపను హీనునిఁ బెద్దఁజేయఁగన్.
(గిరిజా కల్యాణము 2-2)

అను పద్యము శ్రీనాథుని "పుట్టు వెఱుంగ నెవ్వరికిఁ బోలదు" (హరవిలాసము 4-80) అనెడి పద్యమట్లు గలదు. ఇట్లే శ్రీనివాసరావుగారి నాటకములలోని ఏ సీసపద్యమును గాంచినను శ్రీనాథుడు మనకు జ్ఞప్తికి రాకమానడు.

శ్రీనివాసరావుగారి 'ప్రహ్లాద' నాటకము నందలి పద్యములు పోతన పద్యముల కనుకరణములనుటకంటె ప్రతిరూపములనుటయే సమంజసము. "ఆ శైలిని (పోతనశైలిని) బట్టి నేను పద్యములు వ్రాసితిని గాని, యంతటి రసముప్పతిలఁజేయు నంతటి శక్తిలే దయ్యెను." అని వారు పోద్ఘాతమున సవినయముగా వచించినను, అవి పోతన పద్యముల కేమాత్రము తీసిపోవని స్పష్టమగును. అందుకొక ఉదాహరణము. హిరణ్యకశిపుడు ప్రహ్లాదున కొనర్చిన బాధల గూర్చి చింతించు సందర్భమునందు

చ॥ జలనిధి ముంచితిన్ విశిఖజాలములన్బడఁ గ్రుచ్చి తిన్ మదా
వళులపదాహతిన్ బడఁగవైచితిఁ దక్షకదష్టుఁ జేసితిన్
గులగిరులెక్కఁ జేసి దిగఁ గూలగఁ ద్రోసితిఁ జిచ్చుఁజేర్చితిన్
నిలిచెను వీఁడు ప్రాణమున నివ్వెఱఁ గయ్యెడు నేమి మాయయో.॥

(ప్రహ్లాద 5-1) అను నీ రావుగారి పద్యము, పోతన భాగవతము (7-201) "ముంచితి వార్ధులం గదలమొత్తితి" అను పద్యమున కేమాత్రము తీసిపోదు. ఇక నితర సందర్భములలోను పోతన పద్యముల వంటివి కలవు. 'సత్య హరిశ్చంద్రీయ' మున ఇంద్ర సభలో గాలవుడు జెప్పిన పద్యము.

కం॥ వనితల యెడఁ బరిణయమెడ
ధనమాన ప్రాణహాని దశలను గోబ్రా
హ్మణ రక్షణ యెడ ననృతం
బనఘంబగు సూక్ష్మమార్గమరయ జగతిన్ (1-1)

పోతన భాగవతము (8-584) నందలి "వారిజాక్షులందు వైవాహికములందు" అను పద్యమునకు సమముగ రచింపబడినది. ఇట్లే 'సత్యహరిశ్చంద్రీయము' న లోహితుడు సర్పదష్టుడై మరణింపగ చంద్రమతి దుఃఖించిన సందర్భము నందలి

ఉ॥ నాకువు భూషణుండవయి నాకులభూషణుఁ బుత్రుఁ జంపితే
తేకువబూని ? వక్రగతి తేటపడెన్ శ్రుతిబాహ్య! తక్షకా !

యీకసుకంద నిన్ను పదహీనునిఁ జేసెనెః క్రిందఁద్రొక్కెనేః
యేకరణిన్ సుతున్ గఱచి యేచితివయ్య భుజంగరాజమా? (8-4)

అనెడి పద్యము పోతన భాగవతము (1-161) "ఉద్రేకంబున రారు శస్త్రధరులై" అను పద్యము వలె నొప్పారు చున్నది.

శ్రీనివాసరావుగారికి ప్రబంధకవుల కవిత్వముపై, నందున శబ్దార్థ రచనపై ప్రీతియధికము. ఇందుకు వీరి నాటకములన్నింట నుదాహరణములు లభించును. సీసపద్య రచనా పద్ధతిని రావుగారు బాగుగా నలవరచుకొనిరి. ప్రతి సీసము నందు నొక తూగు, సమత, శబ్దార్థ చిత్రణ స్పష్టమగుచుండును మచ్చున కొక సీసము :

'నీ గొప్ప కొప్పింద్ర నీల రాశి గమించు,
నీ నొసల్ చంద్రకాంతిని హసించు
నీ బొమల్మరువిండ్ల నీటుగిటడగించు,
నీ చూపు మరుతూపునిగ్గుఁజూపు,
నీ నాససంపెఁగ నిక్కునుక్కడగించు,
నీ చెక్కుటద్దముల్నిగడెతఁగడు,
నీ చెవుల్ శ్రీకార నిర్ణయంబొనరించు,
నీ మోవిపల్లవ నిధిఁదనర్చు.

నీ రదఁబులు హీరంబులై రహించు,
నీ గళంబన శంఖంబు నాఁగఁబరఁగు,
నీ మొగంబు మహాపద్మ నిధిగ నెసఁగు,
లోప మెద్దియు లేదు వికోలనయన" (సీకుంతిని 4-8)

ఈ పద్య మేప్రబంధకవుల పద్యమునకు తీసిపోదనుటలో సందియము లేదు. ఇంక ప్రబంధకవులందరికి పెద్దయైన పెద్దనకే రావుగా రధికగౌరవమిచ్చి నట్లు తెలియును. అందుచేతనే పెద్దనను ఎక్కువగా రావుగారనుకరించిరి. పెద్దన అతు వుగా ఉత్పలమాలిక రచించియుండ శ్రీనివాసరావుగారు అవకాశమును గల్పించు

కాని 'సునందనీ పరిణయ' నాటకారంభమున దేవతాప్రార్థనలో నొక చంపక మాలికయు, 'సీమంతీని' నాటకము (8–8) న తక్షకుని ఎదుట చంద్రాంగదుడు చదివినట్లొక చంపకమాలికయు రచించిరి. ఇవి ధారాశుద్ధితో నొప్పారు చున్నవి. సునందని తనను వివాహమాడ నిరాకరింప కుబేరుడు పురాణ ప్రసిద్ధుల గూర్చి చెప్పిన పట్టు నందలి

''నెలఁత యోజనగంధి కులమెద్ది ? విఖ్యాతుఁ
　　డలపరాశరుఁ డెట్టి కులము వాఁడు?
మెలత! యూర్వశి యెట్టి కులశీలములదగు?
　　నలపురూరవుఁడెట్టి కులము వాడు?
అలికుంతలా! శకుంతల కుల మెయ్యది?
　　దుష్యంతుఁ డెంతటి దొడ్డవాడు?
చెలి! దేవయాని దే కులము? యయాతి యే
　　**కులము** వాఁడది నీవు గుఱుతెఱుఁగవె?

తెలియవే యట్టి మెలఁతలు తెగలు మాని,
మానితంబని కూడిరి మంచి మగల,
కులము శీలమ్ము లేలొకొ గుణము లేక?
మనము గలిసిన చోటనే మనువుకాదె?" (సునందని 2–2)

అను పద్యము పెద్దన ''వెలిఁబెట్టిరే బాడబులు పశాశరుఁబట్టి దాశకన్యాకేళిఁ దప్పుఁజేసి" (మనుచరిత్ర 12–78)అను పద్యమువలె నొప్పారుచున్నది. ఇట్లెన్ని యుదాహరణములనైన ఈ నగును.

ప్రబంధ కవులనే గాక వేమన మొదలైన వారిన్నిగూడ వీరనుకరించిరి.

"ఉత్సాహ॥ కంటిలోని నెరసు, పాదకంటకంబులట్టి వాఁ
డింట నుండు భుజగమట్టి, డిబె లేనిపోటు సు,
మ్మింటిలోని పోరు, పంట నిరికి యుండు పుర్వు; హా!
మంటలేని యనల, మౌర; మంత్రికాఁడు భూపరా!"
(సునందని 5–6)

అను నీ పద్యము ఛందస్సు వేరైనను వేమన "చెప్పులోని ఱాయి చెవిలోని జోరీగ" అను పద్యమట్లు గలదు.

ఇట్లు పూర్వాంధ్ర కవుల ననుకరించుటయే గాక కాళిదాసు కుమార సంభవము నందలి శ్లోకముల ననువదించుటయు గలదు.

"కామేకపత్నీ వ్రితదుఃఖశీలాం" "కేనాభ్యసూయాపదకాంక్షిణా" (కుమార సంభవము తృతీయ సర్గము...7, 4) అను కాళిదాసు శ్లోకములను,

చం॥ పరమపతివ్రతామణులబాధలఁ బెట్టుచుఁ బట్టి తెమ్మనన్
త్వరితముగాను దెచ్చెదను తాపసు లెవ్వరు గాని నీ పదం
బరసితంబు సల్పపడి నాతఁ పుష్పశరాళి వారినిన్
గురుతర మోహవారిధినిఁ గ్రుంగఁగఁ జేసెదనమ్ముమా మదిన్"
(గిరిజాకల్యాణము 3-2)

ఇంద్రునితో మన్మథుడు సంభాషించు సందర్భమున అనువదించిరి. ఇట్లు శ్రీనివాసరావుగారు అనేక పూర్వకవుల ననుకరించియు, అనువదించియు తమ ప్రత్యేకతను ప్రకటించుకొనిరి.

ఇంత మహత్తరముగా, నిర్వహణ దక్షతతో, సందర్భోచితముగా రస భావానుగుణముగ నాటకములందు పద్యముల రచించిన శ్రీనివాసరావుగారు తమ ప్రథమ ద్వితీయములైన సునందనీ, సుఖమంజరీ పరిణయము లందు పేలవములైన భావములకును పద్యములు రచించి యుండుట గలదు. అచట నచట గద్య పద్యములలో పునరుక్తియు గలదు. అయినను ఇట్టివి క్వాచిత్కమే. కనుక వీ యుత్తమగుణ సందోహమున నిట్టి యొకటి రెండు దొసగులు పరిగణనీయములు గావు.

## 7.2.10 ఛందస్సు :

"ఛందహీనోనశబ్దోస్తి నచ్ఛందశ్శబ్దవర్జితమ్; ఏవం తూభయ సంయోగో నాట్యస్యోద్యోతకః"[1] స్మృతః అని భరతమహర్షి నిర్వచించెను. "శబ్దచ్ఛందము

1. 152. అ. 15. శ్లో. 42

లితరేత రాశ్రితములు. అచ్ఛందమైన శబ్దము, అశబ్దమైన ఛందము శోభిల్లవు. శబ్దచ్ఛందస్సం యోగము నాట్యమునకు ఉద్ద్యోతకము. వాక్యార్థాభినయ రూపమైన నాట్యము రసాత్మకము. రసాత్మ నేత్రేంద్రియ గోచరమైన రూపము నాశ్రయించి నాట్యమనఁబడుచున్నది. అదియే శ్రోత్రేంద్రియ గోచరమైన నామము నాశ్రయించి కావ్యమనఁబడుచున్నది. ఛందము, శబ్దము సంయుక్తములయి నాట్యమును వలె కావ్యమును ఉద్ద్యోతితము గావించును."[1] ఇంతే గాక ఛందో వైశిష్ట్యమును, ప్రయోక్తృయోగ్యత ననుసరించి ఛందః ప్రయోగముండును "వక్తృచైతన్య వృత్తిని వ్యంజించుట దాని (ఛందస్సు) పరమ ధర్మము. ఆ ధర్మము నిర్వహించుటకే దానికి కావ్యాంగతా గౌరవ మొసంగబడినది. ఛందః కర్మయందు కవిచేయు శిల్పమంతయు శ్రవ్యతా మాత్రసిద్ధికొఱకుగాదు; చైతన్య వర్తనమును వ్యంజించుట కొఱకు. వాక్యార్థాభినయము ఛందము యొక్క కర్తవ్యము. కావ్యార్థభావనాపరతంత్రుడై కవి ఛందములు శిల్పించును. స్వచ్ఛందానురోధముగ వక్తవాక్యార్థము నాచ్ఛాదించును. ఆచ్ఛాదించుట యందలి గోపనదీపనాహ్లాదనాది ప్రయోజనములు వక్త్రిచ్ఛాధీనములు. బహుముఖ ప్రయోజనమైన ఛందమును కవి యథారుచి, యథాశక్తి, యథామతి, యథౌచిత్యము కావ్యమున ప్రయోగించును.''[2] ఇట్లే శ్రీనివాసరావుగారు తమ నాటకములందు ఛందః ప్రయోగము గావించిరి.

శ్రీనివాసరావుగారు తమ నాటకములందు రచించిన పద్యముల సంఖ్య 1589; సందర్భానుసారముగా ఉల్లేఖించిన పూర్వకవుల సంస్కృత శ్లోకములు 70 వరకు గలవు. మొత్తము పద్యములలో నాల్గవ వంతు కంటె కొంచెమధికముగా ఉత్పలమాలలు, సుమారైదవ వంతు చంపక మాలలును, 166 మత్తేభములు, 106 శార్దూలములు గలవు. వృత్తములలో ఉత్పలమాలపై నధిక ప్రీతి యని స్పష్టమైనది. కందములు 459, సీసములు 439 గలవు. కనుక రావు గారు వృత్తములకంటెను కంద, సీసముంనే విరివిగా వాడిరి. ఆటవెలదులకంటె తేటగీతులనే ఎక్కువగ రచించిరి. సీసములలోను తేటగీతుల రచించుట వీరికి పరిపాటి. సామాన్యముగా సీసపద్యములు వర్ణన, విషయ వివరణ, పూర్వకథా

1. 40. పు. 15 2. అదే. పు. 80

కథనము, సంవాదము లందుపయుక్తములైనట్లు ముందే వివరించితిని. కందము వివిధ సందర్భములలో వాడబడినది. సీస పద్యమువలెనే సొగసుగా కందము నడపుటలో శ్రీనివాసరావుగారు సిద్ధహస్తులు. అస్మన్‌బేగు కోపమున తండ్రి నెదిరించు సందర్భమునందలి పద్యము.

కం॥ మదికుదురు చెరరి ధీరత
వదలివ ముదుసలివి నీకు వచ్చునెధైర్యం?
బదరని గుండియ గల నా
మది నొవ్వఁగఁ బలుకవలదు మానుము తండ్రీ!"
(సుల్తానా చాందుబీ 5-8)

ఇట్లు వివిధ సందర్భములలో వివిధ భావానుగుణమైన కంద పద్యరచన కెన్ని యేని యుదాహరణముల నొసగవచ్చును. తేటగీతులను రచించుటలో వీరందె వేసిన చేయి యనుటలో సందేహము లేదు.

పైని పేర్కొనినవే గాక ఇతర వృత్తములనుగూడ వాడియున్నారు. మత్తకోకిల, ఉత్సాహ, తరళా వృత్తము లధికముగానే ప్రయోగించిరి. వీరు నూతనచ్ఛందములను సృజించి వానికి పేర్లు పెట్టుటయు కలదు. సాధారణముగా వృత్తములనే తగ్గించియు లేదా తొలగించియు నాటకమును వచనమయము కావింపవలెననెడి వాదముండగా నిట్టి నూతనచ్ఛందస్సృష్టి కావశ్యకమేమియను ప్రశ్నయుదయించును. లేదా అట్టి కల్పిత వృత్తములు సార్థకమైనప్పుడుచిత మనియే తలంపవచ్చును. కాని నూతన వృత్తముల సంగతి అటుంచి ఉత్పల మాలాది వృత్తములే సార్థకమైనవా యనుట ఆలోచింపదగిన విషయము. కోపము, క్రౌర్యము మొదలైన భావోద్రేక సమయమున శార్దూల మత్తేభములు పయుక్తములైన సందర్భము లెడనెడ గలవు. కాని చంపకోత్పలమాలలలోను కోపాటోపముల ప్రకటించి యుండుటయు గలగు.

నూతన వృత్తములు కుశలవ, బభ్రువాహన, సునందనీ పరిణయ నాటకములందు గలవు. అతిభృతి, భయంకర. బాణ, రణ, గూఢ. భల్ల, భీకర, శాప. పౌరుష. పుష్పహారాది నూతన వృత్తములు సార్థకములుగానే గన్పట్టు

చున్నవి. ఈ నూతన వృత్తములు కుశలవలో కుశలవులు శత్రుఘ్నాదులతో యుద్ధమొనరించు సందర్భమున గలవు. ఈ వృత్తములు యుద్ధోచితమై యొప్పుచున్నవి ఇవి నాటకీయత కే మాత్రము భంగము గలిగించునవియు కాదు. ధారాశుద్ధి లేనప్పుడు, సమాసభూయిష్ఠమై నప్పుడు నాటకీయతకు ప్రతిబంధకము లనవలెను. అట్టి దిందు కన్పట్టదు. ఈ నూతన వృత్తములు ధారాశుద్ధియు, భావతీవ్రతయు గలిగి సరళమై యుండుటచే సందర్భానుగుణముగా నొప్పుచున్నవి. శత్రుఘ్నుడు బాణవృత్తమున కుశునిపై బాణము ప్రయోగించును.

"బాణవృత్తము. కుదురుగ యుద్ధము
బెదరక చేయుము
మదిఁగను ధైర్యము
ఇదె కను బాణము"

అనుచు బాణ ప్రయోగము గావించును. అట్లే కుశుడు భల్లవృత్తమున శత్రుఘ్నునిపై బాణము ప్రయోగించును.

''భల్లము. ప్రల్లదముల్
చెల్లవిఁకన్
ఝల్లక యీ
భల్లమునన్" అనుచు

బాణము వేయును. ఇట్లే శ్రీరాముడు కుశునిపై బాణము ప్రయోగింప పుష్పహారమగును. ఆ సందర్భమున పుష్పహార వృత్తమునే వీరు రచించిరి.

పుష్పహారవృత్తము. కాలకంఠుని - కాండమిదే
బాల దేహము -నంటునిఁకన్
కేలు మోడ్పుమ - కాదనినన్
జ్వాల మాలలు - చంపునినున్'

ఇట్లాయా సందర్భములలో తత్తదుచితరీతిని నూతనచ్ఛందములను వాడి శ్రీనివాసరావుగారు కృతకృత్యులైరి.

నాయికా సఖులు వన విహారమున పుష్పాపచయముగావించు నప్పుడును, పురవర్ణన మొదలైన వానికి రగడలను వీరు రచించిన విషయము ముందే వివరించితిని. శ్రీనివాసరావుగారు కాళిదాసులో శ్యామలాదండకము నుల్లేఖించుటయే గాక, రామరాజు చరిత్రము," 'కీచకవధ, 'బభ్రువాహన, సత్యహరిశ్చంద్రీయము. 'రుక్మాంగద' మొదలైన నాటకములందుచిత స్థలములందు సముచిత పద్ధతిలో దండకములు రచించి, తమ నైపుణ్యమును ప్రకటించిరి. ఈ దండకములు పూర్వకవుల దండకములతో నేమాత్రము తీసిపోవనుటలో విప్రతిపత్తి యుండరాదు. ఇట్లు శ్రీనివాసరావుగారు ప్రసిద్ధములగు వృత్తములను వాడుటయేగాక నూతన వృత్తములను సృజించి, వానికి సార్థక్యము చేకూర్చి తమ ఛంద శ్శిల్ప పరిజ్ఞానమును గూడ వెల్లడించి యుండుట గమనింపదగినది.

## 7.3 పాటలు :

పద్యముల వలెనే పాటలును నాటకము లందుండుట ఉచితము కాదనుట స్వభావవాద సిద్ధాంతమే, నాటకమున పద్యమునకైన కొంత గౌరవము కలదేమో గాని పాటకు మాత్ర మదియు లేదు. సంస్కృత నాటకములందచ్చమైన పాటలు లేవు. ద్విపదీ ఖండము, చర్చరి మొదలగు గేయము లొకటి రెండున్నను క్రమముగా నవి పరిత్యజింప బడినవి.[1] అయినను సంస్కృత నాటకములలోని శ్లోకములనే సంగీతజ్ఞులైన వారు గాన యుక్తముగా పాడుట పరిపాటియే. స్వభావవాదము ప్రబలిన తరువాత అట్టి వానికి సైతము 'స్వస్తి' చెప్పబడెను. శ్రీనివాసరావుగారు కుప్పలుగా తమ నాటకములందు పాటలు రచించినను వానిపై మక్కువ తక్కువయని వారిమాటల వలననేస్పష్టమగును "నాకు సంగీతము రాకున్నను తాళమానంబులబట్టి మాటల బాలుఁగూర్చి, కన్నడ కవిత్వం బునుం బోలె వృత్యనుప్రాసంబులు గల్పించి, యెంతటి యెత్తుగడ పాటనయినం జేయుచుంటిని. జనసామాన్యమునకుఁ బాటలు రుచించు నటులఁ బద్య గద్యాత్మకంబగు నాటకము రుచించదని యెంచి, కొన్ని పాటల నచ్చటచ్చట నుంచి మిగిలిన వానిఁ దీసివైచితిని''.[2] ఇట్లు శ్రీనివాసరావుగారు తమకు సంగీతము తెలియదని నుడివినను, దాదాపు నూరు రాగములు వాడి పాటలనేకము రచించి యుండుటచే వీరి సంగీత

---

1. 8. పు. 6, 7 2. 88. పీ, పు. 1, 2

జ్ఞానమవగతమగు చున్నది. వీరు కేవలము పామర ప్రజల ప్రీత్యర్థమే పాటల రచించినట్లు స్పష్టమైనది. కనుకనే పాటలు పాడలేని వారు పద్యములనే పాడు కొనవచ్చునని తెలిపిరి. "ఈ నాటక గ్రంథము (ప్రహ్లాద)లోనే పాటలు వ్రాయ బడి యుండెను. కావున వాని నా యీ విషయ సంబంధానుసారముగఁ జేర్చితిని, పాటపాడ నేరనివారు పద్యములు చెప్పనగును."[1] ఇట్లు శ్రీనివాసరావుగారు పాటల మీద అరగౌర ప్రీతిని వ్యక్తపరచిరి.

నాటకమునందు పాటలనవసరమని నమ్మియు శ్రీనివాసరావుగారు తప్పక రచింప వలసివచ్చినది. ఇది కేవలము పామర జన ప్రీత్యర్థమని వీరే నుడివి యున్నారు. తెలుగున నాటకారంభము కాకపూర్వము నుండి పండితులకు సంస్కృత నాటకములానందము గూర్చుచుండ సామాన్య జన సందోహమునకు వినోదము గలిగించుచు తెలుగున యక్షగానములుండినవి. యక్షగానములలో సంగీత ప్రాధాన్య మెక్కువ. యక్షగానములలోని గానము నందాకృష్టులైన పామరజనులు నూతనముగా తెలుగున వెలసిన నాటకములందును నట్టి సంగీత మునే యాశించియుందురు. ఆ సమయమున పాటలుగల నాటకములకు మాత్రమే ప్రజాదరణ, ప్రచారములుండి యుండవచ్చును. ఆదేసమయము నందలి పార్సీ, ధార్వాడ సంచార నాటక సమాజములు ప్రదర్శించు చుండిన నాటకములలోను సంగీతము మిక్కుటముగా నుండి ప్రజల మన్ననలకు పాత్రములై యుండ వచ్చును. అట్టి సామాజిక సముదాయమును సంతృప్తి పరచుట కొరకు రావు గారును పాటలను రచింపవలసి వచ్చినది.

7.8.1 'సీమంతిని, సుల్తానాచాందుబీ, ప్రతాపాక్బరీయము, చంద్రగిర్యభ్యు దయము, కాళిదాసు, మానాపమానము నను ఆరింట తప్ప తక్కిన నాటకము లన్నిట శ్రీనివాసరావుగారు పాటలు రచించిరి. వీవి పాటలను చాల వరకు నాటకముల చివరఅనుబంధములలో జేర్చి ముద్రింపించిరి. కాని కొన్ని నాటక స్థలములైయును గలవు. 'సీమంతినీ నాటకము' రెండవ కూర్పులో రెండు పాటలు మాత్రము నాటకస్థమైయున్నవి. 'ప్రహ్లాద' లో అనుబంధమున ప్రత్యేక ముగా పాటలు చేర్చబడియున్నను లీలావతి పాడిన లాలి పాట (2-8)

1. 105. ఉ పు. 6

మాత్రము నాటకస్థము చేయబడియున్నది. 'సునందినీ పరిణయము' ఒక ముద్రణలో చాల కొలది పాటలు నాటకస్థముగానే కలవు. కాని నాల్గవకూర్పులో మాత్రమన్ని పాటలు అనుబంధమున చేర్చబడి ముద్రితములైనవి. ఇంక పాటలుగల తక్కిన నాటకములన్నింట అనుబంధమున ముద్రింపబడినవి. ఆరు నాటకములలో పాటలు లేకుండుటకు కారణము తెలియదు. శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారును ఈవిషయమును నుడివియున్నారు." శ్రీనివాసరాయల నాటకము లలో నైదాటింట మాత్రము పాటలు లేకున్నవి. వారు వ్రాయనే లేదో, లేక యచ్చు వేయలేదో తెలియదు".[1] కాని వారు వ్రాయలేదనుట కవకాశము తక్కువ. తమకొరకుగాక పోయినను ప్రజలను తృప్తిపరచుటకైనను పాటలు రచించియుందురు. ఏ కారణము చేతనో ఆ పాటలు అనుబంధమున చేర్చబడ లేదని తలంపవలెను. పాటలు లేని నాటకములలో కొన్ని రావుగారి మరణా నంతరము ముద్రింపబడియుండుటచే నీ పాటలు తొలగింపబడినవేమో అనుటకును వీలులేదు. తదితర నాటకములలో నెక్కువ వానిలో పాటలు ముద్రింపబడియున్నవి, అంతేగాక రావుగారు జీవించియుండగనే ప్రథమ ముద్రణము నందిన 'సుల్తానా చాందుబీ' లోను నీ పాటలు గన్పట్టుటలేదు. మరి యీ పాటలు లేకుండుటకు హేతువూహ్యము.

7.3 2 రాగతాళ యుక్తములేగాక పాటలు సాహిత్యముతో గూడియుండినచో బంగారునకు తావియబ్బినట్లగును. సంగీత సాహిత్య నిధులగుటచే త్యాగరాజు కృతులకంతటి గౌరవ, ప్రచారములు కలిగి త్యాగరాజమరుడైనాడు. వాస్తవము నకు కేవలము తిల్లానాలకంతటి గౌరవమెట్లు వచ్చును? అయినను భక్తాగ్రేసరుడై త్యాగరాజు భక్త్యావేశమున పరవశించి పాడిన పాటలతో నితరులను బోల్చుట దివి టీతో సూర్యుని జూపుటయేకదా? అంతమాత్రముచేత నితరమంతయు చెత్తయని నిర్ణయించ వీలులేదు. రాగతాళానుగుణముగా భాషను సాగదీయుచు పాటలు రచించినప్పుడు భాష వికృతరూపమును ధరించుననుటలో సందేహములేదు. కాని శ్రీనివాసరావుగారి పాటలంత వికృతరూపమును ధరింపకుండుట ప్రశంస నీయము. అంతేగాక వీరి పాటలలో సాహిత్యపు పాలు నధికముగా గల

1. 8. పు 44

దనుటకు వీరి పాటలే నిదర్శనము. లీలావతి బాలుడైన ప్రహ్లాదుని నూయేలలో బెట్టి ఊచిన సందర్భమున పాడిన పాట:

"రారా చిన్నెల నగవుల నా బాలా
సుగుణాలవాలా! రారా! ॥పల్లవి॥
సోముగోమును దోము మోముగల
కాముని బోలెడు కాంతశరీరా। ॥రారా॥
సుందరకాయా అందెలు మ్రోయా
చిందులు ద్రొక్కుచు శీఘ్రము రారా। ॥రారా॥
శ్రీనివాసునిచిత్తమందు నా
చింతన జేయుచు గంతులు వేయుచు। ॥రారా॥
(ప్రహ్లాద 3–3)

ఇట్లు సాహిత్య మధురిమతో సహృదయావర్జకమైన ఈ పాటలకు గౌరవము లేదనగలమా?

7.3.3 శ్రీనివాసరావుగారు సందర్భానుసారముగా అకృత్రిమమై అపేలవమై యొప్పునట్లు పాటలు రచించిరి. సాధారణముగా భావము తీవ్రమైనప్పుడు పద్యములవలెనే పాటలుండును. శోకము తీవ్రరూపము దాల్చినప్పుడును, అభిమన్యువధ వినిన సుభద్ర శోకము శిరోమణి – అనుబంధము 18 (అం. 2 రం. 1), కోపముత్కటమైనప్పుడును అషాబీరామరాజులు దూషించుకొను సందర్భము. రామరాజు చరిత్రము – అనుబంధములు 6,7,8 (2–4), భక్త్యా వేశమునను సంధ్యావళి పాడిన పాట 'రుక్మాంగద' అను – 23 (4–2), ఆనంద మతిశయించినప్పుడును సైరంధ్రి 'కీచకవధ' – అనుబంధము 35 (4–1) పాటలు రచితములైనవి ఇతరులనునయించునప్పుడును దేవల నాగలులు కువలయాశ్వుననునయించుట – 'మదాలస' – అను – 26,27 (3–5); నయ బోధా సమయమున మండోదరి రావణునకు హితము జెప్పుట 'సీతాకళ్యాణము' అను 11.22 (3–1) విచారవేళలోను దుర్యోధన విచారము 'ద్రౌపదీవస్త్రాప హారణము' అను 27 (4–1) పాటలు గలవు. ప్రకృతి వర్ణన ప్రమీల గావించినది 'బభ్రువాహన' – అను 13 (3–1). వ్యక్తి వర్ణన – రుక్మాంగదుడు

గావించిన మోహినీ వర్ణన 'రుక్మాంగద' - అను 17 (3-3) మొదలైన వర్ణన లకును పాటలు రచితములు. ప్రణయ సంవాదమునను సీతారాముల ప్రణయము - 'కుశలవ' అను 6 (1-5) పాటలు కడు దీర్ఘములైయున్నవి. ప్రణయ సంబర్భములలోనే గాక యితర పట్టులందును ఉక్తి ప్రత్యుక్తులతో కూడిన సంవాదములు సత్యహరిశ్చంద్రీయము - అను 13, 28 (2-1;3-2) పాటలలో గలవు. అనేకులు కలిసి యొక పనిని చేయునప్పుడు, ఆడునప్పుడు 'సునందినీ పరిణయము' - అను 9 (2-1) పాటలున్నవి. సాధారణ ముగా ఒకపాత్ర ప్రప్రథముగా రంగమున ప్రవేశించునప్పుడు(రంభా ప్రవేశము) 'శ్రీరామ జననము' అను - 5 (1-3) ఎడనెడ పాటపాడుచు ప్రవేశించును. ఇట్లనేక విధములుగా సందర్భానుసారము శ్రీనివాసరావుగారు పాటలు రచించిరి. సాధారణముగా సంవాదాత్మకమైనవి తప్ప తక్కిన పాటలన్నియు చాల క్లుప్తముగానే యుండుట శ్రీనివాసరావుగారి పాటలలోని యొక మంచిగుణము.

7.3.4 రావుగారునాటకాద్యంతములలో మంగళయుక్తమైన పాటలు రచించిరి నాంద్యంతమున పాడుట కొరకైదు పాటలు రచించిరి. వానినే ఆయా నాటకము లందు వాడిరి. అట్లే నాటకాంతమున మంగళాశంసనార్థము మూడు పాటలు రచించిరి. నాంద్యంతమున పాడబడు నొక్క పాటలో మాత్రము శ్రీనివాస రావుగారు తమ నామమును జొప్పించిరి.[1] ఇట్లే ప్రహ్లాద నాటకమున కొన్ని పాటలలో వీరు తమపేరును జేర్చి రచించిరి [2] శ్రీనివాసరావుగారు పాటలనే గాక గేయములను గూడ రచించిరి. వృత్తము, గేయము, పాట అను వానిని వీరు నిర్వచించిరి. "ఇందు (ప్రహ్లాదలో) వృత్తములు, గేయములు, పాటలని మూడు విధములగు గీతములుండును. అందు వృత్తములనఁగా ఛందశ్శాస్త్ర విధి విధా నంబుగ యతి ప్రాసయుక్తములు. గేయములనఁగా యతి బద్ధములుగాని వృత్తములు. పాటలనగా యతి ప్రాస నియమము లేకయు, గ్లిప్తాక్షర సంఖ్యా బద్ధము గానివియునై యుండును."[3] చాలవరకు నీ గేయములు భగవద్భక్తి యుక్తములై యుండును. ఈ గేయములలో భాష వికృత రూపమును ధరింప లేదు అందుకు వీరి గేయములే నిదర్శనము.[4]

---

1. 100. అను. 1
2. 105. అను. 19, 23, 25
3. 105. ఉ పు. 6
4. 105 అం 4 రం. 6

ఇట్లు శ్రీనివాసరావుగారు పద్యరహిత నాటకములు రసభరితములుగా నుండవని తలంచియు, తమ పాండిత్య ప్రకర్షను ప్రకటించుటకును పద్యములు రచించిరి. తమ కిష్టము లేకున్నను నాటి సామాజికులను సంతృప్తిపరచుటకై పాటలను సైతము రావుగారు రచించిరి. ఈ పాటలు, పద్యములు సందర్భోచితముగా, భావానుగుణముగా నొప్పుచు నాటకముల గౌరవము నధికము గావించుచున్నవని మనకు పై పరిశీలన వలన స్పష్టమైనది.

## 7.4 భాష :

నాటకమున ఉచితమైన భాష యుండుట సర్వజన సమాదరణీయము. కావ్య భాషకు నాటక భాషకు భేదముండితీరవలెను. కావ్యమాలోచనామృతము. నాటకము కావ్యభేదములలో నొకటైనను రంగమున ప్రదర్శింపబడుట దీని లక్షణము. నాటకము రంగమున ప్రయోగింపబడినప్పుడు ఆయా పాత్రల నోటినుండి వెలువడు మాటలు సులభగ్రాహ్యములుగా నుండుటత్యావశ్యకము. కనుక నాటకమందు సులభమై, సర్వజనగ్రాహ్యమై, విన్నవెంటనే అర్థస్ఫురణ కలుగునట్లు భాష సూటిగా నుండవలెను. నాతి కఠినమై, నాతి పేలవమై, రస నిర్భరమై భాష యొప్పవలెను. నాటకమునకు భావ సంపద ప్రాణాధారముకాగా దాని భౌతిక రూపము భాషయగుచున్నది. భావ ప్రకటనమునకు భాష సహకరించు నుపకరణము. దేహరహితమైన ప్రాణమట్లు భాషారహితమైన భావ మగమ్యగోచరము. భాషాభావముల కవినాభావ సంబంధము కలదు. కనుక నాటకోచితమైన భావములకు, తదనుగుణమైన భాషయుండి తీరవలెను. నాటకోచిత భాషయున్నప్పుడే నాటకము సహృదయ హృదయావర్జకమై మెప్పు వడయును. ఈ విషయమున శ్రీనివాసరావుగారు తమ యభిప్రాయము వ్యక్తము గావించిరి. "ఆంధ్రనాటక భాష కఠినముగ నుండరాదని కొందఱి మతము. పేలవముగ దుండరాదని కొందఱి మతము. అంత కఠినముగను నంత పేలవముగను నుండరాదని మధ్యస్థుల మతము. మూల తత్త్వము దెలియక యభిప్రాయములు భాషా విషయమున స్వేచ్ఛగా నిచ్చుచున్నారని నా మతము. వాక్య సౌలభ్య కాఠిన్యములు విషయాధీనములు. విషయములు రసాధీనములు. రసములితివృత్తాధేయములు. ఇతివృత్తములు కవి స్వాధీనములు. శృంగారము నందు కాఠిన్యమును, పౌరుషసమయమున మృదు పదములును గల వాక్యములు

పనకిరావు హాస్యమపుడు గొప్ప సమాస పదములు పనికిరావు పశ్చాత్తాప దూషణము లందు మృదుపదములు పనికిరావు. భరింపనోపని దుఃఖమున, నాత్మ త్యాగమొనర్ప సమకట్టినపుడు సమాసయుక్తములగు గొప్ప వాక్యములు చెల్లవు. పట్టరాని యాగ్రహము వచ్చినపుడు స్పష్టముగా నుచ్చరింపని వాక్యము గాని, కొన్ని పదముల లోపములైన వాక్యములుగాని, యొక ముఖ్య శబ్దముచ్చరించి తన భావము తెలియజేయుచు నిలుపుటయేగాని యుండవలెను. ఇట్లే యాయా రసపోషణమునకై యాయా గుణములకుఁ దగిన శైలి నవలంబింపవలెను. శృంగారబోధనలందు సమాస పద వాక్యములుండుట శ్రావ్యము. మనలో పురాణ నాటకములు హెచ్చుగానున్నవి చారిత్రక నాటకములు, సంఘ సంస్కరణ నాటకములు, గృహకృత్య నాటకములు, వేదాంత నాటకములు బహు స్వల్పముగా నున్నవి. ఇట్టి నాటకములు వ్రాయునపుడు విషయభిన్నత నుండి శైలి భిన్నించు చుండును. కవులకు శైలిని భిన్నించు సౌలభ్యము కలదు. దాని నుండి భాషా సౌష్ఠవము హెచ్చును."[1] ఇట్లు తమ అభిప్రాయములను వెలిబుచ్చి తదుచిత రీతిని తమ నాటకములందు భాషా ప్రయోగము గావించిరి. ఈ విషయము కొంత వరకు రావుగారి సంభాషణ రచనా వైదగ్ధ్యమును గూర్చి వ్రాయునప్పుడు తెలిపితిని.

7 4 1 సర్వసామాన్యముగా నాటకములందు శ్రీనివాసరావుగారిభాష సర్వజన సులభ గ్రాహ్యమై యొప్పుచుండును. సర్వజన సులభగ్రాహ్యమనుటచే భాష పేలవమని తలంపరాదు. భాష భావోచితమై యుండును. కోపము, క్రోధము, ఆవేశము, శోకము, విచారము, శృంగారము, హాస్యము మొదలైన సందర్భము లందు తత్తదుచిత భాషా ప్రయోగము చేసి నాటకోచిత మొనర్చుట వారిలోని ఘనతకు నిదర్శనము. గంభీర భావములను సైతము సూటిగా చెప్పి విషయావ గాహనము గావించుటయు గలదు. అలతియలతి పదములతో నాతి దీర్ఘములైన వాక్యములతో కూడిన భావగర్భితమైన భాషప్రయోగించుట వీరికి పారిపాటియే. వీని కన్నిటికి నుదాహరణములు వీరి నాటకము లన్నియు నని చెప్పుటలో నాశ్చర్యములేదు

---

1. 140. ఏప్రిల్ 7, 8, 1917

7.4 2 అంతట సమాసభూయిష్ఠమైన భాషలేదు. పైపెచ్చు అట్టి భాష నాటకమున వాంఛనీయము గూడ కాదు. అయినను చిన్నచిన్న సమాసయుత రచన ఎడనెడ లేకపోలేదు. పటాణి సంగీతజ్ఞున కొకనికి బహుమాన మిప్పించుటకు బహ్మనీ సుల్తానుల యొద్ద కరిగినప్పుడు "మీ ఏలికకు క్షేమమా" యని బహ్మనీ సుల్తానులు ప్రశ్నింప, పటాణి యిచ్చిన సమాధానము. "మహాప్రభూ! ప్రబలారివారనిబిడాంధకార నివారక ప్రచండకర తీక్ష్ణభానులు, విపులాభి యాతిజాత భూజాత నిర్మూలనకర బృహద్భానులు, ఘోరవైరి నారీ జనముఖ ముల వినాశకర హిమభానులగు భామినీ సుల్తానులు కృష్ణపక్ష చంద్రునిబలె దిన దినము క్షయించుచుండ మాయేలికకుఁ గొరంత యేల కలుగును."[1]

ఇట్లే పంచమాంకము పంచమ రంగమున రామరాజు కంఠము ఖండించిన వెనుక పటాణి శోకసంతప్తుడై తన్నుతాను నిందించుకొనుచు, అషాబీని దురాలాపము లాడు సందర్భమున సమాసభూయిష్ఠమైన భాష ప్రయుక్తమైనది. అట్టి భాష సందర్భోచితముగ, పటాణి గావించిన ఘోరమునకు పశ్చాత్తాపపడు విధముచిత రీతినికొనసాగినది. ఇదే విధముగా ఇతర నాటకములలోను ఎడనెడ భాష ప్రయుక్తమై, సందర్భానుగుణమై యెంతయు నొప్పుచున్నది. అయినను "ఈ గ్రంథంబు (సునందనీ పరిణయము) నం గహ్వార్థ రచన బుద్ధి పూర్వకంబు గనేఁ జేయకున్నను, జిరకాలానుభవ వశంబున సులభమని నమ్మిన యర్థంబేమి, సమాసంబేమి యెచ్చటనయినను జేరియుండు"[2]నని "సునందనీ పరిణయమున"కు సంబంధించి చెప్పి నప్పటికి వీరి తదితర నాటకములకును ఇది వర్తించుననుట పరిశీలనవలన వ్యక్తమగును.

7 4.3 కనుకనే శబ్దార్థాలంకారముల కాకరమై వీరి భాష శ్రుతిహితమై సహృదయ రంజకమై యొప్పుచుండును. శబ్దాలంకారములు అంత్య ప్రాసము (రామరాజు చరిత్రము 3-2); వృత్త్యనుప్రాసము (శిలాదిత్య-1-2); యమకము (సునందనీ పరిణయము-2-2) కలవు. ఇట్లే ఇతర శబ్దాలంకారములకు నుదాహరణముల జూపనగును.

---

1. 100. అం. 3 రం 2 2. 98. పీ. పు. 3

7.4.4 అర్థాలంకారములు : ఉపమ - "ఆకలి తీరిన పిదప నళులు విరులంబాసిన రీతి ననుం బాసితివి. వట్టివలపుల నన్నాలడి పెట్టితివి. ఇలాధిపుల చెలుములు జలములోని వ్రాతలను నది నిజమయ్యె." (రుక్మాంగద — 5-1); రూపకము - "కోమల పల్లవ పత్రరదచ్ఛనా ! నీ యనుపమ సౌందర్యాంగ లావణ్య జలనిధిలో నాయనంగ పరితప్తకాయంబు మునింగి యోలలాడనిమ్ము" (శిలాదిత్య 1-2); అతిశయోక్తి - "తరుణీ! ఈ తరునిక రాంధకారంబు నీ కురుల కాంతిచే దట్టంబయ్యె. మార్గంబు గానరాదు." (సుఖమంజరీ పరిణయము 1-2) ఇట్లే ఇతరాలంకారములకు నైతమెన్నియేని యుదాహరణము లీనగును. ఇట్లు నాటకములు శబ్దార్థాలంకారభూషితమై యుండియు అభినయమున కర్హంకిగాక పోవుట కెంతయు వీరిని ప్రశంసింప వలసి యున్నది.

7.4.5 ఇట్లే శ్లేషాత్మకమై భాష అచటనచట మనోహరమై యొప్పు చున్నది. "ధరాపరాగంబు ధరాపరాగంబను నది స్థాపించితిని." (రుక్మాంగద 5-1) "నీ పీబంధ విముక్తిం గోరుచు దపించుచున్నావు. నేనును నీవిబంధ విముక్తిగని సుఖింప నపేక్షించుచున్నాను." (శ్రీరామ జననము 1-4) శ్లేషతో పాటు వ్యంగ్య స్ఫూర్తియు గలదు. "మహాప్రభూ! మీరు నాకుజనకులుగానెంచి రణావనియందు నాశక్తి యంతయు ధారపోసెద! నిస్సందేహమిది!" (రామరాజు చరిత్రము 4-8) ఇట్లు శ్లేషాత్మకమై భాష యుండినను సులలితమృదు మధురమై యుండును.

7.4.6 వీరి భాషలో సామెతలకు లోకోక్తులకు కొదవ యుండదు. శ్రీనివాసరావు గారనేక సామెతలు సేకరించి వానికాంగ్లానువాదము నైతము కూర్చియున్నారు. అట్టి సామెతల వ్రాత ప్రతి డా. పి. ఎస్. ఆర్. అప్పారావు గారి యొద్ద కలదు. తాము సేకరించిన సామెతలను తమ నాటకములలో వాడి తమ లోకజ్ఞతను ప్రకటించిరి. సుల్తానా చాందుబీ' నాటకములో నున్నన్ని సామె తలు మరే ఇతర నాటకమునను లేవు. "కాలము కొలది మార్పు, తాలిమి కొలది నేర్పు", "జానెడు పోనేల మూరెడు తగ్గనేల", "కల్ల పసిడికిం గొంతులు మెండుకావా" (సుల్తానా చాందుబీ–పు. 8, 9, 28) ఇట్లెన్ని సామెతలనైనను జూపవీలగును.

7.4.7 శ్రీనివాసరావుగారి భాషలో జాతీయములకు, నుడికారములకు కొదవ యుండదు. "కన్నులకుఁ గట్టినట్లు, పూసల గ్రుచ్చిన రీతి, కంటికి రెప్ప వలె, పచ్చడంబునఁ జిచ్చగునని, కనుబొమలెగురవేయు, దారను వెన్నువేసుకొని ('భార్యను వెనకేసుకొని' యను వ్యావహారికమునకు గ్రాంథికము), మీ దేహ మెల్ల కన్నులిడుకొని వర్తింపవలయు, కనురెప్ప వేయక మొదలైన విందు కుదాహరణములు. భావమునకు తగినట్లు సొగసుగ వీరు పదప్రయోగము గావింతురు. 'కన్నులఁ గప్పుకొందు, నా దేహమెల్ల బెండు పారినది, చికిలి చెక్కులు'' మొదలైనవి సొగసైన పదప్రయోగములు (Fine Expressions). కొన్ని రాయలసీమలో వాడుకలో నున్న పదములు సందర్భోచితముగ ప్రయుక్త ములైనవి. లోసంచు లోలోపల ఇతరులతో రహస్యముగా కలిసి సలహాల నిచ్చుట), రెట్టలు (భుజములు, చేతులు), సీవు మల్లివి (మల్లి-కుటిల మనస్క), విడిమట్టుగా (ప్రత్యేకముగ), చించి చెండాడు (సంహరించు), ఇగ్గు (లాగు), దిమాకుపడు (గర్వపడు-క్రొవ్వెక్కు. దిమాక్-హిందూస్థాని-గర్వము-దానిమీద పడుఁజ్యనుబంధము). ఇట్టివనేకములు రాయలసీమలో వ్యవహారమున కలవి ప్రయుక్తములైనవి.

7.4.8 పాత్రోచిత భాష: శ్రీనివాసరావు గారికి పాత్రోచిత భాషపై ప్రత్యయము లేదు. నాటకమునందలి ఆయా పాత్రలకు తగిన రీతిని భాషను ప్రయోగించుట పాత్రోచిత భాష. తెలుగు నాటకములలో పాత్రోచిత భాషా ప్రయోక్తలలో నాదెళ్ళ పురుషోత్తమ గారాద్యులు. కాని దీనికి అధిక ప్రచారము తెచ్చినవారు వేదం వేంకటరామశాస్త్రిగారు. సంస్కృత నాటకములందు పాత్రలు మూడు విధములుగ-ఉత్తమ, మధ్యమ, నీచములని-విభజింపబడి యుండుట సర్వజన విదితమే. అందు ఉత్తమ, మధ్యమ పాత్రలకు సంస్కృతమును, స్త్రీ నీచ పాత్రలకు ప్రాకృతభాషను ప్రయోగించుట పరిపాటి. వేదంవారు ఉత్తమ పాత్రలకు గ్రాంథికమును, నీచ పాత్రలకు గ్రామ్యమును తమ నాటకములలో వాడిరి.అంతే గాక మహమ్మదీయ పాత్రలకు తురకతెలుగును ప్రయోగించిరి. ఆ నాడు ఆంధ్ర నాటక విమర్శక ప్రపంచమున అనేక వాదోపవాదములు, తర్జనభర్జ నలు నీ పాత్రోచిత భాషపై చెలరేగినవి. వేదం వారిని సమర్థించి, అనుసరించిన వారును గలరు. ఇట్టి పాత్రోచిత భాషాప్రయోగముచితము కాదని గర్హించి

వేదం వారిని గ్రామ్యశాస్త్రియని నిరసించిన వారును గలరు. నాటకము జీవిత ప్రతిబింబము గనుక నౌకరు మొదలుకొని రాజు వరకు నొకే రీతిగా నాటకమున భాషించుట యుచితము కాదనియు, ఆయా పాత్రలకు తగిన రీతిని భాషను ప్రయోగించుట సమంజసమనియు వేదం వారిననుసరించిన వారి వాదము. కాని గ్రామ్య ప్రయోగముచే భాష చెడుననియు, అభివృద్ధి నిరోధకమనియు, భాషా సంకరమగుననియు, తన్మూలమున నాటకమయోమయమై అర్థాపగతికి దూర మగుననియు, ఆయా పాత్రలకు తగిన భాషనుపయోగించిన దానికంతము లేకుండుననియు, కనుక పాత్రోచిత భాషా నిబంధమునందు సామంజస్యము గోచరింపదనియు, పాత్రోచిత భాషను నిరసించిన వారి వాదము. వీరికి సమాధానముగా వేదంవారు "గ్రామ్యభాషాప్రయోగ నిబంధన"[1] మను గ్రంథమునే రచించి, పాత్రోచిత భాషా ప్రయోగమే ఉచితమని నిరూపించిరి. వేదంవారు అనువాద నాటకములలోనేగాక, తమ స్వతంత్ర నాటకములందును నీ పాత్రోచిత భాషను ప్రయోగించిరి. కాని శ్రీనివాసరావుగారి కీపాత్రోచిత భాషపై గౌరవము లేదు.[2] "ఇక నాటక భాష గృహములలో మనము వాడుకొనుచుండు భాషగ నుండవలెనని పాశ్చాత్యులలో కొందరి మతము. మనలో సైతమిటీవల కొందఱీ మతముననుసరించినారు. దీనినుండి గ్రాంథిక భాష చెడును. మరల నాటక గాంభీర్యమునకు భంగము కలుగును. ఇంతియ గాక పాత్రోచితముగ నన్య దేశీయ పద వాక్యములుపయోగింపఁ బడవలెనని కొందఱభిప్రాయపడిరి. ఇది కేవలవినోదమార్గముగ నుండును; కాని నాటక సంప్రదాయ మతము కాదు. "లోకో భిన్నరుచిః" అని యున్నది కదా! కానిండు[3] అని శ్రీనివాసరావుగారు ఎవరిని నిందింపకయే తమ అభిప్రాయ మును స్పష్టము గావించిరి. కనుక వీరు తమ నాటకములలో పాత్రోచిత భాష ప్రయోగింపలేదు.

బలిజేపల్లి లక్ష్మీకాంత కవి గారి హరిశ్చంద్రలో వలె శ్రీనివాసరావుగారు తమ 'సత్యహరిశ్చంద్రీయము'న వీరబాహునకు పాత్రోచిత భాష ప్రయోగింప

---

1. 10 2. 85. పు 88-97

3. 188. ఏప్రిల్ 12, 1911

కుండుట యుచితముగా లేదని గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు విమర్శించిరి. అట్లే 'రామరాజు చరిత్రము'న మహమ్మదీయుడైన పటాణికి శుద్ధ గ్రాంథికమును శ్రీనివాసరావుగారు వాడియున్నారు. కాని యిది ఉచితము కాదని పాత్రోచిత భాషావాదులు విమర్శించిరి. వేదం వేంకటరాయశాస్త్రిగారు తమ 'ప్రతాప రుద్రీయ, బొబ్బిలియుద్ధనాటకము'లలో మహమ్మదీయులకు తురక తెలుగును ప్రయోగించిరి. ఈ పద్ధతిని యితరులు కొందరనుసరించిరి. అయినను శ్రీనివాస రావుగారికిట్టిది యిష్టము లేదు. అట్టివారి విమర్శకు సమాధానముగా "తురక వాఁడగు పటాణి నోట సంస్కృత పద జటిలములగు వాక్యములు వచ్చునా? హిందువుల వర్ణనలలో సామాన్యముగా నుండు "ఇంద్రాయుధము, అష్ట దిక్పాలకులు" మొదలగు వర్ణనలు తురకల నోట వచ్చునా? యని కొందరాక్షేపింతురు. ఇది తెలుగు నాటకము. ఉత్తమ పాత్రను ధరించినవాడు తురక వాఁడయినను వానికి ఉత్తమ భాషయే వాడవలెనని నా తాత్పర్యము. "లోకో భిన్నరుచిః"అని యున్నది కావున ననేకు లనేకతాత్పర్యంబులీ విషయంబునఁబూనుదురు." [2] అని శ్రీనివాసరావుగారు నుడివి యున్నారు.

7.4.9 కాని శ్రీనివాసరావు గారికి పాత్రోచిత భాషా ప్రయోగముపై నభిమానము లేకున్నను, కొన్ని నాటకములలో నెడ నెడ నీచ పాత్రలకు గ్రామ్యము వాడి యున్నారు. వీరి ప్రథమ నాటకమైన 'సునందనీ పరిణయము' (2-1) న ఎఱుకల (దొంగల) కు గ్రామ్యము ప్రయోగించిరి. ఇందలి భాష రాయలసీమ మాండలికము. అందునను ముఖ్యముగ బళ్ళారి, అనంతపురము జిల్లాలోని భాష. ఇదే విధముగ 'సుఖమంజరీ పరిణయము'న విషయసేనుని సేనలోని సూరుడు, వేగుడు నను భటులకును (4-8), చంద్రగిర్యభ్యుదయము'న పంచమ జాత్యర్చకునకు (1-4); 'కాళిదాసు' లో డంబర వానికి (2-3), శ్రీరామ జననము'న దొంగలకు (2-2) గ్రామ్య భాషను ప్రయోగించియే యున్నారు. అంతే గాక అచ్చటచ్చట నీచ పాత్రల భాష గ్రాంథికమై యుండియు వైకృత రూపములు దొరలినవి. వీనిలో 'కాళిదాసు' లో డంబర వాని భాష మిక్కిలి సహజమై, సందర్భోచితమై హాస్యస్ఫోరకమై యొప్పుచుండుట ప్రశంసార్హము. ఇట్లు

1. 3. పు. 114-117 2. 100. పీ. పు. 2.

శ్రీనివాసరావుగారికి పాత్రోచిత భాషపై నిష్టము లేకున్నను, నీచ పాత్రల కెడ నెడ గ్రామ్య భాషను ప్రయోగించిరి. కాని దీనిని వీరు సర్వత్ర పాటించి యుండలేదు. అయినను శ్రీనివాసరావుగారు తమ నాటకములలో భటులు, బాలురు, రాజు, మంత్రులు, ఉన్నతపదస్థులు మొదలైన పాత్రల కాయా సందర్భో చితముగ భాషను ప్రయోగించుటలో అందె వేసిన చేయి అనుటలో సందేహము లేదు.

7.4.10 శ్రీనివాసరావుగారి భాషపై కన్నడ భాషా ప్రభావముండుటలో అసహజము లేదు. నింద (ఎక్కువ యనుటకు), కెలసము (పని), నిద్ర చేయు (నిద్రించు, ఇది తెలుగులోను వాడుట గలదు. అయినను కన్నడము తెలిసిన ఆంధ్రులలో దీని వ్యవహారమెక్కువ.) శ్రీనివాసరావుగారు మేము, మనము రెండిటికి నభేదమును పాటించి ప్రయోగించిరి. కన్నడమున మనమను నుభయార్థక పదములేదు. 'మేము' అన్న పదమే రెండిటికి నుపయుక్తము. అట్టి కన్నడ భాషా సాహచర్యముచే వీరిట్లు ప్రయోగించియుందురు.

7.4.11 రావుగారి వాక్య రచనా విన్యాసము కొంత వింతగా ఉండును. "భామా! నీ ప్రల్లదంబులోర్వఁజాలవెళ్ళుము" పాతాళకేతుడు మదాలసను పట్టి ఈడ్చి కొనిపోవు సమయమందలి వాక్యము. నాతో రమ్మ అనుటకు వెళ్ళుమని ప్రయుక్తము. "వారిని నాకుఁ జక్కగాఁదెలుసును, మీకి వాగాడంబరాచార్యులను దెలియునా?" అనునిట్టి వాక్యములెన్నియో లేవు. కనుక పొరపాటున నిట్లు ముద్రితమైనవేమో అని తలంచుట కవకాశము కలదు. భాషపై నంతగా నధికారముగల రావుగారిట్టి తప్పిదములు చేయుదురా?

7.4.12 అయినను కొన్ని దోష దూషిత శబ్దములు, అరిసమాసము లును వీరి భాషలో గన్పట్టుచున్నవి. అరిసమాసములు దుర్నడత, సమయ సందు కట్టు, శాస్త్ర కట్టడములు, కుట్రోపాయము, లోకవాడుక, గర్భగుడి, బహుతమాషా, అధికార గొప్పతనము అనునివి వీరి నాటకములలో నగపడు అరిసమాసములు. దోషదూషితములైన శబ్దములు: శరితాయె (శరీత్రాయె- అనియే యుండవలెను), ఇషణత్రయము (ఈషణత్రయము సరియైన రూపము), సభికులు (ఈ పదము దోషమైనను తిక్కనయే ప్రయోగించెను), చిత్రవర్ముడు (బాలవ్యాకరణము-తత్సమ పరిచ్ఛేదము-సూ 75 ప్రకారము చిత్రవర్మ అనియే

యుండనగును. (ప్రౌఢవ్యాకర్త ప్రకారము పైరూపమును సాధువే యగును.) స్వంత పౌరుషము, స్వంతపుత్రునకు, కననియ్యదు. దానినియ్యఁబూని, సెల వియ్యర, ఇంకఁజేతుమో'' ఇట్టి యసాధు ప్రయోగములు కొన్ని వీరి భాషలో దొరలినవి. కాని వీరు వీని నెరిగియే ప్రయోగించిరేమో తెలియదు. అయినను ఉత్తమ గుణ సాగరమున నిట్టి దోషములు గణించుట యుచితము కాదనియే తలంపనగును. కాని యసాధువులను సాధువులనుట దోషమే కదా! ఏమైనను 'ప్రమాదో ధీమతామపి' అని యున్నదిగదా? సభిక శబ్దమసాధువని శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారు విమర్శించిరి.[1] అది సాధువని శ్రీ గిడుగు వేంకటరామ మూర్తి పంతులుగా రనేక ప్రమాణములచే నిరూపించిరి.[2] ఇట్లు శ్రీనివాసరావు గారు భాషపై నధికారము గలిగి పాండిత్య ప్రకర్షను ప్రకటించుచు నాటకోచి తముగా, సందర్భోచితముగా భాషను ప్రయోగించి యుండుటెంతయు గొనియాడ దగిన విషయము. పాత్రోచిత భాషపై నభిమానము లేకపోయినను అక్కడక్కడ నీచపాత్రలకు మాత్రము గ్రామ్యమును వాడియున్నారు. తెలుగు నుడికార ములు, జాతీయములు, లోకోక్తులు, సామెతలు, పలుకుబళ్లు విరివిగా వాడి యున్నారు. తన్మూలమున రావుగారికి భాషపై నెంతటి యధికారమున్నదో ప్రక టితమైనది శ్రీనివాసరావుగారు తమ నాటకములందుచితరీతిని భాషను వాడి నాటకగౌరవము నధికము గావించిరనుట స్పష్టము.



---

1 135. జనవరి, 1897. పు. 1-12. 2. 9. పు. 130-151

# 8. రచనా ప్రయోజనము

శ్రీనివాసరావుగారి నాటక రచన వలన మూడు ప్రయోజనముల నాశించి నట్లు తెలియును. నాటక రచనా ప్రయోగములచే ప్రజలకు నీతిబోధ గావింప వలెననెడి ఆకాంక్ష మొదటిది. సంఘమునందలి దురాచారములను నిర్మూలింప వలెననెడి ఆశయము రెండవది. వీనిని సాధించుటకు నాటకమును ప్రదర్శింప వలెనను ప్రయోజనము మూడవది. శ్రీనివాసరావుగా రాశించిన మూడు ప్రయో జనములను సువిదితము గావించుట ప్రస్తుత ప్రకరణ ప్రయోజనము.

## 8.1 నీతిబోధ :

కావ్యమునకు రసానందము ప్రథమప్రయోజనము. అది సంస్కృత లాక్షణిక సమ్మతము. రసానందముతో పాటు నీతిని బోధించుట దానికి అను షంగిక ఫలము. ఉత్తమ కవికృత కావ్యమున రసముతో నీతియు సమ్మిళిత మైయే యుండును. ఇట్లే నాటకము సహృదయ హృదయరంజకమై రసా నందమును గలిగించుచు నీతిని గూడ బోధించుట అత్యావశ్యకము. కాని రసా నందమే ప్రయోజనమని నమ్మినవారు లేకపోలేదు. ఇట్టివే పాశ్చాత్య విమర్శక లోకమునను అభిప్రాయములు గలవు. కాని రసము, నీతియును రెండును అవినాభావ సంబంధము గలవి. ఈ అభిప్రాయమునే శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారిట్లే సెలవిచ్చిరి.[1] అందుచేత రసభంగము కాని విధమున నీతిని బోధించుట ఆవశ్యకమని విదితమైనది.

శ్రీనివాసరావుగారి నాటకము లన్నింటిలోను నీతిబోధ అపరిహార్య గుణమై యొప్పుచున్నది. నాటకము లందు నీతి తప్పనిసరిగా నుండవలెనని రావు గారు స్పష్టముగావించియున్నారు. ''కావున నుపదేశార్హమగు గుణములనేకము లుండవలెను. నీతి, రాజభక్తి, రాజద్రోహఖండన, దైవభక్తి, మాతాపితృ

---

1. 8, పు 77, 78

భక్తి, పతిభక్తి, ఆధ్యాత్మజ్ఞానము, దేశాభివృద్ధి, ఐకమత్యము, సంఘసంస్కరణము, సత్యాసక్తి, దుష్టదూషణము, శిష్టపరిపాలనము ఈ మొదలగు దేశార్థమగు నీతి పాఠములుండవలెను." [1]ఇట్లే 'ప్రపంచ నాటక చరిత్ర' చివర నీతిబోధ గావించితీరవలెనని నొక్కిచెప్పిరి.[2] ఇంక ననేకోపయోగము లీ నాటకము వలన కలుగునని ఉపసంహారమున వివరించిరి.[3] "తారాశశాంకము, బిల్హణీయము, కుమార రామచరిత్రము, సారంగధర చరిత్రము'' మున్నగునవి అవినీతిని ప్రోత్సహించునని, వీనిని నాటకీకరింపగూడదని నొక్కివక్కాణించిరి. చివరికి 'ద్రౌపదీ వస్త్రాపహరణము'నుగూడ రంగమున ప్రదర్శింప గూడదనియు, తన్మూలమున ఒక పతివ్రతామానభంగమును ప్రదర్శించినట్లగుననియు నది సంస్కారవంతులకు సహింపరానిదనియు నుడివిరి [4] అయినను వీని కపవాదములు కలవు. తరువాతి కాలమున రావుగారు సారంగధర చరిత్రమును నాటకముగ రచింపకపోయినను దానివంటి కథను కల్పించి 'మైసూరు రాజ్యాభివృద్ధి'లో చేర్చుటయు, 'ద్రౌపదీ వస్త్రాపహరణము'ను నాటకీకరించుటయు గావించియే యున్నారు. 'సారంగధర'లో సవతి తల్లి కుమారుని మోహించి యుండగ 'మైసూరు రాజ్యము'న మేనత్త ఇద్దరు మేనల్లుండ్రను మోహించినది. తిరస్కారమునకు ఫలితముగా నిద్దరును వధింపబడిరి ఇందుకు కారణములను "సారంగధర కథకుం గలిగిన వ్యాప్తిని చూచి "సుమనోరమ సభ'' వారి నిర్బంధము చేతనో, లేక వారికే దృష్టియందు మార్పు గలిగియో దీనిని వ్రాసి యుందు"రని శ్రీ రాళ్ళపల్లి వారూహించిరి. అయినను కావచ్చును. ఇట్లే 'ద్రౌపదీ వస్త్రాపహరణము'ను రచించియుందురని తలంపవలెను. అయినను శ్రీనివాసరావుగారేనాటకమునను అసందర్భముగా గాని, రసభంగమును గలిగించునట్లుగా గాని నీతిబోధకై ప్రయత్నించి యుండక పోవుట ప్రశంసార్హము. శ్రీ రాళ్ళపల్లి వారు ''కాని కళా సంసారమున నీతి తెరమరుంగు భార్యగా నుండి పని చేయవలయునే కాని ముందుపడి మొగముం జూపి త్రోసుకొని రారాదు. అట్లయినచో కళ సొగసుచెడును. కనుక నాటకము నందే నీతి ప్రవేశించినను దానికి కథతో సన్నివేశములతో ఎడతెగని సంబంధ

---

1. 140. ఏప్రిల్ 7, 8. 1917 2. 157. Rules 8, పు. 2
3. పైదే పు. 254-277 4. 157 పు 224-227
5. 8. పు 77

మున్నట్లు కన్పింప వలయునే కాని, అదే పనిగా ఆకస్మికముగా తెచ్చి అతికించి నట్లు చేయరాదు. అది పిలువని పేరంటమువలె సహించుట కష్ట"[1] మని తెలిపిన రీతిగా రావుగారు తమ నాటకము లందెచటను హఠాత్తుగా నీతిని ప్రవేశపెట్టలేదు. ప్రవేశపెట్టిన నీతులన్నియు కథతో సన్నివేశములతో నతికినట్లు గలవు.

శ్రీనివాసరావుగారు నీతియుతములైన పౌరాణిక చారిత్రకేతి వృత్తము లనే గ్రహించి నాటకములుగ రచించిరి. ప్రథమ నాటకము 'సునందనీ పరిణయము' వీరి కల్పితనాటకము. వీరు ఇందలి ప్రస్తావనలో 'అయిన నీ నాటకంబే నీతిని జనులకు బోధించును' నని నటిచే నడిగించి "మానవుఁడు దన కుం దగని పదవులాశింపం జెడు ననియును, ప్రపంచమున నన్ని బలంబుల కంటెను దైవ బలంబు హెచ్చనియును, దానియందు నగపడు"నని నీతిబోధను గురించి స్పష్టము గావించిరి. కావున రావుగారి కీ నీతిబోధ విషయమున నధికాభినివేశము గలదని మన కవగతమగుచున్నది.

8.1.1 శ్రీనివాసరావుగారు తమ నాటకములలో ధర్మ విజయము, సత్యాభినివేశము, పతిభక్తి, అరిషడ్వర్గముల జయించుట, పట్టుదల, నిష్ఠ, శౌర్యము, సాహసము మొదలగు విషయములను నీతి మంతముగా ప్రవేశపెట్టిరి. దుష్టశిక్షణ, శిష్ట రక్షణము కావ్యన్యాయమే కాదు, భారతీయ తత్త్వమునంతే. లేనిచో దుర్మార్గులు సర్వసౌఖ్యము లనుభవించుటయు, సన్మార్గవర్తనులు ఘోర నరక బాధ లనుభవించుటయు జరిగెడిది. కనుక ధర్మమునకు విజయము చేకూర్పవలెననుట వీరి మతము. హరిశ్చంద్రుడు, రుక్మాంగదుడు, రాముడు, భరతుడు, ప్రతాపుడు, యాచమనాయకుడు, ధైర్యధరుడు మున్నగువారు సత్పురుషులు; ఆదర్శవంతులు. వారి యడుగు జాడలలో నితరులు నడచి సన్మార్గ వర్తనులు కావలెను. వీరు ఘోరకష్టముల ననుభవించుటయు చివర సౌఖ్యమునందుట కలదు తన్మూలమున ధర్మమునకు విజయము కలిగినది.

కాని దుర్మార్గవర్తనులై సర్వసుఖములనుభవించి చివరికి సర్వనాశనమైన వారును గలరు. ఉగ్రసేనుడు, సుమతి, విషయసేనుడు, పాతాళకేతుడు,

---

1, పైదే. పు. 78

అస్మన్ బేగు, డాండియాగో, మదనుడు, దుర్యోధనాదులు, హిరణ్యకశిపుడు, జగ్గరాయడు, కీచకుడు, దక్షుడు మున్నగువారు దౌర్మార్గ్యముచే చివరికి ఘోరముగ మరణించుట జరిగినది. ఇది వారికి తగినశిక్ష. ఇదియే కావ్యన్యాయము. లేనిచో అధర్మము ప్రబలి ధర్మము నశించి యుండెడిది. అదెప్పటికి నాశింపతగనిది, ప్రదర్శింపరానిది.

కాని దీనికపవాదము లొకటి రెండు గలవు. 'మైసూరు రాజ్యాభివృద్ధి'లో లక్ష్మణవీరులను కవలను మేనత్త జగన్మోహిని మోహింప వారు తిరస్కరింతురు. తత్ఫలితముగ వారికి శిరచ్ఛేదము జరుగును. మేనత్తకోరిక అధర్మము, అనుచితము, నీతిబాహ్యము నని నమ్మిన ధర్మపరులు మరణించుట అధర్మ జయమునకు కారణమగును. వారిని వధింపజేసి తాను విషము మ్రింగి మరణింతునని ఆమె నిర్ణయించుకొని అట్లు గావించినను అవినీతికే ప్రాధాన్యము చూపబడినది 'శిలాదిత్య'లో కళావతీ మదనుల కుట్రచే పార్థియనుల చేతులలో శిలాదిత్యుడు మరణించుటయు నిట్టి యధర్మమునే చాటుచున్నది. కాని శ్రీనివాస రావుగారు ఈ రెండు నాటక విషయములను మరొక విధముగా సమర్థించి యుండుట గమనింపవలెను. వధ్యశిలపై నున్న లక్ష్మణవీరుల నుద్దేశించి అగస్త్యుడు "మీ పురాకృత కర్మఫలంబు మీకా జగన్మోహినీ రూపమ్మున నగపడినది. మీకు గాల పరిపక్వమయినది." అని తెలిపి "(లక్ష్మణునింజూపి) యదురాయడను పేరంది మహిషపురమునకు జేరిన రాజ్యంబంతయు నేకచ్ఛత్రాధిపత్యంబుగ సర్వమత సమ్మతంబుగ నేలును. దీని నెటింగి సుఖంబుగ నారాయణ ధ్యానంబొనరించుచు ప్రాణంబులు త్యజింపుడి" అని కర్తవ్యమును బోధించెను, దీని మూలమున రావుగారీ విషయమును సమర్థించిరి. అట్లే శిలాదిత్య నాశనమునకు సూర్యుడిచ్చిన వరములే కారణము. సప్తాశ్వసరోవరము మలినము చేయబడి, సాలగ్రామ మపహృతమైన సర్వనాశనమగునని సూర్యుని వాక్కు. తద్రీతిగా కళావతీ మాయోపాయముచే జరుగ పార్థియన్లచే శిలాదిత్యుతు సంహరింపబడును. కాని 'సుల్తానా చాందుబీ' నాటకమున దుష్టశిక్షణ శిష్టరక్షణాధ్యేయముతో, సర్వమత సహనముతో, ప్రజలక్షేమమే తన శ్రేయస్సుగా విశ్వసించి, కంటికి రెప్పవలె పరిపాలన గావించి, పాదుషా సేనల నెదిరించి మహాధైర్య సాహసోపేతయైన చాందుబీ మహారాజ్ఞి దుర్మార్గుడు, కుట్రదారుడునైన హమ్మీదు బాకు పోట్లచే మరణించుట మిక్కిలి అన్యాయము, అధర్మము ననిపిం

పకపోదు సర్వవిధముల నిది అధర్మముగానే కన్పట్టును. తనకు సామర్థ్యమున్నంతవరకు రాజ్యము చేసిన వృద్ధరాజ్ఞి మరణించినను 'పరవా'లేదని రావు గారు తలంచిరో ఏమో తెలియదు. కాని అందులోనే దుర్మార్గులైన అస్మన్‌బేగు, డాండియాగోలు మరణించుటెంతయు న్యాయము. కాని సన్మార్గవర్తనయైన రాణి మరణించుట ధర్మమవి తలంప వీలురేమ. మరెచ్చటను ధర్మచ్యుతిని చూపెట్టినట్లు గోచరింపదు.

8.1.2 ఒక విషయమున నిర్మలత్వముండినను, అది ధర్మబాహ్యమైన యెడల ఉచితమైనదిగా తలంప వీలులేదు. ధర్మములేవి నిర్మలత్వము సర్వత్ర పూజ్యము కాజాలదు. జగన్మోహిని భర్తయుండియు లక్ష్మణవీరులను ప్రగాఢముగ నిర్మలమైన మనస్సుతో మోహించినను అది ధర్మవిరుద్ధమగుటచే తన కోరిక ఫలింపక పోగా తానును మరణించినది. అట్లే కళావతియు మదనునితో పాటు వధింపబడినది. కాని చంద్రమతి, ద్రౌపది, సుఖమంజరి, మదాలస, సీమంతిని, జోరియా, గౌరాంబ మొదలగువారి ప్రేమలో ధర్మము, నైర్మల్యము సమ్మిళితమై యుండుటచేత ఘోర కష్టముల నుండి విడివిడి చివరికి స్వర్గ సుఖము ననుభవించుట కలదు. కనుక నైర్మల్యముతో కూడిన ధర్మమున్నచో తప్పకుండ దాని కంత్యమున విజయము బరిగి తీరును.

8.1.3 స్త్రీకి పాతివ్రత్యము పరమోత్కృష్ట గుణముగా రావుగారు నాటకము లన్నిట అవకాశము కలిగించుకొని వివరించిరి సందర్భోచితముగా ఆయా పాత్రలతో నుపదేశింప జేసిరి. 'సునందనీ పరిణయము'న జయదేవి, 'మదాలస' లో కుండల, 'రుక్మాంగద'లో సంధ్యావళి,సత్యహరిశ్చంద్రీయము'న చంద్రమతి, 'పాదుకాపట్టాభిషేకము'న కౌసల్య, సతికి పతి భక్తి అత్యావశ్యకమని వివరించిరి. చంద్రమతి పతిభక్తిప్రధానమని నమ్మియుండుట చేతనే హరిశ్చంద్రుని కష్టములలో పాలు పంచుకొనుటయేగాక ఋణవిముక్తికై భర్తచే అమ్మబడినది. అరణ్యమున దావాగ్ని ప్రజ్వరిల్లి తమ్ము చుట్టుముట్టు చుండ పాతివ్రత్య బలముచేత దాని అపాయము నుండి తాను తప్పించుకొనుటయేగాక పతిని, పుత్రుని, నక్షత్రకుని గూడా సంరక్షింపగలిగినది ఈశ్వరానుగ్రహమునకు పాత్రురాలై భర్తతో పుత్రునితో సర్వసుఖములను పొందగలిగినది.

సీత మహా పతివ్రత గావుననే భర్తతోడిదే లోకమని యెంచి రామునితో ఘోరారణ్యములకేగి కష్టములనుభవించినది. రావణుడు రాక్షస మాయతో తన నపహరించుకొని పోయినను, పాతివ్రత్య బలముండుటచేతనే రావణు నంతటి వాడు సీతను తాకలేకపోయెను. ద్రౌపది పతిభక్తి ఎనలేనిది. కనుకనే కృష్ణునను గ్రహముచే చీరలు పొందినది. కీచకుడు బలాత్కరింప పరుగిడుచుండ నామె వెన్నంటిన కీచకుని శిక్షింప సూర్యుడు సాహాయ్యమొనర్చినాడు. పుత్రుని పోగొట్టుకొని రాజ్యమున కేగ నిచ్చగింపని ప్రతాప మహారాజుతోనే అరణ్యము లందు జయదేవి నివసించి పాతివ్రత్యమును చాటినది. మదాలస పతివ్రత గనుకనే పతియైన కువలయాశ్వుని మరణమువిన్న మరుక్షణములోనే ప్రాణములు బాసినది. పాతివ్రత్యముచేతనే అశ్వతరుని తపఃప్రభావముతో మరల భర్తను పొందగలిగి నది. సంధ్యావళి సతీ ధర్మయుత యగుటవలన పతివ్రతా ధర్మను మోహినికి బోధించినది.

గౌరాంబ పాతివ్రత్యమసమానమైనది. భర్త ప్రతాపునితో పిల్లలతో నర ణ్యమున అవాచ్యమైన కష్టముల సహించి చివరికి సుఖముల పొందినది. అక్బరు సైన్యముచే చిత్తూరు కోట ముట్టడింప బడినపుడు పురుషుల దరు యుద్ధ మున మరణింప తురకల చేతులలో బడకుండ క్షేమాదేవి మొదలైన క్షత్రియ స్త్రీలు చితిలో దూకి మానము రక్షించుకొని ప్రాణము త్యజించినమహాపతివ్రతలు. వీరి సాటి వరి? దక్షయజ్ఞమునకై వచ్చిన సతీదేవి తండ్రి తన భర్త శివుని నిందించుచుండ మహా పతివ్రతయగుటచే సహింపలేక చితిజేరి తనువు త్యజించి నది. పతివ్రత గనుకనే రతి ఈశ్వరానుగ్రహముతో మన్మథుని మరల పొందు వరము సంపాదింప గలిగినది. ప్రతాపవతి పాతివ్రత్యబలము చేతనే అక్బరు చక్రవర్తి నెదరించి అతనిచే దాసోహమనిపించుకొనగలిగినది, అట్లే మదనసేన పతిభక్తియుత యగుటచే ఉపాధ్యాయు నెదిరించి బుద్ధి చెప్పగలిగినది.

లగ్నము కాకపోయినను వరునిపై మనసు లగ్నమైనచో నతడే భర్తయని నమ్ముట భారత వనితా ధర్మము. వేదవతి విష్ణువునే పతిగా పొందగోరి తపస్సు చేయుచుండ రావణుడామెను బలాత్కరింప చితిలో దూకి తనువు చాలించినది. సునందని ఉద్యానవనమున చూచి భాషించి, తన భర్తగా సుదేవుని తలంచిన వెనుక కుబేరుడు ప్రగాఢ ప్రేమను వ్యక్తము చేసినను తిరస్కరించినది.

సుఖమంజరియు వలచిన వరునే గాని స్వయంవరమునకై వచ్చిన ఇతర రాజన్యుల లెక్కచేయలేదు. తండ్రి దురాగ్రహుడు శత్రువుగా తలంచి ప్రద్యుమ్నుని ప్రతిమను ద్వారము కడ నుంచగా నా ప్రతిమ కంఠమున హారము వేసిన ధీర. విషయసేనుని మాయోపాయమున జయించినది. కష్టముల గడచి చివరికి పతియైన ప్రద్యుమ్నునితో సుఖములనుభవించిన సతి సుఖమంజరి. జోరియా అబిస్సును మనసార ప్రేమించినది. అస్మన్‌బేగు చేతులలో బడినను లొంగక దాం దుబీ రక్షణలోనికి వచ్చినది. అయినను అస్మన్‌బేగు యుద్ధ సంరంభములో జోరియా నెత్తుకొని పోవుచుండ అబిస్సు అస్మన్‌బేగు మరణించునంతటి దెబ్బ కొట్టి సంరక్షించుకొనగా భర్తతో సుఖముగా జీవింప గలిగినది. కుముదినీ యాచములు పెండ్లి పీటలపై నుండ జగ్గరాయని దౌష్ట్యముచే వివాహము విఘ్నము కాగా స్వామి భక్తి పరాయణుడైన యాచమనాయకున కన్ని విధముల సాయముగా నుండి విజయానంతరము యాచముని వివాహమాడిన గరిత కుముదిని. ఇట్లు వివాహము కాకపోయినను భర్తయని నమ్మినచో పతిభక్తి కలిగి నడచుకొనుటను పై ఉదాహరణముల వలన మనము గమనింప వచ్చును.

స్త్రీకి పాతివ్రత్యము పరమభూషణము. తద్విరహితయైన స్త్రీ యనేక కష్టములనుభవించును. జగన్మోహిని మేనల్లుండ్రను మోహించుట నీచము, నీతి బాహ్యము. వారిపైగల మోహము నిర్మలము, ప్రగాఢము కావచ్చును. భర్త వృద్ధుడైనను పాతివ్రత్యమును విడనాడ కుండుటయే యుచితము. కాని తద్విరహితయగుటచే తానును విషము మ్రింగి నిరర్థకముగ మరణించును కళావతి ముదుసలియైన భర్తను త్రోసిపుచ్చి మదనుని మోహములోబడి, అతని కొరకెన్నియో సాహసములు గావించి చివరి కతనితోపాటే దుర్మరణము పాలైనది. కైక ఉత్తమగుణ సంపూజితయయ్యెను. పాతివ్రత్యము గలదయ్యెను మంధర దుర్బోధచే దశరథుని బాధించి ఎప్పటి వరములనో గ్రహించినది. తన్మూలమున సతీ ధర్మమును త్యజించినట్లైనది అందుకే భర్తృ మరణము, తనకు వైధవ్యము, మానసిక బాధ కలిగినవి. కాని దేవకార్యార్థము మంధర కైకకు దుర్బోధ గావించినదనియు, మంధర ప్రేరణచేతనే కైక ఇట్లొనర్చినదనియు రావు గారు సమర్థించి యుండుట యిచట గమనింపదగిన విషయము.

8 1.4 స్త్రీ పురుషులు పరపురుషులను స్త్రీలను కోరుట ఘోరపాపమునకు హేతువు. పరస్త్రీలను గోరి నికృష్టమైన శిక్షల బొందిన వారనేకులు గలరు

అట్టి సమయముల పరస్త్రీ వ్యామోహము గూడదని రావుగారు స్పష్టముగావించిరి అబిస్సుకు మనసిచ్చి పుచ్చుకొన్న జోరిమాను అస్మన్‌బేగు తనదానినిగా జేసి కొన చతురుపాయములు పన్నెను. తత్ఫలితముగా చాందుబీచే దేశ బహిష్కృతుడయ్యెను ఢిల్లీ చేరి పాదుషా సేనలతో అమహన్నగరుకు యుద్ధమునకై వచ్చి స దుచూచుకొని జోరియా నెత్తుకొని పోవుచుండ అబిస్సుచే కొట్టబడి దుర్మరణము పాలయ్యెను. ఇంతకంటెను దష్టుడు డాండియాగో. పరిశుద్ధాత్ముడై యుండవలసిన ఇతడు ఫాదరి డాండియాగో,మరొక ఫాదరిఆల్మేడా సోదరి మేరీని సచ్ఛీలవతిని మోహించిన ఫలితముగ కారాగృహమున పడెను. మాయోపాయమున కార నుండి తప్పించుకొనిపోయి అస్మన్‌బేగుతో చేతులు కలిపి ఢిల్లీ చేరి మరల యుద్ధమునకై వచ్చి మేరీ నపహరింపనుండ యుద్ధమున క్షతగాత్రుడై రాగా, క్షతగాత్రులకు సేవచేయుచుండిన మేరీ ఆల్మేడాలు చూచి క్షమింతురు. మరణావస్థలో నున్న డాండియాగో పశ్చాత్తాపుడై తన సర్వసంపత్తి మేరీకి చెందునట్లు మరణ శాసనము వ్రాసి మరణించెను. ఇట్లు అస్మన్, డాండియాగోలు పరస్త్రీలనుకామించి ఘోరమైన మరణమును బొందిరి.

సర్వసద్గుణ సంపన్నుడయ్యును, రాజ్యపాలనాదికములలో శ్రీకృష్ణదేవ రాయలవంటి ఖ్యాతినార్జించిన రామరాయలు అరివీర భయంకరుడై యుండియు పరస్త్రీ వ్యామోహ మనెడి కళంకముచే పుత్రుని చేతనే వధింపబడి మరణించెను. మహమ్మదీయస్త్రీలను చెరబట్టి ముసుగుదీయించిన దోషమే యతని వినాశమునకు హేతువైనది

విషయ లంపటముతో పరస్త్రీ వ్యామోహితుడైన మదనుడు నవమాలికను బలాత్కరింప యత్నించి విఫలుడై, చేయరాని కృత్యములచేసి పార్థియన్లచే నికృష్టముగ వధింపబడెను. దుష్టుడైన మార నాయకుడు జగదంబనుగోరి ఘోర కృత్యముల జేసి చివరికి తత్ఫలితముగా సుబ్బాసాని వేషమున నున్న కృష్ణరాయనిచే ఘోరముగా చంపబడెను. ఉపాధ్యాయుడు గౌతముడు శిష్యురాలైన మదనసేనను కామించి యామెచే నెదిరింపబడి తరువాత నాటకమున నతని నామ రూపములు లేకుండపోయెను.

పరకాంతను మోహించుటచే విషయసేనునకు కారాగార శిక్ష విధింపబడెను సాయనమాయనల మాయోపాయముచే సుఖమంజరిని కలయగోరి

శిక్షితుడయ్యెను. సభ్యుల నుద్దేశించి చెప్పిన నీతిబోధలో "కనులెత్తి పరకాంతఁ గన్న దోషమున గనుచున్న వాఁడనేగారాగృహంబు, పోయెను మానంబు పోయె ధనంబున్ పోయె జీవనమయో పోదు ప్రాణంబు" అని వాపోయినాడు. "పరసతిఁ గోరిన పాపాత్ముడవని పరమ దుఃఖంబులు పడుచుండు నెపుడు'' అనియు, ''పరభామఁ గనినట్టి పాపాత్ముఁడవని పరమ దుఃఖంబులు పడుటయే గాదు, పరమునకును దాను పరుఁడగు నిజము" అనియు నీతి నుద్బోధించినాడు విషయసేనుడు.

కుబేరుడు సునందనిని కామించి పిచ్చివాడయ్యెను. కుల్లా నాయకుని వృత్తి దొంగతనము. పరస్త్రీల నపహరించుట ఉచితమైనదికాదు. కాని వాడు జోరియా నపహరింప బూనుటచే ధర్మా నాయకునిచే చంపబడెను. కీచకుడు ద్రౌపదిని మోహించిన ఫలితముగ భీమునిచే చిత్రవధ గావింపబడి దుర్మరణము పాలయ్యెను. పాతాళకేతుడు మదాలస నపహరించి కువలయాశ్వునిచే వధింపబడెను. సీతాపహరణముచే దశకంధరుడు రామునిచే వధింపబడెను. ఇట్లు పరస్త్రీ వ్యామోహితునకు సర్వనాశనమగునని సర్వత్ర నీతి నుద్బోధించుట గమనింపనగును.

ఇదే విధముగా స్త్రీలును పరపురుషుల జూచుట సహింపరానిది. దూష్యమైనది. ప్రమీలారాజ్యమునందలి స్త్రీలర్జుని సేనానుల ఆయుధముల గ్రహించి వారి చేతులబట్టి లాగుచుండ నొక సేనాని కోపముతో ''చెలులారా! మీరు మాన మర్యాదలను వదలిన స్త్రీలుగ నగపడెదరు. కాదేని పరపురుషుల శరీర మంటుదురా" (బభ్రువాహన 3.3) అని గర్హించును. పరపురుషులే తమ పురుషులనుట ఆచటి స్త్రీల సూత్రమైనను తదితరుడైన సేనానిచే నీతినిగూర్చి చెప్పించినారు రావుగారు. జగన్మోహిని ఉత్తమ పురుషులైన మేనల్లుండ్రను వెనకి వారిని నాశము గావించుటయే గాక విషము మ్రింగి మరణించినదని ముందే విదితము. అట్లే కళావతికి భర్తయుండ నుపభర్తయైన మదనుని వ్యామోహమున బడి అతనితోనే మరణించుటయు పూర్వోక్తము.

కాని సత్కార్యసాఫల్యార్థము దుష్కృత్యమొనర్చినను దోషము లేదని రావుగారెంచినట్లు తలంపవలెను. దామరాజు పిచ్చి కుదుర్చుటకును, మారనాయకుని గడతేర్చుటకును కామేశ్వర పంతులు మారనాయకుని సోదరిని స్మరకేళిలో

తేల్చి మత్తుగొల్పెను. వ్యభిచరించుట దోషమైనను ఈ మంచిపని కిట్టి దుష్కార్య మవసరమని కామేశ్వర పంతులు యదురాయనితో జెప్పెను. ఇట్లే కళావతియు సత్కార్యమనియెంచి మదనుని కారాగారమునుండి తప్పింప ఆన గవర్మను వరించినట్లు నమ్మించి, వానిని మత్తుగొల్పి వాని వేషమున కారాగారమున ప్రవేశించును. ఇట్టి పని యనుచితమైనను కార్యసాధన కవసరము. ఇవి తప్ప రావుగారు మరెక్కడ నిట్టివానిని ప్రవేశపెట్టలేదు.

8.1 5 బాహిరమైన శత్రువులకే గాక అంతరంగికమైన అరిషడ్వర్గము కామక్రోధమోహలోభ మదమాత్సర్యములకు లొంగినచో మానవునకెని యేని యిక్కట్టులు గలుగుటయేగాదు సర్వనాశనమునకును దారితీయును. ఉగ్రసేనుడు జయమాలిని యందు కామాంధుడే కాదు, భుజబలముచే మదాంధుడై సుమతిచే పాదములు నరుకబడి మరణించెను. క్రోధపూరితుడగుటచే దురాగ్రహుడు కష్టములు కొనితెచ్చిపెట్టుకొని పుత్రిక సుఖమంజరిని యనేకమైన బాధలకు గురిగావించెను. సుమతిలో లోభము మూర్తిభవించినది ప్రతాపుని రాజ్యము నపహరింపవలెననెడి లోభమ చేతనే యతని పుత్రుని వధింప నాజ్ఞాపించి తేనె పూసిన కత్తివలె వర్తించినాడు. తన పుత్రిని ఉగ్రసేనున కంటగట్టదలంచెను. సునందనిని వివాహమాడుమని కుబేరుని ప్రోత్సహించెను. కాని వానికి పిచ్చెత్తెను. బుద్ధిబలవనెడి మదము గలవాడు. మాత్సర్యము దానికి తోడైనది. కాని తన కుట్రలన్నియు వెలివడి దేశబహిష్కార శిక్షకు గురియయ్యెను. వరగర్వితుడైన హిరణ్యకశిపుడు పుత్రుడు ప్రహ్లాదుడు తన శత్రువు హరినామ స్మరణము జేయుట సహింపలేక నానా హింసలు బెట్ట నృసింహావతారమున విష్ణువవతరించి ఖరనఖరములచే చీల్చి మదాంధులైనవారికి గలుగు శిక్ష నిరూపించెను. భారత యుద్ధానంతరము గర్వించియుండిన అర్జునునకు అశ్వమేధయాగ సమయమున సవనాశ్వము వెంట జనిన వేళ పుత్రుడైన బభ్రువాహనునిచే వధింపబడి గర్వభంగము జరిగినది.

8 1.6 మానవు డాచరించు పనులు పట్టుదల లేనిచో రాణింపవు. తన్మూలమున విజయమును చేకూర్చుకొనలేడు. పట్టుదల, అభినివేశము, నిష్ఠ, కార్యాచరణమున నుండి తీరవలెను. ప్రహ్లాదుడు తండ్రి పెట్టిన సర్వబాధలను సహింపగలిగెను. కాని తాను నమ్మినది, ఉత్తమమైనది యైన హరినామస్మరణ

మును వీడలేదు. హరిశ్చంద్రుడు సత్యసంధుడనని నిరూపించుకొనుటకు భార్య నమ్మివేసి తననుతా నమ్ముడువోయి, కాటికాపరియై చివరికి భార్య చంద్రమతి కంఠము నుత్తరింప నిచ్ఛగించెను గాని బొంక నుంకింపలేదు. ఇట్లే సత్యనిష్ఠతో రుక్మాంగదుడు పుత్రుడైన ధర్మాంగదుని వధింపనైనను పాల్పడెను గాని బొంక లేకపోయెను. దశరథుడును కైకకు వరములిచ్చుటలో సత్యనిష్ఠను వదలలేదు. నిష్ఠాగరిష్ఠయై పట్టుదలతో తపమాచరించి కోరిన వరుడు ఈశ్వరునే భర్తగా పొంది పార్వతి ధన్యయైనది. పట్టుదల, నిష్ఠ గలవాడగుటచే ఈశ్వరభట్టు సీమంతినికి విధవాత్వము కలుగునని జాతకమునుండ రాజు చిత్రవర్మతో నిచ్ఛకముగ దశసహస్రవర్షములు సుమంగళియై జీవించునని చెప్పి, దానిని ఫలింపజేయుటకై ఘోరతప మాచరించి సఫలీకృతమనోరథుడయ్యెను. నిష్ఠాగరిష్ఠులు, పరిశుద్ధాత్ములగుటచే మేరీ, అల్మేడాలు కడగండ్లుగడచి చివరికి సుఖముల బొందిరి. పట్టుదల, కార్యదీక్ష, నిష్ఠ కలవాడగుటచేతనే ప్రతాపుడు మహమ్మదీయుల జయింపగలిగెను. కార్యదీక్ష, స్వామిభక్తి యందలి నిష్ఠ కలవాడు గనుకనే యాచముడంత్యమున జయించెను. భామిని పట్టుదలతో నిష్ఠతో మారువేషమున వ్యవహరించి కోరిన వరుడు ధైర్యధరునే వివాహమాడగలిగినది. ఇట్టి పట్టుదల, నిష్ఠ యను నుత్తమ గుణములు మానవులకెంతయు నవసరమే కాదు, అపరిహార్యములు. తన్మూలముననే జీవితమున విజయపరంపరలను, అభివృద్ధిని పొంద వీలగును.

8.1.7 ఇంకను శ్రీనివాసరావుగారు దైవభక్తి, మాతాపితృభక్తి, భ్రాతృప్రేమ, సాహసము మొదలగువానిని నిరూపించియుండుట గమనింపవచ్చును. దైవయోగమే ప్రధానమైనదని 'సునందనీ పరిణయము', 'సీమంతినీ' నాటకములలో వివరించిరి. 'రుక్మాంగద'లో ఏకాదశీ వ్రత మాహాత్మ్యమును, 'సీమంతిని' లో సోమవార వ్రత మాహాత్మ్యమును స్పష్టము గావింపబడెను. శ్రీరామునియందు మాతాపితృభక్తి అనన్యసామాన్యమై యొప్పుచున్నది. సునందని తలిదండ్రుల మాటప్రకారమే నడచుకొని భక్తిని ప్రకటించినది. భరతఃక్ష్మణులలో భ్రాతృప్రేమ స్పష్టమైనది. జాతి, మతము వేరైనను యాచమనాయక బాంధుఖానులలో నుత్తమ మైత్రి ప్రకటితమైనది. అంతఃకలహములచే అపజయము పొందుచుండిన బహ్మనీసుల్తాను లేకమై రామరాజును వధింపజేసి విజయము పొంది ఐకమత్యప్రభావమును చాటిరి సాహసము, పరాక్రమమునను

నవి పురుషులలోనే గాక స్త్రీల యందును రావుగారు చూపిరి. కుముదిని, సుఖ మంజరి, సునందని, కళావతి, ప్రతాపవతి, క్షేమా మొదలైన క్షత్రియాంగనలు, కమల, జ్వాలాదేవి, ప్రమీల, ఖామిని మున్నగు స్త్రీలందరిలోను నిద్దీ శౌర్య సాహసములకు కొదవలేదు. ఇట్లే వీరు ప్రహసనములలోన నీతులను కన్నులకు గట్టినట్లు వివరించిరి. వేశ్యావృత్తిని తొలగింపవలెనని 'నాచిపార్టీ' ప్రహసనము నను, లోకమునందలి సర్వావినీతులను 'అన్యాయధన్యపురి మహిమ' లోను, అనాచారమవినీతికరమని 'ఆచారమ్మనప్రహసనవు' నందును వర్ణించిరి.

## 8.2 సంఘసంస్కరణము :

ఇట్లే సంఘమునందలి దురాచారములను దుయ్యబట్టి సంఘము నుద్ధరింప వలెననెడి ఆకాంక్ష కలవారు రావుగారు. దీనివలన వీరి సంఘసంస్కరణము స్పష్టమగును.

సంఘమున దురాచారములు ప్రబలినప్పుడు కవి తన కవితలలో నద్దీ వానిని గర్హించి సంఘమును సంస్కరింపవలెను. ఇట్టియెడ నాటకకర్తకే బాధ్యత మరియు మిక్కిలిగా గలదని తలంపవలెను. శ్రవ్యకావ్యము పండితులకు, విద్యా వంతులకు మాత్రమే పరిమితము. కాని నాటకము సర్వజనైక వేద్యము. నాటక ప్రదర్శనముచే సంఘ దురాచారములను ప్రకటించి వానిని త్యజింప ప్రజల నుద్బోధింప వీలగును. రంగమున ప్రత్యక్షముగా ప్రజలు చూచి దురాచారముల మూలమున సంఘమునందలి వారికి గలుగు ననర్థములను గుర్తింప సాధ్య మగును. అధునిక యుగమున ఆంధ్ర దేశమున సంఘసంస్కరణమునకు సాహిత్యమును సాధనముగ గ్రహించిన వారిలో కందుకూరి వీరేశలింగం పంతులు గారు ప్రథములు. బ్రాహ్మ వివాహము మొదలైన ప్రహసనములలో వారు సాంఘిక దురాచారములను దుయ్యబట్టి ప్రజలను ప్రబోధించిరి. ఇట్లే శ్రీనివాస రావుగారును తమ నాటకములలో అవకాశమును గల్పించుకొని సాంఘిక దురాచారములను గర్హించుచు, వాని వలన కలుగు ననర్థములను స్పష్టము చేసి, అట్టి దుశ్చర్యలను విడనాడ ప్రజలెనుద్బోధించుట ప్రశంస్యము. దానిచే రావు గారికి గల సంఘ సంస్కరణాభిలాష నుస్పష్టమగును. సమకాలిక స్థితిగతులను నాటకములు వివరించునట్లు రచింపవలెనని నాటక కర్తల నుద్దేశించి రావు గారు

20)

నియమించుట పైమాటలను సమర్థించును. "*Our Present dramas are behind times. Let some of the plays contain the ideas and the passions of the present times.*"[1]

18.2.1 శ్రీనివాసరావుగారి సంఘసంస్కరణాభిలాషకు చారిత్రిక నాటకములు మిక్కిలిగా నుపకరించినవి. సందర్భోచితముగా నాయా విషయములను చర్చించినట్లవగతమగును. తక్కినవాటక ప్రస్తావనలలోను, నాటకములలోను ఎడనెడ వీరి సంఘ సంస్కరణాభినివేశము వ్యక్తమగును. వీరి ప్రహసనములలోను సంఘ సంస్కరణాభిలాష తెలియును. వీరు బాల్య వివాహములను, అతి వృద్ధ వివాహములను, కన్యాశుల్కము, సతీసహగమనము మున్నగు దురాచారములను నాటకములందు చర్చించిరి. 'సీమంతినీ' నాటక ప్రస్తావనలో నూతన కావ్యము లందు రసపుష్టి యుండదని నటిచే ననిపించి, సూత్రధారునిచే "కాలాను గుణముగ గొన్ని పూర్వాచారములను ద్యజించినను నదియొక సుగుణముగానే మనము గ్రహింపనగును."అని చెప్పించిన మాటలచే రావు గారికి గల సంస్కరణాభిలాష వ్యక్తమగుచున్నది. నాటక ప్రదర్శనము సంఘ సంస్కరణమున కుపకరించునని వీరి ప్రగాఢ విశ్వాసము, 'సుల్తానా చాందుబీ' ప్రస్తావనలో సూత్రధారునిచే "నాటకములు జనుల నడవడికలను సంస్కరించును. దేశాభి వృద్ధియు, సంఘ సంస్కరణమును గోరువారు నాటకములు స్వపక్ష పరపక్ష దాక్షిణ్య బుద్ధులుగాక ప్రదర్శించుచుండవలెను, అందుననుగొన్ని నీతియుతములగు ప్రహసనములు ప్రదర్శించినట్లైన కవి చౌడప్ప శతకము వలె దుష్టుల చర్యల తిట్టుచు నీతులు బోధించును." అని పలికించి సంఘ సంస్కరణము నాటకము వలన కలుగవలెనని నిరూపించిరి.

8 2.2 వృద్ధ బాల్య వివాహములను రావుగారు మిక్కిలి తెగడిరి. "రామరాజుచరిత్రము' న రామరాజును వధించి బహ్మనీ సుల్తానులు విజయము పొందిన వెనుక తురకసేన అనేకాకృత్యములొనరించినది ఒకడొక యజ్ఞ సోమయాజి భార్య నపహరింప సుల్తానులతో మొర పెట్టుకొనుటకు పోయిన బ్రాహ్మణుని వారు మిక్కిలి దూషించిరి తలవణకెడు ముదుసలియైన యజ్ఞ సోమయాజి యను బ్రాహ్మణుడు ఏమి తెలియని అమకొను బదేండ్ల పాపను పెండ్లి చేసికొనుటను మిక్కిలి గర్హించిరి. వృద్ధ వివాహము వలన గలుగు ననర్థములను అ

1. 157 *Rules* 18 పు.

న్యాయ ధన్యపురి మహిమ' అను ప్రహసనమున స్పష్టముగ వర్ణించిరి. ఈశ్వర శాస్త్రీ మిక్కిలి వృద్ధుడయ్యును మొదటి భార్య మరణింప మరొక వివాహము చేసికొనెను. రెండవ భార్య వయసులో నుండుటచే నా ముదుసలి వలన సుఖము పొందలేకబోయి రంగని వలన పుత్రుని పొందినది. మరొక భార్యను వివాహమాడ నది రామచంద్రుడను వానితో సుఖముల పొందుచుండినది. ఇట్టి యనర్థములకు దారితీయుచుండుటచే వృద్ధ వివాహ మతి గర్హ్యమని రావుగారు వివరించిరి.

8 2.3 శ్రీనివాసరావుగారు కన్యాశుల్కమును నిరసించిరి. ధనమున కాశపడు తలిదండ్రులు తమ బిడ్డలను వృద్ధులకిచ్చి అన్యాయముచేయు చుండెడివారు. మైసూరు రాజ్యాభివృద్ధిలో జగన్మోహినిని తలిదండ్రులు ధనాశచే వృద్ధుడైన రాజున కిచ్చుటచే భర్తృ సుఖము లేక మేనల్లునిపై వ్యామోహితయై తలిదండ్రులను దూషించి,పాపము వచ్చినను వారిని కవయగోరును. "అయ్యో! పాపాత్ములారా! చండాలులారా! ,తలిదండ్రులారా! ధనపిశాచావేశ పీడితులై మీ వయసు బిడ్డను దయమాలి యీ ముదిబూచికి నిచ్చితిరే! ఇందునుండి మీకుఁ బుట్టుగతులున్నవియా? మీరునుఁజెడి నన్నుఁ జెడిపితిరి. నీతి మార్గమ్మున నేనింక నుండ నలవికాదు. వచ్చునది రానిమ్ము" అని జగన్మోహిని నిశ్చయించుకొని లక్ష్మణ వీరులను బలాత్కరింప వారు తిరస్కరింతురు. తత్ఫలితముగా వారిని వధింపజేసి తాను విషము ద్రావి చత్తుననినిర్ణయించుకొనును. "ఆ ముదిభూతము రేపు వచ్చిన తోడన వ్యసన మభినయించి రెండవ కైకేయి రూపమెత్తి క్రూర దురాగత నేరము మోపి విమర్శలేని యటుల వీరిని రహస్యముగ ఘోరాటవినిఁ జేర్చి చంపించి విషముద్రావి నేఁ జచ్చెద ఇంతటితో నా చరిత్ర ముగియనిమ్ము. ననుగన్న తలిదండ్రుల కడుపు చల్లఁగానిమ్ము. నన్నుఁ జేసికొనిన మగని సంకటమాఱనిమ్ము, కన్నబిడ్డలను ధనాశచే వృద్ధులకిచ్చి వివాహంబు సేయుజనులకు బుద్ధి రానిమ్ము." అని మిక్కిలి వాపోయినది. ఇట్లే 'శిలాదిత్య'లో కళావతి వధాసమయమున "తరుణీమణికి సమవయస్కుడుగాని భర్తను గట్టు తలిదండ్రుల నెంత దూషించినను దీరదు. అయ్యయో! బంగారున కాశించి యంగనలను వృద్ధజంబుకములకిచ్చి వారి జన్మమే భంగ పఱచెదరు. ఇపుడు యోచించి ప్రయోజనము లేదు" అని దుఃఖించినది. ముదుసలియైన భర్తతో సుఖము లేకపోవుటచే నుపభర్తగా మదనుని పొంది వానికై ఎన్నియో

కష్టముల పాలయి, పాపము నొడిగట్టుకొని చివరికి వానితో పాటు దుర్మరణము పాలయినది. 'అన్యాయధన్యపురిమహిమ'లో సరస్వతి తలిదండ్రులు ధనాశ చేతనే ముగ్గురు ముదుసళ్లకు మూడుసార్లు వివాహము చేసిరి. ఇట్లు ధనాశచే తలిదండ్రులు తమ పుత్రికలను వివాహము గావించుటచే ననేకానర్థములు గలుగు నని రావుగారు కన్నులకు గట్టినట్లు వర్ణించిరి.

8.2.4 సతీసహగమనమును గూడ వీరు గర్హించిరి. 'రామరాజు చరిత్రము'న పై జెప్పిన యజ్ఞసోమయాజిని చిన్న పిల్లను వివాహమాడినందుకు బహ్మనీ సుల్తానులలో అహమ్మదు కోపించి "ఛీ దుర్మార్గ బ్రాహ్మణుడా ? గద్ద వలె నేండ్లు వచ్చియు నీకు బుద్ధి రాలేదు. మూడు కాళ్ల ముదుసలివై యాడు కొను పిల్లను కొనితెచ్చి జీవించియుండగనే యా పిల్లను జిచ్చులోఁ బడవైచి కాల్చెదవా? ఛీ! దుర్మార్గుడా! నీకా పిల్ల నిప్పింపము, వెడలిపొమ్ము. ఓరీ భటా! ఈ పాపిని మెడఁ బట్టి ద్రోయుము." అని నిందించెను. 'ప్రతాపాక్బరీయము'న అక్బరు చిత్తూరును ముట్టడించి విజయము సాధించిన వెంటనే క్షత్రియాంగనలు చితిలో దూకుచుండ వారిని వారింప యత్నించి విఫలుడై వారి సాహసములను మెచ్చికొనెను. కాని పతి మరణముతో సతి చితిఁ జేరుట నతడసహ్యించుకొనెను. "హా! చూడ నసహ్యంబిది. నేనేలు ధారుణి నిట్టి క్రూరకర్మంబు జరుగ నటులఁ జూచెద. ఏమీ! విధికృతంబున విగతాసువగుపతి చితిఁ గలిసిన మాత్రాన, విధి విరోధంబుగ సతి చితిఁ గలయనేల? ఇది హిందువుల నీతివిధిగ నుండినను నాయావచ్ఛక్తిధారవోసి, సర్వ ప్రయత్నములొనరించి, యీ ప్రాణయుత సతీ మారణ కర్మంబు నిలిపెద" అని అక్బరు బద్ధ ప్రతిజ్ఞుడగును. ఒక దినము అక్బరు సభ దీరి "బైరాంగారూ! ఈ భరతఖండంబునందలి యార్యులనార్య కృత్యంబులనేకంబు లొనరించుచున్నారు. అందున ముఖ్యమైనది సజీవ స్త్రీ మృతి. దానిని నిలుపుదల చేయింప నాజ్ఞ యొసంగినారా?" అని ప్రశ్నింప అందుకు సాహాయ్యపడిన వారికి మరణ దండన విధించినట్లు బైరాం సమాధాన మిచ్చెను. అందుకు బీరుబల్లు అపహాస్యముగా దీనిచే బంధువర్గము, పురోహితులు మరణింతురనియు చెప్పి "మహాప్రభూ! మీ యాజ్ఞరీతి 'సతి' యనునది నిలువదు గాని మిగత వారి చితి నిజమగును." అని జవాబిచ్చెను. అక్బరందుకు పతులులేని సతులు వివాహమాడుట కంగీకరించెను. ఇట్లు రావుగారు 'సతీసహగమనమును' గర్హించిరి.

8.2.5 వితంతూద్వాహములు జరుపుటలో దోషము లేదని వీరి మతము. 'శిలాదిత్య' లోని వాచస్పత్యాచార్యులు పుత్రిక సుభగ విధవ కాగా నపుడు పునర్వివాహము అనగా విధవా వివాహము కూడదని శ్రుతిస్మృతులకు కష్టార్థములు కల్పించి వ్యాఖ్యానించితిననియు, తన కిప్పుడది యర్థమైనదనియు, దానిని మార్చినచో జనులు తనను స్వార్థపరుడందురనియు వాపోవును. అంతే గాక ఇతర వ్యాఖ్యాతలతో పాటు "బిడ్డ పాపల జిడ్డు లేక వారికిఁ గలుగు దుఃఖానుభవంబుఁ గానక విద్యాబలగర్వంబున ననవద్యములగు స్మృతులకుఁ గష్టార్థంబులు గల్పించి జనులను బాధించుచుందురు కదా వ్యాఖ్యాన కర్తలు. అట్టి వారిలో నే నొక్కఁడనై తి"నని తనను గూడ నిందించుకొనెను. సుభకు ప్రత్యక్షమైన సూర్యుడును వాచస్పతిని నిందించెను. ఇందులో రావుగారికి గల స్త్రీ పునర్వివాహమను సంస్కరణము నందలి అభినివేశమును గోచరించును. ఇంతకంటె స్పష్టముగ 'ప్రతాపాక్బరీయము'న విధవా వివాహమును రావుగారంగీకరించిరి. 'సతి'ని నిర్మూలింప దానికై సాహాయ్య మొనరించు వారిని శిక్షించుటకంటె స్త్రీలు మరల వివాహమాడుట యుచితమని బీరుబల్లు చెప్ప అక్బరంగీకరించును. "బీరుబల్లు: మహాప్రభూ! ఏమియు లేదు. పతులు లేని సతులందఱు నిష్టానుసారము స్వేచ్ఛగ నుండి బిడ్డ పాపల నంద నగునని యాజ్ఞ నిడవలెను. ఇదునఁగష్టమేమియు లేదు. మానవ ధర్మ శాస్త్రములో బీజ ప్రాధాన్య న్యాయ మనుసరింపఁబడినది. ఇప్పటి మీ ధర్మశాస్త్రము రీతి క్షేత్రమునకుఁ బ్రాధాన్యము కలిగించినఁ జాలును.

అక్బరు: బీరుబల్లు! పతులు లేని సతులకు బిడ్డ పాప లేల కలుగుదురు?

బీరుబల్లు: మహాప్రభూ! ఈ శరీరము విషయాదులకు లోబడినది. అందునఁ బురుషులకంటెను స్త్రీలకుఁ జాంచల్యంబు హెచ్చు.

అక్బరు: అటులుండినచో సతులు మరలఁ బతులను బొందనగును.

బీరుబల్లు: ఇది మఱి బాగున్నది. విధవ వివాహంబుఁ గా నగునని కదా మీ తాత్పర్యము?

అక్బరు: కానగును. అందునఁ దప్పేమి? సతులు చితిఁ గలసినపుడు పతులు

మరల సతులను జేసికొనరా? అదే న్యాయము సతులకు." అని యిట్లక్బరు విధవా వివాహములను క్రమబద్ధము, న్యాయబద్ధము చేసెను. దీనిచే రావుగారు సతీ సహగమనము పోగొట్టుటయే గాక స్త్రీ పునర్వివాహమును సైత మంగీకరించిరి.

8.2.6 స్త్రీకి స్వాతంత్ర్యము, విద్య అవసరమని నమ్మిన వారు రావు గారు. 'బభ్రువాహన'లో ప్రమీల సభ దీరి తన స్వప్నవృత్తాంతము దెలుప నందులో నొక స్త్రీ, లోకము నందలి స్త్రీలవలె తామును పెండ్లి యాడి సుఖము లనుభవించుటయే యుచితమని చెప్పగా నందుకు అవలీల యను స్త్రీ 'స్వేచ్ఛాను సారముగ విచ్చల విడిగ, మనముండక, స్వాతంత్ర్య మెల్లను వీడి, యొక మగ వానికి లొగ్గి వాని యానతిలో నుంట ముల్లుఁ దీయింప గొఱ్ఱు గొట్టించుకొనిన చందమగునుగదా?" అనియు సువాలయను నామె 'స్త్రీలేల, పురుషుని వివాహ మాడి వాని వశం వదలై యబలలుగ నుండవలెను? స్త్రీలకు మాన మర్యాదలు లేవా? పరాక్రమములేదా? బుద్ధి కౌశలమూ లేదా?" అనియు వాదించిరి. ఇందులో స్త్రీకి సాతంత్ర్యమవసరమను విషయము వ్యక్తమైనది. స్త్రీ విద్యాప్రాధాన్యమును గూర్చియు రావుగారు వివరించిరి. 'కుశలవ' వాటకమున నటిచే "నేను చెప్పి నంత పని చేయుదానను. అధిక ప్రసంగమునాకేల? స్త్రీలు తెలివిమాలిన వారని కదా వారికిఁ బురుషులు చదువు నేర్పరు.? ఏ విషయమునేగాని వారితో నాలోచింపరు." అనిపించి సూత్రధారుని చేత "నటి! నీవు పొరపడుచున్నావు. అతిబుద్ధి కల వారతివలు కావుననే పురుషులు వారికిఁ జదువుపయోగింపదని వదలినారు." అని వ్యంగ్యముగ నాటిస్థితిని నిందింపజేసిరి. ఇట్లు రావుగారు స్త్రీకి విద్యాస్వాతంత్ర్యము అవసరమని తెలిపిరి.

8.2.8 ఆచారముల పేర ప్రజలు చేయు అనాచారములను రావుగారు గర్హించిరి. 'రామ రాజు చరిత్రమున యజ్ఞసోమయాజి మూడు కాళ్ల ముదుసలి యైనను బదేండ్ల పసిపిల్లను యజ్ఞార్థము వివాహమాడితిననగ, బహ్మనీ సుల్తా నులు నిందింతురు. కర్మశూన్యులు మీకేమి తెలియునని యతడు చెప్ప బహ్మనీ సుల్తానులు యజ్ఞముల పేరు చెప్పి మేక మాంసము తినుటకా యని ధిక్క రింతురు. పూర్వకాలమున ఎంతో పవిత్రకార్యములుగ యజ్ఞయాగములను మన వారు నిర్వర్తించి యుండుటయు, శాకములనే బలిగా నిచ్చియుండుటయు జరిగి

యుండ కాలక్రమమున తద్వ్యతిరేకముగా అపవిత్రము జేయుటచే రావుగారిట్లు గర్హించిరని తలంపవలెను. అన్యాయధన్యపురి మహిమ. ప్రహసనమున వృద్ధుడైన ఈశ్వర శాస్త్రి రెండవ భార్య యజ్ఞసమయమున పీటలపై గూర్చుండ తిరస్కరింప ధనమిచ్చి మూడవ వివాహమాడును. ఆమెయు తిరస్కరించును. వారివలన సుఖము గానకాని శాస్త్రి నరక యాతన ననుభవించెను. ఇట్లు శ్రీనివాసరావుగారీ యనాచారములను నిందించిరి 'ఆచారమ్మన ప్రహసనవు' అను దానిలో ఆచారమ్మ అను నామముంచుకొని, గొప్ప ఆచారవంతురాలుగ చలామణి యగుచు, లోలోపల ఎన్నియొ అనాచారములు చేయుచుండినది. భర్తృ మరణానంతరము 'మార్తామియ్యా' అను మహమ్మదీయుని వలలో వేసికొని తన యింటి యందే యుంచుకొని రహస్యముగ పని పిల్ల భారతిచే వానికి మాంసము వండించి పెట్టుచు, వానితో తానును మద్యము సేవించుచు భర్తృ తద్దినము నపవిత్ర మొనర్చుచు, ఊరంతటిని మోసము చేయబోయి, భారతీ పురుషోత్తమా చార్యులచే శృంగభంగము పొందినది. ఇందు ఆచారమ్మ కావించిన అనాచారములను రావుగారు దుయ్యబట్టి యట్టి యనాచారములతో గూడిన యాచారములను విడనాడుటయే యుచితమనుటను నిరూపించిరి.

8.2.8 జాతులు వేరైనను మానవు లందరు సమానమని వీరి ప్రగాఢ విశ్వాసము. సుఖమంజరీ పరిణయము ప్రస్తావనలో సూత్రధారుడు సమావిష్టులైన చాతుర్వర్ణ్య సభాసదుల సమానముగా కీర్తించెను.

దీనికి ఉపబలకముగా 'చంద్రగిర్యభ్యుదయము'న స్పష్టముగాగలదు. "ప్రపంచములోని సకలులు దైవాంశ సంజనితులు. జాత్యాదిభేదములు వ్యవహారోప యుక్తములు ప్రపంచ మొకటియైనను మానవులు తమ వ్యవహారమునకు దానిని దేశములుగ విభజించి వేలువేలు నామములిడిన మాత్రాన ప్రపంచ మొకటియగాని వేలుకాదు. అటులనే జాతిభేదములును". అని సదాశివయోగి యాచమున కుపదేశించుటలో సర్వమానవ సమానత్వమును రావుగారంగీకరించుట స్పష్టమగును. అది పంపాపతి క్షేత్రమున పంచమ జాత్యర్చకుడుండుటను గాంచి యాచమనాయకుడు "హా! హా! అది పంపనకు నాసాది వాఁడే యర్చకుఁడఁట! ఉండును : సర్వాంతర్యామియగు శర్వునకు జాతిభేదముండునా!" అని సమర్థించినాడు ముందే సదాశివ యోగిచే "అర్చ కస్య తపోబల" మ్మనురీతిఁ

బూజించువాని తపోబలమునఁ బ్రతిమలయందు దేవత్వము స్థాపింప బడునుగాని యట్లులేనిచో రాతి విగ్రహము పాషాణమేను'' అని పలికించుటయు జరిగినది. ఈ 'చంద్రగిర్యభ్యుదయము'ననే యాచమనాయక చాందుఖానులకు సన్మైత్రిని గూర్చి హిందూ ముస్లిం సమైక్యమును రావుగారు చాటిరి.

8.3.9 సర్వమతములు సమానమనియు సర్వమత సహన మవసర మనియు రావుగారు విశ్వసించిరి. కనుక నాటక నాందీ పద్యములలోను, దేవతా ప్రార్థనమునను సర్వదేవతలను వీరు ప్రార్థించిరి. 'మైసూరు రాజ్యాభివృద్ధి'లో యదురాయడు తన యొద్దకు వచ్చిన సర్వమతముల వారిని సమాదరించి వారి వారి మత పద్ధతులను తెలిసికొని తన యొద్దనుండ నంగీకరించెను. అన్ని మత పద్ధతులు వేరైనను ధ్యేయము మాత్ర మొకటే యనుటను శ్రీనివాసరావు గారిందు నిరూపించిరి. 'మదాలసా' నాటక నాందీ ప్రస్తావనలలో హరిహరాభేద మును వివరించిరి. 'శిరోమణి' నాటకమున అశ్వత్థామకు ఈశ్వరుడు భూతాకార మున గన్పట్టి నిజరూపము ధరించి "అశ్వత్థామా! నీ భక్తికి మెచ్చితి. విష్ణువు నా మిత్రుఁడు. కావున విష్ణుభక్తుల రక్షింప నిటు భీకరాకారంబున నీకుఁ గన్ప ట్టితి." అని యనుటలో వైష్ణవ శైవ మతముల వారికి విభేదము లుండగూడదని స్పష్టము చేసిరి 'సుల్తానా చాందుబీ' నాటకమున సభలో మాంసాశనము, మత భేదములను గూర్చిన విద్వేషము ప్రజ్వరిల్లగ చాందుబీ ఖండించినది. "ఇట్టి మత భేద వాదము లింకఁ జాలింపుడు. అవి దేశమునకు హితములు కావు". దీనిచే శ్రీనివాసరావుగారు సర్వమత సమాదరణము నందెంత యభినివేశము కలిగి యుండిన వారో తెలియును

8.2.10 వేశ్యావృత్తిని మిక్కిలిగా వీరు నిరసించిరి. వేశ్యల కంటె వేశ్య మాతల చేతులలో జిక్కిన మానవుడెంత వినాశ మొందునో 'నాచి పార్టీ' (Nautch Party) అను ప్రహసనమున అద్దములో వలె ప్రతిబింబింప జేసిరి. జానకి కూతురు ఆనందాసాని యను వేశ్యా లోలుడైన భోగిశెట్టి దానికై సర్వము ధారవోసి జోగిశెట్టియై దాని యింట కూటికై పడియుండి రత్నశెట్టి వలన బయటపడినట్లు రావుగారు వ్యంగ్యముగా, హాస్యయుతముగా వర్ణించిరి. కనుకనే రావుగారు 'Anti-Nautch Party'కి జెందిన వారని మనము తలంపవలెను.

8.2 11 మద్యపానము వలన కలుగు ననర్థములను గూడ రావుగారు చూపిరి. 'సుల్తానా చాందుబీ'లో కుల్లా నాయకుని తోడుదొంగలు తప్పత్రాగి యుండ నాయకుడు వారిని మందలించును. 'అన్యాయ ధన్యపురి మహిమ'లో ఇంద్రాదేశముతో భూలోకమునకు వచ్చిన శని కామాదులతో గూడి మద్యము సేవించి మత్తెక్కి భూలోక రంభను కొనిరమ్మని కాముని యాజ్ఞాపించు నంతలో కలి ప్రవేశింప మత్తులో రంభయనుకొని కలిని బట్టుకొనును. తరువాత తెప్పరిల్లి తెలిసికొనును. ఇది యంతయు మద్య పానము వలన గలిగిన యనర్థమని రావుగారు నిరూపించి మద్యము సేవించుట గర్హ్యమని తెలిపిరి.

8.2 12 ఇంకను రావుగారానాటి సంఘమున నుండిన కొన్ని పరిస్థితులను మిక్కిలి నిరసించియుండుట మనము గమనింపవచ్చును. 'సునందనీ పరిణయము' ప్రస్తావనలో భారతీయులు లెక్కచేయని, ఆంగ్లేయులు తప్పనిసరిగా అనుసరించునట్టి నిర్ణీత కాలమునకు పని ప్రారంభించుట, హాజరగుటనను వానిని ప్రస్తావించిరి. ఆంధ్రభాషా జ్ఞానములేని మనవారికి చారిత్రక నాటకములు రుచింపవని 'కుశలవ' ప్రస్తావనలో తెలిపిరి. 'సునందనీ పరిణయమున' వడ్డీ వ్యాపారు లన్యాయముగ ధనము సంపాదించుటను దొంగల మాటలచే (2-1) నిరసించిరి. 'సీమంతినీ' నాటకమున సీమంతినీ వివాహ సమయమున బ్రాహ్మణులు కుక్షి నిండ తిని బహుమతులుగ లభించిన ధనము మోయ లేమని బాధపడుటను గర్హించిరి. (2-5) అందులోనే ఈశ్వర నారాయణభట్ల పోట్లాట (1-1) చే పండితుల కొట్లాటను నిరసించిరి. సీమంతినీ వివాహ సమయమున స్త్రీలు హారతి పట్టుటలో కలతలు, పాటలు పాడుట, ధనము పంచుకొనుట వీనిలోని సాధకబాధకములను వివరించిరి మైసూరురాజ్యాభివృద్ధి'లో వాగాడంబరాచార్యులు తన శిష్యుడైన వరదునకు తన గొప్ప ధనమును గూర్చి చాటింపవలసినదనియు, కామేశ్వర పంతులును కృష్ణరాయనితో నట్లె చెప్పుటయు వర్ణించిరి

ఇట్లు శ్రీనివాసరావుగారు నాటి సంఘమును పీడించుచుండిన దురాచారములను సందర్భోచితముగా గర్హించి, ఉత్తమ సంఘ సంస్కర్తగా ప్రకటించుకొనిరి.

## 8.3 నాటక ప్రయోగము :

ఇంక నాటకమునకు ప్రదర్శనము జీవము. నాటకమును ప్రదర్శింపక కేవలము పఠనమున కుద్దేశించిన యెడల దాని వైశిష్ట్యము, దాని ప్రత్యేకతయు నిష్ప్రయోజనమగును. వాస్తవమునకు కేవల పఠనార్థమే యయినచో నాటకముగా గాక శ్రవ్యకావ్యముగ రచింపబడుటయే యుచితము. నాటకమున దృశ్యత్వ లక్షణము ప్రధానము. సంస్కృత నాటకములు దృశ్యకావ్యములు మాత్రమే కావు. సాహిత్య విషయమునను గౌరవము గలవి. ఈ సంస్కృత నాటకములు ప్రదర్శనార్థమే రచితములు. భరత మహర్షి 'నాట్యశాస్త్రము'ను రచించుటయే యిందుకు ప్రముఖ నిదర్శనము. అంతేగాక ఆయా నాటక ప్రస్తావనలలో సామాజికుల నుద్దేశించి ప్రార్థించుటయు, కొన్ని యాత్రాసమయముల లోను, ఉత్సవములలోను ప్రదర్శించినట్లు ఉండుట చేతను తప్పక ఆ నాటకములు ప్రదర్శింపబడినవనియే తలంపవలెను.[1] ఇంక ఆంగ్ల నాటకములు ప్రదర్శింపబడినట్లు చరిత్రయే చెప్పుచున్నది. ఇట్లు నాటకములు పూర్వము నుండియు ప్రదర్శనార్థమే రచితమైనవి. ఇదే విధముగ ఆధునికయుగమున రచితములైన తెలుగు నాటకములును ప్రదర్శనము కొరకు రచించిరనుటలో సందియములేదు.

శ్రీనివాసరావుగారు ప్రదర్శన దృష్టిని మనమున నుంచుకొనియే నాటకములు రచించిరి. అందుచేతనే రావుగారి నాటకములు ప్రదర్శనమున విజయము పొందగలిగినవి. నాటకములు రచించి ముద్రింపించుకొనుట వీరి మతము కాదు. కాని రావుగారిలో ప్రదర్శనా దృష్టి ప్రధానముగా నున్నను, సాహిత్య దృష్టియు లేకపోలేదు. "నాటకంబులు దృశ్యంబులు గాన, నందులకు నుపయుక్తముగా నుండు లాగు కొద్దిగాను, రసవంతముగాను నుండవలెనుగాని ప్రబంధముల రీతిఁ బెంచి వ్రాయఁ గూడదని నా మిత్రులు గొందఱభిప్రాయపడి మందలించిరి. వారి తాత్పర్యంబు యుక్తమేను. అయినను నే నొకించుక విన్నవించెద. గ్రంథకర్తలు వెఱవక నాటకంబులు బెంచి వ్రాయు తాత్పర్యంబే మన్న నని శ్రవ్యములుగా

1. (i) 188. ఏప్రిల్ 12, 1911, (ii) 55. పు 97-100

నైతముండిన మేలనియుఁ బ్రదర్శించు వారందుననే భాగము కథాసరణికి నుప యుక్తంబగునో దానిని వేఱుపఱచి ప్రదర్శింప వలెననియు వారి యుద్దేశ్యము. ఇటులనే ఇంగ్లీషు నాటకములు. అటు గాదేని యే నాటకముగాని బ్రదర్శింప సాధ్యంబుగాదు."[1] అనుట రావుగారి అభిప్రాయము. కనుకనే వీరి ప్రథమ నాటకమైన సునందనీ పరిణయమున పాండిత్య ప్రకర్షను ప్రకటించు పద్ధతుల నవలంబించి యుండుట జరిగినది. కాని సుఖమంజరీ పరిణయమును మాత్రము తగ్గించియున్నారు. నాటకము రంగమున ప్రదర్శింపబడినప్పుడు సర్వజన సమాదరణోపయుక్తముగా నుండుటెంతయు నావశ్యకము. అనగా పండిత లోకమునకే గాక పామర జనావగాహన యోగ్యమై యుండవలెను. అంత మాత్రముచేత నది రసపరిపుష్ట రహితమై పేలవమై యుండవలెనని తలంపరాదు. నాతి కఠినమై రస నిష్యందియై రంగమున సామాజికుడు సందర్శించిన వెంటనే హృదయాహ్లాదము కలుగవలెను. ఇట్టి గుణము రావుగారి నాటకములందంతట కన్పట్టును. అంతేగాక నాటకయుక్తులు తెలియని నాటక కర్తలచే రచితములైన నాటకములు ఎంత గొప్పవైనను ప్రదర్శనయోగ్యములుగా నుండవని రావు గారి దృఢాభిప్రాయము. "Some dramas though ably written by great poets are not fit for the stage, because these poets are not versed in dramatic language, and stage tricks."[2] ఇంతే గాక ఈ 'ప్రపంచ నాటక చరిత్రము'న రావుగారు నాటక కర్తలకు, నటులకు, నాటక సమాజములకు, విమర్శకులకు, సామాజికులకు చేసిన సూచనలను పరిశీలించినచో నాటక ప్రయోగమున వీరికి గల విశిష్టమైన అనుభవమును, నాటక ప్రదర్శనమును జయప్రదముగావించు నాటక యుక్తులును స్పష్టము లగును. "శ్రీనివాసరావుగారు చిరకాలము నాటక సూత్రధారులుగ నుండుటయే గాక, ఆంధ్ర నాటకములలో చరిత్రాంశములఁ గూర్చియు నాటక కవులలో మార్గదర్శి "మహర్షి" యన నొప్పియున్నారు. వీరు కవులకును, పాత్రములుగా నుండు వారికిని పంపిన 'విజ్ఞప్తి' వాస్తవముగ ననుభవసారమైన స్మృతి వాక్యముగ గారవింపదగియున్నది."[3] అని రావుగారి నాటక పరిజ్ఞానమును

---

1. 109. పీ. పు. 2  2. 157. Rules పు 8

3. 2. పు. 281

గూర్చి చెప్పిన పురాణం సూరిశాస్త్రిగారి మాటలక్షరాల నిజము. ఇట్లు బహుధా ప్రశంసలనందుకొన్న రావుగారి నాటకములు ప్రదర్శన యోగ్యములుగా మండకుండుటెట్లు సంభవించును?

8.3.1 ప్రదర్శన విషయమున బహుజాగరూకులై రావుగారు నాటకములు రచించిరి. కథా ప్రణాళిక ననుసరించి, ఆయా పాత్రల ప్రాధాన్యమును పురస్కరించుకొని, రసభావ వ్యక్తీకరణార్థము సంభాషణలు నడపుట మనము ముందే గమనించితిమి. ఒక్క సునందనీ పరిణయమున దప్ప ఇతర నాటకములందీ సంభాషణలు దైర్ఘ్యములేక ఎంతయు నుచితమై యొప్పుచున్నవి కనుక రావుగారి నాటకములందు సంభాషణల మూలమున ప్రదర్శన రక్తి కట్టకపోవుట యనునది లేనే లేదు. సంభాషణలు రసోదంచితములై యుంకుటయే వీరి నాటకములలో సహజగుణము.

8.3,2 సందర్భోచితముగ స్వగతముల ప్రయోగించుటరావుగారి పద్ధతి అను విషయము పూర్వోక్తము. సునందనీపరిణయముననే కొంతవరకు నిట్టి దీర్ఘ స్వగతములు గలవు. రామరాజు చరిత్రమున పటాణికి స్వగతములున్నను నాటకౌచిత్యమున కుపకరించినవే గాని విఘాతములు మాత్రముకాలేదు.

8,3.3 కాలానుగుణముగ రావుగారి నాటకములలో పాటలు పద్యములు మెండుగా గలవు పాటలు పామరజనుల ప్రీతికై రచించినట్లు ముందే స్పష్టమైనది. పద్యములు నాటకమున తప్పని సరిగ నుండి తీరవలెనని రావు యభిప్రాయము. తన్మూలమున నాటకమునకు సాహిత్య గౌరవము చేకూరునని వీరి అభిమతము. పద్యములు కొల్లలుగ వీరు రచించిరి. పద్యములు, పాటలు ప్రయోగించుట వలన నెచటను రసవిచ్ఛిత్తి లేక, కథాసరణికి విఘాతము లేక ప్రదర్శన కెట్టి యవరోధము లేక సమస్త సామాజికులకు నానందము కలిగింపజాలిన వనుటయే సముచితము.

8.3.4 కొన్ని సన్నివేశములలో నొకే సమయమున రంగస్థలముపై పాత్రలను జంటలుగా ప్రవేశ పెట్టి నాటకమునడుపుటయు గలదు. ఇట్టిది ముఖ్యముగ నాయికలు సఖులతో నుద్యానవనములలో విహరించు పట్టులగలదు. వీరు నాయకులను గాంచుట, ప్రేమాకృష్ట లగుటయు నందేజరుగును. అయినప్రదర్శనమున

కెట్టి యాటంకమును గలుగలేదని తలంపవలెను. ఉదాహరణమునకు సుఖమంజరీ పరిణయమున 'సుఖమంజరీ పరిణయమున సుఖమంజరి సీతాచారులోచనలను సఖులతో వనవిహారమున కేగును. ప్రద్యుమ్నుడు మృగయా వినోదార్థమై వచ్చి సంజయునితో ఉపవనము జేరును. విహారమున సీతా సుఖమంజరు లొకవైపు నకుబోవ చారులోచన మరొక దిక్కునకుబోయి సంజయుని గాంచును. సుఖమంజరి సీత వెంటబోయి ఆ ప్రక్కనే ఈరమున దాగిన ప్రద్యుమ్నుని గాంచుట జరుగును. ప్రద్యుమ్నుడు వారిని చూచుచు డాగియుండి సుఖమంజరీప్రేమాకృష్టుడై సంజయుని గలియును. సుఖమంజరీ సీతలు చారులోచనను గలిసికొని గృహమున కేగుదురు. ఇందు శ్రీనివాసరావుగారు నాయికానాయకులకు ప్రేమ యంకురించి యెదుగుటకవకాశము గల్పించ నిట్లు సముచితముగా కథనునడిపిరి. అంతేగాక ఉన్న రంగస్థలములోనే వారిని ప్రవేశపెట్టి ప్రదర్శనకెట్టి యాటంకమును గల్పింపలేదు. పైపెచ్చు ప్రదర్శనానుకూలముగావించిరి. ఈ సన్నివేశమును గూర్చి "సుఖమంజరీ ప్రద్యుమ్నుల పరస్పర మోహప్రారంభ ముద్వితీయ రంగమున నునుపబడియె వారికువురకు దాగుడు మూతలాట కల్పించినట్లు లొకరినొకరు జూచి యొకరు పరువెత్తునట్లు చేసియుండుట నవ్వులాటగా నున్నది."[1] యను నొక విమర్శగలదు. కాని యిట్లు రావుగారు ప్రదర్శనానుకూలముగా రచించిరని గ్రహించినచో నిట్టి విమర్శలకు తావులేదు. నాటకమును పఠించు వేళ నాయికా నాయకులు పరువెత్తినట్లు తోపవచ్చునేమో కాని రంగమున ఆయా పాత్రలు మసలుటను గమనించిన నిట్టిది గోచరముకాదు. నాటకమును ప్రదర్శన దృష్టితో గదా మరి చూడ వలయును. కనుక రావుగారిట్టి సన్నివేశములు కల్పించి ప్రదర్శనానుకూలము గావించి రనుటయే యుచితము. 'మదాలస'లో ద్వితీయాంకము తృతీయరంగమున పాతాళలోకమున కువలయాశ్వుడు హర్మ్యప్రదేశమున నున్న మదాలసను దిగువనుండి గాంచి తానును హర్మ్యతలమునకేగి మరుగున నిలిచి ఆమె యందమును వర్ణించినట్లు గలదు. ఇది కొంత ప్రదర్శనాననుకూలమనియే తలంప వలెను.

8.3.5 వధాయుద్ధాదులను ప్రదర్శనానుకూలముగావని చాలవరకు

1. 1౬౬, జనవరి, 1897 పు. 1

రావుగారు వదలి యున్నారు. అవసరమైనప్పుడు మాత్రమే యట్టి వానిని చూప వలెనని వీరి దృఢాభిప్రాయము.[1]

రావుగారు దుష్టుల వధ రంగముననే జరిగినట్లుచూపి, సన్మార్గుల వధను మరుగు పరచిరి. కీచకుడు,దుశ్శాసనుడు, హిరణ్యకశిపుడు, కళావతీమదనులు రంగమున ప్రత్యక్షముగ వధింపబడిరి. కాని మైసూరురాజ్యాభివృద్ధిలో లక్ష్మణ వీరుల వధా సమయమున ఘాతుకులు కత్తి యెత్తునంతలోపల తెరపడను. చంద్రగిర్యభ్యుదయమున ఓబళనాయకునిచే దుర్మరణము పొందలేక వీరోచిత ముగ భార్యను, బిడ్డలను ప్రక్కకు లాగి వధించి తానును ప్రక్కకు బోయి శ్రీరంగరాయలు శిరము ఖండించుకొనును వీరనరసింగరాయడు భార్యను జంపి, ఓబళుని సంహరించి తానును జచ్చును. యుద్ధమవసరమైనప్పుడది జరిగి నట్లు పాత్రలచే జెప్పించినట్లు ప్రవేశక విష్కంభముల వంటి రంగముల గూర్చి చెప్పినప్పుడు వివరించితిని కాని ప్రతాపాక్బరీయమున మాత్రముద్వితీయాంకము చతుర్థ రంగమున చిత్తూరును అక్బరు సేన ముట్టడించుటలో కోటలోపల, పైన హిందూ సైన్యము, బయట అక్బరు సేన విడిసినట్లును, కాల్పులు జరిపినట్లును కొందరు మహమ్మదీయ సైనికులు కోటపైకెక్కినట్లును, ఇంతలో కొటవాకిలి తెరు పబడినట్లును, పరస్పర యుద్ధము జరిగినట్లును, హిందూ సైన్యము వధింపబడి నట్లు, తురకలు పట్టణమున ప్రవేశించినట్లును, హిందూ వనితలగ్నిలో దూకిన ట్లును సూచితమైనది. ఇది యంతయు ప్రదర్శించుటదుస్సాధము. ఇట్లే హాల్దీ ఘాటు యుద్ధము పర్వతములలోనే జరిగినది. చివర భిల్లులతో ప్రతాపుడు కోటను ముట్టడించి విజయము పొందును. ఇవి ప్రదర్శనానుకూలములుగావు. కాని యివి కేవలము కుండలీకరణములలో సూచితమగుటచే వీనిని వదలినను నాటకమున కెట్టి లోపము కలుగదు. ఇవి సామాజికుల యూహకు వదలినప్పుడట్టి యవస్థ కలుగదు. అయినను ఆనాడు 'పార్శీనాటక ప్రదర్శనానుసారమీ రంగస్థలయుక్తులు (Stage Tricks) సామాన్యమే గనుక వారు వీనిని బాగుగానే ప్రదర్శించి యుందురని తలంపవలెను. లేనిచో వీనిని రావుగారు సూచన మాత్రముగ గూడ తెలిపి ఉండరని తలంపవలెను.

---

1. 157. Rules పు. 2

18 3.8 ఇంక దేవతలు ప్రత్యక్షమగుట వీరినాటకములలో సామాన్యమే. వానినిగూడ రావుగారు సందర్భానుసారముగ ప్రదర్శనానుకూలముగానే చేసి యుండుట గమనింపవలెను. 'రుక్మాంగద, సత్యహరిశ్చంద్రీయము' మున్నగు నాటకములలో దేవతలు ప్రత్యక్షమగుట కలదు. ఇంతేగాక రావుగారు గావించిన మార్పు మరొకటి కలదు 'ద్రౌపదీ వస్త్రాపహరణము'న నిందు సభలో దుశ్శాసనుడు ద్రౌపది వలువలొలిచెనను విషయము నాగరక సంఘమున సభ్యతకాదని యెంచి రావుగారు మార్చిరి. దుశ్శాసనుడు వలువలొలుచుచుండ ద్రౌపది, దగ్గరలో నున్న గదిలోనికి పోయినట్లు మార్చిరి. ఇది దృశ్యకావ్యమగుటచే నుచితము కాదని యిట్లు గావించిరి. ప్రదర్శనానుకూల్యమే ఈ మార్పునకు ప్రబలహేతు వనుటలో సందేహము లేదు.

'ప్రహ్లాద'లో ప్రహ్లాదుని సముద్రమున ద్రోయుట, పాములచేత గరపించుట అగ్నిలో పడద్రోయుట, ఏనుగుచేత త్రొక్కించుట మొదలగువానిని రావుగారు ప్రదర్శన యోగ్యముగా గావించి యున్నారు. క్లిష్ట విషయములే యైనను ప్రదర్శనాను కూలముగా జేయుట యందె కవి ప్రతిభ గోచరించును. ఉత్తమ నాటక ప్రయోక్తయగు శ్రీ కూర్మా వేణుగోపాలస్వామిగారు ఈ ప్రహ్లాద నాటక ప్రదర్శన యోగ్యతను గూర్చి "ప్రహ్లాద చరిత్రలో అనేక సంఘటనలు ప్రదర్శనకి అసాధ్యం. అవి తొలగిస్తే అసలు కథకే మోసం. అటువంటి ప్రహ్లాద చరిత్రని ఆనాటికి సాధ్యమైన రీతిలో ప్రదర్శనకి అనువుగా వ్రాయడం శ్రీ కోలాచలం ప్రత్యేకత. ప్రదర్శనానుకూల్యం నాటకానికి పరీక్షానికషం."[1] అని కొనియాడియుండుట రావుగారి ప్రతిభకు నిదర్శనము. అంతేగాక వీరానాటి రంగ పరికరములను పురస్కరించుకొనియే యిట్లు రచించిరని విశదమగును. కాని యిట్టి వన్నియు ప్రజల ప్రీత్యర్థమే. రచించి యుందురవి శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మగారభిప్రాయము.[2] అయినను కావచ్చును. వీరు తమ కిష్టము లేకున్నను పామర జన ప్రీతి కొరకే పాటలు రచించినట్లు మనకు విదితమేగదా! ఇట్లు శ్రీనివాసరావుగారు తమ నాటకములను ఆనాటి పరిస్థితులను రంగ పరికరములను పురస్కరించుకొని ఉచితరీతిని ప్రదర్శనయోగ్యముగనే రచించిరి.

---

1. 25. పు 283   2. 8. పు. 70-75

8.3.8 శ్రీనివాసరావుగారి నాటకములలో దేనినైన పూర్తిగా ప్రదర్శించుటకు 7,8 గంటలు కాలము పట్టును. కాని అది ఆనాటి ప్రజలకు రుచించి యుండవచ్చునని తలంచుటకు గూడ వీలులేదు. ఆనాడే నాటకము క్లుప్తముగా నుండి ప్రదర్శనమున కనుకూలింపవలెనని మిత్రులు రావు గారిని హెచ్చరించినట్లును, నాటకము దృశ్యమే గాక శ్రవ్యముగా గూడ నుండవలె ననెడి కోరికతో పరిమితిని తగ్గించుట మంచిది గాదని వీరు సమాధాన మిచ్చినట్లు పూర్వోక్తము. ఈ నాటకములు స్థూలముగా నుండవలెననుటకు మరి రెండు కారణములను వీరు పేర్కొనిరి "రెండవ కారణంబేమన్న, ఇప్పటి కాలంబులో ప్రతి పట్టణంబులోను నాటక సంఘంబు లేర్పడి యక్షరశూన్యులు సైత మాడి వారివలె పాఠము నేర్చుకొని వేషంబు ధరించి, రంగస్థాన మలంకరించి యుక్తాయుక్తంబులు దెలియక వ్యస్తావ్యస్తముగా సంభాషించి రసస్ఫూర్తిగల పదములందు రసభంగంబు గలిగించి తమ చేతనయినంత సామర్థ్యంబుచే నాటకంబు చెఱపంబూనుదురు ఇది యజ్ఞాన దోషము. అట్టి వారికి నివి దుస్సాధంబుగ నుండవలెననుట వేఱొక కారణము," "పైగా తెలుగు నాటకములు పామరులకు సైతమర్థమయ్యేడు లాగునను కళాసరణి దెలియు లాగునను నుండవలెను గాన నించుక స్థూలముగా వ్రాయవలసివచ్చును."[1] అనిన వీరి యభిప్రాయముచే నటులు చదువు, సంస్కారము గలవారుగ నుండిన నాటక ప్రదర్శనము రక్తి గట్టునని తెలియును. ఈ విషయమునే తరువాతి నాటక పీఠికలలో స్పష్టము గావించిరి.[2] వీరి మూడవ నాటకమైన 'మదాలస' పీఠికలో ప్రదర్శించు కాలంబు హెచ్చునని భీతిచే సంక్షేపించిరట.[3] "సుల్తానా చాందుబీ" నాటకము నుద్దేశించి "ఈ నాటకము గొప్పదిగ నున్నది. కావున ప్రదర్శించు వారు తమ యనుకూలాననుకూలత కొలది హెచ్చు తగ్గులు సలుపవచ్చును."[4] అని ప్రదర్శకులకు సూచించిరి. ఇంతే గాదు 'రామరాజు చరిత్రము' వ్రాయు సరికి రావు గారిలో గలిగిన మార్పు మరింత స్పష్టమైనది. అప్పటికి నాలుగైదు గంటలకంటె నెక్కువ కాలము నాటకము ప్రదర్శించుట ఉచితము కాదని

1. 109. పీ పు. 8.
2. (i) 10 . ఉ. పు. 3, (ii) 121. పీ పు. 3
3. 120. పీ. పు. 3
4. 99 ఉ. పు. 1

యెన్నిరి. "ఇప్పటి కాలంబున నాలుగైదు ఘంటల కాలము కన్న హెచ్చు కాలము ప్రదర్శింపఁ దగిన నాటకములు జనుల యోపికను జాపును గావున దీర్ఘముగఁ 'బెంచి నాటకముల వ్రాయుట తప్పని యిపుడు నేఁ దెలిసితి. హెచ్చు గం' బద్యములు వ్రాయుట వృథాయాసము."[1] అని సంపూర్ణముగ విశ్వసించు టచేతనే రామరాజు నాటకమును ప్రదర్శన యోగ్యముగా జేయుట కవసరమైన మార్పులను సూచించిరి. "బళ్లారి 'సుమనోరమసభ' వారనేకావర్తు లీనాటకము ప్రదర్శించినారు. అందున నొక తూరి ప్రదర్శించిన రీతి నగపడు ప్రకటన పత్రిక నిందు ముద్రింపించినాడను. ఈ నాటక మాడ నిచ్ఛయించువారు, దానిని జూచి తమ యిష్టానుసారముగ ననుకూలము రీతి రంగములు హెచ్చుతగ్గులు చేసి కొనవచ్చును "[2] అని ప్రదర్శనానుకూలమున కిట్లు రావుగారు వచించిరి. కాని "నిబిడబంధముతో కవి నాటకమును రచింపలేదనుట కిది యాస్కార మొసంగు చున్నది "[3] అని డా.పి. ఎస్. ఆర్. అప్పారావు గారు తమ భావమును వెల్లి డించిరి. అయినను శ్రీనివాసరావు గారి సూచన ప్రదర్శనానుకూల్యమునకే గాని కథలోని నిబిడత సడలి, రసవిచ్ఛిత్తి కలుగుట కొరకు గాదని మనము తలంప వలెను కారణమేమన రావుగారి దర్శకత్వము క్రిందనే అనేక పర్యాయములు రామరాజు చరిత్రము ప్రదర్శింపబడిన దగుటచే నాటక ప్రణాళిక కెట్టి విఘా తములేక, ప్రదర్శన యోగ్యముగ మార్పులు గావించి యుందురనుట కెట్టి సందియములేదు: ఉండరాదు.

8.3 9 శ్రీనివాసరావుగారి నాటకములన్నియు ప్రదర్శనము కొరకే రచితములు. రావుగారి కిష్టమైన చారిత్రక నాటకములను రచించి ప్రదర్శించిరి. సుమనోరమసభ వారి కోరిక ననుసరించియే వీరు పౌరాణికములను రచించిరి. కోరి వ్రాయించుకొన్న నాటకముల వారు ప్రదర్శింపక వదలి యుందురా? అట్లు తలంచుటకు వీలే లేదు. వాని నన్నింటిని సుమనోరమసభ వారు మనోజ్ఞముగా ప్రదర్శించి యుందురు. వాని ప్రదర్శన విజయమునకు రావు గారి పర్యవేక్షణ యెంతయు సహకరించియుండును. కనుక వీరు నాటక ప్రద

1. 99. ఉ. పు. 1. 2. పైదే. పు. 2.
3. 100. పీ. పు. 1. 4. 45. పు. 271.

ర్శనమునకు నాటక కర్తృ సహకారమవసరవని కంఠోక్తిగా చెప్పిరి. "In getting up the play take the author for guide. Remember that in France the author of the play is everything to the Company. The French, therefore, always successful on the stage; but in Germany, the author is little or nothing. The German plays are not therefore so successful."[1] ఇట్టి యభిప్రాయము కలవారగుటచేతనే నాటకములానాడు ప్రదర్శనలో విజయవంతమైనవి. *He* (Kolachalam Srinivasa Rao) has constructed a permanent theatre (Vanivilasa natakasala) for the Company (Sumanorama Sabha) at the cost of Rs 10,000/- and the succcss of the Company is not a little due to the active interest and guidance of Mr Srinivasa Rao."[2] అని ప్రశంసింపబడి యుండుటయే యందుకు ప్రబల తార్కాణము. ఇట్లు శ్రీనివాసరావు గారు తమ నాటకములలో దృశ్యశ్రవ్యత్వ లక్షణముల సమ్మేళనము గావించి దృశ్యశ్రవ్య కావ్య గౌరవములు సంపాదించి ఔత్కృష్ట్యము నొనగూర్చిరి,

పై పరిశీలన వలన శ్రీనివాసరావుగారు నాటక రచనచేసి నీతిబోధ, సంఘ సంస్కరణము నాటకరంగమున ప్రదర్శించుట అను మూడు ప్రయోజనములను సంపాదించి మహా నాటక నిర్మాత కాగలగిరని సుస్పష్టమయినది.



# 9. మరికొన్ని విశిష్ట లక్షణములు

ఇతఃపూర్వము శ్రీనివాసరావు గారు నాటకరచనా, శిల్పములు నిర్వహించిన విధము స్పష్టమయినది. ఈ ప్రకరణమున శ్రీనివాసరావుగారికి గల 'ఆంధ్ర చారిత్రక నాటక పితామహు'డను వాడుకను, వీరి విషాదాంత నాటకముల వైశిష్ట్యమును వివరించి, హాస్యపోషణ, ఔచిత్య నిర్వహణములను విశదీకరించుట ప్రధాన విషయములు.

## 9.1 చారిత్రక నాటకములు :

పాశ్చాత్య సాహిత్య లోకమునను చారిత్రక నాటకములు గలవు. అందున షేక్స్పియర్ నాటకములలో దాదాపు మూడవవంతు చారిత్రకములే గలవు. షేక్స్పియరు చారిత్రక నాటకములకు నొక ప్రత్యేకత గలదు. శ్రీనివాసరావు గారును రచించిన ఇరువదెనిమిది నాటకములలో ఎనిమిది నాటకములు చారిత్రకములు. వీరికి చరిత్రమీద గల ఆదరముననే వీరీ చారిత్రక నాటకములను రచించిరి. పౌరాణికములు చాలవరకు 'సుమనోరమసభా' నాటక సమాజము కోరికపైనను, మిత్రుల ప్రోత్సాహము చేతను రచించిరి. కాని రావుగారికి మాత్రము చారిత్రకేతి వృత్తములు గల నాటకముల పైననే మక్కువ ఎక్కువ. చారిత్రక నాటక రచనచే రావుగారు రెండు ఫలితముల నాశించిరి. ప్రజలకు దేశ చరిత్రను బోధించి విజ్ఞాన వంతులజేసి దేశము నుద్ధరింప వచ్చుననుట మొదటిది. పురాణ విషయముల నితివృత్తములుగా గ్రహించి నాటకములుగా రచించినచో కవి కల్పనా సంవిధాన చాతుర్యములు తెలియవు. చారిత్రకేతివృత్తములను నాటకములుగా నొనర్చినచో మౌలికమైన నాటక కర్తృప్రతిభ వ్యక్తమగునను నది రెండవది.[1] ఇట్లు అమూల్యాభిప్రాయమును వెల్లడించుటయే కాదు. తదా

---

1. (i) 102. ఉ. పు. 1. (ii) 108. పి. పు. 4.

శయమును కార్యరూపమున నిరూపించిరి. కనుకనే రావుగారాంధ్ర నాటక కర్త లెవ్వరు రచింపనన్ని చారిత్రక నాటకముల నధిక సంఖ్యలో రచించి తమ వైశిష్ట్యమును నిలబెట్టుకొనిరి.

9.1.1 చారిత్రక విషయము నితివృత్తముగా గ్రహించి నాటకముగా రచింపన ప్రథములు శ్రీనివాసరావుగారు.[1] వీరి రెండవ నాటకము 'సుఖమంజరీ పరిణయము' చారిత్రకేతివృత్తము గలది. ఇది 1895 లో రచింపబడి 1896 లో ముద్రితము. సమకాలిక నాటక కర్తలైన ధర్మవరం రామకృష్ణమాచార్యుల వారి 'రోషనార శివాజి', వేదం వేంకటరాయశాస్త్రిగారి ''ప్రతాప రుద్రీయము, బొబ్బిలి యుద్ధము'' చారిత్రక నాటకములు గలవు. కాని ధర్మవరం వారి ''రోషనార శివాజి'' తరువాతి రచన. వారికి పౌరాణికముల పైననే యధికాదరము. వేదంవారి 'ప్రతాప రుద్రీయము' 1897 లోను, 'బొబ్బిలి యుద్ధము' 1916 లోను ప్రకటితములు. కనుక శ్రీనివాసరావు గారిదే ప్రథమ చారిత్రక నాటక మనుట నిస్సందేహము. వీరి తరువాతి చారిత్రక నాటకము "సుల్తానా చాందుబీ". దీని రచన 1899-1900 లో. ఇందు రావుగారు చరిత్రను యథాతథముగా ప్రయోగించిరి. ఆ వెనుక క్రమముగా "రామరాజు చరిత్రము" మున్నగు చారిత్రక నాటకములు వీరు రచించిరి.

శ్రీనివాసరావుగారి చారిత్రక నాటకములలో 'సుఖమంజరీ పరిణయము, సుల్తానా చాందుబీ'లు ముందే రచితములైనను శ్రీనివాసరావుగారికి కీర్తిప్రతిష్ఠలను సంపాదించిపెట్టిన చారిత్రక నాటకము 'రామరాజు చరిత్రము'. ఇదియే ఉత్తమ చారిత్రక నాటక మనియు, "విషాద సారంగధర, ప్రతాప రుద్రీయములు" చారిత్రకాభాస నాటకములు అనియు శ్రీ కూర్మా వేణుగోపాలస్వామిగారి యభిప్రాయము. "ప్రథమ చారిత్రక నాటకం శ్రీ ధర్మవరం కృష్ణమాచార్య 'విషాద సారంగధర' అని కొందరి అభిప్రాయం. కాని సారంగధర కథ చారిత్రకం కాదు. ఆంధ్ర సాహిత్యానికి అంకురార్పణ చేసిన నన్నయభట్టును ఆద

1. (i) 159. పు. 642, 643. (ii) 184. పు. 1165.
(iii) 101. పీ. పు. 8.

ధించిన రాజరాజుకి సంబంధించింది అసలే కాదు. తరువాత శ్రీ వేదం వేంకట రాయశాస్త్రి 'ప్రతాప రుద్రీయం' కూడా చారిత్రక నాటకమని మరి కొందరి అభిప్రాయం. ఇందులో కథ కూడా చారిత్రకం కాదు. విషాద సారంగధర ప్రతాప రుద్రీయంమొదలైనవి చారిత్రాకాభాసనాటకములు (Psudo Historical Plays) మాత్రమే." "చరిత్రాత్మకమైన ఇతివృత్తం కల చారిత్రక నాటకం శ్రీ కోలాచలం శ్రీనివాసరావు "రామరాజు చరిత్ర." దీనికి ఫాల్ ఆఫ్ విజయనగర్ అని ఇంగ్లీషు పేరు "[1] కనుక రావుగారి రామరాజు చరిత్ర ముత్తమ చారిత్రక నాటక మనుటలో సందేహము లేదు. దీనికానాడుండిన ప్రచారము ప్రజల ఆదరణను గూర్చి పురాణం సూరిశాస్త్రి గారు "ఇందు (ప్రతాప రుద్రీయ రసపుత్ర విజయ, రామరాజు చరిత్రముల యందు) శ్రీనివాసరావుగారి పౌత్రము ఆంధ్ర చరిత్రమంతటిలో ఘనతమమైన సారస్వత సంబంధమున మఱపురాని విద్యానగర సామ్రాజ్య వినాశనమును తెల్పునది. కాన ప్రజాహృదయమున శోక నిర్వేదముల నెక్కువ జనింపజేయుచు నెక్కువ ఆదరింప బడుచున్నది"[2] అని వివరించిరి. రావుగారి నాటకములలో నాటకీయ శిల్పమునకు కొదవలేదు. రావుగారుత్తమ నాటక కర్తలనుటకు నెట్టి సందియము లేదు. ఆంధ్రదేశ చరిత్రయే గాక, మైసూరు, ఉత్తర హిందూస్థాన చరిత్రలకు సంబంధించిన యితివృత్తముల గ్రహించి నాటకములుగా రచించుట వలన వారి చరిత్ర జ్ఞానము, దానిపై తమకు గల అధికారము స్పష్టమగుచున్నది. ఒక విషయముపై కూలంకషమైన పరిజ్ఞాన ముండిననే గాని దానినొక యితివృత్తముగా గ్రహించి నాటకము వ్రాయుట సాధ్యమగు పనికాదు. చరిత్ర సంబంధి సంపూర్ణజ్ఞాన సముపార్జనము చేసిన వెనుక మాత్రమే శ్రీనివాసరావుగారు చారిత్రక సత్యములకు ముప్పురానట్లు నాటకముల రచించియుండుట ప్రశంసార్హము.

కాని పురాణం సూరిశాస్త్రి గారు మాత్రము రామరాజు చరిత్రము చారిత్రక విరుద్ధముగ నున్నదని' 'రామరాజు చరిత్రము కథాంశము సకలాంధ్రావని రసికాదరణ యోగ్యమైనను శ్రీనివాసరావుగారు పలు తావుల చారిత్రక విరుద్ధముగను, స్వభావ విరుద్ధముగను, శాస్త్ర విరుద్ధముగను ఈ నాటకమును

1. 25. పు. 291-293. 2. 2. పు. 208.

రచించిరి"[1] అనుట కొంచెము అతిశయోక్తితో గూడి యున్నది. బహుశః ఇట్టి విమర్శలకు సమాధానమో అన్నట్లు శ్రీనివాసరావుగారు "ఈ నాటకము కేవల చరిత్రాంశములు గలిగినది. తాళికోట యుద్ధమునందుఁ బరాజయము నొంది హిందూ రాజులు విజయనగర రాజ్యమును గోలుపోయిన విషయ మిందలి యితివృత్తము. చరిత్రాంశము లన్నియును తూ.చా. తప్పక యథార్థ స్థితిలో నాటకము నందుండవు. ఆంగ్లేయ భాషయందుండు చారిత్రక నాటకంబులు చదివిన వారికెల్లరకు నిది తెల్లంబుగ నుండును. ఒక కార్యమునకుఁ గారణంబు గల్పించు స్వాతంత్ర్యము నాటక కర్తకు కలదు. రామరాజు శిరంబునఱకిన వాడతవిసేనాధిపతులలో దురక వాఁడొకఁడని యొక చరిత్రకారుఁడు వ్రాసినాడు వాఁడెవడైనది భాజును జంపుటకుఁ గారణ మేమయినది నేను గల్పించి వ్రాసివాడను."[2] అని తెలిపియున్నారు. కనుక 'రామరాజు చరిత్రమున చేసిన ఈ మార్పు చరిత్రకంటె భిన్నమైనది. పటాణి, అషాబీ యను పాత్రల కల్పన చేసినప్పటికి చారిత్రక యాథార్థ్యమున కెక్కడ విఘాతము కలుగలేదు. కథా వస్తువునకు విఘాతము కానియట్లు నాటక కర్త మార్పు చేయుట కధికారము గలదు. అందుచే పై మార్పువలన చరిత్రకు గాని నాటకమునకు గాని యెట్టి వైరుధ్యము నేర్పడలేదు. పైపెచ్చు అషాబీ పటాణుల పాత్ర సృష్టి ఆంధ్ర నాటక సాహిత్యముననే యనన్యము, అసామాన్యమునై యొప్పుచున్నది. మూలములను వివరించినప్పుడు శ్రీనివాసరావుగారు చిరుమార్పుల గావించియు, మూలకథకు వైరుధ్యము రాకుండ, చరిత్రను యధాతధముగా నాటకము లొనరించినట్లు స్పష్టము గావించితిని. కనుకరావుగారి నాటకములలో చారిత్రక వైరుధ్యముయి లేవని విశద మగుచున్నది.

9.1.2 ఇంక 1906-1907వ సంవత్సరములలో భారత దేశమున వెల్లివిరిసిన నూతన జాతీయ భావముల వలన ననేక నాటక కర్తలు చారిత్రక నాటకములను రచించిరనియు, ఆంగ్లేయులను ప్రత్యక్షముగా నిందింప లేక హిందూ మహమ్మదీయేతివృత్తముల గ్రహించి నాటకములుగ వ్రాసి యందు మహమ్మదీయుల నింద కల్పించి ఆంగ్లేయులను వారి ప్రభుత్వ పద్ధతులను పరో

---

1. పైదే. 2. 100, పీ పు 1.

క్షముగా నిందించినట్లు గావించిరనియు పురాణం సూరిశాస్త్రి గారియభిప్రాయము[1].
కాని యితర నాటక కర్తల సంగతి యెట్లున్నను శ్రీనివాసరావు గారు మహమ్మ
దీయుల మూలమున ఆంగ్లేయులను నిందించుటకొరకే 'రామరాజు చరిత్రము'
రచించిరనుట కవకాశములేదు. ఈ నాటకము నందు రామరాజు తన
చతురుపాయములచే బహ్మనీ సుల్తానులకు అంతర్వైరము కల్పించి
తాను విజేత యగుటకును వారిని సర్వనాశము గావించుటకును యత్నించెను.
అయినను వీరు హిందువులంతకంటె నధికముగానే పటాణి చేత నిందింప
జేయుట గమనింపదగినది. అంతేగాదు. పటాణి ప్రతిన ప్రకారము రామరాజును
యుద్ధమున వధించి బహ్మనీ సుల్తానులకు విజయమును చేకూర్చి అషాబీతో
సుఖించినట్లు శ్రీనివాసరావు గారు నాటకమును ముగించి యుండుట ఆలోచింప
దగినది. మహమ్మదీయ దూషణమే ప్రధానమైనచో వారికి విజయమును గూర్ప
పనిలేదు. కాని తరువాత కొందరు నటులు రామరాజుచరిత్రము కథను
మార్చియు, పటాణిని ఆత్మహత్యచేసికొనినట్లు నాటకమును ముగించియు కాల
మునకనుగుణముగ నొనర్చుకొనిరి. కనుకనే యిది పురాణం సూరిశాస్త్రి గారి
కిని అనుచితమై తోచుటచే నట్లు నుడివి యుందురని తలంపవలెను. మరొక విష
యము గూడ నిట మనము గమనింప వలెను. పైని పేర్కొనబడిన జాతీయ
భావములు, దేశాభిమానము అనగా ఆంగ్లేయులను దూషించుట కొరకు మహ
మ్మదీయుల నిందించుట యనెడి భావము కలుగక పూర్వమే 1889-1900 సం.
లోనే శ్రీనివాసరావుగారు సుల్తానా చాందుబీ నాటక మత్యుత్తమముగా రచించి
యుండుట గమనింపదగినది. మహమ్మదీయ ద్వేషము రావుగారి మనమున నుండి
నచో నిట్లు మహమ్మదీయుల ఔన్నత్యమును వర్ణించియుండెడివారు కారు. ఇంతే
గాక వీరు హిందూ ముస్లిం సమైక్యమును గోరిన వారనుటకు సందియములేదు.
చంద్రగిర్యభ్యుదయమున చాందుఖాన్ అను సేనాధిపతిని యాచమనాయకునకు
మహోత్తమ ప్రాణమిత్రునిగా కూర్చి యుండుట యిందుకు నిదర్శనము. కనుక
శ్రీనివాసరావు గారికి మహమ్మదీయ ద్వేషము లేదు. కాని దేశాభిమానమమితము.
అందువలననే రావుగారు శిలాదిత్య, ప్రతాపాక్బరీయము, మైసూరురాజ్యాభివృద్ధి
మొదలైన వానిని రచించిరి. ప్రజలకు దేశ చరిత్రలను బోధింప వలెననుటయు

1. (i) 2. పు. 205, 206. (ii) 45. పు. 266, 267.

తన్మూలమున ప్రజలలో విజ్ఞానమువెల్లి విరియింప వలయుననియు వారి ప్రగాఢ మైన అభిమతము. అందుచేతనే రావుగారధిక సంఖ్యలో చారిత్రక నాటకములను రచించి మించి వాసికెక్కిరి.

## 9. 1. 3 ఆంధ్ర చారిత్రక నాటక పితామహుడు :

శ్రీనివాసరావు గారు చారిత్రక నాటకములను రచించుటచేతనే వీరికి 'ఆంధ్రచారిత్రకనాటక పితామహుడు' అను వాడుక గలిగినది. శ్రీ కృష్ణదేవరాయల యుగమున అల్లసాని పెద్దనకు 'ఆంధ్ర కవితా పితామహుడను బిరుదమున్నది అంతకు ముందే నన్నయ నాటి నుండి ఆంధ్రమున కవిత్వమున్నను రాయల యుగమున ప్రబంధములను ప్రత్యేక సాహిత్య శాఖ బయలు దేరుటకు పెద్దన ప్రప్రథమముగా పునాది వేసినాడు. 'మను చరిత్రము'ను మనోహర ప్రబంధముగా రచించి సాటిలేని మేటికవి యనిపించు కొని పాండిత్య ప్రకర్షను దశదిశలను ప్రకాశింపజేసి పెద్దన అన్నిట పెద్దన యనిపించుకొనుటయు అతని మార్గముననే యితర కవులు ప్రబంధములు రచించుటయు కారణముగా పెద్దనకు 'ఆంధ్ర కవితా పితామహ' బిరుద మెంతయు నొప్పియున్నది. అట్లే ధర్మవరం రామకృష్ణమాచార్యులు నాటకములు రచింపక పూర్వమే తెలుగున నాటకముబుండినను ఆచార్యులు గారు అచ్చమైన ఆంధ్ర నాటకమును రచించి ప్రదర్శించుటచే వారికి 'ఆంధ్ర నాటక పితామహుడు, అను బిరుదము కలిగినది. అదే విధముగా సమకాలిక నాటక కర్తలు చారిత్రక నాటకములు రచించి యుండినను, మరియే యితరాంధ్ర నాటక కర్తయు రచింపనన్ని అధిక సంఖ్యలో శ్రీనివాసరావుగారు ఆంధ్ర భాషలో చారిత్రక నాటకములు రచించుటయే గాదు. పైని వివరించినట్లు ప్రజోపయోగార్థము దేశ చరిత్రలను నాటకములుగా రచించుట వలనను వీరిని 'ఆంధ్ర చారిత్రక నాటక పితామహు' డనుట యెంతయు సమంజసము. తన్మూలమున ఆంధ్ర నాటక రంగమునకు శ్రీనివాసరావుగారు గావించిన సేవకు ఆంధ్రులర్పింప గలిగిన చిరుకానుక యని తలంపవలెను. ఇచట శ్రీనివాసరావు గారికి గల 'ఆంధ్ర చారిత్రక నాటక పితామహు' డను వాడుక వీరు ఆంధ్ర

---

1. (i) 101. పీ. పు. 8. (ii) 21. పు. 22. (iii) 25. పు. 298.

దేశ చరిత్ర నితివృత్తములుగా గ్రహించి ఆంధ్రమున నాటకములుగా రచించుట వలననా ? లేక చారిత్రకేతి వృత్తముల గ్రహించి ఆంధ్రభాషలో నాటకములుగా నొనర్చుటచేతనా ? యను నొక విచికిత్స కలుగవచ్చును. వీరాంధ్ర దేశమునకు సంబంధించిన ఇతివృత్తములను 'రామరాజు చరిత్రము' 'చంద్రగిర్యభ్యుదయము'నను రెండు నాటకములలోను గ్రహించిరి. ఈ పై రెండును ఆంధ్రుల కభిమాన పాత్రములైన యితివృత్తములు. పైగా 'రామరాజు చరిత్రము' బహుశః జనాదరణ పాత్రమై అనేక విమర్శకులచే బహుధా ప్రశంసింపడిన సర్వోత్తమ నాటకము. కనుక రావుగారాంధ్ర దేశ చరిత్రనే యితి వృత్తముగా జేసి నాటకముగా రచించుటచేత వీరి కీవాడుక వచ్చి యుండునని తలంచుటయే యుచితము. అయినను భారతదేశ చరిత్రలోని ముఖ్యములైన విషయములను ఇతివృత్తములుగా గైకొని చారిత్రక నాటకములనేకము ఆంధ్రమున రచించుట వలనను వీరికి వాడుక కలిగిన దనుటలోను అసామంజస్యము కన్పట్టదు. ఏమైనను 'రామరాజు చరిత్రము'నకు అన్ని విధముల సమానములైన 'సుల్తానా చాందుబీ, ప్రతాపాక్బరీయము' మున్నగు నాటకములున్నను శ్రీనివాస రావుగారి కఖండ ప్రఖ్యాతిని ప్రసాదించిన దిదియే. కనుక ఆంధ్ర దేశ చరిత్రను అందున విజయనగర సంబంధేతివృత్తమును నాటకముగా నాంధ్రమున నొనర్చుటచేతనే 'ఆంధ్ర చారిత్రక నాటక పితామహ' దను వాడుక కలిగినది. ఇంతేగాక ఆంధ్రదేశమున దీనికి గల ప్రబల ప్రచారము నిందుకు కారణమై యుండును.

## 9.2 విషాదాంత నాటకములు :

సంస్కృతమున మోదాంతనాటకములే గాని విషాదాంత నాటకములు లేవు. పాశ్చాత్య సాహిత్యమున విషాదాంత నాటకములు (Tragedies) ప్రధానములుగా పరిగణింపబడినవి. 'గ్రీకు ట్రాజెడీ'ని అరిస్టాటిల్ 'స్వయంసంపూర్ణమై నాతి విస్తృతమును, నాతి సంక్షిప్తమును గాని ఉదాత్త చరిత్రమును ఇతివృత్తముగా స్వీకరించి, కథన రూపమున గాక సంవాద రూపమున కావ్యమున అనుకరింపబడెడి మానవ వర్తనమునకు ట్రాజెడీ అని పేరు. అందలి భాష సందర్భానుసారమైరమణీయముగా ఉండవలెను. కథాంశములన్నియు జాలిని భయమును పుట్టించునవియై, ఆభావములను శోధింపగలవిగా ఉండవలె"

నని నిర్వచించెను.[1] 'ట్రాజెడీ'లో పాత్రచిత్రణమున కంటె ఇతివృత్తము ప్రధానమనియే గాదు 'ఆత్మ'యని అరిస్టాటిల్ మతము.[2] నాటకమున ఐక్య త్రయము (The Three Unities) ఉండవలెను. అందునను కార్యైక్యము (Unity of Action) మిక్కిలి ప్రధానమని అరిస్టాటిల్ చెప్పెను.[3] భావ సంఘర్షము (Conflict) తప్పని సరిగ ట్రాజెడిలో ఉండవలెను.[4] భావ సంఘర్షముతోనే నాటక మారంభమగునని హడ్సన్ పండితుని అభిప్రాయము. ట్రాజెడి విషాద భావ (Tragic elements) సంభరితముగా నుండును. ఇందలి విషాద నాయకుడు (Tragic hero) మన వంటి వాడే అయినను వానిలో ప్రత్యేకత యుండును. అరిస్టాటిల్ మతము ప్రకారము నాయకుడు గుణహీనుడుగాని, ఉత్తమ గుణ ఖనిగాని కాడు. ప్రమాదము వలన గాని, విధివశమునగాని ఏదేని లోపమునకు లోనై ఘోర కార్యము గావించి, తత్ఫలము ననుభవించును[5]

ఈ అరిస్టాటిల్ ట్రాజెడీ లక్షణములకును షేక్స్పియరు ట్రాజెడీ లక్షణములకును కొంత భేదము కలదు. అరిస్టాటిల్ చెప్పిన కార్యైక్యమును మాత్రము షేక్స్పియరు పాటించి తక్కిన వానిని వదలెను. ఇతివృత్త సంవిధానమున కంటె షేక్స్పియరు పాత్రచిత్రణము నందే తన ప్రతిభను ప్రకటించెను. గ్రీకు నాటకములలో chorus ఉండును. షేక్స్పియరు ముఖ్య నాటకములలో నిది కన్పట్టదు. తక్కిన వానిలో కొన్నింట ఇది ఉన్నను ప్రాధాన్యము తక్కువ. గ్రీకు ట్రాజెడీలలో దేవతల ప్రభావ మధికముగా నుండ అరిస్టాటిల్ నాటక లక్షణమున మానవ పురుషకారమునకాధిక్యము కలదు. షేక్స్పియరు ట్రాజెడీలో దేవతలకు ప్రవేశముండదు. ఇందలి విషాద నాయకుడు తన నాశము తాను చేసేతల చేసికొనెడి వాడే గాని దేవతలచే ప్రేరేపింపబడెడివాడు కాడు. గ్రీకు ట్రాజెడీలలో ప్రధాన పాత్రలకే ప్రాధాన్యముండ, షేక్స్పియరు నాటకములలో అప్రధాన పాత్రలకు సైతము ప్రాధాన్యముండును.

---

1. (i) 64. పు. 274, (ii) 156. పు. 28  2. 156. పు. 27, 28.
3. 156. పు. 275, 299.  4. 156. పు. 349
5. 156. పు. 260, 261.  6. 64. పు. 294-296.

పైని వర్ణింపబడిన విషాదాంత నాటకముల వంటివి సంస్కృతమున లేవు. కాని భాసకృత 'ఊరుభంగము' సంస్కృతము నందలి ఉత్తమ విషాదాంత నాటకమునకు పరమోదాహరణమని సోపపత్తికముగా శ్రీబుచ్చిబాబుగారు నిరూపించిరి.[1] ఊరుభంగమున దుర్యోధనుడు నాయకుడుగాక ప్రతినాయకు డగుటచే నిది విషాదాంత నాటకము కాదని ఏ బి. కీత్ మొదలైన పండితుల అభిప్రాయము.[2] "రసవ్యపదేశమును బట్టి ట్రాజెడీల వంటి కరుణభయానక రసస్ఫూర్తి గల నాటకములు సంస్కృతమున కొన్ని గలవు. మరణాంతములు, వధాత్మకములునైన నాటకములును గలవు, నాయకుని చిత్తసంక్షోభ పరితాపములు మొదలగు ట్రాజెడీ ఛాయలున్నవియును కొన్ని కలవు, అచ్చపు ట్రాజెడీలు మాత్రము సంస్కృతమునలేవు"[3] ఇట్టి విషాదాంత నాటకములు లేకుండుటకు కారణములనేకములు గలవు,[4] కాని భారతీయ తత్త్వమును పురస్కరించుకొని ధర్మమునకే విజయము చేకూరవలెను గనుక తదుచితముగ మోదాంతములుగానే సంస్కృతమున నాటకములు రచింపబడినవి.

9.2.1. శ్రీనివాసరావుగారి నాటకములలో కొన్ని విషాదాంతములుగ నుండుటలో అసామంజస్యము లేదు. తత్కాల పరిస్థితుల పరిశీలనచే నది సహజమే యని తెలియును. కాని రావుగారు మాత్రము బుద్ధిపూర్వకముగా విషాదాంత నాటకములు రచించినట్లు కన్పట్టదు. సంస్కృత నాటక పద్ధతిలో మోదాంతములుగ రచించుటయే వీరికిష్టము. ఆంగ్లమునందలి ట్రాజెడీ (Tragedy) అనుదానిని విషాదాంతము లేదా ఖేదాంతమని గాక గంభీరనాటకమని వీరు గ్రహించిరి[5] సంస్కృత లాక్షణికులు చెప్పినట్లుగా నాటకమున నాయక వధ చూపగూడదనుటను విశ్వసించినవారు వీరు. మన ప్రేక్షకులిష్టపడకుండుటచే చారిత్రక నాటకములలో దప్ప నితరనాటకములందు ఉత్తమపాత్రల వధ చూపగూడదని వీరి యభిప్రాయము.[6] కనుకనే వీరి చారిత్రక నాటకములు మాత్రమే మరణాంతములు, విషాదాంతములునై యున్నవి. తక్కిన నాటక

1. 41. పు. 198-202. 2. 160. పు. 106.
3. 64.పు.304-308. 4. (i) 64.పు 309,310, (ii)63. పు 264-266
5. 118. పీ. పు. 8. 6. 157. *Rules* పు. 2.

ములలో నాయికానాయకుల మరణమున్నను వారు పునరుజ్జీవితులై సుఖించుట గలదు అశ్వతరుతపోమహిమచే ఈశ్వరప్రసాదము వలన మరణించిన మదాలస జీవించి కువలయాశ్వుని గలిసి సుఖించును. 'సీమంతిని'లో చంద్రాంగదుడు యమునలో బడి మరణించియు తక్షకుని యనుగ్రహముచే పునర్జీవితుడై సీమంతినిని గూడి సుఖించును. 'బభ్రువాహన'లో అర్జునుడు బభ్రువాహనునిచే వధింపబడి మరణించియు మృతసంజీవకమణి వలనను, శ్రీకృష్ణానుగ్రహముచేతను పునర్జీవితుడగును. ఇట్లు రావుగారు తదితర పౌరాణికములలో దుష్టపాత్రల వధయే గాని శిష్టపాత్రల వధను చూపలేదు.

9.22. దీని కపవాదమునుగలదు. 'పాదుకాపట్టాభిషేకము'న దశరథ మరణము చూపబడినది. కాని యిది మూలములోనే గలదు భాసుడును దీనిని వర్జింపలేదు. దీనిని విమర్శకులు విషాదాంతముగానే తలంచిరి.[1] రావుగారి నాటకములలో విషాదాంత నాటకముల వంటివి కొన్ని మోదాంతములయ్యు కష్టభూయిష్ఠములయి యున్నవియు గలవు. వీనినిట్లు విభజింపనగును.

విషాదాంత నాటకములన దగిన 'రామరాజు చరిత్రము, పాదుకాపట్టాభిషేకము' ననునవి రెండు గలవు బభ్రువాహన, చాందుబీ, శిలాదిత్య అనునవి వధాత్మక నాటకములు. సత్యహరిశ్చంద్రీయము, కుశలవ అనునవి రెండును చిత్తసంక్షోభ పరితాపాత్మకములు. అప్రధాన పాత్రలవధాత్మకములు మైసూరు రాజ్యాభివృద్ధి, చంద్రగిర్యభ్యుదయము. దుష్టనాయక వధాత్మకములు కీచక వధ, ప్రహ్లాద, శిరోమణి. కీచకవధ, ప్రహ్లాద, శిరోమణి అనువానిలో దుష్ట పాత్రల వధ యుండుటచే విషాదాంత నాటకములలో జేరవు 'చంద్రగిర్యభ్యుదయము"న శ్రీరంగరాయాదులయు వధ యుండుట వలన శోకముత్పన్నమైనను చివరి యాచమనాయకుని విజయానందములచే కప్పివేయబడినది, "మైసూరు రాజ్యాభివృద్ధి''లో మారనాయకవధ దుష్టపాత్ర వధ. కనుక దానిని గూర్చిన ఆలోచనయే లేదు 'సత్యహరిశ్చంద్రీయము, కుశలవ' నాటకములు మోదాంతములు. కాని వీని రెంటను విషాదభావము భరింపరానంతగా కలదు. సత్యసంధు

1. (i) 11. పు 41-50 (ii) 41. పు. 171.

డైన హరిశ్చంద్రుడు యజ్ఞార్థము ధనమిత్తునని విశ్వామిత్రునకు మాటయిచ్చి నాడు మాతంగకన్యల వివాహమాడ నిచ్ఛగింపక పోగా విశ్వామిత్రుడు క్రుద్ధుడై నప్పుడు రాజ్యమునైన త్యజింతునుగాని కుల సంకరమునకు పాల్పడనన్నను. ఆ మాట ప్రకారము విశ్వామిత్రునకు రాజ్యమొసగి కట్టుబట్టలతో నరణ్యము పాలయి పడరాని కష్టములనుభవించి ఋణవిముక్తికై భార్యనమ్మి, తాను కాటి కాపరియై చివరికి పుత్రుడు మరణింప, భార్య తల ద్రుంపవలసిన వాడగును. అట్టియెడను కర్తవ్యమును, సత్యనిష్ఠను విడనాడని మహాధీరుడు హరిశ్చంద్రుడు. సత్య నిష్ఠాకర్తవ్యములకు భార్యా మమకారమునకు మధ్య హరిశ్చంద్రుని చిత్తమున సంఘర్షము జరిగినది. మమకారము దూరమై సత్యనిష్ఠా కర్తవ్యము లే జయించినవి. కనుకనే భార్యాపుత్రులతో ఈశ్వర ప్రసాదలబ్ధ మహదైశ్వర్యము లను హరిశ్చంద్రుడనుభవింప గలిగెను. విశ్వామిత్ర కృతకష్టసముద్రము నుండి సత్యనిష్ఠా కర్తవ్యములను తెప్పవలన తరింప గలిగెను హరిశ్చంద్రుడు.

ఇట్లే 'కుశలవ' నాటకమున పౌరులలో బయలుదేరిన సీతాపవాదమును పోగొట్టు కొనుటకై శ్రీరాముడు సీతను త్యజించును. రామునకు సీతను వదలి పెట్టుట యనగా తననే త్యజించుట. అయినను ప్రజాశ్రేయస్సునకై రాముడు సీతను పరిత్యజించెను. రాముని మనస్సులో సీతా ప్రేమ, రాజుగా తానాచరింప వలసిన కర్తవ్యమునకు సంఘర్షము జరిగినది. కాని చివరికి సీత మహాపతివ్రత యని తెలిసికొని భార్యాపుత్రులతో సంతోషమున నుండును. ఇట్లు పై రెండు నాటకములలోని నాయకులలో చిత్త సంక్షోభ పరితాపము లుండుటచే విషాదాంశములు (Tragic Elements) గలవని చెప్పవలెను. సంస్కృతమునందలి "అభిజ్ఞాన శాకుంతలము, ఉత్తరరామ చరితము" నను వానిలోని దుష్యంత రాముల చిత్తములలోని భావ సంఘర్షము వంటిదే వీనిలోను గలదు.

ఇంక వధాత్మక నాటకములలో ఒకటైన బభ్రువాహనలో అర్జునుడు బభ్రువాహనునిచే వధింపబడి పునర్జీవితుడగును. ఇది సంస్కృతములోని 'నాగానందము' వంటిది కానిఅర్జునుడు గర్వపూరితుడై, శాపగ్రస్తుడై భార్యాపుత్రుల విస్మరించి మరణించి పునర్జీవితుడు కాగా జీమూతవాహనుడు పరోపకారార్థము ఆత్మత్యాగ మొనరించి పునర్జీవితుడయ్యెను. ఇంతే గాక తండ్రితో యుద్ధము చేయుటయా మానుటయా అను భావ సంఘర్షమునకు బభ్రువాహనుడు లోనైనట్లును నాటకమున స్పష్టము

'సుల్తానాచాందుబీ'లో అనేక మరణములు గలవు. అస్మన్‌బేగు, దాండియాగో, హమ్మీదుల వంటి దుష్టుల మరణ మెవరికిని శోకము నాపాదింపలేదు. వారికి తగిన శిక్ష పడినదని సంతసింతుము. కాని ప్రజాశ్రేయస్సుకు సర్వవేళల పాటు పడి శౌర్య సాహసముల నెరపిన 'చాందుబీ' హమ్మీదు చేపోడువబడి మరణించుట మాత్రము దుఃఖమున కాకరము. రాజు అబిస్సు, మేరీ, ఆల్మేడా మున్నగు ముఖ్యులు జీవించుటచే ముసలి రాణి మరణించినను 'ఫరవా' లేదని సమర్థించు కొందమన్నను శోకము మాత్రము వీడిపోలేదు. దీనిని వధాంత నాటకమనియే తలంపనగును. గాని విషాదాంత నాటకముగ పరిగణించుటకు వీలులేదు.

ఇంక 'శిలాదిత్య' ముఖపత్రముపై "SILADITYA - An Historical Tragedy" అని ముద్రింపబడినది. ఇది మోదాంతముగాను, విషాదాంతముగాను రెండు విధములుగ రచింపబడియుండుట గమనింపదగినది. 'శిలాదిత్య' వధానంతరము పార్థియన్లచే 'కళావతీమదను'ల వధతో ముగియునది విషాదాంతము. కళావతీమదనులు పశ్చాత్తప్తులై సన్మార్గులుగా మారి శిలాదిత్యుని పుత్రుడు గుహునకు పట్టాభిషేకము చేయుటతో నంతమగు నాటకము మోదాంతము. శిలాదిత్యునకు సూర్యుడు ప్రత్యక్షమై సాలగ్రామమునిచ్చి, సప్తాశ్వసరోవరము మలినము కానంతవరకు, సాలగ్రామమపహృతము కానంతవరకు శిలాదిత్యుడు రాజుగానుండుననియు, నవి పాడైనప్పుడు శిలాదిత్యుని మరణమని తెలిపియుండుటచే సప్తాశ్వసరోవరము మలినము చేయబడి, సాలగ్రామమపహృతము కాగా శిలాదిత్యుడు పార్థియన్లచే యుద్ధమున వధింపబడును. దీనివలన శోకము కలుగు నవకాశము లేదు. పైగా ఈ రాజు కార్యశూన్యుని వలె కన్పట్టును. ఇంక కళావతీమదనులు వారి దౌర్మార్గ్యమునకు వధింపబడుట యెంతయు తగిన శిక్ష. వారికై శోకించుటకు బదులు సామాజికులు సంతసింతురు. కనుక ఇదియు వధాంత నాటకమే గాని విషాదాంత నాటకము మాత్రము కాదు.

9.2.3. రావుగారి నాటకములలో 'రామరాజు చరిత్రము, పాదుకా పట్టాభిషేకము' ననునవి రెండును విషాదాంతము లనదగినవి కలవు. వీరి ప్రసిద్ధ నాటకము 'రామరాజు చరిత్రము'. ఇది విషాదభావసంభరితమై యొప్పుచున్నది. ఈ విషయమును గూర్చి రావుగారి పాత్రపోషణ చాతుర్యమును వివ

వించునప్పుడు పటాణిపాత్ర చిత్రణలో స్పష్టముగావించితిని. విషాద నాయకున (Tragic Hero) కుండవలసిన లక్షణములన్నియు పటాణికి కుదురుట వలన 'రామరాజు చరిత్ర' ముత్తమ విషాద నాటకము. కొందరు నటులు పటాణి రామరాజును యుద్ధమున వధించిన వెనుక పశ్చాత్తప్తుడై దానికి కారకురాలని తలంచి, ఆషాబీని చంపి, తా నాత్మహత్య గావించుకొని ప్రాణము వదలినట్లుగా రామరాజు చరిత్రమును ముగించి నటించిరట. కాని రావుగారి కది ఇష్టము లేదు. రామరాజు వధానంతరము పటాణి పశ్చాత్తప్తుడై ఆషాబీని గూడి జీవించుటయే వీరి యభిమతము. కనుకనే యిట్లు రావుగారినాటకమును సంక్షిప్తము గావించిరి. శ్రీనివాసరావుగారినాటకము నిట్లు ముగించినను, వీరికి గల ఆంగ్ల నాటకాతిమాత్రపు పరిచయముచే ఆంగ్ల విషాదరూపక ప్రభావము 'రామరాజు చరిత్రము'న పడి విషాదాంతనాటక లక్షణములన్నియు సమకూరినవని తలంపవలెను. కనుక నటులు ఈ నాటకమును మార్చినను మార్చకపోయినను విషాద నాటకలక్షణములిందిమిడియుండుటచే నిది విషాదాంతనాటకమనుటయే ఉచితము.

ఇంక 'పాదుకాపట్టాభిషేకము'నను ఈ విషాద భావము వెల్లివిరిసినవి. దశరథునిలో విషాద నాయకున కుండవలసిన లక్షణములన్నియు గలవు. దశరథునికి రామునిపై నమిత ప్రేమ. రాము నెడబాసి ఒక క్షణమైనను నుండ సహింపలేడు. కాని దుర్విధిచే నట్లే కలిగినది. రామ పట్టాభిషేకమునకు సర్వము సిద్ధమైనది. మంథర దుర్బోధచే కైక కోపగృహముచేరి యుండ దశరథుడు మాటాడింపబోవ రాముని పట్టాభిషేకము నిలిపి భరతునకు పట్టము గట్టుమని కైక కోరినపుడు 'నాతీ, నీవు మనఃపూర్వకముగ నిట్టి కోరికం గోరి యుండవని నాకు దోచెడు'నని దశరథుడంగీకరింపడు. కోపమున కైక పోయెద నని వెళ్ళుచుండ 'నీ యిష్టము వెళ్ళు' మని చింతించుచుండును. మరల కైక వచ్చి వివాహ సమయమున నుంకువగా నుంచిన తన రాజ్యమును రామున కిచ్చు నధికారము లేదని చెప్ప దశరథుడందు కంగీకరింపడు. శంబరాసురునితో కలిగిన యుద్ధమున తోడ్పడిన సమయమున దశరథుడు కైక కిచ్చిన వరము లను స్మరింపజేసి, భరత పట్టాభిషేకము, రామ వనవాసము నను రెండు వరములు కోరును. భరత పట్టమున కామోదించినను రామవనవాసమునకు దశరథుడు సమ్మతింపడు. ఆ విషయము విన్న వెంటనే మూర్ఛలో బడును.

"కైకా! రాముని వనమునకుఁబంపు కోరిక యొకటి మాని మతియెద్దియైన నడుగుము. రామునిపైఁ బగసాధింపకుము." అని దశరథుడు కైకను వేడుకొన్నాడు. చివరికి భరతుడు గిరివ్రజపురమునుండి వచ్చునంతవరకైన నాగుమని ప్రార్థించినాడు. ఆమె కఠినహృదయమైనది. ఆమెను దశరథుడు మిక్కిలి దూషించి పరిపరివిధములుగా చింతించుచు మూర్ఛపోయినాడు. రాముని పిలిపించి ఈ వార్త తెలుపకుమని కోరినాడు. రాముడు వచ్చి తండ్రికి నమస్కరింప ఈ ఘోరవార్త తెలుపుట కిచ్ఛగింపక ముఖము పై ముసుగు వైచుకొన్నాడు. అట్టిది అతని పుత్రప్రేమ. కైకను మిక్కిలినిందించినాడు. దశరథునిలో పుత్రప్రేమకును, భార్యకిచ్చిన వరముల నొసగుటచే సత్యనిష్ఠకు సంఘర్షము జరిగినది. ఈ విరుద్ధభావసంఘర్షమే యీతనిని విషాద నాయకునిగా చేయగలిగినది. రాము నరణ్యములకంపి పుత్రప్రేమను విస్మరించి రామవియోగమును భరింపలేడు. సత్యనిష్ఠ నాలోచించినచో వరములను కాదనుట కవకాశము లేదు. వరము లిచ్చుట కంగీకరించిన పుత్రవియోగము, అంగీకరింపనిచో సత్యదూరుడగును. ఈ స్థితిలోనేమియుచేయలేక డోలాందోళితమనస్కుడై మిక్కిలిగా చిత్తసంక్షోభపరితాపములకు గురియయ్యెను. రాముడరణ్యముల కేగిన వెనుక ద్వితీయాంకము ద్వితీయరంగమున దశరథుడు మిక్కిలి దురపిల్లినాడు. అతని హృద్గతరామప్రేమ స్పష్టమైనది. అందుచే రామునివియోగముచే పిచ్చెత్తి పలవరింప మొదలిడెను. రాముని తప్ప నితరము స్మరింపడు. కైకను మిక్కిలి నిందించెను. తరువాత మునిశాపము స్మరించి తనకది యవసానకాలమని విశ్వసించి పరిపరివిధముల పరితపించి రామవియోగముచే కలిగిన ఎనలేని దుఃఖముచే రామనామస్మరణముచే మరణించెను. ఇందు దశరథునిలోని విరుద్ధభావసంఘర్షము మూలమున దశరథుడు విషాదనాయకుఁడయ్యెను. మూలముననే దశరథ మరణము కలదు. కాని నాటకమున రావుగారీ పాత్రకు భావసంఘర్షమును ప్రవేశపెట్టి విషాద నాయకుని గావించిరి.

ఇందులో విధిప్రేరణమున మంథర, మంథరదుర్బోధచే కైక రామువనవాసమునకు తన్మూలమున దశరథమరణమునకు తోడ్పడిరి. కైక వ్యక్తితఃసన్మార్

వర్తన. అయినను మంథరా దుర్బోధవలన సవతియైన కౌసల్య అధిక్యము వహించుననియు, భర్త తనను విస్మరించె ననియు నెంచికైక రామపట్ట భంగమున కొప్పుకొనును. ఇది వాస్తవమున కామె కిష్టము లేదు. రాముడు వనవాసమున కేగిన తరువాత పుత్రవియోగానలమున దహింపబడి స్మారకమున లేని సమయమున కైక "ప్రాణేశ్వరా! నేను గడ పాపిని. నా నుండి యిన్ని విపత్తులు సంభవించెను. శతాపరాధిని. నన్ను క్షమింపు' మని దశరథుని వేడికొనినది. పశ్చాత్తప్తయైనది. కౌసల్య గూడ క్షమింపుమని కైక పక్షమున కోరినది. దశరథ మరణానంతరము (2-5) కైక తన గౌరవము పోగొట్టుకొనుటయే గాక భర్త నుండియు దూరమైతినని మంథరతో చెప్పి విలపించినది. భరతుడును తనను నిందించినప్పుడామె యవస్థ చెప్పనే యక్కర లేదు. ఇట్లామె తాను గావించిన పాపమునకు పశ్చాత్తప్తురాలై నట్లు రావుగారు చిత్రించిరి. ఈమెకోను భావ సంఘర్షమును వీరు చూపిరి. ఇట్లు శ్రీనివాసరావుగారు పాదుకా పట్టాభిషేకమును సైతము విషాద భావ సంభరితమై యొప్పునట్లు రచించిరి. పై రెండు నాటకములను రంగస్థలమున సందర్శించిన సామాజిక హృద్గత మాలిన్య పరిమార్జనము (catharsis or purgation) జరుగును. ఇది అరిస్టాటిల్ చెప్పిన విషాద నాటక లక్షణములలో ప్రధానమైనదిగదా!

## 9. 3 హాస్యము :

మానవ జీవితమున హాస్యమునకు ప్రాధాన్యము గలదు. హాస్యశీలి సర్వావస్థలను విస్మరించి సుఖముగా జీవింప గలడు. కాని అది సందర్భోచితమై యుండిన రమణీయముగ నుండును. మితిమీరిన వెగటు బుట్టించును; అసహ్యము గొల్పును. అందుకే 'అతి సర్వత్ర వర్జయే' త్నన్నారు పెద్దలు! కనుక ఉచితమైన హాస్యము సర్వత్ర సర్వధా మనోహరముగ నుండును. ఇట్టి హాస్యమునకు తెలుగులోనే గాదు సంస్కృత వాఙ్మయమునను ప్రయోగము మిక్కిలి తక్కువ. సంస్కృత వాఙ్మయమున హాస్య ప్రయోగము నవకాశము లేకుండుటకుగల హేతువులను శ్రీమునిమాణిక్యం నరసింహారావు గారిట్లూహించిరి "హాస్యానికి ఆ రోజులలో ఆదరణలేదు. హాస్య శీలుణ్ణి నట విట విదూషకాదిగా

గల పాత్రలతో కలిపి కూర్చోబెట్టినారు. అటువంటి వారివి అప్రాం క్తేయములుగా పరిగణించారు. సంఘంలో హాస్యశీలుడు అంత నీచంగా చూడబడుతూ ఉంటే చూస్తూ చూస్తూ మర్యాదగల ఏ కవి హాస్య రచనలు చేయడానికి సాహసిస్తాడు?"[1]

సంస్కృత నాటకములలో హాస్య ప్రయోగమున్నను అది విదూషకాదులకు పరిమితమై యుండుటచే నంతగా నుత్తమ హాస్యము కాదు. ఆధునిక కవులు నాటక కర్తలు తెలుగులో హాస్యమున కొకింత యవకాశమును గల్పించి యుండుట సంతోషింపదగిన విషయము. శ్రీనివాసరావుగారును తమ నాటకములందవకాశమును గల్పించుకొని సందర్భోచితమైన హాస్యమును ప్రయోగించిరి.

భరతముని హాస్యము నొక రసముగా జెప్పి యుండుట గమనింప దగిన విషయము హాస్యము 'హాస' మను స్థాయిభావము నుండి కలుగును. ఇది ఆత్మస్థపరస్థ భేదములచే రెండు విధములు. హాసము, స్మితము, హసితము, విహసితము, ఉపహసితము, అతిహసితము నని ఆరు విధములు[2]. సాహిత్య దర్పణమున వికృతమైన ఆకార వాగ్వేష చేష్టలతో కూడిన నటుల వలన హాస్యముత్పన్నమగునని చెప్పబడినది.[3] ఇందాకార వేషముల కంటె చేష్ట, దాని కంటె వాక్సంబంధియైన హాస్య ముత్తమము. అనగా బాహిరమైన వానికంటె ఆంతరికమైన వాగ్గతహాస్యము శ్రేష్ఠమైనది. ఈ వాగ్గత హాస్యమును మునిమాణిక్యం నరసింహారావుగారు పలు విధములుగ వివరించిరి.[4] ఆంగ్లమున Humor and wit అనునవి రెండు విధములుగగలవు.[5] ఆంగ్ల వాఙ్మయమున హాస్యమునకత్యంత ప్రాధాన్య ప్రాచుర్యములుగలవు.

శ్రీనివాసరావు గారు కాళిదాసు, సునందనీపరిణయము, సుఖమంజరీ పరిణయము సీమంతిని. 'సుల్తానా చాందుబీ, శిలాదిత్య, మైసూరు రాజ్యాభి

---

1. 51. పు. 816, 817. 2. 45. పు, 204, 205.
3. వికృతాకారవాగ్వేష చేష్టాదేః కుహకాద్భవేత్,
హాస్యోహాసస్థాయిభావః' 151 తృతీయపరిచ్ఛేదే 214,
4. 51. పు. 49-53. 5. 15. పు. 27-29

వృద్ధి, బ్రహ్మవాహన, మానాపమానము నను నాటకములలో కొంచె మధికమగను రామరాజు చరిత్రము, సత్యహరిశ్చంద్రీయము, ప్రహ్లాద, శ్రీరామజననము, ద్రౌపదీ వస్త్రాపహరణము, కీచకవధ అను నాటకములందెడ నెడహాస్యమునకు చోరవ గలిగించిరి. నాచిపార్టి, అన్యాయధన్యపురి మహిమ, ఆదారమ్మన ప్రహసనవునను మూడు ప్రహసనములలో అధిక్షేపాత్మక హాస్యము (Satirical Humour) ప్రయోగించిరి.

9.3.1 హాస్యముచితమై, సందర్భానుగుణమై యొప్పుచెంతయు నవరసము. నాటకము రంగ ప్రయోగయోగ్యమైనది గనుక నాటక కర్త బహుజా గురూకుడై హాస్యమును ప్రయోగింప వలెను. అందుకే రావుగారు నాటక కర్తల నుద్దేశించి 'Let the Dramas be scholarly, noble in pathos, passion and humour. Let the wit be of the finest quality.'[1] అనినుడివి యున్నారు.

శ్రీనివాసరావుగారు చాల గంభీర స్వభావులు. గంభీర స్వభావము గల రావు గారు ప్రదర్శించిన హాస్యము గూడ గాంభీర్యముతో నొప్పారు చుండును. అనగా నుదాత్తమైయుండును రావుగారి ఒకటి రెండు నాటకములలో సంస్కృత నాటకములందలి విదూషకుని వంటి పాత్రలు గలవు. సుల్తానా చాందుబీ నాటకమున ప్రస్తావనలో నటితో నప్రస్తుత ప్రశంస చేసి సూత్రధారునకు భయపడి అస్మన్‌బేగు నాశ్రయించి విప్రవినోదిగా నుండిన రఘునాథుడను వాడు గలడు. కాని ఈ రఘునాథునకు సంస్కృత నాటక విదూషకునకు నెక్కడ పోలికలు లేవు. వీని మూలమున రెండు మూడు తడవలు హాస్యము ప్రదర్శితమైనది. ప్రస్తావనలో నటితో సంభాషణ సాగించినప్పుడు, అస్మన్‌బేగు నాజ్ఞతో జోరియా వేషము ధరించినప్పుడు, ముల్లావేషముతో చాందుబీ యాస్థానమున ప్రత్యక్షమైనప్పుడు హాస్యము గలదు. సుఖమంజరి పరిణయము నందు ప్రద్యుమ్ననకు సంజయుడను నర్మసచివుడు గలడు. ప్రణయమున నాయకునకు తోడ్పడుటయు కొంత వరకు గలదు. కాని వీని యందసత్ప్రలాపములు, వెఱ్ఱిమొఱ్ఱి చేష్టలు

1. 157. Rules పు. 8.

గన్పట్టపు. సుఖమంజరి పేరు జెప్పుమని సంజయుడు ప్రద్యుమ్ను నడుగ నత దేవేవియో జెప్పిన సందర్భమున కొంత హాస్యముగలదు. ఈ సుఖమంజరీ పరిణయము నందే విషయసేనుని నర్మసఖులు సాయనమాయనల అసత్ప్రలాపములలో హాస్యమున్నది. ఈ రెండు నాటకములలో దప్ప, నింకను కొన్నిట నర్మసచివులున్నను వారు హాస్యమున కుపకరింపలేదు. కనుక శ్రీనివాసరావుగారు హాస్యము కొరకు విదూషకులను సంస్కృత నాటకములలో వలె ప్రవేశపెట్టలేదు. హాస్యమున కుపకరించిన పై పాత్రలు కథా సన్నివేశములతో నతికియుండుట గమనింపదగిన విషయము.

9.3.2 శ్రీనవాసరావుగారు హాస్య ప్రతిపాదకమునకై కొన్ని సన్నివేశములను గల్పించిరి. ఇవి సందర్భోచితములై కథాశరీరమున నెంతయు నావశ్యకమై యొప్పుచుండును. కాళిదాసులో ఉపాధ్యాయుడు, మంత్రియు కలిసి మదన సేనకొరకు వరునిగా డంబర వానిని తీసికొని వచ్చు సన్నివేశము (2-8), ముంజరాజు పిచ్చివాడై వీరయోగిని కలిసికొని యోగిచే పిచ్చి వదలించుకొన్న సన్నివేశము (1-4) విద్యా సర్వస్వవేదినీ గృహమున కాళిదాసునకు జరిగిన పరీక్షాసన్నివేశము (4-1) హాస్యమునకు మిక్కిలి ఉపకరించినవి. వీనిలో డంబరవానియు, పిచ్చివానియు సంభాషణములు, గ్రామ్య, మౌర్ఖ్యములతో మతిభ్రమణముతో నుండి హాస్యరసముత్పన్నమై సామాజికులను కడుపుబ్బ నవ్వింపగలుగుచున్నవి. సుల్తానా చాందుబీలో అస్మన్‌బేగు ఖాజీలను భిలిపించి, జోరియాను వివాహమాడ దలచిన సన్నివేశము (3-6), డాండియాగో చెరనుండి తప్పించుకొని పోవు సన్నివేశము (4-౭), రామరాజు చరిత్రమున సంగీత పాత్రకునకు బహ్మనీ సుల్తానులు బహుమతి ప్రదానము చేయు సన్నివేశము (8-2), కోషటి కోడిగ్రుడ్డంతటి వజ్రము నిప్పింపుమని బహ్మనీ సుల్తానుల నడుగు సందర్భము (5-4), శిలాదిత్య (2-1) ప్రహ్లాద (8-8) లలో బడిపిల్లల సంభాషణములు హాస్యమునకై యుపయుక్తములైనవి. ఇంకను నితర నాటకములలోను నిట్టి సన్నివేశగతమైన హాస్యముగలదు.

9.3 3 పాత్రల వికృతాకార వేషముల వలన హాస్యముత్పన్నమగుట ప్రసిద్ధమే. రావుగారిట్టి హాస్యమును గూడ ప్రదర్శించిరి. "సుల్తానా చాందుబీ"లో మహమ్మదీయాచారము ప్రకారము వివాహ సమయమున పిల్ల పక్షమున నెవ

రును లేనప్పుడు కన్యయే ఖాజీల యెదుట నిలిచి వివాహమున కంగీకరించినట్లు నుడువవలెను. అస్మన్ బేగు తనపై నిష్టములేని జోరియాను బలాత్కారముగ వివాహమాడదలచి, యామెను సభలోనికి ప్రవేశపెట్టిన తన గుట్టు బయటపడు నని యెంచి రఘునాధుడను విప్రవినోదికి మహమ్మదీయ స్త్రీలకువలె ముసుగు వేయించి సభలోనికి రప్పించును. ముల్లాలు వేయు ప్రశ్నలకు రఘునాధుడు తడబడి ముసుగు తీయవలసినదని వారుబలవంతము చేయగా రహస్యము బయట పడినప్పుడు వాని వికృతాకార వేషములచే హాస్యముత్పన్నమైనది. ఇట్లే ముల్లా వేషము ధరించిన రఘునాధుడు చాందుబీ ఆస్థానమున ప్రత్యక్షమై మహమ్మ దీయులకువలె నుండి గడ్డమూడదీసినన్ని వేళమున నిట్టి హాస్యము గలదు. మైసూరు రాజ్యాభివద్ధి'లో కృష్ణరాయడు సుబ్బాసాని వేషమున మార నాయకుని జంపు నప్పుడును, 'కుశలవ'లో శూర్పణఖ చాకలి యవ్వగా వ్యవహరించి చాకలి రంగని వ్యవహారము వికటింప జేయుసప్పుడును వేషగత హాస్యమున్నది. ఇంతే గాక 'కాళిదాసు లో (4-1) విద్యాసర్వస్వవేదినీ గృహమున కాళిదాసును పరీ క్షింప వచ్చిన ఏకాక్షి, వికలహస్తుడు, పంగువునమ వారి యాకారములచే నిట్టి హాస్య మభిగమ్యమాన మగుచున్నది.

934 వికృత చేష్టలచేత అభివ్యక్తమగు హాస్యము పై వాని కంటె నుత్తమము. ఇట్టి హాస్యమునకును రావుగారి నాటకములలో నుదాహరణములు గలవు 'సునందనీ పరిణయము'న సన్న్యాసి వేషమున సునందని వచ్చి ఉగ్ర సేనుని యుత్తరము వలన సుమతి దౌష్ట్యమును బయటపెట్టునపుడు సుమతి గజ గజ వణకుచు, కన్నీరు గార్చును, నోట తడిలేక మాటరాక చప్పరించుచు రాజు నుద్దేశించి "ప్ర...ప్ర...ప్ర..." అనుచు, మ్రింగుచు, ముఖము తేలవైచి, రిచ్చవడి తూలుచున్న సమయమున వికృతచేష్టాగతమైన హాస్యము గలదు. ఇట్లే పిచ్చి కుబేరుడెవరు కన్పట్టినను 'సునందనీ' యని కౌగలించుకొనబోవు సందర్భ ములలోను చేష్టాగతమైన హాస్యమున్నది. "రామరాజు చరిత్రము"న సలకం తిమ్మయ్య ప్రేరణచే సుబ్బోజి బాలుడైన రాజునకు మందిచ్చిన కారణముచే సామంతుల యెదుట తన తప్పిదము నొప్పుకొను పట్టున నతని వికృతచేష్టలలో హాస్యముత్పన్న మగును. ఇట్లే 'కాళిదాసు'లో పిచ్చివాడైన ముంజునిచేష్టలు, డంబరవాని చేష్టలు హాస్యమున కెంతయు నుపకరించునవి. "బభ్రువాహన"లో

అర్జునుని సేన నుండి ప్రమీలా సఖులు ఆయుధములు గ్రహించి, మార సంగర మునకు రమ్మని లాగునప్పుడు వారి చేష్టలలో నిట్టిహాస్యమున్నది.

9.8.5 పై హాస్య భేదముల కంటె వాగ్గత హాస్యము మిక్కిలి యుదాత్తమైనది. ఇది మూడు విధములు. శబ్దాశ్రయ హాస్యమునకు: "సీమంతిని"లో సీమంతినీ వివాహ సందర్భమున పండితులకు బహుమతుల నొసగు నప్పుడు విద్యరాని భట్టు ఒసగిన సమాధానమున 'మాటలు వచ్చును. తిండి తినుటకు వచ్చును. నిద్రవచ్చును. కోపము వచ్చునని వెంటనే చెప్పితినండి! చిత్రవర్మ మహాప్రభువు ఫక్కుననవ్వి బాగుగా పరీక్షయిచ్చితిరి. వలసినంత ధనముఁగొని పొండని ధనరాశిఁ జూపెనండీ, మహాప్రభువతడు" అను మాటలలో నిట్టి హాస్య మున్నది.

భావాశ్రయ హాస్యమునకు : "సత్యహరిశ్చంద్రీయము''న మతంగకన్యలను నక్షత్రకుడు కోరినప్పటి వారి సంభాషణలో నిట్టి హాస్యముగలదు.

2వ మతంగకన్య : స్వామీ! మా సౌభాగ్యము మీ యాశీర్వాద ఫలము గదా ?

నక్షత్రకుడు : నిజము మిమ్ము నాశీర్వదించుచు మీకు సౌభాగ్యము హెచ్చు జేసితిని. నేను దారిద్ర్యము దెచ్చికొంటిని.

1వ మతంగ : స్వామీ! ద్విజులకు దారిద్ర్యమనఁగా నేమి?

నక్షత్రక : ఓహో! ఉపనయనము నాటి మాటయున్నది. కావున భిక్షమెత్తుకొని బ్రతుకవచ్చునని కదా నీతలంపు. ఔరా? తల పొగరు? నన్నా మీరు హాస్యము జేయునది?''- ఇందు నక్షత్రకుని మాటలలో భావాశ్రయ హాస్యము గలదు.

"సీమంతిని"లో ఈశ్వరభట్టు తపము నుండి విముఖునిజేయ నింద్రాదేశమునే వచ్చిన రంభోర్వశులు విఫలులై పార్వతీ వరప్రసాదుడైన ఈశ్వర భట్టుమ గాంచి ఇంద్రునుద్దేశించి రంభ "అక్కా! మనతేడెంత భయగ్రస్తుఁడే? తన పదవి నెవరపహరింతురో యని ముక్కుఁబట్టుకొని గూర్చున్నవారి నెల్ల రనుం గని వెఱచుచుండును. కంటివే యీ ద్విజుండొక రాజతనయ సౌభాగ్యం

బునకై తపించుచుండెను.''అని యూర్వశితో పలికిన పల్కులలో నిట్టి హాస్యము గలదు

'కీచకవధ'లో కీచక వలలుల మాటలలోనిట్టిభావాశ్రయ హాస్యము చిప్పిలు చున్నది'వలలుడు:-కీచకా!అట్టివాడవు నీవు కావుననే నిన్ను నీవు పొగడుకొందువు. నను(బోలు ఆడుదాని నీ పుడమిని యెపుడైన గంటివేమొ తెలుపు. నన్నితర స్త్రీలతో( బోల్పక నీ శరీరము నా శరీరముతో జేరి నప్పుడే నీకు శాశ్వతమగు స్వర్గానందంబు గలుగును. కీచకా! దూరమ్మున నిలిచితివేల? సరసకు రమ్ము. కేలం దిమ్ము

కీచకుడు:- సైరంధ్రీ! మన మీరీతి యన్యోన్యస్తోత్రపాతకులగుచు ప్రొద్దుపుచ్చనేల? శయ్యాసుఖంబనుభవించు సమయంబిది, రమ్ము. (అనుచు ముందరికిం బోయి వలలునిపై కేలిడి) (స్వగతము) ఏమీ! నాడు దీనినంటినపుడు దీని దేహము కుసుమకోమలత నొప్పుచుండెను. ఇపుడెంత కఠినత వహించినది. నేను దాని యెదపై చేయిడితికాబోలు. దీని యెద పాషాణముకంటెను కఠినము కాబోలు (అనుచు మరల సమీపించి ముసుగు దీయును...)" ఇందు నాటకీయ వ్యంగ్యముతోగూడిన హాస్యము గలదు. ఇట్టి భావాశ్రయహాస్యమున కెన్నియేని యుదాహరణముల జూప వీలగును.

అర్థాశ్రయ హాస్యమునకు : 'సత్యహరిశ్చంద్రీయము'న నక్షత్రకుడు మతంగ కన్యలతో "...ఇదిగో చూడుడి. నా యిష్టార్థము నెఱపితిరేని మీకు( గార్యసిద్ధియగు. అటుచేయలేని మీకు( ఇక్కట(గ దేహశుద్ధియగు. ముఖప్రక్షాళన మగు. అర్ధచంద్ర ప్రయోగంబగు". "రాజదండనప్రాప్తిరస్తు" అని పలుకుటలో నిట్టి యర్థాశ్రయ హాస్యము గలదు. ఇట్లే 'సుఖమంజరీ పరిణయము' ప్రస్తావనలో సూత్రధారుడు నటితో 'ప్రొద్దయ్యెడిని, వైశంబేపోయి పాత్రాయత్తంబు సేయుమా?' అనగానే విదూషకుడు "హా! హా! భోజనంబునకా?" యనుటలోను నిట్టి హాస్య మున్నది.

ఈ యర్థాశ్రయము శక్తిమూలము, ఉక్తిమూలము నని రెండువిధములు. శక్తిమూలక హాస్యమున అనేక భేదములు గలవు. దీనిలోని అపహసిత హాస్యమునకు : ఒకరు మరొకరిని పరిహాసము గావించుట: 'ద్రౌపదీవస్త్రాపహరణము'

నంచు రుక్మిణి సుభద్రను మాయాసన్న్యాసి యైన అర్జునుని యెదుట పరిహసించుటలో గలదు. 'సుఖమంజరీ పరిణయము' ప్రస్తావనలో నటి రాకయున్నదే యని సూత్రధారుడడుగ విదూషకుడు "శిల్పిచే మొగంబు దిద్దించుకొనుచునో, లేక చాకలిచే శరీరముతికించుకొనుచునో యుండవచ్చు' ననుటలో హేళనాత్మకమైన హాస్యము గలదు. 'సీమంతిని' లో అం. 2. రం. 5. నను, అం. 4. రం. 1 నను బ్రాహ్మణుల భోజనప్రియత్వమును, పెండ్లిపీటలపైని దంపతులకు హారతి ఇచ్చునపుడు పాటలు పాడకపోయినను దక్షిణమాత్ర మెక్కువగా కోరు వారి పద్ధతిని శ్రీనివాసరావుగారధిక్షేపించిరి. ఈ సన్నివేశములలో నాటి ఆచార వ్యవహారములను గూర్చి యధిక్షేపాత్మక హాస్యము (Satirical Humour) ను ప్రదర్శించిరి. ఇట్లే వీరి ప్రహసనములలోను నాటి సాంఘిక స్థితిగతుల నుద్దేశించి అధిక్షేపించి హాస్యము నుత్పన్నము గావించిరి. ఇట్లే నాటకీయవ్యంగ్యము (Dramatic Irony) తో కలిసి హాస్యముండును. ఈ విషయము నాటకీయ వ్యంగ్యమును గూర్చి చెప్పినప్పుడు వివరించితిని.

శక్తిమూలకమునందే మరొక భేదమైన అభిభాషణము: దీనితో నాత్మోత్కర్షాపకర్షములుండును. 'మానాపమానము'న లక్ష్మీధరుడు తనను గూర్చి, సంపదను గూర్చి ప్రశంసించుకొనుటలో నిట్టి హాస్యము గలదు.

అర్థాశ్రయ హాస్యమున మరొకటి ఉక్తిమూలకము. ఇది సరసోక్తి ఛలోక్తి, నర్మోక్తి మొదలైన యనేక భేదములతో గలదు. కాళిదాసులో విద్యాసర్వస్వవేదినీ గృహమున కాళిదాసును పరీక్షించు సన్నివేశమున నిట్టి యన్ని విధములైన ఉక్తిమూలక హాస్యము గలదు. వేశ్యాత్రయమునకు కాళిదాసునకు కలిగిన సంభాషణలో భూదార, జారదార, విద్యాజార పదములలో ఛలోక్తితో కూడిన హాస్యమున్నది. ఒక ముసలిది సుతాసుతులతో వచ్చి కాళిదాసే తన భర్త యనునప్పుడు సరసోక్తియుత హాస్యము; వర్తకులు, వికలాంగులు మొదలైనవారి మాటలలో నితరమైన ఉక్తులతో గలిసి హాస్యము గలదు. 'సుఖమంజరి పరిణయము'న సీత సుఖమంజరి నుద్దేశించి "తరుణీ! ఈ తరునికరాంధకారంబు నీ కురులకాంతిచే దట్టంబయ్యె మార్గంబు గానరా" దను వాక్యమున నతిశయోక్తితో గూడిన హాస్యమున్నది. ఇట్లనేకవిధములుగ శ్రీనివాసరావుగారు హాస్యమును ప్రదర్శించిరి. ఈ ఉక్తిమూలక హాస్యమున

ఆంగ్లమునందలి 'wit' అమనదిగూడ గతార్థమైనది. అనగా రావుగారు భారతీయ పాశ్చాత్య సాహిత్యములలో గల హాస్యపద్ధతుల నన్నింటిని ప్రయోగించిరనుట సువిదితము.

9.3.6. మరొకవిధమైన హాస్యమును రావుగారు ప్రదర్శించిరి. పాత్రల శీలములలోను, స్వభావములలోను పూర్వపర వైరుద్ధ్యముండినచో హాస్యముత్పన్న మగును. 'సునందనీ పరిణయము'న ప్రతాపుడు మంత్రి సుమతి దౌష్ట్యమును గుర్తింపక సకలసద్గుణుడని ప్రశంసించుటలో సుమతి శీలమునందలి వైరుద్ధ్య ముచే హాస్య ముత్పన్న మగుచున్నది. 'సుల్తానా చాందుబీ'లో డాండియాగో తన దౌష్ట్యమును కప్పిపుచ్చుచు మేరీతో సన్మార్గునివలె మాటాడుటలో నిర్దిష్ట హాస్య మున్నది, కాళిదాసులో మదనసేనను బలాత్కరింపబోయి విఫలుడై విక్రమ రాజు రాగా నతనితో ఉపాధ్యాయుడసత్యమును బలికి సన్మార్గుని వలె నటించుట లోను శీలసంబంధమై వైరుద్ధ్యముతోగూడిన హాస్యము ప్రకటితమైనది. 'సునందనీ పరిణయము'నందు సునందని రాత్రి కలగాంచి, కలలో వరుని గూడి ఆనందించిన దట. అప్పుడే ప్రవేశించిన జయమాలిని సునందనితో తెల్లవారినను శయ్యాగృహ మెందుకు వెడలిరాలేదని, రాత్రి నిద్రమానితివేల యనియు, శరీరస్థితి యొకవిధ ముగ నున్నదేమి యనియు ప్రశ్నింప తన నిజస్థితిని గప్పిపుచ్చుటకై సునందని యత్నించు సమయమున భావవిరుద్ధమైన మాటలచే హాస్యముత్పన్నమైనది. ఇట్లే హాస్యము పలువిధముల పరిపోషింపబడినది.

## 9.4 ఔచిత్య నిర్వహణ చణత్వము :

ఇక చివరి యంశము ఔచిత్యము. శ్రీనివాసరావుగారు తమ నాటకములం దెట్లు ఔచిత్యమును నిర్వహించి తమ సామర్థ్యమును ప్రకటించిరో చూచుట అవ సరము. దానితో వీరిలో గల నాటకకర్త కవసరమైన పరిపూర్ణజ్ఞానము స్పష్ట మగును.

ఔచిత్య మెందైనను అత్యావశ్యకమనుటలో విప్రతిపత్తి ఉండరాదు. సర్వోత్తమ కళా జగత్తయిన సాహిత్యమున ఔచిత్యమున కెంతయు ప్రాధాన్య మవసరము. కనుక ఔచితీ సహితమైన కావ్యమే శ్రేష్ఠమైనది. అందునను కావ్య

ములలో రమ్యమైనదియు, రసనిష్యందియైనదియునైన నాటకమున ఔచిత్య పాలనము అపరిహార్యమైన గుణము.

దేనికేది తగియుండునో అది ఉచితము. ఉచిత భావమే ఔచిత్య'మని క్షేమేంద్రుడు వివరించెను. ఈ ఔచిత్యము పదవాక్యగుణాలంకార రసక్రియాదులందుండును. అనౌచిత్యము కంటె వేరు రసభంగకారణములేదని ఆనందవర్ధనుడు తెలిపెను.[1] ఇట్లు ఔచిత్యమునకు సంస్కృత లాక్షణికులచే నధిక ప్రాధాన్యమీబడినది. కనుక నాటకము అందీ ఔచిత్యమును పాటించిననే సహృదయావర్జకములై ప్రసిద్ధి శాశ్వతత్వములను సిద్ధింపజేసికొనును.

9.4.1 శ్రీనివాసరావుగారు నాటకముల నన్నిటిని ఔచిత్య సహితముగ రచించి యుండుటను రావుగారి ఇతివృత్త నిర్మాణ దక్షత మొదలగు నంశములను వివరించునపుడు క్రమముగా నాయా సందర్భములందు సూచించియే ఉన్నాను. ఇతివృత్త స్వీకారములందే రావుగారి ఔచిత్యజ్ఞానము స్పష్టమైనది. వానిని గ్రహించుటయే గాదు. నాటకోచితముగా జేసియుండుట గమనించియే యున్నాము, ప్రదర్శనానుకూలమైన ప్రహ్లాద కథను ప్రదర్శన యోగ్యముగా రచించుటయు నిందుకుదాహరణమగును. ఇట్లే శ్రవ్యకావ్యమునకు తగిన సీతా కళ్యాణము వంటి విషయమును గూడ నాటకముగా రచించి యుండుటయు, అందనౌచిత్యమున కవకాశమీకుండుటయు ప్రశంసార్హము. అనౌచిత్యముతో కూడియుండుటచేతనే తారాశశాంకము, బిల్హణీయము, కుమార రామచరిత్రము, సారంగధర చరిత్రము లను నాటకములుగ రచింప కూడదని వీరి ప్రగాఢవిశ్వాసము. అట్లే ద్రౌపదీవస్త్రాపహరణము విషయమునను తలంచియు వస్త్రాపహరణ సమయమున ఔచితీమహితముగా నాటకమును నిర్వహించిరి. వీరు నాటకములందు భారతీయ పాశ్చాత్య నాటక లక్షణములవసర రీతిని ప్రయోగించుట చూడ ప్రాత క్రొత్తల మేలి కలయిక గ్రహించుటే గాక యనౌచిత్యమున కెచటను చోటీ లేదనుట విశదమగును.

---

1. అనౌచిత్యా దృతేనాన్యత్ రసభంగస్య కారణమ్।
ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపనిషత్పరా॥ ధ్వన్యాలోకము III-15.

9.4.2 పాత్రపోషణలోను ఔచిత్యమును నిర్వహించిరి. అవసరమైన పాత్రల శీలస్వభావములను సముచితముగా మార్పుటయు గలదు, భారత యుద్ధమున ధర్మరాజు చేత అబద్ధమాడించుట యుచితిముగాదని యెంచి ఘటోత్కచుని చేత పలికింప జేయుటయు, కైకా మంధరలు స్వతః దుర్వినీతలు కారనుటకు ఉచితమైన యట్లాపాత్రల శీల స్వభావాదులను వర్ణించుటయు నుదాహరణములు కాగలవు. భారత నారీ శీల స్వభావములలో గాని, భారతీయ పౌరుషమున గాని యనౌచిత్యము రానట్లు పాత్ర పోషణ గావించిరి. ఇట్లనేక విధముల పాత్రల శీల స్వభావముల నుచిత రీతిని పోషించిరి.

9.4 3 సన్నివేశములను కల్పించుటలోనునెట్టి యనౌచిత్యమునకు నవకాశమీ లేదు. ఏ సన్నివేశమును గ్రహించినను దీనికుదాహరణమే యగును. మచ్చునకు సీమంతినీ నాటకమున సామవంత సుమేధులు నిజమైన సామవతీ సుమేధులను దంపతులుగా వర్తించుటలో (4-5) నౌచిత్యమున్నది. సీమంతిని వారి నను మానించియు పార్వతీ పరమేశ్వరులుగా నర్పించినది, ఆమె పాతివ్రత్య మాహాత్మ్యమువంతుడు నిజమైన స్త్రీగా మారిపోవును. ఆమె సిగ్గుతో గావించిన శృంగార చేష్టలెంతయు నౌచిత్య స్ఫోరకములనుటకు సహృదయ హృదయముతే సాక్షి. సుమేధునిపై తనకు గల మోహము నిట్లు స్పష్టము చేసినది.

ఉ॥ సగ్గిస ముగ్గిసల్పడుచు శారిక కోరిక లీరి కెత్తఁ దా
సిగ్గటి భర్తమం గలసి సేదల్సగ్గుచు నిగ్గులాడుచున్
లగ్గులు గాంచు రీతిఁగని లాలన సేయుమ నన్నుఁబ్రోవుమా
యగ్గలమయ్యె నంగజుని యచ్చలమిత్తఱిసైఁప నేర్తునే॥

అని వేడుకొనగా నతడంగీకరింపకపోగా

"సీ. అలనాఁడు వాయన మందిన తరి నుండి
నిజమగు నెలఁతనై నెగడు దాన,
గుట్టుఁ దాఁపఁగఁ జూచి పట్టఁగ లేనైతి
నంగజు నలజడి యధికమయ్యె,
అఅమఱ వలఁదిక నరయుమా నను నీవు

నఱిగొలు యించుక యైన వలదు,
కబరీభరమ్మును గను విచ్చి కనుగొమ్మ
పుట్టి నట్టిదొ గాక పెట్టినదియొ,
తే. గీ. మొగము కనుఁగవ మెడ నడుములను గనుము
నమ్మకున్నను నీ కెద్ది నమ్మికయగు
నట్టి యనువుల నరయుచు దిట్టవగుము
కాని విడనాడ నోపను గంతుదాడి."

అని తన నిజ స్థితిని స్పష్టముచేసినది. ఈ సందర్భమెంతయు ఔచితీ సహితమై యొప్పారు చున్నది ఇందుకు రావుగారి నెంత ప్రశంసించినను తీరదు. రావు గారు గాక యితర నాటక కర్తయైనచో అనౌచిత్యము పాలుచేసి యుండును. ఇట్టి సన్నివేశముల కెన్నియేని యుదాహరణములీ నగును.

9.4.4 సంభాషణ లెంతయు సుచితములై రావుగారి నాటకములందు గలవని ముందే విశదమైనవి.

9.4.5 పద్యములు, పాటలునుచిత రీతిని ప్రయోగించుటగూడ ముందే స్పష్టముగ తెలిసినది. రావుగారు పాటలలో తమ నామమును జేర్చి రచింపలేదు. 'ప్రహ్లాద' (2-8) లో లీలావతి పాడిన "శ్రీనివాసునీ చిత్త మందునా చింతన జేయుచు గంతులు వేయుచు "రారా" అను పాటలో 'శ్రీనివాసునీ' అను పదము న్నను భగవంతునకు నన్వయించును. కనుక నిచట అనౌచిత్యమున కవకాశము లేదు. ధర్మవరంవారు తమపేరు ప్రయోగించుట ఉచితము కాదని యొక విమర్శ కలదు.[1]

9.4.6 వేదం వారు ప్రయోగించిన పాత్రోచిత భాష వంటి దానిపై రావుగారి కిష్టము లేదని ముందే స్పష్టమైనది. కాని వీరు మరొక విధముగ పాత్రోచితముగా భాషను వాడియే యున్నారని తలంపవలెను. ఉన్నత పదస్థులైన రాజామాత్య పండితులకు, విద్యావంతులకు తగిన రీతిని భాషను ప్రయో

---

1. 46. పు. 96, 97.

గించిరి. పిల్లలకు, స్త్రీలకు, పిచ్చివారికి, ఉన్మాదుల కుచితమైన పద్ధతిలో భాషను వాడిరి. దొంగలు, డంబరవాని వంటి పామరులకు జాతి కనుగుణమైన భాషనే ప్రయోగించిరి. బుక్కశర్మంగునకు, వేశ్యలకు తగిన భాషా ప్రయోగము గావించి ఔచిత్యమును పోషించిరి.

9.4.7 రసభావములకు విరుద్ధముగ, కథాసరణికి విఘాతముగా రావు గారు నీతిని బోధింప యత్నింపలేదు. రసౌచిత్యముతో పాటు వీరు నీతిబోధ గావించినట్లు ముందే విశదీకరింపబడినది.

9.4.8 హాస్య ప్రదర్శనమునను రావుగారు ఔచిత్యమును పాటించి యుండుటయు తెలిసినది.

సాంఘిక పరిస్థితులను కథతో నతికి నట్లుగా వివరించియుండుటలో వీరి ఔచిత్య పరిజ్ఞాన మవగతమగును. సాంఘికాశయములున్నను వాని నుచిత రీతిని ప్రదర్శింపవలెనే గాని అతుకులగంతగా తయారు చేయగూడదు. కనుక రావుగారు వీనిని యితరులవలె అస్థానపతితములుచే యలేదు. ధర్మవరంవారు 'Anachronism' అనుదోషమును గావించరని యొక విమర్శకలదు.[1] ఇంక వీరు నాటకములను ప్రదర్శన యోగ్యముగా రచించుటలోను ఔచిత్యమును నిర్వహించిరి.

9.4.9 గ్రామ్యములైన ఆలింగన చుంబనాదులను రంగమున చూపరాదని సంస్కృత లాక్షణిక మతము. తదనుసారులైన రావుగారు తమ నాటకములందు వీనిని పూర్తిగా త్యజించి ఔచిత్యమును పాటించిరి. అంతే గాదు. "Let not the dramatist exhibit on the stage actual kissing, actual embracing and any other thing of that sort. These may be love parts in a private room, but not in public, especially among the Hindus"[2] అని రావుగారు కంఠోక్తిగా బలికి యున్నారు. కాని ధర్మవరంవారు బాహాటముగా వీనిని ప్రయోగించియుండుట ప్రసిద్ధమే.

---

1. (i) 11 పు. 204, (ii) 8. పు. 29–40. 2. 157 Rules పు-2

9.4.10 చివరికి నాటకములకు పేరుంచుటలోను ఔచిత్యమును పాటించిరి. ఉదాహరణమునకు 'కుశలవ' నాటకమున కుశుడు పెద్దవాడు. లవుడు చిన్నవాడు. కనుకనే రావుగారు 'కుశలవ'యని నామకరణమొనరించిరి. తదితరులు లవకుశ అని పేరిడిరి[1]. ఇట్లు శ్రీనివాసరావుగారన్ని విధముల సర్వ విషయములందును బహుజాగురూకులై ఔచిత్యమును పాలించి తమ ఔచితీ సహితమైన ప్రతిభను ప్రకటించిరి.

9.4.11 కాని కొన్ని యనౌచిత్యములు-మిక్కిలి సూక్ష్మముగ పరి శీలించి నపుడు తెలియనట్టివి- ఎడనెడ గలవు. సుఖమంజరీ పరిణయమున సుఖమంజరీ మంత్రిని

"చూడర వీఁడె నావరుఁడు సూనశరుండన నొప్పువాఁడు"

"ఏలరా సుమతీ! నీవిటు వంతఁగుంద" అని యిట్లు సంబోధించుట, మంత్రి రాజునుద్దేశించి "ఉ॥మానవనాథ! యీవనటమానర" అనుటయు నుచిత ము గాదు[2]. కాని చూడక ఏలరా, మానర అను పదములను యతి గణభంగముల కెట్టి యవకాశములేక వరుసగా చూడుము ఏలయో, మానుము అని మార్చి నందున ఔచిత్యముండునుగదా ? కాని యీ మాత్రము శ్రీనివాసరావుగారి బుద్ధికి తోపకుండి యుండునా? ఇట్లే మదాలసలో ఋతుధ్వజుడు తన తండ్రియైన శత్రుజిత్తును

'ఏలర, చాలుర' అనుటయు,శత్రుజిత్తు ఋషీశ్వరుడైన గాలవు నుద్దేశించి "సెలవియ్యర" అనుటయు నుచితముగాదు[3]. ఇందును "ఎందుకు,చాలును, సెలవీ యుఁడు" అను పదముల ప్రయోగించినచో యతి గణ భంగములు గాక ఔచితీ సహితమై యొప్పియుండెడివి. రావు గారిట్లెందుకు అనౌచిత్యము చేసి యుందురు? సుఖమంజరి తండ్రి మీది కోపమున మంత్రినిట్లు సంబోధించి యుండునా? మంత్రి వ్యంగ్యముగా అవివేకియైన రాజునుద్దేశించి యట్లు పలికి యుండునా? ఋతుధ్వ

---

1. 8. పు. 29     2. 185. జనవరి 1897 పు.1-12

3. 185. జూన్, 1897 పు. 52-53

ఙుడు ప్రేమతో తండ్రినట్లు సంబోధించియుండునా? అయినను కావచ్చును. ఇది కేవల మూహమాత్రమే. వీరేశలింగముగారికి ప్రయోగములుచితములట్లు తోచి యుండునా? లేక యివి ముద్రారాక్షసములందమా? అవకాశము లేదు. ఇట్టివి మరే నాటకమునను గన్పట్టవు.

సునందనీ పరిణయములో మరణావస్థలో నున్న ఉగ్రసేనుడు సుమతి దౌష్ట్యమును దెలుపునట్లు సలక్షణమైన పండ్రెండు పద్యములు గల ఉత్తరము వ్రాసి యిచ్చుటలో నౌచిత్యము లేదు.

సునందనీ పరిణయము నందే జయమాలిని సుదేవునిపై గల తన విరహమును తండ్రికి జెప్పి వివాహ మొనరింపుమని యడుగుట యుచితము గాదు. ఇట్లే సుఖమంజరీ పరిణయమున విషయసేనుని యాజ్ఞతో సాయన సుఖమంజరిని తనరాజు నొద్దకు మదనకేళికి రమ్మని పిలుచుట అనౌచిత్యము.

శిలాదిత్యలో సూర్యోపాసనా ఫలితముగ గర్భవతియైన వితంతువు సుభగ తన గర్భమును తానే బాహాటముగ వర్ణించుకొని యుండుటయు నుచితముగ కన్పట్టదు.[1]

సీ॥ మిన్నయి సన్నగానున్న నాలేఁ గౌను
గరువంపుగరిమమై జరఁగనేఁడు,
రాగోరు రుచులచే రాజిల్లు చను మొనల్
నీలకాంతి వహించి నెగడె నేఁడు,
చిగురుల జిగికాంతిఁ జెలువుఁ గాంచిన మోము
వెల్వెలఁబాఱుచు వెలయు నేఁడు,
మించె నిట్టూర్పు జనించె నుసు క్రాంతి
కొంచెపుటారు గాన్పించె నేఁడు

---

1. 35. 3 పు. 50.

తే॥గీ॥ నడలకును మందభావంబులడరె నేఁడు
యొడల కాంతికి జిగి హెచ్చి యొప్పెనేఁడు
కడుపు బరువయి కాన్పించె ఘనతఁగాంచి
దైవమా యేమి తెలుపుదుఁ దండ్రికిపుడు॥

కాని యిట్టి వర్ణనలు శ్రవ్యకావ్యములలో సామాన్యమే. అయిన నిది నాటక మగుట నుచితము కాదనియే తలంపవలెను. శిలాదిత్యను వదలినచో రావుగారి ప్రథమ, ద్వితీయ, తృతీయ నాటకములైన సునందనీ, సుఖమంజరీ, మదలసా నాటకములలో మాత్రమే యీ యల్పమైన యనౌచిత్యములు దొరలినవని మనకు స్పష్టమగును. కాని వీరి ప్రసిద్ధ నాటకము లందెచటను నిట్టి యనౌచిత్య దోషముపాలుగావించిన పట్టులు గన్పట్టవు, రావు గారి నిందుల కెంతయు ప్రశంసింప వలసియున్నది. విశాలమైన వాఙ్మయ సృష్టిలో కొన్ని యిట్టి దొసగులు దొరలినవి. ఏమైనను తదితర శ్రేష్ఠ గుణ గ్రహణమున నివి లెక్క లోనికిరావు, ఇట్లు శ్రీనివాసరావుగారు ఔచితీసహముగా నాటకములు రచించి సర్వోత్తమ నాటక కర్తగా తమ సామర్థ్యమును ప్రకటించిరి.

# 10. నాటకేతర రచనలు

10. ఇంతవరకు పూర్వ ప్రకరణములలో శ్రీనివాసరావుగారి నాటకములు వివిధ దృక్కోణముల నుండి పరిశీలింపబడి వారి దక్షత నిరూపింపబడినది. వారి ఇతర రచనలు ననేకము గలవు. రావుగారి బహుముఖ ప్రతిభా శేముషీ వైభవ ప్రకటనార్థము నాటకేతరరచనల గూర్చి పరిచయాత్మక వివరణమిందు గలదు. నాటకేతి వృత్తములందు వైవిధ్యమున్నట్లుగానే, యితర రచనలలోను వైవిధ్య మెక్కువ.

## 10.1 ఆంధ్రీకృతాగస్త్య బాల భారతము:

శ్రీనివాసరావుగారు దృశ్యకావ్యములను మాత్రమే గాక శ్రవ్య కావ్యమును సైతము రచించిరి. అగస్త్య కృతమైన బాల భారతముమ వీరాంధ్రీకరించిరి దీని మూలమున రావుగారి సంస్కృత భాషా పరిజ్ఞానమభివ్యక్తమగును. రావుగారు ఆది పర్వమును మాత్రమనవదించిరి. ఆరు సర్గలను మూడాశ్వాసములుగ రచించిరి. ఇందలి కొన్ని పద్యములను అమరసింహా బాల భారతము నుండియు, చంపూభారతము నుండియు తెనిగించినట్లును, కొన్ని పద్యములు తామే స్వయముగా గూడ రచించినట్లును వీరు పేర్కొనిరి.[1]

శ్రీనివాసరావుగారు 'నా వద్ద నుండు పుస్తకములో "అగస్త్యకృత బాల భారత"మని యున్నది. ఈ యగస్త్యు లెవరయినది వీరి తండ్రి యెవరయినది తెలియక యున్నది."[2] అని తమ సందేహమును వెలిబుచ్చిరి. కాని 'ప్రతాప రుద్ర యశోభూషణాది గ్రంధకర్తయగు విద్యానాధుడే అగస్త్యుడని శ్రీయుతులు ఈయుణ్ణి వీర రాఘవాచార్యులుగారు, నిర్ణయించినారు.[3]

వీరాంధ్రీకరించిన ఆదిపర్వమునందలి కథ యిది. కౌరవ పాండవులకు

1. 66 పీ. పు. 1 2 66 పీ. పు. 2 3. 62 పీ. పు 5–22

మూలమైనది చంద్రవంశము. చంద్రవంశమునకు మూలపురుషుడు చంద్రుడు. అట్టి చంద్రుని వర్ణనతో నారంబింపబడి, అగ్నిచే ఖాండవ దహనము గావించి విజయుడు ఇంద్రుని జయించి విజయము పొందుటతో ముగింపబడిన . వ్యాస భారతమును నిట్లే ఆది పర్వము ముగియును. అయిన నందుపాఖ్యానములు గలవు. అవి ందు లేవు.

ఈ కావ్యారంభమున రావు గారు మల్లినాథసూరి నుండి తమ వరకు గల వంశ చరిత్రను ఆంగ్లభాషలో రచించిరి. ఆ విషయమునే శ్రీ కాశావధానుల సుబ్బాశాస్త్రి గారిచేత ఆంధ్రమున పద్య రూపముగ వ్రాయించిరి.

శ్రీనివాసరావు గారు తామనుసరించిన అనువాద పద్ధతిని గూర్చి తెలిపినారు. "పూర్వ కాలపు సంస్కృత మహాకవుల శ్లోకముల నాంధ్రీకరించువారక్షరాక్షరమును ప్రతివాక్యమును నాంధ్రీకరించుట కంటెను శ్లోకాభిప్రాయంబు చక్కగఁదెలియులా గొనరించినఁబాలునని నా యభిప్రాయంబు. ఈ విషయంబున ఫ్రాన్సుదేశపు మహాకవి 'బోయిలో' అను నతని తాత్పర్యవాక్యములను 'బాలింగుబ్రోకను' ఇంగ్లీషు పండితుడు క్రింద వివరించిన రీతి వ్రాసినాడు. "To translate survively into modern language an ancient author, phrase by phrase, and word by word, is preposterous; nothing can be more unlike the original than such a copy'[1] వీరు తదుచిత రీతిని ఆంధ్రీకరించిరి.

శ్రీనివాసరావుగారి పద్య రచనాపాటవము, వర్ణనా వైదగ్ధ్యము, అలంకారిక శైలీ విన్యాసము మున్నగు కవితా గుణములను మనము వీరి నాటకములలో చవిచూచియే యున్నాము. కథాకథనము పురాణ పద్ధతిలో సాగినను ప్రాబంధిక శైలి కలదు. చమత్కారయుతమైన ప్రబంధ శైలికి ఆ.8. ప70,118,128, మనోహరమైనపద్యరచనకు ఆ.1. ప181, 162, 164, పాండురాజు మృగయా వర్ణన కడు రమ్యము (ఆ 1. ప 122-128), వసంతర్తు వర్ణన సుందరము (ఆ.1.ప 161-169), ఇంద్రప్రస్థపుర వర్ణనము మనోహరము (ఆ. 8. ప 79-88)ఇవి రావు గారి వర్ణనా వైదగ్ధ్యమునకు ప్రబల తార్కాణములు. ఈ

కావ్యము నందలి కొన్ని పద్యములు వీరు 'ద్రౌపదీ వస్త్రాపహరణ' నాటకమున సందర్భోచితముగ వాడియున్నారు. ఇట్లు శ్రీనివాసరావుగారు 'అగస్త్య బాల భారతమును 'నుతెనిగించి తమ ఉభయభాషా పాండిత్యమును స్పష్టముగావించిరి.

## 10.2 ప్రపంచ నాటక చరిత్రము:

ఆంధ్రీకృతాగస్త్య బాల భారతము తప్ప తక్కిన వన్నియు వచన రచనలు. తెలుగున పందొమ్మిదవ శతాబ్దమున వచన రచనఆరంభమైనది. ఇది ఆంగ్లభాషా సాహిత్యప్రభావము ఆంధ్రసాహిత్యము పైబడుటచే కలిగిన ఫలము. దీనివలనకలిగినమరొకఫలము విమర్శనము. పూర్వము సంస్కృతలక్షణబద్ధమైన విమర్శ లేకపోలేదు. కాని ఆధునికయుగమున ఆంగ్లసాహిత్యములోని విమర్శనా పద్ధతులుసైతము స్వీకరింపబడి సమన్వయదృష్టితో తెలుగున విమర్శన మారంభ మైనది.శ్రీనివాసరావుగారు ద్విపద విమర్శల నాకలింపు గావించుకొని సమన్వయ దృష్టితో విమర్శనాత్మకమైనరచనలుగావించిరి. రావుగారివిమర్శనముఆంగ్లాంధ్ర భాషలలో ద్వివిధముగా సాగినది. వీరు కేవలము నాటక రచనా ప్రదర్శనతో సంతృప్తి నందియుండిన వారు కారు. నాటక చరిత్రమును సైతము రచించిరి. అందున ప్రపంచ నాటక చరిత్రను ఆంగ్ల భాషలో రచించిరి. శ్రీనివాసరావుగారి ఆంగ్లభాషా సాహిత్య పరిజ్ఞానమునకు, పాండిత్య ప్రకర్షకు, విమర్శనాదక్షతకు చక్కని నిదర్శనము వీరి 'ప్రపంచ నాటక చరిత్రము' (The Dramatic History of the world),తదితర నాటకకర్తలకు లేవి ఘనత రావుగారికీ గ్రంథ రచనచే కలిగినదని డా॥పి.ఎస్.ఆర్. అప్పారావు గారు ప్రశంసించిరి. 'శ్రీనివాస రావుగారు 'ప్రపంచ నాటక చరిత్ర" (The Dromatic History of the world)ను ఆంగ్లమున ప్రకటించి, విశ్వవిఖ్యాతులైనారు. ఇంతవరకును ఆధునిక కాలమున తెలుగు కవులు నాటక ప్రపంచమున చేసిన కృషి ప్రశస్తి తెలుగు సీమలను దాటిపోలేదన్నచో నతిశయోక్తి కాదు. శ్రీనివాసరావుగారి కృషి కట్టి భాగ్యము లభించినది. అది తెలుగువారి గర్వమునకు కారణమైనది."[1]'ఇట్లు రావు గారి యశస్సునకు, ఆంధ్రుల గర్వమునకు కారణమైన 'ప్రపంచ నాటక చరిత్రము'ను తెలుగులోనే రచించియుండిన బాగుండెడిది. కాని ఇట్టి కీర్తి

---

1. 45. పు. 261

వచ్చి యుండెడిది కాదు.

తమకు ప్రపంచ ఖ్యాతిరావలెననెడి కోరికతోను, విషయము ప్రపంచ సంబంధి యగుటచేతను రావుగారీ గ్రంథమును ఆంగ్లమున రచించుట యుచిత మని యెంచి యుందురని తలంచుట సమంజసము.

శ్రీనివాసరావుగారు 'ప్రపంచనాటక చరిత్రము'ను రెండు భాగములుగ విభజించిరి. ప్రథమ భాగమున ఏడు ప్రకరణములు గలవు. ఇందుయూరప నకు సంబంధించిన దేశములలోనియు, ద్వితీయ భాగమున గల నాలుగు ప్రక రణములలోను ఆసియా ఖండముతో పాటు. ఆఫ్రికా, ఆస్ట్రేలియా, అమెరికా లలోనియు నాటకములచరిత్రములు వివరింపబడినవి అనగా పాశ్చాత్య ప్రాచ్య దేశములలో నాటకము, నాటక రంగము అనునవేవిధముగా పరిణామము నందినవో రావుగారు పరిశోధనాత్మకముగా పరిశీలించిరి.

ఉత్తమ పరిశోధకునకు, విమర్శకాగ్రేసరునకు ఉండవలసిన లక్షణము లన్నియు శ్రీనివాసరావుగారిలో కలవనుటకు "ప్రపంచ నాటక చరిత్ర' ముత్తమ నిదర్శనము, ఆయా విషయములను గూర్చి వివిధ విమర్శకుల అభి ప్రాయములను పొందుపరచుచు, తమ నిశ్చితాభిప్రాయములను సైతము వివరిం చిరి. ఇతర విమర్శకుల అభిప్రాయముల నంగీకరించినప్పుడు ప్రశంసించుచు ఏకీభవింపని పట్టులందు తమ దృఢాభిప్రాయమును - భిన్నమైన దానిని-తెలుప నటకు వెనుదీయలేదు. క్రీస్తు పూర్వము 6వ శతాబ్దము నుండియు గల గ్రీక నాటక కళ, నాటక రంగముల గూర్చి విపులముగా వివరించిరి. గ్రీకు నాటకావి ర్భావ వికాసములను, గ్రీకు నాటక కర్తలలో ప్రధానముగా 'ట్రాజెడీ'ల రచిం చిన Aeschylus, (Sophoclcs, Euripides)ల నాటకములను, తరువాత కామె డీలను గూర్చి విశదపరచిరి. గ్రీకు 'ట్రాజెడీ' లక్షణములను విదితమొనర్చిరి అతి ప్రాచీన కాలములోనే గ్రీకు నాటక రంగము ముప్పది వేల ప్రేక్షకుల కూర్చుండుట కుపకరింప గలదిగా నుండినట్లు 'The Athenian theatre was so large as to hold thirty thousand people"[1] అని తెలిపియున్నారు తీనగా ఆనాడు గ్రీకు నాటక రంగౌన్నత్యమెంతటిదో మనకు విదితమగును నాటకారంభమునకు మతమే ప్రధానమని రావుగారు తెలిపిరి

1. 157 పీ. పు. 17

ప్రపంచ ప్రసిద్ధిని గాంచిన ఆంగ్ల నాటక వాఙ్మయమును, ఆంగ్ల నాటక రంగమును, నటులను గూర్చి నిష్పక్షపాత బుద్ధితో చర్చించిరి. ప్రసిద్ధాంగ్ల నాటక కర్తయగు షేక్స్పియర్‌ను సమకాలికులను గూర్చియేకాక తత్పూర్వము, తరువాత ఉండిన నాటక కర్తలను, ఎలిజబెత్తు రాణి మున్నగువారు నాటక రంగమును ప్రోత్సహించి, పోషించిన విధమును గూర్చియు ఆంగ్ల నాటకముల శ్రైష్ఠ్యమునుగూర్చియు విపులముగా వివరించిరి. అన్నిటి కంటె మిక్కిలి ఆంగ్లనాటక వాఙ్మయమును గూర్చి రావుగారు విశదీకరించి యుండుట గమనింప దగినది దీనిచే ఆంగ్లనాటక రంగప్రసిద్ధి, ఔన్నత్యము, ప్రచారము మున్నగు లక్షణములన్నియు తెలియు చున్నవి.

భారత దేశమునందు పూర్వకాలమున నాటకములెట్లు అభివృద్ధి గాంచినవో, వానికెంత ప్రాధాన్య ముండినదో వివరించి యున్నారు. భారతీయ నాట్య కళ భారతదేశపు సొత్తు గ్రీకులు, మహ్మదీయులు మొదలైన ఇతర దేశీయులు మన దేశము నాక్రమించి పరిపాలించి యుండినను వారెవరును ఈ కళను కొని రాలేదని సహేతుకముగ తెలిపి యున్నారు. ప్రాచీన భారతమున నాట్యకళ ఎంత ప్రాధాన్యమును వహించి యుండినదో తెలుపుటకు భరతమహర్షి కృత నాట్య శాస్త్రమే నిదర్శనము. లక్ష్యముండిననే లక్షణము కలుగుననుట సర్వపండితైక వేద్యము. కనుక 'నాట్యశాస్త్రము వంటి ఉత్తమ లక్షణ గ్రంథము వెలయుట కంతకు పూర్వమును, సమకాలమునందును, నాటక రచనా ప్రదర్శనములెంత విరివిగా నుండినవో స్పష్టమగును. ఇట్టి నాట్యశాస్త్రము రచించిన "భరత" శబ్దము నందలి ప్రత్యక్షర విశేషమును రావుగారు నిర్వచించిరి. "భ" అన భావమనియు 'ర' అన రాగమనియు, 'త' తాళమనియు తెలిపియున్నారు. ఇది రావుగారి కల్పిత మనుటకు వీలులేదు 'భరత' శబ్దమునకీ యర్థమును దెలుపు శ్లోకము గలదు.

"భకారో భావ సంయుక్తో రేఫోరాగేణ సంశ్రితః
తకారస్తాళ ఇత్యాహుర్భరతార్థ విచక్షణాః॥"[1]

ఈ శ్లోకమును శ్రీనివాసరావుగారెరిగి యుందురనియే తలంపవలెను.

1. 147, పు 6.

లేదా రావుగారే యీ విషయమునూహించియైన నుండవచ్చును. శ్రీనివాసరావు గారు సంస్కృత లాక్షణికోక్తమైన దశరూపకములను, నవరసములను, అలంకారములను, ఛందశ్శాస్త్రము మొదలైన వానిని గూర్చి క్షుణ్ణముగా—వివరించిరి. సంస్కృత నాటక లక్షణములను సంపూర్ణముగా విశదపరచిరి. సంస్కృత నాటక కర్తలను గూర్చి తెలుపు సందర్భమున శూద్రకుని మృచ్ఛకటికమే లభించిన సంస్కృత రూపకములలో ప్రాచీనతమ మైనదని వ్రాసియున్నారు.[1] శ్రీనివాసరావుగారీ గ్రంథము రచించు సమయమునకు లభించిన వానిలో నిదియే ప్రాచీనము. కాని అంతకంటె పూర్వుడు భాసమహాకవి అని **A. B. Keith** మొదలైన వారు వివరించి యున్నారు. కాళిదాసాదులచే స్మరింపబడిన భాసుని నాటకములు 1912లో మాత్రమే బయల్పడినవి.

ప్రాచీన కాలమున మహదౌన్నత్యము వహించిన సంస్కృత నాటక రంగము పతనమై పోవుటకు గల కారణములను వీరు వివరించిరి.[2] నటులు దుర్నీతికి పాల్పడుటచే వారికి సంఘమున గౌరవము లేకపోయినదని రావుగారు తెలిపిరి. చుంబన, పరిరంభణాదులను నాటకమున ప్రదర్శించుట నిషిద్ధము. తరువాతి కాలమున నిట్టివి ప్రదర్శించుటచే భారతీయ నాటక రంగము క్షీణించుట కవకాశము కలిగినదని రావుగారు తలంచిరి. శ్రీనివాసరావుగారిట్టి వానిని తమ నాటకములందు ప్రదర్శింప కుండుట స్పష్టమే. భారతీయ నాటక రంగము క్షీణించుటకనేక కారణములను రావుగారు వివరించిరి.

ఈ గ్రంథోపసంహారమున నాటకము కవిత్వము, సంగీతము మొదలైన లలిత కళల సమాహార రూప మనియు, నాటకము సర్వోత్కృష్టమైన కళ యే గాదు జాతికి గర్వకారణమని సగర్వముగా వక్కాణించిరి. స్వాభావికము గనే నాటకముపై మానవున కభిలాష కలుగుననియు, భారతీయ నాటకముల వలన నెట్టి హానియు కలుగబోదనియు సంప్రదాయబద్ధులయిన ఛాందసులు కొందరీ విషయ మంగీకరింపరనియు తెలిపిరి. భారతీయ నాటకము, నాటక రంగములను సంస్కరించుటెంతయు నవసరమని తెలిపి కొన్ని యంశములను సూచించిరి. "విద్యావంతులు మాత్రమే నటులుగా నుండవలెను. ఇతర దేశము

---

1. 157, పు. 6, 2. 157 పు, 225

లలో విద్యావంతులు నటులుగా నుండుటచేతనే అంత అభివృద్ధి సాధించిరి. మన దేశమునను తుక్కియనువాడు ఢిల్లీని రక్షింపగలిగెను. నాటకము నీతి బోధకమై యుండవలెను. నాటక మొక ఉపాధ్యాయుడు. నీతిని బోధించు ఆచార్యుడు. నాటకము జాతీయ విద్యాపీఠము. నాటకము సంఘమునకు దర్పణము వంటిది. నాటక ప్రదర్శనముచే మానసికాహ్లాదము, వినోదము లభించును ఇట్టి నాటకము భగవంతుని సృష్టి, అలౌకికము." అని శ్రీనివాసరావుగారు వివరించి, గ్రంథాంతమున నాటక రంగ సంస్కరణార్థము, అభివృద్ధికొరకు నాటక కర్తలు, నటులు, నాటక సమాజములు, విమర్శకులు, ప్రేక్షకులు అనుసరింపదగిన అంశములను వివరించియున్నారు. ఇవి సార్వకాలికములైనవిగా గన్పట్టుచున్నవి. వీని వలన తెలుగు నాటకరంగమున కెంతయో ఉపయోగము కలిగినదని శ్రీనివాస చక్రవర్తి గారు ప్రస్తుతించియున్నారు.[1] ఇచట రావుగారిని ప్రశంసించిన పురాణం సూరి శాస్త్రిగారి వాక్యములుల్లేఖించుట అసామంజస్యము కాదు. "శ్రీనివాసరావుగారు చిరకాలము నాటక సూత్రధారులుగ నుండుటయే గాక, ఆంధ్ర నాటకములలో చరిత్రాంశముల గూర్చియు, పాత్రస్వభావమును గూర్చియు నాటక కవులలో మార్గదర్శి, మహర్షి యన నొప్పియున్నారు. వీరు నాటక కవులకును. పాత్రములుగా నుండు వారికిని పంపిన విజ్ఞప్తి వాస్తవముగ నను భవసారమైన స్మృతి వాక్యముగ గారవింపదగియున్నది'.[2] పురాణం సూరిశాస్త్రి గారానాటి సద్విమర్శకులు, వారి వాక్యముల వలన శ్రీనివాసరావుగారికి గల నాటకములకు సంబంధించిన సర్వపరిచయము స్పష్టముకాక మానదు. కనుక ప్రాచ్య పాశ్చాత్య నాటకములను కూలంకషముగా పఠించి నిశ్చితాభిప్రాయములను నిష్కర్షగా వెలువరింప గలిగిన వీరి పాండితీ వైభవమును, పరిశోధనాత్మక బుద్ధి నైపుణ్యమును, విమర్శనాత్మక దృష్టిని ఎంతగా కొనియాడినను తీరదు

## 10.3 ఉపన్యాసములు:

శ్రీనివాసరావుగారి ఆంగ్ల విమర్శనమునకు ప్రపంచ నాటక చరిత్రము నిదర్శనముకాగా, తెలుగు విమర్శనమునకు వీరి ఉపన్యాసము లుత్తమ తార్కా-

---

1. 42 పు. 49, 50 2. 2 పు. 281

ణములు. ఇవి రావుగారు ఐహు గ్రంథముల పఠించి, పరిశోధించి, నిగ్గుదేల్చి రచించి సభలలో ప్రసంగించిన ఉపన్యాసములు.[1] ఇవి సభలలో ప్రసంగించిన ఉపన్యాసములైనను చక్కని వ్యాసములు, వ్యాసము సైతము పందొమ్మిదవ శతాబ్దమున ఆంగ్ల భాషా సాహిత్యముల ప్రభావముచే తెలుగున గలిగిన ఫలితమే. కాని తెలుగున ఆరంభము నుండి వ్యాసమను పేరితో నుండలేదు. 1840-50 లో రచితమై 1862 లో అచ్చయిన స్వామినేని ముద్దు నరసింహం నాయనిగారు 'హితసూచని'లోని వ్యాసములను ప్రమేయము లనియు, పరవస్తు వేంకటరంగా చార్యులు గారు (1822—1900) తమ వ్యాసములను సంగ్రహము లనియు, కందుకూరి వీరేశలింగం పంతులుగారు (1848—1919) ఉపవ్యాసములనియు పేర్కొని యున్నారు.[1] పంతులు గారికి సమకాలికులైన శ్రీనివాసరావుగారు ప్రసంగార్థము ఉపన్యాసములను రచించియుండినను, ఉపన్యాసవ్యాసములను సమానార్థకములుగనే వాడియుండుట గమనింపదగిన విషయము. అప్పటికి వ్యాసమనుటయు ప్రచారములోనికి వచ్చియుండునని తలంపవలెను. శ్రీనివాస రావుగారి ఉపన్యాసము లుబుసుపోకకై రచించినవి కావు. ప్రమాణపూర్వక ముగా విమర్శనాత్మక దృష్టితో అవసరమైనప్పుడు పూర్వపక్షముల వెలిపి యుక్తియుక్తులతో సహేతుకముగా తమఅభిప్రాయములను ప్రకటించియున్నారు. ఏదేని యొక గ్రంథమును విమర్శించుటకు పాశ్చాత్య విమర్శక లోకమున గల రెండు పద్ధతులను రావుగారనుసరించియుండుట వీరి విమర్శనాత్మక దృష్టికి, ఔత్కృష్ట్యమునకు ప్రబల నిదర్శనము. "పురాతన గ్రంథములం బరీక్షించు మార్గము ద్వివిధముగా నున్నది. బాహ్య పరీక్ష, అంతరంగిక పరీక్ష. దీని నాంగ్లే యులు 'External and Internal Evidence' యని యందురు. నేనొరించెడు బూనునది పై రెంటి యొక్క పరీక్ష."[2] అని వీరు భారత భగవద్గీతలను గురించిన విమర్శనము నుద్దేశించి పేర్కొనినను నిది రావుగారి యితర వ్యాసము లకు సైతము వర్తించును. ఈ విషయములను దృష్టి యందిడుకొని రావుగారి ఉపన్యాసములను పరిశీలించుట ఉచితము.

10.8.1 భగవద్గీతా విమర్శనోపన్యాసములు : భగవద్గీతకు తెలుగులో

1. 58 పీ పు. ix
2. భారత భగవద్గీతల గురించిన విమర్శనము-పు. 4

విపులమైన వ్యాఖ్యానములు విరివిగా కలవు, గాని విమర్శనము లేదనియెంచి తల్లోపము నివారింప శ్రీనివాసరావుగారు ఉత్తమ విమర్శనోపన్యాసములు రచించిరని శ్రీ చింతలపల్లి నరసింహశాస్త్రిగారు నుడివిరి [1] భగవద్గీతార్థ రహస్యమును, మహత్త్వమును వివరింపదలచి యీ ఉపన్యాసములు రచించిరి.

శ్రీనివాసరావుగారు భగవద్గీతలోని అష్టాదశాధ్యాయములకు విమర్శ వ్రాసినట్లు గన్పట్టదు. ప్రథమాధ్యాయము మొదలు ద్వాదశాధ్యాయము వరకును, చతుర్దశాధ్యాయమును విమర్శించిరి. రావుగారు చేసిన గీతా విమర్శనమున కుపోద్ఘాతముగా "భారత భగవద్గీతలను గురించిన విమర్శనము" వ్యవహార కర్మ జిజ్ఞాసము" అను రెండుపన్యాసముల నారంభమున రచించిరి. ఈ రెండుపన్యాసములును, అర్జున విషాద యోగము, సాంఖ్య యోగము, కర్మయోగము నను మూడుపన్యాసములును నొక సంపుటముగా ముద్రితము. 7,8 అధ్యాయములును, 9,10 అధ్యాయములును, 11,12 అధ్యాయములును ఒక్కొక్క ఉపన్యాసముగా రచించిరి. అనగా మొత్తము మీద గీతను గూర్చి పన్నెండుపన్యాసములు విమర్శనాత్మకముగా రచించిరి.

శ్రీనివాసరావుగారారంభమున వ్రాసిన 'భారత భగవద్గీతల గురించిన విమర్శన' మను వ్యాసమున వ్యాసకృత భారతమున ఆరంభము నుండియు భగవద్గీత లేదనియు తరువాత కాలమున నిది జేర్పబడినదనియు వీరిందు ప్రతిపాదించిరి. పండిత సీతానాథ తత్త్వభూషణగారిచే రచితమైన 'Krishna and the Gita' అను గ్రంథమును జదివిన వెనుక తమకు కొన్ని సందియములు గలుగ నిట్టి వ్యాసము రచించినట్లు తెలిపిరి. ఇందుకు బ్రహ్మశ్రీ బాలగంగాధర తిలక్కుగారి గీతా రహస్యముపకరించినదనియు నుడివిరి. మహాభారతమున వ్యాసుడే గాక యితరుల చేయియు కలిసినది. ప్రప్రథమమున వ్యాసకృత భారతము 8800 గ్రంథము తరువాతి కాలమున పెరిగి 1,07,890 శ్లోక గ్రంథమైనది. ఇది ప్రస్తుత భారతము, వేర్వేరు కాలములలోనిది పెరిగి పెద్దదయినది. కనుక ప్రారంభమున లేని భగవద్గీత తరువాత నెవరిచేతనో రచింపబడియిందు చేర్పబడినది. దీనికి తగిన ఉపపత్తులు భారతము నుండి రావుగారు

---

1. పైదే పీ పు. 1–8

చూపిరి. పాణిని కాలమున కృష్ణార్జునుల ప్రసక్తిలేదు. పతంజలియు కృష్ణుడు పాండవ పక్షమున నున్నట్టు వ్రాయలేదు. జనశ్రుతిలో గల కథలను కొన్ని కల్పించి భారత కథను ప్రస్తుతమున్నట్లు రచించిరి. కృష్ణుడవతార పురుషుడ నియు,అతని మహిమాన్వితగాథలన్నియు కల్పితములనియుపండితాభిప్రాయము. ఏమైనను భగవద్గీతారచయిత యోగి, చతుర్వేద జ్ఞాన సంపన్నుడు, బ్రాహ్మణో పనిషత్తుల నెరిగిన జ్ఞాని, బ్రహ్మసూత్ర, ధర్మశాస్త్ర, యోగ శాస్త్రముల సారము తెలిసిన విద్వాంసుడు. ఈమహాత్ముని కాలమునకు శ్రీకృష్ణుడు దైవముగ నెన్నబడి అతని గాథలు లోకమంతయు వ్యాపించియుండును. ఆ సమయముననే యిది రచింపబడి భారతమునకూర్చబడి యుండును. కఠోపనిషత్తులోని "ఆత్మా నం రథినంవిద్ధి, శరీరం రథమేవతు।బుద్ధింతుసారధిం విద్ధి, మనః ప్రగ్రహమేవచ॥" మొదలైన శ్లోకములు భగవద్గీతలో చేర్పబడినవి. కఠోపనిషత్తు భగవద్గీత కంటెను పూర్వమే రచితము. కఠోపనిషత్సారము ఋగ్వేదములోనే గలదు కమక గీత వ్యాసకృతము కాదనియు, నితరులచే రచింపబడి కూర్చబడినదనియు రావు గారు తమ మతమును స్థాపింపననేకోపపత్తుల జూపిరి కాని బాలగంగా ధర తిలక్కు గారి గీతా రహస్యము చివర ఇట్టి వాదమును ఖండించిరనియు, వారు పూర్వాచార పరాయణ నాయకులగుటచే వారి చిత్తవృత్తి అట్లే యుండు ననియు రావు గారు తెలిపియున్నారు. కాని బాలగంగాధర తిలక్కు గారి వలెనే ఇతర పండితులు సైతమిది ప్రక్షిప్త మనుట నంగీకరింపరు.

'వ్యవహారకర్మ జిజ్ఞాస' మను నుపన్యాసమున అనేక గ్రంథములలోని ధర్మాధర్మములను గూర్చి చర్చించిరి. అహింసా సత్యాస్తేయత్రికరణశుద్ధిం ద్రియ నిగ్రహము లైదు పంచ ధర్మములని మనుస్మృతిలో చెప్పబడినవి. "అహింసా పరమోధర్మః" అని యుండినను 'జిఘాంసన్తం జిఘాంసీయాత్' అని చెప్పబడి యుండుటచే హింసింపవచ్చును. అయినను దీనికి విచక్షణాజ్ఞానమవ సరము. ఇందుకు ధర్మవ్యాధుని కథ చక్కని యుదాహరణము. 'నాస్తి సత్యాత్పరోధర్మః' అని భారతములోను, 'సత్యంవద ధర్మంచర' అని బ్రాహ్మ ణములలో నుండినను "కామినీషు వివాహేషుగవాంభక్తేతథైవచ। బ్రాహ్మణాభ్యు పపత్తేచ, అనృతేనాస్తి పాతకమ్॥!" అను నాపద్ధర్మముచే అసత్యమాడినను దోషముండదు. ఇందుకు ధర్మరాజుదాహరణము. జీవనమునకై చేయు అస్తే యము దోషముగాదు ఇట్లే యీ ఉపన్యాసమున ఏది ధర్మ మేదియధర్మమను-

విషయములను వివరముగా చర్చించి యుపపత్తులతో నిరూపించియున్నారు. మనుస్మృతి భారతాదుల నుండియే గాక ఆంగ్ల భాషా గ్రంథముల నుండి సైత మెన్నియో విషయముల నీ సందర్భమున నుద్ధరించి విపులీకరించుట రావుగారి బహుగ్రంథ పఠన జన్యజ్ఞానమునకు, మేధకు నిదర్శనము కాగలదు.

పై రెండుపన్యాసములు గీతా విమర్శనోపన్యాసములకు పీఠికల వంటివి. భగవద్గీతా ప్రథమాధ్యాయము, అర్జున విషాదయోగ" మనునుపన్యాసమున భీష్మద్రోణులు దుర్యోధన పక్షమవలంబించుట ధర్మమని చెప్పబడినది. విషాద సందగ్ధ హృదయుడైన అర్జునునకు కృష్ణుడు సర్వశత్రు సంహారమొనర్చుటతని ధర్మమనియుపదేశించెను. ప్రవృత్తి నివృత్తి అని రెండు మార్గములున్నను ప్రవృత్తి మార్గముచితమైనదని కృష్ణుడు బోధించెను.

"ద్వితీయాధ్యాయము-సాంఖ్యయోగము'' అను నుపన్యాసమున, రెండవ అధ్యాయ మంతయు సాంఖ్యముకాదనియు, పదునొకండవ శ్లోకము నుండి 31వ శ్లోకము వరకు మాత్రమే సాంఖ్యమనియు రావుగారు తెలిపిరి. తక్కినవి సాంఖ్యమున కుపకరించు కర్మోపదేశములు. 33 నుండి 38 వరకుగల శ్లోకములలో అర్జునుడు యుద్ధముచేసి తీరవలెననియు, తన విధ్యుక్త ధర్మమాచరించుటచే పాపమురాదనియు బోధించి స్థితప్రజ్ఞునిలక్షణములు బ్రాహ్మీస్థితియువివరింపబడినవి."తృతీయాధ్యాయము - కర్మయోగము" అను నుపన్యాసమున అర్జునునకు కర్మయోగమును బోధించెను. నిష్కామ కర్మ ఫలము నీశ్వరార్పణముగాజేసి కర్మాచరణ మొనరింప వలసినదని కృష్ణుడర్జునునకు బోధించిన పద్ధతిని రావుగారిందు విపులీకరించిరి. ''చతుర్థాధ్యాయము - జ్ఞానయోగాము" అను నుపన్యాసమున బ్రహ్మార్పణమైననే కర్మము మోక్షమొందించునని బోధింపబడినది. ఇందు చాతుర్వర్ణ్య విభజనమున గూర్చి శ్రీనివాసరావుగారు బుద్ధినైపుణ్యముచే సమన్వయించిరి. అకర్మ, వికర్మ, కర్మలిందు చర్చింపబడెను.

"పంచమాధ్యాయము - కర్మసన్న్యాస మంత్రాలయ హఠ రాజ యోగములు" అను నుపన్యాసమునందు గీతా పంచమాధ్యాయమున ఒక కర్మసన్న్యాస యోగము మాత్రమే యున్నను, దీని కనుబంధముగ మంత్రలయ హఠరాజ యోగములు సైతము వివరింప బడినవి. 'కర్మ సన్న్యాస కర్మయోగములు రెండును మోక్షదాయకములే యైనను కర్మ సన్న్యాసము కంటె కర్మయోగము

శ్రేష్ఠమని వివరించిరి. "౬ వ అధ్యాయము – ధ్యాన యోగము" అను నుప న్యాసము నందు అధ్యాత్మ యోగ మనగ సంయమయోగము వివరింపబడినది. యోగి శీతోష్ణాది ద్వంద్వాతీతుడు. ఆత్మను ఆత్మచేతనే యుద్ధరించుకొనవలెను అను సంగతులను విపులముగా రావుగారు చర్చించిరి. అవసరమైన సందర్భము లందు త్రిమతాచార్యులైన శంకర రామానుజ మధ్వాచార్యుల అభిప్రాయములను సైతము వివరించిరి. ఈ యుపన్యాసమున ప్రవృత్తి నివృత్తిమార్గములనువర్ణించి తమ అధ్యాత్మిక చింతనను, జ్ఞానమును స్పష్టము గావించిరి. దీనిచే రావుగారి వేదాంత జ్ఞానమభివ్యక్తము గావింపబడినది.

'విజ్ఞాన తారక బ్రహ్మయోగము' అను నుపన్యాసమున ఏడు, ఎనిమిద ధ్యాయములలోని జ్ఞాన విజ్ఞాన యోగము. అక్షర బ్రహ్మ యోగము నను నానిని గూర్చి రావుగారు వివరించిరి. కాని విజ్ఞాన తారక బ్రహ్మయోగములు అనియుండనగును. ఇందెక్కువగా వివరణములు లేవు. 'నవమాధ్యాయము రాజ విద్యారాజగుహ్య విభూతియోగములు' అను నుపన్యాసము నవమాధ్యాయ మని వ్రాయబడియున్నను దశమాధ్యాయ మందలి విషయము సైతము కలదు. 'విశ్వ రూప సందర్శన భక్తియోగములు' అను నుపన్యాసమున ఏకాదశద్వాదశాధ్యా యములను వివరించిరి. ఏకాదశాధ్యాయమునందు విశ్వరూప సందర్శనమును, ద్వాదశాధ్యాయమున స్వార్థపరిత్యాగులయి యే యంతరాయమునకుఁ జిక్కక మనో బుద్ధులు పరబ్రహ్మము నందుంచి నట్టి. భక్తులు బ్రహ్మభావంబందుదురను విషయమును భక్తియోగమున వివరింపబడినవి. 'గుణత్రయవిచార' మను నుపన్యాసమున చతుర్దశాధ్యాయము నందలి గుణత్రయ విభాగ యోగము వర్ణి తము. ఇందు జీవాత్మను బరమాత్మయందుఁ జేర్చు విధానమే ఆధ్యాత్మ విద్య యని రావు గారు వివరించిరి. సత్త్వరజస్తమో గుణములను గుణత్రయమును వర్ణించుచు, మానవుని ఆహార విహారములందును, మతావలంబనమునను, నాగమ క్రమమునను ఈ త్రిగుణములు ప్రాధాన్యము వహించి యుండుననియు, మాన వుడొనరించు ప్రతికార్యమునను, తలంపునను నివి యుండితీరునని వివరించిరి. ఇందు తాము రచించి సభలలో ప్రసంగించిన భగవద్గీతా విమర్శనోపన్యాసము లుపసంహృతమై యున్నవి.

పై ఉపన్యాసములందు శ్రీనివాసరావుగారు వ్యాసమున కుండవలసిన ఉప క్రమోప సంహారములను పాటించుటయే గాదు వాని కేక సూత్రత, పరస్పర

సంబంధము ఘటించి తమ విమర్శనాత్మక దృష్టిని ప్రకటించుట ప్రశం సార్హము.

1082 వేద విమర్శనోపన్యాసములు : శ్రీనివాసరావుగారి పాండిత్య ప్రకర్షకు, మేధాసంపత్తికి, బహుగ్రంథముల తోడి పరిచయమునకు భగవద్గీతా విమర్శనోపన్యాసముల తరువాత పేర్కొనదగినవి వీరి వేద విమర్శనోపన్యాసములు. మొత్తము పదునైదుపన్యాసములలో వేదార్థ సారమును చర్చించి వివరించిరి. వేదము భారతీయుల చరిత్రయని తెలిపి ఆర్యుల నాగరకతాదులను అనేక దృష్టాంతములతో రావుగారీయుపన్యాసములలో స్పష్టము గావించిరి. దీనినే రావుగారి విమర్శనాత్మక దృష్టి విశదమగును. ఆర్యుల నాగరకత వారి ప్రపంచ వ్యాపకత అనునది వేద విమర్శనోపన్యాసములలో ప్రథమోప న్యాసము. పురాతనార్యుల చరిత్రమే ఋగ్వేదమని రావుగారు తలంచిరి. పురాతన కాలము నుండియు ఆర్యులు నాగరకులు. ఇరాన్‌లు వీరితో సమానులు. వీరి మూలమున ప్రథమమున నాగరకులైన వారు అక్కేడియన్‌లు. తరువాత కాల క్రమమున వీరి నాగరకత ప్రపంచమంతయు వ్యాపించినది. ఆర్యులు సకల విద్యాసంపన్నులు నాగరకులు ననుటకు ఋగ్వేదమే నిదర్శనము. ఆర్యులు భారత యుద్ధమునకు పూర్వాపరములందు ప్రపంచమంతట వ్యాపించిరి పురాతనార్యుల భాషా మూలముననే ప్రపంచ భాషలుద్భవించినవని రావుగారు విశదము గావించిరి. సాహిత్య కళలలో చరిత్రాంశములు తెలియుట ముఖ్యమనియు, దాని వలన దేశాభిమానము, మతాభిమానము, భాషాభిమానము పట్టువడుననియు, ఆర్యులైన మన వారి గొప్పకార్యముల గుర్తెరిగిన మనమును గొప్పవారము కావలెననెడి బుద్ధి కలుగుననియు అట్లు బుద్ధి పుట్టుట, భరతఖండాభివృద్ధికి మార్గమగునని శ్రీనివాసరావుగారీయుపన్యాసమున స్పష్టము గావించి ముగించిరి. 'వేదమతము, నాస్తిక మతము, ఆర్యులదైవములు', అను నుపన్యాసమున నీ విషయములను చర్చించిరి. మానసమును నొక్క విషయమునకు బంధించునది మత మని రావుగారు అనేకోదాహరణములతో వివరించిరి. ఇంద్రుడహల్యా జారుడనుట ప్రసిద్ధము. 'అహల్య' యన దున్ననిభూమి. వర్షాధిదేవతయైన ఇంద్రుడు నేలను దదుపుటచే నతనికహల్యాజారుడను పేరు కలిగెను. అహల్య యన చీకటనియు, ఇంద్రుడన సూర్యుడనియు, నిట్టి సూర్యుడు చీకటి పోద్రోలు వాడగుటయు నా పేరు కలిగినదని వివరించిరి.

'వేదవిచార విమర్శన' మను దానిలో ఋగ్వేదము మన మత గ్రంథమనుట ప్రసిద్ధ మను విషయమును వివరించిరి, వేద మెప్పటిది, ఎవరి కృతము, పౌరు షేయమా, అపౌరుషేయమా యను విషయము లిందు చర్చింపబడినవి. మాక్సు ముల్లరు ఋగ్వేదమును 'Book of Books' అని వర్ణించెను. ఋగ్వేదమార్యుల మత గ్రంథమనుట కంటె ఆర్యుల చరిత్ర యనుట ఉచితమని వివరించిరి.

'సృష్టిని గుఱించిన తాత్పర్యమను దానియందు సృష్టియనాది యనివివరిం సృష్టి యన ముందఱికి ఱరుపబడినదని యర్థము. ఋగ్వేదమును బట్టి ఋగ్వే దము ప్రారంభకాలముననే పుట్టినదని తెలియును. తరువాత ఋక్కులు గలిగి నవి. 'వేదము చరిత్రయా' అను నుపన్యాసమున వేదము మత గ్రంథముకాద నియు చరిత్ర యనియు వివరించిరి. హిందువులకు చరిత్ర లేదనుట గలదు. కాని వేదమే వారి చరిత్రయని రావుగారు తెలిపిరి. ఆర్యుల ముఖ్య వృత్తి కృషి. 'ఆర్' అనగా దున్నుట. కనుక కృషి కర్మవలన జీవించు వారార్యులని రావు గారు స్పష్టము చేసిరి.

'నరమేధ అశ్వమేధాది యజ్ఞములు' అను నుపన్యాసమున ఆర్యుల యజన కర్మల గూర్చి వివరించిరి. ప్రారంభమునుండి యజన కర్మ అనగా ఆగమ విధులుండినవి. పురోహితులొనరించు కార్యములకు దానములొసగ బడుచు వచ్చినవి. దానమునకే దక్షిణ యని పేరు వచ్చినది. ప్రార్థనలు, ఆగమవిధుల మూలమున అసాధ్యములను సాధ్యము చేసికొన వీలగునని ఆర్యుల విశ్వాసము. వర్ణాశ్రమ ధర్మముల గూర్చి వివరించిరి. వర్ణమన జ్ఞానము. జ్ఞానముచే వర్చస్సు కలుగును ఆ వర్చస్సును బట్టి వర్ణము అనగా జాతి యేర్పడినదని తెలిపిరి. నర మేధాదులు ప్రారంభమున లేవు. అనగా జీవహింసలేదు. క్షీర ఘృ తాది బలులు యాగములలో సమర్పింపబడుచుండెడివి. కాని బ్రాహ్మణముల కాలమున పై వానికి బదులు గోవులు మేకలు బలులుగ నర్పింపబడుట కల్పి తము. పురుష సూక్తమునుబట్టి నరమేధాశ్వమేధములను కల్పించిరి. శునశ్శేపుని యాగపశువుగా చేయబడినట్లున్నను పురుషమేధము చెప్పబడియుండలేదు. బ్రాహ్మణములలో చెప్పబడినట్లు నరమేధముగాని, అనేకపశుహత్యగాని వేద మున చెప్పబడలేదని యనేక ఋక్కుల మూలమున రావుగారు స్థాపించిరి. ఇప్పటికిని యజ్ఞ కర్మమునందుమాధ్వ వైష్ణవులు పిష్టపశువును బలిగా నిత్తురు.

జీవహింసలేదు. స్మార్తులలో మేకను ఙంపుటగలదు. 'వేదమత' మను నుపన్యాసమున వేద కాలము నాటి మత సంబంధి విషయము చర్చింపబడినది.

ఋతు ధర్మముల ననుసరించి ప్రకృతి మహిమలచే గలుగు ననేక శక్తులకు నామ కరణమొనరించి గౌరవ బుద్ధితో పురాతనార్యులు ప్రార్థించుచుండి రనుటనురావు గారిందు విశదీకరించిరి. 'ఋగ్వేదము-పురాతనార్యుల చరి తము' (Rigveda-History of the Primitive Aryans) అను నుపన్యాసము నందు ఆర్యుల చరిత్రము వివరింపబడినది. ఆర్యులు పంజాబు చేరు సమయమున దస్యులచే బాధింపబడుచుండిరి. ఇందు రావుగారు ఋక్కుల నుదాహరించి విష యమును వివరించిరి. 'ఋగ్వేదములోని ముఖ్య ప్రార్థనలు' అను దానిలో ఆర్యుల దేవతలలు, వారి ప్రార్థనలను రావుగారు వివరించిరి.

'మద్యపానము జూదము, స్త్రీలగుణములు" (పురాతనార్యుల చరిత్రము Rigveda-History of the primitive Aryans) అను నుపన్యాసమున ఆర్యుల గుణశీలములను వివరించిరి, ప్రాచీనార్య స్త్రీ గుణములు స్పష్టము చేయ బడినవి. పూర్వము జనానా లేదనియు, ఆర్య స్త్రీలు విద్యావతులయి సభలలో భర్తలతో పాల్గొనెడి వారనియు, కాని-యూరోపియన్ స్త్రీలవలె విచ్చల విడిగా తిరిగెడి వారుకారనియు, సనాతనార్యులు స్త్రీల కెంతయో గౌరవ మొసగు చుండెడివారనియు రావుగారు వివరించి యుదాహరణముగా మైత్రేయీ యాజ్ఞ వల్క్యుల కథలు తెలిపిరి. ఋగ్వేదకాలముననే పురుషులలో బహు భార్యాత్వ ముండినది. మద్యపానము చేయు చుండిరి. కాని సోమపానము పవిత్రమైనదిగ తలంచిరి. జూదము గలదు సతిపతితో చితి చేరవలెనని ఋగ్వేదకాలమునలేదు బ్రాహ్మణముల కాలముననో, సూత్రయుగముననో, ఋక్కులోని 'అగ్రే' అను దానిని 'అగ్నే'అని మార్చిరనువిషయమును విపులముగా రావుగారు చర్చించిరి. తన్మూలమున సతిని కల్పించి ఘోర పాపము నొడిగట్టుకొనిరని రావుగారు విశదపరచిరి. పూర్వము విధవావివాహము లుండినవని కొందరందురు. కాని ఆధారములు తక్కువ. దేశ మరాజకమైనపుడు మాన సంరక్షణార్థము సతిచితి జేరియుండవచ్చునని రావుగారి యూహ. ఆర్యులకు శవ దహనము, పూడ్చుటయు గలదు, ఈ ఉపన్యాసమున రావుగారి సంఘసంస్కరణాభిలాష అభివ్యక్తము చేయబడెను.

"వివాహ కట్టడము' (ఋగ్వేదము-ఆర్యుల చరిత్రము) లను నుపన్యాస

మున పురాతనార్యులలోని వివాహ పద్ధతులను వివరించిరి. ఇందును రావుగారి సంఘ సంస్కరణాభిలాష అభివ్యక్తమగును. ఆర్యుల వివాహాది కర్మములను దైవ సంబంధములుగ గౌరవించిరి. వివాహమన విశేషమగు బరువు మోయుట అని అర్థము. వివాహ మిష్టములేని యువతి వివాహ రహితయై పితృగృహ మున నుండవచ్చును. భర్తలను జూచి స్వీకరించు స్వాతంత్ర్యమానాడు పడుచుల కుండినది. బుక్కులు బాల్య వివాహములను నిరసించి ప్రౌఢా వివాహములను స్థాపించుచున్నవని రావుగారనేకోదాహరణము లచే వివరించిరి. యువతీ వివాహమే విధ్యుక్తమనియు, స్త్రీలకు వేదాధ్యయనము, బ్రహ్మోపదేశము నుండిన వనియు రావుగారు వివరించిరి. స్త్రీ వివాహ వయస్సు 15 నుండి 22 వరకునని తెలిపిరి. స్త్రీ వివాహ విషయమున గల వాదములను తెలిపి, వివాహసమయమున సప్తపదీ ప్రాముఖ్యమును, కన్య యన నెవతెయో తెలిపి బాల్య వివాహములు నిషిద్ధమని నిరూపించిరి. తురుష్కుల భీతిచే భర్త మరణముతో స్త్రీ కేశఖండనమును, బాల్య వివాహములు ఆపద్ధర్మములుగ కలిగినవి: "వేదోక్తః పరమోధర్మః ధర్మ శాస్త్రేషుచాపరః। శిష్టాచారశ్చ శిష్టానాం త్రివిధం ధర్మలక్షణమ్ !!" అను శ్లోకమున త్రివిధ ధర్మములున్నను ఆపద్ధర్మము సర్వవేళల అనుసరించదగినది కాదు కనుక "సంప్రదాయః ప్రమాణం చేత్ శ్రుతాద్వైశ్చ విరుధ్యతే। యది తత్సంప్రదాయాయ, దూరే దూరే నమోనమః !!" అనునట్లు సంప్రదాయము నకు విరుద్ధమైనదైన యెడల దూరముండుటయే యుచితము. కనుక అతి బాల్య వివాహములు నిషిద్ధములు. పూర్వము స్త్రీకి బ్రహ్మోపదేశముండినది. తరువాతి కాలమున యజ్ఞోపవీతమునకు మారుగా మంగళసూత్రము ధరింపజేసిరనుటను శ్రీనివాసరావుగారు వివరించిరి. శ్రీ శంకర రామానుజుల కాలమునందు స్త్రీలకు సంస్కార విధులుండినవి. కాని మధ్వాచార్యుల కాలమున తురుష్కుల బాధలధి కమై హిందూ సంఘ విధులనేక విధములుగ మారినవి. స్మృతులలో చేర్పులు మార్పులు కలిగినవి. స్త్రీకి బ్రహ్మోపదేశము లేనిచో నొక సంకటమున్నదని రావుగారు తెలిపిరి. వివాహమంత్రములలో ద్విజత్వమున కాకరమగునవి లేవు. స్త్రీకి సంస్కారము లేనిచో ద్విజకానేరదు; శూద్రస్త్రీయే యగును. ద్విజునకు శూద్రస్త్రీ భార్య యగుట ఉచితము కాదు. కనుక నిట్టిది తరువాతి కాలమున ఏర్పడినదని రావుగారు విశదీకరించిరి, కనుకనే ఆ కల్పించిన వారు స్త్రీకి వివాహముతో నే ద్విజత్వము వచ్చుననిరి. దానిని వీరు ఖండించిరి. పూర్వము

బహుభార్యాత్వముండినది. కాని బహుభర్తృత్వము లేదని రావుగారు వివరించిరి. సంఘ సంస్కరణాభిలాషతో రావుగారీ విషయముల విపులముగా చర్చించి యుంటట గమనింపదగినది.

"జాతి వర్ణాశ్రమ ధర్మము" లను నుపన్యాసమున జాతి వర్ణాశ్రమ ధర్మము లేర్పడిన విధమును వివరించిరి. జాతిని గూర్చి ఋగ్వేదమున చెప్ప బడలేదు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రుల విభాగము వేదమున లేదు. ఒక సూక్తమున మాత్రమున్నది. అది నవీన మని రావుగారు తలంచిరి. జాతి, వారాచరించిన కర్మ ననుసరించి యేర్పడిన దనియు, వేదాధికారము కొందరికి మాత్రమే యనిగాని మరికొందరికి నిషిద్ధమని గాని లేదనియు మానవుడు పుట్టి కచేగాక బ్రహ్మజ్ఞానమార్జించుటచే బ్రాహ్మణుడగునని యు రావుగారు విశదము చేసి కవేషా, సత్యకాముల కథల నుదాహరించిరి. జాతులేర్పడిన విధమును రావుగారు యుక్తియుక్తముగా స్థాపించిరి. జన్మతోనే బ్రాహ్మణుడనుటను, "బ్రహ్మ బీజా యతేనమః" అను నుడియు రావుగారు మిథ్యలనిరి. మానవులందరు మను సంతతియగుటచే జాతులు వేరనుట సముచితము గాదని రావుగారు నిరసించిరి. గుణ, వృత్తి భేదములచే జాతులు కలిగినవని నిరూపించిరి. బ్రాహ్మణోపని షత్తులలోను, ఋగ్వేద కాలమునను ఈనాటివలె జాతి కట్టుబాట్లులేవు. స్మృతుల కాలమున అనేక జాతు లేర్పడినవి. వీనిని దెలిపి రావుగారు జాతియొక్క ఐక్య తను కోరిరి.

"మత విధు లే రీతిగ ప్రబలినది"యను నుపన్యాసమున మత పద్ధతులు వ్యాపించిన విధమును విశదపరిచిరి. ఇందు సులభము, శుద్ధమునైన వేదమత మును నిందించి కొందరు వైషమ్యమునకు లోనయి యైకమత్యమును విడినాడిరని రావుగారు తెలిపిరి.

"ఋషులు, సప్తర్షులు, దధీచి, చ్యవనుఁడు" అను నుపన్యాసమున ఋగ్వేదము నందలి ఋతుధర్మములను, 'అరమతి' యను స్త్రీ దేవతను గూర్చి తెలిపి, ఋషులు, సప్తర్షులు, దధీచి, చ్యవనుడు, ఊర్వశీపురూరవులను వారి పేర్ల సంకేతములను విశేష భావములను సంపూర్ణముగా వివరించిరి.

"యమయమి, మృత్యువు, పితృదేవతలు, కర్మ" అనునది రావుగారి వేద విమర్శనోపన్యాసములకుపసంహారోపన్యాసము వంటిది. దైవ విషయమున గల భేదాభిప్రాయము, దేవుఁడద్వితీయుడు, దైవము సర్వాంతర్యామి, దైవ మఘ విధ్వంసి మొదలైన విషయములను, మృత్యువును గూర్చియు, యమ యమి సంవాదమును గూర్చియు, పితృకర్మల గురించియు, ఋక్కుల నుదాహ రించుచు సర్వమును స్పష్టముగా వివరించిరి ఇట్లు శ్రీనివాసరావుగారు వేదము ననేక దృక్కోణముల నుండి దర్శించి, సమగ్ర పరిశీలనము గావించి, పురాత నార్యుల గూర్చిన వివిధ విషయములను సోపపత్తికముగా తమ మతమును, స్థాపించిరి ఈ వ్యాసములన్నియు నొక పరిశోధనవ్యాసము వలె నొప్పు చున్నవి.

10.3.3 ఇతరవిమర్శనోపన్యాసములు : భగవద్గీతా వేదములను గూర్చియేగాక రావుగారు అనేకేతర విషయములను గూర్చియు విమర్శనాత్మక దృష్టితో పరిశీలించి ఉపన్యాసములుగ రచించి సభలలో ప్రసంగించియున్నారు. వీనిచే శ్రీనివాసరావుగారిలోని వివిధ విషయ పరిజ్ఞానము, దాని సమన్వయ బుద్ధి తమ అభిప్రాయములను స్పష్టము గావింపగల నైపుణ్యము కొట్టవచ్చినట్లగపడు చున్నవి.

'మాయావాదోపత్తి'క్రమము: బ్రహ్మశ్రీ బాలగంగాధర తిలక్కుగారు తమ 'గీతారహస్యమను గ్రంథములో మహారాష్ట్ర భాషలో రచించి యుండ రావుగారు తమ అభిప్రాయములను జోడించి తెలుగున నీ యుపన్యాసము రచించినట్లు తెలిపి యున్నారు బౌద్ధమతముననునీ మాయావాదము గలదు. శంకరాచార్యులను ప్రచ్ఛన్న బౌద్ధులనియు, ప్రచ్ఛన్న సాంఖ్యు లనియు నను టకు గల కారణములను విశదపరచిరి. ఇంకను సత్కార్యవాదము, ఆరంభ వాదము, పరమాణు వాదము, అవచ్ఛిన్న వాదము, ప్రతిబింబవాదము, పరి ణామ వాదము, వివర్తవాదము మున్నగునవన్నియు శంకరాచార్యులకు ముందే యుండినవనియు తెలిపి మాయావాదమును స్థిరపరచుగాథలనేకము గలవనియు వందుకు నారదుని కథ దృష్టాంతముగా నొసగిరి. ఇట్లు మాయావాదోత్పత్తిని గూర్చి రావుగారు చర్చించిరి.

ఆర్యవివాహము : రజస్వలానంతర వివాహము, 'పోస్టు ప్యూబర్టీమ్యారేజి' యను శీర్షికలతో పత్రికలలో వెలువడిన వాదములను జూచి మిత్రుయి కోరగా శ్రీనివాసరావుగా రీయుపన్యాసమును రచించినట్లు వీరే తెలిపియున్నారు. పూర్వాచారపరాయణులైన వారి కొరకు దీనిని ఆంధ్రమున రచించినట్లు తెలిపిరి చాల వరకు నిందలి విషయమంతయు వేద విమర్శనోపన్యాసములలోని 'వివాహ కట్టడము'లను నుపన్యాసములోనిదే. అతి బాల్య వివాహములు నింద్యములనియు, ప్రౌఢా వివాహమే అనగా రజస్వలానంతర వివాహమే యుచితమనియు ననేకోపపత్తులతో రావుగారు వర్ణించిరి. బాల్యవివాహములు 'సతీసహగమనము' వలెనే కేవలము కల్పితములని రావుగారు వివరించి రజస్వలా నంతర వివాహముచితమను వాదమును స్థాపించిరి. ఇందు రావుగారి సంఘ సంస్కారణాభిలాష వ్యక్తమగును.

"భారతీయ విద్యాభివృద్ధి: దివ్యజ్ఞాన సమాజాధ్యక్షురాలయిన "అనిబిసెంటు"గారు భారతీయ విద్యావిషయమును గూర్చి వ్రాసిన ఉపన్యాసము నందలి యొక వాక్యము నాధారముగా గొని రావుగారీయుపన్యాసమును రచించినట్లు తెలిపియున్నారు. ఇందు భారతీయులకు పాశ్చాత్యులకు గల భేదములను వివరించిరి భారతీయ విద్యాభివృద్ధి వలన భారతీయ గౌరవమును గాపాడనగుననియు ఆంగ్లేయుల పరిపాలనము నుండి విడివడి స్వాతంత్ర్యమును బొంది స్వేచ్ఛాజీవులగుటకు వీలు కలదనియు రావుగారు కంఠోక్తిగా పలుకుటచే వీరికి గల దేశాభిమానము, స్వాతంత్ర్యాభిలాష సుస్పష్టములైనవి. ఆంగ్లేయుల భాషా విద్యాజ్ఞానములపై రావుగారి కెంతటి ప్రత్యయ ముండినను భారతీయులకు ప్రత్యేకముగా భారతీయ భావన అవసరమనియు, దేశాభిమానము ముఖ్యమనియు నెంచుటనే భారతీయ విద్యాభివృద్ధి కెన్నింటినో సూచించిరి.

ప్రాచీనగ్రంథాలయచరిత్రము : ఈ ఉపన్యాసము నందు అనాది నుండియు గ్రంథాలయము లుండి లయమైనవనియు వానిని పునరుద్ధరించి ప్రజల జ్ఞానోపయోగమునకు నడుపవలెననియు రావుగారిందు వివరించిరి. సెమెటిక్కు జాతుల నుండి ఆర్యులక్షరములను నేర్చుకొనిరను వాదమును వీరు ఖండించిరి. అక్షరములు వేదము లంత ప్రాచీనములని నిరూపించిరి. ముద్రణాయంత్రములు వచ్చి 1440 నుండి పాశ్చాత్య దేశములలో గ్రంథములు ముద్రిం

చుట ఆరంభమైనది. మన దేశమునకు 18వ శతాబ్దమున నిది వ్యాపించినది. గ్రంథము లన్నింటి నొకచోట చేర్చుటకాదు. వాని ఉపయోగము ప్రజలకు కలుగునట్లు చూచుట ప్రధానమని సూచించిరి. భారతదేశ ఖ్యాతికి, అభివృద్ధికి గ్రంథాలయములు హేతువులని రావుగారెన్నియో విషయములను సూచించిరి.

"భాస కాళిదాస విక్రమాదిత్యుల కాల నిర్ణయము": ఇదు శ్రీ హర్ష విక్రమాదిత్యుడను శ్రీహర్షుడును వేరని నిరూపించిరి. మాళవరాజయిన శ్రీ హర్ష విక్రమాదిత్యుడు బి. సి. 5 శ. కును, కనోజి శ్రీ హర్షుడు ఎ. డి 7 వ శ. కును జెందినవారు. శ్రీహర్ష విక్రమాదిత్యు డుజ్జయినిలో రాజ్యమేలుచుండు కాలమున, నతని యాస్థానమున కవులుండిరనియు, నందు మాతృ గుప్తుడొక డనియు, మాతృగుప్తుడే ప్రథమ కాళిదాసనియు, నితడే కాళిదాసు పేరనున్న నాటకత్రయ కర్త యనియు, ద్వాదశ కాళిదాసులు కాలాంతరము లందు వెలసిరనియు, భాసుడు కాళిదాసు కంటె ముందటి వాడనియు, కాళిదాసుచే నితడు పొగడబడె ననియు, భాసుని కాలము బి. సి. 8,9 శ. లనియు రావుగారు సోపపత్తికముగా వివరించిరి. ఇందు రావుగారి చారిత్రక విషయ పరిజ్ఞాన మభివ్యక్తమగుచుండుట గమనింపదగినది.

పత్రికలలో ప్రకటితములైన వ్యాసములు కొన్ని గలవు. ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక (12-4-1911) లో "నాటక చరిత్ర" అను వ్యాసము ప్రకటింపబడినది. పాశ్చాత్య భారత దేశములలో నాటకము లతి ప్రాచీన కాలముననే రచితములై ప్రదర్శింపబడి యుండుననియు భారతదేశ నాటక సంబంధి విషయములను పరిపూర్ణముగ నెరుగుటకు సాధనములు లేవనియు, మృచ్ఛకటిక శాకుంత లాద్యుత్తమ నాటకములు మహాత్సంభవములు గావనియు, కాని తెలుగున ఆధునిక యుగమున ఆరంభమైక వనియు, నాటకము న పాటలు, పద్యములుండుటయే యుచితమనియు, నాటకములు నీతిబోధకములై యుండవలెననియు రావుగారిందు వివరించిరి.

1915 సం. ఏప్రిల్ 3,4 తేదీలలో ఆంధ్ర సాహిత్యపరిషత్తు చతుర్థవార్షికోత్సవ సభ బళ్ళారిలో జరిగినపుడు శ్రీనివాసరావుగారు మూడు వ్యాసములు చదివిరి, అవి సాహిత్య పరిషత్పత్రికలలో ప్రకటితములైనవి. శ్రీనివాసరావుగారు ప్రథమ సభలో స్వాగతోపన్యాసము చదివిరి. ఆంధ్రుల చరిత్ర పురా-

తన కాలము నుండి వివరింపబడినది. "ఆంధ్రనాటకము"లను గూర్చి మరొక చక్కని వ్యాసము చదివిరి. మరుదినము సభలో "ఆర్యుల నాగరకత, వారి దేశాక్రమణము'' అను వ్యాసము చదివిరి. ఈ వ్యాసమును గూర్చి 'వేదవిమ ర్శనోపన్యాసములలో ముచ్చటించి యున్నారు.

ఇంక వారి ఉపన్యాస చమత్కృతికి, విమర్శనాత్మక బుద్ధి నైశిత్యము నకు, కీర్తి ప్రతిష్ఠలకు కారణభూతమైనవి రెండుపన్యాసములు. అవి 1917 ఏప్రిల్ 7,8 తేదీలలో కడపలో జరుపబడిన ఆంధ్ర సాహిత్య పరిషద్వార్షిక సభ కధ్యక్షత వహించి శ్రీనివాసరావుగారు గావించిన ఉపక్రమోప సంహారోప న్యాసములు. ఇవి ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో ముద్రితములు. ఉపక్రి మోపన్యాసమున ఆంధ్ర భాషా చరిత్రలకు సంబంధించిన విషయములను విపుల ముగ చర్చించిరి. భాషకు గల వృద్ధి క్షయములను, భాషా నిర్వచనమును, దేశోన్నతి భాషోన్నతిపై నాధారపడినదనియు, ఆంధ్ర ద్రావిడోత్పత్తినిగూర్చియు దేశ విభజనమును గూర్చియు, ద్రావిడ బ్రాహ్మణులు తమిళులు కారనియు, ఆంధ్రభాష బహుపురాతనమనియు. ద్రావిడు లాంధ్రులనియు వివరించి భాషా ద్వైరూప్యము గలిగిన పద్ధతియు, భాషాభివృద్ధికిగల కారణములను, దక్షిణ హిందూస్థానమున పూర్వము ఆంధ్రము, తమిళము రెండే భాష లుండినవనియు సాహిత్యమును గూర్చియు, విపులముగా చర్చించియున్నారు. నాటకములు నీతి బోధకము, సంఘ సంస్కరణ సమర్థములై యుండవలెననియు, నాటక భాష కావ్యభాషకంటె భిన్నముగ ప్రదర్శనమునకు యోగ్యముగ నుండవలెననియు, వివరించియున్నారు. ఇందులో వీరు 'కళాశాల శిక్ష'ను గూర్చి తెలిపిన వాక్య ములు బ్లేఖించుటెంతయు నవసరము. ''కళాశాలలో నుపాధ్యాయు లాంధ్రులుగానే యుందురు. కావున వారు భాషాభిమానులై బాలురు సలక్షముగ మాటలాడులాగు నను, వ్రాయులాగునను జేయుటకై శ్రద్ధ పుచ్చుకొనినచో నారీతిగా శిక్షింప బడిన బాలురు భవిష్యత్కాలమున భాషాభవనమునకు మూలస్తంభములైయుందు రనుటకు సందియములేదు. కళాశాలలో నాంగ్లేయ భాషా పాఠములుదప్ప మిగత పాఠము లెల్ల మాతృభాషలో బోధింప నిపుడుండు స్థితిలో సాధ్యము కాదని తోచుచున్నది. తెనుగునకు జేరికగ హిందూ దేశ చరిత్ర మొదటి మాతల భాషలో బోధించినను జాలును. మిగత మార్పులగుట కిప్పుడు సాధ్యముకాదు. ఆంధ్రుల యిష్టానుసారముగ ఆంధ్ర విశ్వ విద్యాలయము దైవానుగ్రహమున

నేర్పడినచో నీ మార్పులన్నియును నప్పుడు ప్రవేశ పెట్టనగును" అని శ్రీనివాస రావుగారానాడే ఆకాంక్షించినట్లి సమయమునకు మాతృభాషలో బోధనజరుగుట కవకాశము కలిగినది. అట్టిది వారి దేశాభిమానము, భాషాభిమానమును.

ఇంక వీరి ఉప సంహారోపన్యాసమున విమర్శనాత్మక జ్ఞానమును, ఎదుటి వ్యక్తుల నొప్పింపక తాము నొవ్వక వివక్షణతో వ్యవహరించి సమన్వయించిన పద్ధతి స్పష్టమగును. శ్రీ నాగపూడి కుప్పు స్వామయ్యగారి 'శ్రీనాథుని కవిత్వ' మను నుపన్యాసమును వీరు శ్లాఘించి శ్రీనాథుని శృంగార వర్ణనలచే నీతి బాహ్యుడనుటకు వీలులేదని సమన్వయించిరి. శ్రీవావిలికొలను సుబ్బారావు గారును, నేరేళ్ళపల్లె రామకృష్ణ శాస్త్రిలవారును నుపన్యసించిన పోతన విషయములు శ్లాఘాపాత్రములని పొగడి, పోతన జన్మస్థలమొంటిమిట్టా, లేక ఓరుగల్లా అను వివాదమును సోపపత్తికముగా రెండు నొకటియే యని నిర్ణయించిరి. అయినను రామకృష్ణ శాస్త్రిలవారు జూపిన యుప పత్తులబట్టి పోతన కడప మండలము నందలి ఒంటిమిట్ట నివాసి యనుటయే యుచితమని యంగీకరించిరి. శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మ గారు సంకుసాల నృసింహ కవిని గురించి యుపన్యసింపవలసి యుండినను సమయమునకు వారు రాకపోగా ఆ విషయమును రావుగారే ముచ్చటించిరి. కవి కర్ణ రసాయనమునతో మను చరిత్రను కొందరు పోల్చుట కలదనియు, నది యుచితము కాదనియు, దాని కదియే సాటియనియు రావుగారు వక్కాణించిరి. అందు కుదాహారణముగ మను చరిత్రలోని 'ఇంతలు కన్నులుండ' అను ప్రసిద్ధ పద్యమును గ్రహించి రావుగారు గావించిన వ్యాఖ్యాన మనితర సాధ్యము. ఈ పద్యము వలన పెద్దన నలసజ్ఞుడు, అభినయ శాస్త్రవిదుడు, స్త్రీ స్వభావ లక్షణ వేత్త, లోకానుభవము గలవాడు నని నిరూపించి తమ ప్రతిభా వ్యుత్పత్తులను విమర్శనాత్మక బుద్ధి నైశిత్యమును రావుగారు ప్రకటించిరి. ఇంతవరకు నా పద్యమునకు గావింపబడిన వ్యాఖ్యలతో నిట్టి దింకెక్కడను కనబట్టదు. తరువాత ఉపన్యాసము జదివిన శ్రీ అనంతకృష్ణశర్మగారి విమర్శనా పద్ధతిని గూర్చి రావుగారు మిక్కిలి శ్లాఘించిరి. బ్రహ్మశ్రీ చింతలపల్లి నరసింహశాస్త్రిగారు 'కవిత్వ తత్త్వమును గూర్చి యుపన్యసింపగా దానిని గూర్చి రావుగారిట్లు సమన్వయించిరి. శాస్త్రి గారాంగ్ల భాషను నేర్వకుండుటచే నవీన విమర్శన పద్ధతులంతగా వారికి బోధపడలేదని 'కవిత్వ తత్త్వ విచారము' గావించినవారు ఆంధ్రాంగ్లభాషా వేత్తలయిన

సి. ఆర్. రెడ్డి గారని వారి విమర్శన మెంతయు ప్రశంసనీయమని వక్కాణించిరి. కనుక అట్టి దాని నీసడించుకొనరాదని తెలిపిరి. తక్కిన విమర్శలను గూర్చి యుపసంహారోపన్యాసమున సమీక్షించి తమ ఉపన్యాస నైపుణ్యమును విమర్శక దృష్టిని, సమయ స్ఫూర్తిని శ్రీనివాసరావుగారు వెల్లడించిరి.

—•••—

# ౨౨. వ్యక్తిత్వము

11. పూర్వ ప్రకరణములలో శ్రీనివాసరావుగారి నాటకముల గూర్చి బృహత్ప్రణాళిక పై సమగ్రముగను. ఇతర రచనల గూర్చి పరిచయాత్మకముగను పరిశీలనము జరుపబడినది. అందు రావుగారి బహుముఖ ప్రతిభా వైభవములు సువిదితముచేయబడినవి. ఇట్టి రావుగారి వ్యక్తిత్వము (Personality) ను ఆయా రచనల మూలమున తెలిసికొనుట అవసరము. వ్యక్తి అంతస్తత్వ విశదీకరణమే వ్యక్తిత్వమగును. రచనలలో రచయిత ఆత్మాంశములు (Personal Elements) ఉండి తీరును. అవి స్వతంత్ర రచన లైనప్పుడు తప్పనిసరిగ కవి హృదయము వాని యందా విష్కృత మగును. సామాన్యముగ తెలుగులో నన్నయ మొదలైన అనువాద కవుల హృదయము లెరుగ వీలులేదనుట సర్వజనవిదితమే. అయినను కావ్యావతారికలలోను, స్వతంత్రించి మూలమునకంటె భిన్నముగా రచించినప్పుడును, పాత్రలను భిన్నముగా చిత్రించిన పట్టులందును వారి హృదయములు స్పష్టమగుచుండును. ప్రబంధయుగము నందలి కవులు స్వతంత్రముగ కావ్యములు రచించినను అస్వతంత్రులగుటచే సుస్పష్టరేఖలతో వారి వ్యక్తిత్వములను సైతము తెలిసికొనుట కొంతవరకు కష్టమే. కాని ఆధునిక యుగమున స్వతంత్రభావావేశపూరితులై రచయితలు తమ హృదయములను రచనలలో నావిష్కరింప కుతూహలులైరి. కనుకనే తామాశించిన, తాము ప్రగాఢముగా విశ్వసించినసద్భావములను, ఆశయములను, తమ గ్రంథములలో పొందుపరచుటకు ప్రయత్నించిరి. దీనికి తోడు పరిస్థితులనుకూలించినవి, ఆంగ్ల భాషా సాహిత్యముల ప్రభావముతో తెలుగున సైతము అనేక సాహిత్య ప్రక్రియలు వెలయుట కవకాశము కలిగినది. నాటకము, వచన రచన, వ్యాసము, విమర్శ, పరిశోధన మొదలగు రచన లెన్నియోవచ్చినవి, ఆ యా సాహిత్య ప్రక్రియలను పెంపొందించుటకు సాహిత్య వేత్తలు, శాస్త్రవేత్తలు, మేధాసంపన్నులు అయిన మహానుభావులెందరో ముందడుగు వేసి ఆధునిక

సాహిత్య యజ్ఞమున కంకురార్పణ గావించినారు. ఇట్టి పవిత్రయజ్ఞమున శ్రీని వాసరావుగారు సహితము కొన్ని సమిధలర్పించి తమ ప్రత్యేకతను నిలబెట్టు కొనిరి. వీరు నాటక కర్తగా, కవిగా, వ్యాసకర్తగా, విమర్శకుడుగా, పరిశోధ కుడుగా, సంఘ సంస్కర్తగా, బహుభాషా కోవిదుడుగా తమ వ్యక్తిత్వమును స్థాపించుకొనిన విధమిందు వివరింపబడును.

ఆంధ్ర సాహిత్య పరిషద్వార్షిక సభ కగ్రాసనాధిపతులై శ్రీనివాసరావు గారు గ్రంథములలోని వర్ణనలను బట్టి గ్రంథకర్తృగుణ శీలములను నిర్ణయిం చుట సముచితము కాదని సెలవిచ్చిరి.[1] గ్రంథములలోని వర్ణనలను బట్టి కవుల నడతలను నిర్ధారించుట న్యాయవిరుద్ధమని రావుగారు తలంచినను పూర్వ కవుల వ్యక్తిత్వముల తెలిసికొనుటకంత కంటె వేరు మార్గము గోచరింపదు. కాని ఎందును మినహాయింపులు (Exceptions) ఉండియే తీరునుగదా? కాబట్టి కవుల వ్యక్తిత్వము నెరుగుటకు వారి రచనలుపకరించు ననుటకు సందియములేదు. అదే రీతిని శ్రీనివాసరావుగారి రచనలలో నావిష్కృతమైన వీరి వ్యక్తిత్వమును నిరూపించుటకును, ఆ యా రంగములలో రావుగారికి గల స్థానము సైతము నిర్ణయించుటకును నిందు ప్రయత్నము జరిగినది.

## 11.1 నాటక కర్తగా :

శ్రీనివాసరావుగారు ఇరువది యెనిమిది నాటకములు రచించుటలోనే వీరికి నాటకకర్త కుండ వలసిన లక్షణములు స్పష్టమగును. కాని రచయిత రచనలు అధిక సంఖ్యగాక తద్రచనలలో దెలియనగు శిల్పరామణీయకమే ప్రాధాన్య మును వహించును. అట్టి నాటక శిల్పమునకు కొరత లేదని వీరి నాటకములలో స్పష్టమైనది.

వీరు నాటకములఁ వ్రాసి తించి భద్రపరచుటకు గాక, వానిని రంగమున ప్రయోగించుట యే పరమ ప్రయోజనముగా నమ్మి రచించి యున్నారని ముందే తెలిపితిని. అంత మాత్రముచేత రంగస్థలమున ప్రదర్శించినపుడు విజ

---

1. 140. ఏప్రిల్ 7, 8, 1917. పు. 101-108

యము కలిగిన చాలునను నభిప్రాయము రావుగారికి గలదని తలంపరాదు. వీరు తమనాటకములకు సాహిత్య గౌరవమును సైతము సంపాదింప ప్రయిత్నించి యుండుటయు మనకు ముందే విదితము. అనగా రావుగారు తమ నాటకములకు రంగ ప్రయోజనముతో పాటు సాహిత్య గౌరవమును సంపాదించి యుండుట గమనింప దగిన విషయము. దీనిచే వీరికి నాటక కర్త కుండవలసిన లక్షణము లలో మొదటిది చేకూరినదని స్పష్టమగుచున్నది.

శ్రవ్య కావ్యకర్త కంటె నాటక కర్తృబాధ్యత లధికమనుట సర్వజన విదితమే. ఏ విషయమైనను శ్రవ్యకావ్యమగును. కాని ఏవిషయమైనను నాటక మగుటకు వీలులేదు. కనుక కథను గ్రహించుటలోను, దానిని నాటకేతివృత్త ముగా మలచుకొనుటలోను, నాటక కర్త గొప్పదనము వ్యక్తమగును. శ్రీనివాస రావుగారు నాటక కథలను స్వీకరించి వానిని నాటకోచితముగా కూర్చుకొనుట లోని కథా సంవిధాన చాతుర్యము ఇంతకు ముందే స్పష్టమయినది.

పాత్ర పోషణలో రావుగారి చాతుర్యము సైతము వెల్లడియైనది. నాటక పాత్రలు సజీవములై మనలో నడయాడు వాని వలె నుండవలెను గాని, పిండి బొమ్మలవలెను, గడ్డి బొమ్మలవలెను జీవరహితముగా నుండకూడదు. సజీవ పాత్ర చిత్రణము మూలమున నాటకమునకు ప్రాణము వచ్చును. లేనిచో నది మృతప్రాయము. శ్రీనివాసరావు గారు సజీవ పాత్రచిత్రణము గావించుటయే గాదు. పాత్రల మనస్తత్వ చిత్రీకరణము చేయుటయు వీరి నాటకములలో స్పష్టమగును. షేక్స్పియరు మహాకవితో సమానముగా పాత్రలను చిత్రించి యుండుట రావుగారికి నాటకకర్తగా ఘనతను కొనితెచ్చినది. "రామరాజు చరిత్రము"లో పటాణి పాత్రకల్పన అనన్య సామాన్యము. ఇది రావుగారి పాత్రచిత్రణ సామర్థ్యమునకు పరమ నిదర్శనము. పౌరాణిక నాటకములలో మూలమునందేదేని పాత్రల గుణశీలములలో లొసగులుండిన వానిని మార్చి వేయుటయు, వానిని ఉత్తమ పాత్రల గావింప యత్నించుటయు వీరిలో గలదు. అందుకు ధర్మరాజు, కైకా మంథరలను పాత్రల నుదాహరింపవచ్చును. ఇట్లెన్నియో విధముల రావుగారు సజీవ పాత్రపోషణమునకై యత్నించినట్లు తెలియును.

ఇంకను సన్నివేశ కల్పనమునను సంభాషణ రచనలోను, పాటలు, పద్యములు, భాష ప్రయోగములలోను వీరి నైపుణ్యము అడుగడుగున గోచరించును. ఇట్లు శ్రీనివాసరావుగారికి ఉత్తమ శ్రేణి నాటకకర్తకుండవలసిన విశిష్ట గుణములన్నియు గలవని స్పష్టమగుచున్నది.

శ్రీనివాసరావుగారి నాటకములలో వైవిధ్యమెక్కువ. అందున వీరికి చారిత్రక నాటకములపైనే యధికప్రీతి. ఇటువంటి వీరి దృష్టికి కారణము లేకపోలేదు. పురాణ కథలను గ్రహించి నాటకములుగా రచించుట వలన నాటక కర్త గొప్పదనము వ్యక్తముగాదనియు, చరిత్రలోని కథలను స్వీకరించి వానిని నాటకీకరించుటలో నాటకకర్తృక థాసంవిధాననైపుణ్యము, కల్పనా చమత్కృతి స్పష్టమగునని వీరి ప్రగాఢ విశ్వాసము. వీరు విశ్వసించిన విధము గానే తెలుగున ఏ నాటక కర్తయుచేయనన్ని చారిత్రక నాటకములను రచించి అందు తమ కథా సంవిధాన, కల్పనా చమత్కారములను సైతము వెల్లడించి యుండుటయు నిట గమనింపదగినవిషయము. ఇందుకు వీరి చారిత్రక నాటకములలో 'రామరాజు చరిత్రము', 'సుల్తానా చాందుబీ' పరమోదాహరణములు. ఇంక వీరు పౌరాణికములలో సైతమిట్టి గుణములను పాటించియుండుట ప్రశంస్యము. 'కుశలవ'లో శూర్పణఖా మంథరల మూలమున చిత్రపట కల్పనము చేయుట మొదలైన వానివలన వీరి వైశిష్ట్యము స్పష్టమయినది.

నాటక కర్తకు నాటక లక్షణములు సైతము తెలిసియుండుట విశేషమే. తెలిసి ఆ లక్షణములలో ఉచితమైన వానిని నాటకములలో ప్రవేశపెట్టుట యెంతయు కొనియాడదగిన మరొక విశేషము. శ్రీనివాసరావుగారిలో నిట్టి గుణము కలదు. వీరు నాటక రచనా ప్రయోగములతో సంతృప్తి జెందినవారు కారు. నాటక లక్షణమును సైతము రచించియుండుటయు గమనింపదగినది. వీరు 'ప్రపంచనాటక చరిత్రము' (The Dramatic History of the World) రచించి అందు భారతీయ పాశ్చాత్య నాటక లక్షణములను వివరించిరి తెలుగు నాటక లక్షణ గ్రంథములేదు. కనుక వీరు ప్రాచీన సంస్కృత నాటక లక్షణములను, ఆంగ్ల నాటక లక్షణములను కూలంకషముగా నెరిగి రెండింటిలోను చితమైన లక్షణములను మాత్రము గ్రహించి తెలుగున నాటకములు రచించిరి. అవసరమైనప్పుడు పూర్వ సంప్రదాయములను సైతము వదలివేయుటకును,

ముఖ్యములని తలంచినప్పుడు నూతన పద్ధతులను ప్రవేశపెట్టుటకును వీరు వెను దీయలేదు. కనుకనే రావుగారి నాటకములు క్రొత్త ప్రాతల మేలికలయికతో నొప్పుచు వీరి ప్రతిభకు నిదర్శకములైయున్నవి.

వీరు నాటకకర్తగాను, ప్రయోక్తగాను అత్యధికానుభవము గడించిరి రచనా ప్రయోగములు రెండును పరస్పర సహకారులు. ఈ రెండును రావు గారిలో కలవు. కావుననే ఈ అనుభవముతో ప్రపంచ నాటక చరిత్ర గ్రంథోప సంహారమున నాటక కర్తమొదలైన వారనుసరింపదగిన సూచన లనేకము చేసి యున్నారు. ఇవి సార్వకాలికములు, సర్వజన సమ్మతములు. రావు గారికిట్టి అపురూపమైన అనుభవముండుటచేతనే వీరి నాటకములెంతయు నుత్తమశ్రేణికి జెందినవి కాగలిగినవి. అనగా రావు గారు నాటకకర్తగా నెట్టి యున్నతస్థాయి నందుకొని యుండిరో తెలియుచున్నది.

వీరి నాటక శిల్పమనల్పము. అందుకు వీరు నాటకీయయుక్తులను సంపూర్ణముగా గ్రహించియుండుటయే హేతువు. మరి యిది తప్పనిసరిగా నాటక కర్తకుండవలసిన లక్షణముగదా? అందుకే కొన్ని ఉత్తమ నాటకములుగా రచింపబడిన ఆయా నాటకకర్తలు నాటకీయయుక్తులను గుర్తింపకుండుటచేనవి రంగమున రక్తికట్టకుండపోవునని తెలిపిరి. 'Some dramas though ably written by great poets are not fit for the stage, because these poets are not versed in dramatic language and stage tricks''[1] ఈ మాటలచే నాటకకర్తగా రావుగారెట్టి అర్హతను సంపాదించిరో స్పష్టము కాకమానదు. "మరియు నాట్య చమత్కృతికి నవకాశములును మెండుగనిందు (రామరాజు చరిత్రమునందు) గలవు" [2] అని "రామరాజు చరిత్రము"ను గూర్చి పురాణం సూరిశాస్త్రిగారు చెప్పినను రావుగారి ఇతర నాటకములకు గూడ నిది వర్తించును.

కావ్యకర్తకు ఔచిత్యము మిక్కిలి అవసరమనుట పూర్వోక్తము. అందున నాటకకర్త కిలక్షణమపరిహార్యమైనది. శ్రీనివాసరావుగారి నాటకము లందీ

1. 157. Rules పు. 8 2. 2. పు. 207

గుణము కలదు. వీరు ఔచిత్యముతో తమ నాటకములను రచించియుండుటను ముందే వివరించితిని. పైగుణములన్నియు నొకయెత్తు; ఈగుణమే యొకయెత్తు. ఇట్లు శ్రీనివాసరావు గారిలో నాటకకర్తకుండవలసిన ఈ అర్హతయు చేకూరినది.

పై విధముగా శ్రీనివాసరావుగారు ఆంధ్ర నాటక రచనా ప్రదర్శనముల ప్రథమోషస్సులో నాటక రచనకు పూనుకొన్నను భారతీయ పాశ్చాత్య నాటక లక్షణములను సమన్వయ దృష్టితో పరిశీలించి ఉత్తమమైన వానిని గ్రహించి, తెలుగు నాటక మిదియనునట్లు గద్యపద్యగేయాత్మకముగా రచించి, ప్రదర్శించి నాటకకర్తగా తమ అర్హతలను నిరూపించుకొనిరి.

## 11. 2 కవిగా:

శ్రీనివాసరావుగారు రచించిన పద్యకావ్యమొక్కటి. అది అగస్త్య బాల భారతమున కాంధ్రీకరణము. నాటకము కావ్యభేదములలో నొకటి. "కావ్యేషు నాటకం రమ్యమ్" అనియు, "నాటకాంతం హి సాహిత్యమ్" అనియు నార్యోక్తులుండుటచే నాటకమునకు శ్రవ్యకావ్యము కంటె ఆధిక్యము కలదని స్పష్టమగును. అట్టి నాటక కర్త నాటకమును రంగమున కుపకరించునట్లొనరించుటయే గాక శ్రవ్యకావ్యమున కుండ వలసిన లక్షణములు కల దానినిగా జేయుట యెంతయు నవసరము. సంస్కృతమున నాటక కర్తలను సైతము కవి యనుటయు, నాటకమును అనగా దృశ్యకావ్యమును కావ్యమనుటయు ప్రసిద్ధమే. అనగా కవికుండవలసిన లక్షణములు నాటక కర్తలోను ఉండి తీరవలెనని స్పష్టమగుచున్నది. శ్రీనివాసరావుగారిలో కవితా లక్షణముల కేకొరత లేదు. నన్నయాద్యనువాద కవులనే గాక పెద్దనాది ప్రబంధకవులను అనుకరించుటయు, ఆలంకారికమై ధారాశుద్ధితో సలక్షణముగా పద్య రచనా పాటవమును కొనసాగించి యుండుటయు భావనిర్భరమై సందర్భోచితమై కవిత్వ మొప్పుచుండుటయువీరి నాటక కవిత్వమును గూర్చి చెప్పినప్పుడు విపులముగ వివరించితిని. మామూలు ఛందస్సులనే గాక ఛందో గ్రంథములలో మాత్రమే మనము కననగు వానిని గూడ వాడి యుండుటయు, తాము స్వతః కొన్ని ఛందములను కల్పించి యుండుటయును స్పష్టముగావివరించితిని. ఇంక వీరాంధ్రీకరించిన అగ

స్యే బాలభారతమున సైతము ఇదే విధముగా కవితా పద్ధతులను సంక్షిప్తముగా వివరించియున్నాను. శ్రీనివాసరావుగారి పద్యములలోనే గాక, నాటక సంభాష ణలలోను కవిత్వ ముట్టిపడును. కవి కుండ వలసిన లక్షణములతో ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములు, లోకజ్ఞత జీవితానుభవము మొదలగు గుణములన్నియు వీరిలో నుండుట చేతనే వీరి నాటకము లుత్తమ శ్రేణికి జెందినవిగా నున్నవి.

## 11. 3 వ్యాస కర్త గా:

శ్రీనివాసరావుగారు నాటక కర్తగానే గాని వచన రచయితగా, వ్యాస కర్తగా లోకమునకు తెలియలేదు. అధునిక యుగమున నాటకములతో పాటు వ్యాసములు సైతము రచించియుండుట వీరి ఘనతకు నిదర్శనము. వ్యాసముల సంఖ్యలోను, వైవిధ్యములోను వీరి ప్రతిభ సైతము ప్రకటితమగుచున్నది. చిన్నచిన్న పుస్తకముల రూపమున ముద్రితములైన వ్యాసములు ద్వాత్రింశత్సాల భంజికలవలె ముప్పదిరెండు. ఇందులో భగవద్గీతా విమర్శనోపన్యాసములలో ప్రథమపంచవ్యాసములు ప్రథమగుచ్ఛముగా ప్రకటింపబడినవి తక్కిన వన్నియు విడివిడిగానే కలవు. ఐదారు వ్యాసములు పత్రికలలో ప్రకటితమైనవి కలవు వీనిలో విషయవైవిధ్యమెక్కువ. భగవద్గీత, వేదములను గూర్చిన వ్యాసములధికము. అయినను ఇతర విషయములను గూర్చిన పది వ్యాసములు పది రకములు.

పై వ్యాసములను ఉపన్యాసములని పేర్కొనినను వ్యాసములనుట పూర్వోక్తము. వ్యాసమునకుండవలసిన ముఖ్యలక్షణము ఉపక్రమోప సంహార ములతోగూడి విషయవివరణముండుట. ఈలక్షణము రావుగారి వ్యాసములన్నిట మనము కననగును. ఏవేని వాదములున్న యెడల వానిని పూర్వపక్షము చేసి సయుక్తికముగా హేతుబద్ధముగా తమ అభిప్రాయములను స్థాపించుట వీరి వ్యాసము లన్నిటను స్పష్టమగును. ఈ విషయమును గురించి చింతపల్లి నరసింహశాస్త్రిగారు భగవద్గీతా విమర్శనోపన్యాసముల(పీ.పు.8) గూర్చి విశిష్ట ముగా నుడివినను వారి ఇతర వ్యాసములకు సైతమిది వర్తించును. ఇందుకు రావుగారి ప్రతి వ్యాసముత్తమోదాహరణమే యనుట సాహసముకానేరదు. ఈ వ్యాసములం దేకసూత్రతయు గలదు.

రావుగారి వ్యాసములకు సంక్షిప్తతయే ప్రధాన గుణము. చాలవరకు 20, 30 పుటల వ్యాసములే యధికము. అయినను విషయ వివరణము, చర్చ అవసరమైనప్పుడు మాత్రము తప్పని సరిగా దీనికి మూడింతలు పెరిగిన వ్యాసములు నైతము కలవు. ముఖ్యముగా 'భగవద్గీతా విమర్శనోపన్యాసము' లలో 'వ్యవహార కర్మ జిజ్ఞాసము, సాంఖ్యయోగము, కర్మ సన్న్యాస మంత్రలయ హఠ రాజయోగములు, ధ్యాన యోగము' అను నాలుగు వ్యాసములు చాల విపులముగ చర్చింపబడి వివరింపబడిన పెద్ద వ్యాసములు. తక్కిన వన్నియు చిన్నచిన్న వ్యాసములే.

విషయమునుబట్టి భాష మారుచుండును. అన్నిటికి నొకే మంత్రము పనికిరానట్లు, భాష అన్ని విషయములకు నొకే రీతిగా నుండుట అసహజము. ఆయా విషయానుగుణ భాష యుండుటయే సహజము. రావుగారి భాష నాతి కఠినమై, యొప్పుచున్నది సామాన్యముగా చిన్నచిన్న వాక్యముల రచించుట యే రావుగారికి పరమ ప్రీతి. అయినను అవసరమైనప్పుడు దీర్ఘ వాక్యములు రచించుటకును వెనుదీయరు. ఇంక వీరిలో స్పష్టత (Clarity) అనుగుణ మంతట కన్పట్టుచుండును.

ఇట్లు శ్రీనివాసరావుగారు విషయ వైవిధ్యముతో పాటు సర్వజన వేద్యముగా సులభ శైలిలో అనేక వ్యాసములు రచించి, వ్యాసరచయితగా కూడ ఆధునికాంధ్రవాఙ్మయమున తమ ప్రత్యేకతను నిలబెట్టుకొని యుండుట ప్రశంస్యము.

## 11.4 విమర్శకుడుగా:

శ్రీనివాసరావుగారుగారు వ్యాసముల నుబుసుపోకకై వ్రాసిన వారు గారు విమర్శనాత్మక దృష్టితో పరిశీలించి యుండుట గమనింపదగినది. భగవద్గీతను గూర్చి వ్రాసిన వానిని "భగవద్గీతా విమర్శనోపన్యాసము' లనియే పేర్కొనిరి. తదితర వ్యాసములలోను విమర్శనా విధానము స్పష్టముగా కలదు. కనుక విమర్శకుడుగా శ్రీనివాసరావుగారు వ్యాసములలోను, 'ప్రపంచ నాటక చరిత్రము' లోను తమ వైశిష్ట్యమును వ్యక్తము చేసి యున్నారు.

విమర్శకునకు సహృదయత అవసరము. సహృదయుడనగా కవి హృదయమును చక్కగా నర్థము చేసికొనగలిగిన వాడు. అట్టి సహృదయుడే సద్విమర్శకుడు కాగలడు. స్వపర భేదములు, ఈర్ష్యాద్వేషములు లేనివాడు ఉత్తమ విమర్శకుడు. తన వాదని మెచ్చుకొనుటయు, పరుడని దూషించుటయు కూడదు. సద్విమర్శకున కుండవలసిన ఉత్తమ గుణములన్నియు శ్రీనివాస రావుగారిలో కలవు. ఉచితముగా వివరించినప్పుడు ఆంగ్లేయులను సైతము వ్యాసములలో మెచ్చుకొని వారిని రావుగారు ప్రశంసించిరి. అనుచితముగా జెప్పినప్పుడు భారతీయులను గూడ వీరు విమర్శించిరి. భారతమున భగవద్గీత తరువాతి కాలమున చేర్చబడిన దను వాదమును బ్రహ్మశ్రీ బాలగంగాధర తిలక్కుగా రంగీకరింప కుండుటకు వీరు వారిని పూర్వసంప్రదాయ నాయకుడని విమర్శించిరి. సూటిగా చెప్పదలచిన విషయమును ప్రతిపాదించి, ఏవేని వాద ములున్న వానిని పూర్వపక్షముగా వించుచు తమ అభిప్రాయములను సహేతుక ముగ, యుక్తి యుక్తముగా నిరూపించు పద్ధతిని శ్రీనివాసరావుగారు తమ ఉప న్యాసము లన్నిట పాటించి యుండుట గమనింపవచ్చును.

వీరు శ్రుత పాండిత్యమే పరమావధియని నమ్మినవారు కారు. తెలిసిన విషయమును విచక్షణా జ్ఞానముతో విమర్శించి అసలు విషయమేమిటో తెలిసి కొనవలెనని వీరెన్నియో సందర్భములలో నొక్కి వక్కాణించిరి. "ఆలోచించి నిజమెఱిగిన దానిని వదలరాదు. ఎవరేమి పలికినను ఆలోచింపక దానిని నమ్మరాదు. అది గుడ్డి నమ్మకము. ప్రమాణబద్ధములైనవి మనము నమ్మక తప్పదు. నిజమగు ప్రమాణము లవియా యని విమర్శింపవలెను. యుక్తా యుక్త జ్ఞానము మనకు దైవ మొసఁగినాఁడు. దాని నుపయోగింపవలెను."[1] ఇట్లురావుగారు ప్రతి విషయమున విమర్శనాత్మక దృష్టి అత్యవసరమని ప్రగాఢ ముగా విశ్వసించిరి. ఈ దృష్టితోనే వీరు 'ప్రపంచ నాటక చరిత్రము'ను అనేక వ్యాసములను రచించి ఎన్నియో విషయములలోని సత్యమును వెలిబెట్టియుండుట పూర్వోక్తము. ఇట్లు శ్రీనివాసరావుగారాధునికాంధ్ర వాఙ్మయమున సహృద యుడుగా, సద్విమర్శకుడుగా తమ స్థానమును నిరూపించుకొనిరి.

---

1. ఆర్య వివాహము పు. 15

## 11.5 పరిశోధకుడుగా:

శ్రీనివాసరావుగారు కేవలము విమర్శకుడు మాత్రమే కాదు. వారి విమర్శన దృష్టికి తోడు పరిశోధనాత్మక దృష్టియు సహకరించినది. వీరి నాటకములలోను, ఇతర రచనలన్నింటిలోను వీరికి గల పరిశోధనాత్మక దృష్టి గోచరించును.

చరిత్రనెంతగానో పరిశోధించి నాటకములు రచించిరి. అందులో చారిత్రక విషయములను వివరించుట ప్రధాన విషయము. ఇట్టి పరిశోధనాత్మక దృష్టి యుండుటచేతనే వీరధికముగా చారిత్రక నాటకములను రచించియున్నారు.

'ప్రపంచ నాటక చరిత్రము' వ్రాయుటలోను వీరికి గల పరిశోధనాత్మక దృష్టి స్పష్టమగును. ప్రపంచ నాటకములకు, రంగములకు, నటులకు సంబంధించిన అనేక విషయములను గూర్చి సంపూర్ణముగా పరిశోధించిరి. అనేక గ్రంథములను పఠించి సారమును గ్రహించిరి. అట్లులేని నాడు ప్రపంచ మందలి నాటకముల చరిత్రను అంత ఉత్తమ గ్రంథముగా వ్రాయుటకు సాధ్యమగునా? ఇందు వీరి పరిశోధనాత్మకదృష్టి స్పష్టమగును.

ఇంక శ్రీనివాసరావుగా రుపన్యాసములను పరిశోధనాత్మక దృష్టితోనే రచించిరి గాని కేవల మాషామాషిగాకాదు. సత్యాన్వేషణమే ప్రధాన లక్ష్యముగా భగవద్గీత, వేదములు, ఇతరానేకవిషయముల గూర్చి పరిశోధించి తమ అమూల్యమైన అభిప్రాయములను వెలువరించి లోకమున కెంతయో ఉపకారము గావించిరి. భారత భగవద్గీతలను, ఇతర బహు విషయములను బుద్ధినైశిత్యముతో పరిశోధించి భారతమున ప్రారంభమునుండి భగవద్గీత లేదనియు, అది వ్యాసకృతము కాదనియు, తరువాతి కాలమున నెవరో మహానుభావునిచే నందు చేర్చబడినదనియు సప్రమాణముగా రావుగారు నిరూపించియుండుట వీరి పరిశోధనాత్మక దృష్టికి ప్రబల నిదర్శనముకాదా?

వేదముల గూర్చిన ఉపన్యాసములన్నియు పరిశోధనాత్మకములు. వేదము ఆర్యుల చరిత్రమని నిరూపించి, ఆర్యుల ఆచారములను, గుణశీలములను, వారి గొప్పదనమును వైశిష్ట్యమును వివరించి తమ పరిశోధనా పరిజ్ఞానమును నిరూ

పించుకొనిరి. అతిబాల్య వివాహములు నిషిద్ధములనియు, రజస్వలానంతర వివాహములే ఉచితములనియు, సతీ సహగమనము మహాపాతక మనియు వేదములను పరిశోధించి నిరూపించిరి. పూర్వము స్త్రీలకు సైతము బ్రహ్మోపదేశము కలదనియు, తరువాతి కాలమున మంగళ సూత్రధారణము కలిగినదని మొదలైన వాటిని వివరించిరి. ఎవడును జన్మతోనే బ్రాహ్మణుడు కాడనియు బ్రహ్మజ్ఞానముచేతనే బ్రాహ్మణుడగుననియు నిట్టి యనేక విషయములు వీరు విశదము గావించిరి. దీనికంతటికి వీరి పరిశోధనాత్మక దృష్టియే వేరుగాదు. 'భాస కాళిదాస విక్రమాదిత్యుల కాలనిర్ణయము, ప్రాచీన గ్రంథాలయచరిత్రము' మొదలైన వ్యాసము లన్నింట వీరి పరిశోధనా జ్ఞానము సుస్పష్టమగుచున్నది. ఇట్టు శ్రీనివాసరావుగారు పరిశోధకుడుగా కూడ తమస్థానమును స్థాపించుకొని యుండుట ఎంతయో ప్రశంసనీయమైన విషయము.

## 11.6 సంఘ సంస్కర్తగా :

శ్రీనివాసరావుగారి విమర్శనాత్మక జ్ఞానము, పరిశోధనాత్మక దృష్టి అను రెండును సంఘసంస్కరణాభిలాషకు దోహదము గావించినవి. సంఘములోని దురాచారములను చూచి వేదములు నితర గ్రంథములను పరిశోధింప నిష్టము కలిగినది. ఆ దృష్టితో పరిశీలించి అనేక విషయములు అతి ప్రాచీన కాలమున లేవనియు తరువాతి కాలమున అపద్ధర్మములుగా కలిగినవనియు నిరూపించిరి. తన్మూలమున సంఘమున పాతుకొని పోయిన మూఢ విశ్వాసములను మిక్కిలి నిరసించి సత్యమును వ్యక్తముచేసి, సంఘమును సంస్కరింప వీరు ప్రయత్నించిరి.

శ్రీనివాసరావుగారు పేరు ప్రతిష్ఠల కొరకు సంఘసంస్కర్తకాలేదు. వారాచరించి నిరూపించిరి. ఆ నాడే సర్వజన సహపంక్తిలో వీరు భోజనము నారగించినట్లు వీరి పుత్రుల వలన నేను విన్నాను.[1] సంఘ సంస్కరణము నాశించియే తమ నాటకములలో సైతము సందర్భోచితముగా సాంఘిక దురాచారములను నిరసించి యున్నారు.

---

1. కోలాచల జయరత్నంగారి "కోలాచలం వారి పరిచయము."

వేదములను పరిశోధించి, సంఘమును పీడించుచుండిన అనేక దురాచారములను పోగొట్టుటకై ప్రయత్నించిరి. అతి బాల్య వివాహములు, సతీసహగమనము, వితంతూకేశఖండనము, మాంగళ్యధారణము మొదలైనవి అపద్ధర్మములుగా జేరినవే గాని నిజమైన సంప్రదాయములు గావని నిరూపించిరి. మాంగళ్యధారణముచే వచ్చిన నష్టము లేదు. కాని ఇతరమైన వాని వలన అనేకానర్థములు వాటిల్లినవి. కనుక వానిని పరిత్యజించుట యెంతయు నవసరమని రావుగారు స్పష్టము చేసిరి. సతీసహగమనమును వీరు మిక్కిలి నిరసించియుండుట పూర్వోక్తము. "ఋగ్వేదమున 18వ సూక్తము. పై సూక్తమున 18 ఋక్కులున్నవి. అందున నేడవ ఋక్కులో 'అగ్రే' యను శబ్దముండ దానిని 'అగ్నె' యని దిద్ది యా తిద్దుకు సరిగ నుండులాగున ఋక్కును మార్చిరి [1] రేఫ పొల్లుగనునకారపొల్లుగ మార్చి లక్షల కొలది స్త్రీల నగ్నిలో బడద్రోసిరి పుణ్యాత్ములగు రాజారామమోహనరాయి గారిందులకుఁ గాను సీమకుబోయి యచ్చట నున్న ఋగ్వేదప్రతులను పండితులకుఁ జూపి యధికారులను మెప్పించి స్త్రీలను గాల్చుపద్ధతిని నిలిపివేసిరి."[2] ఇట్లు శ్రీనివాసరావుగారు సతీసహగమనమును పోగొట్టుటకు గాను విషయమును స్పష్టముగావించిరి. జాతి మత భేదములు పూర్వము లేవనియు, తరువాతి కాలమున కల్పింపబడినవనియు వీరు నిరూపించిరి. అపద్ధర్మముగా నేర్పడినది సంప్రదాయముకాదని గట్టిగా వక్కాణించిరి.[3] యజ్ఞయాగాదులలో పశుబలులు లేవనియు, తరువాతి కాలమున నివి కల్పితమనియు వానిని తిరస్కరించిరి.

శ్రీనివాసరావుగారుత్తమ సంఘ సంస్కర్తలైన రాజారామమోహన్‌రాయలను మిక్కిలి ప్రశంసించిరి. వారితో సమాన సంఘ సంస్కర్త ఆంధ్ర దేశ

1. "ముత్తైదువలు కనుఁగవకు నంజనముఁబూసికొని, పాలు, పెరుగు, వెన్న మొదలైనవి తీసికొని తమ తమ భర్తలం గూడి కన్నీరు వదలక, వ్యసనపడక ప్రారంభమున (అగ్నే) శవము సమీపించి పాలుపోయనిండు" [మండలము 10 – సూక్తము 18– ఋక్కు 7] – 'మద్యపానము, జూదము, స్త్రీంగుణములు'– పు. 22, 23.

2. ఆర్య వివాహము. పు. 14. 3. వివాహ కట్టడములు. పు. 19.

మున కందుకూరి వేరేశలింగం పంతులుగారే వీరితో రావుగారికి పరిచయము గలదు. కనుక ఉత్తమ సంఘ సంస్కర్తలయిన వీరి అన్నగారు వేంకటరావు గారు, కందుకూరివారు మొదలైన వారి ప్రభావము రావుగారిపై పడుటలో నాశ్చర్యము లేదు. అందుచేతనే వీరు సంఘ సంస్కరణమును కోరినారు. అందుకై యత్నించినారు. సంఘము నందలి దురాచారములు సంపూర్ణముగా పరిత్యక్తములై నప్పుడే మన సంఘము దేశము, భాష అభివృద్ధిపొంది మరల మన భారతీ యౌన్నత్యమును గాంచుట కవకాశము కలుగునని నమ్మి అందుకు వీరు సంఘసంస్కర్తగా కూడ కృషిచేసి యున్నారు.

## 11.7 బహుభాషా వేత్తగా :

శ్రీనివాసరావుగారి సమస్త రచనల పరిశీలనానంతరము వీరు బహుభాషా కోవిదులనుట స్పష్టమయినది. నాటకములు, అనేకోపన్యాసములు ఆంధ్రభాషలో రచించి భాషాభివృద్ధికి తోడ్పడిరి. భాషాభివృద్ధి గావించుటకు రావుగా రనేక ప్రయత్నములు చేసిరి. ఆలక్ష్యమును జీవితాంతము వరకు కొనసాగించిన వారు రావుగారు.[1] శ్రీనివాసరావుగారు తమ నాటకములన్నిటి స్వతంత్ర పద్య రచన గావించి యుండుటకు వీరి నాటకములన్నియు నిదర్శనమే. ఇంక వచన రచనలు సైతము అధిక సంఖ్యలో గావించి రావుగారు తమ ఆంధ్ర భాషాభిమానమును ప్రకటించిరి.

వేద శాస్త్రములు, పురాణ కావ్య నాటకములు తలముస్కలుగా చదివి, విమర్శించి సారము గ్రహించుటయే గాక సంస్కృత భాషాతత్త్వమును సంపూర్ణముగా ఆకళింపుగావించు కొనిన వారు. శ్రీనివాసరావుగారు వీరి సంస్కృత భాషా పాండిత్య ప్రకర్ష ప్రభావము వీరి రచనలలో స్పష్టముగా కన్పట్టును. సంస్కృత భాషతో నతిమాత్ర పరిచయ ముండుట చేతనే వీరి నాటకములలో లక్షణ సమన్వయము కుదిరినది. 'ప్రపంచ నాటక చరిత్రము'న సహితము సంస్కృత నాటక లక్షణము లను సంపూర్ణముగ వివరింపగలిగిరి. వేదములు, భారతము, భగవద్గీత, మున్నగువానిని సంస్కృతమున పఠించి వానిపై విమ

1. 105. ఉ. పు 1.

ర్శలు రచింప గలిగిరనిన రావుగారిలోగల సంస్కృత భాషాజ్ఞాన మపరిమితమని చెప్పక చెప్పుచున్నది కదా? వీరు భగవద్గీతను తొమ్మిది భాష్యముల సాహాయ్యమున పఠించిరనగానే వీరికి సంస్కృత భాషతో గల పరిచయము తెలియును. సంస్కృతము నందలి 'అగస్త్య బాల భారతము' నాంధ్రీకరించి తమకు గల సంస్కృతాంధ్ర భాషా పాండిత్యములను సుస్పష్టము గావించిరి. వీరి సంస్కృత భాషా పరిజ్ఞానమునకు మరొక్క నిదర్శనము గలదు. అది 'వేదార్థ చంద్రిక' యను మాస పత్రిక. వేదములోని ఋక్కుల ప్రతిపదార్థ తాత్పర్యము తెలుగులో సర్వజన సుబోధముగ రచించి పత్రిక ప్రకటించుటలో గూడ రావుగారి సంస్కృత భాషాజ్ఞానము బోధపడును.

ఆంగ్ల భాషా నిష్ణాతులు రావుగారనుటలో నెట్టి సందియము నుండరాదు. వీరు ఆంగ్ల భాషలోని కావ్యములు, నాటకములు, చరిత్రలు మొదలైన అనేక గ్రంథములు పఠించి పరిశ్రమించినారు. వీరికి గల చారిత్రక పరిజ్ఞానము, అనేక విమర్శల పఠించిన విధానము వీరి చారిత్రక నాటకములు, విమర్శల వలన స్పష్టమగుచున్నది. ఇంతకంటె పరమ నిదర్శనము వీరి 'ప్రపంచ నాటక చరిత్రము' అను నాంగ్ల గ్రంథము. ఆ సమయమున ఆంగ్ల భాషలో నింతటి యుద్గ్రంథమును రచించిన ఆంధ్రుడే లేడన్నచో అతిశయోక్తి గాదు. రావుగారి ఆంగ్లము నందలి బహు గ్రంథ పఠన జన్యజ్ఞాన మంతయు నిందు ప్రస్ఫుటముగా తెలియుచున్నది. వీరు న్యాయవాదవృత్తిలో నుండుటచే తత్సంబంధమైన ఆంగ్ల గ్రంథములను పఠించి న్యాయస్థానమున వాదించి, ఉత్తమాంగ్ల భాషావేత్తగా వీరు రూపొంది యుందురు. వీరి ఆంగ్ల భాష ఆంగ్ల మెరిగిన సర్వజన సుబోధముగా నుండును. నాతి కఠినమై, శబ్దాడంబరము లేక, డొంక తిరుగుడు వాక్యములు లేక సూటిగా చెప్పదలచిన విషయమును వ్యక్తము చేయుట కుపకరించు నట్లుగా వీరి భాష యొప్పారు చుండును. ఇందుకు వీరి 'ప్రపంచ నాటక చరిత్ర మంతయు నిదర్శనమే యగును. శ్రీనివాసరావుగారికి ఆంగ్ల నాటకములతో అతి మాత్ర పరిచయ ముండుట చేతనే 'హేమ్‌లెట్' వంటి పాత్ర 'పటాణి'ని తెలుగున సృజిప గలిగినారు. లేనిచో నిది సాధ్యమయ్యేడిది కాదు. అనేకాంగ్ల నాటక లక్షణములను సమన్వయ దృష్టితో తమ నాటకములలో స్వీకరించుటయు నిందుకుదాహరణ మగును. ఇంతే గాదు. 'రామరాజు చరిత్రము'న కాంగ్లమున The Fall of Vijayanagar అని పేరు. ఆ పేరు మీదుగానే రావుగారి నాట

కము ప్రసిద్ధి పొందుటయు గమనింపదగిన విషయము. శ్రీనివాసరావుగారు తమకు గల ఆంగ్ల భాషాజ్ఞానము నిట్లు స్పష్టము గావించినారు.

మాతృభాష యగు తెలుగుతో సమానముగా కన్నడ భాషలోను శ్రీనివాస రావు గారికి పరిజ్ఞానము కలదు. ఇది వీరికి రెండవ మాతృభాషయని చెప్ప నగును. వీరు జన్మించిన స్థలము హంపి సమీపమందలి కమలాపురము. పెరిగి, న్యాయవాద వృత్తిలో నుండినది బళ్ళారిలో. మరి వీరికి కర్ణాట భాషా జ్ఞానము చేకూరుటలో నెట్టి యాశ్చర్యమును లేదు. కనుకనే శ్రీనివాసరావుగారు తమకు గల కర్ణాట భాషాజ్ఞానమును సైతము వెల్లడించుట కొరకు 'ఆదారమ్మన ప్రహసనవు' అను ప్రహసనము రచించి యున్నారు.

ఇంక శ్రీనివాసరావు గారు 'మహారాష్ట్రభాష'లోను ప్రావీణ్యము గడించియున్నట్లు మనకు తెలియుచున్నది. వీరు మహారాష్ట్రభాష నుండి 'రాక్షసీ మహత్వాకాంక్ష' మానాపమానము'నను రెండు నాటకములను తెనిగించిరి. బ్రహ్మశ్రీ లోకమాన్య బాల గంగాధర తిలక్కు గారు మహారాష్ట్ర భాషలో రచించిన 'గీతా రహస్య'మను గ్రంథమును వీరు పఠించిరి. పఠించుటయేగాదు ఆ గ్రంథము చివర తిలక్కుగారు రచించిన మాయావాదమును రావు గారు 'మాయా వాదోత్పత్తిక్రమ'మను నుపన్యాసముగా తెనిగించిరి. ఒక భాషలో నుండి మరొక భాషలోని కనువదింపవలెననిన ఆనభాషలోసంపూర్ణ జ్ఞానముండిననే గాని కుదరదుగదా? కనుక శ్రీనివాసరావు గారు మరాఠీ భాష నుండి కొన్నింటిని అనువదించి తమ ప్రావీణ్యమును ప్రకటించియున్నారు.

ఇట్లు శ్రీనివాసరావుగారాంధ్రాంగ్ల కర్ణాట భాషలలో రచన చేసియు, సంస్కృతమహారాష్ట్ర భాషల నుండి యనువాదములు గావించియు, సంస్కృతము నందలి వేదములు, భగవద్గీత వీనిపై తెలుగున విమర్శనాత్మక వ్యాసములు రచించియు తాము బహుభాషా వేత్తలని నిరూపించుకొన్నారు. అందుచేతనే యింత వాఙ్మయమును సృష్టింపగలిగినారు.

## 11.8 వ్యక్తిత్వము :

పైని వివరించిన విధముగా తెలుగులో విశాలమైన, ఉత్తమమైన వాఙ్మయ సృష్టి గావించి, నాటక కర్తగా, వ్యాసకర్తగా, విమర్శకుడుగా, పరి

శోధకుడుగా సమున్నతస్థానము నాక్రమించుకొనిన శ్రీనివాస రావు గారి వ్యక్తిత్వము సైతము మెరుగుట యొంతయు నవసరము. వీరి వ్యక్తిత్వమును దెలిసికొనుట కుపకరించు సాధనము లంతగా లేవు. కనుక మనకు తెలిసిన వీరి జీవిత చరిత్రమును బట్టియు, వీరి నాటకాది రచనల మూలముననుు వీరి వ్యక్తిత్వమును నిరూపింపవలసియున్నది. ఇది కొంతవరకు కష్టసాధ్యమైన విషయమే అయినను మనకు గత్యంతరము లేదు గనుక దీని ననుసరించుటయే ఉచితము.

సుఖమయమైన జీవితము గడిపిన వారు శ్రీనివాసరావుగారు. జీవితమున ఆర్థికమైన ఇబ్బందులు వీరికిలేవు. అయినను లోకము తీరెరుగని వారు గారు లోకజ్ఞత వీరి కపారముగా గలదు. కనుకనే జీవితము నందలి యొడుదుడుకులు కష్టసుఖములు బాధలు సైతము తెలిసినవారు. అపారమైన మేధాసంపత్తి, బుద్ధి నైశిత్యము, యుక్తాయుక్తజ్ఞానము వీరిలో అపరిమితము. లోకజ్ఞతతో గూడిన పైగుణములన్నియు శ్రీనివాసరావుగారి కసామాన్య శక్తిని ప్రసాదించినవి. అందుచేతనే రావు గారు సృష్టికి ప్రతిసృష్టిగా నాటక జగత్తును సృజింపగలిగినారు. కావ్యమునకు రసానందమే పరమావధియైనను లోకశ్రేయస్సును సైతమాకాంక్షించి, ఉత్తమ నీతిమంతములైన కథలను మాత్రమే నాటకములుగా జేసి యున్నారు. నీతి బాహ్యమైన ఇతి వృత్తముగల నాటకమే లేదు. ఇట్లు శ్రీనివాసరావుగారు నాటకేతి వృత్త స్వీకరణముననే తమ ఉన్నతాశయమును ప్రకటించియున్నారు.

వీరి నాటక జగత్తులోని పాత్రలనేకములు. ఆయా పాత్రల మనస్తత్వములగూర్చి ముందే వివరించినాను. ఈ పాత్రల తత్త్వముల మూలమునరావు గారి వ్యక్తిత్వము నెరుగనగును. పురుష పాత్రలలో వీరము, త్యాగము, దాతృత్వము, సంయమము, భక్తి, ఉత్తమశీలము మొదలైన గుణములు గల పాత్రలను సృజించిరి. ప్రవృత్తి నివృత్తి మార్గముల రెంటను అత్యధికాభినివేశముగల పాత్రలు సైతము గలవు. సత్యసంధతయే పరమ ధర్మముగా తలంచిన పాత్రలున్నవి. ఇన్ని పాత్రలలోనురావు గారు కన్పట్టుచున్నారు. సత్యధర్మములను ఎల్లప్పుడనుసరించు వారు రావుగారు. అందుకే హరిశ్చంద్ర పాత్రను, దశరథ పాత్రను మిక్కిలి నైపుణ్యముతో పోషించిరి. రామరాజు, ఏచమనాయకుడు, ప్రతాపుడు మొదలగు నాయకులను అబ్బురమును గొల్పు మహో

దారగుణములచే విరాజిల్లునట్లు చిత్రీకరించినారు. ప్రవృత్తి నివృత్తి మార్గముల రెంటను అభినివేశము కల వారినిగా రుక్మాంగదుని నిరూపించిరి. పితృవాక్య పరిపాలనమే గాక, ప్రజానురంజకమైన పరిపాలనాసక్తుడుగా శ్రీరాముని పాత్రలో స్పష్టముచేసిరి.

శ్రీనివాసరావుగారు చాల వరకు గంభీర స్వభావులు. కనుకనే వీరి పాత్రలు సహితము గంభీరముగా నుండును. వీరి పాత్రలలో ఊకదంపుడు మాటల కవకాశము లేదు. వీరి హాస్యము గంభీరముగా నుండి ఒక్కసారి మెల్లగా పెదవుల మీదే చిరనవ్వును స్పష్టము చేయునట్టిది. అవహేళన చేసినను అది గంభీరమై యుదాత్తమై యుండుట రావుగారిలోని ప్రత్యేకత.

వీరి స్వకల్పిత పాత్ర 'పటాణి'. పటాణి పాత్ర చాల విచిత్రమైనది. ఆంధ్ర నాటక వాఙ్మయముననే యొక మహోత్తమసృష్టి. రామరాజు తన తండ్రి యని తెలియని సమయమున అతని వధింప దలచును. అందుకు తగిన ప్రోత్సాహము లభించును. తండ్రిని వధించును. ఆ వధించుటలో గాదు ఆ పాత్ర ప్రాధాన్యము, ఆ వెనుక తాను గావించిన ఘోరమునకు పశ్చాత్తప్తుడై మనఃశాంతి మొనర్చుకొనుటలో ఆ పాత్రోదాత్తత గోచరించును. వాస్తవమునకీ పాత్ర సంక్లిష్ట (Complex) పాత్ర. శ్రీనివాసరావుగారీ పాత్రను సృష్టించి భావగాంభీర్యమును, పశ్చాత్తాపమును వివరించిరి.

దుష్టులను జూచినపుడు సైతము జాలి కలుగు స్వభావము కలవారు శ్రీనివాసరావు గారు. ఎంత దుష్ట స్వభావము కలవారైనను చివరికి పశ్చాత్తాపులగట వీరి నాటకములలో కన్పట్టును. కొన్ని పాత్రలలో సంలీనము చెంది చిత్రించి నట్లగపడును. వీరిలో సాత్త్వికమే ప్రాధాన్యమును వహించినను రాజసము సైతము దానితో సమానముగా నున్నట్లు వీరి పాత్రల మూలముననే తెలియును.

ఇంక స్త్రీ పాత్రలు భారతీయవనితలకు నిదర్శనముగా చిత్రింపబడిరి. పాతివ్రత్యము స్త్రీకి పరమధర్మము. దైవభక్తియు నుండి తీరును. వారు ఉత్తమాదర్శములకు నిలయలు. ప్రాణమునకంటె మానమే

అధికమని విశ్వసించినవారు. ఇట్లు శ్రీనివాసరావుగారు తామాశించిన విధముగానే స్త్రీని ఆదర్శపూరితగా చిత్రించియున్నారు.

స్వప్నములను ప్రగాఢముగ శ్రీనివాసరావుగారు విశ్వసించినట్లవగత మగును. 'రామరాజు చరిత్రము'న తిరుమలాంబ రామరాజు సభలో అషాఢీ ముసుగు తీయించినట్లును, యుద్ధమున అపజయము తథ్యమను విషయమును ముందే స్వప్నములలో గాంచినది. అదే రీతిని జరిగినవి. 'సునందనీ పరిణయ ము'న సునంధని మారాకారుని కలలో గాంచినట్లే ఉద్యానవనమున సుదేవుని చూడగలిగి భాషింపగలిగి వరించినది. 'శిలాదిత్య'లో బలభిపుర రాజు, శిలా దిత్యుడు కలలను గాంచినట్లే సర్వరాజ్య నాశనమేగాక ప్రాణములను గూడ బోగొట్టుకొనిరి. 'పాదుకాపట్టాభిషేకము'న భరతుడు స్వప్నమున తండ్రి పర్వతముపైనుండి గోమయ హ్రదములో దూకినట్లును, నూనెలో మునిగి గాడిదపై దక్షిణ దిక్కునకేగునట్లును రక్తాంబరముల ధరించి రక్తగంధము బూసికొని నగ్నముగా నగ్నిలో నడిచినట్లును అయోధ్య మసమైనట్లును గాంచి నాడు. అదే రీతి తాను పట్టణ ప్రవేశము చేసిన తోడనే ఘోరమైన తండ్రి మరణ వార్త వినవలసి వచ్చినది. 'ప్రహ్లాద'లో లీలావతి కలకాంచినట్లే ఇంద్రు నిచే కొప్పుఐట్టి యీడ్వబడినది. 'బభ్రువాహన'లో అర్జునుని కలయు దుష్ఫలిత మునే గలిగించినది. తెల్లవారు జామున కనిన కలలు తప్పక ఫలితము నిచ్చు ననుట మన విశ్వాసము. అదే రీతిని సునందని, భరతుడు తెల్లవారు జామున కలలుగని ఫలితములనుభవించినట్లు రావుగారు వర్ణించిరి.

శకునముల చూపినను, వానిని అవహేళనము చేయుట గలదు. స్త్రీకి కుడి భాగమదరుట యపశకునమునకు సూచన. 'రామరాజు చరిత్రము'న తిరుమ లాంబకు కుడి కన్ను కుడి భుజము, కుడి తొడ అదరుటచే నది యపశకునము నకు నిదర్శనమని యామెనమ్మెను. 'ప్రహ్లాద'లో దేవేంద్రుడు తనకు దుశ్శకు నము లగపడుచున్నవని బృహస్పతికి తెలుపు నంతలో హిరణ్యకశిపుడు వచ్చి ఇంద్రాదులను హింసించి తన వశము గావించుకొనును. దుస్స్వప్నమును కనిన వెనుక లేచి నడచుచుండ దీపకాంతితో నగపడు తన నీడకు తల లేకపోవుటచే నది అపశకునముగా అర్జునుడు తలంచెను. అంతేగాక యతని వామాంగ మంతయు అదరుచున్నట్లు తెలిసికొనెను. పురుషునకు వామాంగము చలించుట

అపశకునమునకు సూచన. తాను తలచినట్లే పుత్రుడు బభ్రువాహనునిచే వధింపబడును. విధవాముఖదర్శన మపశకున మనుట విశ్వాసము. 'శిలాదిత్య'లో వితంతువైన సుభగ తండ్రితో "తండ్రీ! సరివారలు నన్నుజూచి విధవయని తిరస్కరించుచు నిర్భాగ్యయని దూషించుచు నీ మోముగాంచినచో నమంగళంబని నిరసించుచు నను నొప్పించుచుందురు గదా? దాని నేనెటు సహింతు'? అని వాపోయినది. కాని రావుగారు "ఆచారమ్మన ప్రహసనవు"లో శకునమ్మను ప్రవేశపెట్టి యీ శకునముల నన్నింటిని అవహేళనము గావించిరి. శకునమ్మ లేచిన శకునము, కూర్చుండిన శకునమని విశ్వసించు వనిత. నీతులు చెప్పుచునే అవినీతి పాలయిన గరిత. శకునముపై విశ్వాసముండవచ్చును కాని ప్రత్యల్ప విషయమునకు నీ శకునము నంటగట్ట కూడదని రావుగారి యభిప్రాయమని మనము తలంపవలెను.

ఉపన్యాసముల మూలమునను శ్రీనివాసరావుగారి వ్యక్తిత్వము తెలిసికొనవీలగును. వీరు సంప్రదాయబద్ధులు. వేదశాస్త్ర పారంగతులు. కాని వీరెంత సంప్రదాయ బద్ధులో అంత సంస్కరణాభిలాషులు. ఇందుకు వీరి 'వేదవిమర్శనోపన్యాసములు' పరమోదాహరణములు. ఆధ్యాత్మిక చింతన గలవారు. దీనికి వీరి 'భగవద్గీతా విమర్శనోపన్యాసము' సాక్షి. ఇహసుఖములతో పాటు పారమార్థిక చింతనమును కోరిన వారు. భగవద్గీతా పంచమాధ్యాయము కర్మసన్న్యాస యోగము నందలి "సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ। తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే" (5-2) అను శ్లోకమును పూర్తిగా నమ్మిన వారు. నమ్ముటయే గాదు ఆచరించిన వారు అనగా త్రికరణశుద్ధి కలవారన్నమాట

"వినదగు నెవ్వరు చెప్పిన" అను సూత్రము ననుసరించిన వారు రావుగారు. కాని ఎవరో చెప్పిన వానినన్నింటిని గ్రుడ్డిగా నమ్మెడి వారు కారు. ''విని నంతనె వేగపడక వివరింప తగున్." విని నంతనె విమర్శించి సత్యమును గ్రహింప వలెననుట వీరి ప్రగాఢ విశ్వాసము.[1]

1. వివాహ కట్టడములు. పు. 18, 19.

మోమాట మెరుగని వారు శ్రీనివాసరావు. ఇందు స్వపరభేదముసైతము లేదు. ఉచిత విషయముల జెప్పిన వారిని పాశ్చాత్యులను సహిత మెంతగానో ప్రశంసించిరి. కాని వాస్తవమును కప్పిపుచ్చునపుడు భారతీయులు, పాశ్చాత్యులు అను విచక్షణ లేక వీరు విమర్శించిరి. ఇట్టిది వీరి స్వభావము.

జాతి మత భేదములను మిక్కిలి గర్హించినవారు రావుగారు. మానవులందరు మను సంతతి, పరమాత్మ ఒక్కడు అని విశ్వశించిన సంగతి అనేక సందర్భములలో వీరి రచనలలో వ్యక్తమైనది. సంఘము నుద్ధరింప తపన పడినవారు వీరు. అనేక దురాచారములను వీరు గర్హించినట్లు మనము ముందే తెలిసి కొన్నాము. వీరు సద్బ్రాహ్మణులయ్యును ఆనాడు బ్రాహ్మణులలో ఆచారము పేరిట జరుగుతున్న అనాచారములను మిక్కిలి తెగడియుండుటయు కుక్షింభరత్వమే పరమావధిగా తలంచి సోమరులై తిరుగు తిండిపోతులను గర్హించుటయు వీరి సంఘసంస్కరణాభిలాషను వ్యక్తముచేయును. సంఘము, దేశము, భాష వీని అభివృద్ధులను ఎల్లవేళల కాంక్షించిరి. తస్మాలమున భారత దేశ పూర్వపు ఔన్నత్యమును పునస్థాపింప త్రికరణశుద్ధిగా కోరిన మహాశయులు కోలాచలం వారు. రావుగారు కీర్తి ప్రతిష్ఠలకై ఎప్పుడును ప్రాకులాడినవారు కారు. అట్టివారిని గాంచిన రావుగారికి పరమాసహ్యము.

ఇట్టు శ్రీనివాసరావుగారి వ్యక్తిత్వము వీరి రచనల మూలమున ప్రత్యేక స్థానము సంపాదించుకొన్నదని విశదమగుచున్నది.

## 11.9 ఆంధ్ర నాటక వాఙ్మయము - శ్రీనివాసరావుగారి స్థానము :

ఇతఃపూర్వము శ్రీనివాసరావుగారిని గూర్చి అన్ని దృక్కోణముల నుండి పరిశీలించి వారికి గల వాఙ్మయ నిర్మాణ దక్షత నిరూపితమైనది. చిట్టచివరిగా వీరి కాంధ్ర నాటక వాఙ్మయమున గల స్థానమును నిర్ణయింపకుండ వదలిపెట్టుట ఈ పరిశీలనము సముచితము, సమగ్రము కాదని తలంతును.

శ్రీనివాసరావుగారి సమకాలికులలో కందుకూరి విరేశలింగం పంతులుగారు ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు, చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారు,

వేదం వేంకటరాయశాస్త్రిగారు, గురజాడ వేంకట అప్పారావుగారు, పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు మున్నగు వారు పేర్కొనదగినవారు. వీరందరు నేదో యొక విధముగ ఆధునిక యుగమున వెలసిన ఆంధ్ర నాటక వాఙ్మయమును పోషించి తమ వైశిష్ట్యమును నిలబెట్టుకొనిన మహానుభావులు. వీరి సరసనే యుండి తమ వైలక్షణ్యమును వ్యక్తము గావించుకొనినవారు శ్రీనివాస రావుగారు. ఆధునికాంధ్ర వాఙ్మయ నిర్మాతలలో ప్రథమస్మరణీయులు కందుకూరి వీరేశలింగం పంతులుగారు. కనుక 1905లో శ్రీనివాసరావుగారు బళ్లారిలో నిర్మింపజేసిన "వాణీ విలాస నాటకశాల"ను బాలగంగాధర తిలక్కు గారిచే ప్రారంభముచేయించి, కందుకూరి వారిచే నుపన్యాస మిప్పించిరి. దీని వలన పంతుల గారిపై రావు గారికి గల గౌరవము వ్యక్తమగును. శ్రీనివాసరావుగారి కంటె ముందే కందుకూరి వారు ప్రహ్లాద, సత్యహరిశ్చంద్ర నాటకములను రచించిరి. శ్రీనివాసరావుగారు సుమనోరమసభ వారి కొరకు 'సత్యహరిశ్చంద్రీయము' రచించిరి.[1] తరువాత "ప్రహ్లాద" ను సహితము రచించిరి. రావు గారు కందుకూరి వారి "సత్యహరిశ్చంద్ర" నాటకమును పఠించియున్నారు.[1] రావు గారు గద్యపద్య గేయాత్మకముగా రచించియుండ కందుకూరి వారివి కొలది పద్యములలో నున్న వచన నాటకములనవచ్చును. కందుకూరి వారిలో కంటె రావుగారి నాటకములందు శిల్పమనల్పము సంఘ సంస్కరణార్థము కందుకూరి వారు ప్రహసనములనేకము రచించియున్నారు. రావుగారు సహితము మూడు నాలుగు ప్రహసనములను రచించి సంఘమునందలి దురాచారములను అవహేళనము చేసి యుండుట పూర్వోక్తము.

శ్రీనివాసరావుగారి సమకాలికులలో పంతులుగారి తరువాత ప్రధానముగ పేర్కొన దగిన వారు ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారు. ధర్మవరం, కోలాచలం వారలలో అనేక సామ్యములు గోచరించును. నాటక రచనముననే గాక ఇతరత్ర సహితము సమానమైన పోలికలు కలవు. వీరిద్దరు బళ్లారి నివాసులు; న్యాయవాద వృత్తినవలంబించిన వారు. ధర్మవరం వారు "సరసవినోదినీ"సభ కధ్యక్షులై యుండ, కోలాచలంవారు "సుమనోరమసభా"నాటక సమా

---

1. 102. ఉ. పు. 2.

జమున కాధిపత్యమును వహించి యుండిరి. ఇద్దరును నాటక కర్తలు, ప్రయోక్తలు. ధర్మవరం వారు స్వయం నటకులు. రావుగారెల్లప్పుడు తెరవెనుక నుండి ప్రదర్శనముమ జయప్రద మొనర్చిన వారు. ధర్మవరం వారికి పౌరాణిక నాటకములపైనభిమాన మధికమైనను ఒక చారిత్రకము (రోషనారా శివాజీ) సైతము రచించిరి. శ్రీనివాసరావుగారు చారిత్రక నాటకములపై నధిక ప్రీతితో ననేక నాటకములు రచించియు ఒక క్రమపద్ధతితో పౌరాణిములను గూడ చేసిరి. వీరిద్దరిలో సమానేతి వృత్తములుగల నాటకములు. ప్రహ్లాద, పాదుక, రుక్మాంగద, హరిశ్చంద్ర, చంద్రహాస, సీతాకల్యాణము అనునవి. వీరిద్దరు గద్యపద్య గేయాత్మకములుగ నాటకములు రచించి తెలుగు నాటకములకు పునాదులు వేసిరి. వీరిద్దరి నాటకములలోను భారతీయ పాశ్చాత్య నాటక లక్షణములలోను త్తమమైనవి గృహీతములు. నాందీ ప్రస్తావన లెడనెడ కన్పట్టినను వీరిద్దరును వీనిని క్రమముగా త్యజించిరి. అర్థోపక్షేపకములను పరిత్యజించిరి. అంకములను రంగములుగ విభజించిరి. పూర్వోత్తర రంగములు (Prologue and Epilogue) ప్రవేశపెట్టిరి. ధర్మవరంవారు విషాదాంత నాటకరచన కాద్యులు. రావుగారిలోను రెండు మూడు విషాదాంతనాటములు కలవు. ధర్మవరం వారు 'ఆంధ్ర నాటక పితామహుడు' కాగా, కోలాచలంవారు 'ఆంధ్ర చారిత్రక నాటక పితమహుడు' ఇట్లు వీరిద్దరిలో సమాన గుణములున్నను రావుగారితో ధర్మవరం వారికంటె వైశిష్ట్యముండుట గమనింపదగిన విషయము. ఆంధ్ర దేశమున నాటక శాల లేని కొరతను దీర్పప్రథమముగా 1905 లో బళ్లారిలో వాణీవిలాస నాటక శాల'ను రావుగారు నిర్మింపజేసిరి రావుగారు. ప్రాచ్య పాశ్చాత్య నాటక పరిచయ జన్య జ్ఞానమునకు, వైదుష్యమునకు తార్కాణముగా 'ప్రపంచ నాటక చరిత్రము' రచించిరి. ధర్మవరం వారి కంటె రావుగారిలో పాత్రల మనస్తత్వమును సువిదితము చేయుటలో సామర్థ్యమెక్కువ. రావుగారిలో ఔచిత్యపాలన మధికము. అందుచేతనే రంగమున చుంబన పరిరంభణాలను వీరు త్యజించిరి. కాని ధర్మవరం వారు మాత్రము వీనిని ప్రదర్శించిరి. విషాదాంత నాటక రచనకాద్యులు ధర్మవరం వారైనను వారి విషాద సారంగధర నాటకమున కంటె రావుగారి రామరాజు చరిత్రమే ఉత్తమ విషాదాంత నాటక మనవచ్చును. విషాదాంత నాటకమున నాయకుడు విషాద భావ సంభరితుడై యుండవలెను. సారంగధరుడు మూసపోసిన సచ్ఛీలము. అంత కంటెను

రావుగారి 'పటాణి' నిజమైన విషాద నాయకుడు. ధర్మవరం వారు తమ నాటకములను గద్యగేయాత్మకములుగ రచించి పూర్వోకవుల పద్యములను గ్రహించెడివారు. కాని రావుగారి కది యిష్టములేదు. ఆంధ్ర భాష నభివృద్ధి పరచుటకై పద్యములు రచింపవలెననెడి భావమును వెలుబరించి తదుచిత రీతిని రావుగారు పద్య రచన గావించినారు.[1] సాంఘికాది పరిస్థితులను ధర్మవరం వారు పౌరాణికములలోను ప్రవేశపెట్టి Anachronism అను దోషమునకు తమ నాటకములను గురిచేసిరి [2] కాని రావుగారనేక సాంఘిక దురాచారములను తమ నాటకములలో విమర్శించి, గర్హించినను అట్టి దోషము వీరి నాటకముల కంట లేదు. ఇది శ్రీనివాసరావుగారి లోవి వైశిష్ట్యము. ధర్మవరం వారు సహజ హాస్యప్రియులు. వారి నాటకములలో నిది కన్పట్టును. రావుగారి నాటకములలోను హాస్యమున్నను వీరు సహజ గంభీర స్వభావులని స్పష్టమైనది. వీరిద్దరి నాటకములు బహు ప్రదర్శనములచే ప్రచారము నందినవి.[3] ఇట్లు శ్రీనివాసరావుగారు ధర్మవరం వారి కంటె కొన్ని విషయములలో నిట్టధికులుగానే కన్పట్టుదురు. ధర్మవరం,కోలాచలం వారల గూర్చి శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు సముచిత రీతిని విమర్శించి యున్నారు.[4] శ్రీ శ్రీనివాస చక్రవర్తి గారు ధర్మవరం వారి కంటె రావుగారే నాటక కర్తగా శ్రేష్ఠులనివివరించినారు.

చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు మొదట వచన నాటకములు రచించిరి. తరువాత పద్యములు జోడించిరి. అయినను వారి గయోపాఖ్యానమపారముగ జనాదరణకు నోచుకున్నది. కాని వారి నాటకములన్నిట సంస్కృత నాటక లక్షణము లనుసరింపబడి యుండుటచే శ్రీనివాసరావుగారి నాటకములతో పోల్చుట కవకాశములేదు.

వేదం వేంకటరాయ శాస్త్రిగారి నాటకములు పద్యగద్యాత్మకములే గాక వాని యందెడనెడ పాటలు సైతము గలవు. వేదం వారి సంస్కృత నాటక లక్షణములను తూ.చా. తప్పక అనుసరించినవారు.'అనగా వారు సంప్రదాయబద్ధులు

1. 105. ఉ. పు. 5. 2. 11. పు. 204.
3. 25. పు. 285, 186; 4. 8. పు. 87-79.
5. 42. పు. 45, 46.

రంగములుగ అంకములు విభజింపబడుటనువీరంగీకరింపరు.కాని రావుగారి నాటకములు వీనికి వ్యతిరేకములు.వీరు చారిత్రక నాటకములను రచించిరి.కానినిజమైన చారిత్రకనాటకకర్త రావు గారనుట ముంచే వివరించిపబడినది.వేదం వారుతెలుగు నాటకములలో క్రొత్తగా ప్రవేశపెట్టిన లక్షణము పాత్రోచితభాష. పాత్రోచిత భాషనాటకములలో నెంతయు ముఖ్యమని వారు తలంచిరి.కానిశ్రీనివాసరావుగారు మాత్రము ఒకటి రెండు నాటకములలో అక్కడక్కడ నీచ పాత్రలకు గ్రామ్యమును వాడి యున్నను దానిపై నధిక ప్రత్యయమున్నవారుగాదు వేదం వారు ప్రతాపరుద్రీయము'న అసమాన్యమైన'పేరిగాని' పాత్రను సృజింప శ్రీనివాసరావుగారు 'రామరాజు చరిత్రము'న అనన్య సామాన్యమైన 'పటాణి' పాత్ర సృష్టించిరి. ప్రతాప రుద్రీయము న వారు 'పేరిగాని' వలనను, పిచ్చివాడైన 'చెకుముకిశాస్త్రి' మూలముననను అద్భుతమైన హాస్యమును పోషించియుండ, వీరు 'కాళిదాసు' నాటకమున 'డంబర వాని' వలనను,పిచ్చెత్తిన ముంజ రాజువలనను సున్నితమై యొప్పు హాస్యమును పరిపోషించిరి.

గురజాడవారు వ్యావహారికభాషతో సంఘ సంస్కరణాభిలాషతో 'కన్యాశుల్కమును" రచించిరి. అతి బాల్య, వృద్ధ వివాహములను గర్హించుట, కన్యాశుల్కమును తెగడుట, వేశ్యావృత్తి నిర్మూలనము నను దానిని దృష్టిలో నుంచుకొని వీరు నాటకమును రచించిరి, శ్రీనివాసరావుగారికి సహిత మిట్టి సంఘ సంస్కరణాభిలాష గలదు. వీరి నాటకములలోను, ప్రహసనములలోను నిది స్పష్టము చేయబడినది. తెలుగున సున్నితమైన హాస్యమునకు పరాకాష్ఠ 'కన్యాశుల్కము". అయినను రావుగారిలోను నిట్టి హాస్యమునకు కొదవలేదు. గురజాడ వారు భాషా సంస్కారవాదులు, అనగా వ్యావహారిక భాషా వాదులు. కాని శ్రీనివాసరావుగారు వ్యావహారిక భాష నంగీకరింపక, భాషాభివృద్ధి కోరిన వారు.

పానుగంటి లక్ష్మి నరసింహారావుగారు ముప్పది నాటకములు రచించిరి. శ్రీనివాసరావుగారును ఇరువదెనిమిదికి నాటకములు రచించిరి. శ్రీనివాసరావు గారి నాటకములు గద్యపద్య గేయాత్మకములు. కాని లక్ష్మి నరసింహారావుగారి ఒకటి రెండు నాటకములలో ఒకటి రెండు పాటలుగలవు. ఇంక వృత్తములు

నాటకములందుండ గూడదనియు వానిని రాగ యుక్తముగా పాడరాదనియు. పానుగంటి వారి అభిమతము. శ్రీనివాసరావుగారు పద్యములు, పాటలు రచించి వానిని రాగయుక్తముగా పాడవలెనని నిర్దేశించిరి. పానుగంటి వారి కంఠాభర ణాదులతో సంఘ సంస్కరణాభిలాష వ్యక్తమగును. శ్రీనివాసరావు గారిలో నిది స్పష్టము. పానుగంటి వారిలో హాస్యము సహజగుణము. అయినను వారి హాస్యము ముదిరి అశ్లీలస్ఫోరకమై యుండుటయుగలదు. కాని రావుగారి హాస్య మున కిది యంటలేదు. ఉదాత్తతయే దీని వైశిష్ట్యము. పానుగంటి వారు రామా యణ సంబంధేతి వృత్తములతో నాలుగు నాటకములు రచించిరి. శ్రీనివాసరావు గారును ఐదు రామాయణ నాటకములు రచించిరి. పానుగంటి వారి పట్టభంగ రాఘవముతో పోల్చదగినది కోలాచలంవారి పాదుకా పట్టాభిషేకము. పానుగంటి వారి 'పట్టభంగ రాఘవము' ను గూర్చి వ్రాయుచు డాక్టర్ ముదిగొండ వీర భద్రశాస్త్రిగారు ధర్మవరం, కోలాచలం వారల "పాదుకా పట్టభిషేక నాట కము" లలో కంటె పానుగంటి వారు తమ నాటకమున సంపాద కౌశలము, పాత్ర మనస్తత్వ నిరూపణము ప్రధానముగా తీర్చినారని తెలిపి పంతులుగారి నాటకములోని ఉదాత్తత తక్కిన వారి రచనలలో లోపించినది. లక్ష్మీ నర సింహారావు గారి నాటకములోని రసపరిప్లుతియు, కావ్యత్వమును తక్కిన వానిలోలేవు."[1] అనిలిఖించిరి. చతురమైన భాషవ్రాయుటలో పానుగంటి వారద్వి తీయులనుటకు సందేహములేదు. అంతమాత్రముచేత కోలాచలం వారిలో సంవాద కౌశలము లేదనుటలో సామంజస్యములేదు. పాత్రల అంతర తత్వము నెరుగు టలో, తన్నిరూపణములో కోలాచలం వారసామాన్యులు. ఇంక కోలాచలం వారి పాదుక ప్రదర్శన యోగ్యమై రసపరిప్లుతితో కావ్యత్వమును సహితము సంపాదించుకొన్న ఉత్తమ నాటకము. కోలాచలం వారి నాటకముల సంభాషణ రచనా నైపుణ్యము, ప్రదర్శన యోగ్యత, పాత్రపోషణ సామర్థ్యము మున్నగు నుత్తమ గుణములు ముందే స్పష్టములైనవి. ఇట్లు కోలాచలంవారు పానుగంటి వారితో నేవిధమునను తీసి పోరనుట స్పష్టమైనది.

[illegible]

1. [illegible] 50. పు. 101

ఇంక తిరుపతి వేంకట కవుల భారతనాటకములు బాల ప్రసిద్ధములు. శ్రీనివాసరావుగారును భారతమునకు సంబంధించిన నాటకములు నాల్గు రచించి యున్నారు. అయినను వీరి నాటకముల కంతగా ప్రచారములేదు. తిరుపతి వేంకట కవులు సహజముగ ఆశుకవులు. పద్యరచనా పాటవము వారి సొత్తు. అంత మాత్రముచేత శ్రీనివాసరావుగారి నాటకములలో పద్య రచనా పాటవము లేదని కాదు. కాని అనేక నాటక సమాజములు తిరుపతి వేంకటకవుల నాటకములు పలుతావులలో ప్రదర్శించి యుండుటచేత వీరి నాటకముల కధిక ప్రచారము కలిగినది. అట్టి అవకాశము రావుగారికి లభింపలేదు. పైగా తిరుపతి వేంకటకవుల నాటకములిటీవలివి.

ఇట్లే శ్రీనివాసరావుగారు మహోన్నతముగ సత్యహరిశ్చంద్రీయమును రచించి యుండ, దీనికిలేని ప్రచార ప్రజాదరణములు బలిజేపల్లి వారి హరిశ్చంద్ర నాటకమునకు వచ్చినవి. రావుగారి నాటకమెందును దీనితో తీసిపోదు. పైగా ఆనాటి వరకు రచితములైన పూర్వ హరిశ్చంద్ర నాటకములను చూచి బలిజేపల్లి వారు తమ నాటకమునకు మెరుగులు దిద్దుచు రచించి యుందురని తలంపవలెను.

శ్రీనివాసరావుగారు కుశలవ నాటకమును మహోత్తమముగా రచించి యున్నారు. పండిత కె. సుబ్రహ్మణ్యశాస్త్రి గారు రావుగారి నాటకములోని కల్పనలను గ్రహించి తామే యట్టి కల్పనలను గావించితిమని ప్రచారము చేసికొన్నారు. అందుకు రావుగారు కుశలవ నాటక పీఠికలో పేరెత్తకయే గర్హించి యున్నారు.[1] అనగా రావుగారు నాటకముల ననుసరించి గ్రహించి యిట్లు తమ సొంతములుగా జెప్పుకొనుటకు రావుగారు కారకులైరి యనుటచే వీరి గొప్పదనము స్పష్టమగునుగదా ?

కోలాచలం వారిలో గల పద్యగద్య గేయాత్మక నాటక రచన ఇతరులను సైతము మట్టి నాటకములు రచించునట్లు దోహదము కావించినది. అనగా వీరి ప్రభావ మితరులపై సైతము ప్రసరించినదని యర్థము. శ్రీముత్తరాజు సుబ్బా

---

1 104. ఉ. పు. 2.

రావు గారి శ్రీకృష్ణతులాభారము (1920) మొదలైన నాటకములిందుకుదాహరణ ములు. శ్రీనివాసరావుగారు పటాణికి భావ సంఘర్షమునకై రచించిన దీర్ఘ స్వగతముల ప్రభావము గూడ తరువాతి నాటక కర్తలందరి పై ప్రసరించి, సుదీర్ఘ స్వగతములు రచన కవకాశము కల్పించినది. ఇట్లనేక విధముల రావుగారి ప్రభావ మాంధ్ర నాటక వాఙ్మయముపై గలదు

ఉత్తమ నాటక కర్తగా శ్రీనివాసరావుగారిని ప్రప్రథమముగా గుర్తించిన వారు చేకమళ్ల అచ్యుత రావుగారు. వీరి నాటకమును బహుధా ప్రశంసించిరి.[1] 'కవిత్వవేది' శ్రీ కల్లూరు వేంకట నారాయణ రావుగారు, ధర్మవరం కృష్ణమాచార్యులు, చిలకమర్తి లక్ష్మీ నరసింహం, కోలాచలము శ్రీనివాసరావు, వేదము వేంకటరాయశాస్త్రి అను నలుగురు నాటక కర్తల నుద్దేశించి పైవారు వరుసగా కవిత్వ ప్రాధాన్యమున Shakespeare, Marlowe Benjonson, Webster లను బోలుదురేమో?" అని నుడివిరి.[2]కాని రావుగారు బెన్‌జాన్సన్ ను గాక షేక్స్పియరును పోలిన వారని పూర్వోక్తము. ఇంక నాటక కళ పునరుద్ధరణమునకై ఏర్పాటు చేయబడిన కార్యవర్గము సమర్పించిన నివేదికలో ఉత్తమశ్రేణి నాటకకర్తలలో (Some Leading Play Wrights) నొకరుగా రావుగారును, ఉత్తమ నాటకములలో నొకటిగా వీరి "రామరాజు చరిత్రము"ను గుర్తింపబడి యుండుట గమనింపదగినది.[3]

సమకాలిక నాటక కర్తల కంటె శ్రీనివాసరావుగారిలో గల వైశిష్ట్యము నిట్లు చెప్పనొప్పును.

శ్రీనివాసరావుగా రనేకేతివృత్తములతో ఇరువదెనిమిది నాటకములు రచించిరి ఇందులో వైవిధ్య మెక్కువ. వీరికి చారిత్రకేతి వృత్తముల పై నత్యధికాభిమానము. కనుకనే ఎనిమిది నాటకములు రచించిరి. ఏ ఆంధ్ర నాటక కర్తకు నిట్టి ఘనత లేదు. నిజమైన చారిత్ర నాటక నిర్మాత రావుగారు. రామాయణము, భారతము, భాగవతము, నితర పురాణముల నుండి ఇతర నాటకకర్తలు

---

1. 5 పు 82, 67. 2 13 పు. 284, 285
3 163.

రచింపనివి గూడ రచించిరి, మరాఠీ భాషా నాటకములను రెండింటిని అను వదించిరి యువతీ వివాహమను సాంఘికనాటకమును రచించిరి. కాని అదీ లభింపలేదు. సునందనీ పరిణయమును రచించి తమ కల్పనా శక్తిని ప్రకటించిరి. ఇంత వైవిధ్యముతో నిన్ని నాటకములు రచించుటయే గాదు, నాటకోచిత లక్షణము లన్నియు నిందు పొందు పరచి ప్రదర్శనయోగ్య మొనరించి ఔచిత్య నిర్వహణమొ నరించి అనల్పశిల్పమును పాటించి యుండుట రావుగారి నాటకములలోని ప్రత్యేకత. చారిత్రికేతివృత్తముల స్వీకరించి నాటకములు రచించి, ఆంధ్ర చారిత్రక నాటక పితమహాను అను ప్రతీతిని పొందుట ఎంతయు సమంజసము.

మూడు నాలుగు ప్రహసనములే రచించినను, సంఘసంస్కరణమే ప్రధాన లక్ష్యమైనను, శ్రీ కందుకూరి వారు మొదలైన వారు ప్రహసనములలో సాధింపలేని శిల్పమును శ్రీనివాసరావుగారు సాధింపి యుండుట మిక్కిలి ప్రశంసింపదగిన విషయము.

నాటక రంగమభివృద్ధి చెందవలెనన్న నాటకశాలంవసరము. ఆంధ్ర దేశమున నాటకశాలలు లేని సమయమున అధికధనము వెచ్చించి ప్రప్రథముగా వాణీ విలాస నాటక శాలను బళ్లారిలో నిర్మింప జేసిన ఘనత రావుగారికి దక్కినది. ఇందుచే వీరు నాటక కళాభివృద్ధికై యెంతగా శ్రమించిరో సువ్యక్తమగును.

ఇతర నాటక కర్తలు నాటకములు రచించిరే గాని నాటక లక్షణము వ్రాయలేదు. వీరు రచించిన 'ప్రపంచ నాటక చరిత్రము' వీరి ప్రపంచ నాటకములకు సంబంధించిన పరిజ్ఞానమునకే గాక భారతీయ పాశ్చాత్య నాటక లక్షణ సమన్వయ జ్ఞానమునకే ప్రథమ నిదర్శనము. నాటక కర్తలు, నటులు మున్నగు వారనుసరింపదగిన యనేకకాంశములను ఈయుద్గ్రంథమున సమకూర్చి రావుగారు నాటక కళ కెంతేని సేవగావించిరి. ఇది వీరిలోని ప్రత్యేకత. వీరి బహుభాషాకోవిదత్వము పై గుణముల కన్నిటికిని దోహదకారియైనది. వీరు బహుభాషావేత్తలగుట చేతనే తమ నాటకముల నంతశ్రేష్ఠములైన వానినిగా తీర్చి దిద్దగలిగిరి.

రావుగారు సంస్కారశీలి. వీరెంత సంప్రదాయబద్ధులో అంతకంటె సంస్కరణము నభిలషించినవారు. ఇట్లుశ్రీనివాసరావుగారు సమకాలిక నాటక కర్తలలో కంటె అన్ని విషయములలోను ప్రత్యేకతను కలిగియుండి ఆధునిక యుగమున వెలసిన ఆంధ్ర నాటక వాఙ్మయమున సమున్నత స్థానము నాక్రమించుకొనియున్నారు. "నాటక రచయితగా, ప్రయోక్తగాగా, లాక్షణికుడుగా కోలాచలం శ్రీనువాసరావుగారు తెలుగు నాటక రంగానికి చేసిన సేవ అమూల్యమైనది."[1]

ఇట్టి శ్రీనివాసరావు గారికి న్యాయము చేకూర్ప వలసిన బాధ్యత ఆంధ్రులపై నున్నది. ఇందు కీసూచనలు ఆచరణ యోగ్యములు. శ్రీనివాసరావు గారి రచన లన్నింటిని సంస్కరించి పునర్ముద్రింపించుట; వీరి నాటకములు పాఠ్యగ్రంథములుగ నిర్ణయించుట: వీరి సంస్మరణ సభలు జరిపి, స్మారకసంచికలు వెలయింప జేయుట;వీరి ముఖ్య నాటకములను "రవీంద్రభారతి"లో ప్రదర్శించుట; వీరి ప్రసిద్ధ నాటకములను "రేడియో"లో ప్రసారముగావించుట ప్రసిద్ధాంధ్ర నాటక కర్తల చిత్రములు సాహిత్య, సంగీత నాటక అకాడమీల హాలులో ఉంచినారు. కాని రావుగారిందుకు నైతము నోచుకొనలేదు. కనుక నిందుకు సత్వర చర్య గైకొనుట;ఇంకబహువిధముల ప్రయత్నించి లోకమునకు రావుగారిని తెలియజేయుట ఎంతైనను అవసరము.

ఇందుకు సాహిత్య అకాడమీ సంగీత నాటక అకాడమీ అధిపతులే గాక ప్రభుత్వము, సర్వాంధ్ర ప్రజలు ప్రయత్నింతురని ఆశించుచున్నాను!

---

1. 42. పు. 50.

— ... —

# సవరణలు

ఎంత జాగరూకత వహించినను, అచ్చుతప్పులు తప్పలేదు. సవరించినవి గాక ఱ, బలను; ద, రలను; న, వలను; న, సలను; ప, వలను; ను, మలను; శ,శలను; సవరించుకొని, కొన్ని పదములలో పూర్ణానుస్వారమును గ్రహించి పఠింప మనవి.

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది. |
|---|---|---|---|
| 9 | 20 | 18-8-854 | 18-8-1854 |
| 21 | 9 | రామరాఱు చరిత్రము | రామరాజు చరిత్రము |
| 23 | 8 | సుసుమనోరమసభా | సుమనోరమ సభా |
| 24 | 8 | పీరి | పీరు |
| 29 | 21 | శ్రీనివాసరావుగాదాహ్వాన | శ్రీనివాసరావుగారాహ్వాన |
| 40 | 3 | హెచ్.కె. రంనాథ | హెచ్ కె. రంగనాథ |
| 42 | 10 | nove | novel |
| 58 | 4 | ఈవచన రచనలు | వచన రచనలు |
| 59 | 9 | ప్రహసములను | ప్రహసనములను |
| 67 | 11 | పుసరాణంబంధము | పురాణసంబంధము |
| 78 | 8 | ఉపక్రయోపన్యాసము | ఉపక్రమోపన్యాసము |
| 78 | 12 | విద్యజ్ఞన | విద్వజ్జన |
| 85 | 8 | కర్మసన్న్యాశ | కర్మసన్న్యాశన |
| 99 | 24 | 1965 | 1565 |
| 111 | 24 | తిక్కిన | తిక్కన |
| 115 | 13,14 | ధరనజుడు | ధర్మజుడు |
| 116 | 16 | కీవచవధా | కీచకవధా |
| 119 | 7 | యుద | యుద్ధ |
| 130 | 4 | కారావస్థలు | కార్యావస్థలు |
| 132 | 22 | అర్థప్రక్మకులు | అర్థప్రకృతులు |
| 137 | 12,13 | శిరోమణిచి | శిరోమణిని |
| 137 | 20 | అర్జునుడగుట | అర్జునుడడుగుట |

| | | | |
|---|---|---|---|
| 146 | 25 | ఆమెచు | ఆమెను |
| 157 | 19 | కుళవల | కుళలవ |
| 159 | 13 | వ్యగ్యము | వ్యంగ్యము |
| 160 | 11 | మీకు | మీరు |
| 160 | 16 | రాజకీయ | నాటకీయ |
| 174 | 22 | పూర్వాంకాతము | పూర్వాంకాతము |
| 176 | 7 | రంగయశట్టి | రంగయ్యశెట్టి |
| 178 | 9 | త్రిమ్మయ్య | తిమ్మయ్య |
| 188 | 4 | అల్లకల్లోము | అల్లకల్లోలము |
| 188 | 19 | గిరిజాకల్యాము | గిరిజాకల్యాణము |
| 188 | 25 | తపమాచరించు | తపమాచరించి, |
| 192 | 18 | రుర్వాసుని | దుర్వాసుని |
| 209 | 7 | వారు | వారి |
| 221 | 18 | వాస్తమునకు | వాస్తవమునకు |
| 225 | 26 | దుర్గుభములు | దుర్గుణములు |
| 281 | 14 | గలవు | గలరు |
| 281 | 16 | ధీరారులు | ధీరురాలు |
| 282 | 24 | శిలాదిత్మ | శిలాదిత్య |
| 284 | 3 | జీవుంపనెంచి | జీవింపనెంచి |
| 235 | 18 | రహించినవి | వహించినవి, |
| 286 | 14 | శ్రుతిస్మృతులకు | శ్రుతిస్మృతులకు |
| 288 | 7 | కలకరించి | కలంకరించి |
| 249 | 11 | ముట్కొని | ముట్టుకొను |
| 255 | 8 | యుత్కంఠ | యుత్కంఠ |
| 260 | 28 | శబ్దబైన | శబ్దంబైన |
| 264 | 16 | శబ్దార్థ | శబ్దార్థ |
| 268 | 8 | ఒబ్దాలంకారము | శబ్దాలంకారము |
| 277 | 8 | నేతేంద్రియ | నేత్రేంద్రియ |
| 278 | 5 | చెరరి | చెదరి |
| 281 | 5 | శ్రీనివాశరావు | శ్రీనివాసరావు |
| 281 | 6 | నాటకముంందు | నాటకములందు |

| | | | |
|---|---|---|---|
| 281 | 22 | పీపి | పీరీ |
| 293 | 7 | శబ్లి | శబ్ది |
| 297 | 26,27 | విశ్వశించి | విశ్వసించి |
| 298 | 14 | విడి విడి | విడి వడి |
| 298 | 16 | జంగి | జరిగి |
| 298 | 23 | భరచే | భర్తచే |
| 299 | 8 | పతివ్రవ | పతివ్రత |
| 314 | 14 | ప్రరర్శ | ప్రదర్శ |
| 314 | 20 | ,, | ,, |
| 315 | 10 | రపరిపుష్ట | రసపరిపుష్ట |
| 315 | 11 | సామాజినుడు | సామాజికుడు |
| 317 | 8 | విదోరార్థమై | వినోదార్థమై |
| 320 | 8 | కారభము | కారణము |
| 322 | 14 | ద్భశ్య | దృశ్య |
| 342 | 24 | భట్టును | భట్టును |
| 347 | 13,14 | మాహాత్మ్యముమవంతుడు | మాహాత్మ్యముచేసామవంతుడు |
| 351 | 12 | సూర్యోపనా | సూర్యోపాసనా |
| 355 | 26 | కౌని | కాని |
| 357 | 21 | తాళ | తాళ |
| 371 | 2 | మిత్రుయి | మిత్రులు |
| 374 | 18 | నరసజ్ఞుడు | సరసజ్ఞుడు |
| 396 | 1 | వేంనటరాయ | వేంకటరాయ |
| 396 | 11 | నాటథములను | నాటకములను |
| 398 | 4 | వెలుభరించి | వెలువరించి |
| 398 | 17 | లరసింహంగారు | నరసింహంగారు |

---